అందఱు—అయ్యో! వారిద్దఱును చూపుమేర నతిక్రమించినారు.

(మరలఁ దెరలో)

ఉ. హాళిని దేలుచుండ రమయంతిక సోమసరస్సునందు న
బ్బాలిక పాలికిం బరుగువాఁడు నయో! మదహస్తి చెచ్చెరన్;

అందఱు—అయ్యయ్యో! హా! సఖి! హా! రమయంతిక! కాలవశమున నీవిప్పుడా
మాటేనుఁగుచేతికిఁ దామరతీఁగ వగుచున్నావు.

(మరలఁ దెరలో)

శైలతటంబునం బడెడుకంబ మనం బయ నుండి మత్తభం
బాలము నెత్తి దూఁకెఁ బొగడం గలకంఠమృగేంద్రుఁ డార్భటిన్.

అందఱు—(ఆలకించి హర్షవిస్మయములతో) బాగు! కలకంఠుఁడా! బాగు!

(మరలఁ దెరలో) సఖీ! రమయంతికా! భయపడకు భయపడకు, కలకంఠకంఠీర
వుఁడు వారణమును దూరముగాఁ దఱిమివేసినాఁడు.

అందఱు—(విని) ఇది సారవికయూటపలుకు.

కాళిం—సఖీ! మల్లికా! జీవితసంశయమునకుఁ దప్పిన రమయంతికను మన మూలిం
డింతము

(అందఱు నిష్క్రమించుచున్నారు)

గద్య-ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదసమాసాదితసరసకవితాధురంధరవడ్డాది సాధువంశ
క్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబ
లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫలసూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరా
యనామధేయాంధ్రీకృత మగుమల్లికామారుతప్రకరణంబునందుఁ దృతీయాంకము.



శ్రీరస్తు

# మల్లికామారుతప్రకరణము

## చతుర్థాంకము

(తరువాత నిద్దఱు మావటివాండ్రు ప్రవేశించుచున్నారు)

ప్రథముఁడు—ఓరీ! బర్బరక! విశ్వావసుమంత్రిగారి కూఁతుమీఁదివలపుచేత, దోస
మనక మనదొర శంబరకుఁ డెంతరోఁతపని చేసినాఁడురా! చందమామవంటి చ
ల్లనిస్వభావము గలిగి, శత్రువులయం దయినను జాల ననురాగమునే కనఁబఱచు
చుఁ జక్కఁదనమునఁ జక్కరవిలుతుని తెక్కు సేయనివాఁ డయిన మారుతుని
యందు మల్లికమనసు దగిలియున్న దనుహేతువుచేతఁ బాప మాతని రహస్యము
గాఁ గడతేర్పఁ జూచుచున్నాఁడు చూడు. డేరాలోనుండి బయలువెడలి మారు
తుఁ డొక్కఁడు వసంతవనోద్యానము చొచ్చియుండఁగాఁ జూచి వచ్చితినని వే
గులవాఁడు చెప్పినమాట విని, మందుపెట్టి చెటియొుకయేనుఁగును మత్తెక్కింప
వలసినదని నీకు నాకు నాన తిచ్చినాఁడు గదా! (విస్మయముతో) నే నట్లు మ
త్తెక్కింపఁగానే, రోషామర్ష పరవశమై వచ్చునాయేనుఁగును జూచి మహాపురు
షుఁ డయినమారుతుఁడు హఠాత్తుగా నుద్యానవనమునుండి బయలు వెడలి యవలీ
లగా మీఁద నెక్కి గరుటామంతుఁడు మకరపుఁద్రాఁచుఁబామునట్లు దానిని దూ
రముగాఁ గొనిపోయినాఁడు.

బర్బరకుఁడు—సింహాముఖ! "దొర శంబరకుఁ డెంతరోఁతపని చేసినాఁడు రా!"
యని నీ వన్నమాట మా బాగుగనున్నదిరా! వేఱొకసొగసుకానిపయిని మేలు
పడి యున్నకన్నియమీఁద నెవఁడు గన్నువేయునో, ఛీఛీ! యాయెబ్బెరాసి
పిసాసి గాని మానిసి కాఁడు సుమీ.

సింహా—అవు నది యట్లే, మఱి నీవ త్తి సోమసరమ్మున నున్నకలకంఠునియొద్దకుఁ
బరుగెత్తినది గదా! దానిపని యేమయినదిరా?

బర్బ—ఏ మయినదా? అది యట్లు పరుగెత్తి, విఘ్నరాతుఁడుగారికూఁతురు రమయం
తిక సంతోషముతో నట జలక మాడుచుండఁగా, నా మెను బట్టుకో వలె నని
నీళ్లలో దిగినది.

సింహా—(అనుతాపములో) అయ్యయ్యో! పాపము! రమయంతిక కూడ నాడనే
యున్నదా?

బర్బ—(నవ్వి) సింహాముఖ! నీయేనుఁ గుద్యానవనము చొచ్చినప్పుడు మల్లికకూడ నక్కడ లేదా?

సింహా—(భయముతో) అయ్యో. మల్లికగూడ నక్కడనే యున్నదా? చెఱకుఁ గోలను బోలె నాబాలనది పట్టుకొన్నయెడలఁ బడినపాటంతయుఁ బదటఁగలిసి పోవును. అవురా! శంబరకుఁడుదొరగారి తెలివితేటలు!

బర్బ—(నవ్వి) పడ్డపాటంతయు నెట్లును బడదేరా.

సింహా—సరే. తరువాత?

బర్బ—అప్పుడు దూరమునుండియే రమయంతికకోసరము రోసముతోఁ దొండమెత్తుకొని వచ్చు నామత్తేనుఁగు విల్లువేటుదవ్వున నుండఁగాఁ జేరువ చెట్టుకొమ్మమీఁద నెక్కి, కలకంఠుఁడు జనసమూహముల హాహాకారము లెగయుచుండఁగా నక్కడనుండి యతిసాహసమున దాని నెత్తిమీఁద గుబాలున నుఱికి తత్క్షణంబ మరలించి మణికూటసమీపకాననమునకు దానిని బరుగెత్తించినాఁడు.

సింహా—ఔరా! యేనుఁగులు గూడ నూడనింబాడినవి! (నవ్వి) ఇహిహీ! వెఱపింపఁ బోయి వెఱచిన ట్లైనది. మఱి చెప్పు. మల్లిక యెక్కడ నున్నదిరా?

బర్బ—సోమసరస్సున మూర్ఛపోయిన రమయంతిక నూఱడించుచున్నది.

(తెరలో) స్వామీ! గజమల్లగర్వనిర్వాపణ! యిటు, ఇటు.

సింహా ఇదిగో! భ్రమరకుఁడు దారి చూపఁగా, నయనాభిరాముఁ డయిన మారుతుఁడుగారు వసంతవనసమీపమున కిటు వచ్చినారు. కాఁబట్టి యీదాపున నున్న యార్యకలవింగకున కీవృత్తాంతము నివేదింతము. ఆకాశవాణీప్రయోగ పండితుఁ డతఁడు ప్రభువుగారికిఁ బ్రియశిష్యుఁడు గదా! (నిష్క్రమించుచున్నారు. ప్రవేశము) (తరువాత మారుతుఁడు భ్రమరకుఁడు ప్రవేశించుచున్నారు)

మారు—భ్రమరక! కుంజరకోలాహలమున కదలిపోయిన మల్లిక యెటఁ బోయి యుండును? వసంతోద్యానమున నెక్కడను గానఁబడ లేదే!

భ్రమ—సామీ! రమయంతికను జూచుట కామె సోమసరస్సునకుఁ బోయియుండు నని తలంచెదను.

మారు—అట్లే కావచ్చును. సోమసరస్సునకు మార్గము చూపుము.

భ్రమ—సామీ! యిటు. ఇటు.

ఇద్దఱు—(నడుచుచున్నారు)

మారు—(కనికరముతో)

ఉ. ఘాతుకవారణం బభిముఖంబుగ రా నతిఘోరఘీంకృతిన్,
గాతరనేత్ర యామెఁ బులిగాంద్రదు మనంగఁ గురంగియుం బలెన్,
భీతిలి దద్దఱిల్లె దయనీయముగాఁ గమనీయగాత్రి; నా
చేతమునం దొనర్చదను జింతనముం దదవస్థ నిప్పుడున్. 1

ఆశ్చర్యము!

ఉ. వేయిమడుంగు లైనతన వేఁడిమితోడను గామవహ్ని, నా
కాయము బగ్గుబగ్గుమని కాల్చుచు నున్నది; యైనఁ గాని, యా
రా యువతీఘన స్తనభరార్పణకారణలోభనీయ మా
నీయది నాదుమూఁపు, వహియించెదు గగ్గురుపాటు మాటికిన్. 2

భ్రమ—సామీ! యామత్తేనుఁగును మద మడఁచి దూరముగాఁ దఱిమి వేసితిరి గదా!

మారు—భ్రమరకా! రమయంతిక మీఁదికిఁ బోవుచున్న యేనుఁగును గలకంఠుఁడు మరలించె నన్నమాట బూటకము గాదుగదా!

భ్రమ—సామీ! బూటక మెట్లగును? సోమసరస్తీరమునుండి మణికూటపర్వత మూలకాననమునఁ బ్రవేశించి సాటోపముగాఁ బరుగు వాఱుచున్న మదపుటేనుఁగు మెడమీఁద నెక్కియున్న కలకంఠుఁడుగారిని, దేవర వెనుకఁ బరుగెత్తుకొని వచ్చుచు నేను గన్నులారఁ జూచితినని మనవి చేయుచున్నాను.

మారు—(సవితర్కముగా) భ్రమరక!

తే. గీ. పొంగు మది, విష్ణురాతునిపుత్రి మృత్యువక్త్రగుహ సొచ్చి కాపాడఁబడినదిని;
క్రుంగు నది కలకంఠు నొక్కరునిఁ గానఁ। గూళయేనుఁగుగొనిపోవుటాలకించి.

భ్రమ—సామీ! ప్రియమిత్రుని భుజపరాక్రమ మెఱిఁగి యుండియు నడలుచున్నారేమి?

మారు—భ్రమరకా! నీ వన్నది నిజమే.

ఉత్సాహ. ఒక్కదంతి యెంత? కోటియుగ్రమత్తకుంభులన్
మొక్క వోనివిక్రమమున మొనసెదు కలకంఠునిన్
గక్కసముగఁ దాఁకి, వానిగాథ మైనచండిమన్
నిక్కముగ సహింపఁ జాలునే తృణంబు నాజిలోన్? 4

అయినను—

తే. గీ. ప్రాణమిత్రుఁడు గ్రమ్మఱ వచ్చినాఁడు। కంటఁబడుదాక శోకమగ్గలము నాకు;
స్నేహకాతర మైనట్టిచిత్త మకట! । హేతువులు లేనియాపత్తు లెంచుఁ గాదె?

(తరువాత వేగిరపాటుతో బాటసారివేషమున శంబరశిష్యుఁడు కలవింగకుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కలవిం—(మారుతునిఁ జూచి)

తే. గీ. మల్లికాయల్లకంబున నుల్ల ముడికి । యక్కజపుబుద్ధిశాలి మాయయ్యవార
లెఱుఁకపడకుండ నితరుల కవనికేని। ద్రోహ మొనరింతు రట్టిమారుతుఁడువీఁడె.

వసంతవనోద్యానమునుండి రయి తెంచుచు మాకుఁ గనఁబడినాఁ డని సింహముఖబర్బరులు నిజమే చెప్పినారు.

మారు—(చూచి)

తే. గీ. ముండ్లుగీఁతినయొడలితోఁ, గండెగట్టి। దుమ్ము పాతినయిరుచిఱుదోడలతోడఁ,
బయనపుంబడలికఁ దొట్రుపడుచు నెవఁడో। వచ్చుచున్నాఁడు కొల్లారి బాటసారి.

కలవిం—(విషాదముతో) అయ్యో పాపము! మాయుపాధ్యాయులవారికుంజరోన్మాదనప్రయాస మంతయు వమ్మయ్యెను గదా! కాని మఱియొక యుపాయము ప్రయోగించెదను. (తొట్రుపడుచు సమీపించుచున్నాఁడు)

భ్రమ—సామీ! మెడలో జందెమున్నది. ఇతఁడు బ్రాహ్మణుఁడు గానోపును.

మారు—బ్రాహ్మణా! మార్గాయాసముగల నీవు బ్రమసిపోయినట్లుగూడ నగపడుచున్నా వెందుచేత?

కలవిం—(ఆవేగము నటించుచు) అయ్యా! నా ప్రాణముఁ గొంచెము కుదురు పఱుచుకొని సర్వము మీతో మనవి చేసెదను. నా కిప్పటికిని గుండెదడ వదలినదికాదు. దిక్కు లన్నియు నాకు ద్విరదమయములయి కనఁబడుచున్నవి.

మారు—(తనలో) అయ్యో! పాప మీదీనుఁడు గూడ వేదండమునకే వెఱచుచున్నాఁడు. (ప్రకాశముగా) ధీరుఁడా! భయపడక చెప్పుము. ఇప్పు డా యేనుఁ గెక్కడ నున్నది?

కలవిం—(నిట్టూర్పుతో)

ఉ. ఏ విను మాంధ్రభూమి వసియింతును గొండొకగ్రామమందు; గో
దావరితీరవాసి; హరదత్తుఁ డటందురు నన్ను విప్రుఁడన్;
భావమునందు సంసరణపంకజుగుప్స జనించినందునన్,
బోవుచు మున్గ గాంగఝరి, ముమ్మొనవాల్దొరమౌళిపూసరిన్. 8

మారు—ఆహా! తీర్థయాత్రాపరుఁడవా? ఎంతయదృష్టము!

కలవిం—

తే. గీ. తెరువుబడివచ్చుచును సోమసరమునం దుఁ। గ్రుంకఁ బోవంగ నే, మణికూటపరిస

రాటవిని, గుండె జల్లన నాముకవిసి! కొమ్మ్రేటనుఁ గొకండు నఱగూడమొట్టె.

మారు—(జనాంతికముగా) భ్రమరక! కలకంఠుఁ డెక్కడనదేసుమీ యాకొమ్మ్రేటె నుఁగు. (ప్రకాశముగా) అహో! మహోపద్రవము సంభవించెనుగదా! చెప్పు చెప్పు దాని కెట్లు దప్పితివి.

కలవిం—ఉ. మావఁగుఁ డొక్కరుం డుదిరిమాదిరిఁ బచ్చనిమేనివాఁడు, త
ద్గ్రీవ నిరంకుశుండుగ నధిష్ఠితుఁడై యతిసాహసంబునన్
నోవఁ బదాగ్రఘట్టనవినోదము సల్పుచుఁ గర్ణయూలమం
దావిలసద్ధయాబ్ధి, మదహస్తి నదల్పఁగఁ జొచ్చెఁ జెచ్చెరన్. 10

మారు—(జనాంతికముగా) సందేహము తీఱినది. అడ్డులేనియేనిక నంకుశము లేకయే యదలింపఁ గలవాఁడు కలకంఠుఁడే గాక మఱి యెవఁడు? (ప్రకాశముగా) తరువాత?

కలవిం—(కన్నీరుపెట్టికొనుచు) అయ్యో! పయిమాటకు నాకు నోరాడ కున్నది.

మారు—(అడలుతో) చెప్పు పిమ్మట నేమి జరగినది?

కలవిం—

శా. కట్టా! కట్టలుకన్ బలాఢ్యమదనాగం బప్డు మూర్ధంబు ని
ట్టట్టాడించుచు వాని శైలదృఢు నుయ్యాలూఁచి కూల్చెన్ మహిన్;

మారు—హా! ప్రాణసఖ! కలకంఠ! నీవేల పడిపోయితివి?

కలవిం—పుట్టం బూడఁగ వెండిలవాఁడు నెగసెన్;

మారు—(ఆసతో) తరువాతఁ దరువాత?

కలవిం—తుండన్ గజం బుద్ధతిన్ బట్టెన్;

మారు—(అడలుతో) తరువాత?

కలవిం—హా! సఖ! మారుతా! యని తుదిన్ వాఁ డీల్గె దంతాహతిన్.

మారు—(కన్నీళ్లు గాఱ రోదనము చేయుచు)

క. హాహా! బంధుజనేందూ! హాహా! పరిపంథిసింధురాహార్యపవీ!
హాహా! మారుతజీవిత! హాహా! కలకంఠ యెంతయాపదమూఁడెన్.

(మూర్ఛిల్లు చున్నాఁడు)

భ్రమ—(కన్నీళ్లతో, రోదనము చేయుచు, మారుతునిఁ బట్టుకొని) హా! స్వామీ! కలకంఠ! తాదృశపరాక్రమాపహాసితమృగేంద్రుండ వయిన నీకా కరికీటమువలన వినిపాతము?

కలవిం—(సంతోషములోఁ దనలో) నానీతివృక్షము ఫలించినట్టే; (ప్రకాశముగా) అయ్యో! యెంతకష్టము! తనప్రియుని చెప్పవాఁడ నయితినే! అయ్యో! పాపము! ఇటువంటిదుఃఖము రాఁగూడని యీమహాభాగుఁ డెవరు? ఈయనకుఁ బ్రేమాస్పదుఁ డయి మదద్విరదము కరమందుఁ బువ్వుబంతియగుచున్న యీమహాపురుషుఁ డెవ్వఁడు?

భిక్షు—అయ్యా! యీయన మతిప్రభావవశీకృతసకలమహీమండలుండగు నమాత్య బ్రహ్మదత్తుఁడుగారికుమారుఁడు మారుతుఁడుగారు. ఆయన యీదొరకుఁ బ్రియ మిత్రుఁడు కలకంఠుఁడు.

కలవిం—(మిథ్యావిషాదమును గనఁబఱుచుచున్నాఁడు.)

మారు—(కన్నులు దెఱచి) సఖుఁడా కలకంఠ! యేమిది? న న్నాకస్మికముగా వదలి వేసితివి. (నిట్టూర్పు విడిచి)—

ఉ. జానువు లంటుబాహువులు జాబిలివంటి మొగంబు గల్గి, యే
న్యూనత గాని లేని దయి యొప్పెడు నీ సు కడానిఁ బోనినె
మ్మేన కటాకటా! యనుఁగు మిత్రమ! వజ్రకఠోరధార మా
నేనుఁగుఁగొమ్మరోఁకలుల కేకరణిన్ విధి పాలు చేసెనో.

కలవిం—సుహృద్విపత్తి వ్యసనములు దుస్సహములు గదా!

మారు—

మ. గురులం దన్వఁగ లేదు సేవలను; గైకో లేదు గేస్తుం దనం
బు ఋణత్రయ్యుపశాంతి; కీప్సితములం బూరింప లే దర్థికిం;
హరిదంతంబులఁ బూయ లేదు యశ; మీ వాలింప లే దంగనా
చరితం; బెత్తుక పోయెనే విధి, వయస్యా! నిన్న కాండంబునన్? 1

భ్రమ—అయ్యో! నాటుకొన్నతోడనే యీపారిజాతపోతము తెలియకుండఁ బడిన కడిఁదిపిడుగుచేతఁ గాలిపోయినది.

మారు—(గద్గదికతో)

ఉ. ధీరతపట్టు వీడెను, గతించెను సజ్జనభావమున్, నిరా
ధారత నొందె నీతి, విరతం బయి పోయె నయో! ప్రియోక్తియున్;
ధారుణిఁ బాసె నమ్మకము, దారెను బంధుతపంబు సర్వమున్;
చేరవె యున్కి గాంచుటను నీ వకటా! కలకంఠుఁడా! సఖా! 15

అయ్యో! యూరక యిట్లు విలపించుచు నాలసింప నేల? మణికూటమున కేగి భృగుపాతమునఁ బ్రియమిత్రునిమార్గము ననుసరించెదను. భ్రమరకా వెళ్ళు. స్కంధావారము నిక్కడనుండి మానగరమునకుఁ దీసికొనిపొమ్ము.

భ్రమ—(విషాదముతో) స్వామీ! యేమిది? విరుద్ధకార్య మారంభించితిరి. (కాళ్ల మీఁదఁబడి) నాథా! సరాజకము, సబంధువర్గము, సరాజపుత్రిమండలము, సగజతురగపదాతస్యందనము నగు నీసకలకుంతలవిషయమును గాపాడుఁడు. ఇంతకు మీరే జీవితము గదా!

మారు—(శూన్యవదనుఁ డయి నవ్వి)

ఆ. వె. దుఃఖితుండ నయిన దుఃఖియు, సుఖితుండ। నయిన సుఖియు నెవ్వఁడట్టిసఖుఁడు
ధరణిఁ గీర్తిశేషతనుఁ డైన,। జీవంబు। లుజ్జగింపకుండి లజ్జపడను.

కలవిం—(ఆనందముతోఁ దనలో) నిశ్చయముగా నితఁడు చచ్చును ఆహా! యాకాశవాణీప్రయోగకౌవిదుఁడ నయిననామతిప్రకర్షము సర్వంకషము గదా!

ఆ. వె. నైజభ్రూక్షేపవిభ్రమాయోజితోగ్ర। సైన్యనాసీరవీరజర్జరితవైరి
యైనవిక్రమనిధి నిట్లు హతముసేయ। నోపునాబుద్ధి యత్యంతమూర్జితంబు.

కాఁబట్టి యీవృత్తాంతమున మాగురువుగారిని సంతోషపెట్టెదను. (విమర్శించి) అట్లు కాదు. ఈబాటసారివేషముతోడనే పోయి, సోమసరస్తీరముననున్న మల్లికకు మారుతుని మరణము నివేదించెదను. ఇట్లు చేసితినా యామె వీనియెడల నివృత్తానురాగయయి తనంతన గురువుగారిని బెండ్లియాడ ననుమతించును. కావున నీవచనైకప్రమాణుఁ డయిన విశ్వవసుఁ డీవలకే యొప్పుకొన్నాఁడు.

భ్రమ—(కలవింగకునితో) అయ్యా! మహాదారుణమయిన మాదారయుద్యమమును మీరు నివారింపుఁడు.

కలవిం—ఓయీ! యింతయనురాగము గల యీమహాపురుషునిప్రయత్నము దుర్నివారము సుమీ నేనిట్టి ఘోరములు చూడలేను. గంగాదర్శనము గావించునంతకు క్షణమాత్రమయిన మార్గాలస్యమునయిఁ బడఁజాలను. పోయివచ్చెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

భ్రమ—(తనలో) వీఁ డెవఁడో మహానృశంసునివలె నగపడుచున్నాఁడు. (ప్రకాశముగా) స్వామీ! యంతయనురక్తురాలయిన మల్లికను గూడ నుపేక్షింతురా?

మారు—ఓరి వెఱ్ఱివాఁడా!

క. దేహము విడుచుచుఁ గూడను। స్నేహార్ద్రిత నెవఁడు నన్నుఁ జేరె, నతనితో
రాహిత్య మాపహిల్లెఁ। హాహా! మల్లిక యదేల నాబ్రతుకేలా? 19

(తరువాతఁ గలకంఠుఁడు ప్రవేశించుచున్నాఁడు)

కల—(అనురాగముతో)

ఉ. కాటుక జాఱుబెర్కుఁదెలిగన్నులనిగ్గులచేఁ గొలంకుపై
న్నాటను రెట్టి గాఁ గముదనీరజముల్, జలకంబులాడువ

బోటిపయఃకణాన్వితపుమూర్ధకపోలము లొప్పనందపుం
దేటమెఱుంగంబు, నాహృదయదేశము దా నెడఁ బాయకుండెడున్. 20

ఏనుఁగును దూరముగాఁ దఱిమి వేసిన ప్రియమిత్రుని వసంతవనసమీపమున వెదకెదను.
(నడచి చూచి విషాదముతోడను భయముతోడను) ఏమిది! యితఁడు కన్నుల బాష్పజలములు జాలు వాఱ దుఃఖించుచుండఁగాఁ, గాళ్లమీఁదఁబడి భ్రమరకుఁడు బతిమాలుకొని యెట్టెట్లో యూఱడించుచున్నాఁడు. (సమీపించుచున్నాఁడు)

భ్రమ—సామీ! తమ రక్షే కావించుపక్షమున సకల మయినస్కంధావారమును ముందే భృగుపాత మొనరింపఁ గలము.

కల—(భయవిషాదముతో) సకల మయినస్కంధావారమును ముందే భృగుపాత మొనరింపఁగల దనుచున్నాఁ డిది యేమి?

మారు—(వినకయే పైకిఁ జూచి)

క. నన్ను విడిచి దివి కిచ్చను । మున్నే వరుగుటకు సిగ్గు పొడమదె సఖుఁడా?

కల—అయ్యో! నేను జీవించి యుండఁగాఁ బ్రియవయస్యుఁ డన్యథా తలంచుచున్నాఁడు.

మారు—నిన్నుం గలసెద వేగమ । యన్నా! గజరాజగమన! యడుగాఁగఁ గదే. 21

కల—పాపము శాంతించును గాక. అమంగళ మడంగును గాక. (త్వరితముగా సమీపించి) చెలికాఁడా! సకలమహీమండలమండనమ వయిననిన్ను నిష్కారణ మమంగళము లాడుకొనియెద వేమి?

మారు—అహో! యిది కలకంఠుని స్వరమే!

భ్రమ—(చూచి) సామీ! మన మదృష్టవశమున బ్రదికినారము. కలకంఠుఁడుగా రిదిగోఁ దిరిగి వచ్చినారు.

మారు—(హర్షగద్గదికతో) కలకంఠుఁడా! రమ్ము రమ్ము. నాకంఠమ్మును గౌఁగిలించుకొమ్ము. బాష్పపూర్ణము లయి నాకన్నులు నిన్నుఁ జూడఁ జాలకున్నవి.

కల—(సెయ్యమునఁ గౌఁగిలించుకొని) చెలికాఁడా! యిది యేమి?

భ్రమ—సామీ! గోదావరీతీరవాసి నని యొకబాటసారి వచ్చి కుంజరవృత్తాంతము నట్లు చెప్పినందునఁ జఱి నుఱుకుట కిటు దొరవా రుద్యోగించుచున్నారు.

కల—(విమర్శించి) శంబరశిష్యుఁడయిన మాయలమారికలవింగకుఁడు ప్రియవయస్యుని వంచించె నని తలంచెదను. మల్లికార్థి యగు శంబరపశువు మనకు ద్రోహము చేయఁ జూచుచున్నాఁడు గదా!

(తెరలో) హా! సకలలోకలోచనఫలమహాభాగ! నీ కంతటియనురక్తురాల నయిన నన్ను విడనాడి స్వర్గవిలాసినీలోలుపుఁడ వయితి వేల? అపహసితకుసుమాయుధ గర్వుని నిన్నాయచ్చరలు వలలో వేసికొన కుండ నిదిగో నేను వచ్చి వారించు చున్నాను.

అందఱు—(ఆలకించుచున్నారు)

మారు—(సాకూతముగా)

తే. గీ. ఏణశాబవిలోచన దీరొయిలుంగు । నా స్మృతి గలంచి డెందంబు నాఁచికొనెడు
వ్యాధశరవిద్ధనిజవల్లభాతిశోక । దగ్ధకురరీరణనముగ్ధతార మగుచు. 22

కల—కోఁకండ్లతోఁ గ్రుమ్మి చంపఁదగిన యాకలవింగకుఁడు మల్లికను గూడ మూర్ఛ పుచ్చెనని నా కుఁదోఁచుచున్నది. శీఘ్రముగా మన మామెను జేరఁబోవుదము. (వేగమున సమీపించుచున్నారు)

భ్రమ—సామీ! యాపూజ్యురాలి పాపటనుండి జాఱి పడినది కాఁబోలు. ఇదిగో నిక్కడ శిఖామణి ప్రకాశించుచున్నది.

మారు—ఏనుఁగుభయమునఁ గలఁతపడి తొట్రుపాటుతో నడచు తొందరలో నిరతనము పతనము నొందియుండును (తీసికొని సస్నేహముగా)

క. నీరదమున సౌదామని । తీరున సఖిచికురమునఁ బ్రదీపించితి వ
య్యో! రతనమ! యటఁబాయుట । నీరాలికిదుఁ గంటఁ, జూడ నేఁటియవస్థ.

(మరలఁ దెరలో) కాళిందీ! పట్టుకోవమ్మా. పట్టుకోవమ్మా. ప్రియసఖి మల్లిక మూర్ఛిల్లి పడి పోవుచున్నది.

అందఱు—(విని త్వరితముగా సమీపించుచున్నారు)

(తరువాత నవమాలికాకాళిందులచేతఁ బట్టుకోఁబడి మూర్ఛానిమీలితాక్షి యగుమల్లికయుఁ, దత్తఱపాటుతో రమయంతికామధురికాసారసికలును బ్రవేశించుచున్నారు)

రమ—(సవిషాదముగా) అయ్యో! మల్లికకు నవయువములేమియుఁగదలుజాడ గానరాదు.

నవ—(కన్నీటితో) మన మెవరి కేడ్తము. మహాభాగునకా? మల్లికకా?

అందఱు—హా! సఖీ! మల్లికా! నీవు గూడ మహాభాగు ననుగమించి పోయితివా?

సార—కాళిందీ! మూర్ఛను బోఁగొట్టు సామర్థ్యము గలశిఖామణి యొక్కడరాలిపోయిన దమ్మా?

నవ—హా! మల్లికాహృదయవల్లభ! మహాభాగ! మారుత! నీనిమిత్తమున మూర్ఛిల్లిన యీమెను బట్టుకొమ్మా.

మారు—(తత్తఱమునఁ బ్రవేశించి) నవమాలికా; యిదిగో! నేను వచ్చితిని. పట్టుకొని యెదను.

అందఱు—(చూచి యానందముతో) సంతోషము, సంతోషము. అక్షతశరీరుఁడయి మహాభాగుఁడు మరల వచ్చినాఁడు.

నవ—(సహర్ష గద్గదముగా) మహాభాగ! హర్ష పారవశ్యమునఁ బర్యాకుల నయి నేనే మియు ననలేకున్నాను. బ్రిదుకే సంశయముగా నున్న ప్రియసఖిని మల్లికను బట్టుకొమ్ము.

మారు—(విషాదానురాగములతోఁ బట్టుకొన్నాఁడు)

రమ—(వెనుకఁదిరిగి) మధురికా! యిదిగోఁ బ్రత్యక్షమన్మథుఁడు మహాభాగుఁడు మారుతుఁడు. ఈయనయేఁగదా నాజీవితప్రదానమహోపకారికిఁ బ్రాణసఖుఁడు. ఈయనయందు మల్లికకు స్నేహసంబంధము తగియే యున్నది. అదృష్టవశమున నా బొటసారిపీనుఁగుమాట లబద్ధ మయినవి గదా!

మధు—సఖి! రమయంతికా! యామరాత్ముఁడే గదా సారెసారెకు వికారముగా నీ వంకఁ జూచుచు వచ్చినాఁడు.

రమ—చాలులే. ఆవచ్చినవానిప్రసంగ మిఁకఁ గట్టిపెట్టు.

కాళిం—సఖీ! తెలివి నొందుము. తెలివి నొందుము. కల్పాంత దీర్ఘాయుష్మని మహాభాగుని విలోకింపుము.

మల్లి—(తెలివి నొందుచున్నది)

మారు—(ఆనందముతో) నవమాలికా! యేడువ కేడువకు, మీప్రియసతి తేఱుకొనుచున్నది. చూడు.

ఉ. నిద్దము లైన నల్లనికనీనికలన్ వికసించె వాల్గనుల్,
సద్దడఁగెం గ్రమంబుగఁ గుచంబు లదర్చెడు గండెదివ్వులన్,
ముద్దియమోము రాహుపరిముక్త సుధాకరమండలంబుతో
నుద్దిగఁ దోఁచె, మోహతమ మోలిని దూలి ప్రసన్న హాటచేన్. 24

మల్లి—(స్పర్శసుఖము నభినయించి) సఖులారా! నే నమృతసరస్సున నుంటినా? కాక మరణించి పోయి స్వర్గములో నామహాభాగునిఁ గలిసికొంటినా?

నవ—సఖి! మల్లికా! స్వర్గమునందుఁ గాదు, ఈసోమసరస్తీరమందే లక్ష్మీవిలాసప్రాసాదమయిన మహాభాగునివక్షఃస్థలమం దున్నదానవు.

మల్లి—హర్షముతోఁ జూచి మహాభాగ! భాగ్యవశమున మిమ్ము మరలఁ [illegible] తిని. నిజముగా బ్రతికితిరా?

మారు—(వెనుకకు దిరిగి)

క. ఏదిపుడు మూర్ఛ దేఱితి। కావున నే నిజము బల్కితుకుఁ గంటిని, గాదేక...
జీవకథ గలదె యంగజ। దావానలకీలజాలదగ్ధున కబలా? 25

కల—(సమీపించుచున్నాఁడు)

రమ—(సంతోషముతో) మధురికా! యదృష్టవశమునఁ గలకంఠుఁడు కూడ వచ్చినాఁడు.

మధు—సఖీ! భాగ్యవశమున నాపాపిష్ఠుఁ డీయన కమంగళము జెప్పినాఁడు కాఁడు. చెప్పియున్నచో మల్లికకుఁ గలిగినట్లే నీకును మూర్ఛావ్యసనము సంభవించి యుండును.

కల—ఏమీ! చాటసారివేషముతో వచ్చిన శంబరకశిష్యునిచేత మీరును మోసపోయితిరా?

సార—(జనాంతికముగా) కాళిందీ! వీనిస్వరముగూడఁ గరభఘుర్ఘురమయి యుల్లయా కౌశవాణి ననుకరించుచున్నదని చెప్పితినిగదా?

మారు—కలవింగకుఁడు నాకు నపకారి యయినను మహోపకారమే చేసినాఁడు.

తే. గీ. తరుణి యాలించి నాదుమిథ్యావిపత్తి। దలఁచె నిశ్శంకముగ జీవితమును బాయ;
నఖిలవిస్రంభపాత్ర మవ్యాజమైన। ప్రేమసర్వస్వ మిందుచే విశదపడియె.

(తెరలో) భుజస్తంభస్తంభితప్రతిభటకరటిఘటు లగు సేనాభటులారా! మణికూటకటకంబులయందును వసంతవనోపకంఠంబులయందును, సోమసరఃకూలోపశల్యంబులయందును బరిపంథిసింధురకంఠీరవుం డగుకుమారమారుతుని, సమరార్ణవమందరదోర్దండుం డగు కలకంఠుని మీర లన్వేషింపుఁడు. వార లిరువురు భ్రమరకమాత్రపరిజను లయి మాకుఁ దెలియకుండఁ దద్గండప్రభిన్నమదరోషామర్షదుర్విసర్పంబు లయిన కుంజరంబుల డీకొన్నవారు (అందఱు వినుచున్నారు)

కాళిం—(చూచి) అహో! ప్రచలత్కులాచలసహస్రసాదృశ్యంబు లయిన భీషణగజఘటలచే విరుద్ధపురోభాగం బయి వలత్తురగఖురకుద్దాలోద్దళితధరిత్రీతలచలితధూళిపాళికలచే ధూసరితదిశాముఖం బయి యిదిగోఁ జమూసమూహ మీలాగుననే వచ్చుచున్నది.

మారు—భ్రమరకా! వెళ్లువెళ్లు. సంభ్రమము వలదు వలదని వారింపుము.

భ్రమ—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు)

నవ—అహా! భ్రమరకముఖనిర్గత మయినముదల చెలియలకట్టగా సేనాసాగర మక్కడనే నిలిచిపోయెను.

మల్లి—(జనాంతికముగా) అయ్యో! యింతటి సైన్యచక్రమునకు నధినాథుఁ డయిన సకలలోకమండనభూతుఁడు మహాభాగుఁడు నానిమిత్తమున నేకాకియయి భయంకర ద్విరదమున కభిముఖముగాఁ బరుగువారెను గదా!

నవ—సఖి! యిప్పు డయిన నీవు టిన్నగాఁ జేయవు. నిన్నాయనకు సమర్పించుకోవు గదా!

మల్లి—సఖీ! పితృవశవర్తినిని, నే నేమి చేయఁగలను? మల్లికావరనిర్ణయమున భగవతి కాత్యాయనీదేవియే కాని నేను ప్రమాణము కానని దేవిసన్నిధానమున నాయనగారు ప్రతిన చేసిరి గదా?

(ప్రతీహారి కనకలత ప్రవేశించుచున్నది)

కన—నవమాలికా! మనయమ్మగారు దుస్సహదుఃఖసంతప్తహృదయురాలయి భర్తృదారికను శీఘ్రముగా నింటికి దోడుకొని రమ్మని యాజ్ఞాపించినారు. ఆమె సకల పరిజనపరివృత యయి వసంతవనపరిసరమున వేచియున్నారు.

నవ—(భయముతో) కనకలతా? యమ్మగారు దుస్సహదుఃఖసంతప్తహృదయురా లెందుచేత?

కన—(విషాదముతో) భర్తృదారికకు శంబరకుఁడు వరుఁ డని కాత్యాయనీభగవతి యమాత్యులవారి కానతిచ్చినది కాదా?

(మల్లికామారుతులు విషాదము నొందుచున్నారు)

సార—(జనాంతికముగా) సఖి! కాళింది! యది యామాయబాటసారి యగు శంబరక శిష్యుని వంచనప్రభావము గాని నిజము గాదు.

కాళిం—(ఖేదముతో) కటకటా! పసివాడినమోముఁదామరలచే గుండెకల్లడము వెల్లడియగుచున్న యీమల్లికామారుతుల శోతద్దురవస్థ నేను జూచి భరింపఁ జాలకున్నాను,

రమ—(జనాంతికముగా) మధురికా! మన్మథుఁ డెంతవెగటుపని చేసినాఁడే; పరస్పరసదృశానురాగులగు వీరి కకాండవియోగ మాపాదించెను.

మారు—(దుఃఖముతో)

చ. సొగయుచు నీమె నేఁ దొలుతఁ జూచిననాఁ డటు లంకురించి, తో
పుగఁ గ్రమవృద్ధమై ననిచి పూచి ఫలోన్ముఖ మైనయస్మదీ
యగురుమనోరథక్షితిరుహం బకటకట! కూలిపోయె నే
మిగులఁ గృతాంతవైశససమిద్ధమహాశనిపాతదగ్ధమై.

మల్లి—అయ్యో! మల్లికా! యింతటిదే నీబ్రతుకుఫలము? హా! తల్లి! కాత్యాయని! నన్ను రాక్షసునిహస్తమునఁ బెట్టితి వేమి?

మారు—(మల్లికముఖముచూచి తనలో)

చ. దరికొనకుండెఁ గాక పరితాపమునన్ భవదీయచిత్త మో
గిరిసుత! తల్లి! దుఃఖభరఖిన్నముఖున్ ననుఁ జూచి; నక్కటా!
తొరఁగుకృపాశ్రుబిందువులతోఁ గనుపట్ట వదేల నీకనుల్,
కరము విషణ్ణనేత్రయగు కన్నియ నీ మెను జూచి యేనియున్. 28

కన—నవమాలికా! భర్తృదారికను జూడమి నమ్మగారు వగచుచున్నారు. కాఁబట్టి త్వరితముగా నీమెను గొనిపోవుదము.

నవ—(విషాదముతో) భర్తృదారకా! యిటు. ఇటు.

మల్లి—(సబాష్పగద్గదముగా వెనుదిరిగి) నయనాభిరామమహాభాగ! మరణైకశరణురా లగుమందభాగిని మల్లిక వీడుకొనుచున్నది.

నవ—భగవతి! కాత్యాయని! నీవు దయార్ద్రహృదయవు గావా? నీపాదములే యాధారముగా నున్న యీమల్లికకు జీవితసంశయావస్థ దెచ్చిపెట్టితి వేమమ్మా? ఒకవేళ నీయాదేశ మిట్లు కాలేదేమో. ఇది కూడ నాశంబరకశిష్యుని వంచనమే కావచ్చునని తలంచుచున్నాను.

సార—(జనాంతికముగా) కాళింది! నవమాలిక యథార్థము పలికినది.

మల్లి—(తనలో) అయ్యో! మల్లికా! యింతటిదే నీబ్రతుకుఫలము? హా! తల్లి కాత్యాయిని! నన్ను రాక్షసుని హస్తమునఁ బెట్టితివేమి? (నవమాలికతో నిష్క్రమించుచున్నది)

రమ—సారసికా! నే నెటు లయిన నీమల్లిక ననుగమించెదను. జీవితదానమహోపకారి యయినమహాభాగుని నేను సెల వడుగ లేను.

సార—మహాభాగ! నీవిచ్చిన శరీరమును దీసికొని రమయంతిక యింటికిఁబోవ ననుజ్ఞ వేఁడుచున్నది.

కల—గృహము నలంకరించును గాక.

కాళిం—సారసికా! తమహృదయంబులను భరియింప వలసినభావికాలదుస్సహవిరహవేదనను దలపోసికొనుటవలన సవిశేషవర్ధమాన మగు మదనానలంబుధూమంబునుం బోని దీర్ఘతరనిశ్వాసంబులతోడను, సుద్దామవిభ్రమోల్లసితభ్రూలతాకలంకితము లయినక్రేఁగంటిచూపుకోపులు ప్రకటించెడు ప్రణయానురాగసర్వస్వంబుతోడను నొడలెల్లను గ్రమ్ముకొన్న క్రొంజెమటలం బోఁచిన యొండొరుల ప్రతిబింబముల

మూలమునఁ బ్రాప్తించు గాఢోపగూహనసుఖంబునం జేసి నారు మొలచినతీరునఁ దలచూపు పులకనికరంబుతోడను రమయుంతికాకలకంతు లెట్టు లున్నారో చూడు చూడు.

కల—(అనురాగముతోఁ దనలో)

సీ. అనయంబుఁ బ్రణయంబునను జంచలము లౌచు బ్రేమంబునను జాలఁ బెద్దవగుచు
మన్మథస్వామికి జన్మదేశము లౌచు ధైర్యంబునకు విభేదకము లగుచు
స్వాంతాపహారణసమర్థంబు లౌచు సారెకుఁ జలాచలకనీనికము లగుచు
నళిరి, తరంగితములు ఘూర్ణితంబులు స్తిమితంబులును మధురములు స్నిగ్ధ
ములును ముగ్ధంబులా నవమోహనాంగి। చారునయనాంబురుహవిలాసంబులహహ
నాపయిం బ్రసరించు చందము దలంప। జల్లుమని మేను పారవశ్యమువహించు

మధు—ఇటు. ఇటు.

రమ—(వెనుకకుఁ దిరిగి) మధురికా! పూర్ణచంద్రసుందరుఁ డగుమహాభాగుని మరల నెప్పుడయినఁ గాంతునా?

మధు—సఖీ! ముందుగ రుద్రరాతుఁ డొకఁడు శంబరక పక్షపాతి యని సంశయము. కానిచో దర్శనమే కాదు, వేఱొకటియు సులభమే సుమీ.

రమ—(నిట్టూర్పు పుచ్చుచు నెట్టెట్టో నిష్క్రమించుచున్నది)

మల్లి—నవమాలికా! కర్ణాంతదీర్ఘవిశాలలోచనపుండరీక మయిన మహాభాగునిముఖచంద్రమండల మితఃపరము దుర్లభదర్శనము గదా! అందుచేతఁ గఱవుదీఱ నిప్పుడే యింకొకమాఱు చూచుకొనెదను. (మోముద్రిప్పి కన్నీళ్లతోఁ జూచుచున్నది)

సార—కాళిందీ! చూడు. సకరుణానురాగనివర్తితముఖచంద్రమండల యగుమల్లిక నేత్రములు, బాష్పపూరపూరితము లయి తుషారకణకరంబితకమలపత్రములతో మిత్రము లగుచున్నవి కాఁబట్టి మనము పోయి యామెనాశ్వాసింతము పద.

కాళిం—సఖీ! మహాభాగుఁ డిట్టుండఁగా మనకుఁ బోఁ గాళ్ళాడునమ్మా?

మారు—మీరు మల్లిక ననుసరింపుఁడు.

కాళిం—మహాభాగ! యిదియు వారాణసీపథికవచనముకంటె వేఱు కాదని తలంచుకొమ్ము. వానిస్వర మాకాశవాణీస్వరమును బోలి యున్నదని సారవిక చెప్పుచున్నది.

కల—ఇది పోలియున్నది. వానిదుర్నయవిలసితము లిట్టివే.

మారు—(తనలో) ఇవి యూఱటలు గదా! (ప్రకాశముగా) కాళింది! మల్లికాసీమంతలాలిత మయినరత్నమిదిగో. (మణి నిచ్చుచున్నాఁడు)

కాళిం—(పుచ్చుకొని) అయ్యో! వెదకినను మాకిది కనఁబడ దాయెనే. (నిష్క్రమించుచున్నారు)

మారు—(నిట్టూర్పుపుచ్చి) హా! దరి యంచు లేనిదుఃఖసాగరమునఁ బడితిని గదా!

చ. తహతహ మీఱుతన్, బొడముతన్ బలుమూర్ఛలు, దాల్మి దూలుతన్
బహుళత వాధి గాంచుత, మహారసుఖేచ్ఛ నశించుతన్, మఱుం
డహితత మేనుగోసి తని యందుత, బెంగ యొసంగుతన్, గనున్
ద్రుహిణుఁడు తుల్యరాగజనదుర్లభమౌ ఘటనన్ కృతార్థతన్. 29

కల—మిత్రుఁడా! మల్లికామారుతులకు మీ కనురూపమగు పాణిగ్రహణమంగళము సర్వమంగళ కసమ్మతమనుట సంగత మగునా? చూడు.

తే. గీ. సేవచేతఁ బ్రసన్న యౌ దేవిసుప్ర। సాదమూర్తులు గద మీ రసంశయముగ;
భావమున నేను దద్వాగుపజ్ఞ మైన। విఘ్న మిది యించుకేనియు విశ్వసింప.

మారు—కలకంఠా! కర్మవిపాకములు కరము విచిత్రములు గదా! ఇది యవిశ్వసనీయ మెట్లగును? చూడు.

క. కలిగించు శుభాశుభములు। తొలుతటికర్మములు సుఖము దుఃఖము; దైవం
బలరెంటిని గుడుపుమఁ దా। నలరుఁ దటస్థుండుగా నుదాసీనుండై. 31

కల—ఏల యిట్లు పలికెదవు? కలవింగకవృత్తాంతము వయస్యునకుఁ బ్రత్యక్షమే గదా!

మారు—(ఆలోచించి) ఆహా! సంశయస్థాపితుండ నయితినిగదా! (తనలో) ఇందుల కేమి చేయుదును? (గర్వముతో) ప్రణతజనపారిజాతవల్లిని భవానిని బ్రసన్నురాలిం జేసికొనియెదను.

తే.గీ. గౌరియాలయమునకు నొక్కండ నేగి। విఫలమగువాడు ప్రాణముల్ విడుతునొండెఁ;
ప్రాణవల్లభ మల్లికఁ బడయువాఁడ। నొండెఁ దద్దేవిపాదాబ్జయుగముఁ గొలిచి.

(ప్రకాశముగా) మిత్రుఁడా! కలకంఠ! నీహృదయమును రమయంతికాక్రాంతము గదా!

కల—(సిగ్గునఁ జిఱునగవుతో) వయస్యా! సత్యము గనుఁగొంటివి.

చ. కలితనిగూఢభావములు గాఢతరోత్కలికంబులున్ సబా
ష్పలవసముద్గమంబు లగుభవ్యకటాక్షము లాపె నాపయిం
బలుమఱు చిమ్మచుం బిఱుఁదుబర్వున మంథరమందయాన యై
నిలయముఁ జేరుచుండియును నెచ్చెలి నాయెడఁ దం జరించెదున్. 32

మారు—కలకంఠ! మదపుటేనుఁగా నెను బట్టుకొనఁ బోవుచుండఁగాఁ బయినుండి నీ వేలాగున నుఱికితివి?

కల—మిత్రుఁడా! నీవు భ్రమరకమాత్రపరిజనుండ వయి వసంతవనమున నుంటివని నేను విని త్వరితముగా నీయొద్దకు వచ్చుచుండఁగాఁ దారిలోపల సారసికదారసిల్లి నన్ను సోమసరస్తీరమునకుఁ గొంపోయినది.

మారు—(తనలో) అవురా! యితనిని గూడ సారసికయే దీసికొనివెళ్లెనా? (ప్రకాశముగా) తరువాత?

కల—తరువాత జలక్రీడానంతరమునఁ, గడలినడుమనుండి కలుములజవరాలునుంబోలె సరోమధ్యమునుండి బయలువెడలు రమయంతికను నేను జూచితిని.

మారు—తరువాత?

కల—తరువాత—

ఉ. స్నానముచేసి వెల్వడులసజ్జలబిందుతరంగితాంగఁ, బ
ద్మానన, సక్తసూక్ష్మవిమలాంబరలోభ్యనితంబభారఁ, దీ
రానను నిల్చునాపయిని ప్రాలెడుచూపులదాని, మన్మథుం
డాననఁబోణి నామనసునందు లిఖించె స్వకీయకౌశలిన్. 84

మారు—మిత్రుఁడా! జవ్వనపుశిల్పిచేత సముల్లిఖితంబు లయిననితంబినులయంగకంబులు హృదయంగమంబులు; స్నానమాడి వెడలునప్పుడు వారియొప్పిదముచెప్పవలసిన దేమి? తరువాత?

కల—తరువాత నయ్యాదన మదద్విరద మాకస్మికముగ సమీపింపఁగా నెట్టననేదిష్ఠ పాదపంబు నధిరోహించి గుబేలున దానిమీఁద నుఱికితిని.

మారు—(హర్షముతో) అదృష్టవశమున రమయంతిక మృత్యువుచేతనుండి తెరలింపఁబడినది.

కల—చ. జనులు హాళాహాళిన్ నుతులు సల్పఁగ నే గజకంఠపీఠిఁ జ
ట్టనఁ బయినుండి హుమ్మని హఠాద్గతి దూఁకుడు నేమి చెప్పఁ, దాఁ
బెనఁగొనుహర్షరాగభయవేగవశమ్మున నమ్మృగీవిలో
కన, హృదయంబు దిగ్గురన గాటపుమూర్ఛ మునింగె నక్కటా. 35

మారు—సఖా! నీకోరిక నెఱవేఱినదే యని తలంచుకొమ్ము. చూడు—

ఉ. తావకరూపవిభ్రమకథాపరివర్ధితరాగవృత్తి దాఁ
గావున మాన్నె యాబిడ సఖా; భవదీయకరస్థ యయ్యె! సం

రావభయంకరంబుఁ జికురగ్రహాయాళుకరంబు నైనదం
తావళిరాజువారి కటు దప్పె,నిఁ కిప్పుడు చెప్ప నేటికిన్? 86

కల—వయస్యా! యీ మెయస్నయగు రుద్రరాతుఁడు శంబరకపక్షపాతి యని సందేహము.

మారు—అంతమాత్రమున నేమి?

క. తరుణులు సమవ్యాదు లయిరే। నిరువురుఁ, బ్రతికూలు రైన నేమీ బంధుల్?
విరసు లయిరేని వారి। ర్వ్వరు వీరనుకూలురైరి పో;ఫల మేమీ? 87

కాఁబట్టి మనము శిబిరమునకుఁ బోదము.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధ సరసకవితాధురంధర వడ్డాది సాధువంశక్షీరనీరాకర
రాకాసుధాకరాచ్చనామాత్యపౌత్రహారితసగోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబా
గర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయసుబ్బరా
యనామధేయాంధ్రీకృత మల్లికామారుత ప్రకరణంబునందుఁ
జతుర్థాంకము.



శ్రీరస్తు

# మల్లికామారుతప్రకరణము

## పంచమాంకము

(తరువాత విప్రవేషధరుఁడు రాక్షసుఁడు ప్రవేశించుచున్నాఁడు)

రాక్ష—అహా! యకుతోభయంబు నతిమనోహరంబును గదా యస్మదీయకుల చరిత్రము!

మ. నరమాంసంబున భోజనంబు జరగున్; రక్తంబు పానీయ మౌ;
సురతక్రీడయు స్వేచ్ఛమై నడచు నస్తోకాన్యదారావాప్తిన్;
బరఁగున్ భాగ్యసమృద్ధి యజ్ఞమథనప్రారంభదీక్షన్; వసుం
ధర స్వచ్ఛందమనోజ్ఞ రాక్షసజనిన్ సంతుష్టిగా దేమిటన్? 1

అస్మదీయజాతివిరుద్ధ మగుటచే నతిశోచ్య మయినను, సింహళద్వీపవాసియగు నాసఖుఁడు వికటగ్రీవునిపనినిమిత్త మీవేషము ధరించితిని. అతఁడు నాతో సఖా! ఖడ్గజిహ్వా! సకలమూర్ఛాహార మయినరత్నముఁ జిత్రమయ మయినకన్యారత్నము, వివుల మయినదివ్యాంబరము నను నీప్రశస్తవస్తువులు మూఁడును నాకుఁ గలిగి యున్నవి. నీవును జూచి యున్నావు గదా! నే నీమూఁడింటిని లంకాపురగమన సంభ్రమాకులుండ నయి నానివాస మగుమఱ్ఱిచెట్టు మొదటఁ బ్రమాదమునఁ బడవేసి తిని. తద్వస్తుత్రయనాశనానంతరము నాయాయు వత్యల్పమని లంకాపురవాస్తవ్యు లగుజ్యోతిష్కులు చెప్పియున్నారు. కాఁబట్టి తద్వస్తుత్రయాన్వేషణమునకయి నీవు ప్రయత్నింప వలయు' నని యానతిచ్చినాఁడు. (హర్షముతో) విప్రవేషముతో వెదకుచున్న నాకు నమ్మూఁడును నీకుసుమపురమందే కంటఁ బడినవి. (విస్మయముతో) అహా! యనిర్వచనీయసౌందర్యనియంత్రితసకలలోకలోచన యగు నచ్చిత్రకన్యయు, దుకూలాంచలలిఖితుఁడును, మరకతస్తంభస్నిగ్ధరుచియు నగున తరుణవయస్కుండును నిట నిజముగానే యున్నారు. (నవ్వి) వారేవొంగలును. (వికటముగానడిచి ముందు చూచి) సాయంసంధ్యాసమయమ్మునఁ గ్రమ్మకొనెడు నిమ్మనిచీఁకటెని జిక్కఁబఱుచుచు నాకసము దాఁకుచున్నయీచీఁకటిమ్రాఁకుల పెనుదోఁపేమిగా నుండునో? (బాగుగఁ జూచి) కుసుమపురోపకంఠవాసిని యగు కాత్యాయనీదేవి విహారోద్యానము గానోపును. ఇది రాత్రులయందుఁ ద

త్కాలసన్నివిష్టసకలపరివారమండలం బయి మనుజదుష్ప్రవేశముగా నుండు నని వినుచుండెదను. అందుచేతనే యిప్పుడు—

చ. అట నిటఁ జెట్లక్రిందఁ బ్రమదార్భకు లాడెద రాటలన్; మహా
ర్భటి నదె విఘ్నరాడ్గళరవం బుఱుమట్లు వినంబడుం; బురీ
ఘటలు భయోత్థఫీత్కృతుల గంపతి దౌలఁ దలంగ వీచు, నా
పటముగ గంధవాహములు హాహనసింహసటావిఘట్టులై. 2

(భయముతో) కాఁబట్టియే యీప్రదేశము మాకుఁ జేరరానిది. ఈదేవి యసురరాక్షసులపక్షమున నిసర్గద్వేషిణిగదా! మాయావిదుఁడగు వసుదేవనందనునకుఁ దోడఁ బుట్టువు. ఆస్త్రీసామాన్యపరాక్రమురాలు.

తే. గీ. కొమ్ముకొననింద్రునాపవాహ్యముఁ జిమ్మి । నటిమహిషాసురునియుత్తమాంగమీమె
లేఁత దగుచిగురాకుపోలికఁ దనర్చు । తనదు పదతలమున విమర్దన మొనర్చె. 3

అయినను నీమెపరాక్రమము భీరుజనప్రశంసాగోచరమే.

మ. తొలి మద్వంశవతంస మల్లదశమూర్ధుం డాత్మదోస్స్వేమమున్
దెలియం గోరి పెకల్చి వెండిమల యెత్తెం గాదె యువ్వెత్తుగాఁ;
జలియింపం గిరి, యేమి చెప్పఁ దదపర్ణన్? కౌఁగిలించెం దనం
త లసచ్చాటువచోనపేక్ష విభు నంత్రాసుఁ డా భీరువై. 4

(మార్గాంతరమున నడుచుచు ముందు చూచి కౌతుకముతో) గంధగజకుమారమంథరసంచారంబుతో నిశ్శంకంబుగా నంబికాయతనారామమునఁ బ్రవేశించు నీయభినవారూఢయౌవనారంభుఁ డెవ్వఁ డగునో?

చ. మరకతరత్నకాంతి యయి మంజులపాండరగండభాగుఁ డై
యురుభుజదండమండనమహోగ్రకృపాణలతాసమేతుఁ డై
కరము మనోహరాకృతిని గాంచియు, వీఁడు భయానకుం డగున్,
బరుషవిషాహియుక్తవిటపం బగుచందనశాఖికైవడిన్. 5

(బాగుగఁ జూచి) అహో! వీఁడు మాదుకూలపుఁ జెంగున వ్రాయఁబడిన పడుచువాఁడు. ఆచిత్రకన్య వీనియధీన. (భయముతో)

క. తన తేజునఁ జీఁకటిలో । నను సైతము దవ్వులను కనంబడు నేత
త్తను వకట! దురాసదుఁ డీ । యన యౌవనజృంభమాణహార్యక్షగతిన్. 6

కాఁబట్టి యీతనిచేతఁ జిక్కిన యాచిత్రకన్య దుర్గ్రహ యని తలంచెదను. అయినను సత్యకన్యయుండఁగాఁ జిత్రకన్యతో నేమిప్రయోజనము? ఈవృత్తాంతము సర్వము

మణికూటశిఖరాగతుం డగు చెలికానికి వికటగ్రీవునికి నివేదించి సాయిచ్చం బోయెదను. (ఆకాశముఁ జూచి) ఈసమయ మస్మత్సంచరణోచితముగదా!

ఉ. మాయనిశ్రోత్రనేత్రురుల మాంసపుసంచయమట్లు సంజకెం
జాయ విహాయసాంతమున సాంద్రముగాఁ గొమరారుచుండఁగా,
వాయసవృత్తిమై నిరులు వావిరిగా నరుదెంచు, దృప్తర
క్షోయుతమట్లు లయ్యెడి సమస్తము గ్రస్తమొనర్చెఁదోడుతోన్. 7

(నిష్క్రమించుచున్నాఁడు. విష్కంభము)

మారు—(అపేక్షతో)

చ. అరమర లేనిప్రేమ విరివై నునుసిగ్గునఁ బొల్చి, తేల్చుచున్
గరణములన్ బ్రమోదరసకంధి, హృదంతరగూఢభావముల్
సరసపుదృక్ప్రచారములజాడ వెలార్చెడుసుభ్రువిభ్రమో
త్కరమున కేను దొల్లిటివిధంబున వెండియుఁ బాత్ర మౌదునా? 8

కటా! యీవిషయమును పౌనఃపున్యముగాఁ దలంచుకొనితలంచుకొని నాహృదయ మనుతాప మొందుచున్నది.

తే. గీ. తన్ను నన్యుండు పెండ్లిగాఁ దలఁచుటెఱిఁగి । వెడలుచింటికి నంతర్వ్యాభిన్నహృదయ
యిం సుందరమైన మో మిటువంచి । సారెనుఁ జూచెఁ, జూపు బాష్పముగలంప.

(మరల నపేక్షతో)

ఉ. పొంజిగియంటి మెచ్చు నడిపొట్టపలెం గడు గౌరపర్ణమై
పుంజితపున్నిసర్గరుచి మున్నికతోరసూ మాయుధవ్యథా
సంజనితంపుఁ బాండిమ నెసంగుచనంగవపాంగుతోడి యా
కంజదళాక్షియం గ మిఁకఁ గౌఁగిటఁ జేర్చను జూడఁ గల్గునా! 10

అయిన నట్లనుకో నేల? అది యనుభూతమగుచునే యున్నదిగదా!

ఉ. నే నిదె కూరుచుండి శయనించి నిలంబడి యేగుచుండి కు
న్నాకనియు మేలుకాంచి తినుచుండి పఠించుచు నుండి మౌనినై
నానను మంద, మౌనదపునన్ నగుమోమునఁ బ్రేమమూపునన్
దేనియపల్కులన్ దగుసతిన్ గనుదున్ నను హత్తరేవగల్. 11

(ముందు చూచి సంతోషముతో)

క. కురవకచంపకకేసర । కురంటకతమాలముఖ్యకుటసాంద్రంబున్
బరిహాసితనందనం బిది । యగయం గాత్యాయని గృహారామ మగున్. 12

(అనుతాపముతో) ఎల్లరాత్రుల సర్వానుపర్వగణంబులు సాక్షాత్కరించుచుండుటంజేసి మానుసుల కిది దివసైకగమ్య మని వినంబడుచున్నది (తెరలోఁ గలకలము)

మారు—(చూచి విస్మయానందములతో) అహో! యహంపూర్వికాప్రణమనావర్జితము లయినమానికపుబొమిడికముల పరస్పరసంఘట్టనమున విస్రస్తస్వస్తరుకుసుమాపీడు లయి నచ్చిపడుచున్న యమృతాంధసులచేత మృడానీభవనసమీపమున నంబరము గిక్కిఱిసి యున్నది. (కౌతుకముతో)

తే. గీ. పుణ్యాతమదర్శనుండు సంఫుల్లనేత్రుఁ । డవతరించెడు నదె పైబిడౌజనుండు
కమలవనవృతమై పెనుగాలిచేత । ధూత మాదేనగానదీస్రోతమట్లు. 13

శా. త్రైలోక్యంబును భ్రూవిధేయము. బలిప్రధ్వంసి తమ్ముండు, ది
క్పాలుర్బంటులు, స్వస్తివాది గురుఁడున్, బ్రాఁబల్కు స్తోత్రంబు, జ
న్నాలే యాపెంత కిల్లు హైమగిరి, మందారాళి పూఁదోఁట, మిన్
జాలే బావి, యొడల్ శచీనయనవీక్ష్యం; బింద్రుభాగ్యం బహో. 14

(మఱియొకసంకఁ జూచి) మెఱపువెలుతురువలెఁ గన్నులు మిఱుమిట్లుగొల్పుచున్న యీపెద్దవెలుఁ గేమిగా నుండును? (ఆలోచించి)

ఉ. అందఱకున్ సమాన మగునాస్యము శిల్పులకున్, బురత్రయీ
సుందరురాంద్రమంశిపుసూత్రముఁ ద్రెంచినశూలికన్న, రూ
పొందినస్వాహనోముఫల మాత్కటతేజమునం దమంబు మా
యం దిగుచున్నవాఁ డితఁ డవార్పతితేజుఁ డుషర్బుధుం డగున్. 15

(చిఱునవ్వుతో) ఈతనిం జూచి యీషదున్మిషితమందాక్షముగా హారమహిషి స్మరదాహము సంస్మరించు నని నేనూహించెదను. (వేఱువైపు చూచి) ఓహో! భీషణోజ్జ్వలాకారుఁ డిదిగో భగవానుఁడు శ్రాద్ధదేవుఁడు.

ఉ. పాపమహాత్మజీవులకుఁ బ్రాచితపుంబరమోపకారముం
జూపఁగ యుక్తదండనము శుద్ధమనంబునఁ జేయువాఁ, డిరుల్
చోపుడు వెట్టునాజగముచుట్టముగాదిలిపట్టి యైనవాఁ
డీపొడకట్టునాతఁడు పితృప్రభుఁ డేల నరుఁ డౌ? 16

అయ్యో! యీయనవాహనమున కీయాకస్మికసంభ్రమ మేమి చెపుమా? ఆ! తెలిసినది.

ఉ. మాత! జోహా ర్జోహా ర్మహిషమర్దని! నీ కని మ్రొక్కు. దేవసం
ఘాతము వాక్ప్రయంబు భయకంపిత మౌచును నాలకించి, తన్
దూతలు మూట్టుకొన్న జవధూతవిషాణభయానకంబుగాఁ
బోతు పరిధావనంబు సలుపున్ వలవంకకు ఘంట మ్రోఁగఁగన్. 17

(అన్యత్ర చూపుఁ బఱపి భయముతో)

చ. వికటపుమోముఁ గ్రొమ్మెఱుఁగువెండ్రుకలున్, నరరుండమాల, తా
లికుటమహాభుజంబులు, జ్వలన్నయనంబు, లగోన్నతంబు మే
చకఘనకాయముం గలిగి సర్వభయంకరుఁ డౌచు విస్ఫురన్,
విశ్రుతముగా నభోంగణము నిండి కనంబడు నీతఁ డెవ్వఁడో. 18

(విమర్శించి) ఇతఁడు దిక్పాలపంక్తినిఃష్టుఁ డని వినంబడురక్షఃపతి నిరృతియని తలం
చెదను. (నవ్వి) ఓహో! యీ తనియం దంబికాపరివారవర్గమున కెంతసా
హాదరము!

తే. గీ. వేగఁ బ్రత్యుద్గమింతురు, కౌఁగిలింత్రు । స్వాగతంబుల నడుగుదు రవసరంబు
నుచితము వచింత్రు, నిరృతిరా, నిచటనున్న! ప్రమథులెల్లను నిండారుప్రమదమునను.

(స్పర్శసుఖమనుభవించి) ఏమిది? నాయంగము ఝల్లనిమడుఁగులో మునిఁగినట్టు లా
హ్లాద మొందుచున్నది! (చూచి)

తే. గీ. హారకుండలధరుఁడు రమ్యాననుండు । నగుచుఁ గనుఁగవదనియించు నంబుభర్త,
విమలతారకపూర్ణేందుబింబయుక్త । మైనగగనావకాశంబునందమునను. 20

ఓహో; యీతని తేజ మితర తేజఃపరిభావకము

క. వరుణుని తేజం బన్యము । హరియించు నటన్న నేమి యబ్బుర? మీతం
డిరవుకొనుకడను జేరిన। తరుణముననె పొనుఁగుపడుఁ గదా పెనుజోతుల్. 21

(మఱియొకరియెడఁ జూచి తావి నాసి) సకలేంద్రియసంతర్పణంబయిన పరిమళంబునఁ
బ్రపంచము ముంచివేయుచున్నాఁ డీతఁ డెవఁడో? (బాగుగఁ జూచి)

చ. అనలుఁడు మిత్రవంతుఁ డగు, నన్నము పాముల కబ్బ, నూర్పుపు
చ్చును, భువనం బనూన మగు శూలిశరీర మెవండు గల్గ, మూ
ర్ధనమనసంచలత్కుసుమదామగళన్మకరందలుబ్ధభృం
గనిచయగానబంధురుఁడుగా నలగంధవహుండు డిగ్గెడున్. 22

(తలఁపు వచ్చినట్లుగా) ఏతద్దర్శనంబున నాహృదయ మేమోకాని యనిర్వాచ్యమయిన
యౌత్సుక్య మొందుచున్నది.

తే. మానసము హర్షపడు, స్వాత్మమతి జనించు
నితనియెడ నేమొకో యిదియే నెఱుంగ; (చిఱునవ్వుతో)
నైన సంగంబునను గేవలైక్యబుద్ధి
గలుగు సమనాములకుఁ బయస్సులకుఁ బోలె. 23

(అతికష్టముగా నన్యత్ర చూపు మరలించి) ఏకపింగళమయిన కనుంగవతో సన్నిహి
తుం డయిన సమగ్రభూషణమణిప్రభాకకలితశార్వరాంధకారోన్మేషుఁ డీపురు
షోద్ఘుఁ డెవ్వఁ డగునో? (తెలియుట నభినయించి)

చ. కలుముల కాఁపురంపుఁ బటలకౌ పురమాళికి సార్వభౌముఁడున్
విలసిత నైజభూధరనివేశితశీతలపాదచూడుఁడున్
లలితప్రయత్నరాజ్యకమలాచపలావళి కంబువాహుఁ డౌ
నలఘుదిశాధినాథమణి యైలబిలుం డగునీతఁ డారయన్. 24

(సానునయహర్షంబుగా) ఆహా! నా సౌభాగ్య మవాఙ్మనసగోచరము గదా!

మ. సజవోచ్చైర్గలదౌసవాహ్యావృషభస్పందానువృత్తిస్ఖల
న్నిజమూడోచ్ఛలితాదితేయతటినీనిర్వాదుఁ డాహ్లాదకృ
ద్విజరాజచ్ఛవి, తాను దృక్పథమునం దీపించుచున్నాఁడు పూ
ర్వ్యజయుం డవ్వల దవ్వులం దొలఁగ దారిం దారునం దేవతల్. 25

ఉ. దేవర యిప్పు డొద్ద కరుదేరఁగ హర్షపరీతచిత్త యై
దేవియుఁ దత్తలంబునను దిగ్గనఁ బయ్యెద జాఱ లేచి, కై
లా విడఁగా జయాసఖి, కెలంకున మిక్కిలి సంభ్రమంబునన్,
దా విభు దాయఁ గాఁ గొనిపదంబు లిడే మెలమెల్ల నేగెడున్. 26

(మరలవిలోకించి) ఆహా! యిది యతిమనోహరముగా నున్నది.

క. సురసిద్ధసాధ్యవిద్యా। ధరకిన్నరసుందరులయుదారనయనభా
సురముఖముల నిండి దివం। బరు దగు బహుచంద్రమండలావృతమ్మై. 27

నే నీబృందారకుల కందఱకు వందన మాచరించెదను.

తే.గీ. అగ్గు నొడఁగూర్ప నెగ్గుఁ దొలంగఁ బెట్టఁ। గలుగు నింద్రాదిదిక్పాలకులకుఁ బ్రణతి;
యొతిదఖిలామరశ్రేణి యెపుడుఁ గొలుచు। దేవికి శైలరాజపుత్రికి జోహారు. 28

(నమస్కరించి లేచి పైకిఁ జూచి) అయ్యో! యాకాశము శూన్యమైనది.

తే.గీ. వేలుపులు లేరు; లేరు దిక్పాలు రప్స। రసలు లేరు; విమానవర్గంబు లేదు;
కేవలంబును దొంటిభయావహంపుఁ। జిమ్మచీఁకటి శేషించెఁ గ్రమ్మలంగ.

నిర్వర్తితశర్వాణీదర్శను లయి గీర్వాణులు గమించి రని తలంచెను. (హర్షముతో)

తే.గీ. వెనుకటిభవంబులందు సల్పినమదీయ। బహుతరోత్కృష్టతప మెల్లఁ బండెనేఁడు;
దేవతాసార్థమును దాను గేవలంబు। సాంబమూర్తియె నాకు సాక్షాత్కరించె.

(విమర్శించి) సర్వమంగళాచరణమాలోపసర్పణమున కిదియే నా కనుకూలసమయము
సమీపించెదను. (పరిక్రమించుచు నపేక్షతో) అంబిక యనుగ్రహించునా?

క. ఉపచితఘనరాగుఁడ నే । నపాంగవిఘూర్ణాంధకారగ మడఁచి కరమునన్
జపలాక్షి కేల్గ్రహింతునొ । తపసుండు సరాగవనితామరవోలెన్. 81

(ముందుచూచి) ఇదె యుపవనద్వారము. నేనిందుఁ బ్రవేశించెదను. (ప్రవేశించి తొట్రుపాటు నభినయించి నిర్వేదముతో) ఇది సమప్రదేశ మయినను నాయడుగు తొట్రుపడుచున్న దేమి కారణము? కాని. ఇక్కడనే కూరుచుండి దేవిని బ్రసన్నురాలిం జేసికొనియెదను (జోసిలిపట్టి)

ఉ. పంచలపాలుగా భీసురసాణి, కుబేరుఁడు పాలి భీతుఁడై,
కొంచఁగ నిక్క సేఁ డోపలఁ గంపము నూరియు మూలఁ దూలి వే
యంచులవాలుజోరు పొరయం బలుబాములు, సైఁప కెన్మరా
త్రించెనుమస్త మేడ్పలి మధించిన దేవపదంబు గొల్చెదన్. 32

(సశ్లాఘముగా నాకాశమున)

ఉ. తోడివయస్య యోవిజమతో సగోష్ఠుల నింక వానకే,
జోడుగ నొద్ద నున్న శశిమాసుని మోమున చూపఁ ద్రిప్పకే,
పోఁడిగ నెత్తునంఘ్రిని శిథూషయు గల్గన ప్రేమఁగనుండఁ జెం
డాడితి వ్రదజా! సుహాసు; నంబ! యి దేమి విలాసమో గదా. 83

(నిమిత్తమును సూచించి)

తే. గీ. ప్రియతమాలింగనము నీకు జెరయు దొంక । వకట! దక్షిణబాహువా! యదరె దేల?
యెఱుఁగ వే మఱి కొఘుటనైక పేంతు । వైనగ నత్రక్రతిన వాక్యము నీవు? 34

(నిశ్వసించి యాకాశమున)

తే. గీ. అయనిర్వ్యక్త కన్యాకా నఘరత్న । మల్పసుకృతుఁడ నగు నాకు నబ్బమి తగుఁ ;
గాని త్వద్వాక్యమే కదా దాన మూల । మంబ! నీకరుణాగ్రహ కద్ది తగునె ?

అయినను స్వకర్మాధీనసుఖదుఃఖుఁడ నయిన నేను భగవతి నీకౌత్స్యాయని నుపాలంభించెద నేల? ప్రియతమురాలు లభింపమింజేసి నాజీవితము నిష్ఫలము గావున స్వాయముహ్ృతంబులయిన కుసుమమంబులచే నార్యామహాదేవి నర్చించి సంతోషపఱిచెదను. (మరల నాకాశమున) ఓకౌత్స్యాయని!

తే. గీ. ప్రణతకామితమందారవల్లి! తల్లి! । యనఁగఁ జెలి నాకు మల్లిక యబ్బదేని
వాదుహాస్తాసిలూనకంఠంపు మోము । గనుమిపుడు నీపదములఁ గోకనదముగను.

(కత్తిదూసి సప్రార్థనముగా)

తే. గీ. పద్మపాటల మైననీపదములందు । దేవిగో! నాకు భక్తి వర్ధిల్లఁ గాక;
యనఁగుమల్లికతోడ జన్మాంతరంబు । నందు నైనను సంగమ మబ్బుఁ గాక.

(ఖడ్గము కంఠమునం దుంచుకొనుచున్నాఁడు)

(ఆకాశమున) హా! నాథ! మారుత! రక్షింపుము రక్షింపుము. రాక్షసహస్తమునం బట్లు చిక్కియున్న నన్నేల చూడవు? మొట్టమొదట మత్తేభగుహాస్తమునుండి నన్ను విడిపించి బ్రతికించినవాఁడవు నీవేకావా? హా! యంబ! గౌరి! నేను సత్యముగా నే రాక్షసహస్తమున నీయఁబడితిని. హా! తండ్రీ! హా! తల్లీ! యిదిగో! గౌరీప్రసాదలబ్ధ యయిన మీయేకపుత్త్రి మల్లిక చెల్లిపోవుచున్నది. హా! మాతృసమానురాల! భగవతి! మందాకిని! యిదిగో! నేను నియమాశ్రమపుసమీపమునకే తేఁబడినదానను సుమ్మా! నామీఁదిప్రేమ చేతను గదా నీవు హిమగిరిని విడిచి పెట్టి యిచ్చోటికి విచ్చేసితివి! హా! సఖి! నవమాలిక! హా! కాళింది! మీదర్శన మిఁక నాకు దుర్లభము గదా! (ఖడ్గము కంఠమునుండి తీసి సంభ్రమాభిప్రాయములతో) ఏమిది! మల్లికాస్వరము కరుణాకరుణముగా గగనగోచరమగుచున్నది! [విషాదవితర్కములతో]

ఉ. ఆకసనీడ మేఘపయి నశ్రము నింపని తోయముం బోయెనో?
నాక మలంకరింప సురనాథుఁడు వేలుపులకై హరించెనో?
ప్రాకటభూష చంద్రకళ గాలి నటుంచు గిరీశుఁ డెత్తెనో?
యాకసమందు నీయుల్ సురరూపిణి యై విలపించెడు భీరు వేమొకో? 38

(పైకిఁజూచి) అన్నన్నా! యెంతప్రమాదము

సీ. గుండె జల్లనఁ బల్లకోరమీసంబులు ప్రేలుజంజాటరాగ వెండ్రుకలను
ముడివడ్డబొమలమోమును, బెద్దలాఁతియు కన్ను దేరినవంక మెఱుఁగుఁగోఱ
లును బ్రగుడ్డులు గల్గి వ్యాఘ్రమంబు నదమస్త్యయమట్టి తోఁచునీచయుఁడు డెవఁడో?
తెలిసె నిశ్చయము; రాత్రించరుండె వీఁడు. ప్రధావించుచున్నాఁడు; పైవమెంత
యాపదఘటించె! నవె నానియంకాలమునుండి ప్రభ్రష్ట యగుచుఁ బయోధరంబు
వలనఁ గ్రొక్కారు మెఱుఁగు దీపయును బోలెఁబడె నమల్లికగడగడ వడఁకుచు హాహా!

(కన్నీళ్లతో) హా! విధాతనిష్కరుణత!

చ. మును మును నేన నేన యని బోటులు చేతుల నూఁత యీయఁ, సో
పనములదారి నైనఁ గటిభారమునన్ మెలమెల్ల డిగ్గునం
గన గగనంబునుండి నడిగాఁ బడు, గాంగఝరీం బెకల్చి చి
మ్మినచవుదంతిచేతిబలిమిం బడుబంగరుఁదమ్మితీఁగనాన్. 40

ఈమెను నేను బడకుండఁ బట్టుకొనియెదను. (ఖడ్గము క్రిందఁ బెట్టి చేతులు వెలికిలఁ బయికెత్తుచున్నాఁడు)

(తెరలో) ఎవఁడో యీయువు చెల్లినవాఁడు నాయుత్సంగమందలి మానవకన్యను దొం
గిలించినాఁడు. నాయొడిలో నప్పుడఁతి యిప్పుడు కనఁబడకున్నది. నే నొక్క—
యుఱుకున దానిని సింహళద్వీపముఁ జేర్ప నాలోచించితిని.

(ఇద్దఱు వినుచున్నారు)

మారు—(నవ్వి) అహా! దేవీప్రసాదమున నిమె నాచేతిలోఁ బడినసంగతి యీమూ
ర్ఖరాక్షసుఁ డెఱుంగఁడుగదా!

మల్లి—(భయముతో) అయ్యో! రాక్షసుఁడు మరల వచ్చుచున్నాఁడు. (వడఁకు
చున్నది)

మారు—(నవ్వి) సుందరీ! భయపడకు. క్షణమాత్ర మాచెట్టుచాటున నుండుము. ఈ
చెనఁటిరక్కసుని నేను జెండాడెదను.

మల్లి—అయ్యో! మహాకాయుఁ డయినరాక్షసునితో నాథుఁ డెట్లు కలయఁ
బడునో?

మారు—(నవ్వి) భీరువా! మహాకాయుఁ డయిన నేమి?

తే.గీ. చండదుస్సహవీర్యతేజస్వి యెందు నరయ నేయురు పరవపుస్థౌల్య మబల!
యంబుజపుఁగెంపుఁగన కట్టెయుదరుఁ గ్గిబూటి సేయునె కొండంత మదుకవాపి

మల్లి—(భయముతోఁ జెట్టుచాటున నున్నది)

మారు—(కత్తిదూసి గర్వముతో నిలఁబడుచున్నాఁడు)

(తరువాత వెదకుకొనుచు సంభ్రమముతో యథోద్దిష్టముగా రాక్షసుఁడు ప్రవేశించు
చున్నాఁడు)

రాక్ష—

శా. నే నాసింహళదేశకాననపతిన్; దీవ్రడించునా మోలఁ గా
లూనన్ భ్రామితకూటశాల్మలి భయంబొందు న్మహామృత్యువున్;
స్త్రీ నంకస్థను గోలుపోయి వికటగ్రీవాసుఁడుం డోర్చునే?
నా నాతిం గయికొన్నయన్నరుఁ డెటు న్నాఁడే గతాయుం డిఁకన్.

మల్లి—(భయముతో) అయ్యో! భయంకరశరీరుఁ డగువీనితోఁ గువలయవశకో
లాంగుఁ డయినమహాభాగునకు సంగరం బెత్తెఱంగున జరుగునో గదా!

మారు—(చూచి విస్మయముతో)

మ. శిర మభ్రంకషతుంగశైలనిభ మీక్షింతుర్ సముద్దీప్తవృత్తి;
యురముం బ్రస్ఫవిశాలభీషణము తాలోత్తాలముల్ బాహువుల్,

చరణన్యాసము ఘాతఘాతలము: చాలన్ వీనిపైస్పృష్టికిన్

బరమాణుత్వముఁ బర్వతంబులనె పొందంజేసె నోధాత మున్. 45

(బిగ్గఱగా) ఓరీయమంగళస్పర్శ!

తే. గీ కుసుమసుకుమార, శృంగారరసపయోధి। సుధ మదనజీవనాడి నావిధువదనను,

బరమకల్యాణి నంటునీకరము నూఱు। వ్రయ్య లెటు గాదు రోరి క్రవ్యాదపాశ!

రాక్ష—(మారుతునిఁజూచి) నిజముగా వీఁడే చోరుఁడు. (సోపహాసముగా) ఓరోరి చో రుఁడా! మేలు మేలు!

తే. గీ. గాఢవిషవహ్నిభీషణకాలసర్ప। విస్ఫుటస్ఫటాఫలకశోభితమణిశిల

నస్మదీయాంకమధ్యపర్యంకవిధృత। జవ్వనిని గవ్వినాఁడ వీ వెవ్వఁడవుర?

మారు—(సక్రోధముగా) హా! లోకవిద్విష్టాచార! వెండియు నీవ్యవహారము కన్య కాగోచరమే యగుచున్నది. (తిరస్కారముతో)

మ. అరిరే పాపమతీ! పలాశ! చపలాత్మా! శ్వాన మాజ్యాహుతిం

బోరయం బోలునె? బాల నంటు టెటు! ఛీ! హా! జీవ మాశించితే;

మరి కాదేని, కఠోరఖడ్గదితయుష్మత్కంధరాంతస్సిరాం

తరనిష్ఠ్యూతకవోష్ణరక్తఝురమేదస్విన్ ధరం జేయుదున్. 49

రాక్ష—(భ్రూముడితో) ఆ! వికటగ్రీవుఁడ నగు నాయెదుట నిలుచుచు నిశ్శంకముగాఁ బొగడుకొనుచున్నావు! (బాగుగఁ జూచి ప్రత్యభిజ్ఞతోఁ దనలో) వీఁడే మద్గురూలాంఛలలిఖితుఁ డయిన పదుమవాఁడు చిత్రకన్యాచోరుఁ డని ఖడ్గజిహ్వుఁడు నాతోఁ జెప్పినవాఁడును వీఁడే. (ప్రకాశముగా)

ఉ. ఏలర మర్త్యడింభ! నిరపేక్షుఁడవై నిజజీవమందు, నా

ప్రోలకు వచ్చినాఁడ విటు? మూఢుఁడ! పుణ్యము; కన్య కేమి పో,

నీళులఁ జింతపండు బలె నిమ్మ కులాంగము మేళగించి తృ

ష్ణాజ్వాల శమింపఁగా గుటగుటం దిను నెత్తుటిచాయ ద్రాగుదున్. 50

(మారుతుని మూఁపునఁ బెట్టుకొని పరుగెత్తుచున్నాఁడు)

మల్లి—(సత్వరముగాఁ జెట్టుచాటుననుండివచ్చి రోదనముతో) భద్ర! రాక్షస! యిదిగో నంజలిపట్టి వేఁడుకొనుచున్నాను. మహాభాగుని విడిచిపెట్టుము. వెండియు నన్నే భక్షింపుము.

రాక్ష—(చెవిఁ బెట్టక నిష్క్రమించుచున్నాఁడు)

మల్లి—(కన్నీళ్ళతో) అయ్యయ్యో! మహాభాగుని రాక్షసుఁ డెత్తుకొనిపోయినాఁడు. (సకరుణముగా) హా! సకలలోకలోచనచకోరవారపూర్ణచంద్ర! హా! కందర్పమ

నోహరాంగ! హా! సుజనచూడామణీ! హా! పుండరీకలోచన! హా! లక్ష్మీవిహా
రభవన! హా! మల్లికాహృదయవల్లభ! హా! మారుతి! సర్వలక్షణలక్షితమైననీక
మనీయవిగ్రహము రాక్షసాహారమగుచున్నదా నాథా? అయ్యో! నేనెంత పాపా
త్మురాలను! ఎంత యదృష్టహీనురాలను! కటా! దైవోపహతురాలనుగదా! సర్వా
నర్థములకు మూలమైన నేనే కారణమగుచున్నదానను. (నిట్టూర్పు పుచ్చి). నా
బ్రతుకిక నిరర్థకము. అయ్యో! మరణము కూడ నాకు దుర్లభమయినది భగవతీ!
భూతధాత్రీ! నాకు వివరమిచ్చి నీలోనికిఁ దీసికొనుము. కటకటా! సకలభువనమును గా
లాంజనశిలమయినకటికిచీఁకటి క్రమ్ముకొని యున్నది నేనెక్కడికిఁ బోదును?
ఎవ్వరికి మొఱ్ఱ వెట్టుకొందును? హా! దిక్కుమాలినదాననయితిని గదా! (రోదనము
చేయుచున్నది)

(తొట్రుపాటుతో మందాకిని ప్రవేశించుచున్నది)

మందా—బిడ్డా! భయపడకు. భయపడకు.

మల్లి—(చూచి కన్నీళ్లతో) అమ్మా! భగవతీ! భగవతీ! రక్షింపుము రక్షింపుము.

(పాదముల మీఁదఁ బడుచున్నది)

మందా—(సకరుణముగాఁ గౌఁగలించుకొని)

చ. తెలిసితి జ్ఞానరూపసుగుణదృష్టికలంబున, భీరురాల! మీ
యలవ్యసనానుబంధము సమస్తము; కస్తిని బొందఁ గిం కిటన్;
విలయము గండ్రు నక్కసము; వేసము చీఁకటి విచ్చు నిగ్గగున్;
దొలఁగును రేయి; దైవము దోడగుఁ; గ్రిమ్మఱ భద్రమయ్యెడున్ 51

మఱియు మారుతుఁడు రాక్షసహస్తగతుఁడయ్యెనని సంతాపపడకుము.

తే. గీ. భవ్యశౌర్యవిడంబితసవ్యసాచి। మారుతుఁ బరాభవింపంగ లేరసురులు;
ప్రాక్కుధరజృంభమాణాంశుబాలభానుఁ। దట్టమగుచీకువా లరికట్టఁగలదె?

(తెరలోఁ జటచటధ్వని)

మందా—(చూచి యానందముతో) మారుతపరాక్రమ మెఱుఁగనిదానా! మల్లికా! మహాభాగుని చండిమను చూడుము.

క. మూఁపుననుండి భయంపడ। కోపించి తొలఁగి నిశిరము నతఁడసిఁ దునిమెన్
గైపునఁ గరికుంభము వ। జ్రోపమనఖరాంకుశముగ యువహరి వోలెన్. 53

మల్లి—(హర్షముతోను భయముతోను జూచుచున్నది)

మందా—(ఆనందముతో)

చ. అసిహతమస్తకుం డగుచు నద్దిర! [illegible] ధరాస్థలిన్
బసురుఁడు వజ్రఘాతదళితాద్రితటంబును బోలెఁ గూలెడున్;

(ఆశ్చర్యముతో)

విస్మృతపుఁదత్కబంధమున వెల్వడి యుజ్జ్వలభూషణుండు మిన్
దెసఁ బురుషుం డొకం డహహా! దివ్యశరీరము దాల్చి యేగెడున్. 54

మల్లి—(విస్మయానందములతో) భగవతీ! యిది మహాశ్చర్యము! అతిభీషణుం డగు రాక్షసునినుండి దివ్యపురుషుఁడు బయలు వెడలినాఁడు. మాడు మాడు. ప్రదక్షిణము చేసి మహాప్రదేశసంచారాభిలాషుండయి మహాభాగునకు నమస్కరించుచున్నాఁడు

మందా—(ఆలోచనతో) ఎవఁడో దివ్యపురుషుఁడు శాపవశమున రాక్షసుం డయ్యె నని తలంచెదను

(తెరలోఁ గలకలము ఇద్దఱు వినుచున్నారు)

మల్లి—(భయముతో) భగవతీ! రాక్షసనాశనము చేసి మఱల రాక్షసుండే వచ్చుచున్నాఁడని తలంచుచున్నాను.

మందా—(చూచి) బిడ్డా! యదిగోఁ గన్నీరు విడుచుచున్న నీతండ్రి నమాత్యవిశ్వావసునిఁ బురస్కరించుకొని నిన్ను వెదకుచు జెడిదఫ్రుఁ గైసుప్తులు నైకొని వీరపురుషు లిటు నటు సర్వత్ర దిరుగుచున్నారు

(మఱలఁ దెరలో) హా! పుత్రీ! మల్లికా! యింద్రజాలికప్రకారముగఁ జూపి కూడఁ జీఁకటి యని వడిసెడుదానవుగదా తల్లీ!

మల్లి—(కన్నీళ్లతో) అయ్యో! నాయనగారు రేడ్చుచున్నా రేమి చేయుదును?

మందా—బిడ్డా! నిన్నుఁ గానక దుఃఖపడుచున్న మీ తండ్రిగారి నూఱడించి, నీకుఁ బ్రాణదానమహోపకారము చేసి విజయమాన ధైర్యమున్న మాధవునిఁ గూడ సంభావింతము రమ్ము. (నిష్క్రమించుచున్నారు)

—◆ గద్య. ◆—

ఇది శ్రీపరమేశ్వరకరుణాప్రసాదసమాసాదితసరసకవితాధురంధర విద్వాది సాధువంశక్షీరసాగరరాకాసుధాకరాంచత్సామాత్యపౌత్రహారీతసగోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత మల్లికామారుత ప్రకరణమునందుఁ బంచమాంకము.



శ్రీరస్తు

# మల్లికామారుతప్రకరణము

## షష్ఠాంకము

(తరువాతఁ గాషాయాంబరయుగళీహస్తుఁ డొకపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు)

పురు—(హర్షముతో) ఓహో! బృహస్పతిని బరిహసించెడు తనమంత్రప్రభావముచేత మల్లికాకరగ్రహణమంగళము సులభపఱచుకొనుచున్న మా శంబరకప్రభువుగారి యెడలనమాత్యవిష్ణురాతుఁడుగారి పుత్రుఁడగు రుద్రరాతునికి స్నేహానుబంధమత్యధికము గదా! అందుచేతనే సన్నిహితమైనయీవివాహమహోత్సవమునందు సంభావితు లగుమహాజనులిఱుకటము పొరయక సుఖముగా వసించుటకయి నిజమహాభవనమునందుఁ గొంతభాగము వారికివిడిచియుఁగూడ నొసంగినాఁడు. ఇంతియకాక తండ్రి యయినవిష్ణురాతుఁడుగారికి సమ్మతము కాకపోయినను దా నాయనను సరకుగొనక తనసోదరిని రమయంతిక నార్యకలవింగకునికియ్యఁజూచుచున్నాఁడు. (నవ్వి) సోమసరఃకూలమునఁ జూచినదే మొదలుగా నార్యకలవింగకునికి రమయంతికయందు ననురాగము పెరుగుచున్నది. దానం జేసియేకదా యతఁడు సవికారము లయిననయనాంచలములతో నమ్మించుఁబోణివంకల మరలఁ జూచుచున్నాఁడు. తానుగ నెట్టయెదుటికిఁ బోయి యేమేమో సల్లాపించుచున్నాఁడు. తా నేవో ఘనకార్యములు చేసినట్లు తననోటితోనే యామెయెద్దఁ జెప్పుకొనుచున్నాఁడు (పక్కున నవ్వి) ఇతఁ డిన్నిపాట్లు పడుచున్నను నామెకుమాత్ర మితనిమోము విషప్రాయము చూడ గిట్టదు. (విమర్శించి) కానున్నది కాఁగలదు ఆర్యకలవింగకుఁడును రమయంతికను సర్వదా పొందఁగలఁడు. అఘటితఘటనైకసిద్ధవిద్యురా లయినమందాకినీభగవతిని నానావిధసత్కారములుచేసి శంబరకప్రభువుగారు తమపక్షమునకుఁ ద్రిప్పుకొనుచున్నారు గదా! ఆతల్లి నిశ్చయముగాఁ దలఁచుకొన్నపక్షమునకుఁ దామరకును జందమామకును బరస్పరానురాగము గలిగింపఁగలదు. చెంగలువ నయినను వేవెలుఁగుతో సంఘటింపఁగలదు. ఇదిగోఁ! క్రొత్తగా వికసించుచున్న మోముఁ బువ్వువన్నెగలిగిన యీమెత్తనిసన్నకావిదువ్వలువలామె కిచ్చుటకేగదా ప్రభువుగారు నాచేతఁ బంపినారు. వివాహమంగళోపకరణవ్యాపృత యయిన భగవతిని జూచుటకయి, విద్యుద్వితానము

వంటి కాంచనధ్వజదండమండలము నెత్తిన బహిర్గోపురము చేదీపించెడునమాత్యవిశ్వ
వసుఁడుగారి యీమహోపవనమునఁ బ్రవేశించెదను. (ప్రవేశమభినయించి ముం
దుచూచి) ఇదిగో! దమయంతికకుఁ బ్రియసఖి యయిన మధురిక లోఁగటిలో
నుండి యీలాగున వచ్చుచున్నది.

మధు—(ప్రవేశించి యానందముతోఁ దనలో) ఆహా! యనితరసాధారణమతిప్రభావ
యగు సౌదామినీభగవతి శంబరికకుఁ దనోపాయము ననవద్యముగాఁ గనిపెట్టినది
గదా! (నిశ్వసించి నిర్వేదముతో) అయ్యో! దమయంతికకు రుద్రరాతుఁడు
సహజశత్రువు గాని యన్నగాఁడు. మర్కటమునకు మల్లెపువ్వులదండవలెఁ గల
వింకకునకు నీమె నీయఁ జూచుచున్నాఁడు. ఇందుకుఁ గూడఁ దెలియఁదగిన
యుపాయముఁ బ్రియసఖికిఁబోలె భగవతి నాచెవిలోఁ జెప్పియేయున్నది. (పురు
షునిఁ జూచి) ఇప్పుడేకగృహనివాసపరిచయమువలన వీఁడు శంబరకపరిజనుఁ
డయిన చపలకుఁ డని నేను దెలిసికొనుచున్నాను.

పురు—మధురికా! భగవతి సౌదామిని యెక్కడ నున్నదో నీకుఁ దెలియునా?

మధు—(తనలో) వీఁడు భగవతిని వెదకుచున్నాఁ డేమి? కాని అడిగెదను. (ప్ర
కాశముగా) చపలకా! భగవతి యెందుకు?

చప—(నవ్వి) ముద్దరాలా! యనుల్లంఘనీయ మయిన యాకాశభాషితమును బ్రతిపా
లించుటకయి శంబరకప్రభువుగారి కామె సర్వవిస్రంభపాత్ర మయి ప్రవర్తించు
చున్నది కాదా?

మధు—(తనలో) తల్లీ! భగవతీ! నీవాంచనప్రభావమునకు నమస్కారము.

చప—(తనలో) దమయంతీవృత్తాంతముఁ జెప్పెదను. (ప్రకాశముగా) ఇప్పు
డావశ్యకముగా భగవతిని సందర్శింప వలయును అన్నగారగు రుద్రరాతుఁడు
తన్నుఁ గలవింకకునకు నిచ్చినను మంకుఁదనమున నాతనిఁ బెండ్లియాడ దమయంతి
క సమ్మతింపక యున్నది. కాఁబట్టి భగవతి యామె పెంకితనమును మాన్పింప
వలయును.

మధు—(సోపహాసముగాఁ దనలో) హా! యాసకాల! అకలవింకకుని పరిశ్రమమున
కు భ్రమరకచరణతాడనమే తుదకు ఫల మగును లే. (ప్రకాశముగా) చపలకా!
దమయంతిక నొడఁబఱచుట యనఁగా భగవతి కది యెంతపాటిపని? (తెరలో)
నవమాలికా! యాలసించెద వేమి? కమ్మనిపరిమళముతోఁ దెమ్మెరలు వీతెంచె
డుకతమున సతిమనోహర మయినవల్లీలోద్యానమునఁ బ్రవేశించి యెంతసేపటినుండి
యో మల్లిక నీరాకను బ్రతీక్షించుచున్నది నీవు త్వరితముగాఁ బోయి యేకాం

తమున వివాహోచితము లయినమంగళభూషణములను సవిశేషముగా నామె కిప్పు డలంకరింపు మని భగవతి నీ కాజ్ఞాపించుచున్నది. పెండ్లివారు రాక మునుపే నీ వీపని నెఱవేర్పవలయును జుమీ

మధు—(తనలో) ఇది మంచిదే మారుతుఁడు గూడఁ గలకంఠభ్రమరకసహాయుఁ డయి యిక్కడ నేయున్నాఁడు. అతనిని నిగూఢముగా నక్కడకు సారసిక తోడుకొనిపోయినదిగదా! ఇఁక నేనును దగినసంవిధానమునఁ బ్రవర్తించెదను. (ప్రకాశముగా) చపలకా! యిదిగోఁ గంచుకులు భగవతి యాదేశమును జరుపుచున్నారు. ఆమె చేరువనేయున్నది. సులభముగా సందర్శింపవచ్చును. బొమ్ము. (నిష్క్రమించుచున్నాఁడు. ప్రవేశకము)

(తరువాత మారుతుఁడు కలకంఠుఁడు భ్రమరకుఁడు ప్రవేశించుచున్నారు)

మారు—భ్రమరక! మల్లిక యీచేరువ లతామంటపము నడుమ నున్నదన్న మాట సత్యమగునా?

భ్రమ—ప్రభువా! కాళిందీనవమాలికలు మంగళాలంకరణమును జేయుచుండఁగా నామెను జూచివాఁడవని మనవిచేసితినిగదా!

మారు—(నిట్టూర్పుతో)

శా. దేనిం బొంద నసహ్యమన్మథరుజార్తిం గూరి ముఁ గోరితిఁ,
దేనిం గాంచుట దుర్లభం బనెడుభీతిం బ్రాణనైరాశ్య మే
యే నట్లొందితి, నట్టిజీవితఫలం బిచ్చోఁ గరప్రాప్త మ
ట్లౌ; నంబా! భవితవ్యతా! మరల నెట్లావిర్భవింతో గదా!

కల—మిత్రుఁడా! సంశయింపకుము. గొంతు గోసికొనుట కయిన జంకు లేక నీవు సాహసింపఁగానే మల్లిక నీచేతిలోఁ బడినదిగాన జీవితఫలము భవానీప్రసాదము వలన నీకుఁ గరప్రాప్తమే.

భ్రమ—ప్రభువా! లతామండపమునకు మార్గ మీవల్లికాదళముల నడుమనుండి.

మారు—భ్రమరక! యీప్రదేశము దట్టంపుటాకుజొంపముల గుబురయినతీవలగుంపుక తమున జీబుకొని యున్నను బరిజను లెవ్వరయిన వత్తురేమో యనుజంకున నెమ్మది లేక కాలు గదలింపఁ జాలకున్నాను

భ్రమ—ప్రభువా! భగవతి యాజ్ఞచేతఁ బరిజనమును వేత్రహస్తు లుద్యానవనమునకు దవ్వులనే యాటంకపఱిచి యున్నారు.

మారు—(హర్షముతో) ఓహో! భగవతినీతి సర్వత్ర యప్రమాదిని గదా! దారి
చూపుము.

భ్రమ—ప్రభువా! యిటు. ఇటు.

(అందఱు నడుచుచున్నారు)

కల—(చూచి) ఓహో! యమాత్యవిశ్వాసుఁడు గారిభవనము ప్రత్యాసన్నవైవాహి
కమంగళమును సూచించెడు సదాత్తమండనవిధానముచేత నెంతచక్కఁగా శోభి
ల్లుచున్నది!

ఉ. తేనియ లుట్టు ద్వారముల దిద్దిరి నందనమాల; లుంచి రిం
పైనవి క్రొత్తచిత్తరువు లచ్చపుమేడల గోడలందు; సం
ధాన మొనర్చి క్షౌమపువితానములందు సుహాణిజల్లులన్,
మానుగ వీథివాకిట నమర్చిరి బంగరుఁ గాయమానముల్. 2

మఱియు—

ఉ. లీల నళిందకేతుపటలీపటపల్లవముల్ గదల్చుచున్,
దాలిచి తోరణప్రసవదామసుగంధమరందబిందువుల్,
గాలులు వీచు వల్గువిచలత్కచకుంకుమఘుర్షవేగసాం
దోలనచేటికామృదులదోర్వలయధ్వను లాహరించుచున్. 3

భ్రమ—(చెవి యొగ్గి) ప్రభువా! కేవల మిది వలయధ్వనియే యనియెద రేమి? అ
టునిటుఁ బ్రధావించెడు వారసుందరులనితంబబింబముల వ్రేలుచున్న మణిమేఖలా
సహస్రములఝణఝణత్కారంబులఁదోరంబయి ఘూర్ణమానసకలాంతఃపురజనం
బుల భూషణారావంబులఁ బూరితంబయి, గుంజన్మంగళమృదంగశంఖకాహళాది
నినాదంబుల నిర్భరంబయి, సన్నిహితసుహితభూదేవవర్గసంపఠ్యమానపుణ్యాహ
ఘోషంబున మాంసలంబయి, వృద్ధకులాంగనాజనసమారబ్ధంబులైనపవిత్ర
పార్వతీలక్ష్మీకల్యాణగానంబుల ననూనంబయి యీయుత్సవకోలాహలము మహీ
యమానముగానున్నది గదా!

మారు—(నిశ్వసించి) సఖా! కలకంఠ!

క. రమణీమణికిం బరిణయ। సమయము ప్రాపించుచుండ సాన్నిధ్యము, చి
త్తము సంశయడోలారూ। ఢ మగుచు నూఁగాడఁగాఁ దొడంగెడు నాకున్.

భ్రమ—ప్రభువా! లతాభవనసమీపమునకు వచ్చినారము

మారు—(సంతోషముతో) మల్లికావాసుభగమయిన లతాభవనమా యిది?

కల—ప్రసాధనసమయసంభావ్యమయి క్షణోత్పన్నవిరత మయ్యెడుభూషణఝంకారము వినఁబడుచున్నది గదా!

భ్రమ—ప్రభువా! మంగళస్నానపరిశుద్ధముగ మయిన పరిక్షామపాండురాంగంబుచే సవిశేష లోభనీయదర్శనయుఁ బ్రసాధననిపుణనవమాలికా నిర్వర్తితవివాహనైపథ్య వధూరోదార వేషయు నయి సాక్షాత్కరించిన యుద్యానలక్ష్మిపోలెఁ దీఁగలసందులనుండి యదిగోఁ బూజ్యురాలు గనఁబడుచున్నది.

కల—(పత్రజాలకాంతరమునుండి విలోకించి) మిత్రుఁడా! చూచుచూడు.

మ. ఇదె సుక్షామమనోహరాంగకము లెంతేఁ గాంతిపూరంబులన్
వెదజల్లన్ నయనాంబుజంబులకు నుద్వేలప్రమోదంబు గాఁ
గొద లేనట్టివిభూషణంబులు హరింపం బెంపఁ గళ్యాణి యీ
పాదరుందీపలయొద్దఁ గాను నొకపూపుంజమై భాసిలున్. 56

మారు—(అనంగమతోఁ జూచి) ఇదిగో నీమె కొంచెముగా మోము పెడమరల్చినది. కాళిందీనవమాలికలతో నేమో మాటలాడుచున్నది సుమీ. మన మీతీఁగలనడుమనుండి ప్రవేశించి రహస్యముగాఁ జూతము. (అట్లు చేయుచున్నారు)

(తరువాత మునుపు చెప్పినట్లు మల్లికయు, నవమాలికయుఁ గాళిందియుఁ బ్రవేశించుచున్నారు)

మల్లి—సఖులారా! మీవిప్రలంభవచనముచేత నే నీయలంకారమున కనుమతించితిని,

నవ—సఖీ! నీవు వేఱుగాఁ దలంచుకోకుము (మారుతునిఁ జూచి సంతోషముతో జనాంతికముగా) కాళింది! మహాభాగుఁడు వచ్చి వెనుక నున్నాఁడు. వెల్లడింతమా? ప్రియసఖికి సత్యమని నమ్మిక పుట్టును.

కాళిం—సఖీ! వెల్లడింపకు. సమయము వచ్చినప్పుడే వెల్లడింపవలయును.

నవ—(చిఱునవ్వు నవ్వి) సఖీ! మల్లికా! నీవు మమ్ము వంచించితివి గదా!

మల్లి—(అనుతాపముతో) ఎప్పుడు?

నవ—సఖీ! రాత్రివేళ మమ్ముఁ గూడఁ గన్ను మొఱఁగి ప్రాణపరిత్యాగమునకుఁ బ్రయత్నించినదానవు కావా?

మల్లి—(సిగ్గుపడుచున్నది)

కాళిం—అదృష్టవశమున వెంటనే రాక్షసునిచేత గృహీతవగు మహాభాగునిహస్తమునందుఁ బడినదానవు.

కల—సఖా! మల్లిక పడినచోటనే నీవుండుట యెట్లు తటస్థించినది?

మారు—మిత్రమా! నే నుపవనాంతరమునఁ బ్రవేశింప నెంచియుఁ గాలు దొట్రిలినందున సంశయించి యక్కడనే నిలువఁబడితిని.

మల్లి—కాళింది! రాక్షసుఁడు గాఁడు. ఎవ్వఁడో యొకదివ్యపురుషుఁడు. అతఁడు మహాభాగునకు జన్మాంతరమిత్రుఁడని భగవతి నాకుఁ జెప్పినది.

(ఇద్దఱు విస్మయపడుచున్నారు)

కల—సఖా! యేంపురాక్షసజన్మమునుండి యాయనను నీవు విడిపించితివి గదా! ఆ మహాపురుషుఁ డెందుఁ బోయినాఁడు?

మారు—అతఁ డత్యంతసౌహార్దమున నాతోఁ ద మాటలాడి సఖుఁడా! నీవు నన్నుఁ దలంచుకొన్నతోడనే నీయొద్దకు వచ్చి నీయభిమతమును నేను నెఱవేర్చి పోయెద నని పలికి వెంటనే తిరోధానము నొందెను.

నవ—కాఁబట్టి నీవే విప్రలంభశీలవు

మల్లి—నీయుపాలంభ మనుచిత మయినదే.

నవ—సఖీ! నీకీయలంకరణ మనుకూలముగా నున్నదో లేదో చెప్పు.

మల్లి—(సిగ్గుతో చిఱునవ్వుతో) సఖీ! యిది నాయలంకారము గనుక సిగ్గున నిట్టిది యని ప్రశంసింపఁ జాలకున్నాను. ఇంతియు కాని నీప్రసాధననైపుణి వాగతీతమే.

కల—వాగతీత మని మల్లిక చక్కఁగాఁ జెప్పినది. ఇందొక్కొక్కటే వర్ణనము నతిక్రమించుచున్నది. ఇది చూడు—

తే. గీ. వలమునభినవకుంకుమపంకమునను। నిద్దమదిరాక్షిముద్దులతిలక మొప్పు;

మారు—(అభిలాషతో)

రక్తమై రమ్యవదనాబ్జసక్తమైన। చంచలత నిల్చుమామకస్వాంతమట్లు. 6

కల—(చిఱునవ్వుతో) సఖా! నావచనమును నీవపహరించితివి.

భ్రమ—అయ్యా! చూడు చూడుఁడు ప్రభువుగారొసంగిన హారయష్టి యామెకంఠమూలమును జుట్టుకొని యున్నది.

కల—(చక్కఁగాఁ జూచి) నిజముగా నిది పయస్యదోరంతరవిహారదుర్లలిత మయిన హారవల్లియే. (విమర్శించి)

మ. స్మరదాహంబునఁ బాండుమూల మగుచున్ శంఖంబుపాంకంబు దా
హరియింపం దగుకంఠకాండమున నీహారంబు భాసిల్లెడున్;

మారు—

హరిణాక్షీవదనంబు నిక్కముగ నేణాంకుండుగా నెంచి యం
బరమందుండి యుడుప్రకాండము భజింపం గోరి యేతెంచెనౌ.

కల—(సశ్లాఘముగా) నీప్రతిభోత్కర్షము సర్వోత్తరముగదా!

మారు—సఖా! సముదారవిరచితనీలధమ్మిల్లగర్భకగ్రథితమాలతీకుసుమసౌరభ్యలుబ్ధ దిందిందిరసుందరీమధురసమారబ్ధమంగళసంగీతకంబును, ననర్ఘ్యతాటంకకిరణపల్లవితకోమలకపోలవిన్యస్తపత్త్రలతాకులంబును, నతిసురభిహిమజలశబలకుంకుమఘనసారసరసాంగరాగలులితఘనతుంగకుచకుంభాభోగప్రేంఖోళహారజాలంబును, నిబిరీసనితంబమండలమండిత కాంచనకాంచీగుణపద్మరాగమయూఖపుంజపుంజితస్ఫారంజితమంగళక్షౌమంబును, నాముక్తహాటకనూపురకింణక్రమవాంసస సేవితచరణపుండరీకంబును నై నయనాభిరామ మయినయీ మైవాహిక నైపథ్యము సకలప్రతిభాదూరము సుమీ. (బాగుగఁ జూచి) అయిన నీయనవద్యాంగికి నలంకారములు పునరుక్తములే. చూడు—

మ. నయనప్రాంతవతంసితశ్రుతిపుటక్ వ్యర్థంబు నీలాబ్జ; మే
క్రియ హారంబును గాని భారము స్మితశ్రీఁ దాల్చుచందోయి? న
వ్యయరాగాంఘ్రియుగాతిబాధకము పిండాలక్తపాతంబు; ని
శ్చయ మీసాజపుఁ గమ్మతావి మెయికిం జర్చల్ వృథాయాసముల్. 8

భ్రమ—పాపటయందుఁ జూడామణి కనఁబడ దేమీ!

నవ—సఖీ! నీయవయవలక్ష్మిచే నలంకృత మయిన మంగళాలంకరణము నీరత్నముకురమునఁ జూచుకొనుము.

(ఎదుట నద్దముఁ గనఁబఱుచుచున్నది)

మల్లి—(సిగ్గుతోఁ జూచుచున్నది)

మారు—సఖా! చూడు—

మ. ఎలప్రాయంబున మీఱుసోయగము చే నీమజ్జగంబందుఁ జి
ల్కలకొల్కుల్ గల రెందఱేని, యయినం గాక యథార్థంబు గాఁ
జెలువంపుంగని యైనయీకలికికిన్ సిద్ధోపమానం బెటన్;
నిలువుం దర్పణరత్నమం దొదవునీడం జామీ చూపితిన్. 9

నవ—సఖీ! స్వభావస్నిగ్ధము లయిననీలనయనోత్పలములభేదము గాన రాని కాటుక రేకతోడను, ముగ్ధమధూకధవళ మయిన గండమూలమున గుణోత్కర్షము గాంచుచున్న కస్తూరికాపత్త్రలతలకతమున విభావిత మగుశోభాతిశయముతోడను, గౌరీచరణలగ్నలాక్షారుణశంకరాపీడచంద్రరేఖకుఁ బ్రతివచ్చెడుమనోహరకుంకుమతిలకాంచితరమణీయలలాటమునిటుతోడను, గందళితకందర్పప్రతాపాంకురశంక నుత్పాదించెడును దారసీమంతపథదత్తసుందరసిందూరముతోడను, సకలలోచనానం

దసంధ్యాయుక్త మయి చందమామకు సాటివచ్చెడు నీమోముదామరను నీవు గూడఁ జూచుకొనుము.

మల్లి—సఖీ! వనమాలికా! నా శిఖామణి యేల పెట్టవయితివి?

నవ—సఖీ! మఱచితివా? రాక్షసహస్తమునుండి జారిపడినప్పు డది నదిలోఁ గ్రిందఁ బడిపోయిన దని నీవే చెప్పితివి కదా?

మారు—అయ్యో! శిఖామణీ! మరలఁ గ్రిందఁ బడిపోయితివా?

తే. గీ. ఎట్టెటో యీ మెఱుఁగు నద్భుతాకృతి! మరల మరలను గొండొక పొరయునీకు
మానికము! నాకుఁబోలెను గాటికకటా! కలుగుచున్న యొక్కఁ బాటు సులభముగను.

(తెరలో) వనమాలికా! త్వరపడుము త్వరపడుము. సుండవవిధనిర్వర్తి[illegible]ము. (అందఱు వినుచున్నారు)

కాళిం—సఖీ! భగవతి వేగిరించుచున్నది. పోదము. ఈవివాహమంగళారంభము నీవు పొందఁ దగినది కదా!

మల్లి—(విషాదముతో నిశ్వసించి తనలో) అయ్యో! నా ప్రాణములను గాపాడుటకు మాత్రమే పలికించెడుమాటలాడు నీప్రియసఖులచేత మోసపోయితిని కటకటా! నిష్కరుణారంభ మయిన నిష్ఠురగగనవాణీదుర్విపాకముచేత నాజన్మఫల మపహృత మయినది. హా! మందభాగినిని నే నిప్పు డేమి చేయుదును? వెంటనే నన్నా క్రూరరాక్షసుఁ డేల భక్షింపఁ డయ్యెను? అయ్యయ్యో! దురదృష్టసంతురాలను నిరాలంబ మయిన యాకాశమునుండి క్రిందఁ బడినప్పుడు నుగ్గునూచ మేల కానయితిని? (స్మరించి మరల నిశ్వసించి) అయ్యో! యట్టు కంఠదేశమునఁ గఠోర ఖడ్గము నుంచుకొని జీవితపరిత్యాగమునకుఁ బ్రయత్నించిన యామహాభాగుఁడు నానిమిత్తమింక నేమి గానున్నాఁడో?

నవ—(జనాంతికముగా) సఖీ! కాళింది! సాహసము! నిజము తెలియక ప్రియసఖి మననవ్వుటాలచే నధికవ్యధ నొందుచున్నది (ప్రకాశముగా) భర్తృదారికా! ప్రత్యుత్తర మీయక యూరకుంటి వేమి? నీయూర్పుగాడ్పు లేల దీర్ఘోష్మలము లయి యెఱ్ఱనిమోవిచిగురును గమలించి పయ్యెద చెఱఁగు నల్లలార్చుచున్నవి? ఏమిటికీబాష్పస్తబకములు నీచెక్కుటద్దముల వ్రాసినచిత్రలేఖలను జెఱిపి కాటుక కరంగఁ గాలువలు గట్టుచున్నవి?

మల్లి—(నిశ్వసించి) సఖీ! నవమాలికా! మనోరథసహస్రములచేత సంపాదిత మయిన నాప్రియవస్తువును విఘటించునిష్ఠురవిఘ్న మనియెడు మృత్యుదేవత కుత్తుకను జొచ్చి బాధపడుచున్నదానిని గా నన్నెఱింగియుండియు నీవుగూడ నిట్టులాయాసపెట్టెద వేల? (నిర్వేదముతో) జీవితనిర్విశేషురాండ్రగు ప్రియసఖుల కిదియుక్త

మా. ఇంతదనుక నయ్యయి విప్రలంభవచనములచేతఁ బరితాపించి యిప్పుడు వెం
డియు నన్నాహా యుష్మదనుభవపాకమునఁ గూలఁద్రోయఁ బ్రయత్నించెదరు.

కల—వయస్య! నీసౌభాగ్యమును జూచుకొనుము.

ఉ. ఈమె ప్రియాళివాక్యముల నెంతయు నమ్మి భవత్స్వమాగమా
శామిళితాత్మ, ముగ్ధ, తన చక్కఁగ ముగ్గ గయి నేయ నిచ్చయి.
చొచ్చె మది బాష్పకరి యయి ప్రుక్కుడు నన్యవివాహసంశ్రుతిన్.
లో మెంగులం దలంచి దగులఁ గనుబాలమువొలిపోలికన్. 11

నవ—(సకరుణముగా, జనాంతికముగా) కాళిందీ! మనసులోని దుఃఖముచేత నతివి
షమ మయిన భర్తృదారికావచనము నాలకింపుము

క. అనుకూలవిప్రలంభము । లను మన మొందింప నమ్మ్రళము సన్నేహం
బును సవిషాదము సోల్లుం । ఠనము సధిక్కారమునుగ నాతి వచించున్. 12

(ప్రకాశముగా) సఖీ! యీమావిప్రలంభవచనములకుఁ గినియకుము. ప్రసన్నవు
గమ్ము. (మారుతునిఁ గడకంటఁ జూచి) నీయందు సవిశేషబద్ధానురాగుఁ డయిన
యీయనను కరకమలము నొసంగుము. బంధువర్గము నానందపఱుపుము.

మల్లి—(శోకభారముతో) సఖులారా! తరుణమయూరపింఛమువంటి నిద్దంపుఁ జా
మనచాయ గలమంగళాంగమున నెసంగుమహాభాగుని మారుతుని సందర్శించినది
మొద లన్యపురుషునిఁ దలఁచి యెఱుంగను; కావున సత్యప్రమాణముగాఁ
జెప్పుచున్నాను. వినుఁ మహాభాగునిపూర్ణలావణ్య మనెడుభాగీరథీప్రవాహమున న
వగాహనము గావించుటచేతఁ బవిత్రము లయిన నా నేత్రములతో లాఁతివాని నిఁక
ముందును జూచుదానను గాను.

కల—మిత్రుఁడా! యీవచనమాత్రమును వీనుదోఁకలతో జుఱ్ఱుకొనుము.

మారు—మదీయమానసవిహారమల్లికా! మల్లిక!

చ. హృదయమునన్ నిరూఢ మగుప్రేమరసాతిశయంపునూత్న పు
న్నది కడుఁ బొంగి పైఁబొరలు నా, హృదయంగమ మైనపల్కులన్
మదనమహాగ్ని దగ్ధుఁ డయి ప్రమందెడు నా కమృతాభిషేకసం
పద గలిగించినట్లయిఁ; ప్రాణము వచ్చెను ప్రాణనాయికా. 12

(మరలఁ దెరలో) వనమాలికా! త్వరపడుమనుచున్నారు. సిద్ధాంతులు పెట్టిన వివా
హముహూర్తము సమీపించుచున్నది.

(అందఱు వినుచున్నారు)

మల్లి—(ఖిన్నతతో) అయ్యో! భగవతి మరల నాజ్ఞాపించుచున్నది సఖీ! నవ
మాలిక? లే లెమ్ము. భగవతి తానుగానే యిక్కడకు వచ్చునేమో? ఇంతలో నే
నశోకలతావలయమున కరిగి మి మ్మొకటి ప్రార్థించెదను.

వన—సఖీ! నీ వాజ్ఞాదానసౌభాగ్యురాలవు. ప్రార్థించుటయేమి? మమ్ము నీయిచ్ఛ వచ్చినకార్యమునందు యథేష్టముగా నియోగించి భగవతి యాదేశమును నిర్వర్తింపుము.

మల్లి—సఖీ! విషాదసంభ్రమములచే నా దేహము కంపించుచున్నది. కాఁబట్టి నేను లేవలేక యున్నాను నాకన్నుదోయిని బాష్పపూరము గప్పుచున్నది; నే నిందు చేతఁ జూడను సయితము చాలకున్నాను నీవే నాచేయిపట్టుకొని లేవఁదీసి మెల్లగా లతావలయాంతరమున నన్నుఁ బ్రవేశపెట్టుము (చేయి చాఁచుచున్నది)

సఖులు—(సంజ్ఞచేఁ బాణిగ్రహణమునకై మారుతునిఁ బ్రేరించుచున్నారు)

మారు—(భయము నభినయించుచున్నాఁడు).

కల—మిత్రుఁడా! యిది సాధ్వసమునకు సమయము గాదు చిరకాంక్షిత మయిన మలికా పాణిగ్రహణమహోత్సవము ననుభవింపుము.

మారు—(లతావలయమునుండి వెడలివచ్చి మల్లికపాణిని గగుర్పాటుతో గ్రహించుచున్నాఁడు)

మల్లి—(హర్షముతో) సఖీ! వనమాలిక! నీస్పర్శమిప్పుడు వేఱుగా నున్నది. చేయి పట్టుకొన్నంతమాత్రమున నా యవయవము లన్నియు నమృతవర్షమునఁ దడిసినట్లు సుఖపారవశ్యము నొందుచున్నవి (మారునుచే యూఁతకొని లేచుచున్నది)

మారు—(బాలు నంటకకయే మెల్లమెల్లగాఁ దీసికొని పోవుచున్నాఁడు)

సఖులు—(చిఱునవ్వుతో వెంబడించుచున్నారు)

కాళిం—సఖీ! మల్లికా! లతాంతరమునకు వచ్చినారము కాఁబట్టి చెప్పఁ దలఁచిన దేమో చెప్పు.

మల్లి—(నిట్టూర్పుతో) సఖీ! వనమాలికా! యెంతఁగ మొదటికి వచ్చినారము?

♦మారు—బహులికుసుమమరసపరివాహమందరపరిమళలోలలోలంబపుంజబద్ధతిమిరమీమందారమూలమునొద్దను.

మల్లి—(సబాష్పగద్గదముగా) ఈమందారము నేను బెంచినదే. కాఁబట్టి నిర్జనమైన యీప్రదేశమునందు మి మ్మొకటి ప్రార్థించెదను.

కాళిం—సఖీ! మే మవధానము గలిగియున్నాము.

మల్లి—ఓ జీవితనిర్విశేష! మారుత! (ఆర్ద్రోక్తిని వై లక్ష్యమభినయించుచున్నది)

సఖులు—(పరస్పరము నవ్వుకొనుచున్నారు)

---

♦ ఈవాక్యముమూలమందు సంస్కృతప్రాకృతసమానము.

మల్లి—ఓజీవితనిర్విశేష! నవమాలిక! సఖీ! కాళింది! పరిపూర్ణచంద్రసుందరాకారుం డగుమహాభాగుని పాదములకు శుశ్రూషచేయుభాగ్య మభిలషించితిగదా విఘటమాన మయిననాజీవితమును నిలుపుకొంటిని. ఆకందర్పసుందరుని ప్రథమదర్శనము మొదలిప్పటిదనక నుత్సాహదీర్ఘకోవిందమకరందవాహులయిమందమందముగా వీతెంచెడు నుద్యానవనమారుతములకు నోర్చుకొనుచుంటిని. ప్రచండమకరధ్వజభుజదండమండలితధనుర్దండటంకారఘోరము లయినమధుకరహుంకారముల నాకర్ణించుచుంటిని. చిగిరించినతీయమావిగుబురులలో విహరించుచుం గోకిలములు గావించెడు పంచమప్రపంచము హాళాహాళిచే దురంతము లగువసంతదివసములు వేగించుచుంటిని. ఇంతియ కాక కిసలయతల్పకల్పనములచేతను, మృణాళభంగహారరచనములచేతను, కదళీదళధవిత్రవీజనములచేతను ఘనసారపరాగచార్చిక్యసంపాదనములచేతను నింకను దత్తదుచితోపచారములచేతను, మిమ్ము గూడ నాయాసపెట్టుచుంటిని. అట్టి రాక్షసహస్తమునుండి జాతి యాకసమునుండి క్రిందబడుచు నియ్యర్ధరాత్రమున నెవ్వనిచేత రక్షితనయితినో యట్టి మహాభాగునిసంగమ మెవరికో పుణ్యాత్మురాండ్రకు సులభముగాని నాకు దుర్లభమే. కాబట్టి నాజీవితధారణము క్షణమేనియు మహాపాతకములలో నగ్రగణ్యముగా దలంచెదను. సఖులారా! జన్మాంతరమునం బునర్దర్శనముగోరుచు మిమ్ము వీడుకొనుచున్నాను. (సప్రశ్రయముగా నంజలిపట్టి సగద్గదముగా) సఖీ! నానిమిత్తము నీవిట్లు నమస్కరించి సుందరభ్రూలక్ష్మీబంధుండును దీర్ఘస్నిగ్ధలోచనపుండరీకుండునునగు నమ్మహాజనుఁడు పరలోకగత నగునాకొఱకు జలాంజలి నిచ్చునట్లు రహస్యమున నాయనతో విన్నవింపవే. (రోదనము చేయుచున్నది)

మారు—(సకరుణముగాఁ దనలో)

చ. హరిహరి మేను వాసెడుప్రయత్నముతోడ శుభాంగి తా నిటుల్
కరుణమనోహరం బగువిలాప మొనర్పఁగ నాలకించుటన్
పరవశతచేఁ గరంగెడును, జాలిని రూపఱుఁ, గంప, మోహావి
స్తరమున, ప్రీలు నాతన్, హాయసంబునఁ బొంగెడు, డెంద మిత్తఱిన్. 14

కాళిం—సఖీ! యమంగళము దొలఁగును గాక.

నవ—(కన్నీరు పెట్టుకొనుచున్నది)

మారు—(ప్రకాశముగా)

* క. వీణావిరావకోమల। వాణీబంధుగణచిత్తవనజమరాళీ
రాణ నెసఁగుసహచారిణి। ప్రాణమునకుఁ దొరకు నలుక కలికి రుణోక్తుల్. 16

వన—(జనాంతికముగా) కాళింది! మహాభాగుండు తన నేర్పు చేత నచ్చముగా నావలె నే మాటలాడుచున్నాఁడు; కాఁబట్టియాతని నిప్పటికిని ప్రియసఖి యెఱుఁగదు.

మల్లి—సఖీ! ముద్దరాల! సాహస మనియెద వేమి? ఎవ్వనికి జీవలోక మంతయు మన్మథమయమయి కనఁబడుచున్నదో యెవని హృదయము మదీయలాభభంగమున నతికాతర మయి యడలుచున్నదో, యంతటియర్ధరాత్రమున నటవీదుర్గమప్రదేశమునకేకాకి యయి పోయి సకలభూమండలమండనమయిన తనకంబుసుందరకంధరాకాండమునందు నెవ్వాఁడు క్రీడాకరవాలముఁ జేర్చుకొని నంతటి మహాసాహసమునకు సిద్ధపడెనో, యటువంటినాప్రేమనిధికొఱకు జీవితసహస్రపరిత్యాగ మయినను సాహసము కానేరదు. ఈవిషయమున నీవు నాకుఁ బ్రతికూలవు కాకుము. వెండియు మహాభాగునకు నామాటగా నిట్లు చెప్పుము. (సగద్గదముగా) నాథ! మందభాగినిని నే నీజన్మమున యుష్మదీయపరిరంభసౌభాగ్యమును బడయలేక పోయితిని కాని జన్మాంతరమున నయినను నిహాందే యపేక్షించుచున్నాను. నాతోఁబుట్టువగు నవ్వ్పాలమాలికను మాత్రము మరకతకవాటస్నిగ్ధవిశాల మయినమీవక్షస్స్థలమునందు నన్నుఁబోలె సర్వదా ధరించుకొనుఁడు. (మారుతుని దడవుగఁ గాఁగిలించుకొని యానందముతోఁ దనలో) ఏమిది! ప్రియసఖీసంస్పర్శము మయి నంతట మంచిగంధ మలంది నట్లయి మహాభాగపరిరంభమునకుఁ బ్రతి వచ్చుచున్నది. హృదయసన్నిహితుఁ డయి సుఖింపఁ జేయుచుండె నని తలంచెదను. (ప్రకాశముగా) సఖీ! యిది నాకడసారి కవుఁగిలింత సుమీ.

సఖులు—(చిరునవ్వుతోఁ దమలో) ఇది కడసారిగాఁగిలింత కాదు. మొదటిదో రెండవదో.

మారు—(కాఁగిలింపఁ బడియే యానందముతో సహజస్వరముతో)

ఉ. ఎవఁడు దృఢానురక్తమతి నిందుముఖీ నిను నిచ్చగించునో
యెవనికినై శుభాంగ యుసురే త్యజియింపఁగఁ దెంపుఁ జేసెదో

మల్లి—(తనలో) ప్రియసఖికంఠము మాఱిపోయిన దేమి? (ప్రకాశముగా) ఆయన యెచ్చట నున్నాఁడు?

---

* ఈపద్యము మూలమునందు సంస్కృతప్రాకృతసమానము.

మారు—

వివిధవిహారభమారశరవిద్ధభుజాంతరగాఢపీడితా
త్యవిరళపీవరస్తనత హాయిగఁ ద్వద్భుజపంజరంబునన్. 16

మల్లి—అయ్యో! మహాభాగుఁడే. (హర్షసాధ్వసలజ్జలతోఁ దొలఁగుచున్నది)

మారు—

తే. గీ. సాధ్వసంబునఁ దొలఁగకు చంచలాక్షి! తగునె సంభ్రమకాతర వగుట దాస
జనునికడఁ? జిరకాంక్షితోత్సవపుఁ గౌఁగిలికిని భంగము బొనర్తు వకట లతాంగి?

మల్లి—(వ్రీడానూయలతో) సఖులారా! నేను బాగుగా వంచిత నయితిని.

కల—(త్వరగా సమీపించి) కళ్యాణి! యీలాగున బలుకకుము.

మ. జగదుత్తంసుఁడు నావయస్యునకు భూషాప్రాయ వైతీ వహో
సుగుణాఢ్యా! యెటు విప్రలబ్ధ యనవచ్చున్ నిన్నుఁ? ద్వత్ప్రాప్తిలో
భగరీయోవ్యగ్రతృష్ణకుం బడి యుపప్రభ్రాంత వర్తించుదు
ర్భగుఁ డాశంబరకుఁడే సుమ్మ పరికింపన్ విప్రలబ్ధుం డిటన్. 18

ఉ. చందనపాదపంబునకు సౌరభసంపద వోలె, జ్యోత్స్న పూ
ర్ణేందునకుం బలెన్, మణికి స్ఫూర్తియుఁ బోలెను, శోభనాంగి! నీ
వందపుసొమ్ము గమ్మితని; కవ్వియు వానికిఁ బోలె నీకు నీ
సుందరమూర్తి యొప్పెడును జూవె సమభ్యుచితావలంబమై. 19

భ్రమ—(సమీపించి) నవమాలికా! మన యదృష్టము మంచిది. ఒడయుఁడు నొడయురాలు నభ్యుదయమున వర్ధిల్లుచున్నారు.

మందా—(ప్రహృష్టవదన యయి ప్రవేశించి)

తే. గీ సిరియుఁ బార్వతి, భారతి, సీత, భీమజాత పౌలోమి, రుక్మిణి, సత్యభామ,
కృష్ణ, శర్మిష్ఠ, సావిత్రి, ధృతి నరుంధతీపరమసాధ్వ, యాశీర్వదింత్రు గాక.

(అంతటఁ జూచి సాశంకముగా) మల్లిక యీలతాభవనమునుండి యెక్కడకు వెళ్లినదో! (లతాంతరముఁ జూచి యానందముతో) అహో! నామనోరథములు ఫలించినట్లే. ఇదిగో! మందారమూలమున మారుతుఁడు—

చ. అతిసుకుమారమున్ గృశము నై రమణీయతఁ గాంచుమేనితోఁ
బ్రతిపదుడుప్రియుండు సరి వచ్చెడురూపున లోభనీయుఁ డై
చతురకటాక్షముల్ స్మరరుజాశబలాక్షము వ్రీళనమ్ర మౌ
నతులితమల్లికాముఖమునం దొలయించుచు నున్నవాఁ డిటన్. 21

(సమీపించుచు) నవమాలికా! యాలసించెద వేమి?

నవ—అహో! భగవతియే వచ్చినది. (ఎదురువోయి) భగవతి! మే మాలసించుటలేదు.

మల్లి—(సగద్గదముగా) భగవతీ! రక్షింపుము. రక్షింపుము. (అంజలిపట్టివచ్చుచున్నది)

మందా—(మల్లికను కౌఁగిలించుకొని) బిడ్డా!

మ. సమరాగుండు మహాభిజన్ముఁడు జగచ్ఛక్షుఃప్రియుం డౌజనో
త్తమానందుఁడు దృఢం కృ పీవు; పొగ డొందం జాలుకళ్యాణి! నీ
దుమునో వాంఛ ఫలించుఁ; బుణ్యములభంగి దో నిన్నుఁ బెండ్లాడి డెం
దముఁ గడించుచిరాంగజజ్వరముబాధం బాయు నిం కేతఁడుఁ. 22

నవ—(ఆనందముతో) భగవతీ! సర్వోత్తరమయిన నతని నిర్మాణ్మై దగ్ధమాచిరకాల
మునకు సఫలమగుటచేత విధాత కృతార్థతను బొందుఁ గాక శంబరకహతకుని ప
రిణయప్రసంగముచేతఁ గలుషము లయినబంధుజనహృదయంబులుప్రసన్నతనొందుఁ
గాక. మాతాపితృసమానము లగు మీహస్తములతో నే మహాభాగుని చేతికిఁ బ్రియ
సఖి నర్పింపవలయును.

మల్లి—(తనలో) అయ్యో! నాకు సర్వమంగళావనప్రమాణులు గదా!

మందా—నవమాలికా! నే నిప్పుడు వేఱుగ నర్పింప వలసినదేమి?

తే గీ. చెక్కు—చెమరింప కుండంగ రక్క—సీని। చేతియందుండి తిగిచి రక్షించియీ మె
నూరఖడ్గము మెడఁబట్టు కొన్న యితని। కరమునందుంచె సర్వమంగళ యెముద్ను.

మఱియు—

క. ఒండొరులయిచ్చ నగుచి। పెండిలియుం దేల యీ మెఁ బెద్ద లొసఁగ! నా
థుం డుదయింపఁ రంజిలు। చుండుకలవ సెన్వరిచ్చిరో తొగచెలికిఁ. 24

అయినను లోకాచారము జరిపించెదను. (మారుతుని గూర్చి) వత్స! మారుత!
యిటురా.

మా—భగవతీ! యాజ్ఞాపింపుము.

మందా—

చ. వెలఁది, ప్రసిద్ధవైభవుఁడు విశ్వవసుం డురుకీర్తి పుణ్యసం
కలితత నబ్ధి లచ్చి బలెఁ గానక కాంచినపుత్రి; ధర్మముల్
పలుపఁగ రాగ పావకుఁడు సాక్షిగ, నే సుహృదుండ వైనని
కెలమిని దీని శ్రేయసున కిచ్చెదఁ బచ్చునివింటివేల్పుతో. 25

కల—మాపుణ్యసురద్రుమము ఫలించినది.

నవ—మాకులదేవతలు ప్రసన్నలయిరి,

కల—(హర్షముతో) భగవతి! సర్వథా యనవద్యమయిన యీసంబంధమును జూచి
హృదయము ప్రసన్నమగుచున్నది చూడు—

ఆ. వె. సహజఘనవిలాససౌందర్యసముదార। తైలరాశి కఖిలదృక్చకోర
కేందుకాంతి కీమె కిద్ధాభిజాత్యంబు। కనకకుసుమదామమునకుఁ దావి. 26

నవ—(మల్లికను జూచి నిశ్వాసముతోఁ దనలో) ప్రియసఖి మహాభాగున కిప్పటివలె సర్వదా ప్రేమాస్పదురాలయ్యెడునా!

మందా—(విమర్శించి కన్నీళ్లతో) వత్సా! మారుతా!

మారు—(సాశంకముగా) భగవతీ! యాజ్ఞాపింపుము.

మందా—

ఉ. ఒరు లెఱిఁగింపఁ దగ్గ దొకఁ డుండ వెలుంగును జ్ఞేయసారమున్
వెరవరి! యైనఁ గేవలముఁ బ్రేముడి నిన్ బలికించు నియ్యెడన్

మారు—(వినయముతో వినుచున్నాఁడు)

మందా—(మల్లిక చేయి పట్టుకొని)

తరుణి యి దేశపుత్రి సుమి తండ్రికి, బంధుల కెల్లఁ బ్రాణ; మీ
కొదవినస్నేహబంధ మెడఁ బొందక యుండుత ముందు నీమెతోన్. 27

మారు—(లజ్జతో) అయ్యో! వాత్సల్యాతిశయమున మీకుఁ బుట్టరానిసంశయము పుట్టుచున్నది.

కల—భగవతీ! యతిప్రసక్తమయిన మీయభ్యర్థనమునకుఁ దగినయుత్తరము మిత్రుని పక్షమున నాకుఁదోఁపకున్నది చూడుఁడు—

చ. స్థిరపడె స్నేహ మీమెకను, స్నిగ్ధునకున్ సఖ్యదీక్ష నల్లె; క్రు
న్మరు వశుఁడై యటన్న. నసమంచిత, మయ్యెను భ్రూవశుండెమున్;
సరళత నిట్టిఁ డేర్పఁ డన. సౌహృదవాక్యము; యీమెకోసమై
సరకు గొనండు ప్రాణ మన, సర్వము నీమెయె చూచె నానిసీన్. 28

మందా—(సవిమర్శముగా మల్లికను గూర్చి) పుత్రీ! నీకుఁ గూడ నించుక యుపదేశించెదను.

మల్లి—భగవతీ! యానతిమ్ము.

మందా—

ఉ. సేవల నత్తమామలకుఁ జేయు; మెదుర్పకు మాఁడుబిడ్డకున్;
సేవకులం దయం గనుము, స్నిగ్ధవు, గమ్ము సపత్నులం; దతి
థ్యావళి సత్కరింపుము; గృహక్రియ లందఱను బద్ధకింప; క
మ్మా! వెయి చెప్ప నేల? సుఖ మందుము సల్పుచు భర్తృయిష్టమున్. 29

మల్లి—(సిగ్గుతో మనస్సున నంగీకరించుచున్నది)

నవ—ఇది యుచితమయిన యుపదేశము.

మందా—వత్సా! మారుత! తలఁచినప్పుడు వచ్చెదనని నిన్ను వీడుకొనినయా దివ్యపురుషుని మాకరంద నామాని. శంబరకహాతకవంచనార్థము మల్లికావేషమును దాల్చి దయచేయుమని యిప్పుడు సంస్మరింపుము.

మారు—(ధ్యానము నభినయించుచున్నాఁడు)

(తరువాత మల్లికావేషముతో మాకరందుఁడు ప్రవేశించుచున్నాఁడు)

మాకరం—సఖా! మారుత! యిదిగో నేను వచ్చితిని. నీయభీష్టము నెఱవేర్చెదను.

(మందాకినీమారుతులు దక్క— మిగిలినయందఱు విస్మయము నభినయించుచున్నారు)

కాళిం—(జనాంతికముగా) నవమాలికా! యీతఁడు మహాభాగునిచే రాక్షసభావము నుండి విమోచితుఁడయిన దివ్యపురుషుఁడుసుమా!

నవ—కాళిందీ! యాశ్చర్యమాశ్చర్యము! ఎవ్వఁడు ప్రియసఖిని భక్షించుటకు సిద్ధపడెనో యతఁడే యిప్పుడు రక్షించుటకు సిద్ధపడినాఁడు. (మల్లికతో) సఖీ! మాకు మఱియొక ప్రియసఖి యెట్లుగలిగినదో చూడు చూడు.

మారు—మహాపురుష! భగవతి నిన్ను మున్నుకోరినదాని నాచరింపుము.

మాకరం—చక్కగా నాచరించెదను.

(కాషాయాంబరయుగళహస్తయయి సారసిక ప్రవేశించుచున్నది)

సార—భగవతి! యిది చపలకుండు తెచ్చిన వస్త్రయుగ్మము.

మందా—వత్స! కలకంఠ! నీవీకాషాయయుగ్మముచే కోపనీయమయినను నా వేషము ధరించుకొమ్ము. ఇది విషయోపభోగవిరుద్ధమే యయినను దీనిచేతనీవు రమయంతికను బొందంగలవు. (అందఱు నవ్వుచున్నారు)

మారు—ఇదియు మనకు మంగళమే యనుకోవచ్చును.

కల—(చిఱునవ్వుతో వస్త్రయుగ్మము తీసికొని నిష్క్రమించి మందాకినీవేషముతోఁ బ్రవేశించి) ఇదిగో! భగవతి నయితిని.

మారు—శంబరకుఁడు నీపాదములమీఁదఁ బడుఁగాక.

మందా—(కాళిందీనవమాలికలను గూర్చి) బిడ్డలారా! మీ రిద్దఱుఁ గలకంఠునితోఁ గూడ నీమహాపురుషు ననుసరింపుఁడు.

ఇద్దఱు—చిత్తము భగవతి!

మాకరం—(చిఱునవ్వుతో) భగవతి! శంబరకునిఁ బెండ్లియాడఁ బోవుచున్నాను.

మందా—వత్సా! ముందు నీకుఁ జెప్పినమార్గమున యాయభిలషితము నెఱవేర్పుము.

మాకరం—మిత్రుఁడా! రమ్ము కలకంఠ! మారుతునకు నేను నీవంటివాఁడనే సుమీ.

కల—మహాపురుష! మా కందఱకు నీవు పూజ్యతముఁడవు. పోదము రమ్ము. (కాళిందీనవమాలికలతో నిష్క్రమించుచున్నారు)

మల్లి—సఖులారా! నా కిక్కడ సాయ మెవరు?

నవ—(చిఱునవ్వుతో నించుక మరలి) ఇదిగో నీమహాభాగుఁడే.

మందా—భ్రమరక! నీవుకూడ గూఢముగా విష్ణురాతునింటికిఁ బోయి మధురిక చెప్పినట్లు కావింపుము.

భ్రమ—చిత్తము భగవతి! (నిష్క్రమించుచున్నాఁడు)

మందా—వత్స మారుత! యిదిగో నిరుగడ దృఢముగా వెలుఁగుచేసి కాపాడఁబడెడు నీయుద్యానవీథి నాయాశ్రమము నంటి యున్నది. ఇక్కడ నంబికాదర్శనార్థమరుగు మల్లికకొఱకుఁ బుష్పవాటికతోఁ జక్కనిదారి యొకటి యేర్పఱుపఁబడియున్నది. కాఁబట్టి మనమును బోవుదము. అస్మదాశ్రమోపశల్యభూములు రమణీయములు సుమీ. అక్కడ —

శా. స్వైరక్రీడల హాయిఁ దేల్చు మిముఁ గూజత్పికభుక్తామ్రముల్,
ధారాధర్భ్రమ పుల్లపింఛకనటద్బర్హీంద్రకేకాధ్వన
న్నీరంధ్రోరుతమాల సంతమసముల్, దీవ్యన్మరీచాంకురా
దామణ్యాంచిత దృక్చకోరములు లీలారామ భూసీమముల్.

మఱియు—

చ. అలసినఁ గ్రీడలన్ సకలకాంతవితానలతాగృహంబులం
దొలయుచు మెల్ల మెల్ల మిము నోపికతోఁ భజియించు నూత్నని
ర్గళితబహుప్రసూనమకరందనిమగ్నసముత్థితంబులౌ
కలకలహంసరావసుముఖంబులు సోమసరస్సమీరముల్.

(అందఱు నిష్క్రమించుచున్నారు)

గద్య.

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాదిసాధువంశక్షీర
నీరాకరరాకాసుధాకర రాచ్చనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్రగుణ
కదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధాన
తనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధేయాంధ్రీ
కృత మల్లికామారుత ప్రకరణమునందు షష్ఠాంకము.



# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 4 | బరముల్ | బలముల్ |
| 3 | 8 | నిర్వా | నిర్వ |
| 4 | 26 | ష్కులా | ష్కురా |
| 10 | 5 | స్నేహా | స్నేహ |
| 17 | 28 | తనం | తదనం |
| 18 | 20 | దీవ్వ | దీవ్య |
| 19 | 26 | చెష్టి | చేష్టి |
| 25 | 22 | జాలా | జలా |
| 25 | 26 | లిఖించి | లిఖియించి |
| 27 | 5 | వెలపలి | వెలుపలి |
| 31 | 16 | అగో | అగ్ధో |
| 38 | 10 | దేవ | నవ |
| 40 | 11 | నిటూర్పు | నిట్టూర్పు |
| 42 | [illegible] | [illegible]ంతు | బవంతు |
| 42 | 23 | తదూభవ | తనూభవ |
| 43 | 28 | రహస్యము( | రహస్యము. |
| 45 | 18 | కా[illegible]గ్ర | కారొగ్ర |
| 45 | 24 | రాలపు | రాలవు |
| 46 | 21 | విష్పటి | విప్పటి |
| 47 | 18 | నిశిచిత | నిశ్చిత |
| 48 | 16 | భవహి | భవమహి |
| 48 | 24 | యుత్కృష్ఠ | యుత్కృష్ట |
| 68 | 15 | నాటో | సాటో |
| 76 | 21 | దుర్పు | దురుప |
| 76 | 24 | విరుద్ధ | నిరుద్ధ |
| 77 | 10 | భర్త | భర్తృ |
| 78 | 5 | చూచి | చూడ |

| | | | |
|---|---|---|---|
| 78 | 11 | నయినా | నయనా |
| 78 | 17 | పంక్తి తరువాత, కన— | ఇటు, ఇటు అనియుండవలెను. |
| 81 | 11 | నల | కల |
| 83 | 2 | మనో | మనో |
| 87 | 6 | నిక్రృతి | నిర్వృతి |
| 88 | 26 | తలంచెను | తలంచెదను |
| 89 | 14 | గిలున | గల్లన |
| 91 | 23 | పనును | ఏమను |
| 96 | 17 | సర్వదా | సర్వథా |
| 112 | 18 | హాయి | హాయి |
| 112 | 13 | తైృక | తైృక |
| 112 | 16 | దృక్కు | దృక్చు |

అంతటను మధురిక పదము " మధుకరిక " యని చదువుకొనవలెను.

7, 21, 22, 23, 44, 66 99, పుటలయందలి విశ్వావసు పదము "విశ్వావసు" అని చదువుకొనవలెను.

[ద్వితీయాంకమున 11 వ పద్యమునకును, దాని తరువాతి ప్రతీహారి ప్రవేశమునకును, నడుమ నీక్రింది యంశములను జేర్చి చదువుకొనవలెను.]

నవ—సఖీ! బాష్పార్ద్రములయిన నిశ్చలలోచనములతో నేమది యాలోచించుచున్నావు?

మల్లి—చెలియా! దీనిని నష్టదన్యలాభము గాఁ జూచుచు నాహృదయము గుఱుతుపట్టిన దానివలెఁ గనఁబడుచు నాకేమేమో చిత్రింపుచున్నది.

నవ—కాళిందీ! ద్వీపాంతరమందున్న దివ్యాంబర మిక్కడకు వచ్చుటయు దానిని జూచుటవలన నీమె హృదయము గుఱుతుపట్టిన దానివలె నుండుటయు వింతగాఁ దోఁచుచున్నది.

కాళింది—ఇం దాశ్చర్యమేమి? ఏది యెవరిదగునో యది దూరమందుండునదయినను వారిచెంతకు వచ్చితీఱును. చూడుఁడు.

క॥ దవుల విదేశంబున నున్నవి యైన, నదృష్టరజ్జువుల గట్టిగ నీడువఁబడి మరుజని నేనియు। నెవరివి వారలకు వేగమే లభియించున్॥౧౨॥

అయినను గుఱుతుపట్టుట మాత్ర మద్భుతమే. ఇంతేకాదు. మల్లెతీఁగ మొదల జననము. పుట్టువులోనే పుష్పమాల. ఈమె వృత్తాంత మంతయు నాశ్చర్యకరమే.

శ్రీ



# మల్లికామారుతప్రకరణము

## 7-8-9-10 అంకములు

ఇది

ఉద్దండ మహాకవిచే రచింపఁబడిన సంస్కృతప్రకరణమునుండి,

రాజమహేంద్రవరమునందలి రాజకీయకళాశాలయందు

నాంధ్రపండితులై విశ్రాంతినొందిన

శ్రీ కవిశేఖర

వడ్డాదిసుబ్బారాయకవిచేతఁ

దెలిఁగింపఁబడినది

రాజమహేంద్రవరము

మొదటికూర్పు 1000

[ బప్పరకుఁడు,
గుంకు సంకలితము ]

[ వెల రు 0—10—0

# బిరుదస్వీకారము



తే. గీ. ఆంధ్రభారతీతీర్థసమాఖ్య సంస్థ
నెసఁగుసారస్వతపరిషత్తొసఁగెను వసు
రాయునికి విజయనగరరాజధాని
బిరుదు కవిశేఖరుం డని జరుగుశుక్ల.

మ. జరిగెం బ్రాయము నాకు డెబ్బదిపయిన్ సర్వేశ్వరా! నాల్గువ
త్సరముల్ ; శ్రీకవిశేఖరాంకపుఁ బ్రసాదంబున్ బుధేద్ధిక్సుధీ
పరిషన్ముఖ్యులచే సమాచితముగాఁ బంపించి తీ శుక్ల ; నీ
బిరుదున్ భక్తమణీకృతీద్యమహీమావిఖ్యాతమం చెంచెదన్.

క. సారస్వత పరిషద్బృం
దారులు కవిశేఖరాంకము నసుఁ జలిపిన స
త్కారంబునకుఁ గృతజ్ఞత
వారలకుం గేలు మోడ్తు.

వ. సు. రాయండన్.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.

## పురుషులు.

మారుతుఁడు—కథానాయకుఁడు. మలయపర్వతమున విలాసార్థము తనువొందిన మందమారుతుని, మంజుల యను విద్యాధరకన్య వలచి గర్భవతియై యప్పుడే ప్రసవించి యట విడిచిపోఁగా, లోపాముద్ర చేతఁ బెంపఁబడి వయోవంతుఁ డయి శాపవశమున భూలోకమునఁ గుంతలేశ్వరామాత్యుఁ డగు బ్రహ్మదత్తునకుఁ గుమారుఁ డయినవాఁడు.

కలకంఠుఁడు—మారుతునకుఁ బూర్వోత్తరజన్మములరెంటను బ్రియసఖుఁడు.

భ్రమరకుఁడు—మారుతుని పరిచారకుఁడు. రమయంతికా వేషము దాల్చి కలవింగకునకుఁ బెండ్లి చేయఁబడినవాఁడు

శంబరకుఁడు—అంగ్లేశ్వరుఁ డగు సింహవర్మ మంత్రి. మల్లికను బెండ్లియాడుటకుఁ గుత్సితప్రయత్నములు చేసి పరాభవ మొందినవాఁడు.

కలవింగకుఁడు—శంబరకుని శిష్యుఁడు. రమయంతికను బెండ్లియాడఁగోరి పరాభవ మొందిన కుత్సితుఁడు.

మాకందుఁడు—మారుతునకుఁ బూర్వోత్తరజన్మములయందు స్నేహితుఁడు. మాయామల్లికారూపము ధరించి శంబరకునకుఁ బెండ్లి చేయఁబడినవాఁడు.

వికటగ్రీవుఁడు—శాపవశమున రాక్షసుఁ డయినమాకందుఁడు. మారుతునిచేఁ జంపఁబడి నిజరూపము దాల్చినవాఁడు.

ఖడ్గజిహ్వుఁడు—విప్రవేషమునఁ గుసుమపురమున వచ్చి, వికటగ్రీవుని వగుమణిదివ్యాంబరచిత్రకన్యక లీపురమున నున్న దని తనసఖునకుఁ దెలియఁబఱిచిన రాక్షసుఁడు.

బర్బరకుఁడు, సింహముఖుఁడు—శంబరకుని మావటివాండ్రు. తదాజ్ఞాప్రకారము ఏనుఁగునకు మత్తెక్కించి మారుతకలకంఠులను జంప దానిని విడిచినవారు.

చపలకుఁడు—శంబరకుని యొద్దనుండి మందాకినికిఁ గాషాయాంబరములు అంచము దెచ్చినవాఁడు.

విశ్వావసుఁడు—మల్లికకుఁ బూర్వజన్మమునఁ దండ్రి యగువిద్యాధరామాత్యుఁడు. మందాకినికి యోగవిద్యయందు సహాధ్యాయి.

ఒక యిద్దఱు వైతాళికులు.

## స్త్రీలు.

మల్లిక—కథానాయిక. శాపవశమున భూలోకమున నవతరించి, గౌరీప్రసాదమున మగధేశ్వరామాత్యుఁ డగువిశ్వావసునకుఁ బుత్రికగా లభించినది. అయోనిసంభవురాలు.

మందాకిని—ఒకయోగిని. విశ్వావసునకు యోగవిద్యయందు సహాధ్యాయిని. మల్లికామాధవులయందు గాఢవాత్సల్యము గలిగి వారిని సంఘటించినది

రమయంతిక—విష్ణురాతుని కూఁతురు. మల్లిక ప్రియసఖి. కలకంఠుని ప్రియురాలు.

నవమాలిక—మల్లికబాల్యస్నేహితురాలు.

మధుకరిక—రమయంతికకుఁ జెలికత్తె.

పావనిక, కాళింది — మందాకినిశిష్యురాండ్రు. మల్లికామాధవులకును, రమయంతికాకలకంఠులకును గలయికలకు సహాయురాండ్రు.

కంకేళిక—భృంగకుని యుంపుడుఁగత్తె.

ప్రవాళిక—మల్లిక యంతఃపుర చేటి.

కనకలత—మల్లిక యంతఃపురద్వారపాలకురాలు.

చందనలత—మాధవుని ప్రతీహారి.



ఈసందర్భమున నాకు స్ఫురించినమత్పూర్వవిరచిత

పద్యములు మఱిరెండు.

ఉ. ఏ రసబంధబంధురరచియించితి నంతము లాఁటి మల్లికా
మారుతనాటకానఁ బ్రథమంబు దొరంకొని; తక్కునాలుగుం
గారణ ముండి రాయను, వెనుకం దెలిఁగింప వనిఁప దిచ్చ; యే
నేమపరిన్ విధాత కరుణించి తదర్థము దాఁగురించెనో. ౭

మ. “కృతి కాదంబరి బాణపుత్రకునిమాడ్కిన్, మల్లికామారుతం
బు తెలింగించెద నుత్తరార్ధ” మని, పెల్బుంబాస సేర్వంగఁ బూ
నితిగా వెంకటి వెంకటార్యునికడన్; నిర్భాగ్యుఁ డౌతండ్రికిం
బ్రతిభావత్తనయుండు దక్కునెటు రా? ప్రహ్లాద యేకాత్మజా! ౮

(సుతస్మృతి 48 పద్యము.)



శ్రీరస్తు

శ్రీపరమాత్మనే నమః

# ఆంధ్రమల్లికామారుతప్రకరణము

## సప్తమాంకము

[తరువాత నవమాలిక ప్రవేశించుచున్నది.]

న — (సంతోషముతో) అదృష్టవశమున మూఢుఁడు శంబరకుఁడు మోసపుచ్చఁబడి నాఁడు. తాదృశవేషసుకుమారుఁ డయిన యాదివ్యపురుషుని మల్లిక యనియే భావించుకొనుచుఁ బెండ్లియాడి, తన్నందఱు నల్లుఁ డని వ్యవహరింప, నిట విష్ణురాతగృహమునం దాగతుఁడయి యున్నవాఁడుగదా! ఇందుల కాశ్చర్యపడ వలసిన దేమి? నిజ మెఱిఁగినమాకుఁ గూడ నతనియందు మాటిమాటికిఁ బ్రియసఖి యనుతలంపే పొడముచున్నది. కృత్రిమలజ్జానటనవ్యాపారుఁ డగునతని బహువిధముల ననునయించి, మదనశరపతనజర్జరితధైర్యుఁ డగుశంబరకుని శయనగృహమున కెట్టెట్టో యనిపి, యిప్పుడే యీవలకు వచ్చితిని. (నవ్వి) కలకంఠుఁడు గూడ భగవతీత్వమును గడుఁ జక్కఁగా నాచరించినాఁడు. రుద్రదాతుఁడును, శంబరకుఁడు, నతని పాదములమీఁదఁ బడి, "భగవతీ! వామశీల యగురమయంతికను మా కనుకూలురాలినిగాఁ జేయవలయు" నని బహువిధములఁ దన్నుఁ బ్రార్థింపఁగాఁ, దొలుత సంకేతముఁ జేసికొన్నవిధమున మధుకరికచేత గూఢముగా రమయంతికావేషము వేయించిన భ్రమరకు నతఁడు కలవింగకునకుఁ బెండ్లి చేయించినాఁడు. (సానుకంపముగా) పాపము! దీనురాలా రమయంతిక కీవిషయ మేమియుఁ దెలియదు. కలవింగకునకుఁ దన్నుఁ బెండ్లి చేయునెడలఁ బ్రాణములు విడిచెదనని గట్టిగా నిశ్చయించుకొని, యుద్యానకేళీగృహమునకుఁ బోయి దాఁగి యున్నది. ఒకవేళ జీవితపరిత్యాగము చేసికొనకున్నచో, మధుకరికావచనవర్ధిత మగుకలకంఠలాభప్రత్యాశయే దానికి ముఖ్యకారణము (అంతటను జూచి సంతోషముతో) మన ప్రయత్నమునకు ననుకూలముగా నిర్దళితనీలాంజనపుంజమాంసల మగునడికిరేయిటిచిమ్మచీఁకటి గ్రమ్ముకొన్నది. సకలపరిజనులు నుత్సవవ్యాపారపరిశ్రాంతు లయి నిద్రించుచున్నవారు. (నడచి ముందు చూచి) ఇదిగో! నీ నాలు

గిండ్లబవంతియం దిట భగవతీవేషమును ధరించి కలకంఠుఁడు, పెండ్లికూఁతు వేషమును దాల్చినభ్రమరకుని, మధుకరికతోఁ గూడ ననువర్తించుచున్నవాఁడు. (మరల జూచి నవ్వుతోఁ దనలో) ఓహో! అల్లుఁడు కలవింగకుఁడుగారు గూడ నిక్కడనే యున్నారు. కాఁబట్టి నేను గూడఁ బోయి పరిహాసవల్లిని వృద్ధిఁ బొందించెదను.

(నిష్క్రమించుచున్నది. ప్రవేశకము.)

(తరువాత ముందు చెప్పినట్లు కలకంఠభ్రమరకమధుకరికాకలవింగకులును, నవమాలికయుఁ బ్రవేశించుచున్నారు.)

కలకం—(అపేక్షతో జనాంతికముగా) నవమాలికా!

మ. బళె! మందాకినిగూఢవర్ధితనయుస్వర్యాభ్యజమిం తెట్టులో
ఫలియించెఁ గద; శేష మింకను ఫలింపం గల్గునో గల్గదో!
బలవన్మారదురంతతాపహరణస్వాదోషధిం బుణ్యవ
త్సులభన్ నే రమయంతికం బడసి సంతోషింపనుం గల్గునా? ౧

నవ—(జనాంతికముగా) మహాభాగా! స్వర్యాభ్యజ మెట్లు ఫలింపకుండును? అతాగృహమధ్యమందు నిగూఢముగా నున్నరమయంతికయంతికమున కీవిఁకే కాళింది వెళ్లి యుండెనుగదా? కాఁబట్టి యామెయె సర్వము సమకూర్పఁగలదు. మన మిక్కడ జరుగుపరిహాసోత్సవమును విలోకింతము.

కలవిం—భగవతీ! యీనవమాలిక తమతో నేమనుచున్నది? చాటువచనచతురుఁడయినమాళంబరకగురువుగారి ప్రణయసరసము లయినయనునయవచనములవలన విశ్వాసము గలిగి యాకాశవాణీప్రభావలబ్ధయైనమల్లిక యాయనకయనగృహము చేరినదా?

కలకం—(తనలో) మరల భగవతీస్వరముననే మాటలాడెదను. (ప్రకాశముగా) మనయల్లుఁడుగారు నిజముగాఁ జాటువచనచతురులే. అంతటివిగ్గరికత్తెయయ్యును నాబిడ్డ క్రొత్తవాఁడగుపెనిమిటియొద్ద నెంతో చనవు గలదానివలెఁ బసుకింటఁ బ్రవేశించినట్లు నవమాలిక చెప్పుచున్నది.

నవ—భగవతీ! పెక్కులేల? ఆకాశవాణి మన కెంతో యుపకారము చేసినది. తన్మూలముననఁ గదా మన కిట్టి నేర్పరి యయినయల్లుఁడు లభించినాఁడు.

కలవిం—(ఆకాశవాణీప్రసంగమున గర్వముతోఁ దనలో నవ్వుకొనుచున్నాఁడు.)

మధు—మనకు భగవతి కూడ నుపకారము చేసినది. తాను రుద్రరాజపక్షమున నుండి దక్షిణత్వనయశీలసౌభాగ్యాదుల గురువును గూడ నతిక్రమించినయీయుల్లాఁడు గారికి, మనలను గూడ మందలించి ప్రియసఖి యయినరమయంతికను గూర్చినది గదా? ఈయన యింతటివా రని యిప్పటిదనుక మన మెఱుఁగ మయితిమి.

లవం—(సంతోషముతోఁ దనలో) మధుకరిక యథార్థము చెప్పినది. పరిచయము లేమిని ముద్దరాలు రమయంతిక నాగుణములు తెలిసికొన లేకపోయినది. (మన్మథపీడను నటించుచున్నాఁడు).

మక—(రహస్యముగా నవ్వుకొనుచుఁ దనలో) మిథ్యావిలాసములతో లజ్జ నభినయించెదను. (తల వంచుకొనుచున్నాఁడు).

లవం—భగవతీ! యీమె మిక్కిలి సిగ్గు పడుచున్నది. తవదీర్ఘవిశాలలోచనములతో నన్నుఁ జూడనయినఁ జూడకున్నది ఇందుకుఁ జేయఁ దగినప్రతిక్రియ యేదో తెలుపుము.

కామం—వెరపరీ! నీకుఁ దెలియదా?

క. మన సనుసరించి మసలంగనుట, మిషగా మాట మాటఁ గలుపుటయు, హాతం
బున వైముఖ్యము, ముగ్ధాంగనవు పలుమకొనఁగఁ దగినసదుపాయంబుల్. ౧

లవం—భగవతీ! నాకు లెస్సగ నుపదేశించితివి. తొలుదొల్త మాటలో మాటఁ గలిపి యీమెసిగ్గును దుత్తునియలు చేసివేసెదను. [భ్రమరకునిఁ గూర్చి సానునయముగా] ఓసువచనా! కలకంఠధిక్కారి యగు నీపలుకున నాతో సల్లాపము గావింపుము.

మక—(క్రోధముతో జనాంతికముగా) మధుకరికా! నాథకలకంఠాధిక్షేపనిరతుఁడగువీనిపం డ్లన్నియు గవ్వలవలె నొక్కసారిగా గలగల రాలునట్లు దవుడమీఁద వకనిపాతనిష్ఠుర మగునొక్కచెంపకాయ వేయుదునా?

మధు—(నవ్వి జనాంతికముగా) అతికోపనా! క్షణమాత్రము తాళ లేవా? ఇదిగో! శీఘ్రముగానే నీ వట్లు చేయఁగలవు.

లవం—మధుకరికా! మీప్రియసఖి యీమె కనుబొమ్మలు చిట్లించుకొని కోపముతో నున్నట్లు కనఁబడుచున్న దెందుచేత?

మధు—నిజముగా నీమెకుఁ గోపమే వచ్చినది.

లవం—(సావేగముగా) ఏమిది! నిర్నిమిత్తముగాఁ గోపించుచున్నది?

మధుక—ఈమె యత్యంతము మానవంతురాలుగదా? „సువచనా!” యని పిలుచుటంబట్టి యది గోత్రస్ఖలనముగా శంకించినది.

కలకం—(నవ్వుతో) ఇది సరిగ నున్నది.

తే. మానవహ్వారగుల్చు పెన్మ్రంతము గాదె। సవతిపే రుచ్చరించుట యువతితతికి?
భవ్యనిర్వ్యాజనిర్భరప్రణయహృదయ। లయినకులకన్యకల కది యధికతరము.

నవమా—భగవతీ! „శోభన మయినవచనము గలది” యని యీమెనే యల్లుఁడుగారు „సువచనా” యని సంబోధించినారు.

కలవిం—నవమాలిక నిజము చెప్పినది. ఈమెయే సువచన. (నిట్టూర్పు విడిచి) అయ్యో! యింకను నే నేమి ప్రతివిధానముఁ జేయుదును? భగవతీ! మీరె యీమెను బ్రసన్నురాలిని గావింపవలెను. ముందు మీచేత నేగదా మా కిరువురకుఁ బరిణయము గావింపఁబడెను?

కలకం—జామాతా! మాకతఃపర మధికారము లేదు సుమీ.

చ. తరుణులకున్ వివాహ మగుదాఁక నె, తద్విధి కంతరాయముల్
జరుగక యుండ, బంధువులు చాలఁ బ్రయత్నము లాచరింత్రు; త
త్పరము, ప్రవృద్ధమానసులభప్రియతాగ్రహసుప్రసాద ల
ప్పురుషపురంధ్రులే సకలమున్ సవరింపఁగఁ జాలుమానుసుల్. ౪

కలవిం—(విషాదముతో) అట్లయిన నీమెకుఁ గోపప్రశమనోపాయ మేదో నాకుఁ దెలుపు భగవతీ!

కలకం—(నవ్వి)

ఉ. కూరిమిపేర్మి మానినులకుం బొలయల్కను బూనుమానపుం
బేరిటి పెన్గ్రహంబు విడిపించుట కుండుఁ జటూక్తు లొట్లు లీ
మేరవి యెన్నొ; యన్నిటిని మీటినయస్త్రము శాంతికిన్, మెడం
జీరను జుట్టఁబెట్టుకొని చేయుచు కాళులకుం బ్రణామమున్. ౫

కలవిం—(సంతోషముతో) అట్లయినఁ గాలక్షేపమును సహింపఁజాలని నే నా యన్నిటిని మీటినయస్త్రమునే ప్రయోగించెదను. (లొట్టుపాటుతోఁ బాదములకు మ్రొక్కుచున్నాఁడు.)

భ్రమ—(నవ్వుతో జనాంతికముగా) మధుకరికా! యీ హతాశుని నా యెడమకాలితో నిప్పు డొక్క తన్నుఁ దన్నుదునా?

మధు—(జనాంతికముగా) వలదు. వల దిక్కడఁ దన్నకు. ఇదిగో! శీఘ్రముగా శయనగృహము చేరఁగలఁడు. మేము నిఁక ననంతరకార్యమునఁ బ్రవర్తించెదము.

నవ—లెమ్ము. లెమ్ము. నీ ప్రాణేశ్వరి ప్రసన్నురా లయినది.

కలవిం—(సంతోషముతో లేచి) ప్రసన్నురా లయినదా? భగవతీ! లెస్స యయిన యుపాయము నాకు నుపదేశించితిరి.

కలకం—జామాతా! అర్ధరాత్ర మయినది. కావున నవవధువుతో శయనగృహమునఁ బ్రవేశించి బహుప్రకారారబ్ధ మయి పరిపక్వ మయినఫలము నాస్వాదింపుము. మేము గూడ నిఁక విశ్రమించెదము.

కలవిం—(సంతోషముతో వెంటనే లేచి భ్రమరకునితో నిష్క్రమించుచున్నాఁడు.)

మధు—(సంతోషముతో) మహాభాగా! యీ హతాశుఁడు బాగుగా వంచితుఁడయినాఁడు. పక్వమాతులుంగఫలబీజము నపేక్షించువానరమునకు నగ్నికణము దొరకినది. మన మిఁక రహస్యముగా నుద్యానగృహమునకుఁ బోవుదము. పాప మీ వృత్తాంత మేమియుఁ దెలియని దయి దీనురాలు రమయంతిక యొక్కతెయు నక్కడ నున్నది.

నవ—ఆమె యొక్కతెయే యుండలేదు. కాళింది గూడ నక్కడకు వెళ్లినది. మనము గూడ వేగముగ నట కేగుదము. (లేచి నడచుచున్నారు.)

కలకం—మధుకరికా! తనవేషము వేసికొన్న భ్రమరకునకును, గలవింగకునకును బెండ్లి యయినసంగతి రమయంతికకుఁ దెలిసియుండదా?

మధు—ఆ ముద్దరాలి కది యెట్లు దెలియును? నేను గలవింగకునిఁ గూడ వంచించి యామెవేషమును వేసి భ్రమరకునిఁ బ్రియసఖిని గావించితిని.

„ మల్లిక శంబరకునకుఁ బెండ్లి చేయఁబడినది. నన్నుఁ గూడ కలవింగకున కిచ్చుటకయి భగవతి యిట రాఁ గలఁదు." అను నింతమాత్రమె యామెకుఁ దెలియును.

కలకం—(కనికరముతో)

తే. నన్నుఁ గాషాయధారణచ్ఛన్నవేషు। సన్నిధికిఁ జన్న, నెఱుఁగ దీయన్న మిన్న;

నవ—(పద్యముతో)

అరుణకమలరజంబు పై నలముగఁ గులు। వఱలు రాయంచను స్మరార్త వరటవోలె.

మధు—మన మీచతుశ్శాలద్వారమున నిర్గమించి పోవుదము.

(అందఱు బైలుదేఱుచున్నారు.)

కలకం—(అంతటను జూచి) ఓహో! నిశీథము మహత్తరముగా నున్నదిగదా?

చ. స్మరజగదేకవీరవరసైన్యమదాంధగజేంద్రబృంద, మం
బరవనపోత్రియూథము, దివాంధకమూహదృగంజనంబు, ని
ట్రుగుణివిశీర్ణకైశ్యము రథాంగగరుద్రథహృద్వియోగసం
జ్వరశిఖిధూమపుంజము, దెసల్ కబళించెఁ దమం బుదగ్రమై. ౭

(పరిశీలించి)

చ. * సమదనిశీథకుంజరము సంజనుశోకనదాళి మాపి, వ్యో
మ మనుమహాహ్రదంబునడుమన్ మునుఁగం, బృఘుసూత్కృతారకా
సముదయబుద్బుదప్రకరసంకులమై, భువనంబు సావిల
త్వముగ దురంతసంతమసపంకము పై కుబికెన్ గరాళతన్. ౮

(నడుచుచున్నారు.)

కలకం—ఈసమయ మతిమనోహరముగ నున్నదిగదా?

క. మృగనాభి నలఁదుకొని మెయి। మొగమునకున్ నీలిచేలము ముసుంగుగ, మేల్
వగలాఁడులు వెలిమగలం। దెగి తగులఁ జరింత్రు తిమిరదేవత లనఁగన్. ౯

(నవ్వి) నవమాలికా! చూడు.

ఉ. మేలిమిచూపుపట్టులను మేడలఁ దాపినమానికంపుదీ
పాలవెలుంగునం బలుచపడ్డయిరుల్ దఱు చయ్యె, రథ్యలం
బోలినపట్లకుం బ్రియులపొందున కేగెడుకాలుగంట్లదృ
జ్జ్ఞలవినీలచంచలశనీశలం జనియించుమించులన్. ౧౦

మధు—ఇదిగో! నుద్యానవనమధ్యమునకు వచ్చితిమి.

నవ—(తిమిరాతిశయమును దలంచి)

మ. తరుమూలాగ్రతలావకాశముల నుద్యానంబునన్ గప్పి. యిం
దురుకాలాయసచూర్ణరాశిఘనతన్ ద్యోతించువెంజీఁకటిం
జరణం బెట్టెటొ మోపు చేగుమన మిశ్యామం, గటా! ఱెప్పలన్
విరియం జేసిన, మూసినన్, గనులకున్ భేదంబు లే దేమియున్. ౧౧

కలకం—(అంతటను జూచి స్మరించి) ఆహా!

తే. కారుమబ్బులగమి వోలెఁ గ్రమ్మకొన్న। చిమ్మచీఁకటి నానయనమ్ము లహహ!
వెందుఁ ద్రిప్పిన, నట నిందుసుందరంబు। గాన వచ్చెడు రమయంతికాముఖంబె.

---

* సమదనిశీథసైరిభము అని మూలార్థము.

మధు—ఈముందఱనే రత్నబద్ధకుట్టిమ మయినతల్లతాగృహము.

కలకం—(చూచి యాశ్చర్యముతో) మధుకరికా! మణిప్రభాప్రతిహతప్రసర మయి భవనముచుట్టు నయోమయప్రాకారమువలెఁ బరివేష్టించినట్టి యీతిమిరమండల మును జూడుము

మధు—(కన్నీటితో) ఇదిగో! ఏకుట్టిమైకదేశమునఁ బ్రముదితవదన యయి కాళిందితోఁ గూడఁ బ్రియసఖి ప్రవేశించుచున్నది.

కలకం—(కనికరముతో)

చ. పెదవులు వేఁడియూర్పుల బీఁటలు వాఱఁగ, బాల, చన్నదో
యి దడియ బాష్పవారిని, జెయిం జెగచెక్కుఁ జేర్చి, దీన మౌ
వదనముతోడ, వేణి విడి వ్రాలఁగ మూఁపునఁ, జిక్కి వెల్లనై
యదె మధురాలసాంగి గననౌ నొకహార మె దాల్చి నేలపై. ౧౩

నవ—ఈమె దుర్విషహఘోరశోకమన్యుచింతాపర్యాకులగాఁ గానఁబడుచున్నది. కాఁబట్టి కలవింకునకు వివాహము చేయుటకయి భగవతి యిటకు వచ్చుచున్న దని కాళింది చెప్పియున్నట్లు భావించెదను.

కలకం—క్షణమాత్ర మిక్కడఁ జీఁకటిలోనే యుండి సర్వముఁ దెలిసికొందము.

(అట్లు చేయుచున్నారు) (తరువాత ముందు చెప్పినట్లు రమయంతికయుఁ గాళిందియుఁ బ్రవేశించుచున్నారు.)

రమ—(నిట్టూర్పు పుచ్చి తనలో) ఇంక నేమి గతి? అయ్యో! యతిజుగుప్సిత మయిన యీకార్యమునకు భగవతి యె ట్లనుమతించినది? అయినను భగవతిని నిందింప నేల? సహింపరాని నామదనసంతాపమునకు నవ్విధమున ఖేదపడుచున్న దయిన ప్రియసఖి మధుకరిక గూడ, న న్నొంటరిగా నిట రహస్యమున నుంచి, వెంటనే వచ్చెద నని పోయి, తాను గూడ నీ రోఁకపనియందుఁ బ్రవర్తించుచున్నది.

కాళింది—రమయంతికా! నీ వింతఁ బ్రతికూలురాలవు గాకుము. భగవతియాదేశ మాచరింపు మని నేను జెప్పుచున్నాను.

రమ—(మన్యుభావమునఁ బ్రత్యుత్తర మీయక మిన్నకున్నది).

కాళిం—సఖీ! నీహృదయములో నీవే యాలోచించుకొనఁ దగినది చూడు. ఇట్లు చేసితివా, యిఁక ముందును మల్లికతోఁ గూడ నీ కేకగృహనివాసము గాఁగలదు. ఈపరిణయవిషయమున నామె యేమియు సంశయించుట లేదు.

రమ—(నిట్టూర్పు పుచ్చి) కాళిందీ! దీనురాలు మల్లిక యెట్లు సంశయించును? ప్రతికూలగగనవాణీప్రమాణమును బట్టి గురుజనముచే నా మె యీయఁబడినదిగదా?

కాళిం—అట్లయిన నీవును నీయన్నగా రయినరుద్రరాతునిచేత నీయఁబడితివిగదా?

రమ—అంతమాత్రమున నేమి ప్రయోజనము? నాతండ్రి గాని, తల్లి గాని నన్నీయ లేదుగదా? వా రిద్దఱు నీయసంగళమును విని యన్నపానములు మానుకొని యున్నారు. ఇంతకు జీవితమునందుఁ గోరిక గలవారికిఁగదా, గురుజన మయినను, భగవతి యయినను గావలెను? కాఁబట్టి భగవతియాజ్ఞను నిరాకరించుదుఃఖము గలుగకముందె నాజీవితముఁ బరిత్యజించెదను. (అని లేవఁ బోవుచున్నది).

కాళిం—(చేయి పట్టుకొని) సఖీ! సాహసింపకు. నేను భగవతిని వారించెదను. భగవతికిఁ గలవింగకుఁడు నీకంటెఁ బ్రేమాస్పదుఁడు గాఁడు. మఱి యిది యేమో నీవే చెప్పఁదగినది నీ శరీరము మిక్కిలి చిక్కి వెల్లనయి యధికసుందరముగాఁ గానవచ్చుచున్న దెందుచేత? నీమానసము ప్రసన్నము చేసికొన్న యేజనునియందో యనురక్త మయిన దని నేను దలంచెదను. నాప్రతిజ్ఞ విను. ఈక్షణముననే నే నెవ్వరికిఁ దెలియకుండ నిన్నాసాబగునొద్దకుఁ గొనిపోయెదను. లేదా నీ యొద్దకు నప్పురుషునిఁ గొనితెచ్చెదను.

నవ—మేలు. కాళిందీ! మేలు.

కలశం—(ఆదరముతో వినుచున్నాఁడు).

రమ—(కొంచెము నిట్టూర్పు విడిచి) సఖీ! కాళిందీ! నీవు వ్యర్థప్రతిజ్ఞురాల వయ్యెదవు. నాయభిలాషము దుర్లభజనగోచరము.

కాళిం—(నవ్వి) ఓసి ముగ్ధా! భగవతిశిష్యురా లయిన యీకాళింది వ్యర్థప్రతిజ్ఞురాలెట్లు లగును? ఆపురుషుఁ డెవఁడో, యెక్కడఁ జూచితివో, నీయభిలాష మెట్టిదో నాకుఁ దెల్పుము

రమ—అట్లయినఁ బ్రియసఖీ! యాలకింపుము. ఈశిశిరావసానమున మెల్లమెల్ల వీచు మలయమారుతమున సంచలించెడుక్రొమ్మావికొమ్మలఁ గెంజిగురుగుత్తులు గాత వచ్చెడు వసంతదివసంబుల నొకప్పుడు, పురందరపురగోపురశిఖరమునందలిపద్మరాగకుంభమో యనఁగఁ గఠోరతామ్రచూడచూడాపాటలుఁడయి పొడుపుఁగొండ కొమ్మునఁ గమలినీవల్లభుఁడు కరమాత్రోచ్చలితుఁ డయి గానవచ్చుచుఁ, గుంన

మార్గ మలంకరించె నని, యాతనిఁ జూచుటకుఁ బ్రతిగృహమునుండియు విలాస
వతులు ప్రధావించుచుండ, సముత్సుకగృహదీర్ఘికాసారసరసితానుగత మగు
వారలచరణమణిమంజీరశింజిత మాలకించి, నేనును గౌతూహలోత్తరళహృదయ
నయి, యారంభించిన నా యలంకరణకృత్యము నడుమనే పరిత్యజించి, మధుకరికా
ప్రముఖ లయిన చెలిమికత్తెలతోఁ గూడ వంశకరీరనీలము లగునింద్రనీలమణులచే
ఘటిత మయినక్రీడాప్రాసాద మారోహించితిని.

కలకం—నవమాలికా! యేనాఁ డాశ్రమమున మొట్టమొదటఁ బ్రియవయస్యుఁడు
మల్లికను జూచినాఁడో, యిదియు నా నాఁడు జరిగినవృత్తాంతమే. (స్మరించి).

చ. అలఘునితంబ యీమె సఖిహస్తము కేల గ్రహించి, భూషణా
వళి గలుగల్లనన్, వెఱఁగుపాటున నెత్తినకన్నుదోయి ను
త్పలమయమాం బొనర్చుచు నభంబును, మేడఁ బ్రధావనం బటుల్
సలిపిననాఁటిమూచ్చట, తలఁపునఁ బాయదు నాకు నిప్పుడున్. ౧౪

కాళింది—తరువాత?

రమ—పిమ్మట రాజమార్గమున నా చూపుఁ బఱపి, మయూరకంధరమువంటిసుందర
స్నిగ్ధవర్ణమును, శరచ్చంద్రమరీచిజాలమువంటి ధవళవాలకలాపమును, గభీరహే
షితవాలవాలితముఖస్ఖలిత మయి ఘుణఘుణాయమాన మగు కాంచనఖలీనమును
గలయశ్వరాజముపృష్ఠదేశమునఁ, గనకచంపకకుసుమదళసదృక్షశరీరశోభునిఁ,
బ్రకీర్ణహేమదండవికటధవళాతపత్రలాంఛితుని, మందమందాందోళితసితచామర
పల్లవనర్తిత కుటిలకోమలస్నిగ్ధనీలకుంతల ముగ్ధముఖ చంద్రమండలుని, నభినవా
రూఢ యౌవనావష్టంభగంభీరదృష్టిపాతవియన్నదీవికసితారవింద సందోహుని,
మూర్తీభవించినవసంతమాసంబునుం బోలె దళద్వకుళలవంగ కర్పూరతక్కోల
సురభినిశ్వాస పరిమళలుభ్యద్భృంగ ఝంకారముఖరపురోభాగుని, నవాంపూ
ర్వికానిపతత్సకలకుసుమ పురసుందరీ సవిభ్రమభ్రూపుంఖితకటాక్షోత్పలమాలికా
భ్యర్చితసర్వాంగునిఁ, బరిమితపరిజనపరివేష్టితునిఁ, గలకంఠుని నేను గాంచితిని.

కాళింది—తరువాత?

రమ—రూపాతిశయదర్శన విస్మయోత్తంభిత నిష్పందపక్ష్మలము లగులోచనములతో
నట్లు దడవుగ వీక్షించుచు, సర్వాంగీణపులకోద్భేద కంటకిత తనువల్లి నయి యుండు
నన్నదుగకయే పగుగువాఱి, కాంచనరంభాగర్భపల్లవ గౌరవర్ణుఁ డగునమ్మహా
భాగునియందు నాహృదయము గాఢలగ్న మయి యిప్పటికిని మరలి రాకున్నది.

కాళింది—సఖీ! నీ హృదయము తగినచోటనే తగులుకొన్నది.

కలకం—నవమాలికా! అప్పు డుద్భవ మయినయద్భుతము నాలకింపుము.

చ. ప్రమదమునన్ సవిభ్రమతరంగితతారక భాఁ, దమాలమా
ల్యము లటు లైనయాచెలికటాక్షము, లిట్టటుఁ బర్వురాజమా
ర్గ మరయఁ, దాండవోద్ధతశిఖావళిపింఛగుళుచ్ఛరాజి, ఛ
న్న మయినభాతిఁ, దత్క్షణమునన్ గనుపట్టె విచిత్రవైఖరిన్. ౧౫

మఱియు నప్పుడే

చ. బలహాలపాతసంక్షుభితభానుసుతాలహరీ గభీర హా
కలికి మెఱుంగుఁగన్నుఁగవకాంతిప్రవంతిఝరిన్ మునుంగు, చి
ప్పాలఁతుకవిల్లువంపుఁ గనుబొమ్మలు, కేల్మకరంపుఁజేష్టితం
బుల నలరారెఁ బెద్దయును బ్రొద్దు మనోహరలీల నత్తఱిన్. ౧౬

కాళింది—తరువాత?

రమ—తరువాత ధవళచామరకలాపాంతరిత మయి, సముత్పతన్మరాళమండలపక్ష్మ పాళీ పరిక్షిప్త కనకారవిందసుందర మగుతనవదనమును సవిభ్రమముగ నించుక పై కెత్తి, విఘటమానసహస్రపత్రరుచిరములు, సవిలాసోద్వేల్లితభ్రూతోరణ మండలములు, ప్రేమమధుమూర్ఛత్పర్యంతములు నయిననయనములతో నన్ను సంభావించుచునే, కరకమలాకృష్టఖలీనావష్టంభమందమందకృత తురంగమ గమనుఁ డయి, యెట్టకేలకు నతఁ డారాచబాట నతిక్రమించెను.

కలకం—"ఎట్టకేలకు రాచబాట నతిక్రమించె" నని యీమధురవాణి సత్యమే చెప్పినది. మధుకరికా! యీవిషయము నీవు నెఱిఁగినదేగదా?

ఉ. ఆమదిరాక్షి యచ్చటఁ గటాక్షములన్ దృఢదీర్ఘరజ్జులన్
నామెయి సర్వముం బెనఁచి నన్నుఁ బిఱిందికి లాగినట్లు గాఁ
గా, మదనాశుగాహతులఁ గంది, ప్రయాసముతోడ నెట్టు లె
ట్లో మునుముందు నే నడుగు పెట్టి ప్రతోళి నతిక్రమించితిన్. ౧౭

కాళింది—తరువాత?

రమ—పిమ్మట నతఁడు నానయనమార్గము నతిక్రమింపఁగా, నెట్టెట్లో నాచూపు లావయిపునుండి మరలించుకొంటిని. కాని వెంటనే మదీయపార్శ్వభాగమునఁ బ్రచండభుజదండకుండలిత శరాసనుం డగుభగవంతుఁడు మకరలాంఛనుఁడు గానవచ్చెను.

కలకం—మధుకరికా! మన్మథు లిద్ద ఱున్నారా? చూడు. అప్పటినుండియు

ఉ. తేనెవిసంపుమాల్కులను దేఁటితెగన్ ఘటియించి సింగిణిన్,
పూవులు సోఁకఁగాఁ దిగిచి వ్రేళులతోడ, శరవ్యమైన యి
మ్మెని నిజాస్త్రశిక్షపటిమంబును జూపుచు, మాటి కక్కటా!
మానశరాసనుం డరుదుజోదిదె నాయెదురం జరించెడున్. ౧౨

మధు—మహాభాగా! యిద్దఱు మాత్రమే కారు. మన్మథుఁడు ప్రతిపురుషునకు నొక్కొక్కఁడుగదా!

కాళింది—సఖీ! మన్మథుఁడు రంధ్రప్రహారనిపుణుఁడు సుమా! తరువాత?

రమ—తరువాత దీర్ఘదీర్ఘనిశ్వాసపవనములచేతఁ బయిఁట చెఱఁగు తొలఁగిపోవ, స్పష్టముగఁ గానవచ్చెడుకుచస్థల ప్రరూఢపులకాంకురములచే గాఢమదనాభిషంగము నిశ్చయించుకొని, విదగ్ధసహచరీమండలము పరస్పరముఖావలోకనంబును వక్రసంభాషణంబులును గావించుచుండుటంబట్టి, ప్రవర్ధమానలజ్జాసూయావ్యతికరసంకులహృదయనయి, యెట్టెట్టో ప్రాసాదశిఖరమునుండి దిగి, యప్పటినుండియుఁ గాళిందీ! మాటలతో నేను జెప్పఁజాలను. కేవల మాత్మమాత్రసంవేదనీయ మగు ప్రచండసహస్రకిరణసహస్రసంపాతదుర్విషహసంతాపముచేత నాహృదయకుసుమము గందిపోవ, నిష్కారణనిష్ఠురమకరధ్వజప్రతిభయశరసంతాపమునఁ జకితచకిత మయి నిర్గమింపఁ జూచెడునాజీవితము నడ్డగించుట కయి, సర్వదా సన్నిహితలు నిపుణురాండ్రు నగుచెలిమికత్తియల కృత్యముల ప్రత్యాశవలన శరీరమును నిలిపికొన్నదాన నయి, కన్నుల నీరు పెట్టుకొనుచు వేవేగ పరిజనము గావించెడు వివిధశీతలోపచారములచే నెమ్మనికోఁకలు రెట్టిగాఁగ నిష్ఫలముగా బ్రదికియున్నదానను.

తరువాత సోమసరస్సునందుఁ దత్కాలోద్భిద్యన్మదరోషదురుపసర్పంబును, కూలతరుసంఘసంఘట్టనఝుడఝుడాయద్దంతదంభోళిశిఖరంబు నయిన దంతావళంబు శుండాదండవలయంబునుండి నేను రక్షింపఁబడినవిషయము నీవును జూచినదియే గదా! సఖీ! నన్ను భగవతి యెవ్వనికీయఁ బ్రయత్నించుచున్నదో, యట్టి నృశంసుఁ డవ్వారణాసీపథికుఁ డాసమయమునఁ గావించినచేష్ట నీ వెఱుఁగనిదానవా? కాళిందీ! మారుతైకపరాయణజీవితను మల్లికను భగవతి శంబరకునకేలాగున నిచ్చినది? ఆ దుష్టపథికుని ముఖమునుండి యట్టివిపత్తు నామె విని ,, హా! నాథా! మారుతా!" యని కరుణకరుణముగాఁ బలవించుచు, గొడ్డటిపెట్టునఁ

బోలెఁ బ్రబలమూర్ఛ నొందియుఁ, దత్కాలసన్నిహితుఁ డయినతత్పూర్ణచంద్ర సుందరమహాపురుషుని చేతఁ బరిరబ్ధ యయి తెలివి నొందినదిగదా! అది యటుండుఁ గాక. ప్రియసఖీ! మరలఁ బ్రస్తుత మాలకింపుము. పిమ్మటఁ దద్ద్వితీయదర్శనంబున ఘృతాహుతిచేత వీతిహోత్రముకయివడి నామన్మథజ్వరము మఱిమఱి ప్రజ్వరిల్లినది.

ఒకనాఁటిరాత్రి మర్దితాంజనమాంసల మయినతిమిరపుంజమునఁ బరిజనమును వంచించిపోయి, లతాగృహమున నొంటరిగాఁ దనకొఱకు వేచియున్న నన్ను, నతఁడును మాఱువేషమునఁ దిరోహితుఁ డయి తనపరిజనమును గన్నుమొఱఁగి, హర్షానురాగపూరితము లయి కర్ణమూలములఁ దాఁకెడులోచనములతో నారూపలావణ్యము గ్రోలువానివలె సమీపించి ప్రేమాతిశయమున డగ్గుత్తిక నొందు నెలుంగుతో నన్నే మేమొ బతిమాలుకొనసాగెను. అప్పుడు తద్దర్శనమాత్రమునఁ బ్రథమజలధరవర్షంబున నంకురించెడు కదంబకుట్మలములవంటి కఠోరరోమాంచమునఁ గంచుకితసకలావయవనయి యిచ్చగింపకున్నను, నన్ను బలాత్కారంబున నాధూర్తుఁడు విశాలమాంసలవక్షస్స్థలనిమజ్జిత స్తనాభోగంబుగాఁ గౌఁగలించుకొని, లజ్జావనత మయిననామోము సవిభ్రమకోమలకరాగ్రహంబున మీఁది కెత్తి, తనసురభిపదసారవిందంబుతోఁ గదియించి, నాకెమ్మోవిని సదయదత్తముగ దశనక్షతంబుగాఁ జుంబించి, యించుక ముకుళించిన లోచనాపాంగంబులతో విద్రుమభంగతామ్రమయి యమృతనిష్యందమధుర మయినదగు తన యధరబింబము నాకును నొసంగినవాఁ డయ్యెను. సఖీ! యతఃపరము చెప్పుటకు సిగ్గున నోరాడకున్నది. తరువాత నక్కితవుఁడు తనంత వీడినవీవీబంధమును గట్టిగాఁ బాణియుగళమునఁ బట్టుకొని, పాఱి పోవ నుంకించెడు నన్ను గాఢభుజయంత్రణంబునఁ బరిరంభించి, యేమేమొ యవగడము లాచరించుటకు నభిలషించుచుండెను.

అంతటఁ దత్క్షణానుభూతపరమానందమూర్ఛాముషితకరణ నయి మేలుకొని, వెండియు సఖీజనవిరచిత మయి కుసుమశరశరతల్పకల్ప మయినతత్కుసుమశయనముననే, పుణ్యశూన్యురాల నయినన న్నే, నాకన్నులతోఁ జూడఁగంటిని.

కాళింది—సఖీ! రమయంతికా! నీ స్వప్నమునందుఁ బోలె నిప్పుడు గూడ వేషాంతర తిరోహితుఁ డయి కలకంఠుఁ డాగతుఁ డయ్యెనేని, నీ వేమి చేసెదవు?

రమ—ఓసీ! యాశ్వాసనశీలురాలా! నన్నేల ప్రతారించెదవు. ఇట్లే గద మల్లిక గూడ మీచేతఁ దఱుచుగ మోసపుచ్చఁబడినది.

కాళింది—రమయంతికా! యీలాగున వగఁబోకు. భగవతిపాదములతోడు. నేనే నేఁటిరాత్రి నిన్నుఁ గలకంఠునితోఁ దప్పక సంఘటించెదను. కాఁబట్టి లే. భగవతి రాకముందే మనము పోవుదము.

రమ—(తనలో) జరుగున దేమో జరుగును. మంచుగా నీసంకటమునుండి బయలుపడెదను.

(ప్రకాశముగా) సఖీ! కాళిందీ! అట్లయిన నిదిగో! నేను నీకు వశవర్తిని నగుచున్నాను.

కాళింది—కాఁబట్టి యీయుపవనద్వారమునఁ బోవుదము. (ఇద్దఱు లేచుచున్నారు)

మధుక—(తటాలున సమీపించి) సఖీ! యెక్కడకుఁ బోయెదవు? భగవతి వచ్చినది గదా!

కలకం—(నవమాలికతో సమీపించు చున్నాఁడు).

రమ—(చూచి సకంపముగా) భగవతీ! యశరణ్యను నన్ను రక్షింపుము. (పాదముల మీఁదఁ బడి కాఁగిలించుకొని రోమాంచముతోఁ దనలో) ఏమిది? ఈవిధముగా సర్వాంగసౌఖ్యదాయి యయి, భగవతిస్పర్శము వేఱువిధముగా నున్నదే.

(సందేహముతో) అయ్యో! ఆమ్మన స్తనములు గూడఁ గానరావేమి? (వెంటనే భయపడి వెనుకకు జరుగుచున్నది)

కలకం—(పయిని గప్పుకొన్నకాషాయవస్త్రమును దీసివేసికొని చేయి పట్టుకొనుచున్నాఁడు).

రమ—(చూచి సంతోషముతోను భయముతోను దనలో) అయ్యో! మహాభాగుఁడు కలకంఠుఁడే. (ప్రకాశముగా ననూయతో బలె) మధుకరికా! యిట భగవతి యెక్కడ?

కలకం—(చిఱునవ్వుతో)

తే. తొలుత నెవని బలాత్కారధూర్తుఁడంటి, ప్రసభధృతధార్ష్ట్యుఁడవ్వాఁడెపట్టుఁజరణ
జలజదాసుఁడు, సంకల్పసంగసుముఖి! యబ్జ మిభమట్లు తావకం బరుణపాణి!

మధు—ఇట బలాత్కార మేమున్నది? పూర్వమే కుంజరహస్తమునకుఁ దప్పించి రక్షించి, యీమె శరీరము మీవశము చేసికొంటిరిగదా. ఇఁక హృదయమో, ప్రథమదర్శనముననే యీమెచేత మీ కీయఁబడినది.

రమ—తెల్లపోవుచున్నది.

కలశం—

క. అహాహా! యిన్నాళ్లకు। గ్రహించె మరుఁ; డీభవంబు గాదు వృథా; నా బహుళతపము పండె స్వయముగ;। నహాహా! చేకొంటె నీమె నన్నులమిన్నన్.

రమ—(కన్నీళ్లతో) నవమాలికా! ప్రియసఖిని మల్లికను మీరు శంబరకునకు నెట్టు లిచ్చితిరమ్మా?

నవ—ముద్దరాలా! భయపడకు. (చెవిలో) యీలా గీలాగున.

రమ—(సంతోషముతో) సంతోషము, సంతోషము. అహా తాపసు లిద్దఱును వేష మాత్రమున వంచితు లయినారా? (నవమాలికను కౌఁగిలించుకొనుచున్నది).

[తెరలో]

ఆ! దురాత్మా! మిథ్యాగగనభాషితప్రయోగకృతకాత్యాయనీహోకన నృశంస! శంబరకపశూ! యిదిగో! నీ విప్పుడు బలి యగుచున్నావురా.

అందఱు—(సంతోషముతో నాలకించుచున్నారు.)

[మరలఁ దెరలో]

అయ్యో! మందభాగ్యుఁడను నేను మరణించుచున్నాను. అకటకటా! వ్యర్థ కాముకుఁడను నేను మల్లిక యనుకొని మహాభూతమును బెండ్లి యాడితిని.

కలశం—ఓహో! మాకందనామకుఁడగుమహాపురుషుఁడు శంబరకమారణకృత్యముఁ బ్రారంభించినాఁడు.

(మరలఁ దెరలో) హా! భగవతీ! మందాకినీ! నన్ను విడిపింపుము. నాయవ యవములు వ్రక్కలగుచున్నవి.

కలశం—ఓరీ! హతాశుఁడా! యిక్కడ భగవతి యెక్కడ నున్నది?

(మరలఁ దెరలో) భగవతీ! నన్ను బ్రదికింపుము. వెండియు నీకమాల్యము అయినకాషాయాంబరములు సమర్పించుకొనెదను.

కలశం—(నవ్వి) ఓరీ! మూర్ఖా! యీపఱలో నీవు సమర్పించుకొన్నవగు కాషాయాం బరములకు ఫలమే యిది.

[మరలఁ దెరలో] ఆశ్చర్యము.

చ. బలిమిని లజ్జ సెజ్జగదిఁ బాదము వెట్టినముగ్ధ, యిప్డు శ్రృం
ఖల బిగఁగట్టి ఖట్వమునఁ గాల్లు, దివిం గొనిపోయి భర్త, ని

వ్వలనఁ దమాలశాఖ దృఢబద్ధునిఁ జేసి యదృశ్య యయ్యె; హా!
యలమరుచుం బిశాచమటు లల్లఁడు వ్రేలు నధోముఖంబుగన్. ౨౧

అందఱు—(సంతోషముతో) ఈహతాశుఁడు తనపాపవృద్ధికిఁ దగిన దగు ఫలము ననుభవించును గాక.

కలకం—భగవతీప్రభావము చూడుఁడు. వీఁడు మున్ను దమాలవిటపమందే మిథ్యాగగనవాణిని బ్రయోగించినాఁడు. ఇప్పుడు దానిఫలము నక్కడనే యనుభవించుచున్నాఁడు.

[మరలఁ దెరలోఁ గలకలము].

కలకం—అయ్యో! అమాత్యవిఘ్నరాతభవన మంతయు హాహాకారముఖరిత మగుచున్నది.

(మరలఁ దెరలో)

చ. అఱచుచుఁ బాఱు నోర్దెఱచి యట్లు ప్రజల్ విడి; వీఁడు భూతమా?
వెఱవకుఁ డేద్వ కేద్వకుఁడు వెఱ్ఱులరై పరివారకంచుకుల్;
కెఱకలు వీడ, మో మగల, నిండ మషిన్ మెయి, ఱోలు చల్లఁడు
బ్బటి కలవింగకుండు, వికృతాకృతి యై పడుకిల్లు వెల్వడెన్. ౨౨

అందఱు—మేలు. భ్రమరకా! మేలు.

భ్రమ—(ససంభ్రమముగాఁ బ్రవేశించి సంతోషముతోఁ జూచి) ఆహా! నాథ కలకంఠుఁడు గూడ రమయంతికను బరిగ్రహించెనుగదా (సమీపించుచున్నాఁడు.)

అందఱు—(చూచి సంతోషముతో) భ్రమరకా! త్వరగా రా. జరిగినది వేగముగాఁ జెప్పు.

కలకం—భ్రమరకా! కృతకృత్యుఁడ వయి వచ్చితివా?

భ్రమ—నాథా! దేవరవారి పరిజనులలోఁ గృతకృత్యుఁడుగాక మరలివచ్చువాఁ డెవఁడు?

కలకం—అట్లయిన నేమి చేసితివో చెప్పు.

భ్రమ—పిమ్మట నేను శయనగృహమునఁ బ్రవేశించి, వెండియుఁ గలహానటనవ్యాపారము గావించు చుండుటంబట్టి, మాటిమాటికి నా పాదములమీఁద వ్రాలెడు వాని వివిధాపరాధంబులు తత్కాలమున సంస్మరించి, విజృంభించెడు రోషంబున వాని సర్వాంగంబులు నిర్భిన్న మగునట్లు నిష్ఠురంబుగఁ జపేటాతాడనంబులు సలుపుచు, నంతకుఁ బూర్వ మే మంచముకడ మధుకరిక యుంచినమషీభాండమును వాని

నెత్తిమీఁదఁ గుమ్మరించితిని. పెక్కు లేల? అట్టు లావాతాశుఁడు శయనగృహము నుండి వెడలి వచ్చుచు, వానిం జూచి సర్వజనులును బిశాచమని పఱవఁ జొచ్చిరి.

అందఱు—(నవ్వి) మఱియొకవిధమునఁ గూడ నందఱు వానిని బిశాచ మని పరిహసించువారె.

భ్రమ—అటుపిమ్మట గాఢనిద్రను మేలుకాంచి, చేటకవర్గవసులు కోలాహలము గావించుచుండ, నేను దీపము లార్పివేసి చీఁకటిలోనుండి వెలికి వచ్చి, యచ్చటఁ దమాలవృక్షంబున వ్రేలాడుచున్న శంబరకునిఘూక్రందనధ్వని వీనులకు విందు సేయఁ దొందరగా నరుగుదెంచితిని.

కలకం—భ్రమరకా! మేలు. మేలు. శత్రువును నికారప్రకారంబునం జెనకి వానికిఁ దెలియకుండ వచ్చితివిగదా?

మధుక—మహాభాగా! యింక మనలను వెదుకఁగలరు. కాఁబట్టి యీయుపవన ద్వారమున నిర్గమించి మల్లికాసమీపమునకే పోవుదము.

కలకం—అట్లయిన మార్గముఁ జూపుము.

మధుక—ఇటు. ఇటు. (అందఱు బైలుదేఱుట నటించుచున్నారు.)

కలకం—(స్పర్శసుఖము ననుభవించి)

సీ. కేళీగృహాంతరక్రీడాపరిశ్రాంతి కుసుమపురీవధూవిసరవదన
పద్మసుగంధంబుబంధువై కమలాకరంబుల నిద్రాజడంబులైన
సారసంబులమనోహారికూజితము దీర్ఘంబు గావించు, చారామములను
బ్రచలితవిచికిలప్రసవసంచయసౌరభంబువెంబడి మూఁగి పఱచు భ్రమర

తే. సముదయము,మన్మథస్వామి సకలలోక। విజయబిరుదావళిని బాడ, వేగుఁబోకఁ
గోమలంబయి యంగానుకూలముగను। మాతరిశ్వుఁడు విహరించు మందగతిని.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీపరమేశ్వరప్రసాదలబ్ధసకలకవితాధురంధర విజయనగరపురీవరస్థాపితాంధ్ర
భారతీగ్రస్తసారస్వతపరిషద్విచక్షణసమర్పితకవిశేఖరబిరుద పట్టాది
సాధువంశక్షీర నీరాకరరాకా సుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితస
గోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తి ముక్తాఫల
సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయ
నామధేయాంధ్రీకృత మల్లికామారుత
ప్రకరణంబునందు సప్తమాంకము.

శ్రీరస్తు

శ్రీపరమాత్మనే నమః

# ఆంధ్రమల్లికామారుతప్రకరణము

## అష్టమాంకము

[తరువాత మందాకినీమకరందులు ప్రవేశించుచున్నారు]

మందా—తరువాత ?

మకరం—తరువాతఁ దమాలవిటపమునఁ దలక్రిందుగ వాని వ్రేలాడఁగట్టి కనఁబడకుండఁ జక్కవచ్చితిని.

మందా—(నవ్వి) వత్సా! వానికిఁ దగినట్లు చేసితివి. (సంతోషముతో)

ఉ. ఇష్టుఁడు మారుతుండు గ్రహియించెను మల్లికకేలుఁదామరన్;
దుష్టవిచేష్టితంబులను ద్రొయ్యలిఁ బెండిలియాడఁ గోరునా
కష్టపుమోసగానికిని గాఁదగుపాచిత మయ్యె దాయకున్;
హృష్టతఁ బొందె నాహృదయ మిప్పుడు, రెండుఁ బ్రియంబు లౌటచేన్. ౧

మకరం—పిమ్మట నట్లు వచ్చినవెంటనే రమయంతికొసహాయుఁ డయి నవమాలికాదులతోఁ గూడ నుపవనమునుండి రహస్యముగా బయలువెడలి వచ్చెదు ఆ కంతునిఁ జూచి, భగవతికిఁ బ్రథమప్రియావేదకుఁడ నగుదుఁగాక యని, వేగముగ నిట కేగుదెంచితిని నే నింకను వారికి నన్ను బయలుపఱుచుకొన లేదు.

మందా—(హర్షాతిశయము నటించుచు) వత్సా! యీమనోరథసిద్ధివలనఁ గలిగిన మహానంద మవాఙ్మనసగోచరము సుమీ!

మకరం—భగవతీ! యది యుక్తమే గదా!

ఆ. నాకరాజ్యలక్ష్మి చేకూరినను, సుధా। రసము దనివి దీఱఁ ద్రావఁ గనిన,
నావహిలని దౌమహానంద మగు మన। స్వికి, నభీష్టకార్యసిద్ధి యైన. ౨

(అంతటను జూచి) భగవతీ! మల్లికామారుతు లెక్కడ?

మందా.—మారుతుఁడు మొదట నుపవనమునుండి బైలువెడలి, తన్నుఁ, దన పరివార జనము వెదకుకొందు రనుశంకచే స్కంధావారమునకే వెళ్లి, సారసికచేత నిప్పుడు గూఢముగా నానీతుఁ డయి, సమీపమునందలి దగులతాభవనమున నున్నవాఁడు. మల్లికయు నాచేత నిట కానీత యయి, యిప్పుడు సారసికవెంబడి యిటనుండి యాతనియొద్దకుఁ బోవ బైలువెడలినది.

(అనుకంపతో)

తే. పాదమని యకుంఠితోత్కంఠ మందు కీడ్వ, । వెగ్గలపుసిగ్గు వలదని వెనుకలాగ,
నడుగు సాగక వడకడ కరిగె నెటులొ । కుసుమశరపరిపీడిత కోమలాంగి. 3

(స్నేహముతో) ఔరా! యంగనలకు నధికతర మగుప్రియజనానురాగము భయమును బాఱఁద్రోలునుగదా!

చ. పరిజనచంద్రమోముఖులు ప్రక్కల మంగళదీపికాసమ
త్కరము కరాంబుజంబులను గైకొని రా, గృహమందు నెట్టటో
తిరిగెడుభీరురా, లిపుడు తేఁకువ లేశము నెమ్మనంబునం
బొరయక, భర్తసన్నిధికిఁ బోయె నొకర్తుక జిమ్మచీఁకటిన్. ౪

మాకరం.—(సంతోషముతో) భగవతీ! మంచుఁగొండనెత్తమునకుఁ బోవ నీక న న్ననుమతింపుఁడు. ఏతదుదంతమున విద్యాధరామాత్యుని కానందము గలిగించెదను.

మందా.—(విమర్శించి) వత్సా! మంచిది. నీవు పోయి నాకు యోగవిద్యాసతీర్థ్యుఁ డయినవిశ్వావసుని సంతోషపెట్టుము.

మాకరం.—(నమస్కరించి నిష్క్రమించుచున్నాఁడు).

మందా.—(తలఁచుకొని సాశంకముగా సంభ్రమించుచు) అయ్యో! తత్తదుపాయ వ్యాపృతచిత్త నయి మూర్ఛాహార మగుమల్లికాసీమంతమణి రాక్షసక్షోభమున జాఱిపోవుట మఱచిపోయితినే! (నిర్వేదముతో) అయ్యో! యెంతకష్టము. ఇది మహాప్రమాదమే. దాని నెక్కడ వెదకుదును? (అని లేచుచున్నది. చెవియిచ్చి) ఇదిగోఁ! గాత్యాయనీభగవతీప్రముఖుఁ డేమో చెప్పుచున్నాఁడు. (ఆకాశమందు లక్ష్య ముంచి) భద్రా! యేమనుచున్నావు? అమణి యావాఁటిరాత్రి ఖడ్గజిహ్వుఁ డనునొకరాక్షసునకు దొరకినది. మేము వానిని దఱుముకొని పోయితిమి. కాని మా కది చిక్కినదికాదనియా? (విషాదము నటించుచున్నది. మరల నాకాశమున) భద్రా! మరల నేమనుచున్నావు? తరువాత ద్రమిడదేశంబునఁ గాంచీపురసమీ

షంబునఁ బరుగువాఱు చుండఁగాఁ. దత్కాలోపస్థితుఁడయిన కామాక్షీదేవికింకరుఁడా రాక్షసుని సంహరించి, వానియొద్దనుండి యామణిని లాగుకొన్నాఁడా? (ఉచ్ఛ్వాసముతో విమర్శించి) నాయోగవిద్యాప్రకటనమున కిది యవసరము. భావికాలమున సంభావితమార్గ యగుమల్లికనే కాంచీపురమునకుఁ గొంచుఁబోయెదను. (నిష్క్రమించుచున్నది).

(తరువాత అతామూలస్థుఁడు మారుతుఁడు ప్రవేశించుచున్నాఁడు).

మారు—(సంతోషముతో) సారసిక యిప్పుడు మల్లికను దప్పక తీసికొని రాఁగలదు. (ఔత్సుక్యాతిశయము నటించుచు)

చ కడచెను గల్పకల్పములుగాఁ బ్రియపాం దనుమాన మాదినాల్;
పడసితిఁ బూర్వపుణ్యమునఁ బ్రాణసమం దుది మల్లికన్ ; మ ఱీ
రెయిడఁ దెలిసంగముం దఱిసె; నీనడుమన్ క్షణసమ్మితంబు ని
బిడవిరహంబు, నాకుఁ గనిపించెడు దుస్తర మౌచు నక్కటా! ౫

(విమర్శించి) మనస్సే యిట్లు దుస్తరమని తలంచెడును. కాన దీని నాశ్వాసించెదను.

చ మనస! వహింపు ధైర్యమును; మానుము ఖేదము; చేరు వచ్చె నం
గనశుభసంగమోత్సవము; గడ్డగునంతటిపెన్వియోగపుం
దినము లతిక్రమించెఁగద; నీవిపు డక్కట! యింక నాలు గై
దు నిముసముల్ యుగంబులుగ దుస్తరముల్ గఁ, దలంచె దేమొకో. ౬

(నిట్టూర్పు విడిచి) కటకటా! మన్మథప్రతాప ముత్తరోత్తరోత్కర్ష మొందుచుండఁగాఁ బాప మీ మన సేమి చేయఁగలదు!

తే అతివప్రథమావలోకన మైన దాది। యెన్ని యస్త్రముల్ నామీఁద నేసినాఁడో,
యన్ని,మఱియంతకంటెనభ్యధికమయిన,।విప్పుడొక క్షణమాత్రనగుప్పుమరుఁడు.

(అంతటను జూచి) అక్కటా! సూచీభేద్యంబు అయినచిమ్మచీఁకటులు గ్రమ్ముకొన భువనమంతయు నేకతమాలోద్యానతుల్యముగా నున్నది. (సకరుణముగా) ఇక్కడ కాశ్రమము సమీపముగా నున్నప్పటికి, నిట్టిసమయమున నాకోమలాంగి యెట్లు రాఁగలదు?

క. సైరంధ్రీకరతల లా। క్షారస మంటినను, నరుణకమలము లల్లా;
నేరీతి విషమభూసం। చారము తిమిరమున సయిఁచు సకియుపదంబుల్? ౭

భూమున నిది యంత శోచనీయము గాదు.

క. వనితలకుం జరణములై న। యనములు, చీఁకటియె వెలుఁగు; నసహాయతయే
యనుఁగుఁజెలి, విషమపథమె భ। వనకుట్టిమ, మభిసరింప వల్లభు నెనయన్. ౯

ఓహో! విద్రుమభంగపాటల మయినయీజ్యోత్స్నావల్లి మొలకెత్తి మల్లికాసరణిని
దీపికవలెఁ బ్రకాశింపఁ జేయుచున్నది. (అవలోకించి)

తే. శ్యామకు నవీనకుంకుమచర్చ, యాశ। సం బనునశోకమునకుఁ గిసాలపంక్తి,
మానికపుబాగుటీఁటియ మన్మథునకు। నుడుపుపొడుపునఁదోఁచుమయూఖరేఖ.

(తూర్పుదిక్కుఁ జూచి సకౌతుకముగా)

చ. ఉదధిజలంబుగర్భమునను౦డి సుధోగుపృషత్కరాళి వహా
సదమలకాంతిపూరమునఁ జంద్రమసుం డుదయించుచున్నవాఁ
డదె, ఫణితల్పవక్షమనుహార్మ్యమునన్ విహరించునిందిరా
సుదతి, యదృచ్ఛ మిన్నెసకు సొంపుగ నెత్తినమోముకైవడిన్. ౧౧

తే. కుముదినీసుకృతంబు చంద్రముఁడు దెసల। నరుణకరదండములు పర్వనతిశయిల్లు,
స్యూతవిద్రుమకులమః పయోధివీచి। కోసముత్క్షిప్త మొక రాజకంబు వనఁగ. ౧౨

(పరిశీలించి) ఓహో! పొడుపుఁగొంపు తొలఁగి పోయినది. (సాకూతముగా)

తే. మదనబాధావిపాండువు మల్లికాస్య। మనుపమానము నతిమనోహరము నయిన.
డంచు కేఁ బోలఁగా లభియించు నంచుఁ। దలఁచెనో, వెలరారెను జలివెలుంగు,

(నవ్వి) దుర్లభార్థప్రార్థనదుర్లలితుఁ డయినయీతని నిట్లనియెదను.

ఉ. అందపుఁజందమామ! హరిణాయతలోచననెమ్మొగంబుచె
ల్వొందను నీదుడెందమున మోహ జనించిన, వెండి కంధిలో
నం దిగు; కందుఁ దోముకొను; నాకతరుప్రసవంపుఁబుప్పొడిం
జెందుము తావి; కానియెడఁ, జెప్పుము నీ వెట? నా మెమో మెటన్? ౧౪

ఎందుకు? ఇప్పుడే వచ్చెడునీమె సురభిసుందరవదనమును గనఁబఱిచి నే
నన్నమాట నిజ మని నిన్నొప్పించెదను. (చెవియొగ్గి సంతోషముతో) ఓహో!
ప్రియురాలు వచ్చినదే.

చ. ఘనజఘనప్రదేశధృతకాంచికఘంటలనాద మీదెసన్
వినఁబడుచున్న, దాయలసవీక్షణ యాక్షణ మింపు వచ్చుటన్;

(మరలఁ జెవి యొగ్గి విషాదముతో)

ధ్వని, యది కాదు కాదు; ప్రతిపంకరుహాకరమందు నిందునిం
గని, తమబందు గీతఁ డని క్రందుగ నంచలు సందడించెడున్. ౧౫

(తెరలో) ప్రియసఖీ! వెన్నెలచేఁ బ్రకాశించెడుమార్గమున మెల్లమెల్లగా నీలాగున నడురమ్ము.

మాధ—(ఆలకించి సంతోషముతో) నిజముగానే మల్లిక వచ్చినది. వెనుకనుండి తీఁగెలమాటున సారసికస్వరము వినవచ్చుచున్నది. (చూచుట నభినయించుచున్నాఁడు).

(మరలఁ దెరలో)

చ. ఉడుపతి రోహిణీపృథుపయోధరలిప్తమృగీమదంబునం
బడసినకప్పుఁజిహ్నమునఁ బాంథవిమోహనుఁ డై కనంబడుం,
దడుపుచుఁ జందనానుకరదగ్ధము వెన్నెలచేఁ బ్రపంచ, మి
ప్పుడు కలువల్లకల్వలను మూఁగి రొదం బొరయింప దిక్కులన్. ౧౭

మాధ—(చూచి సాభిలాషముగా)

ఉ. జంకుచు జంకుచుం గనుచుఁ జంకుఱు, భూరినితంబభార మీ
నాంకధృతాంగపాళి నలసాలస చంక్రమణక్రమంబుచే
నంకురితంబు స్వేదకణ మాననపద్మ మలంకరింప, నా
వంక కిదే సమీపమునఁ వచ్చిన దీయనుకొన్నచోటికిన్. ౧౮

(పరిశీలించి) అహా! చంద్రికాప్రసారమున నీతన్వంగియంగకంబులు సవిశేషాలంకారమును బొందుచున్నవి.

తే. స్తనయుగంబునఁ జందనచారుచర్చ, । మల్లెపూవుల దండ ధమ్మిల్లమందు,
గురునితంబబింబమున దుకూలచేల, । మిందుకిరణంబు లిందీవరేక్షణకును. ౧౯

(నవ్వి) ఔరా! జంతువులకు విశిష్టవస్తువులయం దభిలాషముగదా?

ఆ. దప్పి దీర్చుకొనను, ద్రావంగ మాని వె । న్నెలపులుంగుగములు నెలవెలుంగు,
సారె మూఁగెడుం జకోరాక్షియకలంక । సురభిశ్వాననంబుజ్యోత్స్న కెలమి.

(మరల విమర్శించి చిఱునవ్వుతో) కేవలము చకోరములే కావు

ఉ. ప్రాగవకృష్టకాంతి శశి, పైదలిమోమునిరిం గడించుచు
ద్వ్యాగరిమంబుకై, యవిరళాచ్ఛము లౌ శ్రమవారికణంబులన్
దోఁగినయామెయద్దపునుసంజెగిముద్దుఁగపోలమూలముం
బాగుగ స్వీయబింబము నెపంబునఁ దానును నాశ్రయించెడున్. ౨౦

నేను యెదురు వోయెదను. కాదు. ఇక్కడనే యుండి సులలిత మయిన యీమెయాగమనమును జక్కఁగఁ గనిపెట్టెదను.

(తరువాత ముందు చెప్పినప్రకారముగా మల్లికయు, సారసికయుఁ బ్రవేశించుచున్నారు).

మల్లిక—(తనలో) అయ్యో! యిప్పుడు ప్రథమముననే నార్యపుత్రునియొద్దకుఁ బోవుచు, సాధ్వసలజ్జావశతా హాలంబులచేఁ బరవశ నగుచుంటిని.

సార—ఇటు. ఇటు.

ఇద్దఱు—పరిక్రమించుచున్నారు.

మారు—(సాభిలాషముగా)

తే. నడుము జవజవలాడఁ జన్నవబరువున, । జలజలను రాలఁబూవులు జాఱు నెఱుల,
వదనగంధాగతాళికిఁ బెదరబెదరఁ । గన్ను, లల్లల నరుదెంచు సన్నతాంగి.

మల్లిక—సఖీ! సారసికా! ఆర్యపుత్రుఁ డెక్కడ నున్నాఁడు? చంద్రదర్శనమున నుద్వేజిత మగునాచూ పార్యపుత్రుని ముఖారవిందము సందర్శింప నుత్కంఠిత మగుచున్నది.

మారు—(సంతోషముతో)

తే. సఫల మిప్పుడుగద నామనోజవ్యసనంబు; । నూనవశుఁ డిప్డు గద నాకు నుప్రసన్నుఁ
డహాహా! యిప్పుడుగదయా మెకతిమనోహ । రార్యపుత్రాభిధేయుఁడనైతి నేను.

సార—సఖీ! చేరువనే యున్నాఁడు. మఱి యిరువది యడుగులు వేయుము.

మల్లిక—(తనలో) ఔరా! ఆర్యపుత్రదర్శనోత్కంఠతురాల నయిననా కీయిరువది యడుగులమేరయు దుర్లంఘ్యమే యగుచున్నది. (అంతటను జూచి విషాదముతో) సఖీ! సారసికా! నీ వసత్యమాడుచున్నావు. ఇక్కడఁ గూడ నార్యపుత్రుఁ డగపడ కున్నాఁడు.

సారసి—(నవ్వి) సఖీ! మల్లికా! సత్యమే, నివలుఁదపిఱుఁదులభారమునఁ జేసి, క్రొంజివురులవలెఁ గోమలము లయినవగునీయడుగుఁదమ్ములు లలసటను బొందినవి. అయినను మరల నిన్ను బతిమాలుకొనుచున్నాను. ఇంక నించుక ముందరకు రమ్ము. (వేలితోఁ జూపుచు) ఇదిగో! నిక్కడనే చేరువ నున్నలతామాటమున నతఁడు సన్నిహితుఁ డయి యున్నవాఁడు.

మల్లిక—(సాకూతముగా) అట్లయిన మనము మెల్లమెల్లగా నడుతము. తెలియకుండఁ బోయి యార్యపుత్రునిఁ గౌఁగిలించుకొందను. (ఒక్కడుగు వేసి సిగ్గున నిలఁబడుచున్నది.)

మారు—(తటాలున సమీపించి)

క. జాగోర్వను సుందరి! మం। దాగమనం బైన; సుమశరాస్త్రహతుఁ డనన్
వేగమ బ్రదికింపుము బిగి। కౌఁగిట గదియించి, కంబుకంఠీ! కరుణన్. ౨౩

(మల్లికాహస్తమును గ్రహింపఁగోరుచున్నాఁడు.)

మల్లిక—(చూచి సంతోషముతోఁ దనలో) అయ్యో! ఆర్యపుత్రుఁ డిక్కడనే యున్నాఁడే. (వెఱపుతోడను సిగ్గుతోడను వెనుక కడుగిడుచున్నది.)

సారసి—సఖీ! యీవఱదాఁక నాయావిధమున నుత్కంఠితురాల వయి యిప్పు డతఁడు హస్తగ్రహణము చేయఁబోవుచుండఁ దొట్రుపడుచు వెనుక కరిగెదవేల?

మల్లి—(ప్రత్యుత్తర మీయక సిగ్గున నిలుచున్నది.)

మారు—(కోరికతోఁ దనలో)

చ. బొమలను గుంచి, వంచుకొని ముద్దులు గాఱుముఖారవిందమున్
సమధికలజ్జమందతరసంచలనం బగులోచనోత్పలా
గ్రములరుచిం గుచంబులకుఁ గామిని చామనచాయ గూర్చు, నీ
సమయమునందు నిం దునికి, చక్కనిశోభను లోభనీయ మౌ. ౨౪

(విమర్శించి తనలో) కాని. ఇట్లనియెదను. (ప్రకాశముగా) ప్రియురాలా! హస్తావలంబన మటుండనిమ్ము. ఇందుల కయినను నన్ననుమతింపుము.

చ. వలుఁదపిఱుందుభారము లవంబు గణింపక దుర్వహంబు, నా
వలనికిఁ బ్రస్థితం బయినపాదతలంబును బద్మతామ్రమున్,
దొలఁపక యే తదీయ మగుధూళిని, హాళిని మానికంబుగా
సలుపను, ముద్దుఁ బెట్టుకొన, సామజయాన! జనించుఁ గోరికల్. ౨౫

మల్లిక—(భయమున వడఁకుచు) ఆర్యా! సిగ్గున నేను బ్రతివచన మయిన నీయఁ జాలకున్నాను.

మారు—(మల్లికను జూచి కనికరముతో) సారసికా! మాలతీదళసుకుమారాంగి యయినమల్లికకుఁ దదాగమనజనితపరిశ్రమ మిప్పటికిని దీఱ కున్నది. చూడు.

ఉ. సౌరభసంభ్రమద్భ్రమరఝుంకృతు లింక శమింప వూరుపుల్;
దోర పురోజభారమునఁ దూఁగుఁ దునింగినలాగునన్ గవున్;
జారువు లూరువుల్, జఘనజన్యభరంబున ఖేదముం గనున్;
సారకుసారికన్ వదనసారసమందును స్వేద మూరెడున్. ౨౬

సార — కాఁబట్టి మహాభాగా! ఘనసారపరాగధవళమును శీతలజ్యోత్స్నాపాత సుందరమును గుసుమధూళిసికతిలము నగునీశిలాతలమున విశ్రమింపుము. ప్రియసఖియు నిటఁ గూరుచుండును.

మారు — (కూరుచున్నాఁడు.)

సార — సఖీ! నీవు గూడఁ గూరుచుండుము.

మల్లి — (సిగ్గున నిలుచున్నది.)

సార — మహాభాగా! యీమె నామాట వినకున్నది. కావున నీవే చెప్పుము.

మారు —

చ. ఊరుజఘనా! మదీయ మిది యుత్సుక మంక మలంకరింపు; నీ
చరణ మనుగ్రహింపు మిట సస్పృహ మీచెయి మెత్త నొత్త; నీ
యురమున నొయ్య మోపు కుచయుగ్మము, పాపము! కల్దొ లేదొ నాఁ
బరఁగెడువాదులాటకును బట్టగుమధ్యము, పాయ భారముల్. ౨౩

మల్లి — (తనలో) అహా! ఆర్యపుత్రునిచాటువచనపరిపాటి యతిమధురముగదా? (సారసికతోఁ గూడ శిలాతలముననే కూరుచున్నది.)

మారు — (తనలో) అయ్యో! యీలజ్జావతి రాతిమీఁదనే కూరుచున్నదే. కాని. ఇట్లుపాలంభించెదను. (ప్రకాశముగా)

ఉ. ముద్దియ! క్రొత్తవిచ్చువిరిపుప్పొడిరేణువు మీఁద రాలినన్,
దద్దయుఁ గందునీయొడలు, లెదల్ దయమాలి శిలన్ గదింతువే!
యద్ది స్వకీయ మంచనుమహాభ్రమ మాదిని నీకు గల్గు గా;
కద్ది మొదల్ మదీయ మది; (తనశరీరమును జూపుచు) యీమెయి నీమెయి గా
నెఱుంగుమీ. ౨౪

మల్లి — (సంతోషముతోఁ దనలో) ఇది తన దనియే కాఁబోలు, నార్యపుత్రునకీ శరీరమునను మహాప్రేమ. చెవులారా! యీవచనామృతము నాస్వాదింపుఁడు. (ఔత్సుక్యముతో) కన్నులారా! మీరు పరోక్షమున నుత్కంఠితము అయి యుండియు, నార్యపుత్రుఁ డిప్పుడు సన్నిహితుఁడు గాఁగా మిమ్ము మోసపుచ్చుకొనుచున్నారు. (కొంచెము చూచి సిగ్గున చూపు మరలించుకొనుచున్నది).

మారు — (రోమాంచముతోఁ దనలో) ఆహా! ప్రియురాలిభావవ్యతికర మతిమాత్ర రమణీయముగదా?

ఉ. మోసముఁ జేసి ప్రేయసిని, ముద్దుమొగంబు ప్రఫుల్లవారిరు
ద్భాసుర మెత్తి, నేత్రము, కటాక్షము సౌఖ్యక్షణంబు నాదెసం
ద్రోసి గిలుక్కునన్ బిసపఁ దోన ముసల్చెను దాని; నైన నీ
చేసినదృగ్విచేష్టితముఁ జెల్వ యెఱుంగదు లేశ మేనియున్. ౨౯

(విమర్శించి) ఇట్లని తలంచెదను.

క. బిడియము చెలియలికట్టయి । జడధిజలమునట్టు లాఁగు సతులహృదయమున్;
బొడముచును ననురాగం బను । నుడుపతి, యది తరఁగలెత్తి యుప్పొంగుఁగదా.

(ఔత్సుక్యముతో) ఔరా! మనసునకుఁ జిరకాంక్షితవస్తుసాధనమునందుఁ గూడ నియాకులత్వము.

తే. సిగ్గునను బోఁకముడిమీఁదఁ జేయియుంచి, । తొడలఁ బెనచి నతాస్యముఁ బెడమరల్చి
ముగుద, బలవంతముగ వక్షమున గదించి । సంతసిలఁ గోరుదును; జేయఁ జాల నట్లు.

(తనలో) కాని. వెండియు బతిమాలుకొనెదను. (ప్రకాశముగ) ఓమల్లికా!

చ. కలికి! త్వదీయమున్, గతికకాఁడలకాంతి హరించుతళ్కుఁజె
క్కుల శ్రమబిందు లౌక్కకొని గూడినదై, పకళింపుఁదావి కెం
పులజిగిమోవి సాజ మగుముగ్ధముఖాబ్జము, నాసఁ గోరుదున్;
వలతును మారుకో నైన; వాంఛను దీర్పు మరాళకుంతలా! ౩౨

తే. ముదిత! నీదర్శనంబున నుదిత మయిన । కంతుసంతాప మార సౌఖ్యకరి యైన,
జారుదోర్మూలకూలంకషపరిణాహ । కుచపరీరంభమును ముద్దుగుమ్మ యిమ్ము.

చ. ప్రణయిని! త్వత్కుచాద్రిపరిరంభము నీవధికప్రసంగమం
చనిన, నటుండని మ్మది; నిరంతరమున్ బికవారకూజితం
బును విను చున్కిఁ జేఁదలఁచు బొందుమదీయపురీపుదోయి హా
యిని గన మంజువాణి! దనియింపుము తావక మైనవాక్సుధన్. ౩౪

మల్లి—(సిగ్గుపడుచు నూరకున్నది).

మారు—(చూచి యాశతో)

తే. నమ్రముఖి, మాట నాప్రార్థనంబు, అనుమతించుట తిరస్కరించుట దెలుపదేమిఁ
ప్రణయలజ్జాప్రమోదసంభరితలోచ । నోత్పలముల్ ప్రసాదించు నుత్తరంబు.

సారసి—సఖీ! తెలియకుండఁ బోయి యార్యపుత్రుని కౌఁగిలించెద నని నీవే యని యుంటివిగదా?

మారు—

క. బాల! మనప్రథమదర్శన। వేళఁ గుచప్రణయి నిడితివే సుమమాలన్;
మేలె కుచాలింగన మిడ। నాలోచన? యిప్పు డయ్యుదారత గతమే? ౩౭

మఱి యట్లు చేయ వయితివా —

చ. వికసితకైరవౌఘమధుబిందువికీర్ణనిశీథమారుతా
ర్భకములు వీచు; మారశరపావకకీలలు గ్రాలు వెన్నెలల్;
పికలలితాళిఁ గర్ణపరుషంబుగ జుమ్మను గండుఁదుమ్మెదల్;
వకుళసుగంధి! నీయెదుట వానికిఁ బంచెద నాశరీరమున్. ౩౮

మల్లిక—(సావేగముగా నపవారణముతో) సారసికా! ఆర్యపుత్రుఁడు సత్యముగానే యట్లు చేయునా?

సార—ముద్దరాలా! యతనిసాహసికత్వము నీ వెఱుఁగనిదానవా? మును పు నీవు లభింపవేమో యని కంఠమూలమునఁ గరవాలమును జేర్చుకొన్నాఁడు గదా? కాఁబట్టి వెంటనే యాతనియభిలాషముఁ దీర్పుము. లేదా, నీమాటలో నయిన వారింపుము.

మల్లి—(తనలో) అట్లయిన వారించెదను. (ప్రకాశముగా) ఆర్యపుత్రా! (అర్ధోక్తి యందు సిగ్గున నపవారణముతో) సఖీ! సిగ్గున నాయంతట నేనట్లు చేయఁజాలను. నీవు వారింపుము

మారు—(సంతోషముతోఁ దనలో) ఈకపటసాహసోపన్యాసము చక్కగా నున్నది.

తే. సురుచిరావ్యక్తకోమలాక్షరము గాఁగ। నార్యపుత్రోక్తి యుదయించె నర్ధవిరతి,
నీమధురవాణి మోమున, నిందుబింబ। మందునుండి నిష్యందిత మమృత మట్లు. ౩౯

(ప్రకాశముగా) సారసికా! నాప్రార్థనమును గూర్చి యీయణుమధ్య యేమనుచున్నది?

సార—నాయంతట నేనట్లు చేయఁజాల నని యనుకూలముగానే చెప్పినది.

మారు—మఱి చాలువా రెవరు?

సార—మహాభాగుఁడే.

మారు—(సంతోషముతో)

తే. సతి! యనన్యసాధారణచరణదాసు। నన్నుఁ జాలువానిఁ జేసి నీ వెన్ని తేని
యును, హృదయంగ్రహాశ్లేషమహోత్సవముల। కగును గావుతఁ బాత్రమీయుస్మదురము,

మల్లి—(సానూయముగా నపవారణముతో) సారసికా! యెందుకు నీవు స్వయం
గ్రహమునఁ బ్రవర్తింపఁ జేయుచున్నావు? (తొలఁగి పోవఁ జూచుచున్నది.)

సార—(చేయి పట్టుకొని నవ్వి) సఖీ! నీ కుచకుంభములు నీరంధ్రరోమాంచపక్ష్మ
లము లగుచున్న వెందుచేత? స్వయంగ్రహమునకు జంకుచున్న వయి పులక
కంచుకమునఁ గప్పఁబడినవని నే ననుకొన్నదానను.

మారు—(తనలో) బాగు. సారసికా! బాగు. లెస్సగా నాక్షేపించితివి. నీవు మందా
కినికి శిష్యురాలవుగదా (ప్రకాశముగా) సారసికా! యీ మెకునములు నా కవుఁ
గలికి భయపడియే కంచుకమును ధరించుచున్నావా?

సార—మరేమి?

మారు—అట్లయిన వానిని నే నిట్లుపాలంభించెదను.

ఉ. యౌవనకుంభికుంభయుగమా! యణుమధ్యయురోజయుగ్మమా!
యీవు సహింప వేల తపియించెడు నాయుపగూహనం? బయో!
గ్రావసదృక్ష-కోరమవు; కాను సదా భవదీయభారముల్,
మోవఁగ లేక క్రుక్కు, లవముం గరుణింపవు; వజ్ర గణింతువే? ౪౦

మల్లి—(అసూయతో) సారసికా! యెందు కబద్ధము చెప్పెదవు?

మారు—సారసికా! అబద్ధమే చెప్పితివి.

సార—(చిఱునవ్వుతో) ఏమిది? న న్నిద్దఱును మిథ్యావాదినిఁ జేయుచున్నారు.
కాఁబట్టి యిట మహాభాగుని హస్తమే మధ్యవర్తి యగుఁగాక.

మల్లి—వలదు. వలదు. ఇక్కడ మధ్యవర్తిని దెచ్చిపెట్టకు.

సార—మీ యిద్దఱిచేత మిథ్యావాదిని ననిపించుకొనుట కోర్వను. (మారుతుని హస్త
మును బట్టుకొని) మహాభాగా! నీహస్తము చూపుఁగాత.

మారు—ప్రియురాలా! నాకును మిథ్య యనియే నిశ్చయము. కాని. సారసిక నిర్బం
ధించుచున్నది. (చేయి చూపుచు భయకంపములతోఁ దనలో) ఆశ్చర్యము.

చ. మును పెది భావనారతుల ముద్దియ యంబరకర్షణంబునం
దును వెనుఁబాటు లేక, కడు ధూర్తత వర్తిలె, నట్టికేలు, త
త్స్తనయుగళంబుసన్నిధికి సాగను సైతముఁ జాల కిత్తఱిన్
ఘనముగ జంకు, నంగుళులు కంపము నొంద మదీయ; మే మొకో? ౪౧

(ఎట్టకేలకుఁ బులకలతోఁ గూడిన స్తనమును స్పృశించుచున్నాఁడు.)
(సంతోషముతోఁ దనలో)

క. ఘనపులకాంకితములు చెలి। స్తనములే కావు, పాణితలమున నవి యం
టినమాత్ర మనకు జల్లని। తను వెల్లను మామకమను దాదృశ మయ్యెన్. ౪౨

(ప్రకాశముగా) సారసికా! నీ వొకటి చూచి వేఱొకటి యనుకొనుచున్నావు.

చ. ఘనతరమైన కఠోర మగు కామినికుంభనిభ స్తనద్వయిన్,
ఎనరుహనాళతుల్య మిది, పల్కెడు వేల గగు ర్పటంచు? నూ
తనపుఁగదంబకుట్మలవితానములన్ రచియించి, యీ మెకన్
మనసిజుఁ డిడ్డదొడ్డబహుమానము హారముగా స్ఫురించెడున్. ౪౩

పార—(చూచి తనలో)

క. ప్రణయికరపల్లవతల। మ్మున ముద్రిత మగుచుఁ, జెమటబొట్లము నుద్య
త్స్నన మలరు, మంగళాంబుజ। మనోజమహితాభిషేకమణికుంభ మనన్. ౪౪

కాఁబట్టి నే నీతీఁగలచాటున నుండెదను.

మల్లి—(తనలో) అయ్యో! ఆర్యపుత్రుని హస్తమునుండి స్తనమును దొలఁగించుకొనఁ
జాలకున్నాను. (ఎట్టకేలకుఁ దొలఁగించుకొనుచున్నది.)

చ. కలికి! మనోజకేళి శిఖఁ గ్రాఁగెడునాకయి, నెట్టు లెట్లొ నీ
వలికుచ మొక్కసారి యిడి, వాంఛను దీర్పకఁ దీసికొంటు వే
బలితపు టెండ వేఁడిమిఁ బిపాసను గూరినపాంథుహస్తమం
దలి యమృతంపుఁగుంభమును ద్రాగుచు నుండఁగ లాగులాగునన్? ౪౫

మల్లి—(తనలో) ఆర్యపుత్రుని కరకమలమునుండి తొలఁగిననాకు మరల వెన్నె।
సయిఁపరానిదిగా నున్నది.

మారు—(తనలో) మరల నా సాహసము నుపన్యసించెదను (ప్రకాశముగా) ఓ
ప్రియురాలా! నీ విట్లు కనికరము లేనిదాన వయితివేని—

ఉ. చండిక! శ్వేతవహ్నిశిఖ చంద్రిక, పైపయిఁ గ్రమ్మె; వాతపో
తుండు, మధూళికానిచయధూళిని గప్పెడు రేఁచి యొల్లెడన్;
మండుచుఁ జిక్కియున్న దిదె మామకదేహము చేర్తు, మూఁగు నీ
చండజీకంపుఁ దేఁటిపాగ దొట్టిన కెంజిగురగ్గిసెజ్జపై. ౪౬

ఈ సమీపమందలివల్లీమతల్లిపల్లవములతోఁ దల్పమును గల్పించుకొనెదను

[నిష్క్రమించుచున్నాఁడు]

మల్లి—(భయపడుచున్నది).

సార—(తనలో) మహాభాగుఁడు మంచిపని యారంభించినాఁడు. (ప్రకాశముగ) నిష్కరుణురాలా! సఖీ! తనకుఁ దానే తలిరులతోఁ దలిమమును కల్పించుకొని మహాభాగుఁడు శయనించుచున్నాఁడు.

మల్లి—(సంభ్రమముతో లేచి) ఆర్యపుత్రా! వలదు. వలదు. సాహసింపకు. (కన్నీళ్లతో) అయ్యో! ప్రవేశించినాఁడే. కాఁబట్టి నేను నాపల్లవతల్పమున నే ప్రవేశించెదను

సార—(నవ్వి తనలో) అదిరో కోరిక.

మల్లి—(వేగముగా నిష్క్రమించుచున్నది.)

సార—(చూచి చిఱునవ్వుతో) అహా! యీముద్దరాలు వల్లభుని దనంతటఁ దానే కౌఁగిలించుకొన్నది. కావున నేను మఱియొకలతామూలమున నిలిచెదను. (అట్లు చేసి సవితర్కముగా) మఱి కలకంఠాదులవృత్తాంతము దెలియకున్నదే. ఏదో యడుగులచప్పుడువలె నున్నది.

(తరువాత భ్రమరకునితోఁ గలకంఠుఁడును, ముకుళుతో రమయంతికయు నవమాలికా కాళిందీమధుకరికలును ప్రవేశించుచున్నారు.)

కలకం—భ్రమరకా! ఆశ్రమమున మల్లికాసఖుఁడు పయస్యుఁడు గానరాఁడేమి?

భ్రమ—నాథా! భగవతియు నాశ్రమమున గానవచ్చుట లేదే?

కలకం—కాని. వెన్నెల వచ్చుటచేత సొబగు మీఱుచున్న లతామూలముల వెదకుదము.

అందఱు—ప్రియసఖుని మల్లికను జూచుటకు వేడుక పడుచున్నాము.

నవ—సఖులారా! పాంసుక్రీడ మొదలుగా నింతదనుకఁ బ్రియసఖపార్శ్వము పాయుని దాన నగుటచే నిప్పుడామెను గానక దుఃఖించుచున్నాను.

సార—(చూచి సంతోషముతో) అనుకొనుచుండఁగానే యందఱు వచ్చినారు.

కలకం—(చూచి సంతోషముతో) ఇదిగో! సారసిక

అందఱు—(సంతోషముతో) ఓహో! సారసిక. సారసిక.

సార—(చూచి సంతోషముతో) ఇదిగో! రమయంతిక గూడ. (సమీపించి) మహాభాగా! అదృష్టవంతుఁడవు. ప్రియతమామాలాభమున వర్ధిల్లుచున్నావు. (రమయంతికతో) సఖీ! యదృష్టమునఁ గానవయితివి.

రమ—సారసికా! మఱి మల్లిక యెక్కడ నున్నది?

ఇతరులు—తొరతొరగాఁ జెప్పు.

సార—(చేతితోఁ జూపి) ఇక్కడిలతాభవనమున నిప్పుడే మారుతునితోఁ గూర్చి యిట వచ్చితిని.

నవ—(సంతోషముతోఁ జిఱునవ్వుతో) కాళిందీ! నర్మగర్భము లయినమాటలతోఁ బ్రియసఖిని సిగ్గుపఱుపకుము.

కలకం—(ముందు చూచి తొట్రుపాటుతో) అయ్యో! ఈప్రదేశ మంతటను సంక్షుభితముగా నున్నది. (మరలఁ జూచి) సారసికా! చూడు. చూడు.

ఉ. ధావితవిష్వగిందపరుచామహిమంబును దృష్టిరోధకం
బై, దెసలన్ గ్రసించెను భయావక మస్ఫుతగోచరంబునై,
యేనియొ తేజమో తమమొ యీయుభయోరుతమఃప్రకాశమో,
కోదని దీప్యమానముఁ దిరోహితముం బొనరించెడున్ గదున్. ౪౬

అందఱు—(సంభ్రమముతోను విస్మయముతోను జూచుచున్నారు).

(తెరలో)—హా! ప్రియురాలా! మల్లిక!

కలకం—(సాశంకముగాను సవిషాదముగాను) అయ్యో! యీయార్తనాదము వయస్యునిదిగా నున్నదే.

అందఱు—(పిడుగు మొత్తిన ట్లగుచున్నారు).

కలకం—(సత్వరముగా సమీపించుచున్నాఁడు.)

[తరువాత సబాష్పవదనుఁడు మారుతుఁడు ప్రవేశించుచున్నాఁడు],

మారు—హా! ప్రియురాలా! నిన్నెవ రెత్తుకొని పోయినారే?

చ. హృదయము నూఱువ్రక్క లగు; నింగలమందుఁ బొరల్చినట్లు లో
మది; విన మేదొ నేఁ దినినమాదిరి దేహము విహ్వలించు; ను
త్పదమున నన్ను ము న్నిలిపి భద్రముగా నటు, మాయదైవమా!
యదయత నంధకూపమున హా! యిపుడీగతిఁ గూలఁద్రోయుదే? ౪౭

కలకం—(సమీపించి) సఖుఁడా? మల్లిక కేమి మూఁడినది?

అందఱు—(సమీపించి) మహాభాగా! మల్లిక కేమి?

మారు—(చూచి బాష్పాతిశయముతోఁ దనలో) అయ్యో! మీరు కూడ వచ్చినారా? (ప్రకాశముగా) అయ్యో! సఖుఁడా! నీపరిశ్రమ మంతయు వ్యర్థ మయినది. హా! సఖులారా! మీజీవిత మపహృత మయినది.

కలకం—సఖుఁడా! విషయ మేమో తెలపక యేల మమ్ము దుఃఖపెట్టెద వేమి? మల్లిక కేమి సంభవించినదో తెలుపుము.

సార—మహాభాగా! యిప్పుడే కదా పల్లవతల్పమున నిన్నుఁ గూడినది?

మారు—ఔను. కర్ణకఠోర మిది యాలకింపుము.

తే. అధరమధు పానునాస నవ్యాజరమ్య। మోమెఁ జూనన మేను వ్రీళావతంబు
పైకి నెత్తఁ, గురంగశాబక విలోల। ముగ్ధనయనముల్ ప్రియ వరో మూఁతపడిరొ.

(అని నేలఁ గూలుచున్నాఁడు).

కలకం—(పట్టుకొని) సఖుఁడా! యీమె మూర్ఛిల్లినయెడల శిశిరోపచారముల నూఱడింతము. రా.

అందఱు—(కన్నీళ్లతో) త్వరగాఁ బ్రియసఖి నూఱడింతము.

సార—(స్మరించుకొని) మహాభాగా! మల్లిక ప్రథమసంగమమున మూర్ఛిల్లు నని మును పే భగవతి నా చెవిలోఁ జెప్పినది. కావున మన మామె నాశ్వాసింతము.

మారు—మఱియొక దారుణముఁ గూడ వినిపించెదను.

కలకం—(సాశంకముగా) అదేమి?

మారు—తరువాత నానిమిషమున—

చ. గడగడ మిక్కిలిన్ వడఁకఁ గాయము విహ్వలమై, హఠాత్తుగాఁ
బుడమిని వ్రాలె నాలలన పాల్పతి; యత్తతి "హా! హతోస్మి" యం
చడలున నే మదంకమున నంగనఁ జేర్చితి; నంతలో ననున్
జడముగఁ జేసి, భూత మెదొ చట్టన హా! గొనిపోయెఁ బ్రేయసిన్. ౫౧

(అని మూర్ఛిల్లుచున్నాఁడు).

కలకం—(తనలోఁ గన్నుల నీరు పెట్టుకొనుచు) మునుపు చూచినసంక్షోభము గూడఁ దత్ప్రయుక్తమే.

నవ—హా! ప్రియసఖీ! మల్లికా! నన్నుఁ బలుకరింపుము. (మొదలు నఱికినట్లు పడి పోవుచున్నది.)

కాలిం—హా! మాయదైవమా! స్వయముగాఁ బెంచినతీఁగను ఫలకాలమునఁ ద్రెంచి వేసితి వేమి? (నవమాలికను బట్టుకొనుచున్నది.)

రమ—అయ్యో! అదృష్టహీనురాలను నేను వచ్చుటచేతనే యీయనర్థము సంభవించినది. హా! సఖీ! మల్లికా! నన్నుఁ గూడఁ దీసికొని పొమ్ము. (అని పడిపోవుచున్నది.)

మధు—హా! కృతాంత! మల్లికామూలమున సమస్తబంధువర్గమును మరణ మొందినది. (అని పట్టుకొనుచున్నది.)

భ్రమ—హా! దేవేరి! యనాథ మయినదాసబృందము నుపేక్షించి యెందుఁ బోయితివి తల్లీ?

మారు—(తెలివిని బొందుచున్నాఁడు).

సార—(సాతిశోకముగాఁ దనలో) ఇది భగవతీయోగవిద్యాప్రభావ మని నేను దలంచెదను. (ప్రకాశముగా) మహాభాగా! అతిసంభ్రమము వలదు. భగవతిని జూచి సర్వమును జరిగింతము.

కలహం—సారసిక యుక్తముగాఁ జెప్పినది. మనము భగవతి నరయఁ బోదము.

మారు—(కన్నీటితో) మీ కందఱ కిష్ట మయినట్లే.

[అందఱు నిష్క్రమించుచున్నారు].

గద్య.

ఇది శ్రీపరమేశ్వరప్రసాదలబ్ధసరసకవితాధురంధర విజయనగరపురీవరస్థాపితాంధ్ర భారతీతీర్థసారస్వతపరిషద్విచక్షణసమర్పితకవిశేఖరబిరుద వడ్డాది సాధువంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితస గోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయ నామధేయాంధ్రీకృత మల్లికామారుత ప్రకరణంబునందు అష్టమాంకము.

శ్రీరస్తు

శ్రీపరమాత్మనేనమః

# ఆంధ్రమల్లికామారుతప్రకరణము

## నవమాంకము

(తరువాత సారసిక ప్రవేశించుచున్నది.)

సార—యోగవిద్యాపవానితబోధశక్తి యగుభగవతి, శాపోపస్థిత మయినమూర్ఛ వలనఁ గరణప్రజ్ఞ దూలినప్రియసఖిని దత్పల్లవతల్పమునుండి శీఘ్రముగఁ గాంచీ పురమును బొందించెనుగదా. అక్కడ శ్రీకామాక్షీప్రసాదలబ్ధ మయినసీమంత మణి తాఁకినంతమాత్రమున నిర్ధూతమోహ యయి యామె శీఘ్రకాలముననే మరలఁ బ్రత్యాగతయు నయ్యెడును. (అనుతాపముతో) మారుతుఁడు మాత్ర మెన్నెన్నో యమంగళములను శంకించుకొనుచు బహువిధముల నా చేత నివారితుఁ డయ్యును, మణికూటతటంబులఁ గలకంఠసహాయుఁ డయి శోకపర్యాకులభావం బునఁ దిరుగులాడుచున్నాఁడు. నవమాలికాప్రభృతిసఖీజనము గూడ నాప్రదేశ ములయందే యున్నది. (ఉచ్ఛ్వాసముతో) ఇటు మీఁదట వారలకు వ్యసనము ముహూర్తమాత్రమె. ఇప్పుడు భగవతి కాంచీపురమునుండి వచ్చిన దయి, యిట నాశ్రమమున మారుతునియు నితరులయు దుఃఖమును మన్ముఖమున విని, యాయోగవిద్యాప్రభావముననే మల్లికను మణికూటమునకుఁ గొనివచ్చినది. నేను నపత్యశోకవిహ్వల మయినయమాత్యవిశ్వవసుకుటుంబకము నూఱడించెదను. (ఆకాశమునఁ జూచి) ఆహా! తమాలజాలస్నిగ్ధజలధరపరిణాహకబళితాంబరా భోగ మయి, దర్శనమాత్రమున విరహిజనులకు నాయుఃక్షయమును గావించెడు ప్రావృట్కాలము ప్రవర్తిల్లినదే. కాఁబట్టి యీవిరహము ముహూర్తమాత్రమే యయినను, మారుతునకు మహావ్యసనకర మని శంకించెదను.

(నిష్క్రమించుచున్నది. ప్రవేశకము.)

(తరువాత మారుతుఁడు కలకంఠుఁడు ప్రవేశించుచున్నారు).

కలకం—(సకరుణముగా.)

చ. పటుతరవిక్రమంబులు నుపాయము లాఱడివోఁ, జలంబుపై
నిటు విధిప్రాతికూల్యము ప్రవృద్ధిని గాంచుట, నించుకేని యూ

అట గన, కొఱటంపుఁ బెనుఱంపమునం దెగి ధైర్య మెల్ల, మి
క్కుట మగుకుందుగుండమునఁ గూలితి మే మకటా! దటాలునన్. ౧

మారు—(సకరుణముగా నిట్టూర్పుతో) హా! ప్రియురాలా! యెట్టియవస్థను బొందినదానవు!

తే. అంగభవసార్వభౌమసన్మంగళవిత। మాల్యమధురత్వదాస్యేందు మగువ చూపు;
కనవె యంధంభవిష్ణు సకలకరణుని। నంధతమసంబునం బడ్డయాత్మదాను. ౨

కల—అయ్యో! భగవతియు నెట కేగెనో తెలియఁబడ కున్నది. (ఇంచుక యుచ్ఛ్వాసముతో)

క. పనివడి భగవతి నెమకుట । కను నాశయె మనకు నిప్పు డవలంబ మగున్,
బెనులోఁతునూతఁ బడిపో । యిన నరులకుఁ దరిని నిలుచుతృణవల్లివలెన్. 3

మారు—

శా. హా! యేమాయెఁ ద్వదీయదాసుపయి నీ కాప్రేమ మో మల్లికా?
హా! యెట్లీ వశరణ్యు వీడి చని తెం దాత్మేచ్ఛ? నాప్రాణమా!
పోయెన్ ధైర్యము; పొందె నామతి భ్రమంబున్; మిత్రుఁ బృచ్ఛింపు; త
న్వీ! యీయంజలి ఫాలిఁ జేర్తు; నుడితేనెం జిల్కు మిం తీచెవిన్. ౪

(బాష్పాతిశయముతో) ఒడిలోనున్నదానవే, యెట్లు పోయితివి?

చ. తలఁతును దద్భవత్పృథునితంబభరాలసయానమున్, బ్రియా!
చెలిసరసోక్తి నాబిడెముచే బెడఁ గౌనలపిన్ననవ్వుఁ, దా
రలచలనంబుచేతను దరంగితమున్ వలితాంతకంధరం
బగు సవిలాసమంథరదయాంచితవీక్షితమున్ ద్వదీయ మేన్. ౫

కల—(తనలో) అయ్యో! యేయుపాయమున వయస్యుని మఱపింతును?

మారు—(సకరుణముగా నేడ్చుచు)

శా. ఓశృంగార! రసాధిరాజ! కరుణంబో హాస్యమో రైతమో;
నాశం బొందె మదం, బనంగ! చౌరు సన్యస్తాస్త్రతం గాన; క్షో
ణీ! శీర్ణం బయి పోయెనే, త్రిదివమున్ గెల్పించునీభూషయున్;
మీకష్టోరుతపఃఫలంబు సమసెన్ విశ్వాత్ములారా! విధిన్. ౬

(నిట్టూర్పు విడిచి) మారుతునియందుఁ బ్రేమ గలమల్లికా! యకాలమున నన్నేల పరిత్యజించితివి? నాయం దేమి తప్పు కనిపెట్టితివి? (విమర్శించి) కాదు. తెలిసినది.

తే. అతివ! యనవద్యహృద్య మవ్యాజవిభ్ర।మంబు నమ్లానచంపకాభంబు నైన
యంగమున, నానిమిత్త మనంగరుజను।దడవ నుభవించుటను గిన్క పొడమె నీకు.

(ఉపాలంభముతో) అట్లయిన నీదర్శనము మొద, అనితరసాధారణ మయినవాయవస్థను నీ వెఱుఁగనిదానవా?

ఉ. కోరిక నీరొలుం గనుచుఁ, గోయిలకూజిత మాలకించెదన్;
నైరవపంక్తి నీనయనకాంతిని దీర్ఘికఁ గాంచి పొంగెదన్;
జేరుదు నే, గృహోపవనసీమ సకోరకచారుబాలమం
దారలతన్, దరస్మితయుతన్ నినుఁ గాఁ దలపోసి; ప్రేయసీ! ౮

ఇంతియకాదు.

చ. నినుఁ గన, నెప్పపాటును గణించును దృష్టి, దృఢార్గళంబుగా;
వనిత! త్వదాఖ్యవర్ణములె పల్కు రసజ్ఞ, వచోంతరంబులన్;
మనసున నేను నిన్ గలయ, మామకవక్షము, హారముల్ ఘన
స్తనపరిరంభణవ్యవధిదానకఠోరము లంచు నెంచెడున్. ౯

(ఆకాశమున) మందాకినీ! నీ వయినను జూడవేమి? కారణము తెలిసినది.

ఉ. ప్రాణముకంటె నెక్కుడుప్రియన్, మృత గాఁగ నెఱింగి మల్లికన్,
దానను బుట్టుశోకముకతంబున నిస్స్పృహ నైచు మేన, యో
గానలమందు ధారణబలాధికతం జనియించుదానఁ, గ
న్గోనలనీరు చుఙ్గనఁగఁ గుమ్మరిలం, బసుమంబ వై తయో. ౧౦

కల—అయ్యో! ఎంతకష్టము!

చ. అడుగుజగానఁ గూలితివొ; యంత్రితు లైతివొ కారకంబునన్;
బడితివొ మిత్తివాత; బడబాశిఖిధూమములోన నుంటివో;
కడిఁదితమంబునన్ మునిఁగి, కార్యము దోఁపక, పెద్దయేటిలో
నడిసుడిగుండమందలితృణంబుల నై భ్రమియింతు వయ్యెరా. ౧౧

(మారుతునిఁ గూర్చి) మిత్రుఁడా! మనస్సును గుదురుపఱుపుము. ఆపదల ధైర్యమునఁ జెదరిపోవునని వినఁబడునుగదా!

మారు—(నిట్టూర్పు విడిచి)

ఉ. ఏను బ్రవాళశయ్యను శయింపఁగఁ బో ,,వల దార్యపుత్ర! హా!
మానుము సాహసం" బనుచు, మందుచు నశ్రులు, వేగఁ గంకణ

ధ్యానములోఁ డివాస్తమునఁ బట్టెఁ బటాంచలమ్; మట్టి ప్రేమసం
స్థానముఁ బాసి యంకగత, ధైర్యము నెట్లు వహింతు? నో సఖా! ౧౨

మఱియు నమ్మందారమూలమందే—

మ. పరపాణిగ్రహణం బెఱింగి, యసువుల్ పాయంగ మది గోరి; నన్
బరిరంభం బొనరించి, నెచ్చెలి యటన్ భావంబునన్, బ్రేమతోఁ
దరుణీరత్న మశంకితంబుగ మనస్తాపం బటుల్ గద్గదా
క్షరయై తెల్పును నేడ్చె; వింటిగద తత్సర్వంబు నీవున్ సఖా! ౧౩

(ఆవేగమును నటించుచు) అయ్యయో!

మ. శరణద్వారము లంధకార మెదియో గప్పెన్; భ్రమించున్ మనం
బురుమోహంబున; నాదుజీవితము నయ్యో! నష్టమై పోయెనున్;
బరితాపం బెదొ యంతకాలదహనప్రాయంబు నే నంతటన్
విరియం బాఱెదు; నేమి చేయుదు? సఖా! విధ్వస్తచేతస్కుఁడన్. ౧౪

కల—(తనలో) అయ్యో! వయస్యుని మఱియొకవంకకు మరలింపఁ జాలకున్నాను. కాని. ఈతోఁటకరితతిరామణీయకమును గనఁబఱచుచు నించుక వినోదముఁ గావించెదను. (ప్రకాశముగా) సఖుఁడా! యీసమయము సర్వార్తిహారము. చూడుము.

తే. అనిలసంప్రేరితంబులు నైంద్రచాప । మండితములుఁ దటిన్నటీతాండవైక
రంగమండపము లివె, నిరంధ్రనీర । దంబులు, తమాలరుచి నంబరంబు గప్పె. ౧౫

సఖుఁడా! చూడుము. చూడుము.

చ. కలితము లౌశిలీంధ్రములకచ్ఛల నూఁగెడు తేఁటిదాఁటులన్,
జలధరసంచయంబునను, జాల మలీమస మైనవ్యోమమున్,
జెలఁగుచుఁ గాంచుపల్లెలకృషీవలనారులయుచ్ఛలాక్షులన్
జెలు వగువాసరంబు లివి, జీవులకున్ ముద మావహించెడున్. ౧౬

(అంతటను జూచి)

తే. చలుల గిరులను గార్మబ్బు లుఱుమునంత । విచ్చెడువిమారధారిణి వింతగొలుపు
కాననము, లిటఁ గుటజసుగంధముఱము । లలరఁ జేయుత సఖుఁడ! నీయుక్తియుగము.

ఇంతియకాదు.

మ. మన సౌకర్య మొనర్చు. వా స్తికరసంస్ఫాలంబులం జెమ్మగి
ల్లిన వామున్, నవవారిముక్ఛకలపాళీవేష్టితాద్రిస్థలుల్,

జనితానందమయూరనాదచకితోచ్చైర్వల్మికాళీపత
ద్ఘనభోగిస్ఫుటనూత్నరత్నరుచిచిత్రద్యోతదిగ్భాగముల్. ౧౮

ఉ. తుమ్మెదదిమ్ము ప్రవాహములఁదమ్మునఁ గప్పవడం, గదంబజా
లమ్మట నాపదాగ్రముకుళమ్ముఁ గదల్చుచు, నెమ్మిగుంపు పిం
ఛమ్ములు విప్పి నాట్యములు సల్పఁగఁ జేయుచు, సర్వలోకతా
పమ్ము హరించునీపయర ప్రాచ్యము సేవ్యము నీకు మిత్రమా!. ౧౯

మారు—(అంతటను జూచి సావేగముగ) మిత్రుఁడా! ప్రియావియుక్తుఁ డయి
దిఙ్మూఢుఁ డయినవానికి నీ ప్రావృడారంభ మున్మాదావతారము గదా?

చ. జలదగభీరగర్జలకు స్వాంతము బెగ్గడిలంగ, ముగ్ధనా
రులు దమయంత గుబ్బలను గ్రుచ్చి కవుంగిటఁ జేర్చు కాముకుల్
బలుముద మొందువేళఁ, బ్రచలాకులకేకల నార్చుచున్ మరుం
డలుకను గూరు కోరునఁ, బ్రియారహితుండు మనంగలం డెటుల్? ౨౦

చ. జలదసమీపలోలముల సారసపక్షుల నింగి నార్చుచున్,
గలఁచుచుఁ జాతకుల్ దనియఁగా మిగు లావడగండ్లధారలన్,
బలియుచు వెల్లచెక్కుటను బాణి గదించువియోగినీజనం
బులనిడుపూర్పులన్, మలయుపూర్వమరుత్తుల కోర్వ వచ్చునే? ౨౧

(ఆకాశమును జూచి సకరుణముగా) హా! ప్రియురాలా!

ఉ. కాంచనకర్ణికారరుచిఁ గాదనఁ జాలెడు నీదు మైజిగిం,
జంచలనేత్ర! యొక్కపరి చక్కఁగఁ జూపఁగ రాదె? మల్లికా!
మించినకాంతిగర్వమున మిన్నున నిట్టటు సంచరించు నీ
మించులు, మోము వాంచుకొని మేఘములం ద్యజియించి పాఱఁగన్. ౨౨

(ముందు చూచి)

చ. అళులు కదంబకుట్మలములం దవె; (సకరుణముగా) హా! చికురంబులార!
(వేళ్ళాకవంకఁ జూచి) వె
న్నెలపులుఁగుల్ వనాళి హవణిల్లెడు; (కన్నీటితో) హా! కనులార! (వేఱు
వలనఁ జూచి) యొల్లచో
వలరెకుఁ దావిమాలతులు; (శోకముతో) హా! దరహాసమ! (ఒండుచోఁ
గాంచి) శాద్వలంబులం
దల మెఱు నింద్రగోపములు; హా! విలసన్మధురోష్ఠబింబమా!. ౨౩

(మూర్ఛిల్లుచున్నాఁడు.)

కలకం—(సకరుణముగా) ఛీ! కృతాంత! కేవల మింతనిష్ఠురుఁడ వయితివేమి? (కన్నీళ్లతో) హా! యెంతకష్టము!

తే. ఇప్పుడును శతధా వ్రయ్యవేమొ? మనస! । వజ్రసారమ! నేనెపో బహుళకినుఁడ ;
మోహమున శరద్దళము మిత్రముఖకమలముఁ । గనియు నెప్పటియట్టు లమనుచునంటి.

కటకటా! జలధరారంభమును వర్ణించుమనుదుర్మార్గుఁడను నేనే దీనికిఁ గారణమయితిని. (ఆకాశమును జూచి)

క. విరద! విరద! మారుత! । మారుత! హా! మన్మథుండవు? మన్మథుఁడా! జో
హారి నిది మీ కందఱకును । గోయుము నేఁ బ్రాణభిక్షఁ గూర్మిసఖునకున్. ౨౫

మారు—(తెలివిఁ బొందుచున్నాఁడు.)

కల—(ఉచ్ఛ్వాసముతో)

ఆ. అలకించి నాదుప్రార్థన మే తెంచి । పేరిసామ్యమునకొ మారుతుండు
స్నేహరసము వెల్లఁ జిలికి చైతన్యంబు । మరలఁ గలుగఁజేసె మారుతునకు.

మారు—(ఉన్మాదముతో)

శా. కానన్ రమ్య మి దేప్రదేశమొకో! తద్గాత్రవిన్యస్తంబంబె కా;
నే నెవ్వాఁడనొ బాష్పకీర్ణముఖుఁడన్? నే మారుతుండం గదా!
ప్రాణం గారణ మేమొ బాష్ప? మెందొ సంభూతంబు దుఃఖం; బదే
మీ? నా ప్రేయసిఁ గోలుపోయితిఁ గదా! మేణీదృశన్ మల్లికన్. ౨౬

కల—(సావేగముగా) ఏమిది? యున్మాదమువలె నున్నది

మారు—ఇప్పు డీవనమందే వెదకెదను (సత్వరముగా లేచి పఱవుచున్నాఁడు)

కల—నిజముగా నే మారుతుఁ డున్మాదకాలసర్పముచేత దష్టుఁ డయినాఁడు. కఠినుఁడా! కలకంఠుఁడా! యింకను నీవు బ్రదికి యున్నావేమిరా?

మారు—(అంతటను జూచి) కటకటా! సర్వతోరమణీయము లగునీప్రదేశముల యందు నెందుగా నెందు వెదకుదును? (చేతితోఁ జూపుచు) రక్తకదంబగుచ్ఛలాంఛనము లగునీకచ్ఛములయందా మెయునికి యసంభావ్యమే.

తే. ఇచట నీకొండజాల్దరియనుకతిన్న । నంచనడలను బ్రియ సంచరించు నేని,
జఘనభారాలసలీలచరణచంక్ర । మణభవము వింటు మంజీరరణిత మేను. ౨౭

కల—అయ్యో! ఉన్మాదము పరమావధి నారోహించినది తథావిధ మయిన యామె నాశమును మఱచిపోయి వెదుక పోవుచున్నాఁడు కాని. నేను నితని ననుసరించెదను.

మార—(చెవియొగ్గి సంతోషముతో) మిత్రుఁడా! పరాకు గాక కుడిదిక్కున చెవి యొగ్గుము.

చ. వనగజదానసంగతి సువాసన లీనుకరంగపంక్తికే
చినతరుపాళి మాటువడి, చెంగటఁ దోఁచుమధుంగుపెద్దరిక
వినిరొద, గోటితోఁ దెనకువీణియతీవియపంచమస్వరం
బనఁదగు నస్ఫుటాక్షరము హాయిగ నా కలకంఠివాక్యముల్. ౨౯

(సోపాలంభముతో)

తే. తలఁప నతిఘోరశోకదీనులను మమ్మఁ, । జెలుల సాశ్రుకృతప్రలాపములు విడిచి,
తామరసకోమలాంఘ్రి నాతరుణి యెట్లు । గిరితటంబున జరియించు హరిణియట్లు?

కల—(తనలో) అయ్యో! వయస్యుఁడు కోకిలాస్వరమును విని భ్రమపడుచున్నాఁడు. (ప్రకాశముగా) ఇది మల్లికాసల్లాపము కాదు.

క. పండినజంబూఫలమును । దుండమునం గొఱుకుపికవధూకుహూ విని, మి
త్రుండ! సఖివాక్కుగా; ది । ట్టుందువె యది? దానఁ దేనె లుట్టుం గాదే. ౩౧

మార—(విషాదముతో) ఏమి? యిది పికవధూకూజితమా? (మరలఁ జెవి యొగ్గి) ఔరా! సాదృశ్యరాహిత్యము స్పష్టమగుచున్నను, నా వీనులు భ్రాంతి నొందుచున్నవి.

క. రా లయినను గరఁగింపఁగఁ, । జాలుటఁ బ్రత్యక్షరమును శ్రవణామృత మా
నాలలనయనిందితమధు । రాలాపం, బేల నాకు నతిపరుష మగున్? ౩౨

(నిట్టూర్పుతో) ప్రియతమావృత్తాంతము నే నెవరిముఖమునఁ దెలిసికోఁ గలను? (చూచి కౌతుకముతో)

తే. మేనితళ్కు లెసఁగ మీలు మిట్టఁ, జలించు । చిఱుతతరఁగచాలు చెన్నుమీఱ
వఱలు నెదుర, నిదిగో వనదేవతావగా । హప్రపూత మమల మయినహ్రదము.

దీని నిప్పు డడిగెదను. (సమీపించి)

ఆ. నీజలంబులందు నిమ్ననాభిహ్రద । దానమాడ దిగెనొ నా నెలంత?
యామె బెళుకుఁగనులు హ్రదమ! నీయలలలో । నీఁతలాడ్పఁ జొమ్మెలాఁతిమీల.

(చెవియొగ్గి) ఏమీ? బదులు పలుకక యూరకున్నది. స్నానమాడ దిగి, లోఁతునీళ్లలో మునిఁగిపోయి యుండును. ఆయప్రియమును జెప్పఁ జాలక మిన్నకున్నదని తలఁచెదను. (చూచి సావేగముగ) మిత్రుఁడా! అయ్యో! యెంతప్రమాదము! ప్రేయసి నిజముగానే నీళ్లలో మునిఁగిపోయినది. అది మునకఁ దెలుపుచు నున్నది.

చ. మును పువుఁబోణి కానుకగఁ బుచ్చినమాల గ్రహించి, యామె కే
ననిచినమౌక్తికంపుసరహారము, తత్కృతినోరు నిస్తుల
స్తనయుగళీ స్మరామయరుజాపరిపాండుర మైనదానఁ, దా
వనికముఁ దాల్చి సౌఖ్యపడినట్టి దయో! ప్రియ చిహ్న మింగికిన్. 31

(మరలఁ జూచి ససంభ్రమముగా) మిత్రుఁడా! మునిఁగిపోలేదు. ఇప్పుడు మునుఁగుచున్నది.

తే. ఇందుబింబవిరోధి, మహేంద్రనీల । రమ్యతాచౌర్యచణచికురప్రపంచ
మకట! యాకంఠమగ్నదేహాయగుమగువ। యాననము మాత్రజలకంపమానమదిగో.

(బిగ్గరగా) ప్రియురాలా! భయపడకు. ఇదిగో! నేను బయికిఁ దీసెదను

కల—(తనలో) అయ్యో! ప్రియవయస్యుఁ డంతటను సదృశవస్తువులయందు భ్రాంతి నొందుచున్నాఁడు. (ప్రకాశముగా) సఖుఁడా! నీ వాకర్ణాంతవిశాలనేత్రుఁడవు గదా? ఏమి? యీభ్రాంతి?

మార—ఇదియు భ్రాంతియే—(పరిశీలించి - విషాదముతో)

ఉ. హారము గాదు, మానసవిహారముకై దివిఁ బాఱెడుం బ్రవా
ళారుణచంచుపాదముల నంచలబారిది; చంచరీకముల్
ఝో రొదసేయ, వీచికల లోలతఁ గాంచునవాబ్జ మిద్దియున్;
నీరదనీలకుంతలము నెచ్చెలిముద్దుమొగంబు గాదనూ. 32

కాఁబట్టి వేఱొకచోఁ జూచెదను. (నడచి సంతోషముతో) ప్రథమజలధరధారాసేకోచ్ఛ్వసితసురభిళకటకస్థలాలంకార మయినతమాలతరువుమూలమందు—

క. మదముకుళదపాంగం బయి । యిదిగో! మధుపింగలాక్షు మేనుఁగు, కరముం
రదమున నిడి, ఝుంరొదఁ ద్రోటి । గదలనిచెవి వినుచు నద్రిగతిఁ గనుపట్టున్.

దీని నడిగెదను (సమీపించి)

క. గిరిగవులనో, వనభువులనో, । ఝరిదరులనో, యస్మదీయజాయ, కటకటా!
కురరివలె నడలు చెటనేఁ । గరివర! నీకనులఁబడెనో కరుణం జెపుమా. 33

(సంతోషముతో) ఇది క్షణస్తంభితకర్ణతాళ మయి నావచనమును సాదరముగా వినుచున్నది. మఱియు నంతట నట్టువపిట్టలు తాండవింప, నుఱుమువలె గభీరమయినతనగర్జితంబున నాకుఁ బ్రతివచనము గూడ నిచ్చుచున్నది (సవినయముగా) గజరాజా! ఏమనుచున్నావు? ఆమెలక్షణము లెట్టివనియా?

మ. స్తనముల్ త్వత్సృథుకుంభబంధులు; నడల్ త్వద్యానతుల్యంబు, లో
యనుఁగా! తుండసమానముల్ తొడలు, లే దంతైనఁ గార్కశ్య; మో
యన! సానన్ మెఱుఁ గెక్కు మేల్పసిఁడిడాలద్దంపుఁ జెక్కిళ్లు, నీ
చినవాఁటల్ ములుకత్తుదంతపురుచిం జెన్నారు నేఁ డింతికిన్. ౪౦

(విమర్శించి విషాదముతో) ఏమీ? కనులు మూసికొని నాప్రార్థనమున కూరకున్నది. ఔరా! గజనిమీలిత మన నిట్టిదియే? (నిర్వేదముతో) హా! ఖలజనము దుర్లలితముగదా?

ఆ. అర్థిసంప్రయుక్త మైనయీప్రణయవా।క్యంబు వినఁడు; దుర్మదాంధుఁడితఁడు;
చివర కిట్టు లెట్టొ చెవి వేసికొన్నఁ, దా । నొసఁగు నేత్రమీలనోత్తరంబు

కాఁబట్టి మఱియొకరిని బ్రార్థించెదను (ఒకడుగు వేసి) ఇదిగో! స్పష్టముగాఁ దన యపరాధమును జూచి, ప్రణయకోపమునఁ జేరరానిదిగా నున్న ప్రేయసిని, ఖిన్నమతియయి మఱియొక గున్న యేనుఁ గనుసరించుచున్నది. (చిఱునవ్వుతో) ఇది

ఉ. మానవతాత్మయై, ప్రియుఁడు మక్కువ మాటికి నీయ, నందుకో
దానవసల్లకీకిసలయంబులఁ; గుంభము లంటఁ బోవ, హ
స్తానఁ గరంబు సీత్కృతి విదల్చుఁగ; బల్మిన గోఁకనీక క,
న్నాననముల్ మరల్చుకొను; హా స్త్రీ యొల్లమి లాలనంబులన్. ౪౧

కాఁబట్టి యిక్కడ నాప్రార్థనశ్రమ మనుచితము. (మఱియొకవంకఁ జూచి) ఇదిగోఁ! దనచంచలనేత్రప్రభచేత దిఙ్ముఖముల నిందీవరంబు లుప్పతిల్లంజేయు హరిణీబృంద మిక్కడ నిలుచున్నది కాఁబట్టి దీనియుం దొరకదాని నడిగెదను. స్త్రీలవృత్తాంతము స్త్రీలకే విశేషముగాఁ దెలియఁగలదు. (చూచి) తనగుంపు చెదరిపోవుచున్నను, నాప్రార్థనమును వినుటకయి తాను మాత్రము కదలకున్నది. అదికాదు.

ఆ. మెడను వెనుమఱించి మిగులఁ బ్రేమను దన । వంకఁ జూచుచుండ జింక, పఱవఁ
జాల కెగిరి కూలుపాలకందును గంచు, । నదిగో! దుర్గమాద్రి హరిణి నిలుచు.

(విమర్శించి) కాతరస్నిగ్ధ మయినదీనిచూ పతిలోభనీయముగా నున్నది. ఇక్కడి పర్వతకందరలతామందిరములందుం దెందేసి యుండి, నాపక్ష్మలాక్షి వీనికి విద్యఁ గఱపెడు నని తలంచెదను. (నిశ్చయించుకొని)

ఆ. విపినహరిణులకును బెదరుఁజూపులు నేర్పఁ । బోలు నాదుమల్లి కాలతాంగి;
లోకమందు శిష్యలోకగుణము గాంచి, । గురునిగుణము దెలిసికొంద్రు బుధులు

దీని నడిగెదను. (కొంచెము సమీపించి)

క. నాచంచలాక్షి, హరిణీ! । యేచాడ్పు నలంకరించె నెఱిఁగింపు మికన్?
మీచకితనయనచాతురి । కాచార్యక మొనరిచినది యా మెయి కాదా?. ౪౫

ఏమీ యుత్తర మీయకయే పిల్లలతో వెడలి పోవుచున్నది? దీని కీయనాదరణమున కేమి కారణము? నా ప్రియురాలితోడి సంఘర్షమా? (సవితర్కముగా.)

క. లోలాక్షినయనచాతురిఁ । జాలఁ గలచి హరిణి యేల స్పర్ధ వహించెన్?
(విమర్శించి నిశ్చయించుకొని)
బాలాముఖిపుఁ, దక్కు-లమాలి । భజింపఁగద విధుని; మర్మము దెలిసెన్. ౪౬

వీనిని నిందించెదను. ఓహరిణాంగనలారా! మల్లికాలోచనసౌభాగ్యసర్వస్వహారిణుల మయితిమని మీరు గర్వపడ కుండుఁడు.

తే. కలచితిరి కాంతవలనను గాతరత్వ । పక్ష్మలతలును, స్నిగ్ధభావము, విపులత
యను విశేషంబు లొకకొన్ని; యయిన నేర । వెరవు లేనివి సుండి తద్విభ్రమములు.

కల—(సకరుణముగా) అయ్యో! మిత్రుఁ డున్మాదము తుది మెట్టు నధిష్ఠించి యున్నవాఁడు. తిర్యగ్జంతువులను గూడఁ బ్రార్థించుచున్నాఁడు. అచేతనములతోఁ గూడ మాటలాడుచున్నాఁడు. అయ్యో! నాకు మాతునియాళి యింత వలకే. ఛీ! నా జీవితము. ప్రియసుహృదుఁ డిట్టియవస్థ నుండఁగఁ దాను సహింపకున్నది. (సోపాలంభముగా)

చ. అవురవురా యోరి కీవు పరమాప్తము ప్రాణము కంటె, నట్లు నీ
కౌఁ దగు నీవు నెక్కఁడ దగునిట్టుకు; హా! యితఁ డీవిసంబునన్
మివుల విలాపముల్ మతి భ్రమించి యొనర్చుచు నుండఁ జూచుచున్,
జివురక యెంతకాలము వసించెదవే యిటు మూఢజీవమా? ౪౭

(మాతునిఁ జూచి) హా! చూడ నాకు జాలి యగుచున్నది.

చ. అడవిమృగాలవెంటఁ బడి యాచన సేయుఁగ, నవ్వి యేమియున్
నుడువమి నుత్తరంబుల, ననూనవిషాదత వెచ్చ నూర్చుచున్,
బడుగయి శోకతాపములపాలయి, కన్నులఁ గాఱునీరునం
దడిసిన మోముతో నకట! దైన్యమునం గెలికాఁడు ద్రిమ్మరున్. ౪౮

(ఆక్రందముతో నాకాశమున)

తే. మల్లికా! యోల చెలి! దయ మాలి? తకట! । మునుపు వికసితమంథరముగ్ధమధుర
హైఁసిచూపు, లటు లబ్జముఁ దుఁ బోలె । వ్రాలు మోమిప్డు కను, బాష్పవారిధరము.

మహా—అయ్యో! ఏమి చేయుదును? ప్రియతమురాలివృత్తాంతము దెలుపువా రెవ్వరును గానఁబడరే (దైన్యముతో) కాని. మరల వెదకెదను. అనిర్వేదమే శ్రేయస్సునకుఁ బరమహేతు వని వినఁబడుచున్నదిగదా! (మఱియొకడుగు వేసి కౌతుకముతో)

చ. జలజలమంచుఁ దొట్రిలుచు, జాంబవకుంజములందుఁ బాఱుపే
రలగభీరసింధుపటులన్ ముదితద్విజగానవాద్యలన్,
గలితమనోజతాపశిఖఁ గ్రాఁగెడునన్ను దపుంబడంతిచె
క్కిలులను బోలుపాండురుచి గేదఁగి తేఁకదె విచ్చు మెచ్చుగన్. ౫౧

(సాభిప్రాయముగా)

చ. అమలిన మైనశుభ్రరుచి నవ్వారె విచ్చినకేసరాళితాం
తముకొన యొరు, ఖేలనవిధాప్రచలన్మధుమత్తభృంగమై,
తమి నటు నన్ను మున్ గనినతామరసాక్షివిలాసభావినే
త్రముఁ దలఁపించు నత్తఱిని, బ్రాంతవిలోలవిశాలతారమున్. ౫౨

కాఁబట్టి విశిష్టగంధప్రియు మయునయాభృంగరాజమును నే నడిగెదను. (ఎదుట నిలఁబడి)

క. తిరిగెడు వని, నెటనే మధు । కర! నామదిరాక్షి నీకుఁ గానంబడెనా?
ధర నున్నఁ, బారిజాతపుఁ । బరిమళ మీపొందు దామె వదనము సోఁకన్. ౫౩

ఏమిది? నన్నాదరింపక గర్వముతో గానము చేయుచున్నది. కాని. ప్రియురాలి కడకంటిచూపును స్మరింపఁజేయుదీనియెడల నే ననూయపడను. (ఒకడుగు వేసి) ఇదిగో! నిక్కడ నిరక్తకదంబమునఁ బూలగుత్తులు విశ్రమించియున్నను వేఁడోకఁ డీకొదమతుమ్మెద, చిగురాకుమీఁద శయనించిన దేమి చెప్పుమా! (పరిశీలించి సానుకంపముగా)

ఉ. ధారగ జాఱుమన్న నవిసంబున, నానదు లేక, మంజుఝుం
కార మొనర్ప, దల్లబలఁగంబులతోడను గూడిమాడమున్,
మారుతనీత మైనకుసుమంబులతావికి మోద మొందఁ, దా
రా! రమణీవియోగజనితార్తిభరంబున నిమిలిందమున్. ౫౪

దీనిని నే నడుగను (పరిశీలించి సంతోషముతో) చేరువ నున్నకదళీకుసుమము నుండి విరహాపీడితాంగి యయి యీభృంగి రాఁగా నే—

తే. దయితఁ బ్రత్యాగతను సప్రణయ మనస్వి । భ్రమరరాజము గని యనర్గళపుఁ బ్రేమ
మునను గౌఁగిటఁ జేర్చుచు ముద్దులాడు । గాన మొనరించు హర్షించుఁ గను మతిమతి.

ఇది చూచి నిన్నటి రేయటివృత్తాంతమును నేను స్మరించుచున్నాను. ఆసమయమున—

ఆ. తలిరుసెజ్జ నత్తమిలిననాకడ కిట్టె । హంసయాన వచ్చె; నయిన నేమి?
(మరలఁ దలంచుకొని యాక్రందనముతో)
అయ్యో! తత్క్షణంబ యామె కిందీవర । ములను బోలెఁ గనులు మూఁత వడియె.

కళ—అయ్యో! యింతదనుక నున్మాదతిరోహిత మయినపూర్వసంస్కారము సదృశసందర్శనమువలన మరల నుద్బుద్ధ మగుచున్నది.

మారు—ఛీ! నాప్రమాదము. నేనున్మత్తుఁడ నయి, తాదృశవృత్తాంతనిష్ఠుర భావమును మఱచి యడవిలోఁ దిరుగుచుఁ గాలక్షేపము చేయుచున్నాను. (ఆకాశముఁ జూచి) హా! ప్రియురాలా! మల్లికా! నన్ను విడిచి నీ వొక్కతె వెట్లు స్వర్గ మారోహించితివి?

చ. అమరనదీతటంబున విహారము నిద్దఱముం బొనర్త మో
సమదగజేంద్రయాన! నిముసం బడుగుల్ మెలమెల్ల వేయుమా;
విమలము లైనపేటల వెన్కకు ముందఱ కూఁగునట్టి వా
కమలజు లేరివార్యములు గాంచుత నీగమనప్రకారముల్. ౫౩

అక్కడ

చ. ప్రవిమలజాహ్నవీకనకపంకజగంధిజలావగాహులై
స్రవదమరద్రుపుష్పమకరందము తావిని గుప్పుచున్, శచీ
కువలయలోచనాకుటిలకుంతలముల్ చలియింప వీచు స్వః
పవనకిశోరముల్, సుముఖి! స్వాగత మిచ్చి నినున్ భజించుతన్. ౫౪

(సవితర్కముగా) అహా! విశిష్టగుణము గల్గుట గూడ నొక్కొక్కయెడ ననిష్టావాప్తికి కారణ మగుచుండును గదా! (ఆకాశమున) ఓమల్లికా! నందనవనోపకంఠసంచారము చేయుచున్న నిన్నుఁ గూర్చి నే నించుక వచించెదను.

ఉ. సుందరి! కల్పవృక్షములఁ జూడ జనించెడు కౌతుకంబునన్
నందనసద్వనాంతరమునం బ్రియ! యెత్తకుమీ ముఖాబ్జ; మిం
దిందిరముల్ భవత్సురభినిశ్వసితంబుల మూర్కొనంగ ని
ష్యందిమరందమంజరుల నవ్వలఁ ద్రోచి పయిం బడుం జుమీ. ౫౫

కల—ఇది మఱియొకమాదిరియున్మాదము.

మారు—ప్రియురాలా! పూర్వము చూచి యుండవిప్రదేశమందు నొంటరిదాన, నే నెట్లు నీ కొఱకుఁ బ్రతీక్షింపఁగల నని నీమనస్సున ఖేద మొందఁ దగదు.

చ. మొగము మరల్చి, మాటికిని మద్దియ! నీవు మదాగమోచితం
బగుపథమందుఁ గన్నిడి, యంబుధికన్యవలెన్ నిలంబడన్,
మిగుల వెలంగుఁ బ్రేముడియు నెమ్మదులం బొదలన్, మరాంగనల్
తెగ లయి నిర్నిమేష మగుదృష్టుల నిన్గనుఁగొందు రందఱున్. ౭౦

చ. చెలి! యెటనుండి వచ్చితివి? చెప్పుము యెవ్వనికాంత వీవు? లో
నలుకకు; నీకుఁ గేళిసఖు లందఱమున్; సమయోచిత మైనయీ
నెలవునకల్పవృక్షముల నెయ్యమునన్ గన వచ్చినట్టి శ్రీ
లలనవొ? యైన, మమ్మును దలంపు సహోదరు లంచు నంద్రు నిన్. ౭౧

పెక్కు లేల? ఇవి మొదలుగా మరలమరలఁ గౌతుకమున వారు నిన్నడుగుచుండఁగా, లజ్జచే నీవు గద్గదస్వరమున నిందుక పలుకఁ బోవుచున్నంతలో, వేగముగా నేను వచ్చి కలసికొని, వారికిఁ జక్కఁగఁ బ్రత్యుత్తర మిచ్చెదను. (అంతటను జూచి సంభ్రమముతో) భూపృష్ఠమాత్రగోచర మయినయీదేహమును నే నెట్లు విడిచి ప్రియతమురాలిసమీపమునకుఁ బోఁగలను.

కల—(సాశోకముగా) అయ్యో! హతవిధీ! యేమి యీయారంభము? నీయాలోచన మేమి? ఈయున్మాదము నెట్లుగాఁ బరిణమింపఁజేసెదవు? (అంజలిబంధముతో) భగవానుఁడా! కుసుమధన్వుఁడ! రెండియుఁ దొంటియున్మాదమునకే మరలింపుము. అట్లయిన పనిపని నన్వేషించుఁగాని, ప్రియునయస్యుఁ డీమాదిరియున్మత్తప్రలాపముల నారంభింపకుండును.

మారు—(చెవి యొగ్గి సంతోషముతో) అహో! యింతదనుకఁ బ్రియతమురాలిని బాసి బ్రదికి యున్నందుకు నాయందుఁ గోపగించి దేవుఁడు మకరకేతనుఁడే నాకనుకూలుఁ డయి ప్రవర్తించుచున్నాఁడు. ఇదిగో! నితఁడు.—

తే. గొనయ మారోపణమొనర్చి గనయమందు।మాటి కాస్ఫాలనము సల్పుమరుఁడువిల్లు;
దెసల మార్మ్రోఁత లెసఁగంగఁదీవ్రమగుచుఁ।గర్ణములఁ బడుఁదారటంకారమిపుడు.

కల—అయ్యో! మధుకరఝంకారమును మౌర్వీటంకార మనుకొనుచున్నాఁడు.

మారు—ఈయనను నేను ద్వరపెట్టెదను. (ప్రార్థనముతో)

ఉ. ఏనిట నే దమోఘమని యెంతువొ, చక్కఁ బరీక్షఁజేసి నా
పై వద రేమి, వేగముగఁ బ్రాణము లైదిటె నొక్కసారిగా
స్థానములం ద్యజించునటు సల్పఁగదయ్య దయామయుండ! యో
మానశయుండ; కూరుపరు కూరు లలుం గిరుమాలు సింగిణీ. ౬౩

(స్మరణ మభినయించి) అయ్యో! లోకాంతరమును బొందుచున్న నేను బ్రియ మిత్రుఁడయిన కలకంఠునిఁ గౌఁగిలించుకొని చెప్పిపో వలదా? హా! సఖా! కలకంఠ! నన్ను విడిచి యెటఁ బోయితివి?

కల—(బాష్పముతో)

ఉ. తావక పాదపార్శ్వమును దాఁటి యెటుం జన నేను; మిత్రమా!

మార—(అది వినకయే) వాకదపటిమాట యిది యాలకింపుము (అని వెంటనే మూర్ఛిల్లుచున్నాఁడు.)

కల—(సత్వరముగా దగ్గఱి)

ఉ. క్రేవనె యుంటి; వాక్యము ముగింపు; సగం బనియూరకుంటివే?

(విమర్శించి సావేగముగా)

ఉ. ఈవె గదయ్య చెల్మి గణియింపక తెంపున వేఱు చేసి న
న్నీవసుధం ద్యజించి దివి కేగ తకొండమూనఁదు మిత్రమా! ౬౪

(అని పట్టుకొని) హా! ప్రియవయస్యా! మారుతా! యశరణ్యుని నన్నుఁ బాడుము. హా! మకరాంకుఁడా! నృశంసుఁడా! నన్నతఁ డట్లు ప్రార్థించెనుగదా! యని వయస్యుని ప్రాణము హరించితివా? ఓచోరుఁడా! నీవలె నీబాణములును గావ రాకున్నవే. అవి యలక్షితపతనము లగుచునే శరీరులను మరణము నొందించుచున్నవి. (శీతలోపచారములు గావించుచుఁ బరిశీలించి చూచి) అయ్యో! మందభాగ్యుఁడను నేను జచ్చితిని. ఇప్పటికి నివ్వదనము నిర్వికారమే (కన్నీళ్లతో)

తే. అక్కటా! యరాళకుంతలం బత్యుదార । భాషితంబు సితాంబుజపత్రదీర్ఘ
నేత్రమానః బూర్ణిమాచంద్రనిభము మంద । హాసయుత,మా మొగం బెయ్యాయాసనఁబు.

(లతటను జూచి) హా! భూధరనితంబవనవాసిను లగువనదేవతలారా! రక్షింపుఁడు. రక్షింపుఁడు.

తే. లలితకిలికించితస్మితాదు లగుముగ్ధ । మల్లికావిభ్రమంబుల నల్లనిలకె
నిడిచె భువిఁ గలకంఠలలితనిబంధ । నము, సమస్తభువనమంగళ మగుజనము. [illegible]

సఖా! మారుతా! స్వర్గస్థుఁడ వయిననీవు నాకొఱకుఁ జిరకాలము ప్రతీక్షింప నక్కఱలేదు.

తే. అలసింపను నే నల్ప మైన సఖుఁడ! । నీదుపృథగవస్థితిఁ బెంగ నే వెలుఁగుదు;
స్వర్గమున నున్న, మల్లిక నూన నున్న, । నొద్ద లేకున్నఁ గలఁకఁదుఁ, డోర్వఁగలనె?

అమరలోకాలంకారభూతు లయినమీయిరువురకు నావలనఁ గూడఁ గొంత ప్రయోజన మున్నది.

చ. కురులను దాలుపన్, సరులు గ్రుచ్చుచు గల్పకగాలిపూలను; న
త్తరులయివుల్లఁ గేళిపుష్పతల్పము నింపెసఁగన్ రచింపుదున్;
సురనదిపైఁడితామరలనూత్నదళమ్ములు ద్రుంచి తెచ్చి, తె
మ్మెర మెలమెల్లనన్ గొమరుమేనుల సోఁకఁగ వీతు నే; సఖా! ౬౭

(స్నేహముతోఁ గౌఁగిలించుకొని) మారుతా! హా!

చ. వికటమణీకవాటసమువిభ్రమమున్, మనసార మామకాం
గకముల సార కేను బిగికౌఁగిటఁ జేర్చను నీమువక్షమున్;
ప్రకటము గాఁగ నీకు ననురాగము మల్లిక యిడ్డమాపెక
ల్పకకుసుమదామపుంబరిమళం బెడఁబాయదు దీన నిప్పుడున్. ౬౮

హా! జగన్నయనచంద్ర! హా! గౌరీప్రసాదలబ్ధ! హా! కులతంతూ! హా! కలకంఠజీవితేశ! హా! మల్లికావిలాసప్రబంధలాలితా! (అవిశదవర్ణముగా విలపించుచు మూర్ఛిల్లుచున్నాఁడు) (తరువాత సబాష్పవదనలయి నవమాలికయు, రమయంతికయుఁ, గాళిందియుఁ బ్రవేశించుచున్నారు.)

అందఱు—హా! సఖీజనమును బ్రాణసమానముగాఁ జూచుదానా! మల్లికా! మాకుఁ బ్రతివచన మిమ్ము. వికటమానచంపకదళపరిమళరమణీయ మయి వనితలకుఁ గూడ మన్మథవికారమును గలిగించుభవదీయతారుణ్యశరీరయష్టి యెట్టిదైవదుర్విపాకమునకు లోనయ్యెనే? హా! నిర్భాగ్య! మారుత! నీవు గూడ మల్లికావియోగ మెట్లు సహించుచున్నవాఁడవు! ఆమెనిమిత్తము కంఠచ్ఛేదసాహసమునకుఁగూడఁ గృతసన్నాహుఁడ వయితివిగదా!

వన—అయ్యో! నవమాలికతోడిక్షణవిరహ మయినను సహింప లేనిదానవుగదా! నన్నెట్టు లుపేక్షించితివి! నవమాలికకేమి? భవదీయజీవితనిబంధనమునకయి వివిధప్రకారముల వెలుఁగెత్తి కరుణాక్రందుఁ డగుచున్నమారుతున కేనియు దర్శన మిమ్ము.

ఉ. పున్నమచందమామరుచిఁ బోల్చు, దరస్మితరోచి సాంద్రమై,
కన్నులవిల్తునద్దముల కైవడిచెక్కుల వెల్లఁబాటు, దె
ల్ప న్నిజరాగసంపద, నపాంగవిలాసములం దనర్చు నీ
ప్రసన్ననిమోము, లోఁ దలఁప, బగ్గున మండు మనం బయో సఖీ! ౩౦

(ఆకాశమువైపు చూచి) సఖురాలా! నన్నుఁ బాసి క్షణ మయిన భూలోకమున నవమాలిక వర్తించు నని తలంపకుము. ఈనిముసముననే నన్ను నీపార్శ్వమున నున్నదానినిగాఁ జూచుకొమ్ము. అప్సరసలనడుమఁ బరిజనరహిత వయి నీ వెట్లుండఁ గలవు?

కాళింది—హా! సఖీ! క్షణమాత్రములో నే స్మర్తవ్య వయి పోయితివిగదా! హా! భగవతీ! నీవు గూడ మల్లికనే యనుగమించితి వని తలంచెదను. హా! మహాభాగ! మారుత! కలకంఠమాత్రసహాయుఁడ వయి నీవు గూడ నెటఁ బోయితివి?

రమ—అయ్యో! మందభాగినీ! రమయంతికా! నీసంగమమే యీసర్వానర్థములకు మూల మయ్యెను. దేని కేది ప్రథమభావి దాని కది కారణ మని విందుముగదా!

కాళిం—సఖులారా! మహాభాగు నయిన నీకాననమున నన్వేషింతము.

అందఱు—హా! మహాభాగా! నీ వయిన దర్శన మిమ్ము. (సమీపించుచున్నారు. మారుతకలకంఠులను జూచి సంభ్రమముతో నేడ్చుచు) అయ్యో! దంభోళిఖండితములయిన కల్పవృక్షములవలె వీ రిరువురు నేలఁ గూలి యున్నారే!. (రొమ్ములు మోఁదుకొనుచు నేలఁ బడుచున్నారు) తరువాత నవమాలికాకాళిందులు మారుతకలకంఠులఁ బట్టుకొని) సఖీ! సఖీ! రమయంతికా! వీరు మూర్ఛితులే యయినారు. కొఁబట్టి జలధరవారికణతారకిత మయినయీలతాపల్లవపింఛమున విసరుము.

రమ—(కన్నీటితో విసరుచున్నది)

కల—(తెలివి నొంది విషాదముతో) ఛీ! వయస్యునిఁ గలసికొనక నేను మరలి వచ్చితిని. (చూచి తనలో) అయ్యో! వీరు గూడ వచ్చినారే. (ప్రకాశముగ) హా! సఖీ! నవమాలికా! హా! సఖీ! కాళిందీ! మారుతునియవస్థను జూడుఁడీ. ఇతఁడు.

క. అగపడుమృగముల ఖగముల । నగముల నడుగుచు, వనంబునం దిరుగుచు, నె
వ్వగ మల్లిక నెటఁ గానక । మిగుల నలసి, మిత్రుఁ డత్తమిల్లెఁగా మెల్లఁగా. ౩౧

(రమయంతికను జూచి) మద్దరా లీమెయు లజ్జాశోకపరవశ యయి నిశ్శబ్దముగ నేడ్చుచున్నది. (నిర్వేదముతో)

క. కావరుఁ డగునాతనిచే । రావడి పడుచున్న నన్ను, రమయంతిక హా!
దావమున దగ్ధ మగుతఱిఁ । దీవియవలె నెనసి, యీగతిని శోషిల్లన్. ౪౨

(మారుతునిఁ జూచి) ఆహా! వయస్యునివదనము నిర్వికారముగానే కనుపట్టుచున్నది. (సత్వరముగ లేచి) వయస్యా! యిదిగో! నేను వచ్చుచున్నాను. (పరిక్రమించి క్రిందుచూచి) ఈగిరినితంబప్రపాత మనయనగాహ్యతలముగా నున్నది.

తే. ఎగుడుదిగు డయి పెద పెద్దరాళ్ళుఁగులను । బోలుగండోపలములసమూహ మున్న
యిచటి యీకొండచఱిపెలరేటితోడఁ। గూడ నుతికి వేగము సఖుఁగూడుకొనెద.

(అందఱు సంభ్రమముతో సమీపించి కలకంఠుని వెనుకకుఁ ద్రోసి) ముందుగా మేమే యిందుఁ గూలెదము.

నవ—సఖీ! మల్లికా! మహాభాగ! మారుతా! జన్మాంతరమందుఁ గూడ నేను మీకే పరిచారిక నయ్యెదను. (పడఁబోవుచున్నది.)

కల—(అంతటను జూచి ససంభ్రమాకూతముగా) నవమాలికా! పడకుపడకు. తొల్లిటి యపూర్వసంక్షోభమువలె నున్నది.

ఉ. ఛాదితమేఘునుద్ధరవిసద్రుచిశేషము దృష్టిరోధకం
బై దెసలన్ గ్రసించెను భయానక మద్భుతగోచరంబు నై;
యేదిరయె. తేజమో తమమొ యీయుభయోపహతప్రకాశమో,
రోదసి దీప్యమానముఁ దిరోహితముం బొనరించెడున్ గదున్. ౪౩

(అష్టమాంకములోని 47 వ పద్యము, కొంచెము మార్చి, చదువుచున్నాఁడు)

(తరువాత నవమాలిక చేయూఁత గొని శిఖామణీభూషిత యయి మల్లిక ప్రవేశించుచున్నది.)

మల్లి—సఖీ! పడకు. పడకు. (అని నవమాలికను నివారించుచున్నది.)

అందఱు—(హర్షముతోను విస్మయముతోను మల్లికను గాఢాలింగనము చేసికొని గద్గదస్వరముతో) సఖీ! నిజముగా మరల వచ్చితివా?

కల—(హర్షముతో) అదృష్టవశమున దైవముచే ననుగ్రహింపఁ బడితిమి. ఇది మూర్ఛితునకు సంజ్ఞాలాభము; అంధకారపతితున కర్కదర్శనము; అంగారకబళితున కమృతాసారమునుగదా!

మల్లి—(కన్నీళ్లతో) సఖులారా! ఆర్యపుత్రుఁ డెక్కడ?

తక్కటివారు—సఖీ! యవిజ్ఞాతతత్త్వంబు నద్భుతతమంబు నయినతాదృశభవదదర్శనంబునఁ దత్తృష్ణాసంజాతమోహోన్మాదపరవశుఁడయి కాననంబుల నందందు నిన్ను వెదకివెదకి యదిగో! నాలతామూలమున మూర్ఛిల్లి మరలఁ దెలివినొందక పడి యున్నాఁడు.

మల్లి—(కన్నీళ్లతో) హా! ఆర్యపుత్రా! (అందఱతోఁ గూడ సమీపించుచున్నది.)

తక్కటివారు—(కనఁబడుచున్నారు)

మల్లిక—(అవిధముగా నున్నమారుతునిఁ జూచి) అయ్యో! యదృష్టహీనురాలను. నేను జచ్చితినిగదా! హా! నాథా! ప్రత్యాగతురాల నయిననన్నుఁ జూడుము. (నఱకఁబడినట్లు క్రిందఁ గూలుచున్నది)

తక్కటివారు—(భూతలము దాఁకకుండఁ జేతులతో నొక్కసారిగాఁ బట్టుకొని) సఖీ! వెఱవకు. వెఱవకు ఈతఁడు కేవలము మూర్ఛితుఁడు. కావున నమృతశీతల మయినకరస్పర్శనమున వేగముగాఁ దెలివి నొందింపుము.

మల్లి—(సగద్గదముగా) సఖులారా! వేవేగ మూర్ఛాహర మగుమణిని నాశిఖాబంధమునుండి తీసి యార్యపుత్రునియంగముఁ దాఁకింపుఁడు.

తక్కటివారు—(జనాంతికముగా) మనము మణిని దాఁకింప వలదు. ప్రియసఖీకరస్పర్శముననే మహాభాగుఁడు దెలివిగొందుఁ గాక! (ప్రకాశముగా) సఖీ! యేతాదృశములు వేయిమణు లయిన, నీయనమూర్ఛను దీర్పఁజాలవు కాని రక్తోత్పలకోమల మయినకరతలమున మహాభాగునిప్రత్యంగమును నీవు నిమిరితివేని, తోడనే తెలివి నొందఁ గలఁడు. ఇది యథార్థము.

కల—(సఖురాండ్రవచనము తాను నంగీకరించుచు)

ఆ. పట్టు మంగళములఁ బతిశరీరము; సఖి! । యితనిమేనఁ గదిన మిడకు మణిని;
నీయుదర్శనమునఁ బోయె నాతని తెవ్వి; । మానిపింప మూర్ఛ మందు నీవె.

మల్లి—(కన్నీళ్లతోను గగుర్పాటుతోను మారుతునిఁ దనయంకమున నిడుకొనుచున్నది.)

తక్కటివారు—(సశీకరము లయినచిగురుటాకులతో వీచుచున్నారు.)

మల్లి—(మారుతునిఁ జూచి) అయ్యో! ఆర్యపుత్రుఁ డిప్పటికిని దెలివి నొందకున్నాఁడు. (కలకంఠునిఁగూర్చి) మహాభాగా! నీవచనమున మిత్రునిఁ దేర్పుము. నీవు పిలిచినఁ స్వప్నమం దయిన నీయన మిన్నకుండఁడు గదా!

కాళి—ఓయి మారుతుఁడా!

క. విను మామెపలుకు; నీనుఁ । గనికరలకన్నుఁగవను గదలింపు; సబా
ష్పనయనఁ బ్రియుఁగను; మల్లికఁ । గనుచో నిమిషమును దలఁతుఁ గడియగ ననవే.

నవ—సఖీ! సఖీ! మహాభాగుఁ డెక్కుడుగ మూర్ఛిల్లినాఁడు. కాఁబట్టి క్షణమాత్రము కవుఁగిలించుకొమ్ము.

మల్లి—(సిగ్గుతోఁ దనలో) ఆర్యపుత్ర! మీ రందఱయెదుట నన్నేల సిగ్గుపఱిచెదు? నీపాదములతోడు. ఏకాంతమునఁ గౌఁగిలించుకొనెదను. లెమ్ము.

అందఱు—సఖీ! ప్రియతముఁడు తెలివి నొందిన, నీవు సిగ్గుపడియెదవు. ఇప్పుడే యొక్క కవుఁగిలింతఁ బ్రసాదింపుము.

మల్లి—(విధిలేక యంగీకరించుచున్నది. తనలో) ఆర్యపుత్రా! నిన్నటి ప్రొద్దుట సారసికాముఖమునఁ బ్రార్థిత మయినపరిరంభ మిప్పు డిచ్చుచున్నాను. (సిగ్గుతోడను వణఁకుతోడను సపులకముగాఁ గౌఁగిలించుచున్నది.)

మారు—(తెలివినంది తనలో)

తే. సకలగాత్రంబునకు ఘనసారచర్చ । చల్లఁదన మిచ్చినట్టియీస్పర్శమునను
మనమునఁ దలంతు, నేస్వర్గమునకునరిగి । ప్రియతమాలింగితుఁడనటనయితిననుచు.

(కన్నులు దెఱచి మల్లికను జూచి కవుఁగిలింతతోనే లేచి హర్షముతోను గద్గదస్వరముతోను) ఓప్రేయసీ! మల్లికా! పరలోకగత వయినను నిన్నదృష్టవశమునఁ గలసికొన్నవాఁడ నయితిని.

ఉ. ఏకత మీవు నాకమున కేగితి, లాఁతివిలాతి; కుల్కుతే?
నీకు సురాధిరాజరమణీమణు లైరె వయస్య లందఱున్?
శ్రీకరనందనద్రుమములనీడల వేడుకఁ గ్రీడ లాడితే?
సైకము నే విలంబనము సల్పినదానికిఁ గింకఁ బూనితే? ౩౩

కాళి—ఇప్పుడు గూడ నితనిహృదయము సోన్మాదశేషమే.

మల్లి—(తనలో) అయ్యో! న న్నార్యపుత్రుఁడు స్వర్గస్థురాలినిగాఁ దలంచుచున్నాఁడే. (హర్షశోకవివశురా లయి వక్షమునందే హత్తి యున్నది.)

మారు—(చెలికత్తెలఁ జూచి సంతోషముతో) సఖీ! నవమాలికా! సఖీ! కాళిందీ! మీరు గూడ వచ్చితిరిగదా. పుట్టినది మొదలు క్షణమాత్రమును మల్లిక. నెడఁబాయనిమీ రీమెను విడిచి యెట్లుండఁగలరు? (మరల హర్షముతో)

ఓహో! రమయంతికయు సఖుఁడు కలకంఠుఁడుఁ గూడ నిక్కడనే యున్నారే. సఖీ! రమయంతికా! నీకు స్వాగతము. (ఆనందముతో)

తే. నాదుబాంధవజనుల నందఱను నేఁడు । గలసికొంటినిగద; పూర్ణకాముఁడైతి;
నెనవిసన్నిధి నుండరో యిష్టజనులు,। నాక మైనను వానికి నారకంబె. ౩౭

కల—సఖుఁడా! యిది మణికూటశిఖరము గాని నాకము గాదు.

మారు—(హర్షాతిశయముతో నంతటను జూచి) సఖుఁడా! నీ వన్నమాట సత్యమే.

చ. ఇది పృథుధారిణీధరముశృంగము; గా దమరేంద్రుపట్న; మి
య్యది శుభతోయనిర్ఝరము; నాకతరంగిణి గాదు; సాంద్రమై
యొదిగిన కాననద్రుమము లియ్యవి; గా వలనందనద్రుముల్;
మదిఁ బరికించితిఁక, మనము మర్త్యుల మార్గము; గాము వేలుపుల్. ౩౮

(మల్లికను గౌఁగిలించుకొని) ప్రియురాలా! యిది యేమి?

మల్లి—ఆర్యపుత్ర! నే నట్టు లాపల్లవతల్పమున నతర్కితముగా మూర్ఛ నొందినదాన నయి, మరలఁ దెలివి నొంది, విదేశమున శిఖామణిభూషిత నయి, భగవతి యుత్సంగమునఁ గాన నయితిని. అప్పు డిది ద్రమిడదేశమున శ్రీకామాక్షీస్థానమగు కాంచీపుర మని భగవతి నాకుఁ దెలిపినది.

(అందఱును వింతపడుచున్నారు.)

మారు—భగవతి యిప్పు డెక్కడ నున్నది?

మల్లి—పిమ్మటఁ గాంచీపురమునుండి భగవతిని బట్టుకొని వేగముగా నిక్కడకు వచ్చినదాన నయి నవమాలిక కన్పింపఁ బడితిని. భగవతి మరల నాకగపడలేదు.

(మందాకిని ప్రవేశించి చిఱునవ్వుతో)

మందా—వత్సా! యదృష్టవశమున నవిపన్నమనోరథుఁడ వయితివి.

అందఱు—(హర్షవిస్మయములతో లేచి నమస్కరించుచున్నారు.)

మారు—అవాఙ్మనసగోచరప్రభావురాలా! భగవతీ! యీవృత్తాంతము సవిస్తరముగా వినఁ గోరుచున్నాను.

మందా—వత్సా! యీకథ మిగుల విపుల మయినది. కావున నది యిప్పు డనవసరము. విశ్వవసుప్రభృతులును స్కంధావారజనంబును దుఃఖపడుచుందురుగదా! కాఁబట్టి మనము వేగముగా నేగి వారి నూఱడింతము.

కల—ఇది యుక్తముగా నున్నది.

మారు—భగవతీ! నీయిష్టము. కలకంఠుఁడా! దారి చూపుము.

కల—ఇటు. ఇటు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

గద్య.

ఇది శ్రీ పరమేశ్వరప్రసాదలబ్ధసరసకవితాధురంధర విజయనగరపురీవరస్థాపితాంధ్ర
భారతీతీర్థసారస్వతపరిషద్విచక్షణసమర్పితకవిశేఖరబిరుద పెద్దాది
సాధువంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితస
గోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల
సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బరాయ
నామధేయాంధ్రీకృత మల్లికామారుత
ప్రకరణంబునందు నవమాంకము.



శ్రీరస్తు

శ్రీపరమాత్మనే నమః

# ఆంధ్రమల్లికామారుతప్రకరణము

## దశమాంకము

(తరువాత వైతాళికుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

వైతా—(హర్షముతోఁ బరిక్రమించుచు నంతటను జూచి) అదృష్టవశమున భగవతీ ప్రభావప్రత్యుజ్జీవితమల్లికాసఖుఁడు కుమారమారుతుఁడు మరల వచ్చుటచేత నున్మృష్టరథ్యంబు నుచ్చిత్రతోరణంబు నుత్తంభితకేతుజాలంబు నుచ్చలితగాణిక్యంబు నుద్ఘుంభితమంగళమృదంగంబు నుద్దామవందిబృందంబు నయి స్కంధావారపదం బఖిలంబు నుత్సవమయంబు గా నున్నది.

ఉ. సాధుభుజంగగాయనులసంగతి శోభిలుచందనాద్రి, వి
ద్యాధరసుందరీస్మితసుధాధవళంబు హిమాచలంబు, నం
భోధు, లినుండు సారె కట ముగ్గడుఁ దేలెదు, నవ్వె, మేర లా
ఽధర, సర్వదృక్కువలయేందుఁడు మారుతమంత్రి భాసిలున్. ౧

(అంతటను జూచి మరల హర్షముతో) ఇదిగో! 'మారుతభవనద్వారాంకణవితర్దికాపరిసరంబున విచిత్రాంబరమాల్యాంగరాగభూషణోష్ణీషధారు అయి నానాదిగంతరాగతు అగువందులు మారుతిసంబంధిగుణగణంబులను వర్ణించుచున్నారు కావున నేను గూడ వీ రందఱిలో నొక్కరుఁడ నయ్యెదను. (పరిక్రమించుచున్నాఁడు.— తెరలో) జయ జయ జగన్మంగళమాణిక్యదీప! మారుత!

చ. అలికల నంధ్రసుందరుల కా చెలగేదఁగి రేకు, పాండ్యభా
మలపెండ రెట్టి సేయు చురుమాత్రికభూషలు, గన్నడంపుఁగాం
తలకును వీనులం దగుచు దంతపుఁగమ్మలు, వియళంబు మి
క్కిలు, ఘనసారపత్రికలు కేరళనారుల కామఁ జెక్కులన్. ౨

(తెరలో)

ఉ. కొమ్మల దాఁగి నింగిపలుకుల్ గ వచించియు, మత్తుగొల్పి ప
ల్లొమ్మ మొగమ్ము డీకొలిపి, కూళతనమ్మున నీకు శత్రు వౌ

నమ్మ నిముచ్చు తంబరకుఁ దాత్మకృతమ్మిడ దుష్ఫలమ్ము, దే
శమ్ముఁ ద్యజించి సిగ్గువడి జాల్ముఁడు వాఁడెను నవ్వ నల్వురన్. 3

వైతా—(ఆలకించి సోపహాసముగా) పాఱిపోయె నని చెప్పెద రేల? కతిపయక్షణా
రోపితజామాతృశబ్దుఁ డతఁడు తమాలవిటపమున వ్రేలాడుచుఁ, గాత్యాయని
హేళనమునకు భీతి నొందెడుస్వపరిజనముచేతఁ గూడ నింతవఱకును గట్లు విప్పఁ
బడకయే యున్నవాఁడు. ఇప్పుడు మరల వచ్చినమందాకినియాజ్ఞచేతఁ ద్రోటిత
బంధనుం డయి, మహారాజాగారితో నయినఁ జెప్పకుండ పలాయితుఁడయినాఁడు.
(మరల నవ్వి) విదితసకలదుర్నయప్రపంచుఁ డయి కలవింకునికిఁ గలిగిన యిప్పటి
భ్రమరకచరణతాడనము గూడఁ దలఁచుకొనెను. (చూచి సాశంకముగా) కరత
లాందోళితకనకవేత్రలతుఁ డయి యీకంచుకి వందివర్గమున కేమో తెలుపు
చున్నాఁడు. (చెవి యొగ్గుచున్నాఁడు). (తెరలో) ఓహో! వందులారా!
మందరక్షుభితమహోదధికలకలగంభీర మయినకోలాహలంబునఁ బ్రపంచమును
జెవుడు పఱుపకుఁడు. మల్లికాసఖుఁడు కుమారమారుతుఁడు మందాకినీభగవతి
ముఖంబున నాకానాకవిచిత్రపుఁగథను వినుచున్నాఁడు. క్షణమాత్రము మీగోల
యుడిగింపుఁడు.

వైతా—(విని సకౌతుకముగా) ఆకథ యెట్టిదో విన నాహృదయము వేగిరపడు
చున్నది. కాని. సర్వముఁ దనంతటఁ దానే ప్రకటము కాఁగలదు. అంతః
పురమున జరిగిన దాపణాంబునఁ జాటఁబడు నని చెప్పనేరుగదా! నేను యథేచ్ఛ
ముగాఁ బోయెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాతఁ బటమండపమునఁ గూర్చుచుండి కలకంఠసఖుఁడు మారుతుఁడును,
సఖీపరివృత యయి రమయంతికతోఁ గూడ మల్లికయు, శిష్యారాంద్రతో
మందాకినియు విభవమునఁ బరివారజనంబును ప్రవేశించుచున్నారు.)

మారు—భగవతీ! సావధానుల మయి యున్నాము. కథఁ బ్రారంభింపుఁడు.

మందా—వత్సా! మారుత! యాలకింపుఁడు. సేతుబంధసీమంతితమహార్ణవవర్ణ్యమాన
రఘునాథవిక్రమం బగుదిక్కునందు—

ఉ. మందమరుచ్ఛిశుప్రసవమందిరగహ్వరచారిభోగిని
బృందశిరోవిభూషణసమిద్ధమణీగణకాంతిచిత్రమై
చెందయతో నగస్త్యముని ప్రేయసి తోయము వోయ, వృద్ధియౌ
చంధనసంతతిన్, మలయసంజ్ఞ మహాచలరాజ మొప్పెడున్. ౪

కల—ఈకథాప్రారంభము సావష్టంభముగా నున్నదే!

మారు—భగవతీ! యీపర్వతరాజము సుప్రసిద్ధము. (సశ్లాఘముగా)

చ. కలవు మహేంద్రముఖ్యము లగంబులు గొప్పవియే జగంబునన్;
మలయమహీధరంబు, మహిమంబున నన్నిటికన్న మిన్న యౌఁ;
గులగిరులం జయించుకుచకుంభములన్ గుణపక్షపాతినుల్
పొలఁతులు, చందనంబు మిషఁ బూనరె తద్యశమున్ విశుద్ధమున్? ౫

నవ—(జనాంతికముగా) సఖీ! మల్లికా! మలయాచలమిషంబున వనితాస్తనంబులు వర్ణితంబు లగుచున్నవి.

మల్లి—(నవ్వుచున్నది.)

మందా—

చ. ఆమలయాచలంబున నొకప్పుడు, కోయని గండుఁగోయిలల్
మామిడిలేఁజివుళ్లు దిని మత్తిలి కూయుచు నుండ, మన్మథ
స్వామికిఁ బ్రాణమిత్రుఁ డనఁ జాలినదక్షిణగంధవాహుఁడు, ద
య్యామనిశోభ లీలను విహార మొనర్చును మెల్లమెల్లగన్. ౬

మారు—తరువాత?

మందా—మహాత్ముల చరితంబులు స్వచ్ఛందహృద్యంబులు. అప్పుడు—

తే. గిరితటంబుల స్వేచ్ఛమైఁ దిరుగు చటులు।మరకతద్యుతి తను వొందె మాతరిశ్వుఁ;
డద్ది గనినంత వనదేవతాక్షియుగము।లయ్యె, సవిలాసములు సహర్షాశ్రువులును.

మారు—(కౌతుకముతో) తరువాత?

మందా—

తే. అంత ఫణిపతివాసుకిమంత్రి యగు । మణిధరుతనూజ మంజుల, మదనజయప
తాక వదనాబ్జగంధలుబ్ధభ్రమరక, ।యట సఖులుదానువనిఁ గన్య యాడుచుండె.

మారు—తరువాత?

మందా—

తే. జఘనమంథరగతి కుచక్రాంతమధ్య। సఖులతోఁ గోసికొనుచు వాసంతు లింతి,
పింఛతాపింఛరుచిరు నవిరళతాని ।కుంజసంచరు దేవుఁ గన్గొనియెఁ బవను. ౮

మారు—తరువాత?

మందా—ఉ. ఆకులకన్య మారవిశిఖావళిచేతను బీడ్యమానయై,
స్తోకనిమీలితాక్షులను జూచుచు వానిఁ గృశాంగి, సంగసా

ఖ్యాతలనంబు ధ్యానమున నాటను, దాలిచి చూలు. తత్క్షణం
బా శకుమారకుం గనిరి నాకులలోన, భయాకులాత్ములై. ౧౦

మారు—దేవతాగర్భములకు ధారణప్రసవములు రెండును నేకకాలమునందె గదా! తరువాత?

మందా—తరువాత భగవానుఁడు గంధవహుఁడు దానికన్యాత్వ మదూష్యముగా ననుగ్రహించి, యా మెతోడికన్నియలకుఁ గూడఁ దనవలన హృదయక్షోభము కలుగు నేమో యని, యక్కడనే యంతర్హితుఁ డయ్యెను. అంత నా మెయుఁ బుత్రవాత్సల్యమునఁ జన్నులు చేఁపుచున్నను, దండ్రివలనిభయంబున నా బాలుని లతాపల్లవతల్పమున నునిచి, తత్పాలనమునకయి వనదేవతలను బతిమాలుకొనుచు సబాష్పనయన యయి తనయింటికిఁ బోయెను.

మల్లి—(సదయముగా) అయ్యో! తల్లిదండ్రులు విడిచినయాపసికూన కయ్యరణ్యమున నెవరు దిక్కు?

మందా—అప్పుడు తత్పరిసరంబున నున్నకుంభసంభవభగవానుని యాశ్రమంబునుండి సమిదాహరణార్థ మేగుదెంచినమునిబాలకు లాబిడ్డ నెత్తికొని పోయి యమ్మహర్షికి సమర్పించిరి.

మారు—(సంతోషముతో) తరువాత?

మందా—

శా. పాలీయం దనయానురాగమున లోపాముద్ర చన్నేఁపి, యా
బాలుం డంత నగస్త్యమౌనివరక్లృప్తశ్రౌతసంస్కారుఁడై,
కాలానుక్రమశం బ్రవృద్ధి గనియెన్ గన్వింపుగా; ముద్దునన్
లాలింపన్ మునిభామినుల్ గొనుచుఁ గేలం గేల నప్పట్టునన్. ౧౧

మారు—ఆహా! తద్బాలకుఁ డెంతధన్యుఁడు? దుర్లంఘశాసనస్తంభితవికటవింధ్యాచలవిజృంభణుం డగుకుంభసంభవభగవానునిపాదోపకంఠంబును బొందినాఁడు. (సశ్లాఘముగా) భగవానుఁ డగునామునిచక్రవర్తిమహిమ వాగగోచరముగదా!

తే. హస్తపల్లవపుటమున నబ్ధితోడ । నాది నాచాంతుఁడై విష్ణు, వమ్మునిహృది
యంతకంటెను విస్తృతమనుచుఁ దలఁచి । యన్యరుచిమాని తిరముగా నటనెనిలిచె.

మల్లి—(కౌతుకముతో) భగవతీ! యాపసివానిబాల్యక్రీడితములను వినుట కభిలషించుచున్నాను.

మందా—అంత నాశిశువు దినదినప్రవర్ధమానుఁడయి—

తే. ముగ్ధకరపల్లవములను మూఁదుకొనుచు, । నలికమునఁ గుంతలము లటులటు చలింప,
మొలను బదములఁ గింకిణుల్ మొరయ, బుడుతఁ । డంకణంబున జానువులాని ప్రాఁకు.

తరువాతఁ గాలక్రమమున—

ఆ. కలభకర్ణములను నలువుచుఁ, గొదమసింగ । ముల జూలు వేడుకను బెఱుకుచు,
నాడుబుడుతఁ దిరుగు, రవినయా! వ్యాఘ్రబాధ । సేయుకనుచు మునులు స్నేహగరిమ.

మారు—(ఉత్కంఠతోఁ దనలో) ఏతత్కథాశ్రవణమువలన నాకేమో యౌత్సుక్యము పొడముచున్నది. (ప్రకాశముగా) తరువాత?

మందా—తరువాత నానాఁటికి—

ఉ. మారమతంగజంబునకు మైమఱపించెడుమత్తుమందు, శృం
గారరసాంబురాశి కధికంబుగఁ బొంగు ఘటించుచంద్రికా
పూరము, రాగపుండరీపురుపుంజముఁ బెంచువసంత, మంగనా
చారుకటాక్షసత్కృతము జవ్వన మొందెను బాలుఁ డవ్వలన్. ౧౫

కళ—(జనాంతికముగా) కాళిందీ! యేతత్కథాశ్రవణమున భర్తృదారికకెంత యాదరమో. చూడుచూడు.

మారు—తరువాత?

మందా—ఆశ్చర్యము. భగవానుఁడు విధాతృఁడతిదుర్ఘటములను గూడ సంఘటింప సమర్థుఁడుగదా! తరువాత నాతఁడొక్కనాఁడు మటజాంకణప్రరూఢ బాలచందనలతాపల్లవములతో సవయస్కులు కల్పించినట్టి ఘర్మచ్ఛిదతల్పమున శయనించినవాఁడయి—

మ. కని నొక్కర్తు నతండు, స్వర్ణకదళీగర్భాంగకచ్ఛాయ, నూ
తనసైరోరువిలాసయుక్తి, స్మరభృత్యశ్రేణిఁ గల్పించుచున్,
ఘనలజ్జావిలసత్కనీనిక కటాక్షశ్రీని సత్కారభా
జనుఁ దన్ జల్పెడుకామినీయకనిధిన్ స్వప్నానఁ గన్యామణిన్. ౧౬

మారు—(ఉత్కంఠతో) తరువాత?

మందా—

ఆ. అప్పు డతఁడు మందహాసాననుఁడు దన । చెంత కేగుదెంచు నింతిపైఁట
చేలచెఱఁగు లీలఁ గేలఁ బట్టెడునంతఁ । దరుణి నాల కనిచి తలఁగె నిద్ర. ౧౭

మల్లి—(అనుతాపముతోఁ దనలో) నిద్ర కామిజనప్రద్వేషిణిగదా! ప్రియజనసమాగమము స్వప్నలబ్ధముగాఁగా, నోర్వలేనిదానివలెఁ దత్క్షణమే తొలఁగి పోయినది. (ప్రకాశముగా) భగవతీ! యాతఁడు మేలుకొని యేమి చేసెను?

మందా—

ఉ. విగళితధైర్యుఁడై యతఁడు, వెండియు హా! ప్రియురాల! నాకు నీ
వగపడు మంచు జస్రమును నార్తవిలాపము లాచరించుచున్;
దెగ లయి నేను నేననుచుఁ దీవ్రముగా మెయి దాఁకుచున్న యా
ఖగముల కెల్ల, నొక్కరుఁడె మూటికి నయ్యె శరవ్యుఁ డయ్యెడన్. ౧౯

అందఱు—(ఖేదమును బొందుచున్నారు.)

మారు—తరువాత?

మందా—తరువాతఁ దండ్రి యయినపవమానునిచే సమర్పితు లయి, పాంసుక్రీడ మొదలుగా నాత్మానురూపశీలవిద్యాశౌర్యధైర్యంబులతోడ హృదయనిర్విశేషు లయి ప్రవర్తించెడువయస్యు లిరువురు, రహస్యమునఁ దన్నడుగఁగా, వారితోడ నామెలక్షణంబు లతఁడు వర్ణించి చెప్పెను.

మారు—ఏమని?

మందా—

తే. నవ్యకుంకుమపంకవర్ణంబు మేను; । రమ్యనీలాబ్జపత్రదీర్ఘములు కనులు
చాన మొగ మెన్నఁబున్నమచందమామ;। యాదుజాతినఖంబునూఁగారు చెలికి.

క. నీరదమున సౌదామని। తీరున మణి యొకటి మెఱయుఁ దెఱవశిరమునన్;
హారము కుచకుంభాలం। కారము, డిండీర మామె కాంతిలహరికిన్. ౨౦

కల—(జనాంతికముగా) సఖుఁడా! స్వప్నదృష్టకాంతను గామించెడు నయ్యువజనుని యిరువుర చెలికాండ్రయావేగ మూహింపఁగా, నిప్పుడు నాకుఁగూడ హృదయము విషాదము నొందు చున్నది.

మందా—

మ. కొలఁకుల్ రాజమరాళసంకులములున్, గుంజద్ద్విరేఫంబు లౌ
జలజాతాళిముల్, లతల్ వికచపుష్పవ్రాతముల్, వెన్నెలల్,
కలితానల్పమృణాళతల్పములునుం, గావయ్యె నయ్యింతిపైఁ
దలఁపుల్ జేయుచువానిమాన్మథుజాతాపంబు నే పాఁపఁగన్. ౨౧

మల్లి—(విషాదముతో) అయ్యో! కలిమిరుచే తెలియనికలలో నిక్కన్యను గామించు చున్నయతనికి నిఁక మీఁదట నేది యాదరువు?

మందా—పిమ్మట బహుళపక్షపాకరునివలె దినదినము క్షీణించుచున్న శరీరము గలవాఁడయి, యొకనాఁడు జాముప్రొద్దువేళఁ గొండవాఁగునొడ్డునందలి చందన పాదపచ్ఛాయను శీతలం బగుప్రదేశమునఁ గిసలయశిలిమంబునం దుపవిష్టుఁడయి, యరఁటిమొవ్వుటాకువీవనను జేతఁ బూని శోకవ్యాకులు లగుచున్న తనయుభయ వయస్యులచేత నుపాస్యమానుఁ డగుచు, వెలఁకఁబాఱిన దీనవదనంబు కరతలంబున నిడుకొని నిశ్వసించుచు, బాష్పమంథర మగుదృష్టితో యాదృచ్ఛ నట్టె యాకసము నవలోకించెను. అప్పు డక్కడ—

తే. అణిముత్యాలవలెఁ దెల్ల నైనకనులుఁ, । దూండ్లు గలచినయొట్టినిత్రోటిపుటులుఁ
గలిగి, హిమరుగ్వళక్షపక్షముల, మింట । నరుగు రాయంచ బాయ నవ్విరహి గాంచె.

మారు—(కౌతుకముతో) తరువాత?

మందా—

తే. అంగు నొకహంస బిసకాండమనెడుభ్రాంతి । నెట్టెటో ముక్కునను బట్టి యెగురుచుండ,
జాఱిపడె దారి రయమునఁ, జంద్రకిరణ । ధవళ, మొకహార మాతనితలిమమునను.

కల—(నవ్వి) దైవము మేలుచేసెను. మృణాళభ్రాంతిచేత రాయంచ చంచూపుటము దానిని గేవలము ఖేదముకొఱకే పూన నయ్యెను.

మారు—(చిఱునవ్వుతో) తరువాత?

మందా—తరువాతఁ గ్రిందఁ బడఁగానే దానిని విస్మయహర్షోత్ఫుల్లనయనుఁ డయి చేతను గ్రహియించి సఖునితో నిట్లనెను.

ఉ. ఔర! స్పృశించుమాత్రన మదంగకముల్ పులకింపఁ జేయు; నీ
హారము, స్వప్నదృష్ట యగునమ్మదిరాక్షి ధరించినట్టిదే;
చారుసితేతరాంశుకముసంగతి, నాలలితాంగితుంగవ
క్షోరుహపాళిఁ గప్పు? నిదిగో! సరమందు మసార మానవాల్. ౨౮

కల—(సవిత్కరముగా) ఇందువలన నట్టికన్య యొక్కడనేని కల దని వాయ దలంచు కొన నగును.

మల్లి—(తనస్తనాగ్రమండలిహారమును విలోకించి తనలో) ఆర్యపుత్రుఁ డొసంగిన యీహారమునఁదుమఁ గూడ నింద్రనీలమణి యున్నదే?

మందా—అనంతర మాహారలతను గంఠమున ధరించి, దానిని దనప్రియతమురాలి
పరిరంభముగా భావించుకొనుచు, నామె నన్వేషించుటకయి యుత్సాహమును
బూని, సంజాతప్రత్యాశు లగుతనవయస్యులతోఁ గూడఁ గలిసి, సిగ్గువలన భగ
వానుఁ డగుకుంభసంభవమహర్షితోఁ జెప్పకయే యాకాశమార్గమున నుత్తరదిక్కు
నకుఁ బయన మయ్యెను.

మారు—అది యుక్తమే. హంస లేదిక్కునుండి వచ్చినవో యాదిక్కునకే పోవలెను.

మందా—అట్లు పోవుచుండఁగా—

తే. తరళహారచ్ఛవిచ్ఛటాచ్ఛురితగగన । తలుని రాకాహిమాంశుసుందరుని, నమర
తరుణు లాశ్చర్యనిశ్చలతాంకేక్ష । ణముల వీక్షించి రతని నానందగరిమ. ౨౭

మారు—తరువాత ?

మందా—

తే. సంతతనిమజ్జదమరయోషాస్తనోరు । శాతకుంభకుంభస్థలస్ఖలనజర్జ
రితమహోర్మిమాలను, సప్తఋషినిషేవి । తప్రతీర స్వర్ణదిఁ గాంచె నందు దనరియు.

మారు—తరువాత ?

మందా—అక్కడఁ గల్పవృక్షములచేరువను—

చ. చలనమునఁగా సుమస్తనుమసౌరభ మెల్లెడ వెల్లిగొల్పన
మ్మలయమరుత్తుపుత్రకుని మన్మథమోహను జూచి యానతుఁడా,
దళముగ డెందమం దలరి నందనదేవత, న్రమ మైనత
ద్గళమునఁ దేజి చిందువిరిదామము నవ్యము వెట్టెఁ బ్రేముడిన్. ౨౯

మారు—(తనవక్షమునందలిమల్లికాదత్తమాలిక నాలోకించుచున్నాఁడు.)

మందా—

తే. దానినెత్తావి రేఁగి యంతటను ముసరు । భసలతతి, యమునాఝరీభ్రాంతిఁగొలుప,
నతఁడు గంధర్వగీతిమోహితకురంగ । సమూదయముఁ జేరె మిన్నంటుహిమనగంబు.

మారు—తరువాత ?

మందా—తరువాతఁ దత్పర్వతనితంబస్ఖలితం బగుమందాకినీసింధువునుపకూలంబున
నున్మదవిద్యాధరవదనాంబుజగండూషశీధుసేకవికస్వరకేసరంబును, గోమలకంకేళి
తాడనసన్నద్ధకిన్నరకామినీపాటలచరణాంబుజ జల్పాకమణితులాకోటిమధుర ని
క్వాణ ఝుళంఝుళిషణోషారంబును, గర్వితగంధర్వాలవాతుంగకుచకలశాలింగన

పులకితకురవకంబు, నుద్భ్రాంతభృంగపటలసంఘటితకపటాంబుదసందర్శనతాండవితశిఖండిమండలమండితకనకకదళీమండపంబు, నర్ధయోజనవిస్తృతంబు, నగునారామంబుఁ బ్రవేశించి—

తే. అగ్రసన్నద్ధలిఖితసింహాంకచీన । పటసముత్తుంగకాంచనధ్వజవిరాజి,
యంబికాలయసౌధ, ముదాత్తకీర్తి । కనియెఁ గైలాసకూటసంకాశ మతఁడు —

మారు—(తనలో) ఈప్రదేశము పూర్వము నేను జూచినట్లున్నది. (ప్రకాశముగా) తరువాత?

మందా—తరువాత నచ్చోటి కేఁగి, యంబికాచరణములకు నమస్కరించి యయ్యెడ నున్నమంటపైకదేశమునందలి పటికంపుఁదిన్నియపయిని గూర్చుండియుండిన యొకానొకమహానుభావురాలిని—

సీ. ఇడకుఁ బింగళకును నడిమి కౌనాడిపర్వశ్రేణి గూఢమై పరఁగుదాని,
విమలహృదయారవిందంబునందు సువ్యక్తమై తెలియంగఁ బడెడుదాని,
నంతరాయోపసర్గానుపహతములై నియమస్థిరత్వముల్ నెగడుబుద్ధి
స్వాత్మ వీక్షించుచు, స్వానందవారాశిమగ్నయై పూర్ణసమాధియందు
నున్నవర్ణినిఁ, బులకసంఛన్నదేహ; । శాంతగంభీరవేష, విస్మయయుతాత్మఁ
దగుచు నొకసిద్ధయోగ, నత్యంతవినయవినమితశిరస్కుఁడై యటఁ గనియె నతఁడు.

మారు—తరువాత?

మందా—తరువాత నామె సంతోషమున లేచి, తనకు స్వాగత మిచ్చి చిరపరిచితురాలివలె సంభావింప, క్షణ మటఁ గూరుచుండి చెవి యొగ్గి, యచ్చేరువ లతామండపమున నవిచ్ఛిన్నంబులను ద్రుతమధ్యవిలంబితంబులు నగు కంకణక్వణితంబుల నతఁ డాలకించెను.

రమ—(జనాంతికముగా) సఖీ! మల్లికా! యీకథ కర్ణరసాయనముగా నున్నదే!

మల్లి—సఖీ! యీకథాశ్రవణమున నాహృదయమున కేమో గాని యౌత్సుక్యము కలుగుచున్నది.

మందా—తరువాత నావర్ణిని "మహాభాగా! యదృష్టమున నీవీప్రదేశము సాదరముగా నలంకరించితివి; మంజుగిరికటకప్రత్యాగత అయినగంధర్వయువతులచేత వర్ణింపఁబడుచుందువు. ఇక్కడ విమలయశోరాశివితానితప్రపంచుఁడును, విద్యాధరామాత్యచక్రవర్తియు నగువిశ్వావసునకు, విలాసలావణ్యమయి యొకకన్నియ

గలదు. పెక్కు లేల? హంసచే నుపహృతంబగు నేయువతీహార మిది, మహాభాగుని పక్షంబు సంభావించినదో యామె, నేఁడు కృత్తిక యని, యీ నేరువలతాభవనమున భవానీదేవిని కందుకక్రీడచే నారాధించుచున్నది. భూషణధ్వని వినంబడుచున్నదిగదా? మనముఁ గూడఁ బోయి చూత"మని యాయోగిని వచింపఁగా. హర్ష విస్మయస్తిమితమానసుఁ డయి, యామె స్వయముగాఁ గనంబఱచెడు మార్గంబున నెచ్చెలులతోఁ గూడ నచ్చోటికి విచ్చేసెను.

మారు—(సంతోషముతో) ఔరా! యదృష్టము. గగనలతను గామించువానికి దాని కలిమి సత్యమయ్యెను తరువాత?

మందా—

తే. చామరకలాపవీటీవ్యజనమణీక । లాచిభృంగారశుకదుకూలములు గేలఁ
దాల్చి, యాత్మావలోకోత్కంఠావితాక్షు । లైనపరివారనారుల నరిగి కాంచె. 31

చ. కను మటు నేత్రపర్వ మనఁగాఁ దను పర్ణ ని, భూషణధ్వనుల్
వినఁబడునద్దెసం గనులు వే మరలన్, సుషమాసుధారసం
బును గురియించున తరుణిఁ, బూఁబోఁడిపంట, నవీనసిరిదం
బునను మెఱుంగుఁదీవియను బోలె నతం డెలమిం గనుంగొనెన్. 32

మారు—(సోత్కంఠముగా) తరువాత?

మందా—తరువాతఁ ద్రిభువనవిజయసమయమున మకరకేతనునకు విరించనుఁ డొసంగి నది, సర్గాభ్యాసపాటవశంసిని, యగువాస్తోపాయనపుత్రికలాగునఁ గానవచ్చెడు వామించుఁబోణి, వివిధవిరచితచాతురీవిశేషంబుగ నారబ్ధవిభ్రమభ్రమివేగ ప్రశిథిలబంధధమ్మిల్లపాతితమాల్యకులంబుగ నాలోలదీర్ఘలోచనోత్పలవిషయీకృతపతితోత్పతితకందుకతాడనారుణకరకమలపల్లవితపురోభాగంబుగ నవనమనోన్నమనవేపితఘనస్తనకుంభత్రుటితకంచుకీకంబుగ ననుక్షణశంకితభంగముగ్ధమధ్యలతంబుగ నంకురితఘర్మకణికాసంఘుతరంగితకోమలధవళదుకూలంబుగ నిబిరీసనితంబబింబవాచాలకాంచీకలాపంబుగ నరుణాంఘ్రిపల్లవనిష్ఠ్యూతయావకలాంఛితమణికుట్టిమంబుగ నఖిలసఖీమండలవిహిత వివిధమార్గంబుగ సంజనితవ్రీడంబుగఁ గ్రీడసల్పెను.

మారు—తరువాత?

మందా—తరువాత నతఁడు సత్వరముగ నట సమీపించి, విస్మృతనిమేషంబు లయిన నయనంబులతో నామెసౌందర్యము నానువాఁడునుం బోలెఁ గనుపట్టుచు, రహస్యమునఁ దన్నడిగిన చెలికాండ్రతో నిట్లు పలికెను.

క. వదన మదే, నయనము లవె యదె భ్రూ, వదె గళము, నదియె యరుణాధర, మ
య్యదియే కుచకుంభయుగం, బదె జఘనం, బవ్వె పదము, లమ్మాదిత యిదే. 33

అని మఱియుఁ దదవస్థాదర్శనద్విగుణితమన్మథవికారుం డయి వెండియు నే
కాంతమున వారలతో నిట్లనెను.

తే. ఝుళఝుళత్కంకణతను, సంచలితకుచతఁ, జపలనయనోత్పలతఁ, జలాచలచికురత
ప్రస్తకర్ణావతంసత, శ్రమజలాళికత, నడుచు నింతి నాహృదిఁ; గాదు బంతి. అని 3౪

మారు—(జనాంతికముగా) సఖుఁడా! కలకంఠుఁడా! ద్వీపాంతరగతుఁ డగుచిత్ర
కారుని చేత హిమగిరిలతాగృహంబున మల్లిక గూడఁ గందుకక్రీడాఖిన్నగ లిఖిత
యయినదిగదా! (ప్రకాశముగా) తరువాత?

మందా—అటు తరువాత నామె—

ఉ. రూపముఁ దాల్చి వచ్చినముకుందో మధుండో యనంగఁ జాలునా
రూపవిఁ, గందుకం బెటులు ద్రుళ్లిన నట్లు భ్రమించుబెళ్కునుం
జూపులతో సవిభ్రమతఁ జూడక చూచుచు వాలుగంటి, దే
వీపరిచర్యగాఁ జలుపు వేడుకక్రీడ ముగించెఁ గోవెలన్. 3౫

మారు—తరువాత?

మందా—తరువాత నామె కందుకగర్భం బగునంజలితో సావర్ణినికి నమస్కరించి—

ఉ. కందుకకేళిఁ జెక్కులను గ్రమ్మిన చెమ్మట నంటి ప్రేల్కురుల్,
చెందొవ రేకువంటితన చేగొనవ్రేలను బైకిఁ ద్రోయుచున్,
సుందరి, వానిఁ గన్గొనలఁ జూచు చరాళకనికంబులన్,
మందసమీరసంచలితమంజులతం దలఁపించె నత్తఱిన్. 3౬

తరువాత

ఉ. కూరిచి యింద్రనీలములు గ్రుచ్చినముత్తెపుఁజేరులుం బలెం,
దోరపులోనికందురుచితో దిగువెన్నెలనిగ్గులుం బలెం,
సూరసుతాప్రవాహ మెడఁ జొచ్చినగాంగఝురంబులుం బలెం,
వారిరుహాక్షినీలసితభవ్యకటాక్షము లల్లె వానిపై. 3౭

ఆసమయమందు—

చ. నిడుపులు శ్వాసముల్, చెమట నెమ్మొగమందు, శ్రమంబు మేన, సుం
దొడలను గంపముం, దొగరనుంగవ మో, ద్వనువివికారముల్

వెడవిలుకానిపీడనఁ బలెం, బరిఖేలనఖేదమందు నా;
నొడలుల నెల్లఁ దోఁచుపులకోద్గమ మొక్కఁడు భేదకం బిటన్. ౩౮

నవ—(జనాంతికముగా) సఖీ! మల్లికా! నీ వున్మనాయమానవయి యుత్కంఠితు
రాలివలె నగపడుచున్నా వెందుచేత?

మల్లి—(కన్నుల నీరు పెట్టుకొనుచున్నది.)

మందా—

తే. చెమ్మటను దొప్పదోఁగినచెలువమందు। రాంగకములఁ బ్రతిఫలించుచాతఁడు స్ఫుటి,
తొంగ చెలి తనీయలావణ్యదుగ్ధజలధి। యలలమధ్యంబునం దీఁదునట్లు దోఁచె. ౩౯

మారు—తరువాత?

మందా—అప్పు డావర్ణిని యామెతో ,, కుమారీ!

తే. మాధవమరుత్తునకుఁ గుఁగుమారుఁడితఁడు; ప్రీతిఁ గుంభోద్భవుఁడు పెంపఁ బెరిఁగినాఁడు
నిన్నుఁ గనవచ్చె; నీతనికిన్నరనుత। గుణము లాలించి యుత్కంఠఁ గూరితి గద. ౪౦
కావున నీతని స్వాగతంబున సంభావింపు" మని చెప్పెను.

మారుతకలకంఠులు—(సశ్లాఘముగా) భగవతీ! యామెయు మీకంటె గుణముల
చేతఁ దక్కువది కాదని తలంచెదము. చెప్పుఁడు. ఆకన్యక స్వాగత మడిగినదా?

మందా—అప్పు డామె స్వాగత మడుగలేదు. కాని—

తే. మును పెఁగ ధానురాగంబువినికినైన। దపుడు సంప్రాప్తుఁగని మోహనాంగి, యతని
తనువునను దమ్మిపూవులదండ వోలె। మాన్మథవిలాసవీక్షాళి మరలఁ జిమ్మె ౪౧

మల్లి—అది యుక్తమే. నిసర్గశాలీనస్వభావము గలకులకన్యాకాజనము స్వాగత
మెట్లు లడుగును? పిమ్మట నమ్మహాభాగుఁ డేమి చేసెనో?

మందా—అప్పు డతఁడు—

ఆ. మోముఁ దమ్మితావి మూఁగించు చలులను, । గప్పురంపురజము గుప్పినట్లు
దశనకుట్మలాగ్రధవళదీధితిపుంజ। మొలయఁ, దేనె లొలుకఁ బలికె నిట్లు. ౪౨

మారు—(కౌతుకముతో) ఎట్లు? భగవతీ!

మందా—. భగవతీ! స్వాగతసంభావనం బెందులకు? చూడు,

క. హృదయము సౌహార్దంబున। సదమల మయి యునికి, చూడ్కి సంతోషంబున్
వెదచల్లుట, సత్సత్కృతి;। యదనము సర్వంబు లౌకికాచార" మనఁగ. ౪౩

మారు—(సశ్లాఘముగా) మేలు. ఈవచనము విదగ్ధమధురము. తరువాత?

మందా—తరువాత నతనియిరువురుచెలికాండ్రలో నొకఁడు, " ఇదిగో! నీ పూజ్యురాలి యీహారము హంసముఖమునుండి జారి పడినది. మేము దీనిఁ గొంటిమి. దీని నీవె వెండియుఁ బరిగ్రహించునుగాక." అని పలుకఁగా, నత్తరుణి చెలిమికత్తియ, " మహాభాగా! గగనమునఁ దారావళివలె నీ తారావళి మహాభాగుని దోరంతరము ననే విహరించునుగాక. దివ్యపరిమళ మగునమ్మాలిక దయచేయుఁడు. మాభర్తృదారిక దానికొఱకు వేడుక పడుచున్నది." అని చిఱునవ్వుతోఁ బలికెను.

మారు—తరువాత?

మందా—

ఆ. దాన హర్షమొంది తనకేల నతఁడిచ్చు। స్రజము, భృంగగీతసద్గుణంబు
నంది సకియ, యామె కగ్రగామ్యకౌతుకా। క్రుపితదృష్టి, కుని చెంగంతమునను ౪౪

కల—ఏమి? అక్కడఁ గూడ హారమాల్యములకు వ్యత్యయమా?

మందా—

ఆ. వేగ మంతలోన విద్యాధరేంద్రుని। సచివుఁ డైనజనకుశాసనమునఁ,
బిలుచుకంచుకులను గలిసి, యాంగజపీడఁ। దిరిగితిరిగి కనుచుఁ దరుణియరిగె ౪౫

మారు—తరువాత?

మందా—

చ. వనిత గృహంబు చేరి. ఫణివల్లభభోగసమానదీర్ఘబా
హుని, సుకుమార శైవతనయుల్లమునం దతనిఁ బఠించి, పా
యనిమదనజ్వరంబునఁ గృశాంగకముల్, శ్లథనీవిబంధయై
యనయము వెచ్చ నూర్చు చపలాత్మత వ్రాలిచె నొయ్య శయ్యపై. ౪౬

అట్లు వ్రాల్చి—

తే. మొలక వెన్నెరుగు బోనిముద్దొలుకు మేన। నొలసె బిసకాండసోదర మొందుచాయ;
కమలినట్లగు నిట్టూర్పుగాలిఁ గెంపుఁ। దునుకఁగులకింపు గలమోవిదొండపండు.

కావున నాతనిహృదయము నధికతర మయినపుణ్యంబు చేసికొన్న యేకన్నియ యందో యాసక్త మయిన దని చింతించుకొను చుండెను

నవమాలికాకాళిందులు—(జనాంతికముగా) సఖీ! నీవు గూడ నీపైఁటచేలచెఱఁగున మహాభాగుని ప్రతిచ్ఛందమును జూచి యీపద్యమే పఠించితివి గదా!

మందా—ఇట్లు చింతించుచున్న యామెకు, నాలసించి వచ్చిన యామె యడపకత్తియ యతనివయస్యులచేత వర్ణిత మయినస్వప్నవృత్తాంత మంతయు వినిపించెను.

మారు—తరువాత ?

మందా—

చ. సకియ, చిరోపగూఢమును సాంద్రము నూతనమీఁదివానిర
క్తికనట, రక్తి యైన స్మరతీవ్రత, ప్రాణము వచ్చినట్టులై,
ప్రకటవియోగపాండుమధురత్వత దాకృతి వ్రాసి పైఁటపై,
సకలవిధుప్రభాధవళచారుసరంబు లిఖించెఁ బేరదగ్. ౪౫

మల్లి—(పైఁటచెఱఁగు చూచుకొని) ఆర్యపుత్రుని ప్రతిచ్ఛంద మిక్కడఁ గూడ హార సహితమే.

మందా—అతఁడు మరల—

తే. అరుగు చింటికి, మూఁగెడూనళుల జోపు| కైతవమున మఱల్చి త్రికంబు, సఖుల
నడుమ వరగంట నేక స్తనంబు దోఁప|దనుఁ గనినతన్వఁ, దలఁచు నతండు దమిని.

మారు—తరువాత ?

మందా—తరువాత నుత్కంఠావినోదనమునకయి చిత్రఫలకమున—

తే. ఆగిరీంద్రము, నచ్చటియాస్రవంతి, | యాలతాసద్మమును, బంతియాటవలన
నలసటను గన్న యాచకోరాక్షి, నా మె| యుఱుత నాపుష్పమాలయు, నతఁడు వ్రాసె.

నవమాలికాకాళిందులు—(జనాంతికముగా) సఖీ! మల్లికా! తద్వసంతోద్యానమునఁ దీఁగెలమాటుననుండి మేము చూచితిమి. నీవు కూడఁ జిత్రఫలకమున నిట్లే వ్రాయఁబడి యుంటివిగదా!

మందా—తరువాత సంచారమనోహర మయిన యయ్యుద్యానవనమం దెట్టెటో దిన శేషమును గడపి, విరహిజనుల ప్రాణవాయువులను గబళించుటకుఁ గాలభుజంగి మయిననిశాసమయము ప్రాప్తింపఁగాఁ, బురందరహరిదంగనాశ్రవణహాటక తాటంకుఁ డగుభగవానుఁడు శశాంకుఁ డుదయించుడు, దుస్సహవిరహానలదహ్యమానుఁ డయి, తనసఖులచేఁ గల్పిత మయినమృణాలతల్పమున మేను వాల్చి, యావిద్యాధరకన్యకనే తలంచుకొనుచుఁ, గన్ను మొగడక యొట్టకేలకు సగము రాత్రిని వెళ్లఁబుచ్చెను.

మారు—తరువాత ?

మందా—తరువాత నచ్చేరువఁ జంద్రకాంతమణిసంఘటిత మగుక్రీడాపర్వతశిఖరము వైపు చెవి యొగ్గినవాఁ డయి—

తే. నిద్దురను బుల్గుబలఁగము సద్దడంగు। నద్దరేయిటఁ, గన్నుల నశ్రు లలమఁ,
గర్ణములకు సాయుష్యము,కరుణ,మొక విలాప మాలించె నతఁడుదూలంగఁ దాల్మి.

మారు—అవిలాప మేమని ?

మందా—

తే. అకట చూత! హా చంపక! హా లవంగి!। యయ్యొ మాలతీ! హా మల్లి! హా కురంగి!
హా మరాళి! హా కేకిని! హా చకోర!। యయిత స్మర్తవ్య; మీసఖి హా! గతించె.

క. జగములను గన్న జననీ!। భగవతి! భక్తానురక్త! భద్ర! భవానీ!
యగుతన్ మఱుజన్మంబున। మగండు నా కలమనోజ్ఞ మారుతసుతుఁడే. అని ౫౩

మారు—(తొందరతో) తరువాతఁ దరువాత ?

మందా—అది విని సాశంకముగా లే తనవయస్యలతోఁ గూడ సత్వరముగాఁ క్రీడాపర్వత మారోహించి యచ్చో నక్కన్నియ నే—

ఉ. ఆయువ దివ్యమాల్య మురమందు ధరించినదాని. బాష్పపుం
దోయమూనన్ ముఖాంబుజము దోఁగినదాని, స్మరాస్త్రవేదనన్
హా! యనుదాని, వాడినమృణాళము పోలినదానిఁ, గంఠమం
దాయత పైనవల్లి యురి యాజనరాలిని గాంచె నొంటరిన్. ౫౪

అప్పుడు వెంటనే యామెను సమీపించి—

క. మానుము మానుము, సాహస। మూనకుమీ సుందరీ! మఱొకజన్మమునం
దేనిని వరుఁగ వలచెదం। దానం బ్రార్థించి, తట్టి దాసుఁడు నేనే. ౫౫

అని పలుకుచు నామెతీఁగయురిని ఛేదించి కంఠమునుండి తొలఁగించెను.

మారు—(సంతోషముతో) తరువాత ?

మందా—

తే. కన్నియల కభిసారము కాని దంచు,। వచ్చె నర్పింప నుసుఱు భవాని కబల;
వానిఁ గని, లజ్జ వణఁకుచు వాంచి మోము,। కాలిబొటవ్రేల వ్రాయుచు నేల, నిలిచె.

మారు—తరువాత ?

మందా—(కన్నీటితో నిట్టూర్పు విడిచి) అక్కటా! దైవము నతిక్రమింప నేరి తరము ? అల్లతొందరలో లతాపాశములను గోసివేయుచున్నయాతని చేతినుండి చిత్రఫలకము జారి యటునిటు దొరలుచుఁ, గ్రమక్రమముగ నచ్చోఁ దరుమూల

మునకుఁ గాకతాళీయన్యాయమునఁ దత్కాలాగతుఁ డగుసులభమన్యుఁ డను మహర్షి నెత్తిమీఁద ఘణిల్లు మని పడ్డదాయెను.

అందఱు—(విషాదము నటించుచున్నారు)

మారు—(నిట్టూర్పు పుచ్చి) ఉత్సవములు నిరంతరాయములు కావుగదా? తరువాత?

మందా—తరువాత నమ్ముని యాబద్ధభ్రుకుటీకరాళవదనుఁ డయి, యోరీ! దురాత్మా! కన్యాకాముకా! నీవు రాగాంధుఁడ వయి, నిరపరాధుఁడ నయిననా నెత్తిమీఁద ఘణిల్లు మన నీదారుఫలకమును బడవేసితివి కావున, నీవు మనుష్యయోనిని జనియింపుము. ఈకులటయు మానుషభావముఁ బొంది జన్మాంతరమందును నీతొలి సంగమముననే మూర్ఛిల్లుఁ గాక. అని పిడుగువంటిశాప మిచ్చెను.

మల్లి—(వణఁకుచున్నది.)

అందఱు—(కన్నుల నీరు పెట్టుకొనుచున్నారు)

మారు—అయ్యో! మహాప్రమాద మే. తరువాత?

మందా—(సబాష్పగద్గదముగా) తరువాతఁ దచ్ఛాపదహనదగ్ధాంగు లయి, వారు తత్క్షణమే విలయ మొందిరి.

మారు—తరువాత? (అను నర్ధోక్తియందే బాష్పరుద్ధకంఠుఁ డయి యూరకుండెను.)

మందా—అప్పు డాతనివయస్యు లిద్దఱును శాపశ్రవణభయంబున మూసికొనిన కన్నుల నెట్టకేని దెఱచి—

క. ప్రియమిత్త్రుఁ గాని, యాశ్రి। న్నియ గాని, కాన రైరి; నేలను బడుము
ద్దియచూడామణి మఱి యాప్పయిదలిప్రియుప్రాణికొన్నపయుఁటఁ, గనిరటఁ.

మారు—తరువాత?

మందా—తరువాత నయ్యిరువురలో నొకఁడు సుహృద్విరహమున జనియించినశోకమును నిలిపికొనలేక, భగవతీ! కాత్యాయిని! జననాంతరమున నీప్రియసుహృదునకే యనుచరుఁడఁ గావలయు నని ప్రార్థించుచు, నాకేళీపర్వతము చఱియ నుఱికి తన మిత్రునిగతినే తానుఁ బొందెను.

మారు—(నిర్వేదముతో) అయ్యో! సర్వనాశ ముపస్థిత మయ్యెనుగదా?

కల—(సశ్లాఘముగా) మేలు. సౌహార్దమునకు సదృశ మయినపని చేసినాఁడు.

మందా—మఱి యారెండవవయస్యుఁడు తద్దర్శనమునఁ గూడ నధికసంజాతశోకమన్యుఁ డయి తచ్చూడామణిని, దత్సహృత్ప్రతిచ్ఛందకుభగ మయినదుకూలమును, దచ్చిత్ర

ఫలకమును, సత్వరముగాఁ గయికొని ...ఛీ! మూర్ఖా! నృశంస! మునిపాశ! యేమిరా? నీవు మా కందఱకు సంఘమృత్యువవయితివి'' అని బాష్పరుద్ధనయనుఁ డయి సారెసారె కమ్మనిని దూఱ సాగెను.

మారు—అయ్యో! యీవాక్కు జ్వలదగ్నికి ఘృతవృష్టి గదా? తరువాత?

మందా—తరువాత నమ్మౌని మరలఁ గుపితుఁ డయి ..నీవు సుహృత్స్నేహమున రాక్షసునివలె వ్యవహరించితివి. కావున రాక్షసుఁడవె కమ్మనియు, మిత్రుఁడగునితఁడే నీకు శత్రు వగు''ననియు శాప మిచ్చి నిజేచ్ఛం జనియె.

మారు—విధాతృనిహింసకత్వము దుర్లంఘనము గదా!

మందా—తరువాత నాసఖుఁడును దుకూలాదివాస్తుఁ డగుచునే మునిశాపోచితమయిన తనువు దాల్చి యాతుధానుఁ డయి, సకలభూతసంత్రాసముఁ జేయుచుండఁగాఁ, గాత్యాయనీభవనవర్తిని యగునవ్వర్ణిని, ధ్యాననయనమున సందృష్టసకలానర్థ యయి హాహాకారమున దద్దరిల్లి యన్నోటికి విచ్చేసెను. అప్పుడు స్నిగ్ధమధుర మగుగౌరీదేవివాక్కు గగనమున నిట్లు బయలు వెడలెను.

మారు—ఏమని?

మందా—

''తే. సంతతిని గోరుమద్భక్తజనుల కిలను । బిడ్డ లగుదురు గావుత వీర లిరువు;
రంత నన్యోన్యదత్తంబు లగుత, వారి । సహజమహోత్కృష్టహారపుష్పస్రజములు. ౫౭

ఇంతే కాక యిటుమీఁదటఁ గూడ సువిశేషసౌందర్యశాలివిగ్రహు లగువీరియువురకును, పరస్పరవర్ధమానరాగరమణీయ మగుసమాగమము కాఁగలదు. అకస్నాయకు మునిశాపప్రయుక్తప్రథమసంగమమూర్ఛ. మూర్ఛాహర మగునారమణి చూడామణి తాఁకినంతమాత్రమున శమించెడుఁ గావుత''మని.

మారు—(హర్షముతో) ఓహో! భగవతియనుగ్రహమున మునిశాపము శుభాంతమయ్యెనుగదా! పిమ్మట నవ్వయస్యులసంగతి యేమి జరిగినది?

మందా—మరల నావాక్కిట్లు బయలు వెడలెను. చతి నుతికినవాఁడు గూడ నేత్రరూపవిశిష్టుఁడే యయి యితనికి నిట్లే పరమమిత్రుఁ డయ్యెడునుగాక. తదన్యుఁడును రాక్షసుఁ డయి శత్రు వగుమిత్రునిచేతనే నిహతుఁడయి తోడనే నిజరూపమును బొంది వెండియు నతని కత్యంతప్రేమాస్పదుఁ డగుమిత్రుఁ డయ్యెడును.

కల—అదృష్టమున వారిరువురు గూడ ననుగ్రహింపఁబడిరిగదా!

మారు—భగవతీ! యాపురుషు లెక్కడ నున్నారు? ప్రేయసితోఁ గూడ నాతఁడుండుఁ
డే మయ్యెను?

మందా—(చూచి హర్షముతో)

ఉ. కాముని గెల్పులచ్చి యలకన్యయె (కన్నీళ్ళతో మల్లికను గాఁగిలించుకొని)
మల్లిక యీమె; (అందఱు విస్మయమును నటించుచున్నారు.)

మందా—యీమెకుం బ్రేమనిధాన మాపవనుబిడ్డఁడు మారుతుఁ డీవె;

నవ-రమ-కాళిందులు—(హర్షముతో) ఇందు సందేహము లేదు

మందా—నెయ్యురం। దా మెయి నేఁడు గూలె భృగవం దొకయుం. షల్ప్రాణమిత్రు
నిం। గా మది నెంచుకొమ్మ, కలకంఠసమాఖ్యను గాఁ మనీతనిన్. ౫౯. క.

మారు—(కలకంఠునిఁ గాఁగిలించుకొని) సఖుఁడా! మహాదృష్టమున నీజన్మమునఁ
గూడ నిన్నుఁ జూచితిని.

మందా—

క. నీకై దువ్వున హాతిం గని। రాకానిశనంబు వోయి ప్రాణసఖుండై
యాకసమున కేగినయా। మాకందునిఁ దెలిసికొనుము మతియొకసఖుఁ గా. ౫౯ గ

(మల్లికామారుతకలకంఠులును, మందాకినియు హర్షాతిశయమునః మూర్ఛిల్లుచున్నారు)

తక్కటివారు—(విస్మయముతోను, సంభ్రమముతోను) అయ్యయ్యో! వీరు మూర్ఛిల్లి
నారు. ఔరా! శోకమువలెనే హర్షమును మూర్ఛాకారణముగదా! కాఁబట్టి
శీతలోపచారముల వీరి నాశ్వాసింతము.

మల్లి—(సత్వరముగాఁ దెలివి నొందుచున్నది )

నవ—(సంతోషముతో) కాళిందీ! నీమంత్రమణిప్రభావమున మునుపటివలెఁ బ్రియసఖి
యంతగా మూర్ఛాక్రాంతురాలు గాలేదు.

మల్లి—(ఉత్కంఠతోఁ దలంచుకొని తనలో) ఔరా! నిద్రవోయి మేలుకొన్నట్లు
లిప్పు డాయావృత్తాంతము దెలిసికొనుచున్నాను

నవ—(హర్షముతో) ఓహో! భగవతి కూడ నామెయే. (మూర్ఛిల్లినవారిని చుట్టు
తిరిగి చూచి సావేగముగా) అయ్యయ్యో? వీరు మూర్ఛిల్లినా రేమి?

కాళిం—(మందాకినిని బట్టుకొనుచున్నది.)

మల్లి—సఖీ! రమయంతికా! నీవు గూడఁ గలకంఠునిఁ బట్టుకొమ్ము

నవ—(చిఱునవ్వుతో) సఖీ! మల్లికా! మఱి, నీవు మారుతుని—

ఇద్దఱు—(సిగ్గుతో నట్లు చేయుచున్నారు.)

మల్లి—(ఉత్సంగమున నిడుకొని మారుతునిఁ జూచి కన్నీళ్లతో) నాఁటి దగుస్వప్నము మొదలుకొని యింతదనుకను నానిమిత్తమున నాలాగున సహింపరాని మదనానల సంతాప మార్యపుత్రునిచే ననుభూత మయ్యెనుగదా? ఆర్యపుత్ర! లెమ్ము. లెమ్ము.

(ముగ్గురు మూర్ఛఁ దేఱిరి)

మారు—(మల్లిక నాలింగనము చేసికొని యుచ్ఛ్వాసముతో) ఓమల్లికా!

క. నీయెడఁ బొడమి యెదిగి యటు । నాయనురాగంబు ముట్టినం గొట్టకొనన్.
ప్రేయసి! యిపుడు నవీకృత । మై యగపడుఁ బ్రాజ్ఞని తలఁ పయ్యెడునాపన్.

(మందాకినిని గూర్చి) అవిగీతప్రభావురాలా! భగవతీ! నీ వాపెం గానట్లు మాట లాడుచున్నను, నిన్నుఁ గూడ నా మెనుగాఁ దెలిసికొన్నాను. మఱియు నిప్పుడు మీచేతఁ దెలుపఁబడినట్టి జనవాంతరోదంత మంతయుఁ గూడఁ దెలిసికొన్నాను. విశేషించి వీనిని నాహృదయ మెప్పుడును విస్మరింపదు. (మల్లికను జూచి)

ఉ. కందుకఖేలనభ్రమలఁ గంజిగి నింగి విసిల మాటయున్,
దండిరియానతిం జనెడుదారిని నన్ వెను ద్రిప్పి గాంచుటన్,
మెండుగ సాహసించునిని నే నురితీవలఁ ద్రెంప, లజ్జయున్
గొండొకభీతి, హర్షమును. గూరిన మోమున నీమెం నిల్చుటన్. ౨౨

మందా—వత్సా! మారుత! మీయుందఱస్మృతిబీజసంస్కార మేది మఱుఁగు పఱిచినదో యట్టి మునిశాప జన్మదోష మింతవఱకే యని కాత్యాయనీదేవి వచించెనుజామీ.

సార—(తనలో) మొట్టమొదటనే భగవతి యీవృత్తాంతమంతయు నా చెవిలో వేసినది

కల—(పైకిఁ జూచి యాశ్చర్యముతో) భగవతీ! యాశ్చర్యము. చూడుచూడు.

చ. వెలుఁగుల విజ్జిఁ జిమ్ముచు, భువిం దిగుచంద్రమసుండొ, పక్షముల్
మొలచి విహారముల్ సలుపఁ బూనినతారధరాధరంబొ; హా
తెలిసె; నిజధ్వజాగ్రనిహితిప్రచలజ్జలదోచ్చయంబు, ని
ర్మలవియదంబునాళివిచరత్సితనాక విమానరాజ మా. ౨౩

ఆదఱు—(విస్మయముతోఁ జూచుచున్నారు.)

మందా—(చూచి) వత్సా! కలకంఠా! యిది నిజముగా విమానరాజమే. (మగలఁ బరిశీలించి చూచి) అందులోఁ బరిమితపరివారుఁ డొకదివ్యపురుషుఁడు—

తే. వెలిగొడుగువాఁడు. రత్నకుండలధరుండు । స్వర్ణభాస్వత్తనుండు, సచామరుండు
వరునిఁ గొమరితఁ జూడ విశ్వావసుండు । నాదుచెలికాఁడు, వచ్చుచున్నాఁడు నేఁడు.

మల్లి—(హర్షముతోను సంతోషముతోను) ఓహో! నాయనగారు వచ్చినారు.

కల—భగవతీ! చూడుము. మాకందుఁడు గూడ నామహామహునిపార్శ్వభాగమున నున్నాఁడు.

అందఱు—(సంభ్రమముతో నిలఁబడుచున్నారు.)

(తరువాత నాకాశయానమున విమానస్థుఁడు విశ్వావసుఁడు ముందుచెప్పినట్లు మాకందునితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

విశ్వా—(క్రిందుచూచి) మాకందా! కుసుమపురస్కంధనివిష్టము, నాయల్లుఁ డగుమారుతునిస్కంధావార మిదియే యగునా?

మాకం—(వేలితోఁ జూపుచు) నాసఖుని దగునివాసభవనము గూడ నిదియే సుండీ. (పరిశీలించి చూచి సంతోషముతో) పెక్కులేల? ఇదిగో! మల్లికాసఖుఁడు మారుతుఁడు సంభ్రమముతోఁ దనయున్నతాసనము డిగ్గి, పూజ్యు లయినతమసమాగమమహోత్సవమును మందాకినీభగవతితోఁ గలిసి సంభావించుచున్నాఁడు.

విశ్వా—(అట్లు సుందరుఁ డయినమారుతునిఁ జూచి సంతోషముతోఁ దనలో) చిరకాలమున కిప్పటికి నాహృదయము ప్రసన్న మయినది.

క. జనకునకుఁ దనయతోడన। జనియించును శోకరూపశంకువు హృదిలోఁ;
దనయంత సడలి చను నది,। యనుకూలవరుండు దొరకినా కన్నియకున్. ౧౫

(పరిశీలించి చూచి గుఱుతు పట్టి) ఇతనియురస్స్థలమందలి దయినయీముక్తాహార మదియేగదా! దీనిని బూర్వము నేను నాబిడ్డకు మల్లికకు మెడలోఁ వేసితిని.
(జ్ఞప్తికిఁ దెచ్చుకొని)

తే. ఇచ్చె శేషుండు దీని మహేంద్రునకును;। దైవతాధిపుఁ డొసఁగె విద్యాధరాధి
నాథునకు సాదరంబుగా; నాకు నమ్మ।హాప్రభుండు ప్రసాదించె నమితకరుణ.

మాకం—(విలోకించి) ఇదిగో! భూమిని సమీపించితిమి. తమరు దిగుండి.

విశ్వా—(మాకందుని చేయి పట్టుకొని విమానము దిగుట నభినయించుచున్నాఁడు.)

మందా—(సంతోషముతో సమీపించి సగద్గదముగా) విద్యాధరామాత్యునకు స్వాగతము.

విశ్వా—ఓహో! భగవతి మందాకినియా. అనిశావ్యాజోపకారనిరతకు నమస్కారము.

మారు—(వినయముతో నమస్కరించుచున్నాఁడు.)

విశ్వా—(నమస్కరించినమారుతునిఁ బులకితబాహువులతోఁ గౌఁగిలించుకొను

చున్నాఁడు) (పరిజనము బంగారుపీఠమును దగ్గఱ వేయుచున్నారు. విశ్వావసుఁడు కూరుచున్నాఁడు.)

మారుత-కంకణులు—(మాకందునిఁ గౌఁగిలించుకొని) సఖుఁడా! మన మందఱ మదృష్టవశమునఁ గలిసికొన్నారము.

అందఱు—(ఉచితాసనములఁ గూర్చున్నారు.)

మల్లి—(కన్నీళ్ళతో సమీపించి) హా! తండ్రీ!

విశ్వా—(బాష్పరుద్ధనయనుఁ డయి చేరఁదీసి కౌఁగిలించి యుత్సంగమునఁ గూర్చుండఁ బెట్టుకొని హర్షస్తిమితహృదయుఁ డయి క్షణ మూరకుండును)

మల్లి—(తండ్రి మెడను గవుఁగిలించుకొనుచున్నది.)

విశ్వా—(మల్లికను బరిశీలించి చూచి తనలో) అహో! భగవతి కాత్యాయనీదేవి ప్రసాదమున నీ బిడ్డవి యగునవయవముల సంస్థానవిశేషము పూర్వావస్థకు నేమియుఁ దీసిపోలేదు. (వాత్సల్యాతిశయముతో)

చ. కొమరితమై, శిరీషకుసుమకోమలకేసరపేశలంబు; నం
గము జిగి, జాలువారు దళకందళకుందకుట్మలంబులన్ హసించు; గం
ధము నెలఁగుల్, రసాలవనవ్యకుహూమధురంబు; (పరిశీలించి) సుందర
త్వము నతులంబు; నన్నియు నవే; వానికి నెక్కుడు నంచు నెంచెదన్. ౭౪

అందఱు—(హర్షస్తిమితత్వము నటించుచున్నారు.)

మల్లి—(పెనిమిటికి సిగ్గుపడి యొడినుండి దిగి ప్రక్క నిలుచున్నది)

మారు—(ఆనందముతోడ ననురాగముతోడఁ దనలో)

ఆ. హర్షనిర్భరోస్రపాక్షిపక్ష్మవిమిశ్రి । తాశ్రుమంథరంబు, హసితకోక
నదసమాన మైన వదనంబు, మల్లిక । వంచుకొనియె లజ్జవలన లలన. ౭౫

మల్లి—(విశ్వవసునిఁ దలంచుకొని స్నేహముతో) నా జనకు లిరువురకుఁగూడ నీమహాభాగుఁడు సమానుఁడే.

విశ్వా—(విమర్శించి) భగవతీ! పూజ్యుఁడగు సుపలక్ష్యము మహర్షి యిడినశాప మనుగ్రహమే యయినదిసుమీ. అందువలన నేఁగదా పావనోజ్జ్వలచరితులు బ్రహ్మదత్తవిశ్వావసులు గూడ మాపాలె సంతానవంతు లయినారు.

మందా—(శ్లాఘనముగా) అతిమనోహరముగాఁ బలికితివి. పరస్పరతుల్యు లగుమీ నలువురకు నీబిడ్డ లిరువురు సమానులే (విమర్శించి)

తే. ఇతఁడు పవమానదేవున కిట్టివాఁడొ । తాదృశుఁడ యయ్యెడును బ్రహ్మదత్తునకును.
నీక విశ్వావసుఁడ వగునీవు నిట్టి । యదియె, విశ్వావసున కిప్పు డట్టిద యగు. ౭౯

మల్లికామారుతులు—మాహృదయములు నిజమని తలంచుచున్నవి.

రమయంతికా నవమాలికా కాళిందులు—(పరస్పరము జనాంతికముగా) ఏమీ మందాకినీభగవతీప్రభావము! మొదట నామె తత్తత్ప్రకారంబుల శంబరకుని వంచించి, విస్మయానందజనకముగా నొక ప్రకరణము నిర్వహించినది. ఇప్పుడు కథాకథనమున మరల నట్టిదే వేఱొకప్రబంధము గనఁబఱచినది.

విశ్వా—(మాలతి రమయంతికాదులను జూచి) మల్లికా! నీపార్శ్వమున నున్న వీ రెవరు?

మల్లి—(తండ్రిమూఁపునఁ జేయి వేసి చెవిలో) వీ రందఱు నా ప్రియసఖురాండ్రు. ఈమె పాంసుక్రీడ మొదలుగా హృదయనిర్విశేషురా లగు నాప్రియసఖి నవమాలిక.

విశ్వా—(తానుగూడ మెల్లగానే) తక్కిన యిద్దఱు నెవరు?

మల్లి—ఈమిగిలినయిరువురు మందాకినీభగవతీశిష్యురాండ్రు, సారసికా కాళిందులు.

విశ్వా—బిడ్డా! ఆమఱియొకతె కూడ నెవరు? చెప్పు.

మల్లి—ఈమె యమాత్యవిష్ణురాతునిపుత్త్రికామణి రమయంతిక. ప్రియసఖునికిఁ గలకంఠునికిఁ బ్రియురాలు.

విశ్వా—(సబహుమానముగఁ దనలో) ఇది యంతయును మాకందుఁడు నాకుఁ జెప్పినాఁడు. విశుద్ధోదారరూపవ్యాకృతపరమాభిజాత్యురా లయినయీమె కలకంఠునకుఁ దగినదే (ప్రకాశముగా నవ్వుకొనుచు) బిడ్డా! కలకంఠుఁ డెవరికిఁ బ్రియసఖుఁడు?

మల్లి—(సిగ్గున వెనుకకుఁ బోవుచున్నది.)

విశ్వా—ఆనందముతో—

క. ఈపె నిజధర్మ్యవాఙ్మా । ప్రేమపితనమితానవాఙ్మ నేఁ గాంచితి; నా
కీపుత్త్రికతోఁ గూడమిన । రూపమనోరథము నేఁడు పూర్ణం బయ్యెన్. ౮౦

మందా—(లజ్జాహేతువు నెఱింగి చిఱునవ్వుతో) ఈబిడ్డ యెందులకు సిగ్గుపడుచున్నది?

విశ్వా—నాకుఁ దెలియును. రమయంతికను బ్రియసఖునిప్రియురా లని యీమె చెప్పినది. "ఎవరికిఁ బ్రియసఖుఁడు" అని నే నడిగినంతనే సిగ్గుపడుచున్నది.

అందఱు—(తమలో నవ్వుకొనుచున్నారు)

రమ—(మల్లికతోఁ గూడ సిగ్గుపడుచున్నది.)

మారు—(అట్టియవస్థ నున్న ప్రియురాలిని జూచి సాభిలాషముగాఁ దనలో) అకటా! గురుజనసమక్షమని శంకించుచున్నాను. కాని, కౌఁగిలింప బుద్ధి పుట్టుచున్నది!

(పటాక్షేపముగా భ్రమరకుఁడు ప్రవేశించుచున్నాఁడు.

భ్రమ—భగవతీ! యమాత్యవిశ్వావసువిష్ణురాతులతోడఁ గూడ మహారాజుగారిదిగోఁ బత్రిక నంపినారు.

మందా—(పుచ్చుకొని చదువుచున్నది.)

మ. నయనానందమృగాంక! కైకొనితి కన్యన్ మల్లికన్, గట్టి దు
ర్నయు క్రేలం దరుశాఖ శంబరుకు; నానందించితిన్; మారుతా!
చెయి పట్టెన్ రమయంతికన్ స్మరజయశ్రీ విష్ణురాతాత్మజన్.
నయ మారం గలకంఠుడున్, గదిసె తన్మందాకినీవేషతన్. ౪౧

అందఱు—(హర్షమును నటించుచున్నారు.)

విశ్వా—(సశ్లాఘముగా) అహో! భగవతినయప్రభావము మహత్తరముగదా! ఈ మాకందుని ముఖమున సర్వవృత్తాంతము నే నెఱిఁగితిని.

నవ—సఖీ! రమయంతికా! చూడు. మధుకరిక ప్రతీహారమున నృత్యము చేయుచున్నది.

మందా—వత్సా! మారుతా! ఇఁక నీకు నే నేమి ప్రియము చేయుదును?

మారు—

మ. లలనన్ నేఁ జిరకాంక్షితాసులభఁ గళ్యాణిన్ బ్రియం బొందితిన్;
గలబంధుల్ ముద మొందిరందఱు ద్విజన్మప్రాప్తు; లీమిత్రుఁ డౌ
కలకంఠుండును మోద మొందె దయితం గైపట్టి; మాకందునిం
జెలికానిన్ వరలంగఁ గంటిఁ; బ్రియమున్ జెప్పంగ నాకేదికన్? ౪౨

మారు—భగవతీ! అయిన నిట్లగుఁ గాక. (భరతవాక్యము)

తే. భద్ర మయ్యెడుఁ గాక ప్రపంచమునకు;
భక్తి హరియందొ హరునందొ ప్రజల కౌత;
శ్రౌతమార్గంబు గాంచుత సతము జయము;
మఱియు విద్వాంసు లెల్ల శ్రీమంతు లగుత. ౪౩

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

సర్వంబు సమాప్తము

---

# మచ్చుపద్యములు:

## చండకౌశికము

మ. తరుణీ! నిజిగిమోవి కాసపడెడుం దాంబూలరాగంబు; సుం
దరి! కందోయిని ముద్దుఁబెట్టుకొన నుత్సాహంపడుం గజ్జలం;
బురువక్షోరుహా! కౌఁగిలించుకొనఁగా నూహించు హారంబు కం
ధర; నీ కేటికి భూషణంబు? లని స్వార్థం బాశ్రయించు న్నినున్.

చ. కడఁగినసాధనం బిటు విఘాతము నొందుటఁ గ్రోధ మెచ్చి, నా
కుడిచెయి గాంచు చాపమునకుం గడు వేగిరపాటు; నెన్నఁడో
విడిచిన దల్లజాతిఁ దలపెట్టుచుఁ, దానును సాహసాంక మీ
యెడమకరంబు, చాపమున కంతయు నేడ్తెఱసేయు నిత్తఱిన్.

## ప్రబోధచంద్రోదయము

చ. నలినజులోకంబు నొకనాఁడు గనుంగొన నేను బోవ, సం
దలిమును లున్నతాసనకదంబము డిగ్గిరి దిగ్గుదిగ్గనన్;
నలువయు నొట్టుఁ బెట్టుకొని నన్ బతిమాలుచు, గోమయంబుతో
నలికి నిజోరుపీఠి, నను నచ్చట నుంచుకొనెన్ రయంబునన్.—దంభోక్తి

శా. లేనేలేనిపదార్థ మున్న దని ప్రేల్ మిథ్యాప్రజాప్వాస్తికుల్,
నానాభంగుల సత్యవాదులను నన్యాయంబు నిందింతు రే
లా నాస్తిక్యల? మేను గోని కనివారా యెవ్వరేఁగాని, యు
న్యానున్ జీవునిఁ బంచభూతపరిణామోద్భూత చిద్భిన్ను నిన్?—మహామోహోక్తి.

మ. బళె! ప్రత్యక్షపు మైలతిత్తిఁ గొలఁతిన్ బ్రాజ్ఞుండు వీక్షించి, "వ
ర్తులతుంగస్తని యుత్పలాక్షి కలితభ్రూవల్లి పద్మాస్య స
త్పులినశ్రోణి మనోహరాంగి" యనుచున్ మోదించుఁ గీర్తించు మ
త్తిలుఁ గ్రీడించును; మోహదుశ్చరితముల్ దెల్పన్ మహాశ్చర్యముల్.

వస్తువిచారోక్తి.

## అభిజ్ఞానశాకుంతలము

ఉ. వ్రాసి పటంబులోన విధి, ప్రాణము వోసెనొ? మానసంబునన్
జేసెనొ రూపసంచయము చేతను? గాదటు, వేధశిల్పవి
న్యాసవిభుత్వముం, గలికియంగకసౌష్ఠవ మింత చింతనం
జేసినఁ, గన్య యన్యవిధి స్త్రీమణిసృష్టి యటంచుఁ దోఁచెడున్.

చ. శ్రమము హరింపఁగాఁ దగినచల్లనితామరపాకుఁదాళవృం
తమునను నార్ద్రవాయుచలనం బొలయన్ మెలమెల్ల వీతునా?
నిమసము, పద్మతామ్రములు నీయరుగుల్ గదియించి మామకాం
కముపయి, నీప నెట్టులు సుఖం బటు పట్టుదునా వరోరువా?

## విక్రమోర్వశీయము

గీ. స్యందనక్షోభమునఁజేసి యిందువదన । యంస మంసముతోడ రాపాడెఁ గానఁ,
దలఁప నీభుజ మొక్కటే ధన్య, మితర । మైన మే నెల్ల భూమికి నతిభరంబు.

చ. కొడుకు మొగంబుఁ జూచి, మదిఁ గుందక యూఱటఁ జెంది యుండఁగాఁ,
బడఁతుక! నీవియోగ మనివార్యత నిప్పుడ సంభవించెఁగా!
మిడిమిడిగ్రీష్మతాపము శమింప నవాంబుదవృష్టిఁ గాంచి యొ
ప్పెడుతరుఁ, జెట్టపైఁ బిడుగు భీకరభంగిని బడ్డకైవడిన్. (పం. అం.)

## భామినీవిలాసము

ఉ. కాలభుజంగి నంచె ముఖగహ్వరమందును గొండెకాండ్రకున్
నాలుగుమోము లన్నదొర నాలుక పేరిటఁ; గా దటన్న, మం
త్రాల తెఱంగెఱుంగ నిజనమ్ము లయో! యది తమ్ము ముట్టఁగా,
వైశమ ప్రాణవాయువులఁ బాయుట యేగతి సంభవించెదున్? ప్రా. వి.

ఉ. కోరిక లూరి పాల్కడలికూఁతుమికూఁతురు గ్రుచ్చి కౌఁగిటన్
జేరుపఁ, బ్రేంకణంపులతచేఁ బరివేష్టితమౌతమాలభూ
మీరుహముం బలెం బొలుచు మేచకవర్ణుఁడు దోఁచుఁగాత, మిం
పారఁ దనుప్రయాణసమయంబున నాహృదయంబులోపలన్. శాం. వి.

## మేఘసందేశము

మ. పలుకంబాఱినపండ్లగుత్తులపసన్ బాగైనమామిళ్ళ నల్
వలఁకుల్ గప్పఁగ, వేణికాసమరుచిన్ బ్రాల్ణివు శృంగంబునన్
నిలువన్, జుట్టును బాండురంబు నడుమన్ నీలంబునై, పర్వతం
బలరున్ వేలుపుదంపతుల్ గనఁ, బయోదా! భూమిపాలిల్లనన్.

సీ. పలుచనివైదీఁగ బాగైనయొలవాగ, యౌవనమధ్యస్థయైనచాన
మొనలు దేరినదంతములనొప్పుకలికి, బింబాధరోష్ఠంబున నమరుతరుణి
నడచిన నసియాడునడుము మన్ననపలా, విలోలబాలమృగీవిలోలనయన
గంభీరమైనచక్కనినాభిఁ దగునాతి, కటిభరాలసగతు లలుగుచెలువ

వలఁదు వట్రువ యిఱుకు నిబ్బరపు గుబ్బచనుల బ్రేఁగున నుంత వంగిన కౌలంత,
కటంబముననంత నొకవాఁడుగంటిముచట, మొదట నలువ సృజించిన మదిత యనఁగ.

చ. అమరఁగ జాతిపల్కుఁ, బొలయుల్కును జెందిననిన్ను ధాతురా
గములను వ్రాసి, నీచరణకంజములం బడినట్టు నన్నటన్
దమిని లిఖించుకోఁ దలఁపఁ, దద్దయు నశ్రులు కప్పు దృష్టి; దై
వము మన కింతమాత్రసహవాసము నోర్వదు దేమి సేయుదున్?॥

## ఆపదుద్ధారకశతకము

మ. అనలస్పర్శము, జందనాచలసమాయాతానిలస్పర్శమున్
దను వట్లే మన సెంచు. మన్మృతసుతజ్ఞప్తిన్, ద్వదంఘ్రిస్మృతిన్;
గన దుఃఖం బవిచారమూలక మసత్కార్యంబు గాఁ దోఁచి, లో
ననుసంధింతు సుఖస్వరూపు నినుఁ గృష్ణా! యాపదుద్ధారకా.

శా. కాళిందీనది నల్పు; బింబితమహాకాశంబు నల్పందులోఁ;
గూలంబందుఁ దమాలరాజి నలు; పాఘోరాహియున్ నల్పు; త
న్మౌళిన్ నర్తిలునీవు నల్పు; నలుపుల్ ధ్యానింపఁగా నిన్నియున్,
మాలోనల్పు దొలంగుఁ; జిత్ర మిది; కృష్ణా! యాపదుద్ధారకా.

## మంగళగిరినృసింహాస్తవము

క. శ్రీనాథ! శోణితము మును । పానక మా వెనుకఁ గ్రోలవా? "నరసుతికిం
బూనిననాలుకఁ బొగడెద । వా న?" న్న న కీవు; మంగళాద్రినృసింహా.

క. కౌనిక నీకుం బెల్లపుఁ । బానకమే యనఁగ నేల? భక్తులు కల దే
దే నొకఁ డర్పింతురు; కొను । మా నాకవనంబు; మంగళాద్రినృసింహా.

క. గవి నిడి గుడపానక, మేఁ । జెవి నిడి సుడిపానకంబు, శీలింపఁగ, రెం
డవ దిత వనుకైవడిఁ, గ్రా । యవె నీ వాక్యంబు! మంగళాద్రినృసింహా.

## ధృతరాష్ట్రుని విశ్వరూప స్తవము

ఉ. కాళుల వ్రేళులం గలుగుకన్నులు, నా కిపు డాననంబునన్
గ్రాలుటఁ జేసి, క్రొత్తలును బ్రాఁతలుఁ గ్రొత్తలైయె పదార్థముల్,
చాలఁగ వింత గొల్పెడు; బలా! బలునింతల వింత! యీజగ
జ్జాలము నీశరీరమున సర్వముఁ దోఁచుట, పూరుషోత్తమా.

చ. ఇముడుచుశక్తి నీది, పరమేశ్వర! యద్భుతగోచరంబు; వి
శ్వము భవదీయదేహమున. స్వల్పపుబీజమునన్ వటావని
జము బలె సంతరించి; తెది సాగదు నీ వెద సెంచ? నాదునే
త్రమున నజాండ మెల్లఁ జొరదా? వరదా! మురదావనీరదా.

# వసురాయ చాటుప్రబంధము:

## ప్రశంసాప్రకరణము.

మ. కురువంశాంకుర మీమహాస్త్రమున శంకుస్థాపనం జేసెనో
పురముం గట్టను రాజమహేంద్రుఁడు, మహామహార్థంబునం గావ్యముల్
విరచింపం, గవి నన్నభట్టు వసుపుంబిశ్శ్యారిఁ బూజించెనో,
సిరియుల్ వాణి, పవిత్రతం నేఁడుఁ జెలిమిన్ శ్రీరాజమహేంద్రంబునన్.

## ప్రకృతిప్రకరణము.

ఆ. విన్ను పెరుఁగుఁగడవ; వెన్నెల తక్రంబు; । వెలుఁగుచలి వెలుఁగు వెన్నముద్ద;
చిన్నిచుక్క లన్ని చినుకులు; రే, యీవి । గోవుపాఁడి ద్రచ్చుగొల్లభామ.

## ప్రాస్తావికప్రకరణము.

క. మొదలను వెన్నెల, చీఁకటి । పదపడి, యగు రేయివంటి బ్రదుకునకంటెన్,
మొదవటను, తుదకు, వెన్నెల । యొదవెడు రేవంటి బ్రదుకు, కనుత్తమము సుమీ.

## ప్రకీర్ణప్రకరణము.

ఆ. చిన్నవోవుఁ గవిత, చెడి మూఢవర్ణంబు । బుధులు మెచ్చుకోక పోయి రేని;
కాన పాత్రపదక, ఘనయత్నమున సల్ప । నగును కృతులు, సరసులౌ ననంగ.

క. మాలాలితనముఁ బిదపను । బాలెంతతనంబుఁ దెచ్చి ప్రసవశ్రమమున్
దూలించి, కంట, తల్లిం । దేలించు సుఖాంబుధిం; కృతియుఁ గవి నట్లే.

## స్వవిషయప్రకరణము.

ఉ. గౌతమిఁ గట్టి కాలువలు కొటను త్రవ్వినకాలమందు సం
భూతుఁడ నైనవాఁడఁ, బహుమానఁ దగు నేఁడుల యీడు తల్లికిన్;
మాతకు లేమిఁ బో, లచట మంటను మోసెను చుప్పరమ్ము లే,
ప్రీతిని నన్నుఁ జన్గుడిపి పెంచిరఁ, లేమి ఋణానుబంధమో?

ఉ. అద్దము చేతఁ బట్టుకొని యాకసమందలిచంద్రుఁ జూపి, నీ
ముద్దులమూట గట్టునగుమోమును సన్నిధి చేసికొందు నీ
వొద్దను లేక యున్న; నిది సల్లము నీయెడఁ ద్రిప్పి; యందునో
ముద్దియ! సాక్షియుగ్మమిది, మాఁతరయౌటం గనికన్నుఁ జెందొగల్.

# అభిజ్ఞానశాకుంతలము

**వసురాయకవిరచితము.**

---

ఇది కాళిదాసమహాకవి విరచితమయిన సుప్రసిద్ధ సంస్కృత నాటకమునకుఁ దెలుఁగు. ఇందు మూలానుగుణము లయిన గద్యపద్యములు మాత్రమే కాక తావుల గూఢములయి యున్న సరసభావములు, రసికమనోరంజకములుగా లఘు సవిమర్శనముగా విశదీకృతము లయి యున్నవి. సావధానముగాఁ జదువువారికి ము, మూలములోని యనేక సారస్యములను గ్రహించుటకు మేలిసాధన మగు నని యతిశయోక్తిగాదు. శైలి దెలియుట కిక్రిందఁ గొన్ని పద్యము లుదాహరింపఁబడుచున్నవి.

దీనివెల 1—0—0 మాత్రమే.

ఉ. ఏయది మేయు కావిశిఖ మీనుకుమారపుజింక మేనిపై;
దోయఁగ వచ్చునయ్య యందుఁగుమిమీఁదను వీతిహోత్రముల్ ?
హా! యతిలోల మాహారిణకావలి కీఁత మేసు? నేఁడ సీ
సాయకముల్ నిశాతఫలసంకలితంబులు సారపుంఖముల్ ?

ఉ. వ్రాసి పటంబులోన విధి ప్రాణము వోసెనొ ? మానసంబునన్
జేసెనొ రూపసంపదయు చేతను ? గాదటు ; వేధ శిల్పవి
న్యాసవిభుత్వమున్ గలికియంగకసౌష్ఠవ మింక చింతనం
జేసినఁ, గన్య యన్యవిధ స్త్రీమణిసృష్టి యటంచుఁ దోఁచెడున్.

చ. శ్రమము వారింపఁగాఁ దగినచల్లనితామరపాకుఁ దాళవృం
తమునను నార్ద్రవాయుచలనం బొలయన్ మెలమెల్ల వీతునా ?
నిమసనము, పద్మతామ్రములు నీయడుగుల్ గదియించి మామకాం
కమునను, నీకు నెట్టులు సుఖంబటు నట్టుడునా వరోరువా ?

చ. పలుకకు నసౌభ్యయం డిటులు, వాస్తవ నట్టుల దైవతి పేసియుం
గులమున పాడికిం జెడినకూఁతుర వేటికి నీవు తండ్రికిన్ ?
దలఁగదు నైజశుద్ధచరితం బని నిక్కమె మెచ్చెంగి యుంటివా
నిలు తతియింట బానిసగ నేనియుఁ; నీ కది చాల మేలగున్.



# చండకౌశికము
అను
# హరిశ్చంద్రనాటకము.



ఇది

క్షేమేశ్వరకవికృతమయిన సంస్కృతనాటకమునుండి,


వడ్డాది సుబ్బారాయకవి


తెలిఁగించినది.

[illegible]
[illegible]
[illegible]


శ్రీవిద్యానిలయముద్రాక్షరశాలయందు ముద్రితము

రాజమహేంద్రవరము.

1920.

[వెల 0-10-0.

## —* ఈనాటకమునందలి పాత్రములు. *—

### పురుషులు.

హరిశ్చంద్రుఁడు — అయోధ్యాధిపుఁడు. కథానాయకుఁడు.

బోధాయనుఁడు — రాజునకు వేడుకచెలికాఁడు.

కౌశికుఁడు — వసిష్ఠశిష్యుఁడు. రాజునకు శాంత్యుదకము దెచ్చినవాఁడు.

వనచరుఁడు — రాజును వేఁటకుఁ బిలువ వచ్చినకిరాతుఁడు.

విఘ్నరాట్టు — విశ్వామిత్రుని తపముఁ జెఱుప వరాహమయినవాఁడు.

సూతుఁడు — రాజు సారథి.

విశ్వామిత్రుఁడు — రాజువలన రాజ్యదానము పొందినమహర్షి.

పాపపురుషుఁడు — పురుషరూపము ధరించినపాపము.

భృంగీశ్వరుఁడు — శివుని పరిచారకుఁడు.

లోహితాస్యుఁడు — రాజు కుమారుఁడు.

ఉపాధ్యాయుఁడు — రాజుభార్యను, కుమారునిఁ గొన్న బ్రాహ్మణుఁడు.

వటుఁడు — ఉపాధ్యాయుని శిష్యుఁడు.

విశ్వేదేవులు — విమానమునుండి విశ్వామిత్రుని నిందించిన దేవతలు.

ధర్ముఁడు — రాజును గొనుటకుఁ జండాలవేషి యయినధర్మదేవత.

అనుచరుఁడు — ధర్ముని శిష్యుఁడు.

కాపాలికుఁడు — రాజుయోగ్యతఁ బరీక్షింప మఱియొకవేషము దాల్చినధర్మదేవత.

వేతాళుఁడు — కాపాలికు నాజ్ఞచే రాజునొద్దకు సిద్ధి దెచ్చినపిశాచరాజు.

ప్రహస్తుఁడు — ధర్ముని పరిచారకుఁడు.

### స్త్రీలు

శైబ్య — రాజుభార్య.

కాయమతిక — చేటి.

హేమప్రభ — ప్రతీహారి.

విద్యలు — విశ్వామిత్రుని హోమకుండమునఁ బ్రత్యక్షమగుచున్న త్రిశక్తులు.

స్వయంవరలబ్ధుండును శ్రీమహీపాలదేవునియాదేశంబు గాంచి
తిని. పురావిదు లుదాహరించు నీప్రశస్తగాథ యాయనదే గదా!

మ. అనుకూలుండయి యాశ్రయించి గహనం బానార్యచాణక్యనీ
తిని, మున్నందులఁ గెల్చి పుష్పపురిఁ బొందెం జంద్రగుప్తుండు; గం
టునఁ గర్ణాటనఁ గాంచువారి సకలం బ్రాపించె భుజాదర్పమం
దనఁ దౌ శ్రీమహీపాలదేవుఁ డసంద్రైనాఁ డిప్డు నిక్కంబుగన్

పారిపార్శ్వకుఁడు—(ప్రవేశించి) ఆర్యా! అస్మన్మహారాజు నాదేశమేమి!

సూత్రి—సుప్రసిద్ధం బగువిజయప్రకోష్ఠుఁ బ్రపౌత్రుం డార్యక్షే
మీశ్వరకవి నవీనముగా విరచించినచండకౌశికనాటకముం బ్రయో
గింపుమనది యని. అస్మన్మహారాజవి నాట్యవేదవిశారదులును, విద్యాకలావి
దులును, లోకజ్ఞులు, నగు సభాసదులుం గూర్చి యిట్లు పలికియున్నాఁడు.

క. దోసము లేశము లేవి
వీసము గుణంబు లేవియు లేవెంకన్;
దోసమును గప్పి పుచ్చుఁడు;
భాసిలఁ జేయుండు గుణముఁ బండితులారా.

కావునఁ బారిపార్శ్వకా! కుశీలవులతో సంగీతము నారంభింపవేమి!

పారి—(సాశంకముగాఁ దల వాంచుకొని) ఆర్యా! ఆలకింపుఁడు. నాఁడు
గ్రహణకాలమున మీరు దక్షిణ యిచ్చెద నని మాటయిచ్చిన
బ్రాహ్మణోత్తముఁడు తదర్థము నేఁ డరుగుదెంచి కోపపడు
చున్నందునఁ గుశీలవు లందఱు వందురుచున్నారు.

సూత్రి—(భయము నభినయించి చింతను నటించి సహర్షముగా)
మారిషా! ఈవిషయమున విషాదంపడ నేటికి? ఇదిగో నే నిప్డే—

ఆ. వె. ఆలిఁ జూలి నమ్మి యాత్మదేహము నమ్మి
సత్యపాలనంబు సలుపఁ బొంచు

నియ్యకొన్నవిత్త మిత్తు హరిశ్చంద్ర
పార్థివుండు వోలె బ్రాహ్మణునకు.

(తెరలో) వయస్యా! ఇటు, ఇటు,

సూత్ర — (తెరవంకఁ జూచి) ఓహో ఏమి! హరిశ్చంద్రమహారాజే మహోత్సాహసూచకంబు లగునాపదలు కుశలపరిణామంబులుగాఁ బ్రసిద్ధి నిస్తరుం డగు పురోధసుండు రహస్యంబున నుపదేశించిన నియమజాగరంబును భావించి పర్యాకులమానసుం డగుచుఁ దనకుం బ్రియవయస్యుండు బోధాయనుండు దారి చూప సంతిపురము వైపున కిటు బయలు వెడలినవాఁడు, చూడుఁడు—

చ. ఖర మగుతూఁగుచేఁ దొరఁగుపాటిని సోమరి కన్నులం, బ్రజా
గరమున వాడు వేరుముఖకంజమునన్, విభుఁ డీతఁ డొప్పెడున్,
మంగిన యాత్మయూథమును మాపటివేళను బాసి, రేపటన్
విరహకృశానుకీలలను వేఁగు మహాగజరాజమో యనన్.

కావున నక్కడకే పోదము రా. (నిష్క్రమించుచున్నారు) (ప్రస్తావన)

(తరువాత జాగరఖేదము నభినయించుచు రాజును విదూషకుఁడును
ప్రవేశించుచున్నారు)

విదూ — చెలికాఁడా! జాగారవుబడలికఁ గలకన్నులతో నీపదద్రవముఖం బగుతాఁజేలునుం బోలె నున్నెత్తని మేఘంబులం గావించుచున్నను దారి గానక గుడ్డియెలుకలాగున నిటునటుఁ బరిభ్రమించుచున్నావు.

రాజు — మిత్రుఁడా! ప్రాణులకు శరీరధారణవిషయంబునం బ్రథమకారణము నిద్రయే గదా!

ఉ. చిత్తముఁ దేఱుచుం జులుకఁ జేయును వస్తములైన యంగముల్;
గ్రొత్త వికాసముం బ్రతిభకుం గలిగించుఁ, దొలంచు నొప్పముల్

బాత్రిగ; ధాతు సామ్యమును బొందఁగఁజేయును; వేయునేటికి
త్యుత్తమయోగగవ్యసుఖ మొక్కటిఁగూడ ననిద్రయుప్పమే?
అందుచేతనే చూడు నాకిప్పుడు—

ఉ. నిద్దురబట్టదెంబునను నెమ్మి యొకింతయు లేదు పావహీలైనన్
దద్దయు; ఖేదభారముకతంబునఁ బ్రస్తుతమింతయు చిత్తమున్;
ఒద్దిగ నావులింతలు జనించెను మానక సారెసారెకున్;
బ్రొద్దుటి లేఁత యెండపొలుపుంగన సైఁపదు చూపు లేశమున్.

(ఆలోచించి విస్మయముతో) ఇప్పు డీనిశాప్రజాగరవ్రత మావే
శించుటకుఁ బూజ్యులగు కులపతులయభిప్రాయ మేమైయుండునో?
ఏమయిన నేమి? గురుశాసనములు నమస్కార్హంబులు గావు.

విదూ—చెలికాఁడా! నే నాలోచించిచూడఁగా వాసవసజ్జిక యగు
దేవి ఖండిత యయ్యెననునర్థము దక్క వేఱొక్కటి యీ వ్రత
మునకుఁ బ్రయోజనము గానరాకున్నది.

రాజు—మిత్రుఁడా! నీపరియాచకములు మానుము.

విదూ—అయ్యో! నీ కిది పరిహాసకము గాని యనాథవటువునకు
నాకు మహానర్థము.

రాజు—(సోత్కంఠముగా భయమును నటించుచు) మిత్రుఁడా! దేవి
యేమిచేయు నని నీ వనుకొనుచున్నావు?

విదూ—చెలికాఁడా! నిశ్చయముగా నామె కోపముచేయు నని యూ
హించుచున్నాను.

రాజు—మిత్రుఁడా! అది తప్పు. అందుకు సందేహ మేమి? దేవికిది
సామాన్య కోపకారణము గాదు చూడు.

ఉ. మంతురు లాఁగిరో, హితసమాజము గోష్ఠికిఁ జొక్కి నిల్చెనో,
కాంతుఁడు, వేఱొకర్తు ననుఁగాదని కూడెనో, రాఁడు ధూర్తుఁడై,

విదూ—(నడచి తెరవంకఁ జూచి సశ్లాఘముగా) ఓహో! చెలికాఁడా చూడు చూడు. అలంకరణోపకరణంబులం గొనివచ్చెడు చారుమతితోఁ బ్రవేశించి యిదిగో దేవి యిక్కడ నున్నది.

రాజు—(చూచి సతోషముతో) ఆహా! ఏమీ!

చ. చెలి శరగౌరపుందళుకుఁజెక్కులఁ గూర్పదు పత్రభంగి; పీనులఁ గడ క్రొత్తువాలికకనుంగవఁ దీర్పదు కజ్జలంబు; వేనలి కుటిలంబు వేణియు; నరుణం బధరం బగు ధూసరం;బిటుల్ పొలిచినఁ దోఁటి దేసుషమ;భూషణముంబు సేయు నాఁదగున్.

(తరువాత ముందుచెప్పినట్లు చింతను నటించుచు శైబ్యయుఁ జారుమతియుఁ బ్రవేశించుచున్నారు.)

చారు—దేవీ! ఇదిగోఁ బ్రసాధనోపకరణము.

శైబ్య—(ఖేదముతో) ఓసీ! చారుమతీ! యిక్కడ నివి తీసివేయుము. నన్నే నెందాఁకఁ బరాభవించుకొందును? నాహృదయమునకీయలంకరణోపకరణాసక్తి నిరర్థకము.

విదూ—అబ్బో! ఈమెది గట్టిపట్టే.

రాజు—బాగు! దేవీ! బాగు! నిసర్గమనోహరంబు లయినసీయువయోవంబులకుఁ బ్రసాధనోద్దేశము నిజముగాఁ బరాభవస్థానమే; చూడుము.

మ. తరుణీ! నీజిగిమోవి కాశపడెడుం దాంబూలరాగంబు; సుదరి! కందోయిని ముద్దుఁ బెట్టుకొన నుత్సాహింపడుంగజ్జలం; బురువక్షోరుహా! కౌఁగిలించుకొనఁగా నూహించు హారంబు కంధర; ఏకేటికి భూషణంబు లివి స్వార్థం బాశ్రయించు న్ననన్.

విదూ—మిత్రుఁడా! మనసు సమీపెంతము.

రాజు—చెలికాఁడా! మన మిక్కడ దాఁగి యుండి వీరివిస్రంభసంభాషణ మాలకింతము. (అట్లు చేయుచున్నారు.)

శైబ్య — చేటీ! చారుమతీ! అప్పటమున నూటఅడించియు వారల నన్యాధ్యపుత్రుడు విప్రలంభగోచరిం గావించెనుగదా! సర్వథా నాభాగధేయంబు లవిశ్వసనీయంబులు. వాని కిదె బదివేల నమస్కారములు.

రాజు—ఓమనస్విని!

క. ఘనపటలాంతరితుడగు
నినుడు, డబ్బిర మోము ముడువ, నేమి యుపాలం
భన మయ్యెడు నయ్యది యా
యన? కెట్టులు విప్రలంభ మది పద్మినికిన్?.

చేటి— దేవీ! నీవిచారము మానుము. రాజులు బహుభార్యులుగదా!

విదూ—ఆ! బానసహోతాయ్రా! బహుభార్యలు చెప్పను. ప్రియమిత్రు నూరక యపదూఅఅపాలు చేసెద వేల?

రాజు—చెలికాడా! దీనిమీదద గోపపడకుము.

క. సమయము గని సఖులకదం
బము బిగిసము సేయు చుండ మానగ్రింథిన్,
రమణుల మిథ్యోపాలం
భమునకు బాత్రక లభించు బహుపుణ్యునకున్.

శైబ్య—(ఏడ్చుచున్నది.)

చేటి—దేవీ! ఊఅడిల్లు మూఅడిల్లుము. అతిమాత్ర మైనయమాయికత్వముచేత నీవే మహారాజును మాఅట బెట్టినదానవు. అమ్మా! నీ విప్పుడు నన్నడిగితినా విను. ఆయన నిన్నుజూచినను నీవాయనను జూడకుము. ఆయన నిన్నెంత మంచిమంచి మాటలతో బతిమాలుకొన్నను దడవుగ నీవుల్లనము లాడి యాయనను ఖేద పెట్టుము.

రాజు—(తొందరగా) పీఠము. పీఠము.

ప్రతీ—(పీఠము గొని వచ్చుచున్నది)

రాజు—స్వామీ! ఇదిగోఁ బీఠము. కూరుచుండుఁడు.

(అందఱుఁ గూరుచున్నారు.)

రాజు—హేమప్రతీ! నీవు ద్వారముకడ నుండుము.

ప్రతీ—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నది)

తాప—రాజా! మహాత్ముండయిన కులపతులు తమ యాశీస్సులవలన సత్యప్రభావసంపన్నంబు గావించి నిశ్శ్రేయఃకారణంబును గాంతాసహితంబుగా నీవు శిరస్సునఁ జల్లుటకు స్వస్త్యయన శేషము నీశాంత్యుదకము నంపినారు.

రాజు—(హర్షముతో దోసిలిపట్టి) మహాప్రసాదము.

తాప—

మ. శమితాంహశ్చయమున్ ద్రిశత్పూతమును బుష్యత్ప్రాక్తన తేజోనలం
బమితప్రోన్మత్తఖలదుర్విపచ్ఛమనసంప్రారబ్ధసత్కర్మదే
వ మనిర్వాచ్యమహత్త్వమానుదక మైశ్వర్యంబు నీ కిచ్చెడున్
బ్రమదంబుంబాదలించుఁగాత మఖరాడ్భూత్యుఁ ద్రివారింపుత౯.

(శిరస్సునఁ జల్లుచున్నాఁడు.)

రాజు—(స్పర్శము నభినయించి) ఆహాహా!

క. అంకుతత్రిబీజమునకుం
గలుగం బ్రసవాంకురంబు కాఁబోలు నిది, వే
వెలుఁగుఁగోలను తేండ్రెత్తుకఁ
దల దీఁ ప్రసాదమునఁ గదా మెత్తిరిల౯.

తాప—పూజ్యురాలా! శైబ్యా! కులగురుల యాదేశంబున గృహదేవతలకును భూదేవతలకును సవిశేషముగా నీవును సమారాధనములు జరపవలయును.

శైబ్య—(దోసిలి పట్టి) స్వామీ! చిత్తము.

తాప—రాజా! నీకు శుభమవుఁగాక. నేను ప్రారబ్ధవివిధవిఘ్నవిస్తృతు లగుకులపతులసంభావింపఁ దగుచున్నాఁడ (నిష్క్రమించుచున్నాఁడు)

శైబ్య—(వైలక్ష్యముతో) ఓసీ చామంతికా! ఆర్యపుత్రునకు నిశాప్రజాగరము మహానుభావులు కులపతులే యాదేశించిరి. అయ్యో! నమ్మకము లేని యీపాపమనస్సు నన్నెంత దురాత్మురాలిఁ జేసినదే. కానీ. ఈలాగు చేసెదను (దోసిలిపట్టి ప్రకాశముగా) ఆర్యపుత్రులు నన్ననుగ్రహింతురుగాక.

రాజు—(అనురాగముతో) ప్రేయసీ!

ఉ. చెన్నఁటితప్పిదానఁ గలుషీకృతచిత్తుఁడ నయ్యు నాకు నో
యన్నులమిన్న! నీ వినయం బిది గ్రాహ్యము యందువేఁ నీ
ప్రన్నని చెక్కుటద్దములఁ బత్రములన్ రచియింతు మత్తవుం
బన్నసరంబుఁ గంబుసమమం బగుకంఠమునన్ ఘటింతు నన్.

శైబ్య—(సిగ్గు పడుచున్నది.)

రాజు—(అట్లుచేయుచు) ప్రియురాలా!

చ. చెఱకురుగుర్వు నీకు జిగిచెక్కుల, నాకు వడంకు గేల నే
క్రమమున వ్రాయ నేమకరికల్? సకలంబు వృథాశ్రమంబుహా
రము మెడఁ గూర్పఁగా నదితరంగిత మౌచుఁ గుచాగ్రసీమఁ గం
పమును మదీయహస్తసహవాసభవంబును మాన దుగ్మలీ.

శైబ్య—ఆర్యపుత్ర! కులపతు లానతిచ్చినట్లు లాచరింపఁ బోవుచున్నదానను. (ఇద్దఱును నిష్క్రమించుచున్నారు)

రాజు—మిత్రుఁడా! సోక్కుచుండఁడ నైన నే నేలాగునఁ బ్రొద్దుపుత్తును.

విదూ—చెలికాఁడా! నీవు నేవిమాటలను జెప్పుకొనుచు సంతోషింపుము! నేనును భోజనప్రసంగములోఁ గాలము పుత్తును.

వనచరుఁడు—(ప్రవేశించి) జే జే దేవరా! అవధారు సామీ! బెట్టి దవుముట్టి ముట్టకొనం బిట్టు గ్రోడాడుతుంగిపట్టులం బుట్టిన నెత్తావి వెల్లువపొత్తులం బెల్లువలచు నూర్పుగాడ్పులఁ దంతయంత్రాంతరదరచర్వ్యమాణంబు లగు తెల్లని కొట్టిగడ్డలపిండి యిట్టట్టుఁ జెదరి ప్రకీర్ణప్రతిపక్షజయాపార్జితంబగు యశఃపటలంబునుం బోలెఁ గాలమేఘంబునం గురియుకరకవర్షంబునుం బోలె దశదిశాభాగంబులం గప్పఁ బెద్దకాలంబునుండి మెదుకొని యున్న వేసంపుఁగారణంబునం జేసి రోసంబునం బూర్ణశశాంకమండలంబునుండి సింహ బలిమిం గళాయమళంబుఁ జెరలి చికబళించుతుది రేయి కటి కిచీకటి ముత్తమ్ముంబోలె దశనాంతరాళఖడనభయకుండలాయితమృణాళదండభాసురకరాళవికటదంష్ట్రాయుగళంబున ముఖమండలంబు దీప్రింప, నేహారుకోపానలంబు సెగయునుంబోలెఁ దరళతరజిహ్వప్రవాళంబు గ్రాల విదారితపనసింహసంహతి యగు నిజగర్వగంభీరఘుర్ఘురారావంబునం బెదరి తమతమజాతి కనుగుణంబుగా వాపోవు నాభీలశార్దూలాది వ్యాళజాలంబుల కోలాహలంబు బాలకించి యాగ్రహించి యాక్రమించి కర్ణద్వయంబు ముత్తమపుఁజిప్పదోయిం జప్పటలు నఱప రూక్షతరపింగాక్షివిక్షేపం బులఁ శితకరవాలవిమలేంద్రనీలకజ్జలతమాలశ్యామలస్థూలకాయంబు స్ఫులింగశేషం బగుదవదహనమషీరాశి నీసడింప, వికటాటిచ్ఛటాకడారకేసరకలాపం బన నిరంతరపరిస్ఫురద్దవనలగ్నదావానలోద్గారభాస్వరం బయి యవతారితధరావలయలీలానమిత్థితం బగు మహావరాహంబునుం బోలె నొకవరాహయూథాధిపతి మృగవ్యభూమిం బ్రవేశించెను. అవధరించి దేవర చిత్తానుసార మాచరింపుఁడు నేను నక్కడకే పోవుచున్నాను.

రాజు—(సంతోషముతో) ఆహా! నాకిప్పుడు వినోదస్థానము లభించినది.

విదూ—(కోపముతో) ఓహో! చెలికాఁడా! ముల్లుకంపలలోను తెల్లుకబ్బులలోనఁబడి మిట్టుపల్లంబు లనక యాఁకలిదప్పులకు లోఁగుచు నడవులలోఁ దిరుగులాడవలయుటం బట్టి బహుప్రత్యవాయంబు నాఁ జను వేఁటయే నీకు వేడుకపట్టు మనపట్టణమున నీకు లోకములో నాయాసస్థాన మేది యుండును ?

రాజు—మిత్రుఁడా! రాజులకు వేఁట యత్యుపకారకము గదా! చూడు—

చ. అలఁదురుమానసంబునకు హాయి ఘటించుఁ; జలించు లక్ష్యముం
దలపఁబడుచుఁ స్థిరత్వ మఖిలాంగముల లాఘవ మొందఁజేయు న
క్రొలుపుఁ గడంక బుద్ధిఁ; గలఁకుంబలెనే తయు యోగ్యమింతయుం
దలఁపక వేఁట నందు వ్యసనం బిది రాజులకుం బండితుల్.

కాఁబట్టి రా మన మక్కడకే పోవుదము.

[అందఱు నిష్క్రమించుచున్నారు.]

—: గద్య :—

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాది సాధు
వంశక్షీరనీరాకర రాకాసుధాకర రాచ్చ నామాత్యపౌత్ర హరి
తసగోత్ర పవిత్రగుణకదంబ లక్ష్మాంబాగర్భశుక్తిము
క్తాఫల సూరపరాజపుత్రానతనూభవ విబుధ
విధేయ సుబ్బరాయ నామధేయాంధ్ర
కృతం బగు చండకౌశిక
నాటకంబునందుఁ

ప్రథమాంకము.



శ్రీ పరమాత్మనే నమః.

# చండకౌశికనాటకము

## ద్వితీయాంకము.

[తెరలో] ఓహో వరాహాన్వేషులారా!

మహాస్రగ్ధర.

కలంచుం బంకంబుఁ, ద్రెంచుం గమలిని, సములం గందళన్మస్తకంబుల్,
జలమీనంబుం గూలనొడ్డుల్, స్ఫుటములుగ వ ప్రస్థలుల్ సల్పుఁ, దూటెం
బలుగోపంబు, దక్కెం దక్కెం, బఱచుఁ బఱచు, వేగ ల్లముల్ చిమ్ముఁ డంచుం
బలముల్ వెన్నాడి గాలింపఁగఁ జొరఁబడెనుం బదిక్కాంతారభూమి౯.
గాఁబట్టి యశ్వుల నెల్ల నరికట్టవలయును.

సీ. గహనాంతరోద్ధధూమ్రవాహజాలికలు బాల
బంధంబులను బొంతఁ బన్నవలయు
భయకసంఘులు వనాభ్యంతరంబున జాగిల
ములఁ బట్టెడ లెస్సఁ బంగవలయు
వలయు నా జాలు వనస్థలము లెల్లను బాశ
హస్తులు రాహుత్తులలము వలయు
దండముల్ పూనుదాంగిల రౌతు లంతకల్
బల్లెగాన గజిబిశింఫంగ వలయు

[తెరలో] అతినిబిడవనాంతర్ధానగర్విత! వరాహాధమ! ఉండుండు.

చ. కనఁబడుచుం నిమేషమునఁ గన్మొఱంగుచునో పిసాళి! మా
యను గయికొన్నచందమున నక్కట! సన్నలయించి దవ్వుగాఁ
గొని చనుదెంచి తేల నుడుగుల్ వెయి? నీ విపు డింత నాదుకం
టను బడి తేని దామరవసంబుల నింకిటఁ ద్రుంప వెన్నఁడున్.

విఘ్న—(విని హర్షముతో) ఓహో! ఇతఁడు సమీపించెనే. నే నిపు
డీలాగునఁ బోయి యెప్పటిమాయనే యవలంబించి కనఁబడియెదను.

(సత్వరముగా నడచి నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత విల్లుపూని వెంబడించుట నభినయించుచు రథమెక్కి
రాజును సారథియుఁ బ్రవేశించుచున్నారు.)

రాజు—("కనఁబడుచున్ నిమేషమున" అను పూర్వోక్తపద్యము
పఠించుచు ముందుచూచి సంతోషముతో) ఆర్యా! ఆర్యా!
వరాహము మనకుఁ జేరువనున్నట్లు తోఁచుచున్నది—చూడు.

చ. నమలుతఱిం దొరంగుకవణంపుబిసంబులు గప్పె పేవన
క్షమను గలంగి పాఱునుదకంబులధార లివే సరస్తటిన్,
శ్రమగళితోరు ఫేనముల శాద్వలముల్ శబలంబు లిందు, సాం
ద్రము ధృతముస్తసౌరభము తచ్ఛ్వసితంబుల మారుతం బిటన్.

(మరల నిపుణముగాఁ జూచి సంతసముతో) ఆర్య! ఆర్య! ఇదిగో
నది, చూడు చూడు.

ఉ. జోక మెడం గదల్చికొనుచున్ వెనఁ ద్రివ్వినదుంపతో డిప
ర్యాకులలోలనాలపికచాబ్జము నోరను బూని, కో నిగూ
ఢాకృతి యైననాభినల మాననపద్మముఁ జేరఁ గాండి దం
ష్ట్రాకలితక్షమోద్ధృతిని గ్రాలుమహాకిటి నాఁ దనర్చెడున్.

సూతు—(సకౌతుకముగా విలోకించి) ఆయుష్మంతుఁడా! చూడు
చూడు.

మ. తిరుగం గ్రొవ్వన వచ్చి లక్ష్యమయి భీతిం దోప వెన్దిసి ముం
దఱిపాదంబులు సాఁచి, కంచుచరమార్థం బీడ్చుచున్ వసుంధరన్
ద్వలితశ్వాసవిదీర్ణసృక్వవివరభ్రశ్యద్బిసాంకూర మా
ర్గిగోలం దరిసించు నీ కన గతవ్రీడావిలజ్ఞాఘ్యమై.

రాజు—(బాణమోక్షణమును నటించుచు నభినయించి యంతటఁ జూచి యాశ్చర్యముతో) అయ్యో! యీసీమమున నే మాయమై పోయినదినిమీఁద నః వసరమున బాణమోక్షణము గావించితినే.

చ. కను మొఱఁగుక్ క్షణంబు, క్షణకాలము దృగ్గపయుం బగుక్, మఱిన్
జనుఁ గడుదవ్వుగా, మరల సన్నిధి కుంచుఁ జరించుఁ, గ్రమ్మఱన్
వెనుకను బ్రిక్క నంతటను వెండి బ్రమించు; మెఱుంగువోలె ని
ల్వని దగుదీని నొక్కరణి లక్ష్య మొనర్పఁగ నోఁప దేమియుక్.

(నిపుణముగా నరసి దూరము చూచి యానందముతో)

ఓహో! వరాహ మీ మహారణ్య మతిక్రమించి ప్రసన్నభూమి నధి రోహించినది. ఆర్య, ఆర్య! గుఱ్ఱములను వేగముగాఁ దోలుము. ఇఁక నిది యెందుఁ బోఁగలదు?

సూతు—(అట్లు చేసి రథవేగము నభినయించి) ఆయుష్మంతుఁడా! చూడు చూడు.

చ. వెనుకను బెందుదూరమున వీచెడుగాలిని మీఱుచుక్ వడిన్,
మునుమున లక్ష్యముం గలయఁబోయెడునాపది వెన్నడించుచుక్,
దనయచలధ్వజాంశుకము దాఁకఁ బయోదము నీశరాళితో
డను నరి గాఁగ నయ్యయిరొడక్ భవదీయరథంబు వ్రాలెడక్.

రాజు—(విస్మయముతో) ఏమిది!

మ. చదలఁ జరించుచుం బవనజైత్రజవంబున సంబురాశి గో
ష్పదముగఁ జొక్కళించురథవాజులతోఁ దనుఁ గూడ ముట్టునా

కరిర ! విభిన్నకర్జాంచయుపత్రియమానవినీలకాయ మీ
క్రోడమవరాహ మర్త్యమునకుం దమమట్టులు దూరదూర మా.
(ముందుచూచి ఖేదముతో) అయ్యో ! యీమహారణ్యము నతిక్ర
మించి వెంటనే యదృశ్యం బయినదీని యడుగులజాడ యయినను
గానరాకున్నది. కానీ, ఇదిగో నెట్టయెదుటం దిన్నగా నున్నయీ
యరణ్యరేఖ నిప్పు డన్వేషించెదను. (అట్లు చేయుచు సంతోష
ముతో) ఓహో ! యిది తపోవనోపకంఠము గానంబడును. నిశ్చ
యమే.

చ. ఒకయెడ వేళ్ళతోం జెఱికి రొక్కెడం గోసిరి దర్భబీళ్ళు; పూ
లకు దయ నందుకో రివటం న్ లత లింతిసుమంత వంగె; నో
ల్చికొనుటం జేసి వల్కలముం జెట్టిట గాయపడెన్; దొరంగుపాల్
పత్రికట మొనర్చు నీతరువరంబుల నిప్పుడె తుత్రించు టిధ్మముల్.
(అంతటం జూచి సంతోషముతో) ఆర్యా ! చూడు చూడు.

చ. చిలుకలు స్వాగతంబును వచింపచుం గదంబపుం దొట్టితోదియర్ ;
దలంపు హరించు ఘ్రాణమును దన్పుచు హవ్యసుగంధవాయువుల్;
జలపులినప్రదేశజకుశం బఘునిర్ఝరతోయ మీకురం
గులు మనవంకం గన్గొనుచుం గోత్రిలు భయాతివిలోల దృష్టులన్.
మాతలీ ! యాశ్రమోపాంతసంచారి యగునీవరాహము నీకు వెదుకం
దగదు. నీ విప్పుడు గుఱ్ఱములను నీరు ద్రావించి విశ్రమింపం జేయు
ము. ఇంతలో నేను నాయుధమాత్రసహాయుండనై యాశ్రమము
నం బ్రవేశించి తపోధనుల కభివాదనంబు గావించి వచ్చెదను.
పూజ్యులకు సపర్య గావింపమి శ్రేయోవిఘాతంబుగదా !
మాత — చిత్తము దేవా ! (నిష్క్రమించుచున్నాడు)
రాజు — (చింతను నటించి సశ్లాఘముగా) ఆహా ! యేబెత్తుల నెటుం

గమింజేసి యీజడదారుల మొంగబు లెంతరమణీయంబులై యొసం
గుచున్నవి !

మ. గతసంకల్పునకుఁ గోరఁబోదు మది భోగంబుల్; మమత్వంబు వ
ర్జితమై యేగుటచే వియోగములపై స్నేహంబులున్ గావహం
కృతిఁ దూలించుట స్వాన్యభేద మనుమాటే లే దసర్వాచ్య మా
నతిశాంతిం ఘను లౌతపోధనులు సౌఖ్యశ్రీనిధానుల్ గదా.

(వినయముతో నడిచి భయమభినయించి సాశంకముగా) అహో !
యే మిది ! అవిసయదురాలోకంబు లైనయీతపోవనంబు లపూ
ర్వంబు లగుటంజేసి సాపరాధులకుంబోలె సాధ్వసముం గలిగించు
చున్నవి. తేజస్సులలో సర్వాభిభావియు నసభిభవనీయంబును
నగుతపోమయబ్రహ్మతేజం బనిర్వచనీయంబు గదా !

క. అనుగనుగున జడు పిడు నా
కడవి ప్రశాంతము మనోజ్ఞ మయ్యును, మెత్తం
బడు నెల్ల తేజము లు తమ
పొడమినకడ నిప్పు నీటిపొందునఁ బోలెన్.

(భయముతో నడచుచున్నాఁడు)

(తెరలో) ఆర్యులారా ! రక్షింపుఁడు రక్షింపుఁడు. ఏయపరాధము
నెఱుంగని యనాథల మశరణ్యలము; అయ్యయ్యో ! యతిదారు
ణముగా నగ్నిహోత్రమునఁ ద్రోయఁబడుచున్నారము. మంద
భాగినులను మమ్ము రక్షింపుఁడు రక్షింపుఁడు.

రాజు——(విని యపష్టంభముతో) ఓహోహో ! చేరువ నీవైపున భ
యార్తిం గూరిన యాఁడువారలదియుం బోలె నంగలార్పు వినవ
చ్చుచున్నది. (అచ్చెరువుతో) ఏమిది ! ఇది తపోవనమే. ఇటు
వంటియుపనీతుల కిక్కడ సంభవ మెట్లు ? కానీ నమూపించెదను.

(అటు చేయుచున్నాఁడు)

[తెరలో దొంగటియుల్లి వినఁబడుచున్నది.]

రాజు—(విని సావష్టంభముగా) భయార్తుల కభయ మభయము.

(క్రోధముతో) హా!

క. క్రూరుఁడ నాత్మనీన మతిఘోరము నీఖలకర్మముందవ
శ్యారివనీవిరుద్ధము నృశంసము నెవ్వఁ డొనర్చు, వాని నా
దోరసి గొంతుఁ గోసి మెయి తున్కలుతున్కలు చేసి యుజ్వల
ద్వైరివవహ్నికీలలను భస్మముగా నవియెల్ల వ్రేల్చెదన్.

(నడచి తెరవంకఁ జూచి విస్మయముతో) ఓహో! యగ్నిహోత్ర
మధ్యంబున నాసీనంబయి భయార్తిని నంగలార్చుచు దివ్యరూపం
బునం దేజరిల్లునారీరత్నంబుతో సన్నిహితహోమసాధనుం డయి
యగ్నిశాలయం దున్నవీఁ డెవ్వఁ డయి యుండును? నిజముగా
వీఁడు తాపసవేషధారి యగుకొండొకపాషండుండు గావలయు.

(తరువాత హోమము నభినయించుచు విశ్వామిత్రుండును, య
థాసర్దిష్టముగా విద్యలును ప్రవేశించుచున్నారు)

విద్య—(సంభ్రమించుచుఁ బూర్వోక్తము పఠించుచున్నారు.)

విశ్వా—(ఆశ్చర్యముతో) ఓహో! యేమి చెపుమా.

ఉ. పూని మహిస్సుమిత్రపరిపూత ముహూర్తమున నే నొసంగఁగా
నైనను గాఁడు లేశము హుతాశనుఁ డిద్యెడ దక్షిణార్చిః హె
చ్చైనకిర్తిప్రభావము, నద్దిర! యిద్దను నేఁడెంచి రీ
చాలు విద్య లైనను వశింపడ కుందురు నాకిదేమొకో.

(సమాధి నభినయించుచున్నాఁడు)

విద్య—(పూర్వోక్తము పఠించుచున్నారు)

రాజు—(సత్వరముగా సమీపించి) భయార్తుల కభయ మభయము.

అరే! దురాత్మ! పాషండాధమ! నిలు నిలు. ప్రచ్ఛన్నరాత

సుండ వగునీమాయాప్రపంచ మిదియేమి ?

ఉ. కేల వరాటమాల, తలఁ గెంజడలుం, మొల వల్కలంబు, ద
ర్భాలుల దైనయీపరమశాంతపువాలక మేమి ? ఘోరచం
డాల ! జుగుప్సితం బకరుణం బగు స్త్రీవధ, పాతకోత్సవో
ద్వేలమనం బిదే యనుభవింపుము కర్మఫలంబు నిప్పుడే.

విశ్వా—(సంవరణము నభినయించుచుఁ గ్రోధముతో)

మ. అసకృత్కర్ణకఠోరభర్త్సనమిషవ్యాఘట్టజుం డాంతర
ప్రసభక్షోభసమాధిభంజనభవద్వ్యాపద్విరద్దీప్తి నా
యసదృక్క్రోధజజాతవేదుఁడు సమిత్ప్రాప్తిం దయస్పర్శ
ప్రవరోద్యత్ప్రబలమహాగ్ని నాఁ ద్రిభువనగ్రాసేచ్ఛఁ దీఁగుతం

విద్య—(సంతోషముతో) మాకుఁ బ్రియము, మాకుఁ బ్రియము
జయము జయము హరిశ్చంద్రమహారాజ ! (నిష్క్రమించిరి)

విశ్వా—(చూచి క్రోధముతో) అహో ! యేమిది ! దురాత్ము
డీహరిశ్చంద్రుఁడే మాకు శ్రేయోంతరాయుఁ డైనాఁడు. అరే
క్షత్రియాధమ ! నిలు నిలు.

ఉత్సాహ. హరివి యగుదు గాక, చంద్రుఁడగుదు గాక, చంద్రమౌ
ధరుఁడుహరుఁడె యగుదు గాకఁ దానికేమి యధమ,యీ
పరమవిద్య లంతరింపఁబట్టి కొట్టిదంబు గా
నెరియు నాదుక్రోధవహ్ని కింధనం బగావు రా.

ఓరోరి దురాత్మ !

శా. జాయాకేళిమయుండు భూతకరుణాశాంతుండు దా నయ్యెఁగ్రీ
డాయత్తాత్మసమాధిభంగవిరసాన్యభ్రూకుటీభీషణుం
డై యాకృష్టశరాసు మారుఁగని ఫాలాక్షుం డెటుల్ చేసెనో
చేయుం గౌశికుఁ డట్టి నిన్నిపుడు దృష్టిం గ్రోధధూమాయితన్

రాజు—(సంభ్రమించుచుఁ దనలో) అయ్యో! యేమిది! ఈయన భగవానుఁడు కౌశికుఁడా? వారు పూజ్యరాండ్రు విద్యలా? వారి సిద్ధికిఁ బాపాత్ముఁడను నే నీయన కంతరాయ మైతిని గదా! నిజముగా నింధనప్రాయుఁడను నే నవివేకంబునఁ బ్రస్ఫురచ్ఛిఖాకలాపం బగు జ్వలనంబును ద్రొక్కితిని.

విశ్వా—(క్రోధముతో)

చ. కడఁగిన సాధనం బిటు విఘాతము నొందుటఁ గ్రోధమెచ్చి నా
కుడిచెయి గాంచు శాపమునకుం గడు వేగిరపాటు; నెన్నఁడో
విడిచిన దల్లజాతిఁ దలపెట్టుచుఁ దానును సాహసాంకమై
యెడమకరంబు చాపమున కెంతయు నేడ్తెఱ సేయు సత్తుకన్.

(లేచుచున్నాఁడు)

రాజు—(భయముతో సమీపించి) స్వామీ! నమస్కరించుచున్నాను.

విశ్వా—(క్రోధ మభినయించుచున్నాఁడు)

రాజు—(పాదములం బడి) భగవానుఁడా! క్షమియింపుము క్షమియింపుము. స్త్రీజనార్తప్రలాపమాయావంచితుండనయి యెఱుంగని వాఁడ నయిన నన్ను క్షమియింపం దగును.

విశ్వా—ఏమీ! "యెఱుఁగనివాఁడ నయిన నన్ను క్షమియింపం దగు" ననెదవుగా; ఓరోరి క్షుద్ర! నన్నే నీ వెఱుంగవుగా!

ఉ. జాతిస్వయంగ్రహంబున నెసంగిన దుర్లలితైక విప్రుఁడన్
బోతరవున్ వసిష్ఠముని పుత్త్రలకాననవీతిహోత్రుఁడన్
నూతనసర్జనోద్యమ వినోదనభీతజగత్కృతాంతుఁడన్
ఖ్యాతమతంగయాజకుఁడ గౌశికుఁడన్ నను నీ వెఱుంగవో.

రాజు—తాపసోత్తమా! ప్రసన్నుఁడ వగుము ప్రసన్నుఁడ వగుము స్వామీ! నీ విలాగున నమకోఁ దగునా?

ఉ. అన్నము లేనికాటక మనం దటు జీవిక గన్నవాని, భూ
భృన్నివహప్రతిగ్రహణవృత్తికిఁ జిత్తము రోయువాని, సో
సన్నుతకీర్తి! యాడిబకసంగరకంపితజీవలోకునిన్
నిన్ను మహాత్మ పోఁడిమి నేల నెఱుంగనివాఁడు గల్గునే

భీరుజనార్త ప్రలాపంబు నాలకించి యాలాగునఁ గావించితిని. స్వ
ధర్మాక్షిప్తచేతసుండనయి యెఱుంగకవాఁడ నయిన నన్ను క్షమి
యింపం దగునని విన్నవించుకొనుచున్నాను. మహానుభావ!

విశ్వా—ఏమీ! "స్వధర్మాక్షిప్తచేతసుండవా? దురాత్మా! చెప్పు
చెప్పు ఏదో నీధర్మము?

రాజు—మునికులోత్తమ! మనవి చేసికొనుచున్నాను. చిత్తగింపుము.

క. ఈయంగవలయు రక్షణ
సేయంగనువలయు, రణము సేయఁగవలయున్;
రాజులకు నిత్యధర్మం
బీయది యని పలికి రాదిఋషిమూర్ధన్యుల్.

విశ్వా—ఏమీ! "ఈయంగవలయు" ఇత్యాది పద్యము పఠించుచున్నాఁడు.

రాజు—మఱేమి?

విశ్వా—అట్లయినం జెప్పు—ఎవని కీయవలయు? ఎవ్వాని రక్షణ సేయవలయు? నెవ్వనితో రణము సేయవలయు?

రాజు—భగవానుఁడా! ఆలకింపుము.

విశ్వా—ఊఁ. మఱీ చెప్పు

రాజు—క. ఈవలయును సద్ద్విజులకుఁ,
గావవలె భయార్దితులఁ, బగఱతో రణముం
గావింపవలయు; నీయది
భావము దప్పఁ దలఁచుకొన వదరినాఁడన్.

విశ్వా—మహాత్మా! నీవట్టి దృఢవ్రతుఁడవగుటచే మాకు విద్యా తపోనురూపముగా నేమయినఁ గొంచెము నొసంగవలయు.

రాజు—(సంతోషముతో) ఓహో! భగవానుని చే వైవస్వతవంశ మనుగ్రహీతముగదా! స్వామీ! ప్రసాదింపుము.

ఉ. దేవర సత్కరించుటకుఁ దిన్నగ, లోకములన్ని చాల విం
 తావల నేమి యుండు? బిడియంబగు నాయఖిలంబు నిత్తు నా
 నోవిబుధాగ్రణీ! యయిన నోపనయీవి ప్రతిగ్రహింపుమీ
 భూవలయంబు సర్వధనపూర్ణ మశేషము నీ కొసంగితిన్.

విశ్వా—(ఆశ్చర్యముతో తనలో) కానీ నే నీలాగు చేసెదను. (ప్రకాశముగా) రాజా! స్వస్తి. సరియేగాని యదక్షిణము దాన మందురు. కావున దక్షిణ కూడ నివ్వ వలయును.

రాజు—(సిగ్గుపడుచుఁ దనలో) ఈమొదట జేయదగిన దేమి! (చాలఁ గ నాలోచించి సంతోషముతో) కానీ. ఈలాగునఁ జేసెదను. (ప్రకాశముగా) ఓమహాభాగ!

క. గడియించి లక్ష హేమము
 లిడుకొనిమొదల దక్షిణగ ఋషీశ్వర మీకున్
 దడవుక కసికరంబున
 గడు వోసఁగుదు నేఁడు మొదలుగా నెల నాకున్

విశ్వా—ఈగడువు మాకు సమ్మతమే కాని పుత్రమిత్ర విడిచి కడం గడించి యొసంగవలయు.

రాజు—(సాశంకముగాఁ దనలో) ఇందుకు (ఆలోచించి హర్షముతో) ఓహో క్రియ స్ఫురించినది. విశ్వేశ్వర కలదు గదా!

చ. తలఁచుచు వారణాసివసుధాతలభోగవిభిన్నభావను౯
బలుకుదు రంగరీత్యమునపట్టణ మంచును దానిఁ గోవిదుల్;
దెలియుదు రాగమార్థచరదృష్టిఁ గచాగ్రసహస్రభాగసూ
క్ష్మలవతులాంతరాళమును సంయమివర్యులు శ్రద్ధధానులై.
కాఁబట్టి యీయుపదక్షిణ నేనందార్జించి యిచ్చెదను. (ప్రకాశముగా) స్వామీ! తమయాజ్ఞకు బద్ధుండను.
(ఆభరణములను దీసి) మహాత్మా!
ఉ. ఈయఖిలంబు లైనసిరు లీవసుధావలయంబు శేష మీ
యాయుధముల్ సమస్తము, ధరాధిపలాంఛన మీకిరీటముం
దీయవి; నేఁ డిదే మరల భూమ్యదులాగ్రఘుల కప్పగించితిం
జూ, యమివర్య! సాదరముఁజూపున వీని ననుగ్రహింపరే.
(పాదంబులం బడి లేచి సంతసముతోఁ దనలో) ఆహా! ఆయాసభూయిష్ఠంబయినను నదృష్టవశంబున రాజ్యభోగ మిప్పుడు నాకు సఫల మయినది.

ఆ. వె. ఎడఁద నేది పెద్దపిడు గనుకొంటినో
యట్టిగాధితనయునాగ్రహంబు
చల్ల చల్ల జాతి జాజిపూవువండ
యగుచు నాదుశిరము నంటఁ బడియె.

(నేలపట్టి) భగవతీ! వసుంధర! ఇదిగో! నిన్ను వీడుకొనుచున్నాను.

ఆ. వె. దేవి! లోకధాత్రి! వైవస్వతులు నృపుల్
వీరకీర్తి నేలినారు నిన్ను;
నరిదిపాత్రముసకు మారగి నే విడిచితి; నా
నేరదోష మిది సహింపవలయు.

:క నేను ద్వరితముగా నయోధ్యకుఁ బోయి కౌశిక ప్రతిశ్రుతంబును సంపూర్ణ పఱిచి దక్షిణోపార్జనంబునకయి వారణాసి కేగెదను.

పరిహాసముగా) మహానుభావ! తమ రిప్పుడయోధ్యకు విజయం చేసి నన్నుఁ గృతకృత్యునిం గావించి దక్షిణాసంపాదనంబునకనుమతి యిచ్చి యంపవలయు.

శ్వా—(ఆశ్చర్యముతోఁ దనలో) అహో! ఈదురాత్ముని మనస్థైర్యము! ఏమీ! వీనిమహానుభావత్వము! ఆ! దురాత్మ! అచిరకాలముననే నీబింకము నేను వీక్షించెదను.

ఉ. ఓరిమదాంధ! యెందునక నజ్జ్వలరాజ్యవిభూతికిం బలెం
దోరపుసత్యసంపదకుఁ దోడస పాసినవాసిఁగాంచఁగ
న్నార నినుం గనంబడయ నందనుకేఁ భవదీయ దుర్నయో
దారత బగ్గుబగ్గను మదాగ్రహ మాఱుకురా దురాత్మకా.

(పరిహాసముగా) రాజా! అలాగే కానీ. ఏమి దోషము.

(నిష్క్రమించుచున్నారు.)

—* గద్య. *—

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధ సరసకవితాధురంధర వడ్డాది
సాహువంశక్షీర నీరాకర రాకాసుధాకర రాచ్చనామాత్య
పౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాం
బాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్ర
ధానతనూభవ విబుధవిధేయ
సుబ్బరాయనామధేయాం
ధ్రీకృతంబగు చండకౌశి
కనాటకమునందు
ద్వితీయాంకము



శ్రీ పరమాత్మనే నమః.

# చండకౌశికనాటకము

## తృతీయాంకము.

---

(తరువాత బీభత్సవేషముతోఁ బాపపురుషుఁడు ప్రవేశించుచున్నాఁడు)

పాప—(వికటముగా నడుచుచుఁ బెద్దనవ్వు నవ్వి తనలో)

క. ఆరంభమధురుఁడ నతి
ఘోరవియోగాధిశుగ్రుజామధ్యుఁడ నా
నారూపనరకబాధా
దారుణపరిణాముఁడను గదా పాపుండన్.

ముందు చూచి భయపడి తొలఁగి) కట్టా! పేరెత్త నయిన వల్లగాని యీవల్లకాటిపట్టణము నాదుంపదెంపినది. నన్నుఁ గడతేర్చినది. ప్రవేశముమాట యటుండఁగాఁ బట్టణముదరిఁ గన్నెత్తి దీనిఁ దేఱి చూడ నయినఁ జాలకున్నాఁడ. అమ్మా! నే నేమిచేయుదు? (ఆలోచించి) కానీ నే నిక్కడ నేకతంబ యుండి జన్మాంతర సంచితుని నన్ను విడిచి యిందుఁ బ్రవేశించిన జనులను దిరిగి వచ్చిన ప్పుడు పన్నంటెదను.

(తెరలో)

అపుడల శంభుపాదజలజాంకన మాయుఁ దత్ప్రేమ మా
శివకును బుత్రివత్సలత, సిద్ధశపం బతన శుత్రితంబు నా
కివి యిటు లున్నఁ గిన్నరము లెమ్ములుఁ దోలునమాయఁబడ్డ జీ
ర్ణవపుబదే? మనుష్య పరిణామము ప్రాక్కృతకర్మ మేరికిన్.

(పష్టాంభముగా) ఆ ! అది యాలాగే గదా! * (విస్మయముతో)
ఎవఁడురా యిక్కడ మాటలాడుచున్నాఁడు. (తెరవంకఁజూచి)
ఓహో! భగవానుఁడయిన విషమలోచనునియాసన్న పరిచార
కుఁడు భృంగీశ్వరుఁ డిదిగో నీలాగున వచ్చుచున్నాఁడు. నేను
ద్వరితముగా నవ్వలకుం బోయెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత భృంగీశ్వరుఁడు ప్రవేశించుచున్నాఁడు.

భృంగీ—(అపుడల శంభుపాదేత్యాది పఠించి యాలోచించి) దీని
కన్యథాత్వంబు గలదా? రాజర్షి యయిన హరిశ్చంద్రునకును దశా
విపర్యయము ప్రాప్తమయినట్లు దేవర దేవేరికిం దెలియఁబఱతి
చెనా.

ఆనతి యిచ్చుచో నధిపునద్భుతమైన చరిత్రఁ, జిల్లె నె
మ్మేను సెమర్చె నేత్రములఁ బొడమె మేఁగినబూదియు శూలికిం; దదీ
యానన మాచలద్భ్రినయనాంబురుహాత్రియమయ్యె; మౌళియుఁ
బూనవపూపరే వెలుఁగుఁబూ వసియాడఁ జలించె మాటికిన్.

రాచక్రవర్తి యిటకు రాఁగలఁడని దేవీసహితము భగవానుఁడు
ఫాలలోచనుఁడు పర్యుత్సుకుఁడయి యున్నవాఁడు. నేనును శీఘ్ర
ముగా భగవదారాధనము నిర్వర్తించుకొని యావేడుకఁ జూడ
సిద్ధముగా నుండెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

(తరువాత విచారముతో రాజు ప్రవేశించుచున్నాఁడు.)

ఉ. ప్రీతిని మౌని కిచ్చి పృథివిం దగవిం గనుమానసంబని
ర్యాతితదక్షిణం దలఁచి వ్యాకుల మయ్యెను; నాకు నార్జనం
బాతనిరాజ్యమంచుఁ దగనంచుసఁ దజ్జ్ఞు ధాత్రి నాని దై
పాతకహారియా శివని వాసముఁ జేరుదుఁ గాశికాపురిన్,

(చింతను నటించి నిట్టూర్పు విడిచి) అక్కటా! ఎంతకష్టమెంతకష్టము!

మ. అవశిష్టంబు త్రియుంబు త్యాగమున కీమూల్యం గుమారుండు మే
నవశిన్ లే దిఁకఁ, గ్రోధి గాధిసుతుఁ డత్యాజ్యంబుసత్యంబు, భూ
దివిజస్వోపహతంబు గాన విడ నైతిం గాదయో! జీవ మే
మి వొనర్పంగను బాలుఁవోదు మది కేమేఁన్ దిశల్ శూన్యముల్.

(ముందు చూచి సంతోషముతో) ఓహోహో! ఇదిగో వారణాసి.
తల్లీ! వారణాసి! నమస్కరించుచున్నాను. (ఆలోచించి యాశ్చర్యముతో)

చ. తపముల బ్రహ్మచర్యముల దాంతిశమానశనశ్రుతంబులన్
జపితతముల్ వఱితు రెద సన్యసనంబుల బ్రహ్మనిష్ఠుల
ట్టిపరమతారకంబు శివుఁడే యుపదేశ మొసంగుఁ బ్రాణికిన్
వపువుఁ దొరంగుచో నిటుఁ బునర్జననం బిఁక లేక యుండఁగన్.

చ. సడలనిచావుపుట్టువులనంకెల యూడును బ్రాణికిచ్చటన్;
మృడునికరంబునుండి పడియెన్ మును బ్రహ్మశిరంబు నీడ; ని
య్యెడ నవిముక్తుఁడై యుభవుఁ డేనముఁ బాసి వసించు జాయతో;
విడువఁడు దీని నెప్పుడును; వే ఱొక టింతటిక్షేత్ర మున్నదే?

నే నిం దేయుపాయంబున ముని ఋణంబునకుఁ బాయఁగలవాఁడ. (విచారముతో)

మ. ధనదుం గెల్చి గ్రహింతునో ధనము శ్రీత్యక్తంబు నా కేల గ
ల్పను వౌ యాచన జన్మిగట్ల కది చేయర్ దీనతన్ క్షత్రియుల్

ధనమూలంబు బెహార మన్నదది పేదన్ సాగునే నాకు? నే
వఃకిం గాల మపేక్షణీయ మది యోర్వన్ దైవయోగంబునన్.

అయ్యో! మందభాగ్యుఁడను నే నేమి చేయుదును? [ఆలోచించి సంతోషముతో] ఓహోహో! దొడ్డయుపాయము తోఁచినది. నే నిప్పుడు.

క. అమ్మకొని నన్ను నే స
త్యమ్మును బాలింతు శాశ్వతమ్ముగ; సదుపా
యమ్మున నది పోవమి ని
క్కమ్ముగ లోకద్వయమ్ము గావమి గాదే?

[సావష్టంభముగా] కుత్తవాఁడు లోహితాస్యుఁడు వెనుకఁజిక్కఁగా వాఁకొలఁకఁ బ్రతీక్షించుచు దీర్ఘాధ్వవిశ్రాంత యగు దేవి నన్నింకను గలిసికొనలేదు. ఆమె రాకమున్నే నేను సత్వరముగాఁ బోయి నకోఁక తీర్చుకొనియెదను. [పైకిఁ జూచి] అబ్బా! అప్పుడే పొద్దు నెత్తిమీఁదికి వచ్చినదే.

ఉ. చండకరుండు కౌశికునిచందమునం దపియించుఁ దీండ్రమై;
మండెడుఁ దెర్వ నామనసుమాదిరి; దైవవశంబునం గటా,
యెండను మాఁడిమాఁడి కృశియించిన దేవియుఁ బోలె భూమిరు
ట్షండము క్రిందికిం జనియె ఛాయయు నీయెడ మెల్లమెల్లగన్.

కాఁబట్టి యిప్పుడు గడువునకు— గాదు కాదు— హరిశ్చంద్రునకే, యవసాన మాసన్నమైనది. హా! మందభాగ్యుఁడను నేను నశించితినిగదా! [భూమిమీఁదఁ బడి తిరిగి లేచి దుఃఖముతో] ఓరి దురాత్మ! హరిశ్చంద్రహతక!

తే. గీ. మున్ను గాఁ బ్రాహ్మణున కియ్యకొన్నయట్టి
దక్షిణను నీక బ్రహ్మస్వదగ్ధుఁడవును

సత్యచలితుండ వగుచు నేచాయ కీవు
నరుఁగువాఁడవురా యోరిపరమశఠుఁడ?

నే నిప్పు డంగడివీథికిం బోయి ప్రక్రయమును సరించెదను. ఇంతకు సమ్మహాముని వచ్చి యుండనోపును. [స్వగతముగా నడచి యేకాంతమున నున్నాఁడు]

[తరువాతఁ గోపముతో విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు]

విశ్వా—[తనలో]

చ. కరగత శైవవిద్యలఁ ఘూర్ణము చేతఁ బ్రవృద్ధమై నదీ
యరుప, శతుండు వారి విన యాత్మవ్రతవృత్తి నిరుద్ధమాయ, లో
దరికొను నెండుఁగట్టియలఁ దద్దయు మండుదవంబు, పైపయిం
గురిసెడు వానలం దడియుచోనను బోలె నను దహించెడున్.

[కోపముతో] దురాత్మా! హరిశ్చంద్రపాతక!

ఉ. ఓరిమదాంధ! యెందనుక నుజ్జ్వలరాజ్యవిభూతికిం బలెం
దోరపు సత్యస పదకుఁ దోడన పాసినవాఁడు గాఁగఁ గ
న్నార నినుం గనం బడయ, నందనుకన్ భవదీయదుర్నయో
దారత బగ్గుబగ్గన మదాగ్రహ మాఅదురా దురాత్మకా.

(చూచి విస్మయముతో) ఏమీ! యిదిగో దురాత్ముఁడు— పోనీ మహాత్ముఁడే—వీఁడు వచ్చినాఁడే. సమీపించెదను.

[అట్లుచేసి క్రోధముతోఁ బ్రకాశముగా] ఆఁరా! యేమిది! మాందక్షిణాసువర్ణము లిప్పటికి నీయకున్నాఁడవు

రాజు—[సంభ్రమముతో] ఓహో! భగవానుఁడు కౌశికుఁడే. స్వామీ! యభివాదనము చేయుచున్నాఁడను.

విశ్వా—ఛీ! యనార్య! నీ విప్పుడును మమ్ము శుష్కప్రియములతో వంచింప నెంచుచున్నావురా?

రాజు—(చెవులు మూసికొని) స్వామీ! శాంతింపుఁడు శాంతింపుఁడు.

విశ్వా—(క్రోధము నభినయించుచు) ఛీఛీ! దురాత్మ! అలీకదాన సంభావనాప్రఖ్యాపితమిథ్యాపౌరుషప్రపంచ! ఉండుండు.

చ. నెలయును నిండఁగ గడువు నీ విడ వింకను గాదు దక్షిణన్
వలవని శుష్కపుం గ్షుద్రరవాక్కులతోఁ గనిటు డాయుచుందువో
పలువ! ప్రతిశ్రుతం బయిన పైకము నీయమి నల్గి యిచ్చమ
జ్జ్వలితకృశానుఘోరతరశాపము నీపయి నిప్పుడే పడున్.

(శాపజలమును గ్రహించుచున్నాఁడు)

రాజు—(సంభ్రమముతోఁ బాదములమీఁదఁబడి) స్వామీ! శాంతింపుఁడు శాంతింపుఁడు.

క. తాపసవర! మీదక్షిణఁ
బ్రాపింపరయేని పొద్దు వడకుండంగన్
శాపార్హుఁడ నో యీమనుజుఁడు
వ్యాపాదార్హుండనో మీకు స్వాధీనుఁడటన్.

కావునఁ బ్రసన్నుల రయి వణిగ్వీథిం బోవుదము రండు.

విశ్వా—(శాపజలముపసంహరించి) కానీ, అక్కడకే పోయియుండుము ఇంతలో నేను ద్వితీయస్నానము నిర్వర్తించుకొని వచ్చెదను.

(నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—(నిర్వేదించుచుఁ దనలో)

క. పరిణామదారుణం బిహ
పరభయకారణము ఋణము ప్రాణుల కిస్సీ
పరిభూతధనికముఖముం
దరిసింపనినరుఁ డొకండె ధన్యుఁడు పుడమిన్.

(నడచి సంతోషముతో) ఓహో! యిదిగో! వణిగ్వీథి (శిరమునఁ దృణ ముంచుకొని దైన్యముతో) ఓహో! సాధులారా!

క. ఒదవి యొకానొక దుఃఖము
యది దీఱుమనట్టి యొకయుపాయము లేకే
నిదె లక్ష హేమములకుం
గొనకక యీ దేవి నమ్ముకొనుచున్నాఁడన్.

అయ్యలారా! కొనుండి నన్నుఁ గొనుండు. (ఆకాశమున) ఏమనియెదరు? ఎందుకీ దారుణకర్మము నారంభించితి వందురా? నన్నిట్లు మీరేల నిర్బంధించెదరు? ఈజీవలోక మతివిచిత్రము గదా! (వేఱొకచోటికేగి "ఒదవియొకానొక" అను [illegible] చదివి యాకాశమున) ఏమనియెదరు? "నీశక్తియేమి? ప[illegible]మి జ్ఞాన మేమి?" యని యడుగుచున్నారా? (చిఱునవ్వుతో)

క. దేవర యేపని వెట్టినఁ
గావించెదువాఁడ నౌను గాదనక మదిన్
సేవకునకు దొరయానతి
యావంతయు మీఱమియ కదా సుగుణ మగున్.

(ఆలకించి) ఏమనుచున్నారు? నేను వెల యెక్కుడుగాఁ జెప్పినాఁడను కాఁబట్టి మఱి యొకబేరము చెప్పుమందురా? (ఖేదముతో) ఓ సాధులార! మేము క్షత్రియులము. మరల మరల బేరములు చెప్పుట యెఱుంగము. మీరు వెడలిపొండు. (వేఱొకచోటికేగి "ఒదవియొకానొక" అను పద్యమును చదువుచున్నాఁడు.)

(తెరలో) ఆర్యపుత్ర! ఆత్మంభరుండవు గాకుము. అట్లు నీతో సుఖంబునఁ బాలిదాననైన నన్ను మందభాగినిం జేసి నేఁడు సంవిభాగపరాఙ్ముఖుండ వగుట పాడి గాదు. నాథా! ప్రసన్నుండవయి నన్నే యీకార్యమునకు నియోగింపుము. నీప్రియ యిప్పుడు సంఘటితము నప్పటిదే గదా!

రాజు—(వైలక్ష్యముతో) అయ్యో! దేవి వచ్చినదే, నాకోరిక కొంత నేఱినది కాదు.

(తరువాత బాలకానుగమ్యమాన యయి వైక్లబ్యము నటించుచు శైబ్య ప్రవేశించుచున్నది)

శైబ్య—(సకరుణముగా నార్యపుత్రేత్యాది పఠించుచు మెల్లగానడచి) ఆర్యులారా! సమయదాసిగా నన్నుం దలిసగమువెలకు విలువ కొనుఁడు.

బాలకుఁడు—ఆర్యులారా! నన్నుఁ గూడ విలువకొనుఁడు.

రాజు—(వేఁడినిట్టూర్పు పుచ్చి తనలో) అన్నా! ఎంతకష్ట మెంత కష్టము!

మ. చతురంభోధిపరీతభూతలమహాసామ్రాజ్యముం వీడితి౯;
హితులం బాసితి శత్రుదీనముఖుల౯; నే నూఱడింపం బ్రజ౯;
సతి పుత్రుం డిపుడమ్ముకోఁ దమి నిటుల్ సైరించి చూతుంగటా!
శతధా వ్రయ్యదు గుండె, ధాత యిది వజ్రాన్ విరచించెనో.

శైబ్య—(బయ లాలకించి) ఆర్యులారా! యేమనెదరు? సమయ మేమనియా? పరపురుషపర్యుపాసనంబును, బరోచ్ఛిష్టభోజనంబును బరిహరించి మఱి యేకార్యమైనను జేయుదానను. అదియే నాసమయము. (మరలఁ జెవి యొగ్గి) ఏమనియెదరు? ఈసమయమున కొడంబడి నన్నెవఁడు కొనునందురా? అట్టయినచో మీరనుగ్రహించి వెడలి పోదు. ఈజనముతో మీకేమిప్రయోజనము? ఎవ్వఁడేని దీనజనానుకంపి యగుభూమిలింపుఁడు సాధుశిఖామణి నన్నుఁ గొనఁగలఁడు.

(తరువాతనుపాధ్యాయుఁడును వటుఁడునుబ్రవేశించుచున్నారు.)

ఉపా—వత్స! కౌండిన్య! నిజముగా నంగడివీథిని విక్రయింపఁ బడుచున్నదా?

వటు—గురువుగారితో నే నసత్యము మనవిచేయుదునా ?

ఉపా—అట్లయిన నక్కడకే పోవుదము.

వటు—చిత్తము. గురువరా! ఇటువిచ్చేయుఁడు. ఇటువిచ్చేయుఁడు.

ఉపా—(నడచి చూచి యాశ్చర్యముతో) ఓహో! యంగడివీథి యెంతరమణీయముగా నున్నది!

మ. పసిఁడిన్ మేరుమహాద్రి యన్ మణులచేఁ బాథోధి వేలన్, నవా
బ్దసమానోన్నత సామజచ్ఛటల వింధ్యశ్రీ, [illegible]చుచున్,
వసనోత్పల్లవ యూహముల్ గల్పవృక్షశ్రేణిన్ బ్రీ[illegible]ల
ద్రిసముత్సాహంబున కిచ్చు విపణి బుద్ధిన్ లోలముల్ జేయదే.

వటు—స్వామీ! గురువర్య! అదిగో నక్కడ గుంపుగా నెందరో జనులు గనఁబడుచున్నారే అచ్చోట నదితప్పక యుండునని నే నూహించుచున్నాను. (సమీపించి) ఆర్యులారా! దారి దారి. ఓసరిల్లుఁ డోసరిల్లుఁడు.

ఉపా—ఓహో? యేమి యీసమ్మర్దము!

శైబ్య—(వైక్లబ్యముతో) ఆర్యులారా! సమయదాసినిగా నన్నందలి సగము వెలకు నిలుచుకొనుఁడు. (మరల ననుచున్నది)

బాల—ఆర్యులారా! నన్నును నన్నును.

ఉపా—(చూచి యాశ్చర్యముతోఁ దనలో) ఏమీ! యీమె యేగాదా? (ప్రకాశముగా) అమ్మా! యేమి నీసమయము ?

శైబ్య—బ్రాహ్మణోత్తమ! పరపురుష పర్యాసనంబును, బరోచ్ఛిష్టభోజనంబును బరిహరించి మతియేకార్య మయినను జేయుదానను.

బాల—సాధుబ్రాహ్మణా! నన్నును నన్నును.

ఉపా—(హర్షముతో) నీసమయ మిది యనుకూలముగా నున్నది.

నియమము తోడనే నీవు మాయింట నివసింపుము. నాభార్య యగ్నిపరిచర్యాపరాధీనత్వమున గృహకృత్యనిర్వహణమునకుం జాల కున్నది. ఇదిగో! ధనంబుం బుచ్చుకొనుము.

శైబ్య—(సంతోషముతో) చిత్తము. భూసురోత్తమ! నే ననుగ్రహింపఁబడినదానను.

ఉపా—(తడవుగఁ దేఱిపాఱఁజూచి విస్మయముతోఁ దనలో)

ఉ. మేలిమిసుంగు మూర్ధమున, మేనునసాజపుసిగ్గు మోమునన్,
గాళులవేళ్ళఁ జూపుగుఱి, నడ్పుల మంథరభావ ముక్తులన్
జాలఁగఁ గోమలత్వమును జాతిహిమున్ మితభావ మిన్నియుం
బోలిచి చూడ నీమె కులఁగుబోఁడి కులీనగ నాకుఁ దోఁచెడున్.

(విచారముతోఁ దనలో) ఇట్టి యూకృతివిశేషమున కింతటిదురవస్థ రావలసినది కాదు. ఏమికారణమున నీమె కీదుర్దశ ప్రాప్తించినది చెప్పుమా? (ప్రకాశముగా) బోటీ! నీపెనిమిటి బ్రతికియున్నాఁడా?

శైబ్య—(తలతో సంజ్ఞచేయుచున్నది.)

రాజు—(నిట్టూర్పు విడిచి తనలో) హా! యేమిబ్రతుకు! బ్రతికియున్నవానిభర్యకా యిట్టి యవస్థాంతరము?

ఉపా—ఇప్పు డతఁడు నీదగ్గఱ నున్నాఁడా?

శైబ్య—(కన్నీళ్ళతో రాజును జూచుచున్నది.)

ఉపా—(చూచి విస్మయముతో) ఇతఁ డీమెభర్తయా? (తడవుగఁ దేఱి చూచి ఖేదముతోఁ దనలో)

శా. మూఁపుల్ గోపతిమూఁపురంబులు, భుజంబుల్ మత్తవేదండశుం
డాపీనాయతముల్, విశాల మురమున్, హా! లోకరక్షార్హ మీ
రూపం బేమి? కిరీటయోగ్యశిర మారోహించు టెటులా తృణం
బాపాదింపఁడు వేని కేనెరగు నామారంభుఁడా ధాత తాన్?

(సమీపించి కన్నీళ్ళతోఁ బ్రకాశముగా) ఓయిమహాత్మ! నీవు నన్ను దుఃఖమున నన్నుం బాలివానిఁగాఁ జేసికోఁ దగును. నీయీప్రయత్న మెందునిమిత్తమో నాకుఁ దెలియఁబఱుపుము.

రాజు—(ఆలోచించి వైక్లబ్యముతోఁ దనలో) ఈసాధుజనునివచన మన్యథాకరించుట యుక్తము గాదు. (ప్రకాశముగా) సాధువర్యా! విస్తరించి చెప్పుటకు దేశకాలము లనుకూలములు గావు. సంక్షేపించి వినిపించెదఁ జిత్తగింపుము. బ్రహ్మస్వపీడితుండ నయి నే నీప్రయత్నముఁ జేయుచున్నను. ఇఁక నన్నేమి[illegible] మని నిర్బంధింపకుము.

ఉపా—అయ్యా! అట్లయిన నీకుఁ గావలసినధనము నేనిచ్చెదఁ బరిగ్రహింపుము.

రాజు—(చెవులు మూసికొని) ఓహో సాధువర్య! నీ వన్నది ప్రథమవర్ణవృత్తి. మాబోఁటులకది నిషిద్ధముగదా! నీవు నన్నుఁ గనికరించితి వేని దానిని మూల్యసంబంధమున ననుగ్రహింపుము.

శైబ్య—(తొందరగా సమీపించి వినయముతో నంజలిపట్టి) ఆర్య! ఆర్య! ముందుగ బేర మాడిననన్ను నిరాకరించుట నీకుఁ దగదు. నేను నీపాలఁ బడితిని. నన్ననుగ్రహింపుము.

ఉపా—(కన్నీళ్ళతో) ఓ సౌభాగ్యవతీ!

ఆ. వె. ఏను దెచ్చియున్న హేమంబు లరలక్ష,
యీధనంబు మీకు సిద్ధమగును;
యుక్తమెట్టు లట్టు లొనరింపఁగాఁ దగు
నరసికొని పరస్పరానుమతిని.

(సొమ్ము నిచ్చుచున్నాఁడు.)

శైబ్య—(పుచ్చుకొని సంతోషముతో) అదృష్టవశమున నార్యపుత్రు

నీప్రతిజ్ఞాభర మారసాలు తగ్గినది. నే నిప్పుడు కృతార్థురాల నయితిని.

ఉపా—(తనలో) ఇప్పు డీదంపతుల దుఃఖము నేను జూచి సహింపఁ జాలను. (వెళ్ళఁబోవుచున్నాఁడు.)

శైబ్య—బ్రాహ్మణోత్తమా! ముహూర్తమాత్రము నుండుము. ఆర్యపుత్రునిమో మొక్కమాఱు కన్నులనిండఁ జూచుకొని వచ్చెదను.

ఉపా—ఇదిగో నీకౌండిన్యుఁ డుండును. (నిష్క్రమించుచున్నాఁడు)

శైబ్య—(రాజుబట్టను సొమ్ముమూట గట్టి) ఆర్యపుత్రా! నన్నీద్విజవరునకి బానిసనుగా ననుమతింప వేఁడుచున్నాను.

రాజు—(దుఃఖముతో) దేవీ! దైవమే యనుమతించెను. (ఆకాశముఁ జూచుచు నిందాసహితముగాఁ దనలో) అయ్యో! హతవిధీ!

తే. గీ. పట్టమహిషిగఁ జేసిన పరమసాధ్వి
బానిసగఁ బంపు చుంటివి పరునియింటి
కకట! యిది మౌళి నున్నమానికముఁ దీసి
పాదభూషణ మొనరించుభంగి కాదె ?

(మఱియు జాలిగా) హా! యెంతకష్టము.

ఉ. ఆఁ దైవ మాపదల కగ్గము సేయుట మందబుద్ధి నై
యాలిని జాలి నీకరణి నంగడికిం గొనితెచ్చి యమ్మఁగాఁ
జాల నిజాన్వయం బపయశంబును బొందె నటన్నకుందునన్
హేళియు నప్రమన్మూర్తి మలినీకృతవక్త్రుఁడు నయ్యెనయ్యయో

[ధైర్యము తెచ్చుకొని ప్రకాశముగా] ప్రియురాలా!

ఉ. సేవ లొనర్పు భక్తిని నశిష్యున కాద్విజవంశమౌళికిన్;
నీవు తదీయ జాయకును నెమ్మనిజేయు మహోపచారముల్;
పావని! కావునీకొడలఁ బ్రాణము లేమఱ కేదు మర్త్యకున్;
దైవము శాసనంబు నవతంసము సేయక తీఱియ వచ్చునే ?

శైబ్య—ఆర్యపుత్రా! దేవరయాం నేళ వెట్టు లట్లు నడచుకొనియెదను
[వెళ్ళఁబోవుచు రాజును జూచి దుఃఖించుచున్నది]
వటు—రావమ్మా రావమ్మా! ఉపాధ్యాయులు దూరము వెళ్ళినారు.
శైబ్య—[అనునయముతో] నాయనా! మహాపూర్తమాత్రము న
న్ననుమతింపుము. ఆర్యపుత్రుని మోమొక్కమారు కన్నులార
జూచి వచ్చెదను,
రాజు—(దుఃఖించుచు) ప్రియురాలా! నీవు [illegible] మాము. బ్రా
హ్మణోత్తముఁడున్నాఁడు గదా!
శైబ్య—(రాజును జూచుచు మెల్లగా నడచుచున్నది)
బాల—బాబయ్యగారూ! అమ్మ యెక్కడకు వెళ్ళుచున్నది?
రాజు—(ఖేదముతో) నాయనా! యెక్కడ దాసిగావలసి యున్నదో
యక్కడకు.
బాల—ఓరీ వడుగ! మాయమ్మ నెక్కడకుఁ దీసికొనిపోయెదవురా?
వటు—(కోపముతో) ఛీ! పోరా యావలికి గర్భదాస! (గెంటి క్రిం
దఁబడఁ ద్రోయుచున్నాఁడు)
బాల—(పెదవి విఱుపుతోఁ దల్లిదండ్రులఁ జూచుచున్నాఁడు)
ఇద్దఱు—(కన్నీళ్ళతో బిడ్డను జూచుచున్నారు.)
రాజు—అయ్యా! బ్రాహ్మణ! శైశవ మపరాధ్దముగదా! నీవీ
లాగున వానిని ద్రోయవచ్చునా? (పిల్లవానిని లేవనెత్తి శిరము
మూర్కొని కౌఁగిలించుకొని దుఃఖముతో)

మ. అదరం గ్రోధవశంబునం బెదవి, యన్నా! నేలగన్గొంచునా
వదనం బేను దయావిహీనుఁడ మహాపాపుండ, నాకన్న శ్వా
పద మైనన్ గలుగంత మే లది దలంపన్ మానినం గూనలన్
గదురం జేయును వెంటిచోట నయినం గ ఘానురాగంబెదన్,

నాయనా ! నేను బరమచండాలుఁడను. నన్నేల యనుసరించెదవు ?
మీయమ్మతోఁడ బొమ్ము (దుఃఖించుచున్నాఁడు)

శైబ్య—ఆర్యపుత్ర ! అదృష్టహీనురాల నగు నానిమిత్తము దుఃఖపడుచు మహర్షి కార్యము నేమఱియెదరు సుఁడీ. (పిల్లవానిని దీసికొని నడచుచున్నది)

(తరువాత విశ్వామిత్రుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

విశ్వా—ఆ ! యేమిది ! మాదక్షిణాసువర్ణము లిప్పటికిని ముట్టవయ్యెను !

రాజు—(విని సంభ్రమముతో సమీపించి) స్వామీ ! ఇప్పుడు సగమిచ్చెదఁ బుచ్చుకొనుఁడు.

విశ్వా—ఛీ మూర్ఖ ! సగమే మొగముతో నిచ్చెద నను వాఁడవురా ? నీవు నిజముగా నిచ్చుఁ దలఁచుకొంటివా, ప్రతిశ్రుతమును నిశ్శేషముగా నిచ్చివేయుము.

(తెరలో)

క. ఏల తపం? బేల వ్రతం?
బేల బహుశ్రుతము గాల్పనే యున్నయిసీ
యీలీల హరిశ్చంద్రుని
జాలిం బెట్టెదవు నీవు సద్విప్రుఁడవే ?

విశ్వా—(విని క్రోధముతో) ఎవండ్రు రావింక్రు ? నన్నిసీయని గర్హించుచున్నారు. (పైకిఁజూచి) అహో ! ఏమీ ! విమానచారులు విశ్వేదేవులా ? (కోపమును జూపుచుఁ గమండలుజలంబున వార్చి శాపవారిం గయికొని)
ఛీ ! అనాత్మజ్ఞులారా ! ఓరీ క్షుద్రక్షత్రియపక్షపాతులారా !

క. కాఁగలదు మీకు జన్మం
బేగురకును క్షత్త్రియోని ; నిది గాకట్టుపై
నూఁగుంబ్రాయము వారిం
దాఁగెడపును ద్విజుఁడు ద్రోణతనయుఁడు మిమ్మున్.

(మరలఁ బైకిఁ జూచి సంతోషముతో) ఓహోహో ? యిదిగో !
వీరు—

ఉ. మామకదృష్టిపాతభయమగ్న చలాచలఘుం[illegible]
క్రామితనాకసంస్ఖలితరత్నవిమానమునుండి యేవురుక్
భూమిని బిట్టు గూలెదరు, బొమ్మిడికమ్ములు దాలుకో రథ
క్షామములందు; నూడిపడఁగర్ణవిభూషలు, గిరింద్రుగాఁ దల్!

రాజు—(పైకిఁ జూచి తనలో) ఓహోహో! తపఃప్రభావము ; హరి
శ్చంద్రుఁడు క్లేశమొందుట యుక్తమే గదా! (ప్రకాశముగా)
స్వామీ ? ఋషివర్యా? మీర లన్యథా తలంపకుఁడు.

ఆ. వె. ధర్మపత్ని నమ్మి తనయుని నమ్మి కూ
ర్చినధనమ్ము దీర్చి జేకొనుండు
మిగతసొమ్ము గూడ మిగతితోఁ జేర్చి న
న్నంత్యజునకు నైన నమ్ముకొందు.

విశ్వా—(క్రోధముతో) ఆ! కొంత యెందుకు ? అంతయు నిచ్చి
వేయుము.

రాజు—ఓసాధులారా?

“ క. ఒడవి యొకానొక యుక్కు అ
యది దీఱుచు నట్టివేఱుపాయము లే కే
సిదె లక్షహేమములకుం
గొదుకక యీ దేహ మమ్ముకొనుచున్నాఁడన్.”

(అనుపద్యము మరలఁ జదువుచున్నాఁడు.)
(తరువాతఁ జండాలవేషముతో సానుచరుండు ధర్ముఁడు ప్రవేశించు
న్నాఁడు.)
ధర్ము—(తనలో)
చ. భువనములం దిరంబుగను బ్రోచెడువాఁడను నేను; నన్నుఁ ద
ద్భువనయుతంబుగా నెపుడుఁ బ్రోచెడు నట్టిది సత్య మందుచేఁ
గువలయనాథుసత్యమును గొండొకశోధనముం బొనర్ప ని
చ్చవొడమి గాదె యీయధమజాతి పరిగ్రహణం బొనర్చితిన్.
(తడవుగ నాలోచించి యాశ్చర్యముతో) ఆహా! నేను నాదివ్యదృష్టి
నెంత వెదకినను రాజర్షి యగు హరిశ్చంద్రునికి సమానుఁడు గాన
బడ కున్నాఁడు! కానీ నే నతని యొద్దకే పోయెదను. (నడచి ప్ర
కాశముగా) ఓరీ పెద్దిగాఁడ; వరాలజాలెను తీసికొని వచ్చినాఁడ
వటోరి.
అనుచరుఁడు—ఓరి పెద్దా? నీ కిప్పుడు వరాలజాలె మోదుకురా, కల్లు
గాని తాగెదవటోరి?
ధర్ము—అరే; నీ కెందుకురా నాతోఁ బడుజోలి?
రాజు—("క. ఒదవి యొకానొక యక్కట" అను పద్యమును
"ఆ. వె. ఏను దెచ్చియున్న హేమంబు లరలక్ష" తృ-అం22 వ పద్య
మును జదివి, యంతటఁ జూచి ఖేదముతో)
అయ్యో? నే నెంత మందభాగ్యుఁడను? నన్నుఁ గొనుటకు నెవ్వరును
జేర కున్నారు? హా? చచ్చితిఁ గదా? (మూర్ఛిల్లి పడుచున్నాఁడు)
ధర్ము—(విని చూచి తనలో) ఏ మిది? యీమహాసత్వుఁడు మూర్ఛి
ల్లినాఁడు? కానీ. ఇట్లు చేసెదను. (సంభ్రమముతో సమీపించి ప్ర
కాశముగా) ఓరీ! లేరా. నేనే నిన్నుఁ గొనువాఁడను. ఇదిగో నీకుఁ
గావలసినసొమ్ము పుచ్చుకోరా.

రాజు—(హర్షముతో లేచి) ఓ సాధూ ? ఇటు లేసికొని రా. (చూచి విషాదముతో) భద్రి ? నీవే నన్నుఁ గొనియెదవా?

ధర్మ—అ ? నేను నిన్నుఁ గొనియెదను.

రాజు—అలాగైన నీ వెవ్వఁడవో చెప్పు.

ధర్మ—తే. గీ. ఒలికిమిట్టల కన్నింటి కొడయఁ డనుర ;
నమ్మకపువాఁడర తలార్లనాయఁ డకుఁ ;
దలలు నఱికెడుమ కిపెత్తనము స
పెద్దమాలను వినరోరి పేరుపడితి.

రాజు—(తొందరగాఁ దొలఁగి కౌశికునిపాదములమీఁదఁ బడి) భగవానుఁడా ? అనుగ్రహింపుము.

క. మునినాయక నీకే సే
వనముం బోనరించి ఋణముఁ బాసెద నకటా !
వినినది కనినది గా దీ
చెనంటిచంఁడాలపాదసేవ మహాత్మా.

విశ్వా—ఛీ ? మూర్ఖ ? తపస్వులు స్వయందాసులు గారా ? నీవు దాసుఁడ వయి మా కేమి చేసెదవు ?

రాజు—(అనునయముతో) స్వామీ ! తమయాజ్ఞ దొప్పనసే ప్రవర్తించెదను.

విశ్వా—వినుండు వినుండు విశ్వేదేవులు. (హరిశ్చంద్రునితో) నే నాజ్ఞాపించినట్లు నీవు చేసెదవా ?

రాజు—తప్పక చేసెదను స్వామీ.

విశ్వా—అలాగైనపక్షమున నీవు వీనికే యమ్ముఁడు వోయి తత్క్షణము మాదక్షిణాసువర్ణము లిచ్చి వేయుము.

రాజు—(చింతతోఁ దనలో) అయ్యో ! యేమి చేయుదును ? (ప్రకా

శముగా) స్వామీ ! చిత్తము. (చండాలుని సమీపించి) ఓ పెద్ద మాల ? నీవు యాభిగా నన్నుఁ గొనెనుపక్షమున నొక్కసమయమున మాత్రము చేయవలయును.

ధర్మ—సరే. ఏమి సమ్మయ ?

రాజు—విను.

ఆ. వె. తిరిప మెత్తి తినుచుఁ దొసవుఁబేలికలను
గట్టుకొనుచు నెడము గలుగ నుండి
సామి ముదము వెట్టు సకలకార్యములను
గొంకులేక సలిపి కొలుచువాఁడ.

ధర్మ—మంచిది. నే నీసమ్మకు నొప్పుకొన్నాను. సొన్నా లెత్తుకో.
(సొమ్ములను స్మరించి దూరముగాఁ దొలఁగుచున్నాఁడు)

రాజు—(పుచ్చుకొని సంతోషముతో)

క. మునిచేతఁ దిట్టువడక
ప్పను దీఱిచి సత్యవాక్యమునకుం బెడఁబా
యనివాఁడ నయిననాకీ
నవియమచండాలసేవ శ్లాఘ్యము గాదే.

(విశ్వామిత్రునిఁ గూర్చి సానునయముగా) స్వామీ ? కౌశికమునీంద్ర! మీ రీధన మశేషము పరిగ్రహింపుఁడు.

విశ్వా—ఇచ్చెదవా ?

రాజు—పుచ్చుకొండి స్వామీ ?

విశ్వా—(పుచ్చుకొని తనలో) ఇంక నిర్బంధ మెందుకు ? కానీ పో నుమెద. (సిగ్గుతో నట్లు చేయుచున్నాఁడు.)

రాజు—(వినయముతో దోసిలి పట్టి) స్వామీ ? కాలవిలంబనముచేఁ గావించిన నాయపరాధమును క్షమింపుఁడని వేఁడుకొనుచున్నాను.

విశ్వా—క్షమించితిని. (నిష్క్రమించుచున్నాడు.)

రాజు—(చండాలునిఁజేరి) ఓ పెద్దమాల! (అని యర్థోక్తిని నోరుమూసికొని) ఏలికా! సేవకునకుఁ జేయవలసినపని యాజ్ఞాపింపుము.

ధర్మ—(సంతోషముతోఁ దనలో) ఆ! నీ వివరకు, గననిదియు విననిదియు నైనపని నీ కాజ్ఞాపించెద నుండు. (ప్రకాశముగా) ఓరీ? నీవు దక్కినవుఁగాటికిం బోయి యక్కడఁ బీనుంగుల మీఁది గుడ్డలను దీయుచు రేయుం బవలు నే మఱకోవలసిన [illegible] నే నింటికిఁ బోవుచున్నాను.

రాజు—దేవర చిత్తము (అందఱు నిష్క్రమించుచున్నారు.)

—* గద్య. *—

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధ సరసకవితాధురంధర వడ్డాది
సాధువంశక్షీర నీరాకర రాకాసుధాకర రాచన్నామాత్య
పౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాం
బాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజపుత్ర
ధానతనూభవ విబుధవిధేయ
సుబ్బరాయనామధేయాం
ప్రణీతంబగు చండకౌశి
కనాటకమునందు
ద్వితీయాంకము.





# చండకౌశికనాటకము

---

## చతుర్థాంకము.

(తరువాతఁ జండాలు రిద్దఱు వెంబడింపఁగా విచారముతో రాజు ప్రవేశించుచున్నాఁడు.)

చండా—ఓసల్లుండి బాబులారా? ఓసరిల్లుండి. మీ రందఱిక్కడ నేమి సూడ మూఁగినారు. వీనిని మేము తల గొట్టుటకుఁ దీసికొని పోను. (బయలా కించి) బాబు లేమనుచున్నారు? వీఁడెవ్వఁడు? ఎక్కడకుఁ గొనిపోయెద రందురా? వినుండి బాబులార! ఈని అపేద మాపబు నయిన పెద్దమాలవద్ద నొద్దెసొమ్ము పుచ్చుకొని బానిసతనమునకుఁ గుదిరినాఁడు. అందుచేత వీని నిప్పుడు దక్కిన పుటొలికిమిట్టకుఁ గావలి పెట్ట నెట్టుకొని పోవుచున్నాము.

రాజు—(కన్నీరు పుచ్చి తనలో) అన్నన్నా! ఎంతకష్టము! ఉత్తరోత్తరదారుణ బహుమద్వ్యసన పరంపరాపాతమునకు మేర లేకున్నది!

ఆ. వె. శ్వపచునొద్ద నాకు బానిసం బివ్వాకు.
వసతి ఘోర మైన వల్లకాడు,
పని శవాలు మోఁదిపాఁతలు గొనుట, హా!
విధి క్షమింపఁ డిట్టి వెతల నైన.

(శోకముతో) ఒక్కదుఃఖము పెక్కుదుఃఖములచేఁ జిక్కఁబడు నందు

రిది నిక్కమే గదా ! దక్షిణాఋణ్యార్తుండ నన్నిప్పు డిన్ని దుఃఖ
ములు చుట్టుకొన్నవి.

(దుఃఖము నటించుచు)

సీ. నేన చుట్టము నాటచే నిప్పు డసద లా
పరిజలఁగూర్చి విచారపడుదు కొక్క
యధికవాత్సల్యపూర్ణు లైన యాత్మబం
ధువులఁగూరిచి యలందురుదు [illegible]కొక్క
దేన మాలి మిక్కిలి దీనభావము గాంచు
సేవకాళిగుఱించి చింతిలుదని
పాలుపింటను దాసిపనులు సల్పెడుప్రాణ
వల్లభఁగుఱించి యించి ఖేదమందుదునో
యకట ! సిసు వైనముద్దుఁగుఱ్ఱకు వగతునో
యధమచండాలదాసత కలమరుదునో
యన్నిదుఃఖంబులకు మూలమైన నాదు
పాపజీవితమున కార్తిపాలగుదునో.

(స్మృతి నభినయించు ఖేదము తోఁ)

మ. పరిత్యాగ్రితపోనిధానుఁడు దురారాధ్యుండు నాగాధిపు
తిరికున పీంగెడునాఁ డటుల్ నటుఁడు పోరా గర్భదాసా యటం
చకటా ! తోసినఁ దెల్వి యేడ్చుసుతునాస్యంబేను గన్గొంటిఁ జె
ద్దకఠోరవ్రణమట్లు సల్పెడుఁ దదంతశ్శల్య మెల్లప్పుడున్.

చండా—(ఓసరిల్లుండి యిత్యాది మరల ననుచున్నాడు.

రాజు—(ఆలోచించి ఖేదముతోఁ దనలో) స్వప్నము నన్నది యెం
త వేధించుచున్నది!

చ. పన మాని యొక్క వంక గురుభక్తిని శిష్యుఁడు వేగిరింపఁగాఁ
బదవాత్రిఁ దిగ్లి యొక్కెడను బాలుఁడేఁడ్చుచుఁ గొంగులాఁగఁగా
నదిమినకొద్దిఁ బెల్లుబుకునశ్రులు దారల నప్పఁ గూర్చు నన్
వదల బీదచూపు, బలవంతిపై కాంత మరల్చె నెట్టకేఁ.

(వైక్లబ్యముతో) హా! దేవి!

ఆ. వె. తరణిగోత్రమునకుఁ దగినకోడల వైన
సదమలేందువంశజాత వైన
నాతి! భూతిరాశి నేత్రయాహుతి వడ్డ
లీల నేల నాకు నాల వైతి?

అయ్యో! రాజపుత్రి!

ఉ. పూవుల తోఁటలోపలను బూచిన క్రొవ్విరవాజులం గటా!
నేవళమున్ రచించుచును నీవు గదున్ మిసిమింతురాల వౌ
దేవగ నాచరింతొ యిపు డెప్పుడుఁ జేసి యెఱుంగనట్టిదుః
ఖావహ దాసికాసముద యూర్త్వ కఠోర నికృష్ట కర్మముల్.

చండా — అరే! దక్కిణఘమనన మిక్కడ దగ్గఱనే యున్నది. దబ్బు
దబ్బున గారం.

రాజు — (చూచి ధీరముగా) జీహో! మహాశ్మశానమా యిది!

ఉ. మండలసంచయంబు పలుమా ఱొనరించి దిశిన్ విదూరమం
దుండి యదంష్ట్రాత్రముల నొప్పెడుతోఁకల నిశ్శ్యలంబు లా
చుంకు వెడందపక్షతుల నూఁకున గ్రద్దలు వ్రాలుఁ బీనుఁగుం
గండలయూన నూరుముఖగహ్వరలాలల నిండఁ జంచువుల్.

మఱియు నిదిగో!

సీ. బారసాఁచిన చెట్టువలతోడ నిడుపాటి
మొదలను నిక్కించి నమునుగ వియ్యు

నిసుఁగుఁబీనుంగుల నెత్తిఁగాళ్ళతోఁ ద్రొక్కి
ప్రేవులుముక్కులఁ బెఱుకు నవియు
డొక్కలుమఱి ఱెళ్ళనుక్కు బాటిగ మెక్కి
మ్రోలమ్రాఁకులమీఁద మూఁగునవియు
నీల వట్టినయట్టి లెలుఁ గొప్ప నెఱిచికై
మొగిసితన్నుచుఁ గలహించునవియుఁ
గోర్కు లిగురొత్తఁ బెంటులఁ గూడినవియు
దూఁకుచును గాకిమూఁకలఁ దోలునవియు
నగుమఁ బితరువసామిబంట్లనఁగ నెందు
గుములుగుములయి రాపులుంగులు చెలంగు.

(తెరలోపలఁ గలకలము) అహో! ఈశ్మశాన మెంత బీభత్సరౌద్ర
ముగా నున్నది!

మ. అవె వ్యాపించు నమంగళోగ్రపటహావ్యాడంబరారావముల్
శివ లంటంపితిశబ్దసంక్రన్నాకటుస్వీయోరుసీత్కారలై ;
తవులం గాటపుకట్ట, పెల్ల శవమూర్ధశ్రేణిమస్తిష్కముల్
స్రవియింపన్, వెలుఁగుం జితాగ్నులివె నిశ్చాంచల్యభుగ్నార్చులన్

(ముందు చూచి సశ్లాఘముగా) ఓహో? ఇట నిది బీభత్సమే యయి
నను మిగుల స్పృహణీయముగా నున్నది. ఓశ్మశానమా? సర్వస్వాగ్ర
హులయి ప్రీతినెఱపు శ్వాపదగణంబులచే యథేష్టోపభుజ్యమానం
బ వయ్యెదవుఁ నీవెంతధన్యమవు ?

చ. కరటము కాళ్ళలూఁచి తలఁ, గన్నులపూఁతను విప్పి ముక్కుతోఁ
బెరిమను నక్కక్రొవ్వునన వ్రేలెడునాల్కతోసం గ్రసింపఁ గు
ర్కురమును బీఁకు శేష మట గొయ్యెనరించును గ్రద్దబెజ్జమున్;
జరుపు యథేష్టచేష్ట లిటు శ్వాపదముల్ కుణపంబ! నీసమృద్ధిన్,

శ్లో. భగవతి! చండి! ప్రేతే
ప్రేతవిమానే ప్రియే! లసత్ప్రేతే
ప్రేతాస్థిరౌద్రరూపే
ప్రేతాశిని! భైరవి! నమస్తే.

(తెరలోపలఁ గలకలము)

రాజు—(ఆలకించి) అహో! దివసావసానసూచకంబులయి నానా దిగంతములనుండి స్వస్వనీడపర్యుత్సుకంబులయి [illegible]వెడలిన శకునకులములకలకలమాయిది? (పడమరసు జూచి) ఆహా! యెవ్వనికిఁ గాని దైవపరిపాటి దాఁట రానిది గదా?

తే. గీ. అకట! గగనాంగణప్రదీపకుఁడు, తరళ
కాలభుజగఫణామణి, తిణపడంబి
తౌర్వసర్వాశివిగ్రహుం డదిగో విధుకుఁ
డై యహర్పతి గూలెను నంబురాశి.

(అంతటఁ జూచి విస్మయముతో)

ఉ. కాళికనుసంధ్య వధ్యసతి, రాగమసృక్ఛవి, మందరశ్రియా
హేళిపరిశాంతహేతిచితి, యిర్లురుఘామముమల్ నరాస్థులుం
బాలసముద్రఫునిస్మిమి మానిసిపుత్రియ గాఁగఁ గాలకా
పాలికలీలకుణ్ భువనపాళి యొసంగె నహో శ్మశానమై.

చండా—(చూచి) అరే!—

ఆ. వె. తలలు బొనకు పట్టు దలకొట్టఁ బడవాని
యట్టు ప్రొద్దుగ్రుంకు గట్టు నేరఁ
గొంగవాలు లూరి గోనంగులట్టులు
చిమ్మచీఁకటులును గ్రమ్ముకొనియె.

రాజు—(అంతటం జూచి ధైర్యముతో) అహో! యీశ్మశానభూమియందలి
లివ్వి యెంతగంభీరభీషణంబులయి తోఁచుచున్నవి!

వహ్న్యగ్ర, లోహితవర్ణములు నష్టములుగా, దిశకజ్జలాగమి
త్ర మ్మొకనీలిమంబె పరిస్ఫురితంబుగ నద్వితీయ మై

కానీ బిగ్గఱగాఁ బలుకరించెదను. ఓరీ! యెవ రక్కడ? ఇదిగో! నే
ను గాటికాపరిని. ఊరి కెల్లరకు నాయకుఁడను. నాయానతి నాల
కింపఁడు.

క. పడయక నాయాదేశం
బిడకయు స్వాతంత్ర్యంబలంబు నెవ్వరుగానీ
నడపంగ రాదు మనసుఁ
గడఁ గావింపంగ వలయు కర్జము లెవియున్

వినుఁడు నేఁడు మొదలుగా—

చ. వలె శిరసావహింప నది వల్లెయటంచిట నవ్విమత్తులై ;
చులుకగ సామిశాసనముఁ జూచుట కేను సహించువాఁడఁ గా
నుజ్జలజాసనేంద్రగమరుద్భవతుల్యన కైన నొందుమా
టలు గలవానికిం బ్రతిభటమ్ము మదీయభుజమ్మగుం జుమీ.

ఏమిది? ఎవ్వఁడును మాట లాడఁడు! పోనీ. మఱియొకచోట గేక వే
సెదను. (నడచి) ఓహో! యెవరక్కడ (తెరలో) ఇదిగో నోయి
నేను.

రాజు—(ధైర్యముతో) ఓహో! యేమీయాప్రత్యుక్తి! కానీ మా
టనవ్వఁడిని బట్టి తెల్సి వాఁ డెవ్వఁడో నిపుణముగా నరసెదను.
(నడచి తెరవంకఁ జూచి విస్మయముతో) ఆహా! యితఁ డె
వఁడు?

తే. గీ. బూదె మైఁ బూసి ఖట్వాంగమును ధరించి,
కాంతిముల్లు నుజ్జ్వలంబులుగా నరాస్థి

భూషలు, కపాలపాళి యై పొలుచు; నరక
రంకమాలి సాక్షాద్భయంకరాకృతి యిటొందు.

(తరువాతఁ గాపాలికవేషుఁడు ధర్ముఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ధర్మ.—ఇదిగో నాయి నేన.

సీ. అడుగక చేసుఖబికిరము
గుడుచుచుఁ బందిరియుచయంబు [illegible]యించి వెసఁ
గడచి భవ మునశ్మశానము
కడు బీభత్స మగునట్టి కాటఁ జరింతుఁ.

(ఆలోచించి) భగవానుఁడు రుద్రుఁడు మహావ్రతము నాచరించె నన్న నది యాతనకుఁ జెల్లును. కాపాచారుల కిది యత్యంతము పరీక్షము గదా! అయినను—

క. విమలతపోద్వైతము సుల
భము, భైక్ష్యాద్వైతము సులభంబు, క్రియాద్వై
తము సులభం బాత్మాద్వై
తము మాత్రము దుర్లభంబు తల పోయంగన్,

(అంతటఁ జూచి సాశంకముగాఁ దనలో)

“చ. భువనములం దిరంబుగను జొచ్చెడువాఁడను నేను, నన్నుఁ ద
ద్భువనయుతంబుగా నెప్పుడుఁ జొచ్చెడునట్టిది సత్య మందుచేఁ
గువలయనాథుసత్యమును గొండొక శోధనముం బొనర్ప ని
చ్చ వొడమితయాఁ గృష్ణతనుజాపరిగ్రహణం బొనర్చితిన్”

(ఆలోచించి యాశ్చర్యముతోఁ దనలో) ఔరా! యెంతలేసి దుఃఖములు సంప్రాప్తములగుచున్నను వగ పిన్నదిగాఁ దలఁపక యీరాజర్షి చరిత్ర మాశ్చర్యజనక మగుచున్నది. మహాత్ముల కిది ప్రకృతియే గదా!

చ. అరయుఁగ దుఃఖ మంచు సుఖ మంచును నెప్పుడి యున్న దేది? యు
ర్వరఁ సుఖదుఃఖపు వ్యతికర బు ఘటిల్లు వివేకహీనున్
బరవ మగున్ మహాపురుషభావ మనిర్వచనీయ మేదిమే
దురసుఖమున్ సుఖంబుగను దుఃఖము దుఃఖముగా గణింపదో.

కానీ వారియొద్దకే పోయెదను. (నడచి చూచి సశ్లాఘముగా) అహో
యిదిగో నామహాత్ముఁ డిక్కడనే యున్నాఁడు. సమీపించెదను.
(అట్లుచేసి) ఓయిరాజా? సిద్ధిభాజనంబవు గమ్ము.

రాజు—మహావ్రతచారు లగునైష్ఠికులకు మీకు స్వాగతము.

కాప—రాజా! మే మర్థుల మయి నీయొద్దకు వచ్చితిమి.

రాజు—(లజ్జపడుచున్నాఁడు)

కాప—రాజా! నీవు బిడియపడకుము. మేము యోగచక్షులము గ
దా! మాకు నీవృత్తాంత మంతయు గోచరించినది. ఇట్టియవస్థ
యం దున్నను మానసమీహిత మొసంగుటయందు నీవు దరిద్రుఁడ
వు గావు.

తే. గీ. పరులయుపకారమునకు నెబ్బంగి నయినఁ
గాకమానరు బుధులు నిక్కంబు మూడు
కుహువునంకునుజందురిందు బహుతరము గ
సంతసిల్లఁ జేయుఁడే వనస్పతిచయంబు.

కావున సావధానుఁడ వయి యవధరింపుము.

రాజు—ఇదిగో సవహితుఁడ నయి యున్నాను.

కాప—ఉ. వ్రీలుమహాత్త్వముల్ గలుగువజ్రరసాయనపాదలేపబే
తాళుకు ధాతువాదమును దద్గుటి కాంజనదైత్యకామినీ
బాలవిధానముల్ గయివసంబులు నాకవి యంతరాయపుం
జేలములం దిరస్కృతిని జెందనిచందము మందలింపుమీ.

రాజా నీవు విఘ్నములు రాకుండ నాజ్ఞాపింప వలయు.

రాజు—అయ్యా! సాధక! యూశకేర మస్వాధీన మని యోగబలం బున నీ వెఱింగిన వాఁడవే గదా! కాఁబట్టి స్వామ్యర్థావరోధంబు గాఁ బ్రవర్తించెదను.

కాప—ఓరాజా! యింకు స్వామ్యర్థవిరోధ మేమి యున్నది? భగ వదాజ్ఞామాత్రమున నే మాకు సమీహితం[illegible] గలదు. ఇ దిగోఁ జూడు మీాదాపుననే సిద్ధరసంబు మహానిధాన మొకటి యు న్నది. తదర్థము మేము కృషిచేయువారము. నీ విక్కడ యుండి విఘ్నప్రత్యూహ విషయంబున సావధానుండవు గమ్ము (నిష్క్ర మించు చున్నాఁడు)

రాజు—(ధైర్యము తో నంతటఁ దిరిగి) విఘ్నములారా! తేఁకుఁడు తలఁగుఁడు. సర్వథా మీాప్రసరణంబు ప్రతిహతంబు గావలయు (తెరలో) మహాప్రసాదము మహాప్రసాదము.

క. ఓరాజ? నీకు సువ్రత
దార్గంబులు శ్రేయములు, న్వయంవరులు మహో
దారలు విద్యలు, సిద్ధులు
స్వైరాగత లెవఁడు మీాఱుఁ ద్వచ్ఛాసనమున్.

రాజు—ఏమియదృష్టము? నామాటకు విఘ్నంబు లనుమతించినవి. నాకిది మహానందము.

(తరువాత విమానచారిణులు విద్యలు ప్రవేశించుచున్నారు)

విద్య—(శీఘ్రముగా సమీాపించి) రాజా (హరిశ్చంద్ర) భాగ్యము న వర్ధిల్లుచున్నావు.

ఆ. వె. ఎందఱో జకు సన్న ఋషివర్యుఁ డాగాధి
పట్టి బిట్టు గినిసి బాధపెట్టె

నష్టివిద్యలము త్వదాపదలకు మూల
మూలము వచ్చినార మఘు చరిత.

రాజు—(చూచి యాశ్చర్యముతోఁ దనలో) ఓహో! యేమీ? యీ పూజ్యురాండ్రు విద్యలా? త్రిలోకవిజయినులగు విద్యలారా! మీకు నమస్కారము.

విద్య—రాజా! మేము నీవారల మయినారము. మమ్ము నాజ్ఞాపింపుము.

రాజు—తల్లులారా? మీరు నన్ను గాపాడ్యేఁగాఁ దలఁచితిరేని మిమ్మొక్కఁడు వేఁడుకొనెదను. దయచేసి భగవానుఁడు కౌశికునకు మీరు వశపడుఁడు. దానంజేసి నే నపరాధీందు గన పరాధ్ధుండ నయ్యెదను.

విద్య—(విస్మయముతో నొండొరులను జూచుకొని) రాజా? నీయిష్టము (నిష్క్రమించుచున్నారు.)

(తరువాత బేతాళునిచే నిధానము మోపించుకొని కాపాలికుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కాపా—(త్వరితముగా సమీపించి) రాజా! భాగ్యమున వర్ధిల్లుచున్నావు. ఇదిగో సంసిద్ధరసం బనునీమహానిధానము నీకు లభించుచున్నది. సర్వశక్తిమంత మీరసేంద్రము నీవుపయోగింపుము

ఉ. ఓనగనాథ దీనియుపయోగముచేత న కాదె సిద్ధులా
మానిత మైనస్వర్భువనమార్గము మృత్యువు గెల్చి, పొందిసం
తాననవీనమంజరులఁ దద్దయు శోభిలు మేరుభూమిభృ
త్సానువులం జరింపుదురు సంతతసౌఖ్యరసావశాత్ములై.

రాజు—అయ్యా! యిది దానభావవిరుద్ధము. దీనివలన స్వామిద్రోహము సంఘటిల్లును గదా!

కాపా—(ఆశ్చర్యముతోఁ దనలో) ఓహో! యెంతవింత! కానీ (ప్రకాశముగా) రాజా! అది యట్లయినచో నీవీమహానిధానమును గైకొని నన్నును నీకళత్రంబును దాస్యంబువలనఁ దొలఁగించుకొమ్ము

రాజు—అయ్యా! నాకది యెట్లు కాఁగలదు? దాసభావ మధమ మని కదా మనీషులు వ్రాసి యున్నారు. స్వామ్యర్థమయినచో దీనిని నేను నిరాకరింపను. నీ [illegible] నా కను [illegible] కాఁబట్టి నీ విట నుంచిన యీమహానిధానమును స్వామ్యర్థము పరిగ్రహించుచున్నాను.

కాపా—(ఆశ్చర్యముతోఁ దనలో) ఓహో ధైర్యము! గంభీరా! జ్ఞానము! ఏమీ యీ మహానుభావత్వము!

క. ప్రళయపవనంబు తాఁకినఁ
జలియించుఁ గులాచలములు సత్యంబుగ ని
శ్చలములు ధీరులమనములు
చలింప వవి యెంత లేసి క్రమముల నైనన్.

కాఁబట్టి నాకెందు కీ యతినిర్బంధము? (ప్రకాశముగా బేతాళునితో) భద్ర! పోయి నీ వీభూపతి సమాహితము నాచరింపుము.

బేతా—(నమస్కరించి) చిత్తము సాధక! (నిష్క్రమించుచున్నాఁడు)

కాపా—(అంతటఁ జూచి) రాజా! విభావరి ప్రభాతప్రాయ మ కానది. మే మిఁకఁ బోయివత్తుమా?

రాజు—అయ్యా! సాధక! దుస్థితకథలయందు మమ్ము స్మరియింపుఁడు.

కాపా—రాజా! నిన్ను దేవతలు స్మరింపఁగలరు. (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(తూర్పు చూచి సప్రసాదముగా) అహా!

తే. గీ. గాఢతిమిరంబు పంచబంగాళముగను
సంధ్య యరుణుండు నిజపురస్సరులు గాను
సకలభువనజాతానుగ్రహార్థ మిదిగోఁ
బయికి వచ్చుచు నున్నాఁడు భాస్కరుండు.

కాఁబట్టి నేనును బరమపవిత్ర యగు భాగీరథీతీరమునకుఁ బోయి స్వాధ్యాయాదికము నొనరించెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

—* గద్య. *—

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధ సరసకవితాధురంధర వడ్డాది సాధువంశక్షీర నీరాకర రాకాసుధాకరాచ్ఛనామాత్య పౌత్ర హారితసగోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబా గర్భశుక్తి ముక్తాఫల సూరపరాజపుత్ర ధానశనూభవ విబుధవిధేయ సుబ్బారాయనామధేయ ప్రణీతంబగు చండకౌశికనాటకమునందు చతుర్థాంకము.



నరకపాలకునకు సభ్యుడనుద్వార

మిప్పుడొక్క వరణమే తలంప

(తెరచిమ్మకొని చండాలుఁడు సత్వరముగాఁ బ్రవేశించి)

చండా—అరే! చిన్నకొడుకునకు—

రాజు—(సాశంకముగా) భద్రా! చిన్నకొడుకున కేమి?

చండా—ఓరీ! నేను చెప్పునది యిది. చిన్న[illegible]ఁజేరువఁగూరు
చుండి కొంతసేపు కూఁడుది కడుపు దరిగోయ నెంతో జాలిగా
నేడ్చుచున్నది. కావున నీవు వేవేగ నావంకకుఁ బోయి వానిచేతఁ
బీనుఁగుఁబాతఁ బుచ్చుకోరా. నే నిదిగో సామియొద్దకుఁ బోయె
దను. (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(నడచుచున్నాఁడు)
(తెరలో) అయ్యో! కొడుకా! అయ్యో! నాకన్నతండ్రీ! ఎక్కడ
నున్నావు? పలుకవేమిరా బిడ్డా!

రాజు—(విని శోకముతో) కటకటా! యీప్రలాపమెంత దారుణముగా
నున్నది.

(తరువాత ముందుచెప్పినట్లు శోకమును నటించుచు శైబ్యప్రవేశించు
చున్నది.)

శైబ్య—అయ్యో కొడుకా! అయ్యో నాకన్నతండ్రి! ఎక్కడను
న్నావు? పలుకవేమిరా బిడ్డా? (మాఱుపలుకమి నభినయించి మొ
ట్టకేలకుఁ దెలివినొంది కన్నీళ్ళతో) హా పుత్రా! హా పుత్రా! యె
క్కడనున్నావు? మాఱు పలుకు తండ్రీ! అయ్యో! యిది యే
మిరా బిడ్డా! మీ తండ్రిగారు విడిచిపెట్టినట్టే యదృష్టహీనురా
లిని నన్నిప్పుడు నీవును విడిచిపెట్టితివి. ఇది యుక్తమగునా య
న్నా? (మూర్ఛిల్లుచున్నది.)

గుణనిధి యగున కిప్పుడింతటియవస్థాంతరము సంప్రాప్తమయినదో
కనుంగొనము. ఆర్యపుత్రా! యేమఱక బిడ్డను గాపాడుమని నా
కాజ్ఞాపించితివి. పాపశీలను నేనాలాగునఁ గావింప నయితిని.

రాజు—(సవిశేషకరుణంబుగా) అహో! యీపరిదేవనము లాయమ్ముల
ను గోయుచున్నవే.

శైబ్య—(మృతుని ప్రత్యంగము దడవిచూచి) [illegible]న్న! కొన్ని
ల చిన్నన వన్నెమీఱు నిది నీనెన్నుదురు గదా! శతత్రికా
రౌద్రయినతెప్ప తొండ్రికల నొప్పి పర్యంతపాటలంబు లయి
సుస్నిగ్ధధవళంబు లగునివి నీకన్నులు గదా! కొడుకా! సుఘటి
తాస్థిబంధకఠినవిస్తీర్ణమిది నీహృదయఫలకముగదా! తండ్రీ!
సాహసహీనుండవు, నీయాకృతి యాక్రాంతహాతిమన కేమి
యుపలక్షణము దోఁపించిన దోయి *సత్యసంధుని కార్యపుత్రునకు
మందభాగిని నగునాచరితవలన దాలాగునఁ బ్రమాదము గలిగినది.
సర్వథా ధర్మమె కారణము; లక్షణమప్రమాణము; విజ్ఞా వేదు
లలీకవాదులు; అయ్యయో! సాముద్రికవిచక్షణులెందఱొ
వీని యావయవ లక్షణములయందు విశ్వాసము గలవారయి
యితఁడు దీర్ఘాయుష్మంతుఁడు వంశోద్ధారకుఁడు, సార్వభౌముం
డు గాఁగలఁడని పలుమాఱు ప్రశంసించిరి. ఆప్రశంసము లన్నియు
మందభాగ్యురాల నయిన నాకర్మమున నసత్యములే యయిపో
యినవి.

రాజు—(సాశంకముగా) అయ్యో! యేమీ! యిది యంతయు నాకే
తగిలివచ్చుచున్నది (నిపుణముగాఁ జూచి కన్నీళ్ళతో) హా
నే మిది?

మ. గొడుగుంబోయి శిరంబు, పెద్దనుదు, రక్షుల్ దీర్ఘముల్ చిన్నిలే
యడుగుల్ చక్రసులక్షితంబులు, భుజా లాజానులంబుల్ స్ఫుర

జడజంబుల్ కరముల్ గవుంగ్రశము, వక్షంబాయతం, బన్నవా
గడు సీపాపఁడు చక్రవర్తిపదయుక్తశ్రీయాంకూరమే.

(జ్ఞప్తివచ్చి దుఃఖముతో) అయ్యో! నిజముగా మారోహితా శ్వున కిదే యీడు. అందుచేత నాహృదయమున కనుమానము కలుగుచున్నది. కానీ వత్స కమ గళము దొలంగుఁ గాక.

శైబ్య—హా! భగవానుఁడా! కౌశిక! యిప్పుడుగదా నీవు కృతార్థుఁడ వయితివి!

రాజు—(సావేగముగా) హా! యేమిది! భగవానునిఁ గౌశికుని నిందించుచున్నది; ఎందుఁగాని యింతకయు భేద మున్నది కానరాదు. ఈమె పరదార యెట్లగును. నిజముగా నీతపస్విని శైబ్యయే. (తడవుగఁ దేఱి చూచి సకరుణముగా) ఇఁక సందేహ మెందుకు?

మ. మృదువీణాస్వనమెల్లు రావ్రైనదే యేడ్వఁగ మహోర్థ్వగఁ
జెఱి రెండుమ్మెదఃప్పబెన్న లతినెఱల్; చిక్కెఁ గ సమస్తాంగముల్
మదికిం బోలఁ బరాక; నెమ్మొగముగఁ మాలిన్యమ్ముం బొందెఁ బ్రాఁ
తదియాచిత్రరురూపుచందమున వేద్యం బయ్యెడుఁ లేఖఁగఁ

హా! వత్స! రోహితాశ్వ! యెక్కడ నున్నవు? పలుక వేమిరా తండ్రీ! (మూర్ఛ) మరలఁ దెలిసి రోహితాశ్వునిఁ జూచి)

తే. గీ. ప్రథితమంగళగుగ్గులురచిత మైన
నన్న దిన్నారికూక టిజడలు వ్రేల
మధుపలంఘితము గతాననరసశోభ
నెసఁగునీమొగ మిపు డొప్ప దేర తండ్రి.

హా వత్స! హా రోహితాశ్వ! హా తపనకులబాలప్రవాల! హా హరిశ్చంద్రహృదయానందన! హా కుపితకౌశికదక్షిణానృణ్యప్రదానపణ్య!

చ. అనిమిషు లొందఁ దృప్తివివిధాధ్వరముల్ సవరింప లేదు, యాచనకుల కీప్సితార్థము లొసంగను లేదు; దిగంతమందనం
బును నెలకొల్ప లేదు; సుఖముం గనలేదు కలార్థ మూవరం
బున వటబీజమునొల్లక పోలె వృథాపాలియిపోతే సుతా.

(మెల్లగా నడిచి, తలంచుకొని సంభ్రమముతో) అయ్యయ్యో! నేను బరాధీనుండ నన్నమాట బొత్తిగ మఱచి పోయితినే. (విచారించి దుఃఖముతో) అన్నన్నా యెంతకష్ట మెంతకష్టము!

క. మృతివంచనను గాంతురు ని
ష్కృతి నతిశయముగ నవాంతిప్రవృత్తులు ధన్యుల్
క్షితిలోన నాత్మవిక్రయ
ఘతిపాపులు పాయరు జాలి రకటా యసువుల్.

(దుఃఖించుచు) అయ్యో! పంచభాగ్యుండను నే నాకొరకును దూరమాయి పోయితిని.

తే. గీ. దారుణంబైన యీదుఃఖభారమునకుఁ
దగినయౌషధ మిప్పుడు ధైర్య మొకటి;
వేలి నాలింపరాని యంతటి మహాఱ
గలుగునాని మప్రతీకార మరయ.

కావున దుస్సహదుఃఖానలదందహ్యమానుండ నగుచున్న వివేకజలంబులం జల్లార్చుకొని ప్రభుశాసనమున నే యుండెదను.

శా. నాదిభ్రాంతిరి వ్యక్తమహా నయమ నవ్యక్తంబ యాదిం దుదిన్;
బ్రాదుర్భూతము పంచధా జగము; తత్ప్రాచుర్య మబ్రిం బోలె;
యాదోరాశితరంగభంగవలనవ్యాపార మా సంస్మృతిన్
భేదంబేమి వియోగయోగములకున్; ఖేదంబు మోహోత్తమే.

శైబ్య—(తెలివి వచ్చి) అయ్యో యీవల్లకాటిప్రాణము నన్నింకను విడిచి పెట్టి పోవకున్నది. ఇందుకు నే నేమి చేయుదును. (కన్నీరు తుడుచుకొని) కాని ఈశ్మశానవృక్షమున నురిపోసికొని యీ పాడుజీవము పోగొట్టుకొనియెదను. (ఉరిపోసి కొనుచున్నది.)

రాజు—(చూచి తొట్రుపాటుతో) అయ్యయ్యో! యిప్పుడు మఱియొకజీవితవ్యసనఫలము సంప్రాప్త మగుచున్నది. మందభాగ్యుండను నే నిందు కేమి చేయుదును?

(ఆలోచించి) కానీ ఈలాగునఁ జేసెదను. (మఱియొక చోటికిఁ బోయి "మృతివలనను గాంతునా నిర్వృతి" యను నీ పూర్వోక్త పద్యము చదువుచున్నాఁడు.)

చ. కనఁ బరలోకభోగములు స్వకర్మవిభేదవిపాకవిభ్రమం
బునను విరోధమార్గములు వో[illegible] బరలోకతత్త్వవి
జ్ఞనములు మాయ సుజ్ఞనము సల్పి హసింతు నెమ్మనంబునం
దనిశ మపార మైనయవశాత్మలయేతదసార సంసృతిన్.

శైబ్య—అపురపురా! యెంతప్రమాద మెంతప్రమాదము! మరణమహోత్సవవ్యాసక్తహృదయ నయి పరాధీనజీవితురాల నగు నేను దాసత్వము విస్మరించితిఁ. నేను బదరి యట్లే చేసి యుంటి నేని జన్మాంతరమున నయిన నీదాసభావము నన్ను విడువకుండును గదా! అయ్యో! యప్రతీకారదారుణం బగునీదశావిపర్యయంబున నే నెందాఁక నలమరుదానను? కానీ కాలోచితము నాచరించి దాసత్వసముచితం బగు శుశ్రూషచేత బ్రాహ్మణోత్తము నారాధించుచు నదృష్టహీనురాలను నే నీమనుష్యలోకమునఁ గ్రమ్మఱ జన్మింప కుండ వ్రతోపవాసనియమంబుల నీదేహంబు శోషిల్లం జేసికొనియెదను. (పాద పేర్చుచున్నది)

రాజు—(చూచి దుఃఖముతో) అయ్యో! యీమె కాలోచితకర్మమున కప్పుడే యారంభించినది. (తనలో) దేవీ! బాగుబాగు; నీ విట్టియవస్థయం దయిన నాభిజాత్యము నతిక్రమింప కున్నదానవు. ఇంక నే నీమెను సమీపించి ప్రభుశాసనము నెఱవేర్చెదను. (సమీపించి విచారముతో) దేవీ! (అర్ధోక్తిని నోరు మూసికొని) ఓ మహాభాగురాల!

క. సదయుక నాయాదేశం
బిడకయు మృతకంబలంబు నెవ్వరు గానీ

నడపంగ రాదు మానవుఁ
గడఁ గాంపింపంగ న్యాయముకర్జము లెవి యుక్.

కాఁబట్టి మృతకంబళము నీయవలయును. (కన్నీళ్ళడంచుకొని చేయి సాచుచున్నాఁడు)

శైబ్య—(భయమున వణంకుచు) భద్రముఖ ! దూరముగా నుండుము నేను నీకిచ్చెదను.

రాజు—(లజ్జించుచు) ఉన్నాఁడను.

శైబ్య—(రోహితాశ్వుని శరీరముమీఁదనుండి బట్టతీసి యిచ్చుచు హస్తమును జూచి విస్మయముతోఁ దనలో) ఏమిది ! చక్రవర్తి లక్షణలక్షితం బయ్యు నీ చెయ్యి యిటువంటివ్యాపారమునం దుప యుక్తమైనది ! (సమీపించి మెల్లగా నెల్లయవయవములు చూచి యానవాలు పట్టి) ఏమిది ! అయ్యో ! ఆర్యపుత్రులా ? (తత్తఱ పాటుతో) హా ! యార్యపుత్ర ! రక్షింపు రక్షింపు (పాదముల మీఁదఁ బడుచున్నది)

రాజు—(తొలఁగి) దేవీ ! చండాలదాస్యదూషితుండ నయిననన్నంటఁ దగదు. ఊఱడిల్లు మూఱడిల్లుము,

శైబ్య—(ఊఱడిల్లి) అయ్యయ్యో ! యిది యేమి ?

రాజు—దేవీ ! యిది పూర్వజన్మకర్మములవంట. నీ విందుకు విలపింప కుము. మృతకంబలమును దెమ్ము.

శైబ్య—(దుఃఖముతో నిచ్చుచున్నది) ఆకాశమునుండి పుష్పవర్షము కురియుచున్నది.

ఇద్దఱు—(వింతతోఁ జూచుచున్నారు)

(తెరలో) క. ఔరా దానము, శీలం
బౌరా, ధీరత్వ మౌర, యౌరా సత్యం

దారా యోరువు, జ్ఞానం

దారహరిశ్చంద్రభూపహార్యశ్శు కృతా.

శైబ్య—(విని సశ్లాఘముగా) ఆహాహా! యెవరోగాని యార్యపుత్రుని గుణశ్లాఘవలన నాహ్లాదము నూఱడించుచున్నారు అయిన నీగుణశ్లాఘమున కేటుగాని యార్యపు[illegible]కాని కీదృశావస్థ తటస్థించుట చూడ సర్వథా ధర్మమకారణ[illegible] సత్యమరణ్యరోదనము, విజ్ఞాన మంధకారనర్తనము.

(ధర్ముఁడు ప్రవేశించుచున్నాఁడు)

ధర్మ—హా! పతివ్రతామణి! హా! మహారాజహరిశ్చంద్ర! నే నకారణుఁడ నెట్లులగుదును? చూడు.

చ. తమతమసత్యవాక్యముల దానములన్ మఱి యార్జితంపుఁగ
ర్మములను లాఁతిభూపతులమండలి కెయ్యది దుర్లభంబు ల
వ్వివలత గాత్రదర్శనపవిత్రము లై తగుశాశ్వతంపులో
కములను నేను నీకు నొసఁగం జగ దెంచినవాఁడ నియ్యెడన్

కావున నీవింక విచారింపకుము, వత్స! రోహితాశ్వ! యూఱడిల్లు మూఱడిల్లుము.

రాజు—(చూచి సంతోషముతో) ఏమీ భగవానుఁడు ధర్ముఁడా? మహాత్మా! యభివాదనము చేయుచున్నాను.

శైబ్య—స్వామీ! ప్రణమిల్లుచున్నాను.

రోహి—(మెల్లమెల్లగాఁ గన్నులు దెఱచుచున్నాఁడు)

ధర్మ—రోహితాశ్వ!

క. పిత్రుధర్మ పాలితుండ వ
యితి వీవు కుమార ; మరల నేతెంచెను నీ
గత మైనయట్టిప్రాణము
క్షితిప్రజలను నేలుకొనుదు చిర మూఱడుమా.

రోహి—ఓహో! మాయమ్మ వచ్చినది. అమ్మా! నిన్నిచ్చటి కెవరు తీసికొని వచ్చినారు?

శైబ్య—ఎవరున్నారు నాయనా? నాకర్మమే నన్నిక్కడకుఁ దెచ్చినది.

ధర్మ—వత్సా! రోహితాశ్వ! యిదిగో బ్రహ్మలోకాధిప మీతండ్రి నీయెదుట నున్నాఁడు.

రోహి—ఓహో! నాయనగారా? రక్షింపుఁడు రక్షింపుఁడు. తండ్రి మీఁద వ్రాలుచున్నాఁడు.

రాజు—పుత్రకా! చండాలసేవదూషితుని నన్ను నీవు దాఁకఁగూడదు.

ధర్మ—రాజా! నీ వింక నీదీనాలాపములను చాలింప వచ్చును. ఏమనఁగా—

శా. నీయిల్లాలిని గొన్న బ్రాహ్మణుఁడు పత్నీసంయుతుం డెవ్వఁడో
హేయాకారముతోడ నిన్ను గొనినాఁ డీమాలవాఁ డెవ్వఁడో
న్యాయం బొప్పఁగ నెందుఁ జేయుకువా రాజ్యం బెల్ల గుహ్యంబుభూ
పాయాథార్థ్యమెఱుంగ నీ కిపుడు దివ్యాలోక మే నిచ్చెదన్.

ఎవఁడురా పరిచారకుఁ డక్కడ?

పురుషుఁడు—(ప్రవేశించి) స్వామీ! యాజ్ఞాపింపుము.

ధర్మ—ఓరీ! విమానమును దీసికొని రమ్ము.

పురు—చిత్తము స్వామీ (అట్లు చేయుచున్నాఁడు)

ధర్మ—మహారాజా! నీ విమాన మధిరోహించి దివ్యనేత్రముల సర్వము నెట్లున్నదో విలోకింపుము.

రాజు—చిత్తము మహానుభావ! [దివ్యవిమాన మారోహించి ధ్యానము నటించి) * ఓహోహో! విద్యలు దన్నుఁ బొందిన పన్నసంతోషముచేత భగవానుఁడు కౌశికుఁడు మారాజ్యమును విడిచి మంత్రుల కప్పగించినవాఁడు.

ధర్మ—మహారాజ! భవదీయ మగుసత్యవాక్యమును బరీక్షింప వేఁడి మారాతపోధనుఁ డట్లుచేసినాఁడు గాని యాయనకు నీరాజ్యమెందుకు?

నీవు నంభ్రమింపక యింకను దేటగా సర్వము నాలోకింపుము.

రాజు—(వెండియు ధ్యానము నటించియానందముతో) దేవీ ! నీ వెంతయదృష్టవంతురాలవు.

ఉ. బానిసగా నినుం గొనినవాఁ డపారకృపానిధానుఁ డీ
శానుఁడు సుమ్ము ; బ్రాహ్మణియు సర్వజగజ్జనయిత్రి యద్రిజా
మానిని ; నన్నుఁ గొన్నతఁడు [illegible]డనఘుండు ధర్ముఁడో
చాన ! యథార్థ మిట్లగుట శల్యము [illegible] నేఁడు నాహృదిన్.

ధర్మ—అట్లయిన నిప్పుడు రాజా! కుమారుని రోహితాశ్వునిఁ బృథివీ రాజ్యమున కభిషేకింపుము.

రాజు—చిత్తము మహాభాగా.

ధర్మ—సింహాసనము సింహాసనము ; ఆతపత్రము మాతపత్రము ; చామరము చామరము ; జలకుంభము జలకుంభము.

పురు—మ. ఇదె భాస్వన్నవరత్నసంఘటిత మహా
హేమోచ్చసింహాసనం
బిదిగో శారదచంద్రమండలనిభం
బిద్ధాతపత్రంబు ; కో
మ దిక్కల్లి న్నగు హైమదండరుచిరం
బుల్ చామరాలివ్వె; కాం
డధినాట్సప్తకసంభృతాంబు పరిపూ
ర్ణసువర్ణకుంభం బిదే.

ధర్మ—(పైకిఁ జూచి) ఓహో ! యెంతయదృష్టము ! ఈ రోహితాశ్వకుమారుని యభిషేకమహోత్సవమును దేవత లభినందించుచున్నారు.

ఉ. వీరె నదుల్ ధరించిరి పవిత్రపయఃపరిపూర్ణకుంభముల్ ;
భూరిసుపర్వదుందుభులు మ్రోగు నివేదివి యందు ; ముక్తమం
దారసువృష్టులౌ చిదిగో నర్తనముంబొనరింతు రచ్చరల్ ;
చేరి యిదే నృపాలుని భజింత్రు నిజాంశములన్ దిగీశ్వరుల్ ;

కరణీయ మాచరితం బయ్యెఁ గావున నీ వింక బ్రహ్మలోకమునకుఁ బ్ర
యాణము గమ్ము.

రాజు—భగవానుఁడా !

శా. సందష్టోష్ఠత ఘోరతర్జనల విశ్వామిత్రుఁ డుగ్రుండు రాఁ
గం, దేవా ప్రజలం ద్యజించి యెట కేగం జూతుఁ గొంపొమ్ము మ
మ్మం చో నందు సబాష్పదీనముఖులై మున్నన్న నావారి మో
సం బిగ్గన్ విడి శాంతు నెట్లొకఁడఁ దన్వన్నా దిష్టలోకంబులన్.

ధర్మ—రాజా ! స్వకర్మవైచిత్ర్యంబునం జేసి యుచ్చావచస్వభావు
లగు ప్రజలకా, యింత లేసి భాగధేయంబులు ?

రాజు—మహాత్మా ! విను నా నిశ్చయము.

క. తిరుగుదు నయ్యైలోకము
లరనిముసం బైన వార లందఱతోనే
దొరకుత నాద బపున్నెపు
నెరసున నసే వారలకును నీచూపుగతుల్.

ధర్మ—(విస్మయముతోఁ దనలో) అహో ! యీ రాజర్షిచరిత్రము
లోకోత్తరము ! [ప్రకాశముగా] రాజా ! యేతత్పుణ్యదానసంభా
వితం బగు నపరపుణ్యసంభారంబు చేత నెకను నీప్రజలకుం గూడ
శాశ్వతలోకంబులు సంపాదించుకొన్నాఁడవు. నీ కింకను గావలసిన
దేమి యున్నదో దానిని బ్రసాదించెద నడుగుము.

రాజు—భగవానుఁడా ! యింతకన్నను నాకుఁ గావలసిన దొకటి
యుండునా ? చూడు—

చ. పొసఁగుటఁ జేసి విద్యలు తపోనిధి నాపయి వీఁడె కోప మీ
నిసుఁగును బ్రాణముల్ వడసి నేలకు నయ్యెను జక్రవర్తి; నా
కొసఁగితి నీదుదర్శనము; క్రొందఁగఁ గన్గెను బ్రహ్మలోకముం
గొసరఁగ నింతకన్న నొకకోరిక నా కెదలోన నుండునే.

అయిన నట్లగుఁగాక.

శ్రీ

# విక్రమోర్వశీయనాటకము.

ఇది

కాళిదాసకవి విరచితమయిన

సంస్కృతనాటకమునుండి

రాజమహేంద్రవరంబున

దొరతనమువారి మొదటితరగతి బోధనాభ్యాసన పాఠశాలయందుఁ

ప్రధానాంధ్రోపాధ్యాయుండగు

వడ్డాది సుబ్బారాయనిచేతఁ

తెలిఁగింపఁబడినది.

రెండవ కూర్పు 2000 ప్రతులు.

రాజమహేంద్రవరము.

అయ్యగారి బాపిరాజుగారిచే శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1912.

వెల 0 8 0.]

# వసురాయకవికృత గ్రంథమా

1. అభిజ్ఞానశాకుంతలనాటకము. (టీకాసహితము)
2. వేణీసంహారనాటకము. (రౌద్రరసప్రధానము)
3. మల్లికామారుతప్రకరణము. (అంకములవరుసను కవి యొక్క చిత్రపటముతో నున్నది.) ... ... 0
4. ప్రబోధచంద్రోదయము (శాంతరసప్రధానము) 0
5. చండకౌశికనాటకము (హరిశ్చంద్రకథ) 0
6. విక్రమోర్వశీయనాటకము (శృంగారరసప్రధానము) 0
7. సూక్తివసుప్రకాశకము (లోకదృష్టాంతసమన్విత నీతిబోధకపద్యగ్రంథము.) ... ... ... 0
8. సుగుణప్రదర్శకము ... ... ... 0
9. భక్తచింతామణి ... ... ...0
10. భగవత్కీర్తనలు ... ... ... 0
11. నందనందనశతకము (విష్ణుభక్తులకానందకరము) 0
12. దైవభక్త్యుపన్యాసము ... ... ... 0
13. ఆంధ్రమేఘసందేశము ... ... ... 0
14. భామినీవిలాసము[పండితరాయవిరచితమునకు తెలుగు]0 1
15. సూర్యశతకము (మూలశ్లోకములతో గూడియున్నది) 0
16. సతీస్మృతి (కరుణారసభూయిష్టము) ... ... 0
17. మతస్మృతి (ఆపదుద్ధారకశతకముతో నున్నది.) 0 4
18. గౌతమీమహాజలమహిమానువర్ణనము, గోదావరి నౌకావిహారము చాటుప్రబంధము:2 చంపకమాలికలుగలది. 0 2
19. సుమనోమనోజ్ఞము (శాంతవచనము 1 వ భాగము) 0 7
20. డిటో (2 వ భాగము) 0 9
21. డిటో (3 వ భాగము) 0 8

పై గ్రంథములు వలయువారు వడ్డాదిసుబ్బారాయకవిగా
రాజమహేంద్రవరము వారికి వ్రాసికొనవలె

# పీఠిక.

ఈగ్రంథముఁ గవికులసార్వభౌముం డగుకాళిదాసు సంస్కృతభాషయందు రచియించినాఁడు. ఇది శృంగారరసప్రధాన మయినది. ధీరలలితనాయకగుణ సంపన్నుఁడును, చంద్రవంశసముత్పన్నుండును నగు పురూరవశ్చక్రవర్తి దీనికిం గథానాయకుండు. విక్రమశాలి యగునయ్యేలికను, వేలుపువెలఁది యగునూర్వశిని గూర్చి యొనర్చినది గావున, నిది విక్రమోర్వశీయ మని, విక్రమోర్వశి యని వాడఁబడును. రూపకములలో నాటకము మొదటి దగుటను, దక్కినవానియందుఁ గూడఁ దఱుచుగ దానిలక్షణములే పట్టుచుండుటను, దీనికిఁ గూడఁ దన్నామమున సామాన్యవ్యవహారంబు గలిగియున్నను, దివ్యమానుష సంశ్రయం బయి, యయిదంకములు గల దగుటంబట్టి, యీవిక్రమోర్వశీయమును నాటికాద్యష్టాదశోపరూపకములలోని త్రోటక మని విశేషజ్ఞు లగుమనీషులు పేర్కొందురు.

ఈప్రబంధమునకుఁ గథానాయకుం డగుపురూరవుండు, తీర్థరాజం బగు ప్రయాగంబునంతరాళంబునఁ బ్రతిష్ఠానపురంబున వసియించి, నిఖిలజనరంజనంబుగా నేలాపాలనంబు సేయుచుండెను. ఆపృథివీశుం డొక్కనాఁ డరద మెక్కి యక్కడక్కడ విహారంబు సలుపుచుండఁ, గుబేరభవనంబునుండి మరలివచ్చుచు మార్గమధ్యమునఁ గేశి యను రక్కసునిచేఁ జెఱపట్టఁబడినతమప్రాణసఖి యగునూర్వశికొఱకు వేడ్చుచున్నరంభాద్యప్సరసల యార్తప్రలాపంబు లతనివీనులకు వినవచ్చెను. తోడనే యార్తత్రాణైకపరాయణుఁ డగువాధరణీరమణుం డవ్వేల్పుఁబడుచుల నూఱడించి యాక్రించురక్కసు నుక్కడంచి, యూర్వశిని విడిపించి తెచ్చి, యామెనెచ్చెలులకు సమర్పించెను. తత్కారణంబుగా నది మొదలమ్మదవతి యాక్షితిపతియందు మనసు దగిలి, యనన్యాయత్తచిత్తంబునఁ దద్ధ్యానంబును సలుపుచుండెను.

ఇట్లుండునంతఁ గొండొకకాలంబున నింద్రసభయందు లక్ష్మీస్వయంవర మనునొక నాటక మాడవలసివచ్చెను. అందు లక్ష్మీవేషమును ధరించినయాయూర్వశిని వారుణీభూమికాధారిణి యయినమేనక "నీడెంద మెవనియందుఁ దగిలియున్నది" యని యడుగఁ, "బురుషోత్తమునియందు" ననవలసినది "పురూరవునియందు" నని బదులు పలికెను. అది విని తన్మార్గంబు శిక్షకుం డగుభరతముని గినిసి "నీవు మానుషివి గ"మ్మని దానికి శాపం బిచ్చిన, నచ్చెలువ తచ్ఛాపమోక్షణంబుకయి తన్ను వేఁడుకొనినం గనికరించి యింద్రుండు "నాకు సమరసహాయుం డగుపురూరవునిం గుమారకుఁ డుదయించునంతకుఁ బొంది యుండు"

మని యనుగ్రహించిరి, ప్రసాదం బని యగ్వాళ, యయ్యార్యులకు [illegible]యోత్య యయ్యె. అనుసీకథయే యీనాటకమున నెంతో చమత్కారముగా సృజింపఁజేయఁ బడెను. సంస్కృతపుస్తకములలోఁ బాఠభేదము లనేకము లున్నవన్నియు నంశము విమర్శకు లెఱుంగకపోరని నమ్ముచున్నాను.

నే నిప్పటి కయిదాఱు సంవత్సరములక్రిందట, వేణీసంహారనాటకమును దెనిఁగించిన తరుణముననే దీనినిగూడ నాంధ్రీకరించితిని గాని, దానివలె దీనిని బ్రయోగించి చూచుటమాత్ర మెన్నఁటికిని దటస్థించినదికాదు. ఇందలిపాత్రములు పెక్కు లంతరాళమునఁ బ్రవేశింపవలసిన వగుటచేత, దీనిప్రయోగ మెల్లరకును సులభసాధ్యము కాదు గాని, సాధ్య మయినచో మాత్రము సహృదయులను సభ్యుల నానందపరవశులను జేయఁ జాలు ననుటకు సందేహము లేదు. ప్రయోగకుశలులు రసికతల్లజుల యుల్లంబులను దీని మూలమునఁ బల్లవింపఁ జేయుదురు గాక. 1883 సం॥ అక్టోబరు. వ॥ సు

## ద్వితీయముద్రణపీఠిక.

---

ఈనాటకము మొదటికూర్పుప్రతులు పదిపండ్రెండు సంవత్సరముల క్రిందటనే నిశ్శేషముగా వ్యయపడినవి. అప్పటినుండియు నాంధ్రదేశమునానాముఖములనుండి యవిరామముగ నీపొత్తముకొఱకు ననేకులు రసజ్ఞులు నాకు వ్రాయుచున్నారు. అయి నను బునర్ముద్రణము గావించుటలో నేను శీఘ్రముగ శ్రద్ధచేయనికారణమునఁ జదువరుల కీనాటకము దుర్లభ మగుచుండెను. జనానురాగమునకుఁ బాత్ర మయినగ్రంథము నిట్లుపేక్షించుట మంచిది కాదని యీసంవత్సరము దీనిని మరల నచ్చొత్తించితిని.

మొదటికూర్పు ప్రతులు చెన్నపురియం దచ్చు పడినవి. అచ్చుచిత్తులు నేను దిద్దుటకు వీలు చిక్కనికతమున వానియందు బహువిధస్ఖాలిత్యములు దొరలినవి. వానిని బునర్ముద్రణమున నేను సవరింపఁ దలంపుగొని యుండఁగా, గీర్తిశేషులయిన గొల్లపూడి రామదాసు బి. ఏ గారు విమర్శరూపమునఁ గొన్నిచోట్ల శక్తికొలఁది నాయుద్యమమునకుఁ దోడు చూపిరి. అందులకుఁ గృతజ్ఞుఁడ నయి వారియాత్మకు నిత్యసుఖమును గోరుచు నీద్వితీయముద్రణమున నాయాంధ్రీకరణమును వెండియు మూలముతోఁ బోల్చి యుచితములయినసవరింపులఁ బద్యగద్యములయందుఁ గొన్నిచోట్లఁ గావించితిని. పుస్తకముల కొఱకు బహుదేశములనుండి వ్రాసి వ్రాసి విసిగియున్న చదువరుల డెందములకింక నీగ్రంథ మానందము గలిగించుఁ గాక.

1 ఏప్రిలు 1912 సం॥రం. }

వడ్డాది సుబ్బారాయఁడు
రాజమహేంద్రవరము.

# శ్రీపరమాత్మనేనమః

## ఇష్టదేవతా ప్రార్థనాదికము.

శ్రీలకుఁ బుట్టుపట్టుఁ, దనుఁ జేయుబుధాళికిఁ జెట్టుఁజెట్టు, ధీ
శాలులగుట్టుమట్టు, భవసాగర మీఁదుక పెట్టుగట్టు, బ
గ్గోళులకార్మ్రుగుళ్ళనుడిగొట్టు, జగంబులకట్టు, ధర్మము
నా్రిలఁగ నీనిపట్టు, నఘనాగవిరాట్టు, విరాట్టుఁ గొల్చెదన్.

ఉ. పూవులఁ గుచ్ఛమాలకరుపోలికఁ దావు లెఱుంగుమన్, రసో
జ్జీవకశబ్దరాజిఁ గృతి శేఖరముల్ రచియించుసత్కవుల్,
కేవలతప్రసగ్రహణకృత్యమునందు మిళిందచాతురిన్
బావనసాహితిం దనరుపండితు లందుఁడు మన్నమస్కృతుల్.

చ. దిరిసెపుఁబూలమాదిరి నతిమ్రదిమంబులు కాళిదాసస
త్తరురసనం జనించినపదంబు లి వంటివఁ గందు నాక, తెం
పరినయి తెల్గులోనికిని మార్పఁ దలంచితి విక్రమోర్వశిన్,
సరళపుఁద్రోటకంబు రససంభరితం బిది యే మొనర్తునో.

ఆ. వె. ముందు నేను మేఘసందేశ మాంధ్రీక
రించి, కొంచె మలవరించుకొన్న
పరిచయం బొకింత పని సేయకున్నె యీ
విక్రమోర్వశీయవిరచనమున?

సుగంధి. ప్రక్రమంబు దప్పి యర్థభంగ మైన, నింక నే
వక్రతల్ గనంగఁబడ్డ, వానిఁ దెల్ప రే సుధీ
చక్రవర్తులారా! నేను సంస్కరించుకొందు నీ
విక్రమోర్వశీయమందు వేయువేయుకూర్పులన్.

క. అని యిష్టదేవతానే
వనమును, విద్వత్కవిస్తవనమును, విజ్ఞా
పనమును, మాతృకగుణభా
వన మొనరిచి రచనసలుపు వ॥ సు॥ రాయండన్.

## ఈనాటకమున వచ్చుముఖ్యపాత్రములు.



### పురుషులు.

రాజు—కథానాయకుఁ డయినపురూరవుఁడు.

చిత్రరథుఁడు—ఊర్వశిని విడిపించుకొనివచ్చుట కింద్రునిచేఁ బంపఁబడిన గంధర్వసేనాధిపతి.

విదూషకుఁడు—పురూరవుని వేడుక చెలికాఁడు.

పైలవుఁడు
గాలవుఁడు } —భరతమునిశిష్యులు.

కంచుకి—పురూరవునియంతఃపురమున నుండువాఁడు.

కుమారుఁడు—పురూరవునికొడు కగు నాయువు.

నారదుఁడు—దేవఋషి.

### స్త్రీలు.

ఊర్వశి—కథానాయిక యగునప్సరస.

రంభ
మేనక
సహజన్య } ఊర్వశిసఖు లగునప్సరసలు.

దేవి—పురూరవునిపట్టమహిషి.

నిపుణిక—దేవికిఁ బరిచారిక.

తాపసి—చ్యవనాశ్రమమునుండి కుమారుని దీసికొనివచ్చిన వృద్ధురాలు.

వీరును మఱికొందఱు పరిచారకులు మొదలగువారును.



# విక్రమోర్వశీయము.

## ప్రథమాంకము.

(తరువాత నప్సరసలగుంపు ప్రవేశించుచున్నది)

అప్సరస—అమరపక్షపాతంబు నాకాశగమనంబును గల యయ్యలారా! రక్షింపుఁడు రక్షింపుఁడు.

(తరువాత రథమెక్కి రాజును సూతుఁడును బ్రవేశించుచున్నారు.)

రాజు—ఏడువకుఁడు. నే నిప్పుడే సూర్యు నుపాసించి వచ్చినపురూరవుఁడను. నన్నుఁ జేరి మిమ్ముఁ గావవలసినది దేనినుండియో చెప్పుఁడు.

రంభ—దేవా! రాక్షసునిగర్వమునుండి.

రాజు—మీకు రాక్షసగర్వమున నేమికీడు మూఁడినది?

రంభ—మహారాజా! చిత్తగింపుము. ఇతరులతపోమహాత్త్వమునకు నుత్తలపడు నింద్రునికి మెత్తనిగత్తియు, రూపగర్విత యగుశ్రీతరుణికి నిరాకరణంబును, దివిదినంబున కాభరణంబు నగుమాయనుఁగుచెలి యూర్వశి కుబేరభవనంబునుండి వచ్చుచుండ హిరణ్యపురవాసి యగుకేశి యనుపలలాశి; చిత్రలేఖాద్వితీయ యగునమ్మత్తకాశినిని గాంచి హఠాత్తుగా నెత్తుకొని పోయెను.

రాజు—సరే. తెలిసినది. ఆముష్కుఁడే దిక్కునకుఁ బోయినాఁడు.

మేనక—దేవా! పూర్వోత్తరముగా.

రాజు—అప్సరలారా! యింక మీమనోవ్యథ నుజ్జగింపుఁడు. మీచెలిమికత్తెను జెఱ విడిపించి తేఁ బ్రయత్నించెదను.

రంభ—రాజేంద్రా! చంద్రునకు బౌత్రుఁడ వయిన నీకిది యనురూపమే గదా!

రాజు — మీరు నాకొఱకు నెక్కడఁ బ్రతీక్షించు చుండెదరు?

అప్స — దేవా! యీ హేమకూటశిఖరమున.

రాజు — సూతుఁడా! గుఱ్ఱముల నైశానదిశ నతివేగమునఁ దోలుము.

సూతు — దేవా! చిత్తము. (అట్లు చేయుచున్నాఁడు.)

రాజు — (రథవేగము నిరూపించి) మేలు! మేలు! సూతుడా! యీరథవేగము చేత మనకంటె ముందు బయలుదేఱినయనూరునయినను (వైనతేయునైనను) గలసికొనవచ్చును ఇఁక నాపొలసుదిండిని గలసికొనుట యెంతపని? ఇదిగోఁ! జూడుము.

చ. పొడియయి తేరిముందు ఘనముల్ చను ధూళిగ; నాకుసందులం
డడరు నరిభ్రమంబున నరాంతరనైఖరి; యశ్వపాళిపై
నిడుపగునట్టిచామరము నిశ్చలతం గనుఁ జిత్రితాకృతిన్;
నడుమను వ్రేలుకేతువసనంబు, కొనన్ నిలుచున్ మరుద్గతిన్.

(రాజును సూతుఁడును రథముతో నిష్క్రమించుచున్నారు.)

సహజన్య — సఖీ! రాజర్షి వెళ్ళినాఁడు. మనము గూడ నిర్దిష్టప్రదేశంబునకుఁ బోవుదము.

మేనక — చెలియా! యట్లే చేయుదము.

(అందఱు హేమకూటశిఖరము నధిరోహించుచున్నారు)

రంభ — ఆ రాజర్షి మనహృదయశల్యము నూడఁ బెఱుకునా?

మేన — సఖీ! సంశయింపకు.

రంభ — దానవులు దుర్జయులు గదా!

మేన — సఖీ! యింద్రుఁడు సయితము యుద్ధము తటస్థించినప్పుడు, మధ్యమలోకము నుండి బహుమానపురస్సరముగా నీయనసే దోడుకొనిపోయి, విజయముకొఱకు సేనాముఖమున నిలుపుకొనుచున్నాఁడు.

రంభ — సర్వథా యితఁడు జయశాలి యగుఁగాక. (క్షణమాగియుండి) సఖులారా! యూఱడిల్లుఁడు యూఱడిల్లుఁడు. ఇదిగోఁ! జంద్రదత్తమగునారాజర్షిరథము హరిణకేతనమునఁ దోఁతెంచుచున్నది. ఇతఁడు కృతార్థుఁడు గాక వచ్చువాఁడు కాఁడని తలంచెదను.

(అందఱును గన్నులెత్తి చూచుచున్నారు.)

(తరువాత రథమెక్కి రాజును సూతుఁడును, భయమునఁ గన్నులు మూసికొని చిత్రలేఖ కుడిచేయి యూఁతగొన్నయూర్వశియుఁ బ్రవేశించుచున్నారు.)

చిత్ర—సఖీ! యూఱడిల్లు మూఱడిల్లుము.

రాజు—సుందరీ! యూఱడుమూఱడుము.

ఆ. వె. భీరురాల! యసురభీతి యప్పుడ పోయెఁ; ద్రిభువనావనుఁడు గదే బలారి;
తెల్లవాఱఁ దమ్మితీఁగ పద్మము లట్లు, విప్పు మిఁక నీదు నెడఁదకనులు.

చిత్ర—అయ్యో! యూపిరిమాత్రమున జీవించి యున్నయీకొమ్మ యిప్పటికిని జేతన పొరయకున్నది.

రాజు—చిత్రలేఖా! మీచెలి యామె మిక్కిలి యదలిపోయినదే సుమీ. చూడు

క. ఇందుముఖి యలుఁదగుబ్బల, సందున మందారకుసుమసర మదరుచు నీ
సుందరికిఁ జెదరి గుండెలు, క్రిందుగఁ గొట్టుకొనుచున్నకైవడి దెలుపున్.

చిత్ర—(సకరుణముగ) సఖీ! యూర్వశీ! నీగుండెను గుదురు పఱచుకో. అప్సరసవు కానియట్లు లగపడుచున్నావు.

రాజు—

క. మునితకుసుమకోమలమగు, హృదయము నిప్పటికి విడువ దిదె భయకంపం
బది తెలిసికొనఁగ నడిప, దెయ్యది చెఱఁగున దాని తెలుఁగు నెలుఁగఁగ నమ్మెన్.

ఊర్వ—(ప్రకృతిని బొందుచున్నది)

రాజు—(హర్షముతో) చిత్రలేఖా! నీవు మహాదృష్టవంతురాలవు, చూడు. ప్రియసఖి ప్రకృతిని బొందుచున్నది.

చ. తొగచెలి దోఁపఁగా నిరులు దూలి వెలింగెడురాత్రికైవడిన్,
బొగవగలాయు మాని నిశిఁ బొల్చుహవిస్ఫులింగార్చియట్లు, తా
నగపడుచున్న దీసురుచిరాంగి క్రమంబుగ మూర్ఛ దేఱి, లోఁ
దొగి దరి కూలఁగాఁ, గలఁగి తేఱుచుగంగ తెఱంగు దోఁపఁగన్.

చిత్ర—సఖీ! నామాట నమ్మవే. అసురవిరోధులు హతాశులయి పరాభూతు లైనారు.

ఊర్వ—(కన్నులు తెఱచి) సఖీ! మహేంద్రప్రభావముచేతనా?

చిత్రి—కాదు. కాదు. మహేంద్రసదృశానుభావుఁ డయినయీరాజర్షి చేత.

ఊర్వ—(రాజును జూచి తనలో) ఆరాక్షసులు నాకు మహోపకారులు గదా!

రాజు—(మూర్ఛదేఱినయూర్వశిని జూచి తనలో) ఆహా! పూర్వము నారాయణ ముని నాసకొలుపుటకుఁ బోయి, యాయనయూరువునందుఁ బుట్టినయీసుందరిని జూచి యప్సరస లందఱు సిగ్గుఁ బొంది రనుమాట తగియే యున్నది గదా! అయిన నీమె వాముని సృజించినాఁ డనుట యుక్తము కాదు.

ఉ. చారుకళాతిసుందరుఁడు చందురుఁడో, ఘనసైకమోహిశృం
గారరసప్రధానుఁ డగుకంతుఁడొ, సూనదుఁ డౌవసంతుఁడో,
యారయఁ గాక, వేదజడుఁడై విషయేచ్ఛల మానుప్రాచినరా
చారి మనోహరం బయిన యీపడఁతిరూపు సృజింప నోపునే?

యూర్వ—ప్రియసఖీ! సఖీజన మెక్కడ నున్నదే?

చిత్రి—అభయదాన మొసంగినయీమహారాజేఱుంగును.

రాజు—(యూర్వశిని జూచి) అదిగో! నీసఖు లక్కడ నతివిషాదమును బొందు చున్నారు. చూడు.

తే. గీ. తరుణి! యాదృచ్ఛికంబుగా దారి నొక్క, పారిగనుఁగొని నేత్రసాఫల్య మొందు
నతఁడె నీయొడఁబాటున కడలు ననఁగఁ, జిరదృఢస్నేహసఖు రాంద్రిఁ జెప్పనేల?

ఊర్వ—(వెనుక దిరిగి) ఈయనమాట యమృతపుఁదేటగదా! అయినను జంద్రుని వలన నమృత మొలుకుట యేమి యాశ్చర్యము? (ప్రకాశముగా) అందువలననే సఖీజ దర్శనమునకు నాచిత్తము తత్తఱించుచున్నది.

రాజు—(ప్రీతితోఁ జూపుచు) సుందరీ!

క. ఘనహేమకూటగతలై, గనుఁగొన దే నీదుచెలిమికత్తెలు నీమో
మును గనుఁగొనవు దీఱఁగ, జనములు రాహుప్రముక్తుఁ జంద్రునిఁబోలెన్.

ఊర్వ—(అభిలాషతో రాజును జూచుచున్నది.)

చిత్రి—సఖీ! యేమి చూచుచున్నావే?

ఊర్వ—సుఖదుఃఖసమాన మగుజనమును.

చిత్రి—(చిఱునవ్వుతో) ఓసీ! యెవ గది?

ఊర్వ—సఖీ! ప్రియజనము గాదా?

రంభ—(సంతోషముతో జూచి) ఇదిగో! చిత్రలేఖాద్వితీయ యగుప్రియస
నూర్వశిని దీసికొని విశాఖాసమీపగతుం డగుచంద్రుఁడునుం బోలె రాజర్షి వచ్చు
చున్నాఁడు.

మేన—(చూచి) మన కిప్పుడు రెండుప్రియములు చేకూఱినవి. మనప్రియస
మరల రాఁగలిగినది. మహారాజు చెక్కుచెదరక యున్నవాఁడు.

రంభ—చెక్కుచెదరకయున్నవాఁ డని చక్కఁగాఁ జెప్పితివి. రాక్షసుఁ
దుర్జయులు గదా!

రాజు—సూతుఁడా! యిదే యాపర్వతశిఖరము. రథ మిచట దింపుము.

సూతు—చిత్తము. (అట్లు చేయుచున్నాఁడు.)

ఊర్వ—(రథావతరణక్షోభము నభినయించుచుఁ ద్రాసమున రాజా నానుకొ
చున్నది.)

రాజు—(తనలో) హాయి. హాయి! నాయింద్రియములకలిమి సఫల మ
చున్నదిగదా!

తే. గీ. స్యందనక్షోభమునఁజేసి యిందువదన। తనువు తను వంటి నన్నిట్లు దాఁకుకతన
మన్మథుఁడు మొల కెత్తినమాడ్కి దేహ। మట్టె జల్లని పులకిత మయ్యె నాకు.

ఊర్వ—(సిగ్గుతో) సఖీ! కొంచెము ముందఱకు జరుగు.

చిత్ర—(చిఱునవ్వుతో) నేను జరగ లేను.

రంభ—సఖులారా! రాజర్షిని సంభావింత మిటు రండి.

(అందఱు సమీపించుచున్నారు.)

రాజు—సూతుఁడా! తేరు నిలుపుము.

క. మతి నుత్కంఠిత యగునీ, యతివ సముత్కంఠ లయినయాశ్రమసఖులతో
డుత మరలఁ గలసికొనియెడు, ఋతుసంపద లతలఁ బొందురీతి యొసంగన్.

సూతు—చిత్తము. (అట్లు చేయుచున్నాఁడు.)

అప్స—అదృష్టవశమున మహారాజా విజయమున వర్ధిల్లుచున్నాఁడు.

రాజు—ప్రియసఖీసమాగమమున మీరును.

ఊర్వ—(చిత్రలేఖ కయిదండ యొసఁగి రథము దిగి) సఖులారా! యిటు వ
న్నన్ను గట్టిగఁ గౌఁగిలించుకొండి. నేను మరల నీలాగున సఖీజనమును జూతు ననుకొనయి

(అందఱుఁ ద్వరగఁ గవుఁగిలించుకొనుచున్నారు.)

రంభ—(అభిలాషతో) సర్వథా మహారాజు కల్పశతం బీపృథివిఁ బరిపాలించుఁగాక.

సూతు—దేవా! తూరుపుదిక్కున మహావేగముతో రథముచప్పుడు వినఁబడుచున్నది. చూడు.

తే. గీ. గగనముననుండి యెవ్వఁడో కాని యొకఁడు। త ప్తకాంచనరుచిరాంగదములవాఁడు
నగముశృంగముమీఁదికి దిగెడు నదిగో!। మెఱుపుఁదీవియు వోలె పగుమేఘమట్లు
(అందఱును జూచుచున్నారు.)
అప్ప—ఓహోహో! చిత్రరథుఁడు!

(తరువాతఁ జిత్రరథుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

చిత్ర—(రాజున కభిముఖుఁ డయి సగౌరవముగా) రాజా! మహేంద్రున కుపకారము చేయఁ జాలినపరాక్రమసమృద్ధిచే వర్థిల్లుచున్నావు. ఆహా! యేమి నీ యదృష్టము!

రాజు—ఓహో! గంధర్వరాజా! (రథము దిగి) మిత్రమా! కుశలమా? (చేయిచేయి పట్టుకొనుచున్నారు.)

చిత్ర—వయస్యా! కేశి యనుపలలాశి యూర్వశి నెత్తుకొని పోయినాఁ డన్న సమాచారమును నారదునివలన నాకర్ణించి, నాకేశుఁడు శీఘ్రముగా నమ్మగువను విడిపించికొని రమ్మని గంధర్వసైన్యమున కానతిచ్చెను. అనంతరము దారిలో నేనుజారణులవలన

క. ఘన మగునీజయకీర్తుల, విని యిక్కడ నున్ననిన్ను వేడుకఁ గంటిఁ
మనుజేశ్వర!నీ వీవని, తను దోడ్కొని యింద్రుకడకు దయ సేయఁదగుఁ.

మిత్రుఁడా! నీవు మహేంద్రునకు మహోపకారము చేసినావుగదా! చూడు.

ఆ. వె. నాఁడు శక్రునకును నారాయణుండు సృ। జించి యిచ్చె నీపసిండిబొమ్మ;
నసురచేతినుండి యవలీల విడిపించి। యిచ్చినావు సఖుఁడ వీవు నేఁడు.

రాజు—మిత్రుఁడా! యట్లు గాదు. [రుల గెలిచె;

తే. గీ. ఇంద్రునిపరాక్రమము సుమ్మి యిదియుఁ జూడ, వఱనిపక్షము వాఁడే గా య
గుబ్బలుల మ్రోఁగుసింగంబుబొబ్బరింత,యేనుఁగులఁ బీనుఁగులను గావించుఁగాదె

చిత్ర—చెలికాఁడా! బాగుబాగు! గర్వరాహిత్యమే పరాక్రమమున కలంకారము.

రాజా—మిత్రుఁడా! మహేంద్రునిసందర్శనమున కిది నా కవసరము కాదు. ఈమెను నీవే ప్రభుసన్నిధానమునకుఁ గొనిపొమ్ము.

చిత్ర—మిత్రుఁడా! నీయిష్టము. అప్సరలారా! రండీ రండీ.

(అప్సరసలు బయలుదేఱుచున్నారు.)

ఊర్వ—(జనాంతికముగ) సఖీ! చిత్రలేఖా! యుపకారి యయినయీరాజర్షిని నే నామంత్రణము చేయఁ జాలను. నీవు సెల వడుగుము.

చిత్ర—(రాజును డాసి) మహారాజా! "దేవర యనుజ్ఞ యిచ్చిన, భర్తృదీయకీర్తిని ప్రియసఖిని బోలె స్వర్గలోకమునకుఁ గొనిపోవ నభిలషించుచున్నా"నని యూర్వశి మనవి సేయుచున్నది.

రాజా—మంచిది. పునర్దర్శనము లభించుఁగాక.

(అందఱు గంధర్వసహిత మాకాశోత్పతన మభినయించుచున్నారు.)

ఊర్వ—(ఉత్పతనభంగ మభినయించి) అయ్యో! తీఁగకొమ్మను నాయేకావళి దగులుకొన్నది. (వెనుకదిరిగి రాజును జూచుచు) సఖీ! చిత్రలేఖా! దీనిని వదలింపుము

చిత్ర—(చిఱునవ్వుతో) సఖీ! గట్టిగా దగులుకొన్నదే. ఇది వదలింపఁ దరము గాదు. అయినను యత్నించెదను.

ఊర్వ—చాలు. నీపరిహాసము. వదలింపవే.

చిత్ర—(వదల్చుచున్నది.)

రాజా—(తనలో)

ఆ. వె. మొగము సగము ద్రిప్పి మగుడ వక్రపు వాలుఁ। జూపుచేత మరలఁ జూచె నన్నుఁ
గాన నీలతాంగిపైన మించుక నిల్పి। నాకు మేలు చేసినావె తీఁగ!

సూతు—దేవా!

క. వెలుచను లవణాంబుధిలో, నలదనుజుల ముంచి యుష్మదనిలాస్త్రం బ
మ్ములపాదిని వచ్చి చొచ్చెను, గలుఁగునఁ జొరఁబాఱు పాముకైవడి దోఁపక్.

రాజా—అటులయిన రథము దగ్గఱఁ జెమ్ము. ఆరోహించెదను.

సూతు—(అట్లు చేయుచున్నాఁడు.)

రాజు—(రథ మెక్కుచున్నాఁడు.)

ఊర్వ—(తనలో) ఉపకారి యయినయీ రాజర్షిని మఱలఁ జూడఁ గలుగునా? (రాజును జూచి నిట్టూర్పులు పుచ్చుచు. గంధర్వులును దోడియప్సరసలును దానును బోవుచున్నది.)

రాజు—(ఊర్వశి పోవుదిక్కున కభిముఖుం డయి) అహహా! మన్మృగుఁ డందని మ్రానిపండుల కఱ్ఱు సాఁచునుగదా!

క. చదలఁ జనుచు నీవేలుపు, మదవతి నాతనువునుండి మది లాఁగుచు ను
న్నది బలిమిని, గలహంసిక, నుద దునిమి బిసంబునుండి సూత్రముఁ బోలెన్.

ఇది శ్రీపరమేశ్వరానుగ్రహప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాదిసాధు
వెంకటేశ్వరవీరాఘవరామానుజాచార్యనామాత్యపౌత్రహరితస
గోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల
సూరపరాజ ప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బ
రాయనామధేయాంధ్రీకృత మగు విక్ర
మోర్వశీయనాటకము ప్రథమాం
కము.



శ్రీరస్తు.

శ్రీపరమాత్మనేనమః.

# విక్రమోర్వశీయము.

---

## ద్వితీయాంకము.

[తరువాత విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—అబ్బబ్బో! శ్రాద్ధభోక్తకు మాటిమాటికిఁ బరమాన్నము తేనుపు వచ్చునట్లు రాజరహస్యము నాకడుపులో నిముడక వెడలి వచ్చుచున్నది. జనులతో నిండియున్న యిచ్చోట నానోరు గాపాడుకోలేను. రాజు ధర్మాసనమున నుండునంతవఱకును జనసమ్మర్దము లేని దేవచ్ఛందప్రాసాదమునఁ గూరుచుండెదను.

(నడచి చేతులతో నోరు మూసికొని కూర్చున్నాఁడు.)

[తరువాతఁ జేటి ప్రవేశించుచున్నది.]

చేటి—దేవి యయినకాశిరాజపుత్రి నాతో "నిపుణికా! మహారాజు సూర్యభగవాను నుపాసించి వచ్చినది మొదలు మతిపోయినవానిలాగునఁ గానఁబడుచున్నాఁడు; కావున నాయనకుఁ బ్రియమిత్రుఁ డగువిదూషకునొద్దకుఁ బోయి రాజుగారి మనస్తాపమునకుఁ గారణము నెఱింగి రావె" యని యిప్పుడు సెల విచ్చెనుగదా! అబ్రహ్మబంధుని నే నేలాగున వంచింతును? అయినను దృణాగ్రమున ముత్తెములాగున నంటుకొనియున్న మంచుబిందువువలె నాబ్రహ్మచారినాలుకకొన నుండురాజరహస్యమును నేను గదలించి వెడలింప లేనా? అతఁ డెక్కడ నున్నాఁడో వెదకెదను. (నడచి చూచి) ఇదిగో! బటమునఁ జిత్రించినకోఁతిలాగున నిక్కడ దాఁగి మాటాడక కూరుచున్నాఁడు. ఈతని సమీపించెదను. (సమీపించి) అయ్యా! దండము.

విదూ—నీకు శుభ మగుఁగాక. (తనలో) ఈచెడుదాసిని జూడఁగనే రాజరహస్యము నాహృదయము భేదించుకొని పయికి వచ్చుచున్నదే. ఏమి చేయుదును? (కొంచెము నోరు దాఁచి పరిహాసముగా)ఓసి బానిసకూఁతురా! సంగీతవ్యాపారమును మాని యెక్కడకే యీలాగున బయలుదేఱినావు?

చేటి—చిత్తము. దేవిగారు మిమ్ము నే చూచి రమ్మని పంపినారు.

విదూ—ఆమె యేమని యాజ్ఞాపించినది?

చేటి—"ఆర్యమాణవకునకు నాయందెంతో పక్షపాతమే. అయినను విరహవేదనాభరమున దుఃఖితాత్మ నగుచున్న నాయోగక్షేమము నొకమాఱును గనుఁగొనుటయే మానినాఁడు." అని మీతోఁ బలుకు మన్నారు.

విదూ—నామిత్రుఁడే యయిన నామెకుఁ బ్రతికూలము జరిగించినాఁడా యేమి?

చేటి—అయ్యా! చిత్తము. రాజుగారేమెనిమిత్తము పరితపించుచున్నారో యామెపేరు పెట్టి దేవిగారిని బిలిచినారు.

విదూ—(తనలో) ఓహో! చెలికాఁడు దాఁచుకొనలేక తానే రహస్యమును వెల్లడించుకొన్నాఁడు. నే నేల నోరు మూసికొని యిట్లు బాధపడవలెను. (ప్రకాశముగా) ఏమి! దేవి నుర్వశి యని పిలిచినాఁడా?

చేటి—చిత్తము.

విదూ—ఆయప్సరసను జూచినది మొదలు పిచ్చియెత్తి దేవినే కాదు, ప్రియమిత్రుఁడ నయిన నన్నుఁగూడఁ దిండిప్రిప్పటులు లేకుండ బాధించుచున్నాఁడు.

చేటి—(తనలో) నే నుపాయముచేతఁ జల్లగా రాజరహస్యగుప్తమును భేదించితిని గదా! (ప్రకాశముగా) అయ్యా! దేవిగారితో నే నేమని మనవి చేయుదును?

విదూ—నిపుణికా! నే నిటుమీఁదట నామృగతృష్ణికనుండి చెలికాని మరలించెదను పిమ్మట నామెదర్శనమునకు వచ్చెదను. ఈసంగతియే దేవికి విన్నవింపుము.

చేటి—చిత్తము. (నిష్క్రమించుచున్నది.) (తెరలో)

వైతాళికుఁడు—దేవా! జయము జయము!

శా. ఆలోకాంతనిరస్తభూజనతమోవ్యాపారముల్ గాన, దే
వా! లోకాప్తుమహాధికారముఁ ద్వదీయంబున్ సమోద్యోగతన్
గ్రాలున్; గాముల కేఁడు నిల్చు క్షణ మాకాశంబుమధ్యంబునన్;
బోలన్ వాసరపష్ఠభాగమున నీవుం గాంతు విశ్రాంతమున్.

విదూ—(చెవియొగ్గి) ఇదిగో! ధర్మాసనమునుండి లేచి ప్రియవయస్యుఁ డీలాగు ననే వచ్చుచున్నాఁడు. పోయి నేను నాతనిపార్శ్వభాగమున నిలిచెదను. (నిష్క్రమించుచున్నాఁడు)—ప్రవేశకము—

(తరువాత విరహవేదన గలరాజా విదూషకునితోఁ బ్రవేశించుచున్నాఁడు.)

రాజు—

క. ననవిలుతునమోఘశరంబునఁ దూఁటగునాదుహృదయమున సులభముగా ననిమిషసుందరి చొరఁబడెఁ, గనులను దర్శక్రమాఱు గనుఁగొనినంతన్.

విదూ—మిత్రుఁడా! పాపము! దేవి మిక్కిలి విచారించుచున్నది సుమీ!

రాజు—ఓయీ! నీవు రహస్యమును జక్కఁగఁ గాపాడుచున్నావు గదా!

విదూ—(తనలో) అయ్యయ్యో! తొత్తుకూఁతురు నిపుణిక నన్ను మోసపుచ్చెను గదా! లేకున్నఁ జెలికాఁడు నన్నిట్లేల యడుగును?

రాజు—(సంశయముతో) ఏ మోయి! యూరకున్నావు?

విదూ—మిత్రుఁడా! యిది యూరకుంట గాదు. ఉత్తర మిచ్చుటయే. అప్పటి నుండియు నానోరిట్లే కట్టిపెట్టి యుంచినాను. చూడుము. నీకయిన, నెంటనే ప్రతివచన మీయకుంటిని గదా!

రాజు—సరిగాని విరహవేదన గలనే నేలాగునఁ బ్రొద్దు పుచ్చుదును?

విదూ—దాని కింత యాలోచన యేల? వంటయింటిలోనికిఁ బోవుదము.

రాజు—అక్కడ నే మున్నది?

విదూ—మిత్రుఁడా! యక్కడ నే మున్నదా? పంచభక్ష్యపరమాన్నములును దగుచితసంభారములతోఁ గూడఁ బళ్ళెరములలో వడ్డించబడి సిద్ధముగా నుండును. అవి చూచుచు నీవేదన నపనయింతము.

రాజు—(చిఱునవ్వుతో) అవి యన్నియు నీ కిష్ట మయినవి గావున, నక్కడ నీ కుబుసుపోవును. దుర్లభప్రార్థనుఁడ నయిననా కచ్చటఁ బ్రొద్దు జరుగుదా?

విదూ—మిత్రుఁడా! యుర్వశి కూడ నిన్నుఁ జూచినది గదా!

రాజు—అయిన నేమి?

విదూ—అట్లయిన నామె నీకు దుర్లభురా లని నేను దలంపను.

రాజు—ఓయుస్సా! పక్షపాతము మాని యామెసౌందర్య మసాధారణ మని తలంచుకొనుము.

విదూ—నీవే యి ట్లనుటవలన నాకును గుతూహలము వర్ధిల్లుచున్నది. కురూపులలో నే నెట్లో, సురూపురాండ్రలో నుర్వశియు నట్లు సాటి లేనిది కాఁబోలును.

రాజు—మిత్రుడా! యామెసౌందర్యము ప్రత్యవయవవర్ణనమున కశక్యము గావున, సంగ్రహముగాఁ జెప్పెద నాకర్ణింపుము.

విదూ—ఇదిగో! సావధానుఁడ నయి యున్నాను.

రాజు—

క. అంగన మెయి నగకు స్రగ, సింగారంబునకు వింతసింగారంబున్
రం గగునుపమానమునకు, నంగగునుపమాన మిది యథార్థము సఖుఁడా!

విదూ—అందుచేతనే నీవు వానకోయిలలాగున దివ్యరసము నభిలషించుచున్నావు. ఇప్పు డెక్కడకుఁ బోయెదవు?

రాజు—వయస్యా! విరహి యగువానికి విజనస్థలముకంటె, వే ఱొకటి శరణము లేదు. నాకుఁ బ్రమదవనమునకు దారిఁ జూపుము.

విదూ—(తనలో) అయ్యో! యేమిగతి? (ప్రకాశముగా) దేవా! యిట్టిటు. (నడచుచున్నారు.)

విదూ—మిత్రుఁడా! ప్రమదవనపోదెత మయినయీదక్షిణమారుతము నీకతిథిసత్కారార్థ మెదురు వచ్చుచున్నది.

రాజు—చెలికాఁడా! యీవాయువునకు దక్షిణవిశేషణము తగియే యున్నది సుమీ.

తే. గీ. స్నేహదాక్షిణ్యములకల్మిచేతఁ దాను। మాధవీలతఁ దడుపుచు మల్లెతీఁగ
నల్లనాడించుచును మలయానిలుండు। కామికై వడిఁ గనుపట్టుఁ గాదె సఖుడ!

విదూ—మిత్రుఁడా! నీయభిలాష మిట్టిదియే కానోపు. (నడచి) ఇదే ప్రమదవనద్వారము. మిత్రుఁడా! యిందుఁ బ్రవేశింపుము.

రాజు—ముందర నీవు పద.

(ఇద్దఱును బ్రవేశించుచున్నారు.)

రాజు—(ముందు చూచి యాయాసపడుచు) ఔరా! యీప్రమదవనము నాకు నాపత్ప్రతీకార మని నిశ్చయించుకొంటిని. తుద కది వేఱువిధ మయినది.

క. గాఁటపుటూరాటము పూఁ, దోఁటను బాయు నని నేను దొరపడి చొర, ని
చ్చోటు ప్రతికూలమగు నా, కేటివడిం బోవువాని కెదురీఁతవలెన్

విదూ—ఎందుచేత?

రాజు—

ఉ. అంపనిమ్రానిపండునకు నబ్బు నిగుడ్చుచుఁ ద్రిప్ప రావినా
డెంపముఁ గొందలంపఱిచెడిన్ మునుపే విషమాస్త్రుఁ డిప్పు డే
మందును మందమందమలయానిలపాతితపాండుపత్రమా
కందము లిందుఁ బ్రోఁదొడిమగంటులఁ జూపెడు నంకురావళుల్.

విదూ—మిత్రుఁడా! దిగులు పడకు. శీఘ్రకాలములోనే యనంగుఁడు నీయభీష్టమును సఫలపఱిచి సౌఖ్య మొసఁగును.

రాజు—బ్రాహ్మణవచనమును బరిగ్రహించితి. (నడుచుచున్నారు)

విదూ—మిత్రుఁడా! వసంతాగమసూచక మగునీప్రమదవనమునభిరామత్వము నవలోకింపుము.

రాజు—చెలికాఁడా! నే నడుగడుగునకుఁ జూచుచునే యున్నాను. చూడు,

ఉ. క్రేవలఁ జామనై నడుమ స్త్రీనఖపాటల మయ్యెఁ గోరఁటల్;
గావి యొలొప్ప నున్ముఖవికాసము లయ్యె నశోకముల్; రజో
ల్పావరణంబునన్ గపిశ మయ్యెను మంజులచూతమంజరుల్;
గావున బాలయుం బడుచు గా కలరున్ మధులక్ష్మి నెచ్చెలీ!

విదూ—మిత్రుఁడా! యింద్రనీలమణిసనాథ మగునీమాధవీలతామంటపము జుమ్మ్రుజు మ్మని మూఁగుతుమ్మెదలసమ్మర్దమువలన రాలినపుష్పములచేతఁ గప్పఁబడి, నీకుఁ గానుకపట్టి ప్రతీక్షించుబాగున నున్నది. నీ విప్పుడు దీని ననుగ్రహింప వలయును.

రాజు—చెలికాఁడా! నీయిష్టము. (అందుఁ గూర్చున్నారు)

విదూ—మిత్రుఁడా! యింక నీ విక్కడ సుఖముగాఁ గూరుచుండి దర్శనీయము లగునీపూవుఁదీఁగలను జూచుచు నుర్వశిగత మగునుత్కంఠ నపనయించుకొనుము.

రాజు—(నిట్టూర్పు పుచ్చి)

ఆ. వె. ఉవిదరూపుఁ జూచి యవినయం బైననా। చూపు కలితబహుకుసుమలు నతవి
టపలు నగుచుఁ దోఁచునుపవనలతలపై। నిలున దేమి బుద్ధికి చెలిమికాఁడ!

—పాఠాంతరము—

ఆ. వె. తరుణిరూపుఁ జూచి తనఁబడునా చూపు। విఱుగఁ బూచినట్టివిటపములను
నొప్పు గులుకు చున్నయుద్యానలతలపై। నిలువ దేమి బుద్ధికి చెలిమికాఁడ!

వాకోరిక కొవసాగుట కుపాయ మే దయిన నాలోచింపుము.

విదూ—(నవ్వి) అహల్యాకాముకుం డయినయింద్రునకు బృహస్పతియు, నూర్వ శీకాముకుం డయిననీకు నేనును, మే మిద్దఱము నీ విషయమున నున్మత్తులమే.

రాజు—మిత్రుఁడా! అ ట్లనకు. స్నేహమే నీ కాలోచన దోఁపించును.

విదూ—అటులయిన సరే. ఇదిగో! నాలోచించుచున్నాను. ఇంక నీవు దుఃఖించుచు నాధ్యానమును జెడఁ గొట్టకు. (అలోచించుచున్నాఁడు.)

రాజు—(నిమిత్తము సూచించుచుఁ దనలో)

ఆ. వె. మాష నిందునదన నులభగాఁ దోఁపదే, యిట్టిమదనవికృతి కేమి కతము?
అభిమతార్థసిద్ధి యభిముఖ మయినట్లు హర్ష మొందుచున్నయది మనంబు.

(ఆసతో నున్నాఁడు.)

[తరువాత నాకాశయానమున నూర్వశియుఁ జిత్రలేఖయుఁ బ్రవేశించుచున్నారు.]

చిత్ర—సఖీ! కారణము చెప్ప కుండ నిప్పు డెక్కడకే యీపోకడ?

ఊర్వ—చెలియా! నాఁ డాహేమకూటశిఖరమునఁ దీఁగకొమ్మకొ నాయేకావళి దగులుకొనఁగా, నది వదలింపుమని నిన్ను బతిమాలుకొంటినిగదా! అప్పుడు నీవు "గట్టిగాఁ దగులు కొన్నదే. ఇది వదలింపఁ దరము గాదు." అని నన్నుఁ బరిహసించి యుండియు, నిప్పుడు "కారణము చెప్పకుండ నెక్కడకే యీపోకడ" యని యడుగుచున్నావు.

చిత్ర—ఓహో! రాజర్షి యయినపురూరవునొద్దకా?

ఊర్వ—సఖీ! యే మందు నిది సిగ్గు విడిచినపని.

చిత్ర—సఖీ! ముందుగా నెవరిని బంపితివే?

ఊర్వ—నాహృదయము నే.

చిత్ర—సరే. నీవే నిశ్చయించుకో. ని న్నెవరు నియమించువారు?

ఊర్వ—సఖీ! మన్మథుఁడే నాకు నియామకుఁడు. ఇట నిశ్చయించుకోవలసినదేమి?

చిత్ర—అయిన నిటుపయిని నేను జెప్ప వలసినది లేదు.

ఊర్వ—అటు లయిన నే నక్కడకుఁ బోవుటకు నిరపాయ మయినమార్గము చూపుము.

చిత్ర—సఖీ! భయపడకు. మహానుభావుఁ డయినదేవగురుఁ డపరాజిత యను శిఖాబంధనవిద్య నుపదేశించి, రక్కసులకు మనల నసాధ్యురాండ్రను జేసినాఁడుగదా!

ఊర్వ—(సిగ్గుతో) సఖీ! దానిప్రయోగము నీకు స్ఫురించుచున్నదా?

చిత్ర—అది యంతయు నీవే యెఱుఁగుదువు.

ఊర్వ—అవును. ఎఱుగుదును గాని, భయోద్రేకమున దానియందు నా కిప్పుడు నమ్మకము కుదుర కున్నది.

(ఇద్దఱు సిద్ధమార్గమును బొందుచున్నారు.)

చిత్ర—సఖీ! చూడు మిదిగోఁ! బ్రతిష్ఠానపురమునకుఁ జూడారత్న మగుపురూరవసునివిన్యభవనము; యమునాసంగమపావనము లయినభాగీరథీజలములయందుఁ దనయందమును జూచుకొనుచున్నట్లు గనుపట్టుచున్నది.

ఊర్వ—(ఆసక్తితో) సఖీ! స్వర్గమే వలస వచ్చిన దనుము. (ఆలోచించి) చెలియా! యాయాపన్నశరణ్యుఁ డెచ్చట నుండునో?

చిత్ర—సఖీ! యిదిగో! రెండవనందనముచందమునఁ జూపట్టుచున్నయీప్రమదావనమున దిగి తెలిసికొందము.

(ఇద్దఱు దిగుచున్నారు.)

చిత్ర—(రాజును జూచి సంతోషముతో) సఖీ! చూడుమూడు. ఈయన వెన్నెలవంటిని న్నెడఁబాసి తొలుపొడుపునెలలాగునఁ గనుపట్టుచున్నాఁడు.

ఊర్వ—(చూచి) సఖీ! మునుపటికంటె నా కిప్పుడే మహారాజు ప్రియదర్శనుఁ డగుచున్నాఁడు.

చిత్ర—అది యుక్తమే. సమీపింతము రమ్ము.

ఊర్వ—సఖీ! నే నిప్పుడు సమీపించుట కాదు. తిరస్కరణీవిద్యచేతఁ గనఁబడకుండ నీయనప్రక్కనుండి చెంత నున్నచెలికానితో రహస్యమున నేమి యాలోచించుచున్నాఁడో వినియెదను.

చిత్ర—సఖీ! నీయిష్టము.

(ఇద్దఱును గూర్చున్నారు.)

విదూ—ఓప్రియమిత్రుఁడా! దుర్లభురా లగునీప్రియురాలిని గలిసికొనునుపాయమాలోచించితిని.

రాజు—(ఊర కున్నాఁడు.)

ఊర్వ—(ఈర్ష్యతో) ఈయన గోరుకొనుటచే సౌందర్యగర్వము నొందుచున్న ధన్యురా లెవతె చెప్పుమా?

చిత్రి—సఖీ! మనుష్యభావమును బొందెద వేల? దివ్యదృష్టిని దెలిసికొనుము.

ఊర్వ—సఖీ! నే నిప్పుడు పరిభావముచేతఁ దెలిసికొనఁగలను కాని, యట్లుచేయుటకు భయపడుచున్నాను.

విదూ—ఓయి మిత్రుఁడా! నీప్రియురాలిని గలసికొనునుపాయము నాలోచించితి నని చెప్పుచున్నాను.

రాజు—చెలికాఁడా! యయిన నది యెట్లో చెప్పుము.

విదూ—మిత్రుఁడా! నీవు నిద్ర పొమ్ము; కలలో నామెను గలసికొందువు. లేదా యాయూర్వశిరూపమును జిత్తరువున వ్రాసి చూచుకొనుము.

ఊర్వ—(సంతోషముతో) ఓసిటికిహృదయమా! యూఱడిల్లు మూఱడిల్లుము.

రాజు—మిత్రుఁడా! నీవు చెప్పినయీ రెండును నాకు వలనుపడనివే.

మ. కల నాప్రేయసిఁ దెచ్చి కూర్చునిదురన్ గన్మోడ్చి నేఁ బొందఁగాఁ
గలనా? నాయెదఁ గామువాఁడిములుకుల్ గాఁడుం గదా సర్వదా!
కలికిం జిత్తరువందుఁ జూడఁ గలనా? కందోయిబాష్పాంబువుల్
వెలికిం గ్రిమ్మెడు, నాప్రియఁ బూనఁగనె యాలేఖ్యం బయోమిత్రమా!

చిత్రి—సఖీ! విన్నావమ్మా?

ఊర్వ—విన్నానుగాని నాహృదయమున కింకను దనివి దీఱకున్నది.

విదూ—వయస్యా! యీవిషయమున నింతే నాబుద్ధివిభవము.

రాజు—(నిట్టూర్పువుచ్చి)

చ. మఱిఁగెడు నామనంబునతిమాత్రపువేదన యే యెఱుంగదో,
యెఱిఁగియు స్వపరిభావమున, నేలదొ తా నను, నట్టివేలుపుం
దెఱవకునై, యల్పఫలనీరసనంగమవాంఛ నామదిన్
మఱిమఱి వెంచు మన్మథుఁడు, మంచిది, తా నె సుఖించుఁగావుతన్.

చిత్రి—సఖీ! విన్నావుగదా!

ఊర్వ—అయ్యయ్యో!మహారాజు న న్నీలాగునఁ దలంచుచున్నాఁడు. నే నెదుటఁ

బడి యాయనకుఁ బ్రతివచనము నీయఁజాలను. కావున నా దివ్యమహిమచేతను నిర్మిత మయినభూర్జపత్రమున నుత్తరము వ్రాసి యీయనయెదుటఁ బడవేసెదను.

చిత్ర—నాకు నిది యనుమతమే.

ఊర్వ—(విలాసముతో భూర్జపత్రముఁ బుచ్చుకొని వ్రాసి యట్లు చేయు చున్నది.)

విదూ—(చూచి దద్దఱిల్లి) అబ్బో! యేమోయి యిది? పాముకూసము కాఁబోలు, మనముందఱఁ బడినది. నన్నుఁ గఱచునేమో!

రాజు—(తెలిసికొని నవ్వి) చెలికాఁడా! యిది జిలుఁగుటక్షరములు వ్రాసిన భూర్జపత్రము గాని, పాముకూసము గాదు.

విదూ—అట్లయిన నోమిత్రుఁడా! యొకవేళఁ బూజ్యురాలు ఊర్వశి తా నగపడ కుండ, నీపరిదేవనము విని, తుల్యానురాగసూచకముగా నీపత్రిక వ్రాసి పడవేసినది కాదుగదా!

రాజు—కోరికల కేమికొదువ? (పుచ్చుకొని చదివి సంతోషముతో) చెలికాఁడ! నీయూహము సరిగ నున్నది.

విదూ—హి. హి. హీ. మిత్రుఁడా! బ్రాహ్మణవచన మేల మఱియొకలాగగును? నీవిఁక నిమ్మళింపవచ్చును. మఱి యం దేమి వ్రాసినదో నాకుఁ జెప్పవా?

ఊర్వ—బ్రాహ్మణా! మేలుమేలు! నీవు నాగరికుఁడవు.

రాజు—చెలికాఁడా! యాలకింపుము. (చదువుచున్నాఁడు.)

ఉ. “సామి! యెఱుంగ కీవు నను స్వాంతమునం దనుకొన్నలాగునన్
బ్రేమము గల్గునీయెడల నే ననురక్తను గాకపోయినన్,
గోమలపారిజాతసుమగుంఫితశయ్యను బవ్వళించినన్
నా మెయి నిర్దహించెడునె నందనమందసుగంధవాయువుల్.”

ఊర్వ—ఇప్పు డేమనునో?

చిత్ర—సఖీ! వేఱుగ ననవలసిన దేమి? వాఁడిపోయినతామరతూఁడులవంటి యీయనయవయవములు తెలుపుచునే యున్నవి.

విదూ—మిత్రుఁడా! నాఁకలిగొన్నప్పుడు నాకు స్వస్తివాచనకము దొరకునట్లు నీ కష్టదశమున నీ సమాశ్వాసకారణము దొరకినది.

రాజు—మిత్త్రమా! సమాశ్వాసకారణ మనినయది యేమి? చూడుము,

ఉ. నన్నును సమానురాగ పిశునమ్మును, సల్లలితార్థబంధమై
కమ్మను వ్రాసియున్న ప్రియకాంతయుదంతము, నిశ్చయమ్ముగా
నిమ్మెయి నెంతు, నాదుమది రేకుణ మాడనమ్మతో, సఖా!
యిమ్ముగ నొప్పెత్తి, కవియించినయా చెలిమోముఁజిమ్మగన్.

ఊర్వ—ఇయ్యెడ మాయిరువురకును నెయ్యము సమవిభాగమే.

రాజు—చెలికాఁడా! నాప్రియురాలు ప్రేమచేత స్వహస్తముతో లిఖియించిన యీపత్త్రిక నీచేతితోఁ బట్టుకొనుము. నా వేళ్ళ చెమటచే నీయక్షరములు చెడి పోఁగలవు.

విదూ—(పుచ్చుకొని) ఏమిది? మిత్త్రుఁడా! పూజ్యురా లుర్వశి నీకోరికలఁ బుష్పింపఁ జేసి, ఫలింపఁజేయుటకుఁ బాలుమాలుచున్నది.

ఊర్వ—సఖీ! రాజసన్నిధానమునకుఁ బోవ జంకుచున్న నాహృదయమును నేను కుదుటపఱచుకొనునంతలోఁ, నీవు ముందుగా నీయునికి గానిపించుకొని నాకుఁ దగిన మాట లాడుచుండుము.

చిత్ర—అలాగే. (తిరస్కరణిని బాసి రాజుం జేరి) జయము జయము మహారాజ!

రాజు—(తొందరతోడ సాదరముతోడను) కల్యాణీ! కుశలమా? (పార్శ్వమున కొఁజూచి)

గీ. అట్టు లలరింప లేదైతి వల్లసఖిని, బాసి వచ్చుటఁ జేసి నన్ భామ! నీవు
మున్ను సంగమపదమునఁ గన్నయమున, గంగ నొనయక కనఁబడ్డకరణి, నిపుడు.

చిత్ర—దేవా! ముందుగా మేఘమాలయుఁ, బిదప మెఱుపుఁదీఁగయు గనఁబడుచుండును గదా!

విదూ—(వెనుకదిరిగి) ఈమె యూర్వశి కాదా? ఆపూజ్యురాలి యనుఁగుఁ జెలియా?

రాజు—ఇదిగో! పీఠము. కూరుచుండుము.

చిత్ర—దేవా! యూర్వశి తలతోడను నమస్కరించి మహారాజుగారితో మనవి సేయుచున్నది.

రాజు—ఏమని యాజ్ఞాపించుచున్నది?

చిత్ర—"నన్ను రాక్షసబాధవలన రక్షించుటకు దేవరవారే శరణ మయినారు.

ఇప్పుడు నేను మరల దేవరదర్శనమున మారుబారికి లో నయి వెండియు దేవరనే శరణు చొచ్చితిని; కాఁబట్టి కరుణింప వలయు''నని.

రాజు—ఓశుభాననా!

ఆ. వె. మారుబారిఁ బడియె మగువ యందువు గాని, సుదతి! నాయవస్థఁ జూడవయితి;
మాకు నిర్వురకు సమానమె వలవంత, తప్తలోహమునకు దప్త మదుకు.

—పూర్వపాఠమున నుత్తరార్ధము—

మదనుఁ డదుకఁ దగును మము సమప్రణయులఁ
దప్తలోహమునను దప్త మట్లు.

చిత్ర—(ఊర్వశిని జేరి) సఖీ! యిటు రమ్ము. నీకంటెను గటికితనము వహించిన మన్మథునిఁ జూచి నీప్రియునకు నేను దూతిక నయితిని.

ఊర్వ—(తిరస్కరిణిని బాసి దుఃఖముచేత వణఁకును భయమును గలది /నే. యయి) ఓసి చలచిత్తురాలా! న న్నింతటిలో వదలిపెట్టితివే?

చిత్ర—(చిఱునవ్వుతో) సఖీ! యెవరి నెవరు వదలిపెట్టునదియు నిప్పుడే తెలియ వచ్చును. ఆచారము నడుపుము.

ఊర్వ—(భయముతో రాజును సమీపించి) జయము జయము మహారాజ!

రాజు—(సంతోషముతో) సుందరీ!

ఆ. వె. వేయిగనులవాని విడిచి వేఱొక్కని, చాయఁ బోనినీదుజయపదంబు
నన్నుఁ బొందెఁ గాన సన్నుతాంగిరో! నాకు,జయము గలుగుటకును సందియంబె?

(చేయి పట్టుకొని చెంగటఁ గూర్చుండఁ బెట్టుకొనుచున్నాఁడు.)

విదూ—ఏ మిది నీకు మర్యాదయే గా! రాజునకుఁ బ్రియమిత్రుఁడను, బ్రాహ్మణుఁడను, నాకు నమస్కారము చేయ వయితివి.

ఊర్వ—(చిఱునవ్వుతో నమస్కరించుచున్నది.)

విదూ—స్వస్తి భవత్యై. (తెరలో)

దేవదూత—చిత్రలేఖా! యూర్వశిని త్వరపెట్టు. త్వరపెట్టు.

ఆ. వె. అప్సరసములకును నాశ్రియ మైనయే, భవ్యనాటకమున భరతమౌని
యేర్పఱించె మిమ్ము, నెలమి దానిఁ గనంగ, దివిజభర్త కొలువు దీర్చి యుండె.

(అందఱు వినుచున్నారు.)

ఊర్వశి—(విషాదముఁ బొందుచున్నది.)

చిత్ర—ప్రియసఖీ! దేవదూతవాక్యము విన్నావా? ఇంక మహారాజునొద్ద నీవు సెలవుఁ బుచ్చుకొనుము.

ఊర్వ—(నిట్టూర్పు విడిచి) సఖీ! నాకు నోరు రాకున్నది.

చిత్ర—"మహారాజా! యీజనము పరాధీనము; కాఁబట్టి యిందాజ్ఞ నతిక్రమింప కుండుటకయి దేవరవారి సభ్యనుజ్ఞ వేఁడుకొనుచున్నా"నని యూర్వశి మనవి సేయుచున్నది.

రాజు—(కష్టముతో మాట దెచ్చుకొని) నే నీమె స్వామియాజ్ఞను గాదనఁ జాలను గాని, యీజనునిమాత్రము మఱవవల దనుచున్నాను.

ఊర్వ—(వియోగదుఃఖము నిరూపించి రాజును జూచుచుఁ జెలికత్తెతో నిష్క్రమించుచున్నది.)

రాజు—(నిట్టూర్పు విడిచి) హా! యిప్పుడు నాకన్నులకు గ్రుడ్డితనము వచ్చినట్లే యున్నది.

విదూ—(పత్రికను జూపఁ దలఁచి) మిత్రుఁడా! (అర్ధోక్తిని దనలో) అయ్యయ్యో! యింకే నేమున్నది? ఊర్వశిని జూచి విస్మయపడి, చేతనుండి జాఱిపోయిన భూర్జపత్రము నెఱుఁగలేకపోయితిని

రాజు—ఓయీ! నీ వేమో చెప్పఁ బోయినావు?

విదూ—మ ఱేమియు లేదు. నేను జెప్పఁ దలఁచినది యిది. నీ వూరక దుఃఖింప వలదు. నీయం దూర్వశికి గాఢానురాగ మున్నదిగదా! ఆమె యిఁక ముందును నాయను బంధముఁ ద్రెంచివేయదు.

రాజు—నాకును మనసులో నిట్లే తోఁచుచున్నది. చూడు. ఇచ్చటనుండి బయలు దేఱి వెళ్ళునప్పుడు—

ఆ. వె. దేహమునకుఁ దా నధీశ్వరి గామి స్వా, ధీన మయినహృదిని దెలవ నాకు
నప్పగించి చనినయట్టు లే కనుపట్టెఁ, జన్నుమిట్ట లదరుశ్వాసములను.

విదూ—(తనలో) అయ్యయ్యో! మిత్రుఁడు భూర్జపత్రముమాట యెప్పుడు దలపెట్టునో యని నాగుండెలు పీచుపీచుమనుచున్నవి.

రాజు—చెలికాఁడా! మిక్కిలి విచారముగా నున్నది. నే నిప్పు డేలాగునఁ బ్రొద్దుపుత్తును? (తలఁచుకొని) ఆఁ! యేదీ మిత్రుఁడా! భూర్జపత్రము?

విదూ—(అంతటఁ జూచి విషాదముతో) అయ్యో! కనఁబడదాయెను. మిత్రుఁడా! యాభూర్జపత్రము దేవతాసంబంధముగలది గదా! కావున నదియు నూర్వశితోనే పోయి యుండును.

రాజు—(అసూయతో) ఛీ! మూఢున కన్నిటను బరాకే. మఱి వెదకు.

విదూ—ఓయీ! వెదకెదను. (లేచి) ఇదిగో! నిక్కడ నున్నది. అదిగో! నక్కడ నున్నది. (బహువిధముల గంతులు వేయుచున్నాఁడు.)

(తరువాత నౌశీనరియుఁ జేటియుఁ బరివారమును బ్రవేశించుచున్నారు.)

దేవి—ఓసీ! నిపుణికా! విదూషకునితోఁ గూడ మహారాజు లతాగృహమునఁ జొచ్చి యుండఁగా నిజముగా నీవు చూచినావా?

చేటి—అమ్మా! తమతో నే నెప్పుడయిన నసత్యము మనవిచేసినానా?

దేవి—అట్లయిన నీ విప్పుడు చెప్పినమాట నిజమో కాదో నే నీతీఁగెలగుంపు మాటునఁ బొంచియుండి వీరియేకాంతములను వినియెదను.

చేటి—దేవీ! చిత్తము.

దేవి—(నడచి ముందుచూచి) నిపుణికా! యిది యేమిపత్రము? పాఁతపేలిక లాగున దక్షిణమారుతముచేత నిటు ఎగిరి వచ్చుచున్నది.

చేటి—(పరిశీలించి) దేవీ! దొరలుటను బట్టి బాగుగఁ దెలియ వచ్చుచున్నది. ఇది యక్షరములు వ్రాసినభూర్జపత్రము. ఓహో! మాయందనే దగులుకొన్నది. (పుచ్చుకొని) అమ్మా! చదువుండి.

దేవి—నీవే చదివి చూడుము. అనుకూలముగా నున్న వినియెదను.

చేటి—(అట్లు చేసి) దేవీ! యిది యాపవాదములాగుననే కనఁబడు చున్నది. ఊర్వశి మహారాజునకు వ్రాసినయుత్తరమని భావించెదను. ఆర్యమాణవకుని ప్రమాదము వలన మనచేతిలోఁ బడినది.

దేవి—అయినచో నది వినియెదను జదువు.

చేటి—(చదువుచున్నది.)

ఉ. "స్వామి! యెఱుంగ కీవు నను స్వాంతమునం దనుకొన్న లాగునన్
ప్రేమము గల్గునీయెడల నే ననురక్తనె కాకపోయినన్,
గోమలపారిజాతకుసుమగుంఫితశయ్యను బన్వళించినన్
నా మెయి నిర్దహించెడునె నందనమందసుగంధవాయువుల్."

దేవి—ఓసీ! రా! రా! అప్సరఃకాముకుం డయినయాయన కిది కానుకగా నిచ్చి సందర్శింతము.

చేటి—దేవీ! చిత్తము. (ఇద్దఱును లతాగృహమున కరుగుచున్నారు)

విదూ—మిత్త్రుఁడా! యది యేమి? గాలిచేత నెగిరిపోయి ప్రమదవనసమీపమునఁ గ్రీడాపర్వతశిఖరమునఁ గనఁబడుచున్నది

రాజు—(లేచి యంజలిపట్టి) భగవానుఁడా! వసంతప్రియ! మన్మథబంధూ! మలయమారుత!

ఉ. భూరిసువాసనల్ గలుగు; మ్రిచ్చిలు తీవలపూదుమార మ
య్యో! రమణీస్వహస్త మది యారక యేల హరించితయ్యొ? పె
ల్లారట మొందినావు మును పంజనఁ గోరుచు; నీ నెఱుంగవే?
మారునిబారినొట్టె యగుమానిసి కిట్టిద కావె యారటల్?

చేటి—దేవీ! చూడు. చూడు. ఈభూర్జపత్త్రము నే వెదకికొనుచున్నారు.

దేవి—అట్లయినఁ జూచెద నూరకుండుము.

విదూ—(విషాదముతో) అయ్యయ్యో! వికసించినసల్లగలువపూవువన్నె గలిగిన యీనెమిలికన్ను చూచి మోసపోయితిని.

రాజు—అయ్యో! నేను మందభాగ్యుఁడను. సర్వథా మోసపోవుచున్నాను.

దేవి—(తటాలున సమీపించి)ఆర్యపుత్త్ర! తొట్రుపడకుఁడు. ఇదిగో! మీ భూర్జపత్త్రము.

రాజు—(తత్తఱపడి తనలో) అయ్యో! యిదిగో! దేవి. (తెలతెలపోవుచుఁ బ్రకాశముగా) దేవీ! కుశలమా?

దేవి—నాథా! నా కిప్పుడు దురాగతము వచ్చినది.

రాజు—(జనాంతికముగా) చెలికాఁడా! దీని కిప్పుడు ప్రతికార మేమి?

విదూ—(జనాంతికముగా) సొత్తుతోఁ బట్టువడినదొంగ, మాటలతోఁ దప్పుకొన లేఁడు.

రాజు—(వెనుక దిరిగి) మూర్ఖుఁడ! యిది పరిహాసమునకు వేళ గాదు. (ప్రకాశముగా) దేవీ! మేము వెదకుకొనునదియీపత్రముగాదు. అదివ్యావహారికపత్రము

దేవి—నాథా! మీగుట్టును మీరు గాపాడుకొనవలసినదే.

విదూ—అమ్మా! యీయనకుఁ ద్వరగా భోజనము పెట్టింపుము. దానిచేతనుగాని యీపైత్యము తగ్గి స్వస్థతఁ బొందఁడు.

దేవి—నిపుణికా! యీబ్రాహ్మణుఁడు మిత్రునికయి యెంతో చక్కగాఁ జెప్పుచున్నాఁడు. ఆఁకటిచేతఁ జెలికాఁడు బాధపడుచున్నాఁడఁట!

విదూ—చూడు. దేవీ! యావహించినపిశాచము గూడ నన్నముచేత వదలిపోవుచున్నది. ఇఁక నిది యెంత?

రాజు—మూర్ఖ! నీవు బలవంతముగా నన్నపరాధిని జేయుచున్నావు.

దేవి—నాథా! మీ కిష్టము కాకపోయినను మీయెదుట నున్నందున నాదే యీ యపరాధము. మీ దేమియపరాధము? ఇదిగోఁ! బోయెదను. నిపుణికా! యిటురా (కోపముతో బయలుదేఱుచున్నది.)

రాజు—

క. తాళుము నే నపరాధిని, జాలింపుము కోప మిఁకఁ బ్రసన్నవు గమ్మా;
యేలిక కోపించిన జవ, రాలా! దాసుండు నిరపరాధుం డగునే?

(పాదములమీఁదఁ బడుచున్నాఁడు.)

దేవి—ధూర్తుఁడా! నేను లఘుహృదయురాలను. నీబతిమాలుటలకు సంతసింపను కాని యీరహస్యము దెలిసె నేని దక్షిణనాయకుఁడవగునీకేమి సంభవించునో యని వెఱచుచున్నాను.

చేటి—దేవీ! యిట్టిటు.

దేవి—(రాజును విడిచి పరిజనముతో నిష్క్రమించుచున్నది.)

విదూ—మిత్రుఁడా! దేవి వానకాలపునదిలాగునఁ గలఁకదేఱకయే పోవుచున్నది. లెమ్ము లెమ్ము.

రాజు—(లేచి) చెలికాఁడా! యిది యిప్పుడు తగినపని కాదు.

ఆ. వె. ప్రేమ లేనిప్రియులప్రియవాక్యములతోడి, యనునయములు సతులమనసులకును
నెక్క విది నిజంబు కృతిప్రమరత్నములఁ, దద్విదులకు మనను దనువఁ గలవె?

విదూ—నీ కీమాట యనుకూలము గానే యున్నది. కన్నులు కలఁగినవానికి దీపశిఖ యెదుట నుంచఁ గిట్టదు గదా!

రాజు—అట్లు గాదు. ఊర్వశియందు మనసుపడి యున్నను, దేవియందు నాకు మునుపటిగౌరవమే యున్నది. అయినను నాప్రార్థన నుల్లంఘించినది కావున, నేనును ధైర్య మవలంబించెదను.

విదూ—మిత్రుఁడా! నీమాట దేవిమాట, యటుండ నిమ్ము. ఇప్పుడు నే నాఁకటి కోర్వఁ జాల కున్నాను. నాజీవము నిలుపఁ జెట్టుము. ఇది స్నానభోజనములకు సమయముగదా!

రాజు—(పైకిఁ జూచి) ఓహో! మధ్యాహ్న మయినది. చూడు.

చ. చలువకుఁ జేరెడుఙ్ నెమిలి చల్లనిచెట్టుమొదంటిపాదునం
దళి యదె కర్ణికారముకుళాగ్రము విచ్చుక లోనఁ దూరెడుఙ్,
నిలుపక కన్నెలే డుడుకునీటఁ, దటాకిని కల్లఁ దారెడున్:
జిలుకయుఁ బంజరాన దగ చేఁ బడకింట జలంబు గోరెడుఙ్.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర పద్దాదిసాధు
వంశక్షీరనీరాకరరాకాసుధాకర రాచ్చనామాత్య పౌత్రహరితస
గోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల
సూరపరాజ ప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బ
రాయనామధేయాంధ్రీకృత మగుపిక్ర
మోర్వశీయనాటకము ద్వితీయాం
కము.

---

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

# విక్రమోర్వశీయము.

## తృతీయాంకము.

(తరువాత భరతశిష్యులు ప్రవేశించుచున్నారు)

ప్రథముఁడు—మిత్రుఁడా! పైలవ! మహేంద్రసభకుఁ బోయెడుమనయుపాధ్యాయులతో నీవు దర్భాసనము పట్టుకొని కూడఁ బోయితివి. నే నగ్నిహోత్రగృహమును గాపాడుటకు నింటియొద్ద నుంటిని. అందుచేత నిన్నడుగుచున్నాను. గురువుగారినాటకప్రయోగమునకు దేవసభ యానందించినదా?

ద్వితీయుఁడు—మిత్రుఁడా! గాలవ! యెట్టు లానందించినదో నాకుఁ దెలియదు. సరస్వతీకృత మయినయాలక్ష్మీస్వయంవరనాటకప్రబంధమున నూర్వశి యాయారసాంతరస్థానములయందు బొత్తిగ నున్మత్తురాలయి ప్రవర్తించినది.

ప్రథ—మిత్రుఁడా! నీ విటుఁ జెప్పఁ బోవుదానియందు దోషమున కవకాశ మున్నట్టు పొడకట్టుచున్నది.

ద్వితీ—అవును. అప్పుడు ప్రమాదమున నూర్వశిమాట తప్పఁబడినది.

ప్రథ—ఎట్లు?

ద్వితీ—మిత్రుఁడా! యానాటకములో లక్ష్మీవేషమును ధరించినయూర్వశిని జూచి వారుణీవేషమును ధరించినమేనక "సఖీ! ముల్లోకముల నున్నలోకపాలురు విష్ణువుతోఁ గూడ నీస్వయంవరమునకు వచ్చి యున్నారు. ఇందఱిలో నీ కెవరిమీఁద మన సున్నదో చెప్పు మన్నది.

ప్రథ—తరువాతఁ దరువాత?

ద్వితీ—అప్పు డూర్వశి పురుషోత్తమునిమీఁద ననఁ బోయి పురూరవసునిమీఁద నని పలికినది.

ప్రథ—ఆహా! బుద్ధీంద్రియములు కాఁబోవుదాని ననుసరించి యుండును గదా! దానికి మనగురువుగారు కోపపడలేదా?

ద్వితీ—కోపపడ కుందురా? గట్టిగ శపించినారు. పిమ్మట దేవేంద్రుఁడు దానిని గనికరించినాఁడు.

ప్రథ—మిత్రుఁడా! యది యెట్లు?

ద్వితీ—"ఓసీ! నాయుపదేశము దప్పితివి; కావున నీకు దివ్యస్థానము లేక పోవుఁగాక" యని యొజ్జలు శపించినారు. అప్పుడు సిగ్గునఁ దలవంచుకొని యున్న యుర్వశిని జూచి మహేంద్రుం డుర్వశీ! నీవు మోహించినవిధమున నాకు రణసహాయుఁ డయిన రాజర్షికిఁ బ్రియము సలుపవలసినదే. సంతానప్రాప్తియగునంతవఱకు నప్పురూరవుని యథేచ్ఛముగాఁ బొందియుండుమని సెల విచ్చినాఁడు.

ప్రథ—మిత్రుఁడా! యితరులను గూడఁ దనవంటివారినిగానే తలఁచుకొనియెడు మహేంద్రుని కట్లు పలుకుట యుచితమే గదా!

ద్వితీ—(సూర్యునిఁ జూచి) మాటలపరాకున స్నానవేళ మించఁ బెట్టి తప్పు చేసితిమి. ఇంక మనము గురువుగారియొద్దకుఁ బోవుదము. పద.

(నిష్క్రమించుచున్నారు)

(విష్కంభము.)

[తరువాతఁ గంచుకి ప్రవేశించుచున్నాఁడు.]

కంచు—

ఉ. కడఁగుదు రర్థముల్ పడయఁ గల్యవయస్సున గేస్తు లందఱున్;
గొడుకు లనంతరంబు గయికో గృహభారము, విశ్రమింతు; రా
కడిగడి దేమి? మే నహరహంబు హరించెడి సేవరూపునన్
తెవుచెఱ మూఁడెఁ; గష్ట మిది స్త్రీజనమం దధికార మక్కటా.

—పూర్వపాఠము—

ఉ. ఎల్లరుఁ బ్రాయమం దనుభవించి సుఖంబులు, మీఁదఁ బుత్రులం
దిల్లిడి విశ్రమింతు రిఁక నేమొ శరీరము పర్యగ్రహంబు శో
షిల్లఁగఁ జేయుసేవ యనుజీర్ణత నెప్పుడు నిట్లయుంటి మో
చెల్ల! మహాభరంబు గద స్త్రీజనమం దధికార మేరికిన్.

(నడచి) వ్రతస్థురాలగు దేవి నాతో:- “కంచుకీ! నేను గోపము మాని నాథా! నావ్రతము గొనసాగింప వలసిన దని నిపుణికాముఖమున మహారాజును బ్రార్థించి యుంటిని. నీవు కూడ నిప్పుడు నామనవిగా మహారాజున కట్లు విన్నవింపు మని సెల విచ్చినది. కావున నిప్పటికి సంధ్యాజపమును నిర్వర్తించి యుండుమహారాజును నేను సంధర్శించెదను. (నడచి చూచి) ఆహా! రాజగృహమునందలిసాయంకాలప్రాంత మెంత రమణీయముగా నున్నది!

చ. మలఁచినమాటికిన్ నిదురమంపునఁ బోల్చు నెమిళ్ల యష్టులన్;
వలభులయందుఁ బావురపుభ్రాంతి నొనర్చెడు జాలధూపముల్;
వెలుఁగు లెసంగ నంతిపురివృద్ధజనుల్ సనుమోపహార పూ
స్థలముల సాంధ్యమంగళవిధానముగా విభజింతురు దీపముల్.

(చూచి) ఓహో! మహారాజీలాగుననే వచ్చుచున్నాఁడు.

ఆ. గీ. బలసి యూడిగంపునెలఁదుకల్ దివిటీలు, కేలఁబూని రాఁగఁ గాంతె నిరఁడు,
చటులకర్ణికారశాఖలపూలతో, నడచుపక్షసహితనగము వోలె.

కావునకు నేను గనఁబడులాగున నిలిచి వేచియుండెద. (నిలుచున్నాఁడు)

(తరువాతముందు చెప్పినట్లుపరివారముతో రాజును విదూషకుఁడును బ్రవేశించుచున్నారు)

తే. గీ. పగలు కార్యాంతరంబులఁ దగిలి యుండి, యెట్లెటో పోద్దుపుచ్చితి నింక నిపుడ
నిర్వినోదత జాములు నిడుపు లగును; గటకటా! యెట్టు లీ రేయి గడపువాఁడ?

కంచు—(సమీపించి) జయము జయము మహారాజ! “నాథా! మనమణిహర్మ్యవ మీఁదికిఁ జంద్రుఁడు చక్కఁగాఁ గనఁబడఁ గలఁడుకావున, నాథవశీకరణుఁడు రోహిణీ సమీపమునకు వచ్చునంతదనుక దేవరవారు నాకొఱకు మేడమీఁద దయచేసి యుండవలయు” నని దేవి మనవి సేయుచున్నది.

రాజు—అయ్యా! సత్కీర్తీ! నీయిష్ట మంటి నని దేవితో మనవిచేయుము.

కంచు—దేవా! చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

రాజు—(విదూషకునితో) చెలికాఁడా! దేవి యీవ్రతము కేవలము పరమార్థముగానే యారంభించి యుండునా?

విదూ—మిత్రుఁడా! యామె కిప్పుడు పశ్చాత్తాపము గలిగినది. అందుచే

మును పోమేను నీవు కాళ్ళు పట్టుకొని బతిమాలుకొనినను నిరాకరించి కోపముతో లేచి పోయినతప్పు నీనోము నెపమునఁ బాపుకొనఁ దలఁచిన దని నే నూహించెదను.

రాజు—నీవు బాగుగా నాలోచించి చెప్పితివి. అట్లేసుమీ.

క. పొలుపుఁ బ్రియాపరాధము మీఱటిమునఁ, బిదప శీ మానినులు మిగులఁ బశ్చాత్తాపం
బొంది దయితానునయముల, నెపలను గడు సిగ్గుపడును రెండును సఖుఁడా.

ఏదీ? మణిహర్మ్యమునకు నాకు మార్గము చూపుము.

విదూ—మిత్రుఁడా! యిదిగో! మణిహర్మ్యము. రాత్రియగుటచేత దీపములు వెలుఁగునఁ గడు రమణీయముగాఁ గానఁబడుచున్నది. దీనిని గంగాతరంగములవలె నున్న యాస్ఫటికమణిసోపానములమీఁదుగా నారోహింపుము.

రాజు—ముందు నీ వెక్కుము.

అందఱు—(మేడ యెక్కుచున్నారు.)

విదూ—మిత్రుఁడా! చంద్రోదయమునకు వేళ యయినట్టున్నది. చీఁకటి క్రమక్రమముగాఁ బలుచనయి తూర్పుదిక్కు కొంచె మెఱుపెక్కి నేత్రోత్సవము సేయుచున్నది.

రాజు—నీవు చక్కగాఁ బలికితివి.

ఆ. వె. పొడుపుఁగొండ వెనుకఁ బొంచి యుండెడి చందురు, కిరణములను నిరులు విరిసి పోవ
ముంగురులను నూర్ధ్వమునకుఁ ద్రోచికొన్నట్లు, ప్రాచ్యముఖంబు కనులపండు వయ్యె.

విదూ—ఇహిహీ! మిత్రుఁడా! యుండ్రముక్కలాగున భగవానుఁడు మృగలాంఛనుఁడు పయికి వచ్చుచున్నాఁడు.

రాజు—(చిఱునవ్వుతో) అన్నిటఁ దిండిపోతున కాహారమే విషయము. (లేచి యంజలి పట్టి) భగవానుఁడా! నిశానాథా!

ఆ. వె. సూర్యుఁ జేరు దీవ సుజనులక్రియలకై; సుధను దనుపు దీవ సురలఁ బితల;
నిసిని గ్రమ్ము నిరులు పస యడంతువు నీవ; హరునిశిరముమీఁది యతఁడ వీవ?
దేవా! నీకు నమస్కారము.

విదూ—మిత్రుఁడా! బ్రాహ్మణుఁడ నయిన నా మోమునుండి వచ్చు నక్షరముల చేత మీతాత గారు నీ కనుజ్ఞ నిచ్చుచున్నారు. నీ వాసన మలంకరింపుము. నేనును సుఖముగాఁ గూరుచుండెదను.

రాజు—(సూచుచుండి పరిజనమును జూచి) ఈవెన్నెలలో నీదివిటీలు వెలవెల పోవుచున్నవి. వ్యర్థముగా నివి యేలకి మీరు సెలవు పుచ్చుకొని విశ్రమింపుఁడు.

పరి—దేవా! చిత్తము. (నిష్క్రమించుచున్నారు)

రాజు—(చంద్రునిఁ జూచి విదూషకునితో) చెలికాఁడా! ఇంక నొకముహూర్తమునకు దేవి వచ్చును. కనుక నీరహస్యస్థలమున నాయవస్థను నీకుఁ జెప్పెదను.

విదూ—మిత్రుఁడా! యుర్వశి కనఁబడకపోయిన నేమికి ఆమె పోవునపుడు నీయెడల గాఢానురాగము కనఁబఱిచినదిగదా! కాఁబట్టి యాశాబంధమున జీవమును గాపాడుకొనవచ్చును.

రాజు—మిత్రమా! నీవు చెప్పినది సత్యమే. అయినను నావలవంత యంతకంతకు నధిక మగుచున్నది.

ఆ. వె. ఎగుడుదిగుడుతాలయిఱుకున నడి తోట్రు, వడినయేటినీటివఱదపోలెఁ
గలయికలకు విఘ్నములు ఘటిల్లుటఁజేసి, మారుఁడిపుడు నూఱుమడుఁగు లయ్యె.

విదూ—చెలికాఁడా! యవయవము లధికముగాఁ జిక్కిపోయి నీవు శోభిల్లుచున్నావు. కావున నీకుఁ బ్రియాసమాగమము చేరువయయినట్లు నేనూహించుచున్నాను.

రాజు—(నిమిత్తమును సూచించుచు) వయస్యా!

ఆ. వె. ఆసపుట్టుమాట లాడుదు నామనో, వ్యథను నీవు పాపునట్టె, చూడు
మదరుటలను దక్షిణాంసంబు గూడను, నన్ను నూఱడించుచున్న దిపుడు.

విదూ—చెలికాఁడా! బ్రాహ్మణవచనముగదా! మఱియొకలాగున నేలజరుగును!

రాజు—(ఆసతోనున్నాఁడు)

(తరువాత నభిసారికావేషము ధరించి యాకాశయానమున నుర్వశి చిత్రలేఖతోఁ బ్రవేశించుచున్నది.)

ఊర్వ—(తన్నుఁ జూచుకొని) సఖీ! చిత్రలేఖా! స్వల్పాభరణభూషితురాలనయి నీలిచీరను గట్టుకొన్ననాయభిసారికావేషము నీమనస్సున కింపుగా నున్నదా!

చిత్ర—సఖీ! యేమని చెప్పుదునుకి నీయందమును వర్ణించుటకు నాకు వాగ్విభవము చాలదు. అయిన నిట్లనుకొనెదను. నేనే పురూరవసుఁడ నయితినా—

ఊర్వ—సఖీ! నన్ను నావెన్నెకాఁడున్నచోటికి సత్వరముగఁ గొనిపొమ్మని వదయస్థుఁ డగుమన్మథుఁడు నీ కాజ్ఞాపించుచున్నాఁడు.

చిత్రి—(చూచి) సఖీ! కైలాసశిఖరసశ్రీకలబయు యామినీయమునాప్రతి బింబిత మయినట్లు భాసిల్లెడునీప్రియతమునివాసభవన మిదిగో! సమీపించినాము.

ఊర్వ—చెలియా! యాలాగయునయెడల నాహృదయచౌరుని హరించినయామహారా జిప్పు డెక్కడ నుండునో, యేమిచేయుచుండునో నీదివ్యదృష్టిని దెలిసికొనుము.

చిత్రి—(ధ్యానము నభినయించి తనలో) కానీ దీనితోఁ గొంచెము వేళ మాడెదను. (ప్రకాశముగా) సఖీ! తెలిసికొన్నాను, ఇప్పు డామహారాజు విహారయోగ్యప్రదేశమున మనోరథలబ్ధ మయినప్రియాసమాగమసుఖము ననుభవించుచున్నాఁడు.

ఊర్వ—(విషాదము నభినయించుచు నిట్టూర్పుతో) సఖీ! యట్టియదృష్టము పట్టినది ధన్యురాలుగదా!

చిత్రి—ఓసిముగ్ధా! యది నీవుగాక మఱియొకప్రియురా లనుకొనుచున్నావే?

ఊర్వ—(నిట్టూర్పుతో) సఖీ! యవశమయి నాహృదయ మట్లు సంశయించుచున్నది.

చిత్రి—(చూచి) సఖీ! చూడు మిదిగో! మహారాజు నర్మసఖుఁడొక్కఁడే తనకు సహాయుఁడుగా నీమణిసౌధమున నాసీనుఁ డయి యున్నవాఁడు. సమీపింతమురమ్ము.

ఇద్దఱు—(దిగుచున్నారు)

రాజు—వయస్యా! రాత్రితోఁగూడ నామదనబాధ వర్ధిల్లుచున్నది.

ఊర్వ—సఖీ! యర్థము స్పష్టముకాక యున్నయీయనమాటచేత నాగుండెలు తటతటఁ గొట్టుకొనుచున్నవి. సంశయము దీఱువఱకు నిక్కడ దాఁగియుండి వీరిరహస్య భాషణములను విందము.

చిత్రి—సఖీ! నీయిష్టము.

విదూ—మిత్రుఁడా! నీ వమృతగర్భము లయినయీచంద్రకిరణములను సేవింపుము.

రాజు—వయస్య! యీతాప మిటువంటివానిచేత నుపశమిల్లునా;

తే. గీ. క్రొన్ననలపాన్పు, జాబిల్లివెన్నెలలును, మై నలందినగందంబు, మణులభువులు,
దాప మార్పనె, యూర్వశిఁదరుణిరై న—

ఊర్వ—(అమ్మనఁజేయియుంచుకొని) ఇఁక రెండవదేదో?

రాజు— నా మెయేకాంతకథయైన నార్పఁగాని.

ఊర్వ—హృదయమా ! నన్ను విడిచి యీయనను బొందినందుకు నీ విప్పుడు తగిన ఫలమును బొందితివి.

విదూ—మిత్రుఁడా ! నీవు చెప్పినమాట నిజమే. నేను గూడ గారెలుగాని బూరెలుగాని దొరకనినాఁడు వానిని దలఁచుకొనుచు నూఱడిల్లెదను.

రాజు—మిత్రుఁడా ! నీ కవి యేలాగున నయిన దొరకఁగలవు.

విదూ—నీవును నీప్రియురాలిని శీఘ్రముగాఁ బొందఁగలవు.

రాజు—వయస్య ! నామనస్సులో ని ట్లనుకొనియెదను.

చిత్ర—ఓసి యసంతుష్టురాల ! వినువిను. ఏమో చెప్పుచున్నాఁడు.

విదూ—మిత్రుఁడా ! యెట్లు ?

రాజు—చెలికాఁడా ! విను.

తే. గీ. స్యందనక్షోభమునఁజేసి యొరుసుకొనఁ, యంస మంసముతోడ రాపాడెఁ గానఁ
దలఁప నీభుజ మొక్కటే ధన్య మితర, మైనమే నెల్ల భూమికి నతిభరంబు.

ఊర్వ—ఇంక నే నాలస్యము సేయనేల ? (గ్రక్కున సమీపించి) సఖీ ! నే నెదుర నిలఁబడినను న న్నెఱుఁగనియట్లు లీయన యూరకున్నాఁ డేమి ?

చిత్ర—(చిఱునవ్వుతో) ఓసీ ! యెంతతొందర నీ. తిరస్కరణిని బరిహరించితివా ?

(తెరలో) దేవీ ! యిట్టిటు. (అందఱును వినుచున్నారు.)

(ఊర్వశి చెలికత్తెతో విషాదముఁ బొందుచున్నది.)

విదూ—అయ్యో ! మిత్రుఁడా ! దేవి వచ్చుచున్నది. నీ వింకఁ బెదవి గదల్పకుము.

రాజు—నీవును దిన్నగా నుండుము.

ఊర్వ—సఖీ ! యిప్పు డేమిగతి ?

చిత్ర—ఓసి పిఱికిదానా ! తొందరపడకు. తిరస్కరణీవిద్యను విడువలేదు. కనుక మన మింకను గనఁబడములే. ఈదేవియు నేదో వ్రతము చేయుచున్నట్లు లగపడుచున్నది. కనుక నిక్కడఁ దడవు నిలువదు.

(తరువాతఁ బూజోపకరణములు దెచ్చుపరిజనముతో దేవి ప్రవేశించుచున్నది.)

చేటి—దేవీ ! యిట్టిటు.

దేవి—(చంద్రునిఁజూచి) నిపుణికా! భగవానుఁడు చంద్రుఁడు రోహిణీసంయోగమున నెంతచక్కఁగా శోభిల్లుచున్నాఁడే.

చేటి—అమ్మా! దేవితోఁ గూడినమహారాజునకు రమణీయత యధికము గాదా?

అంచలు—(నడుచుచున్నారు.)

విదూ—మిత్రుఁడా! దేవి నాకు వాయనమే యిచ్చునో, చంద్రనిత్ర మను మిషచేత నిన్నుద్దేశించి చేసెడియీనోముమూలమునఁ గోపము విడిచినట్టి ప్రణిపాతలంఘనదోషమును బరిహరించుకొనునో, యెఱుఁగనుగాని, యీమె నాకన్నుల కెంతో సుముఖురాలుగా నగపడుచున్నది.

రాజు—(చిఱునవ్వుతో) చెలికాఁడా! నీకు రెండువిధములు ననుకూలములే గాని, రెండవదిమాత్రము నాకనుకూలము. చూడు మీదేవి—

ఆ. వె. మడుఁగుఁజీర గట్టి, మంగళమాత్రభూషలు ధరించి దూర్వ లలకఁ గూర్చి
వ్రతము పేర గర్వవర్తన ముడుగు దే, హమున నలుక దీఱినట్లు దోఁచు.

దేవి—(సమీపించి) నాథా! జయము! జయము!

పరి—దేవా! జయము జయము!

విదూ—(దేవింగూర్చి) స్వస్తి భవతు.

రాజు—దేవీ! కుశలమా? (చేయిపట్టుకొని కూర్చుండఁబెట్టుచున్నాఁడు.)

ఊర్వ—సఖీ! యీమె దేవీశబ్దమునకుఁ దగియే యున్నదిసుమీ. తేజోగౌర్యగాంభీర్యసరసత్వాదిగుణములయందుఁ గొంచెమైనను శచీదేవికిఁ దీసిపోక యున్నది.

చిత్ర—సఖీ! యీమాట నీనోట నెట్లు పలుకఁ గలిగితివి?

దేవి—నాథా! దేవరవారు సన్నిహితులు అయి యుండఁగా, నేనొకవ్రతము చేయవలసియున్నది. కాఁబట్టి ముహూర్తమాత్రము తమరు నాప్రతిబంధమును క్షమింపవలయును.

రాజు—(చిఱునవ్వుతో) చెలికాఁడా! చూడు. ఇది నాకుఁ బ్రతిబంధమఁట!

విదూ—స్వస్తివాచకునకు నాకుఁగూడ నిట్టి ప్రతిబంధకములు తఱచుగ లభింపవలయును.

రాజు—దేవీ! యిది యేమి నోము?

దేవి—(నిపుణికను జూచుచున్నది.)

చేటి—దేవా! యిది ప్రియానుప్రసాదనవ్రతము.

విదూ—(వెనుకకుదిరిగి) ఏమీ! పెనిమిటికోపముదీర్చునదా యీవ్రతము? కో పమే దెప్పింపకపోయిన నీశ్రమ వమ్ముకాలేకపోవునే.

రాజా—(దేవినిజూచి)

కం. ఈనోమున బిసకోమల, మైనశరీరంబు మిన్నకేలయిరించెద వో
మానిని! నీదయ గోరెడి, వానికి సేవకున కంతవలయునె చెప్పుమా.

ఊర్వ—(సవిస్మయమందహాసముతో) సఖీ! యీయన కీమెయందు నెంత గౌరవమో చూడుము.

చిత్రి—ఈమె యాకృతి యింతగౌరవమునకుఁ దగియే యున్నదిగదా! ఓసి ముగ్ధ! వేఱొక స్త్రీయందు ననురాగము గలవారయ్యును నాగరికులు భార్యయం దధికముగా దాక్షిణ్యము గలవారే యగుచుందురనుమీ.

దేవి—(చిఱునవ్వుతో) ప్రాణేశ్వర! దేవర యీవిధముగా మన్నించుట వ్రతప్రభావమునఁ గదా?

విదూ—మిత్రుఁడా! చాలు నింక నూరకుండుము. వ్రతము మానిపి వాయనము చెడఁగొట్టకు.

దేవి—బాలికలారా! పూజాద్రవ్యముల నిటు దీసికొని రండు. మేడమీఁదికి వచ్చినయీచంద్రునిపాదముల నర్చించెదను.

పరి—దేవీ! చిత్తము. ఇవిగో! పూజాద్రవ్యములు.

దేవి—తెండి. (గంధకుసుమాదులచేతఁ జంద్రకిరణములఁ బూజించి) చేటీ! చంద్రునకు నివేదించినయీయుండ్రములపళ్లెరమును బూజ్యుఁడయినవిదూషకున కిమ్ము.

చేటి—దేవీ! చిత్తము. అయ్యా! విదూషక. ఇది నీకే.

విదూ—(పుచ్చుకొని) స్వస్తి భవత్యై. బహుఫల ఉపవాసః భవతు, వ్రతస్ సుప్రీత మస్తు.

దేవి—నాథా! యిటు దయసేయుఁడు.

రాజా—ఇదిగో! వచ్చితిని దేవి!

దేవి—(రాజును బూజించి యంజలి పట్టి) ప్రాణనాథా! మీకుఁ బ్రణమిల్లుచున్నాను. దేవతాదంపతు లీరోహిణీహరిణాంకులు సాక్షులు. ఇంతటనుండి దేవరవ

ఏస్త్రీని గామింతునో, యేస్త్రీ దేవరవారిని గామించునో యామెతోడ నప్రతిబంధముగా ప్రవర్తింతురు గాక.

ఊర్వ—(ఆశ్చర్యముతో) సఖీ! యీమె యీవిధముగా నెందు కన్నదో తెలియదు గాని, నాహృదయము మిక్కిలి విశ్వాసమును బొందుచున్నది.

చిత్ర—సఖీ! మహానుభావురా లయిన యీపతివ్రతచేత నీ వనుజ్ఞాత వయితివి. నిరంతరాయముగా నీకుఁ బ్రియసమాగమము గాఁగలదు.

విదూ—(వెనుకదిరిగి) మిత్రుఁడా! మొండిచేతుల జెస్తవాఁడు చేఁపజాఱి పోయిన దని దుఃఖపడుచు, నాకుఁ బుణ్యముండును ననుకొన్నాఁ డంట. దేవి మాటలు నీలాగుననే యున్నవి. (ప్రకాశముగా) దేవీ! నీ విఁక మహారాజునెడలఁ బ్రేమ విడిచిపెట్టుకొంటివా యేమి?

దేవి—ఓయిమూఢుఁడ! నేను నాసుఖమును మానుకొని నాథునిసౌఖ్యమును జూచుచున్నాను. ఈయనయందు నాకుఁ బ్రేమ యున్నదో లేదో దీనినిబట్టి మాంచుకొనుము.

రాజు—

క. ఇచ్చపడ నైన నొరులకుఁ, బుచ్చుకొనుట కైన నీకె పోలును దానున్;
సచ్చరిత! నీవు దలఁచిన, యచ్చున నేఁ గాను జూడుమా నీయెడలన్.

దేవి—కంచు; కా కుండుఁడు. నే నుద్దేశించుకొన్నట్టు ప్రియప్రసాదనవ్రతము కొనసాగినది. బాలికలారా! రారే పోదము.

రాజు—ప్రియురాలా! నీ విప్పుడు నను విడిచిపెట్టి వెళ్ళితివా, నాయం దింకను నీ కనుగ్రహము లేనట్లే.

దేవి—నాథా! వ్రతవిఘాతము ప్రత్యవిఘాతమును జేయును గదా! (పరిజనముతో నిష్క్రమించుచున్నది.)

ఊర్వ—సఖీ! యీమహారాజు భార్యయం దెంత ప్రేమ గలవాఁడని తెలిసియు నాహృదయము నీయననుండి మరలించుకొనఁ జాలకున్నాను.

చిత్ర—ఓసి పేలా! స్థిర మయినయాశ గల దది యెట్లు మరలును?

రాజు—(దగ్గఱకువచ్చి) వయస్యా! దేవి చేయునది లేదుగదా!

విదూ—మిత్రుఁడా! చెప్పఁదలచిన దేమో నిశ్చయముగాఁ జెప్పు; వైద్యుఁడు బాగుచేయ లేక వదలివేసినరోగివలె నీవామెచేత విడిచిపెట్టఁబడితివి.

రాజు—ఊర్వశిచేతనా?

ఊర్వ—(తనలో) నే నిప్పుడు ధన్యురాల నయితిని.

రాజు—

ఉ. చాటుననుండి యందియలసద్దయినన్ జెవిలోన వేయునా,
యాటకు వెన్కవచ్చి కను లైనను జేతులతోడ మూయునా,
నీటుగ మేడమీఁద దిగి నివ్వెఱచేఁ దనకాళ్ళు దాటి ప్రేలన్
బోటి పెనంగి ముందుఱుకఁ బుచ్చఁగ నూర్వశి నన్ను డాయునా.

చిత్ర—సఖీ! యూర్వశీ! నీ వింకఁ బూర్ణముగా నీయనకోరికను దీర్పుము.

ఊర్వ—(జడుపుతో) నేను గొంచెము పరిహాసము చేసెదను.

(వెనుకనుండి మెల్లగా వచ్చి రాజు కన్నులు మూయుచున్నది.)

చిత్ర—(చెప్ప వల దని విదూషకునకు సంజ్ఞ చేయుచున్నది.)

రాజు—(స్పర్శసుఖమును నిరూపించి) చెలికాఁడా! యీమె నారాయణోరు సంభవ యయినయూరంభోరువు గాదుగదా!

విదూ—మిత్రుఁడా! నీ వెట్లు తెలిసికొంటివి.

రాజు—వయస్యా! యిది తెలిసికొనుట యేమి యశక్యము?

క. నలరాయనికాఁకల మల, మల మఱఁగెడు నాదు మేను మఱియొకచేతం
బులకిత మగునే? కలువను, నెలకరములె గాక లప్పునే రవికరముల్?

ఊర్వ—అన్నా! యాశ్చర్యము. వజ్రలేపముచేత నంటించినట్లే నాచేతుల మరలఁ దీసికొనుటయు శక్యము గాకున్నది. (ముకుళితాక్షియయి కన్నులమీఁదిచేతుల దీసి కొంచెము సేపు జడియుచు నిలువఁబడి మెల్లమెల్లగా సమీపించి) జయము జయము మహారాజా!

రాజు—సుందరీ! కుశలమా? (ఏకాసనమునఁ గూర్చుండఁబెట్టుకొనుచున్నాఁడు)

చిత్ర—ప్రియవయస్యు లయినదేవరవారికి భద్రమా?

రాజు—కల్యాణీ! యిప్పుడు దానిని బొందినవాఁడ నయితిని.

ఊర్వ—సఖీ! చిత్రలేఖా! యీమహారాజును దేవి నాకొసఁగుటచేతఁ జనవ

లాగున ముందుగా నే నిట్లు గాఁగిలించుకొంటిని. నన్నుఁ దుందుడుకుదానివిగా నెంచ కొనకుము.

విదూ—మిత్రుఁడా! మీ కిద్దఱి కిక్కడనే ప్రొద్దు వోవుచున్నది.

రాజు—(ఊర్వశిని జూచి) సుందరీ!

క. దేవి యొసంగిన దనియే, యీ విప్పుడు నన్నుఁ గౌఁగిలించినదో, ముం
దేవా రొప్పఁగ దొంగిలి, నావో దెలుపంగ వలయు నాహృదయంబున్.

చిత్ర—మిత్రమా! యీమె నిరుత్తరురా లయినది. ఇప్పుడు నా దొకమనవి చిత్తగింప వలయును.

రాజు—ఇదిగో! సావధానుఁడను.

చిత్ర—స్వామీ! యీవసంతఋతువు దాఁటఁగానే గ్రీష్మఋతువున నేను భగవానుఁ డయినసూర్యునకుఁ బరిచర్య సేయవలయును. కాఁబట్టి నాప్రియసఖికి మరల స్వర్గముమీఁద మనసు వాఱకుండునట్లు దేవరవారు చేయవలయును.

విదూ—పూజ్యురాలా! యీమెకు స్వర్గములో నే మున్నది? తిననా? త్రాగనా? చేఁపలాగున ఱెప్ప వేయనికన్నులతోఁ జూచు చుండవలయును.

రాజు—కల్యాణీ!

తే. గీ. స్వర్గ మిట్టిది యనరానిసౌఖ్య మొసఁగు, దాని మఱపింప నెవ్వనికైనఁ దరమె?
యొండుపూఁబోణులకు దుర్లభుం డనంగఁ, దగుపురూరవుఁ డీయింతి దాసుఁ డింక.

చిత్ర—దేవా! మహానుగ్రహముగదా! సఖీ! యుర్వశీ! నీకు భయము లేదు. నన్నిఁకఁ బంపుము.

ఊర్వ—(చిత్రలేఖను గౌఁగిలించుకొని సకరుణంబుగా) సఖీ! నన్ను మఱచి పోయెదవు సుమీ!

చిత్ర—(చిఱునవ్వుతో) ప్రియసఖీ! నీవు మహారాజును జేపట్టినావు. కనుక నీలాగున నిన్ను నే ననవలసినది. (రాజునకు నమస్కరించి నిష్క్రమించుచున్నది.)

విదూ—మిత్రుఁడా! నీ వదృష్టవంతుఁడవు. మనోరథసిద్ధియయి వర్ధిల్లుచున్నావు

రాజు—మిత్రుఁడా! యిప్పటినాయభ్యుదయము చూడు.

తే. గీ. నిఖిలసామంతమకుటమాణిక్యకలిత, పాదపీఠంబు, నేకాతపత్ర మయిన
ప్రాజ్యరాజ్యంబు నీయింతిపాదసేవ, నేయునంతటిధన్యత్వ మీయ దయ్యె.

ఊర్వ — దేవరవారితో బదులు పలుకుటకు నాకు వాగ్విభవము చాలదు.

రాజు — (ఊర్వశిహస్తమును బట్టుకొని) ఓహోహో! నాయిష్టార్థము సిద్ధించుట వలన నిప్పు డన్నియు విరుద్ధకార్యములు గలుగుచున్నవి.

చ. మునుపటివే హిమాంశుకరముల్, మెయి కిప్పుడు సోఁకు హాయిగా;
ననవిలుకానిములుకులును నాఁటెడి నూ, హృదయానుకూల మౌ;
ననయము నాకు బెట్టిదము లైనవి యన్నియు నీవు నన్ను న
న్నన నిటు లేలుకొన్నకతనం గడుఁ దిన్నని నయ్యెఁ దొయ్యలీ.

ఊర్వ — దేవరకుఁ జిరకాలవిరహతాపము గలిగించి నేను మహాపరాధమును జేసినాను గదా!

రాజు — సుందరీ! యట్లుగాదు —

తే. గీ. ఇల నతిక్లేశమున గడియించుకొన్న, సుఖమె రసవత్తరం బైనసుఖము సుమ్ము
మండువేసంగిలో దారి నెండ నడచిన, నరులకే గాద సుఖ మిచ్చుఁ దరులనీడ.

విదూ — మిత్రుఁడా! యింతవఱకును బ్రదోషరమణీయము లయినచంద్రకిరణము సేవించితివి. చాలును. ఇంక నిది వాసభవనము చేరవలసినయవసరము గదా!

రాజు — చెలికాఁడా! యటులయిన నీవయస్యురాలికి మార్గముఁ జూపుము.

విదూ — పూజ్యురాలా! యిట్లిటు.

రాజు — సుందరీ! యింకొక్క కోరిక యున్నది.

ఊర్వ — స్వామీ! యది యేమి?

రాజు —

తే. గీ. మున్ను నాకోర్కె యీడేఱకున్ననాళ్ల, రాత్రి యొక్కొక్క టేనూఱు రాత్రులర
నతివ! యిటుమీఁదఁగూడ నట్లయ్యె నేని, నేఁ గృతార్థుఁడ నౌదుఁగా నిన్నుఁగు

అందఱు — (నిష్క్రమించుచున్నారు.)

ఇతి శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసకవితాధురంధర సద్గాదిసాధు
వంశక్షీరనీరాకరరాకాసుధాకర రాచ్చనామాత్యపౌత్త్రహరితస
గోత్రపవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల
సూరపరాజపుత్త్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బ
రాయనామధేయాంధ్రీకృత మగువిక్ర
మోర్వశీయనాటకము తృతీయాం
కము.

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

# విక్రమోర్వశీయము

## చతుర్థాంకము.

(తెరలో సహజన్యా చిత్రలేఖల ప్రవేశమును సూచించు గీతిక.)

దినకరుకరములు దగిలి కమలములు విలసిలుకొలనిదరిన్

దనసఖిఁ బాపి కలఁగుహంసి మెలఁగుఁ గలసి యొకసహచరిన్.

(చిత్రలేఖయు సహజన్యయు విచారముతోఁ బ్రవేశించుచున్నారు.)

చిత్ర—(రెండడుగులు నడచి దిక్కులు చూచి)

ద్విపద. ప్రియసఖీదుఃఖంబు పీడించు చుండ। నయనంబులశ్రుకణములతో నిండ

నలమగుచున్నది హంసీయుగలము। గళము రాల్పడఁ దటాకమున నగ్గలము.

సహజన్య—(చిత్రలేఖను జూచి) సఖీ! చిత్రలేఖా! వసివాడిన తామరపువ్వువలె వన్నెదఱఁగి యున్న నీమోముచాయ హృదయములోని యస్వస్థతను దెలియఁజేయుచున్నది. నేనును నీతోడిపాటుగ సుఖదుఃఖముల ననుభవింప వలసినదానను గదా! కాఁబట్టి నీ విట్టు లస్వాస్థ్యత నుండుటకుఁ గారణ మేమో నాకుఁ జెప్పుము.

చిత్ర—సఖీ! యప్సరసలవంతులవెంబడిని నేను సూర్యభగవానునికిఁ బరిచర్య చేయుచుండి యిప్పుడు నాప్రియసఖి నెడఁబాసి యున్నసమయములో నీవర్షఋతువు వచ్చినందున మిక్కిలి బెంగ పెట్టుకొంటిని.

సహ—సఖీ! నీకును నూర్వశికిని గల యన్యోన్యస్నేహము నాకుఁ దెలిసినదే. తరువాతఁ దరువాత?

చిత్ర—సఖీ! యీదినములయందు నాప్రియసఖివృత్తాంత మెట్టు లుండెనో యని దివ్యదృష్టిని ధ్యానించి చూడఁగా మహోపద్రవము గోచరించినది.

సహ—(తొందరపడి) అది యెట్లు?

చిత్ర—(సకరుణముగా) సఖీ! మనయూర్వశి తనయందలియధికానురాగముచేత మంత్రులమీఁద రాజ్యభారము నుంచినయారాజర్షితోఁ గూడఁ గైలాసశిఖరోద్దేశమున గంధమాదనవనమందు విహారము సేయఁ బోయినది.

సహ—(సశ్లాఘముగా) సఖీ! యట్టిప్రదేశములయందలిసంభోగమే సంభోగము. తరువాతఁ దరువాత.

చిత్ర—సఖీ! తరువాత నక్కడ మందాకినీతీరమున నిసుకతిన్నెలపయిఁ బిచ్చుక గూండ్లను గట్టుకొని యాడుకొనుచున్నయుదయవతి యనువిద్యాధరబాలిక నారాజర్షి క్షణమాత్రము వీక్షించినాఁ డన్నకారణమున నూర్వశికిఁ గోపము వచ్చినది.

సహ—కాఁ దగినదే. అతిశయించినస్నేహమున కట్టిది గిట్టదు గదా! తరువాతఁ దరువాత?

చిత్ర—తరువాత నూర్వశి, తన్నెన్నివిధముల నారాజర్షి బతిమాలుకొన్నను వినక, నాఁటిగురుశాపమున మూఢాత్మురాలయి దేవతానియమమును మఱచిపోయి, స్త్రీజనము చొరఁ గూడనికుమారవనమున నడుగు వెట్టినది. అడుగు వెట్టినతోడనే యాయడవిలోనితీఁగలలోఁ దాను నొక తీఁగగా మాఱిపోయినది.

సహ—అన్నా! యంతటియనురాగమున కింతటియనర్థ మెంతలో సంప్రాప్తమయినది. సఖీ! దైవమున కెందును దాఁట రానిది లేదు గదా! తరువాత నారాజర్షి యెట్టియవస్థను బొంది యుండునో!

చిత్ర—సఖీ! యటుపిమ్మట నారాజర్షి వెచ్చి యెత్తినవాఁ డయి యాయరణ్యములో నిదిగో! నూర్వశి, యదిగో! నూర్వశి, యని యహోరాత్రి మొక్కతీరుగాఁ దన ప్రియతమురాలిని వెదకుచుఁ దిరుగులాడుచుండెను. అది యటుండఁగా మీఁదు మిక్కిలి వియోగము లేనివారికిఁ గూడ విరహతాపము గలిగించెడునీవర్షకాలము గూడ సంభవించినది. ఇట్టిచో నటువంటిరమణీయప్రదేశమున నాతని కెట్టి యవస్థము తటస్థించునో నాకుఁ దెలియ కున్నది.

(తెరలో)

ద్వి. నెచ్చెలిఁ బాయుట నెయ్యంబు పేరి । వెచ్చనిబాష్పముల్ వెడల లో నూరి,
యలమరుచున్నది హంసీయుగళము । గళము రాల్పడఁ దటాకమున వగ్గలము,

సహ—సఖీ! వారికి మరల సమాగమోపాయ మేదైనఁ గలదా లేదా?

చిత్ర—సఖీ! గౌరీచరణరాగసంభవ మయిన సంగమనీయమణి వలనఁ దక్క వే రొక్కటి వారికిఁ బునస్సమాగమము గలుగ నేరదు. అది యతని కెట్లు లభించును.

సహ—సఖీ! విచారింపకుము. ఇట్టి సులక్షణాకృతులు గలవారలు చిరకాలదుఃఖ మనుభవింపరు సుమీ. ఏదేని యనుగ్రహము నిమిత్తముగాఁ దప్పక సమాగమోపాయము లభించు నని నే నూహించెదను. (తూర్పు చూచి) ఇదిగో! భగవానుఁడు సూర్యుఁ డుదయింప నున్నాఁడు. మన మాయన నుపాసింపఁ బోవుదము. రమ్ము.

(తెరలో)

గీతిక. కలఁత నొందినమనసుతోడఁ, జెలిమికత్తియ నెలమిఁ జూడ
మెలఁగుచున్నది హంసలలన, గలయఁ బూచినతమ్మికొలన.

ఇద్దఱు—(నిష్క్రమించుచున్నారు.)—ప్రవేశకము—

(తెరలోఁ బురూరవునిప్రవేశము సూచించు గీతిక.)

కరినాథుఁడు గహనము చొరఁబడెఁ బ్రియకరిణిని బాసినఖేదమునన్
పుష్పకిసలయసుమవిసరముల నిజకరమున సలుపఁగ నున్మాదమునన్.

[ఉన్మాదవస్త్రవేషముతో రాజు ప్రవేశించుచున్నాఁడు.]

రాజు—(క్రోధముతో నాకాశమున లక్ష్యముంచి) ఆ! దురాత్మ! రాక్షస! నిలు నిలు. నాప్రియతమురాలిని దీసికొని యెక్కడికిఁ బోయెదవురా! కటకటా! కైలాస శిఖరమునుండి గగనమున కెగసి నామీఁద బాణవర్షము గురియించుచున్నావు.

(పెడ్డ చేతఁ బట్టుకొని కొట్టుటకుఁ బరుగెత్తి దిక్కులు చూచి)

ద్వి. శోక మ్ముల్లంబును జాలువాఱఁ గాల్పఁ । బైకిఁ గన్నులనుండి బాష్పముల్ పొరలఁ
గలవాణిఁ బాసి యెక్కలు విరుచ్చుచును । గోలన రోయుచు పొక్కుచు నున్నాఁడకటా!

రాజు—(ఆలోచించి) ఓహో! నాచిత్తవిభ్రమము!

చ. తొలుకరినీలమేఘ మిది, దుష్టనిశాటుఁడు గాఁడు; దాన ను
జ్జ్వలముగ నింద్రచాప మిది, సజ్యము దానవు విల్లు గాదు; కే

నలమును వర్షధార లివి, బాణపరంపర గాదు; పైఁడిగీ

టీలఁ దలఁపించె మించిదె, హృదీశ్వరి యూర్వశి గాదు మూఢిగా!

(మూర్ఛిల్లి మరల లేచి నిట్టూర్పు పుచ్చి)

ద్వి. తొలుత రక్కసుఁ డింతి దొంగిలించుటను । దొలుకారు మెఱపులతోడ సర్షించు

నల్లమబ్బును జూచి నాగుండె చెదరి । చెల్లఁబో! మరలను జెనఁటి దానవుఁడు

మెలఁతను జెఱపట్టి మింటికై యెగసి । యాలవునఁ గొనిపోవు ననుకొంటి బ్రమసి.

(దుఃఖముతో నాలోచించి) అటు లయిన నాప్రాణనాయిక రంభోరు వెందుఁ బోయి యుండునో గదా!

చ. తనమహిమంబుచే నలిగి దాఁగెనొ, తోఁచదు వేల యల్గుఁ? జెం

గున దివి కేగెనో యెగసి, కొమ్మకు నాపయిఁ గూర్మి హెచ్చు; నా

మునుమున నున్నదానిఁ గొని పోవఁగ లేరు సురారు లైన; నం

గన గన రాని కిం కిటను గారణ మే మగు నొక్కొ దైవమా.

(వెక్కులు మించి నిట్టూర్పుపుచ్చి కన్నీళ్ళతో) అన్నా! యదృష్టము దొలఁగినవారి కాపదల మీఁదనే యాపదలు వచ్చుచుండును గదా!

ఆ. వె. ఇపుడు ప్రాప్త మయిన యాప్రియావిరహంబు, నేను సైఁప లేక యిట్టు లుండ,

నాతపంబు లేమిచేతఁ జల్లనైన, వాసరములు వచ్చె వానకారు.

(మేఘమును జూచి) గీ. తెఱపి లేనివానసోనలను దశదిశ లలమినజలదా!

మఱప కిపుడు నాయాజ్ఞను సంరంభమును మానవలదా?

తిరిగి తిరిగి యీయడవిలోన నా తెఱవఁ గంటి నేని

సరగ నపుడు నీవేమి చేసినను సహించుంతును గాని.

(ఆలోచించి) వృథాగా నామనోవేదన నుపేక్షించుచున్నా నేల? "రాజా కాలస్య కారణ" మ్మని మునీంద్రులు పలుకుదురు గదా! నేనే కాలమునకుఁ గారణ మయిన నన్ను బాధించుచున్న యీవర్షకాలమును నేను నిరాకరింపకుండ నేల? (నవ్వి, "రాజా కాలస్య" మొదలుగాఁ గల వాక్యము మఱచి) ఇదిగో! నిరాకరించెదను.

(అంతలో) గీతిక. పరిమళరసమునఁ బరవశంబయి భ్రమరనికరము పాడఁగా,
మొరయు కోయిలమూఁక తూర్యమ్ముల రవమ్ములు గూడఁగాఁ,
గరువలిని జలియించు తలిరులఁ గల్పవృక్షము సొంపుగా
విరులు జలజల రాల నాడెడు విపినమున మది కింపుగా.

పో. నిరాకరింపను. ఈవర్షకాలచిహ్నములవలన నా కిక్కడ రాజోపచారములు జరుగుచున్నవి. (నవ్వి, పరిమళంబున నను గీతిక మరలఁ జదివి) ఆయుపచారము లెట్లు జరుగుచున్న వనఁగా—

ఉ. బంగరుజాల్మెఱుంగులవఁ గ్రొంబెఁ జరీపనినీలిచందువా,
వంగనపుష్పగుచ్ఛములపర్బ్బలులే వెలిచామరాలు, వే
సంగి యడంగుటన్ రుతము సల్పు శిఖండులె వందు లీగిరుల్
ముంగిటఁ బెద్దధార లనుముత్తెపుఁ బేరులు నైమశేరులున్.

అయ్యో! యీమేఘోపచారములను శ్లాఘించుటవలన నేమిలాభము? ఈయడవిలో మటుమాయ మయి పోయిననాప్రియురాలిని వెదకికొనియెదను. (అంతలో)

గీతిక. తరుణీరహితం బురుదుఃఖితమున్, విరహాతురముం బరిమంథరమై
కరిరాజము సుమధురరాజితమా, గిరికాననమునఁ దిరుగుచు డస్సెన్.

(రెండడుగులునడచి) అయ్యయ్యో! ప్రాణేశ్వరిని వెదకుచున్ననాకు నీప్రదేశమున విరహానల మధిక మగుచున్నది.

క. అరుణాంచలములు సలిలో, దరములు నయి యలరుచున్నతనపుష్పాల సుం
దరకందళి దలఁపించెడుఁ, దరుణీమణి కినిసి కంటఁ దడి పెట్టుటలన్.

నాప్రియురా లీమార్గమున వెళ్ళినయెడల నా కేమిగుఱుతు లగపడఁగలవు?

తే. గీ. వాన గురిసినయీపెనుగానలోని, యిసుకనేలను సతి పాద మిడియె నేని,
గురునితంబత మడమలు గూరుకొన్న, యడుగు లగపడుఁ బారాణియానవాళ్ళ.

(నడచి చూచి సంతోషముతో) ఆహాహా! యిదిగో! నాప్రియురాలిమార్గముఁ దెలిసికొనుటకుఁ జక్కని యానవాలు గనఁబడుచున్నది.

చ. చటులపుమోవిలత్తుకరసంబు గరంచెడుబాష్పబిందువుల్
బొటబొటరాలు, రాచిలుకపొట్టను బోల్ చెలిపచ్చపట్టుఁబ

ర్యోఁటపిడియుత్తరీయ మిది; యీసున భిన్నగతిన్ గమించుచోఁ
దటుకున జాఱి పడ్డదిటఁ, దన్వి యెఱుంగదు కోపతీవ్రతన్.

—పాఠాంతరము.—

తే. గీ. అధరరాగము హరియించునశ్రువారి, నంకితంబు శుకోదరశ్యామ మిది, త
దిందుపదవాస్తనాంశుక మిచట జాఱెఁ, గోపమునఁ గల్కి వేగ మేగుతఱి, నిజము.

దీనిని నేను దీసికొనియెదను. (నడిచి యాలోచించికన్నీటితో) అయ్యో! యిది యామెస్తనాంశుకము గాదు- ఆర్ద్రపురుగులచేత వ్యాప్తమయి నవనవలాడుచున్న పచ్చిక పట్టు. కటకటా! యీనిర్జనవనమందు నాప్రియురాలివార్తను నే నేలాగునఁ దెలిసి కొందును? (చూచి) కానీ. ఇప్పుడు మోదిన పెద్దవానకుఁ గరఁగిపోయిన శైలేయము వ్యాపించినఱాతిబండపయి నెక్కి—

తే. గీ. విష్వపింఛ మెదురు వీచుగాలిని నాడ, మెడను నిడుపుగాను మీఁది కెత్తి
కేకి నల్లమబ్బుఁ గేకారవంబుతోఁ, జూచుచున్న దెంతొ సుందరముగ.
దీని నడిగి నాప్రియురాలివృత్తాంతము దెలిసికొనియెదను.

గీతిక. వెనుకటిచందము మాఱి, తనసుందరిఁ గనఁ గోరి
వనగజ మబ్బురపడుచును, వనమున నడివడి నడచును.

(మరల) గీతిక. నిను వేఁడెద బర్హిణరాజను! యీవనమునఁ దిర్మ్మరుచుఁ
గనినయెడల నాప్రియురాలిని గృప గలిగి తెలియఁబఱచు
అంచనడలు నెఱచందమామ నిండుమోము గలది
యెంచుకొనుమి యీచిహ్నలనలన గ్రహింపఁదగును వెలఁది.

(మోకటిల్లి యంజలి పట్టి)

పంచ. మయూరవంశమండనాయమాన! సుందరాంగి! నా
ప్రియాపవేణి గానఁబడ్డపక్షమందుఁ గానలోఁ
బ్రియావియోగవహ్నిచేఁ దపించుచున్న యో! భవ
ద్దయామయోక్తిశీతలామృతంపువెల్లి ముంపవే.

ఏమిది? నాకుఁ బ్రత్యుత్తర మీయక నృత్యము సేయుచున్నది! దీనికి సంతోష కారణ మేమి యయి యుండును? (ఆలోచించి)

చ. అగును గ్రసించినాఁడఁ బ్రియురాలు గనంబడ కుంటఁ జేసియే
పగ దగ నంచు నిప్పు డిది బాగుగఁ దాఁ బురివిచ్చి యాడెడున్;
విగళితబంధమై రతిని విజ్జినపువ్వులతోడియామెకో
ప్పుగపడెనేనిఁ గోరి యొకరైనను గాంతురె దీనిపింఛమున్.

ఛీ! యితరులదుఃఖమునకు సంతసించుచున్నదీని నింక నడుగ రాదు. (నడిచి) ఇదిగో! గ్రీష్మఋతువు గడచిపోవుటచేత మదాలస యయి నేరేడుచెట్టుమీఁదఁ గూరుచున్న దాఁడుఁగోయిల; ఇది పక్షిజాతిలోఁ బండితురాలు; దీని నడిగెదను.

గీతిక. విద్యాధరకాననమున వెదకుచు దీనాననమున
మాద్యత్కరినాథుఁడు తనమది వేదనమీఱుకతనఁ
బొంగెడుబాష్పజలంబులఁ బొరల కుండ నయనంబుల
మ్రింగికొనుచు నడుచుఁ గదా నింగిఁ గొలుచుపొడుగునఁ దా.

(మరల) గీతిక. పరభృతికా! మధురవాణి! నీ వీ వరకాననమందుఁ
దిరిగెడునాతరుణిని జూచినయెడఁ దెలుప వేఁడుకొందు.

(నృత్యముచేయుచుఁ జేరఁ బోయి మోకాళ్ళూని) ఓకలకంఠీ!

చ. విరహులపాలి కీవు వెడవిల్తునిదూతిక వందురు; మానసా
హరణమునం దమోఘ మగునస్త్రమవే; యటుగాన నిన్ను నో
పరభృతి! వేఁడుకొందుఁ; గలభాషిణి నాప్రియ నిందుఁ దోడితే;
మరియటు సేయవేని, నను మానినియొద్దకునైనఁ గొంచుఁ బో.

(కొంచెమెడము నడచి యాకాశమున) పూజ్యురాలా! యే మనియెదవు? ఇంత యనురాగము గలన న్నెందుల కెడఁబాసినదా? ఆలకింపుము.

ఆ. వె. కోపకారణంబు లొపను లెపుడు నేఁ, జేసి యుండ; నైనఁ జేడె యలిగె;
మగలమీఁదఁ గలుగుమగువలయధికార, మేల నేరముల నపేక్షు సేయు?

(తొందరగా సమీపించి మోఁకాళ్ళూని, కోపకారణం బనుపద్యము మరలఁ జదివి వీక్షించి) ఏమీ! యిది ప్రస్తుతకథను మాని తనపనినే చూచుకొనుచున్నది. బాగు!

చ. అలమటఁ వేఁడునాపరిచయంబు గణింపక దుర్మదాంగనై
లలితపుదోరనేరెడుఫలంబును మోవిని బోలె నొక్కి, తా

నెలమిని గోరిలుచున్నయది యీపికభామిని; యొండ్లదుఃఖ మ
గ్గలమును శీతలం బనుచుఁ గా వచియింతురు; సత్యమే సుమీ.

ఓసీ! యిట్లు చేయుచున్నను నాప్రియురాలియెలుఁగునంటికంఠస్వరము గలదాన వని నీమీఁద నా కేమియుఁ గోపము రాకున్నది. నీవు సుఖముండుము. (నడచి చెవి యొగ్గి) ఓహో! దక్షిణదిక్కున నాప్రియురాలు నడుచుచున్నట్లు లందెలచప్పుడు విన వచ్చుచున్నది. అక్కడకుఁ బోయెదను.

(అంతలో)

ద్వి. ఉడుగ కశ్రుక్షీరంబు లొలుకునేత్రములు, నడలునఁ దడఁబడునట్టివెన్నడలు,
నురుతాపభరమున నుడుకు నెమ్మేను, దరము పెల్లెచివఁ దలఁకుస్థైర్యంబు
నయి కరీంద్రుఁ డరణ్యమందుఁ గ్రుమ్మరెడుఁ, బ్రియతమావిరహసంపీడితుఁ డగుచు.
(నడచి మాచి దుఃఖముతో) అయ్యో! యెంతకష్టము!

ఆ. వె. ఆకసమునఁ బన్నినట్టిమబ్బులనల్ల, నల్లనై నదిక్కులెల్లఁ జూచి
వేగ మానసమున కేగురాయంచల, రవము గాని యందెరవళి గాదు.

కానీ. మానససరస్సునందు వేడుక గలమరాళము లీకొలననుండి యెగిరిపోక మునుపే దీనిని నాప్రియురాలివృత్తాంత మడిగెదను. (సమీపించి మోఁకాళ్ళూని) ఓహంసా! జలవిహంగరాజ!

చ. రయమున నీవు మానససరస్సున కానలఁ బోదు గాని, నీ
పయనము కంచుఁ జంచువునఁ బట్టినబత్తెపుఁ దమ్మితూఁడు వెం
డియుఁ గొన వచ్చుఁ గాని, తరుణీమణివార్తను దెల్పి కావుమీ
దయఁ, బరకార్య మెక్కుడు గదా నిజకార్యముకన్న వేత్తకున్.

(అడ్డముగాఁ జూచి) ఇది నా కభిముఖ మయి చూచుట విచారింపఁగా, మాన సోత్సుకమ నయిన నేను నీప్రియురాలిని జూడ లేదనుటగాఁ దోఁచుచున్నది. (అంతలో)

ద్వి. అందమా యోరి! నీ కంచలరాయ! మందయానను దాఁచి మాయము సేయ?

(నృత్యము చేయుచు)

క. ఈతమ్మికొలనిదరి నా, శాతోదరి జూడకున్న సకలంబును నీ
కైతీరున దొంగిలితివి, రా తరుణీగమనలీల, రాజమరాళా.

ద్వి. ఆననఁబోణియొయ్యారంపునడల, చే నసుమానంబు చిక్కెనీయెడల.

(సమీపించి యంజలిపట్టి)

ఆ. వె. నావెలందినడలు నీవు దొంగిలితివి, గాన హంస! మందయాన నిమ్ము.
దొడ్డవోయినట్టి పెద్దసొత్తున నించు, కంత దొరకుపోట నంత గొనరె?
గీతిక. తెలుపవనడలు నీ కెవరు నేరిపిరి తెలుపుము రాజమరాళా!
యెటులేఁగింపుము నీ వింతిఁ జూచితే నే హర్షింతును జాల.

(నవ్వి) ఓహో! యీరాజు దొంగలను శిక్షించు నని వెఱచి యీహంస యెగిరిపోయినది. పోనీ! మఱి యొకచోటికిఁ బోయెదను. (నడచి చూచి) ఇదిగోఁ! దన ప్రియురాలితో నక్కడ నొకజక్కవపులుఁగు గగపడుచున్నది. దానియొద్దకుఁ బోయెదను. (అంతలో)

గీతిక. మన్మథరణితమనోహరమై, మన్మథసుమకిసలభాసురమై
పేర్మి గన్న కాననమునను, ద్రియఁ బాసి కరీంద్రుఁడు చనును.

(మగల) గీతిక. గోరోచనాకుంకుమారుణాకార! చక్రివాక!
సారసాక్షిఁ జూచితివా మధువాస రమున నిట రాక,

(సమీపించి మోకా ళ్ళూని)

ఆ. వె. ఓ రథాంగనామ! నే రథాంగశ్రోణి, బింబఁ బాసి పరితపించు రథిని,
మొలక లెత్తుచున్న పలుమనోరథముల, తోడ నడుగుచుంటిఁ జేడెవార్త.
ఏమీ! యీజక్కవ "కఃక" యనుచున్నది. నే నెవఁడనో యెఱుంగదు కాఁబోలు; కానీ, తెలిపెదను. ఓచక్రివాకనాయకా!

ఆ. వె. మాకు భాస్కరుండు మాతామహుండు ను, ధాకరుండు మాపితామహుండు
నుర్వి యుర్వశి యనునిర్వారు స్వయముగాఁ, గోర్కెతో వరించుకొన్నపతిని.
ఏమి! యూరకున్నది. కానీ, దీనిని నిందించెదను. (మోఁకా ళ్ళూని) ఓజక్కవా! తనవలెనే యెదుటివారు నని తలంచి ప్రవర్తించుట యుక్తము గదా! చూడు.

చ. సరసునఁ దామరాకొకటి చాటయినంతనె చక్రివాకమా!
దురపిలుచుంటి వీవు కడుదూరము పోయెను వెంటె యంచు: నీ
కరయఁగ నంతభీతి ప్రియురాలిని బాయుట యన్న; నయ్యయో!
విరహిని నేను నాచెలిప్రవృత్తిని వేఁడఁగ నూర కుందువే?

(కూరుచుండి) సర్వథా యిది మాదురదృష్టపరిభావము. కానీ! మఱి యొకరి నడిగెదను. (నడిచి చూచి) ఇదిగో!

క. మొనపంట మోవి నేఁ జూఱు, కున నొక్కఁగ సీత్కరించుకొమ్మ మొగములీ
లను, లోపలఁ దుమ్మెద జూ, మ్మనునీవిరిదమ్మి నన్ను నరికట్టు నిటనే.

కానీ. ఈతామరపూవునందు నధివసించి యున్నతుమ్మెదను ప్రార్థించెదను. లేకున్న నీవిచారమొకటి నన్ను బాధించుచుండును.

(అంతలో) ద్వి. ఎలమితోడుతఁ గామ మెద వృద్ధి గాంచ,
గొలనఁ గ్రీడించును గోదమరాయంచ.

(చేరి యంజలిపట్టి) ఆ. వె. తుమ్మెదా! తెల్పవే ముద్దుగుమ్మవార్త;
(ఆలోచించి) చూడలేదేమొ నీవు నాసుదతి మోము;
నా మెనిశ్వాససౌరభ మబ్బెనేని
నీకు మన సౌనె యీపుండరీకమందు?

(నడిచి చూచి) ఇదిగో! నీకడిమిమ్రానిబోదెపయి హస్తముంచి తనకరేణువుతోఁ గరినాథుఁడు నిలిచియున్నాఁడు. ఇతనియొద్దకుఁ బోయెదను-

గీతిక. కరిణీవిరహానలబాధితమై, కానఁ దిరుగు మదకరి యుద్ధతమై.

(మరలఁ జూచి) అయిన నిప్పు డీతని నడుగఁ బోవుటకు సమయము గాదు.
ఇదిగో!

ఆ. వె. కల్లువాసన గలపాలు గాఱుచుండఁ, జేతఁ దెమలించి యందుగుఁజిగురుఁగొమ్మ
సరసముగ బోటి యందీయఁ గరిపభుండు, మించువేడుకతో నారగించు చుండె.

(క్షణ ముండి) ఇదిగో! నీతనిభోజన మయినది. ఇంక సమీపమునకుఁ బోయి యడిగెదను. (అంతలో)

గీతిక. కుంజరేంద్ర! నిన్నడుగు చుంటి నాకొమ్మవార్తఁ దెలుపు
మంజువాణి, మోహనాంగి చందురుమామ గెలుచుమోము గలది సుందరి. కుంజ.

(సమీపించి)

ఆ. వె. ఓయియూథనాథ! యూధికాశబలకై, శ్యంబుదాని, నీకరంబుఁ బోలు
నట్టితొడలదాని, యౌవనవతిని నా,సుదతి నెచటనేనిఁ జూచితయ్యా?

(సంతోషముతో నాలకించి) ఓహోహో! నాకుఁ బ్రియాలాభసూచకమగు నీఘీంకారముచేత నూఱడిల్లుచున్నాను. మఱియు సమానధర్మములనుబట్టి నీయందునా కెంతో ప్రీతి గలుగుచున్నది.

ఉ. ఏనిలఁ గుంభినీపతుల కీశుఁడ, నీవును నట్టివాఁడవే;
మానితదానసంపద సమానమె యిద్దఱియందు; నాకు స
న్మానినులందు నూర్వశియు మాచల నీసతి నీకుఁ బ్రేయసుల్;
వీనికిఁ దోడు నావిరహవేదన నీకు లభింప కుండుతన్.

పాఠాంతరము.

మ. నను ధాత్రీశ్వరనాథుఁ డందురు, కరీణ్ణాథుండ వీ వుత్కటం
బు నవిచ్ఛిన్నము నీకు దాన మది యొప్పున్ నాకు నీనాఁ; మం
దను నీ కీవశ, నాకు నూర్వశి వరస్త్రీరత్నంబు నం, జాయ లీ
వెన నత్యున్నట మైన గాసిలకుమీ యీప్రియావియోగవ్యథన్.

ఓయికరిరాజా! నీవు సుఖముండుము. నేను బోయెదను. (నడచి చూచి) ఓహో! యిది కడునుంపర మయినసురభికందర మనుపర్వతము. అప్సరసలకు రమణీయస్థలము లగు బహుప్రియము గదా! ఒకవేళ నాప్రియురాలు దీనియుపత్యకయందుఁ గానఁబడునేమో! (నడచి చూచి) అయ్యో! గాఢాంధకారబంధురమే! కాని మెఱపువెలుతురునఁ జూచెదను. అన్నన్నా! నాపాపము వలన మేఘము గూడ మెఱుఁగు లేని దగుచున్నది. ఎట్టులయిన దీని నడుగక మరలను. (అంతలో)

గీతిక. ఖరఖురదారితధారణినై నిజ, కార్యపరైకవిచారణనై
తిరుగు వరాహము దీనంగనై భీ, కరగహనంబున లీనంబై

తే. గీ. ఇంచుకైన నడుమ నెడ మన్నదే లేని, కుచయుగంబు గలుగగురునితంబ
పంచశరున కనికిపట్టైనసీమనాం, తరము చొచ్చెనయ్య సగకులేఁడ?

ఏమిది! యూరకున్నాఁడు. దూర మగుట వినఁబడ లేదేమో! చేరువకుఁ బోయి మరల నడిగెదను. (అంతలో)

గీతిక. స్ఫటికశిలాతలనిర్మలనిర్ఝర! బహువిధసురభిళసుమకృతశేఖర!
పటుతరకిన్నరగీతమనోహర! భామామణిఁ జూపుము ధరణీధర.

(సమీపించి యంజలిఘట్టి)

ఆ. వె. సర్వభాగ్యరేఖ! సర్వాంగసుందరి, రమ్య మైనయీయరణ్యమందుఁ
గానఁబడినదయ్య కలికి నా కెడఁబాసి, యేకతంబ సంచరించుచుండి?

(అదే ప్రతిధ్వని విని సంతోషముతో) ఏమిది! "కానఁబడినదయ్య" యని స్పష్టముగాఁ జూచినట్లు చెప్పుచున్నాఁడు. కానీ. ఇంకొక్కటి యడిగెదను. అయ్యా! యేమయిన దామె? (మరల నామాటనే విని) ఏమిది! మరల నే నన్నట్టే వినఁబడుచున్నది. (దిక్కులు చూచి దుఃఖముతో) అయ్యయ్యో! యివి నామాటలే. గుహాముఖమున మాఱు మ్రోఁగుచున్నవి. (మూర్ఛిల్లి లేచి కూరుచుండి విషాదముతో) అబ్బబ్బా! నాప్రాణము బహుసుఖపడుచున్నది! కొంచెము నే నీకొండవాఁగుదరిని గూరుచుండి తరంగములమీఁదనుండి వచ్చు చల్లగాలి ననుభవించెదను. (చూచి చూచి) ఓహో! క్రొత్త నీటివలనఁ గలఁకనొంది పాఱుచున్నయీయేఱు చూచుటచేత నాకానందము గలుగుచున్నది. ఏమనఁగా—

చ. అల లివి భ్రూవిలాసము లయారె! కలంగుపులుంగుఁజాలు గం
టలమొలనూలు, పైవిరిసినం దరిఁ జేర్చెడునుర్వు జాఱఁగా
లలి నసరించుచేల, కుటిలంపునడల్ మఱి తొట్రుఁబల్కులుం
గల నటుగానఁ గోపమునఁ గామిని యీనది యయ్యె రూఢిగా.

కానీ. దీనిని బతిమాలుకొని ప్రసన్నురాలిని జేసెదను.

గీతిక. అలుక యేటికే సుందరీ! ఝరీ! కలఁకఁ దేఱ రాదే?
కలికిమిన్న! నే నలికి నీపద కంజములకు మ్రొక్కెదఁగదే॥ అలు॥
చలితదీనవిహంగమకులా! లలితఝుంకృతి భృంగసంకులా!
కలితజాహ్నవీతీరతత్పర కమనీయతరంగభాసురా ॥అలు॥

(మరల)

గీతిక. జలధివిభుఁడు సలలితముగ నృత్యము సలుపఁ దొడఁగె మిగులఁ
దోలుకరిజలఖగములు మద్దెళములు తోయఘట్టనల హస్తతాళములు
తూర్పుగాలి కెగసెడునల లనుచే తులను జాఁచి, మురువు
గూర్పఁ జక్రిచక్రాంగశంఖకుంకుమకృతాభరణుఁడై యచ్చెరువు॥జల॥

(మోఁకాళ్లూని యంజలిపట్టి)

ఉ. మానిని! నీయెడన్ మిగుల మక్కువ గల్గినవాని, నిందు కం
ఠైనను నప్రియం బెప్పుడు నాడనివానిని, నీకు దెమ్మెకిన్
హాని ఘటిల్లు నన్నుఁ గలఁ గైన సహింపక యుండువాని, నే
డే నపరాధలేశ మెఱు గెంచక దాసుని నన్నుఁ బాసితే?

ఏమిది! యూరకున్నది! అయిన నిది యూర్వశి? గాదు; నిజముగా నదియే. ఊర్వశియే యయినయెడలఁ బురూరవసుని నన్నిట్లు లవవిపాలు చేసి తాను స్వేచ్ఛను సముద్రాభిసారిణి యగునా? కాని. దైన్యము దేనసే మేలు చేకూరదు. ఇంక నిక్కడ లేచి నాప్రియురాలు మాయ మయిపోటికే పోయెనను. (పరిచి చూచి) ఇదిగో! నీ కూయుచున్న సారంగమును గూడ నాప్రియురాలి వృత్తాంతము నడిగెదను.

గీతిక. మదకలకోకిలకూజితమధురిత మంజులఝుంకారారాతిమనోహర
త్రిదశాధిపనందనవనసమంబునఁ దేనె చిందుపూగుత్తులపొందునఁ
బోదలునొకానొకభూజముపొంతను బొలఁతి మన్న నెపంబాసినచింతను
మదిఁ బొగులుదు నైరావత మనియెదు మదమాతంగం బిది కరిమ్మరియెదు॥మద॥

(నృత్యము చేసి మోఁకాళ్లూని)

తే. గీ. వానకాఱుఁ జూడ వాంఛామదనలక్ష్మి, ఘర్ఘరకటాక్షపాత మనఁగ,
నీలచిత్రోన్నతియకాయంబున, రంగు మీఱు సీకరంగ మాగ!

ఏమిది! నన్నవమానించుదానివలె నీయిత్తి మొగ మటు దిప్పుకొన్నది! ఓహో యటుగాదు.

ఆ. వె. తన్నుఁ జేర రాఁగ దారిఁ జూ ల్గుకుపుమ, నెంటఁ బడినదిన్ని చంటె నిను వుఁ
బులిమి పుచ్చ లేక నిలుచున్నవృగెనరక, మెడను బెస మగోచ్చ మృగము కూడు.

ద్వి. కటిభాగమున మందగమనంబు దాని, బటు స్తైనయుజిగుబ్బపాలింప్లదాని
వలపించునిందువదన్వాన మున్న దానిఁ, బలుదనితనువల్లి భాసిల్లుదానిఁ
గలహంసలకు నడకలు దిద్దుదాని, సులలితం బగులేఁతమూపులదాని
నీకానుటూషనిలో నేగఁడుదాని, లోకసుందరిని నాలోకించితేని
హరిణమా! యావేళ్ళు పటిపఁ జూపింపు, విరహాబ్ధిముంచిన నన్నుద్ధరింపు.

(సమీపించి యంజలిపట్టి) ఓయీ హరిణయూధనాథ!

ఆ. వె. మూఁదివాపటుఖ్య సుదతిని గానవో, నాలకింపు మావవాలు సతికిఁ;
బెద్దకనులతోడఁ బేర్మి నీప్రియురాలు, చూచునట్లె చూచు సుందరియును.

ఏమిది! నామాట వినిపించుకోక తనపనిత నే చూచుచున్నది. అవురా! యవస్థ తప్పినప్పు డవమానమే తటస్థించును గదా! కానీ. మఱియొకచోటికిఁ బోయెదను. (నడచిచూచి) ఇదిగో! నామార్గమున కానవాలు.

ఉ. ఆనుమగాత్రి నేను గనినప్పటిరక్తకదంబకం బిదే;
వేసఁగిపోక దెబ్బనగవిచ్చినకేసరపాళి నెమ్చక
గ్గాసమయంబు నందె ప్రియురాలు పదాంగుళి నిల్చి దీనిపు
వ్వాసను గోసి యొక్కటి శిఖాభరణంబునుగా ధరించెఁగా.

ఓహో! యీశిలాలయిఅకునఁ గట్టియనయి కానఁబడుచున్నది, ఇది యేమి యయి యుండును?

ఉ. సింగము గోళ్ల నేనుఁగును జెంపినమాంసపుముక్క గాదుగా?
యింగలపుంగణంబో! యిది యెట్లు వనంబున నాన మోదనే!
మంగళరక్తనంజుళిసుమస్తబకారుణగత్న మిద్ది; దీ
నిం గొనుభంగిఁ జేతులను నీరజమిత్రుఁడు సాఁచు దీనిపై.

ఓహో! యిది నామనస్సును హరించుచున్నది. దీనిని బుచ్చుకొనియెదను.

(అంతలో)

।తిక. ప్రియయినిబద్ధాశాద్రిత మై బాష్పాకులలోచనయుతమై
పనమునఁ జను మపకరి నగల వదనము వసివాఁడఁగ మిగుల॥

(పుచ్చుకొని రనలో) దీన నేమిలాభము?

క. మందారకుసుమవాసన, నందం బగుమగువసిగకు నర్హం బిది; య
య్యిందుముఖి యిప్పుడు దుర్లభ; యెందుకుఁ గన్నీళ్ల దీని నేఁ దడుపవలెన్?
(నడలిపెట్టుచున్నాఁడు.) (తెరలో) వత్సా! పుచ్చుకో పుచ్చుకో.

క. ఇను మిది సంగమనీయం, బనురతనము; పార్వతీపదాంబుజరాగం
బున సంభవించినది; యిది, గొని తాల్చినఁ బాయువారిఁ గూర్చును సరగన్.

రాజా—(పైకిఁజూచి) ఇట్లు నన్నాజ్ఞాపించువా రెవరో! (దిక్కులుచూచి)

ఓహో! పార్వతీపతి న న్ననుగ్రహించుచున్నాఁడు. దేవా! మహాప్రసాదము (మణిని బుచ్చుకొని) ఓహో! సంగమనీయమా!

క. ఘనమున నెడఁ బాసినవా, తనుమధ్యను నన్నుఁ గూర్చుదానవ యేనిన్
నిను నేను మౌళిఁ దాల్చెదఁ, దనరెల లేనెలను శివుఁడు దాల్చినలీలన్.

(నడచి చూచి) ఓహో! యేమిది! పుష్పములు లేకున్నను నీమల్లెతీఁగను జూచుట వలన నాకు మహానురాగము పొడముచున్నది. అయిన నిది నాకు మనోహర మగుట యుక్తమే, ఏమనఁగా నీలేఁదీఁగ—

ఉ. వానను నానుతేఁటిగుము బాష్పజలంబునఁ దోఁగు మోవిగా,
స్వాభుగుణచ్యుతిం గనతి లతాంతము లన్నగల్ దొలంగి, యిం
పొసఁగపాటు లేమి ఘన నమ్యోను మౌనముఁ దాల్చ, సంప్రతి లేఁ
బూనినఁ దోఁచి వెన్క వెతఁ బొందెడుకోపనవోలెఁ దోఁచెడున్.

నాప్రియురాలిని బోలుచున్న యీతీఁగను నే నాలింగనపూర్వకముగా గౌరవించెదను.

ద్వి. ఓలతకూన! న న్నొకమారు గనుము, వీడ్రిలినగుండెతో వెత నొందు చుంటి;
విధియోగమున నేను విరిఁబోణిఁ గనిన, నధికంబుగా నింక నడవిలోఁ దిరుగ;
నది గాక నాకుఁ బ్రాణాంతకి యైన, సుదతి నెప్పుడు దేను జూమ్మి యిచ్చటికి.

(సమీపించి లతను గౌఁగిలించుకొనుచున్నాఁడు. తరువాతఁ దదీయస్థానమాక్రమించి యుర్వశి ప్రవేశించుచున్నది.)

రాజు—(కన్నులు మూసికొని స్పర్శసుఖము నిరూపించి) ఆహాహా! యుర్వశి శరీరము సోఁకినట్లే నాశరీరము హాయి నొందుచున్నది. అయిన నామెయే యనునమ్మకము మాత్రము నాకు లేదు.

సుగంధి. మించుబోణి యందు నాస మీఱ ముందు నే సము
ద్రించుతీఁగ మాఱి పోయె నింతలోనె కాన నా
చంచలాక్షియే యటంచు స్పర్శదృష్టి నిష్ఠ భా
వించు నేను వేగిరించి విప్ప రాదు కన్నులన్.

(క్షణ ముండి మెల్లమెల్లగాఁ గన్నులు దెఱచి) ఏమిది! నిజముగాఁ బ్రియురాలే. (మూర్ఛిల్లుచున్నాఁడు.)

రాజు—(తెలివినిబొంది) ప్రియురాలా! యిప్పుడుగదా బ్రతికితిని.

ఆ. వె. కోపశీలురాల! కోమలి! త్వద్వియోగ, మోహాంధకారమందు నడఁగు నేను
బుణ్యామునను మరలఁ బొందఁగాంచితి నిన్నుఁ, జేతనను మృతుండు చెందునట్లు.

ఊర్వ—దేవా! నన్ను నావేళఁ బాపపుఁగోప మావేశించి యట్లు గొనిపోవుటచేత దేవరవారి కింత యాయాసము సంభవించినది. స్వామీ! క్షమియింపుఁడు.

రాజు—ప్రియురాలా! నీవు నా కిప్పు డలుక దీర్ప నక్కఱలేదు. నిన్నుఁ జూచినంతమాత్రముచేతనే బాహ్యేంద్రియములతోఁ గూడ నాయంతరాత్మ ప్రసన్నమయినది. స న్నెడఁబాసి యింతకాలము నీ వెట్లు లుండఁ గలిగితివో చెప్పుము.

గీతిక. మయూరశిఖిమరాళీరథాంగముల్, మధుకరకరిగిరిసరిత్కురంగముల్
ప్రియురాల! నీమూలమున వేఁడఁగ జెఁజాల, భీకరాటవి నువ్వ్రేకిఁగుఱ్ఱాడువేళ

ఊర్వ—దేవా! నే నవాంతేంద్రియురాల నయి యేమియుఁ జేయలేకపోయితిని గాని, దేవరవారివృత్తాంత మంతయు నాయంతఃకరణమునకుఁ బ్రత్యక్షమగుచునే యుండెను.

రాజు—సుందరీ! "యవాంతేంద్రియురాలనయి" యను నీమాటభావమే మాకుఁ దెలియకున్నది.

ఊర్వ—దేవా! చిత్తగింపుము. పూర్వము మహానుభావుఁడు కుమారస్వామి శాశ్వత మయినకుమారవ్రతము నవలంబించి గంధమాదనవనమునందలియకలుష మనుకచ్ఛము నందుఁ బ్రవేశించి యుండి యచ్చోట నొక నియమము చేసెను.

రాజు—సుందరీ! యేమని?

ఊర్వ—ఆవనమున నేవనిత ప్రవేశించునో యది తీవియగా మారిపోవు ననియు, గౌరీచరణరాగసంభవ మయినసంగమనీయమణిలనఁ దక్క వేఱొక్కటి విమోచనము గలుగ దనియు. ఆదేవతానియమమునుమాట, నేను గురుశాపవశమున మూఢాత్మురాల నయి మఱచిపోయి, వనితాజనపరిహరణీయ మయినకుమారవనము ప్రవేశించితిని. ప్రవేశించిన తోడనే నారూప మీకాననోపాంతమున లతాకారమునఁ బరిణమించినది.

రాజు—ప్రియురాలా! యిది యంతయు సత్యమే.

తే. గీ. అలరువిలుకానిపనుల నే నలసి సొలసి, ప్రక్కనిదురింప మండఁ, బ్రవాసగతుని
గాఁ దలంచెదు దాన నోకలికిమిన్న! యీచిరవియోగ మెట్లు సహించినావొ.

సుందరీ! యిదిగో! నీవు చెప్పినట్లే భవదీయపునస్సంగమకారణ మయినదీనిని నే
నీశ్వరానుగ్రహమునఁ బొందితిని. (మణి చూపుచున్నాఁడు.)

ఉర్వ—ఏమీ! యాశ్చర్యము! ఇది సంగమనీయరత్నమా! అందుచేతనే గదా
యీమహారాజు కౌఁగిలించుకొన్నంతమాత్రముచేత లతాభావమును విడిచి ప్రకృతిరూప
మును బొందినాను. (నుదురు సోఁక మణికి మ్రొక్కుచున్నది)

రాజు—సుందరీ! నీవు క్షణమాత్ర మీలాగుననే యుండుము,

ఆ. వె. సుదతి! నీవు మణికి నుదురు సోఁకఁగ మ్రొక్క, నందుచేత దీనియరుణకాంతి
పర్వ, నీముఖంబు బాలసూర్యాతప, రక్తకమలసుందరత వహించె.

ఉర్వ—మహారాజా! దేవర పురము వెడలి వచ్చి పెద్దకాల మయినది గదా!
ప్రకృతివర్గమునకు నాయెడల నసూయ పుట్టును. కాఁబట్టి మన మింకఁ బట్టణమునకుఁ
బోవుదము.

రాజు—సుందరీ! నీయిష్టము.

ఉర్వ—దేవా! దేవరవా రిప్పు డేమార్గమున రాజధానికిఁ బోవలయు నని యభిల
షించుచున్నారు?

రాజు—సుందరీ!

పంచ. అమేఘకాంతిహృద్యవిద్యుదావళీపతాకమై
సమిద్ధమిశ్రవర్ణశక్రచాపచిత్రరూపమై
విమాన మట్లు లొప్పునీనవీననీరదంబుపై
గమింపఁ గోరుచుంటి నాదుకౌతుకంబు దీర్పవే.

గీతిక. ఎడఁబాసినసహచరిని గలసి మే నెలమిఁ బులకరింప
వెడలె రాజహంస విమానముపయి స్వేచ్ఛను విహరింప.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాదిసాధు
వంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్రహరితస
గోత్ర పవిత్రగుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల
సూరపరాజ ప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బ
రాయనామధేయాంధ్రీకృత మగువిక్ర
మోర్వశీయనాటకము చతుర్థాం
కము.

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

# విక్రమోర్వశీయము

## పంచమాంకము

[తరువాత సంతోషముతో విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ — ఓహో! యదృష్టవశమునఁ జిరకాలమునకు నాప్రియమిత్రుఁడు తనప్రియురాలయినయుర్వశితోఁ గూడ నందనవనము మొదలయినదేవతారణ్యములయందు విహరించి మగల వచ్చినాఁడు. ఇప్పుడు స్వకార్యానుశాసనమునఁ బ్రకృతిజనులను సంతోషపెట్టుచు రాజ్యము చేయుచున్నాఁడు గదా! ఇతనికిసంతానము లేదన్న దొక్కటియే గాని యింక నేమిలోపము? నేఁడు పర్వదినమని దేవీజనముతోఁ గూడ గంగాయమునా సంగమమున స్నానము చేసి, యిప్పుడే డేరాలోనికి వచ్చినాఁడు. ఇది యతఁ డలంకరించుకొనుసమయము గావున, నేను గూడ మంచిగంధము, పుష్పూలదండలు మొదలగున వి ధరించుకొని యాయనకుఁ దమ్మునివలె నుండెదను. (నడచుచున్నాఁడు) (తెరలో) అయ్యయ్యో! యీవిసనకఱ్ఱమీఁద నునిచి, దుకూలాంచలము పయిని గప్పి, పదిలముగాఁ గొనిపోవు చుండఁగా, దేవిగారిశిరోరత్నమును మాంసఖండ మనుకొని గద్ద యెగురఁదన్నుకొని పోయినది.

విదూ — (చెవియొగ్గి) హా! హా! యెంతకష్టము! అది నామిత్రునికిఁ బ్రేమాస్పదమయినసంగమనీయ మనుచూడామణి గదా! అందుచేతనే యతఁడు తనయలంకారరచన ముగియకుండఁగనే దిగ్గన నాసనమునుండి లేచి యిటు వచ్చుచున్నాఁడు. నే నాతని చెంతకుఁ బోయెదను. (నిష్క్రమించుచున్నాఁడు.) [ప్రవేశము]

[[illegible]పడుపరిజనముతో రాజు ప్రవేశించుచున్నాఁడు]

రాజు — రేచక! రేచక!

ఆ. వె. బ్రదుకుమీఁదియాస వదలుకొన్నట్టిదా, పక్షిదొంగ యెందుఁ బాఱిపోవు?
నెచట లేనిచౌర్య మింతకాలమునకుఁ, బ్రభువుగృహమునంద పక్షి చేసె.

కిరాతి — దేవా! మణి గ్రుచ్చిన హేమసూత్రమును దనముక్కుఁగొనతోఁ బట్టుకొని యాకసమునకు జాదు ప్రాయమున్నట్లు దిరుగుచున్నది.

రాజు — అదిగోఁ! జూచుచున్నాను.

తే. గీ. హేమసూత్రంబు ముక్కున నిఱికి గ్రద్ద, గిఱ్ఱుగిఱ్ఱున మండలాకృతిని దిరుగఁ
గొఱవి ద్రిప్పినలాగున గుండ్రముగను, జుట్టు మణిరాగరేఖ గన్పట్టుచుండె.

ఇప్పుడు చేయవలసిన దేమి?

విదూ — (సమీపించి) మిత్రుఁడా! కనికరింపకు. దీని కింత యాలోచన యేల? అపరాధి శిక్షార్హుఁడే గదా!

రాజు — ఓయీ! నీవు చక్కఁగఁ జెప్పితివి. ఏదీ విల్లు?

యవనిక — ఇదిగోఁ! గొనివచ్చెద దేవ! (నిష్క్రమించుచున్నది)

రాజు — ఏదీ! విహంగాధమము? కనఁబడుట లేదే!

విదూ — ఇదిగో! దక్షిణముగాఁ బాఱి పోవుచున్నది.

రాజు — (నడచి చూచి) ఔఁ గనఁబడుచున్నది.

పంచ. కరంబు డంబు మీఱు మానికంబుతో విహంగ మం
బరంబునందుఁ ద్రిమ్మరంగ భాసమాన మద్యశున్
హరిన్ముఖంబు శోకగుచ్ఛ మాడలన్ ధరించుచున్
దిరిన్, దదీయదర్శనీయదివ్యదీప్తి సంపదన్.

(విల్లు పట్టుకొని యవనిక ప్రవేశించి) దేవా! యివిగో! ధనుర్బాణములు.

రాజు — ఇంక నీవిల్లేల? ఆపాడుగద్ద బాణపథ మతిక్రమించి పోయినది. మాఁడు.

తే. గీ. పులుఁగు గడుదూరముగఁ గొనిపోవుకతన, మానికము మిన్కుమిన్కని కానఁబడెను
మబ్బుఁదెరలమఱుఁగున మాటు వడుచుఁ, గొంచె మగపడునంగారకుండు వోలె.

(కంచుకిని జూచి) లాతవ్య!

కంచు — దేవా! యాజ్ఞాపింపుఁడు.

రాజు — నీవు పోయి, సాయంకాల మీపక్షిదొంగను నివాసవృక్షమున వెదక వలసిన దని పౌరజనులతోఁ జెప్పుము.

కంచు — చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు)

విదూ — మిత్రుఁడా! నీవు విశ్రమింపుము. ఈమణికుంభీలకము నీయాజ్ఞను మీఱి యెక్కడికిఁ బోఁగలఁడు?

రాజు — (విదూషకునితోఁ గూడుకొని) వయస్యా!

తే. గీ. పతగ మెత్తుక పోయినరత్నమందుఁ, గడుప్రియము నాకు మణి యనికాదు సుమ్ము
సన్ను నాప్రియురాలితో మున్ను గూర్చి, నట్టిసంగమనీయ మయ్యాని వయస్య!

విదూ — మిత్రుఁడా! యౌను. నీవీవృత్తాంతము నాకు వెనుక నే చెప్పినాఁడవు.

[రాజనామాంకబాణముతోఁగూడ మణిని బట్టుకొని కంచుకి ప్రవేశించుచున్నాఁడు]

కంచు — (సమీపించి) దేవా! జయము జయము.

ఆ. వె. హరుఁ డాకృతిని ధరించినదేవర, నారివీర్యమహిమ లనఁ బక్షి
యొక్క ద్రిన్న పడియె నపరాధయోగ్యదండంబుఁ బొంది మణియుతంబుగాను.

(అందఱు నాశ్చర్యపడుచున్నారు.)

కంచు — దేవా! నీళ్ళతోఁ గడిగినయీమణి నెవరి కప్పగింతును?

రాజు — కిరాతీ! దీనిని గొనిపోయి నగలపెట్టెలో నుంపుము.

కిరాతి — దేవా! చిత్తము. (మణిని పుచ్చుకొని నిష్క్రమించుచున్నది.)

రాజు — లాతవ్యా! యీబాణ మెవనిదో యెఱుఁగుదువా?

కంచు — దేవా! దీనిమీఁదఁ బేరు చెక్కినట్లున్నది-గాని, నాచూపు సన్నపరిశీలనము చేయఁ జాలను.

రాజు — అట్టు లయిన బాణమిటు తీసికొనిరమ్ము; నేను జూచెదను.

కంచు — అట్లు చేయుచున్నాఁడు.

రాజు — (పేరు చూచి విచారించుచున్నాఁడు.)

కంచు — దేవా! దేవరనియోగమునఁ బ్రవర్తించెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

విదూ — మిత్రుఁడా! విచారించెద వేమి?

రాజు — ఓయీ! పక్షిని జంపినవాని పేరు వినుము.

విదూ — ఇదిగో! వినుచున్నాను.

రాజు — (చదువుచున్నాఁడు)

తే. గీ. ఊర్వశీగర్భశుక్తిసముద్భవుండు,
పుణ్యమూర్తి పురూరవుపుత్త్రకుండు
కడిఁది విలుకాఁడు పగఱ నుక్కడఁచువాఁడు
నయిన యాయుష్కుమారుని యాశుగంబు.

విదూ—ఇహీహీ! మిత్త్రుఁడా! నీ వదృష్టవంతుఁడవు. సంతానలాభమున వర్ధిల్లుచున్నావు.

రాజు—మిత్త్రుఁడా! యేమి యీ యాశ్చర్యము! నైమిశారణ్యమునఁ దక్క నే నుర్వశి నెప్పుడు నెడఁబాసి యుండలేదు. అప్పు డామెకు వేవిళ్లు లోనగు గర్భావిర్భావ చిహ్నము లేమియు నగపడలేదు. ఈకాను పెట్లు వచ్చెను? అయిన నొకప్పుడు-

క. నలుపెక్కిన చనుముక్కులు, సలలితలవలీదళంబుచాయ మొగము న
త్యలసాలసవీక్షణములుఁ, బొలఁతికిఁ గొన్నాళ్లు మేనఁ బొడకట్టె సఖా!

విదూ—మిత్త్రుఁడా! యివి మనుష్యస్త్రీధర్మములు. వీనిని దేవతాస్త్రీలయందు విచారింపకుము. వారలచరిత్త్రములు ప్రభావముచేత నిగూఢములుగ నుండును గదా!

రాజు—ఓయీ! సరే. అది నీవు చెప్పినయట్లే కానిమ్ము. మఱి యామె కుమారుని దాఁచుట కేమి కారణము.

విదూ—మిత్త్రుఁడా! మఱేమున్నది. ముసలి దయిన దని నీవు త్రోసివేయుదువే మోయని.

రాజు—చాలు నీపరిహాసము. ఆలోచింపుము.

విదూ—మిత్త్రుఁడా! దేవతారహస్యము లెవరు విచారింపఁగలరు?

(కంచుకి ప్రవేశించుచున్నాఁడు.)

కంచు—దేవా! జయము జయము! చ్యవనాశ్రమమునుండి యొకకుమారుని వెంటఁ బెట్టుకొని తాపసస్త్రీ వచ్చి హజారమున వేచి యున్నది. దేవరవారిదర్శనము గోరుచున్నది.

రాజు—ఇద్దఱను శీఘ్రముగాఁ దీసికొనిరా.

కంచు—చిత్తము. దేవా! (నిష్క్రమించి వారిని గొనివచ్చి) పూజ్యురాలా! యిట్టిటు. (అందఱు నడచుచున్నారు.)

విదూ—మిత్రుఁడా! యీపిల్లవాఁడు క్షత్రియకుమారుఁడుసుమీ. గృధ్రలక్ష్యభేది యయినబాణము నితనిదే కావచ్చును. బహుతరముగా నితఁడు నీపోలిక నున్నాఁడు.

రాజు—మిత్రుఁడా! యాలాగే కావచ్చును. అందుచేతనే

ఉ. ఈతనివంకఁ జూచుడును దృష్టికి బాష్పము లడ్డు వచ్చెడున్;
చేతము ప్రీతియుక్తమయి చెందెఁ బ్రసన్నత; లోనిధైర్యపుం
బాఁతును బెల్లగిల్లెను; జెమర్చుచు నిట్లు వడంకుచున్న నా
యాతను వంతతో నితని నే బిగికౌఁగిటఁ జేర్ప నెంచెదన్.

కంచు—అమ్మా! యక్కడ నిల్చుము.

తాపసి—(కుమారునితో నిలుచున్నది.)

రాజు—.(సమీపించి) పూజ్యురాలా! నమస్కరించుచున్నాను.

తాప—మహారాజ! చంద్రవంశనిస్తారకుండవు గమ్ము. (తనలో) ఓహో! రాజర్షి యయినయీపురూరవునకు నీయాయుష్కుమారుఁ డౌరసపుత్రుఁడని చెప్పకయే తెలియుచున్నది. (ప్రకాశముగా) బాలకా! మీతండ్రిగారికి నమస్కరింపుము.

కుమా—(చాపగర్భ మగుసంజలితో మ్రొక్కుచున్నాఁడు.)

రాజు—కుమార! యాయుష్మాన్ భవ.

కుమా—(స్పర్శమును నిరూపించి తనలో)

క. ఈయనకు సుతుఁడ నని నా, కీయన దండ్రి యని వినుట నింతగఁ బ్రేమం
బాయె; నిఁక నెప్డు డోడిలోఁ, బాయక పెరిఁగినను దండ్రిపయిఁ బ్రియ మెంతో.

రాజు—పూజ్యురాలా! నీరాకకుఁ గారణ మేమి?

తాప—మహారాజా! యాలకింపుము. ఆయుష్మంతుఁ డీయాయువు జననమొందినతోడనే, యేమినిమిత్తముననో యుర్వశి యీశిశువును నాచేతిలోఁ బెట్టినది. వీనికి క్షత్రియకుమారార్హము లయినజాతకర్మాదిసంస్కారములు మహాత్ముఁడు చ్యవనమహర్షి యథావిధిగ నాచరించినవాఁడు. అక్కడనే యిక్కుమారుఁడు వేదాధ్యయనము చేసి ధనుర్వేదము గూడఁ జక్కగ నభ్యసించినాఁడు.

రాజు—ఓహో! నే నాయనకారణమున సనాథుఁడ నయితిని గదా! తరువాతఁ దరువాత?

తాప—రాజా! యీతఁ డింతకుముందు పుష్పఫలసమిత్కుశాహరణార్థము ముని కుమారులతోఁగూడ వనంబున కేగి యచ్చోట నాశ్రమవాసులకు విరుద్ధ మయినయొక కార్యము చేసినాఁడు.

విదూ—(భయముతోడ) ఏమేమి?

తాప—గ్రద్ద యొకటి మాంసఖండము నోటఁ గఱచుకొని వృక్షాగ్రమునఁ గూరు చుండి యుండఁగా నీబాలుఁడు తనబాణమునకు దానిని గుఱి చేసినాఁడు.

విదూ—(రాజును జూచుచున్నాఁడు.)

తాప—తరువాత నమ్మహర్షి యీవృత్తాంతము తెలిసికొని "నీ కప్పగించినకుమారుని మరల నుర్వశి కప్పగించి ర" మ్మని నా కాజ్ఞాపించెను. మహారాజా! దేవి నుర్వశినిఁ జూడఁ గోరుచున్నాను.

రాజు—పూజ్యురాలా! యటు లయిన నీవు పీఠమును బరిగ్రహింపుము.

తాప—(పరిజనము తెచ్చినపీఠమునఁ గూరుచున్నది.)

రాజు—లాతవ్యా! యుర్వశిని బిలువుము.

కంచు—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—(కుమారునిఁ జూచి) రారమ్మ కుమార!

క. తనయస్పర్శము జనకున, కును సర్వాంగీణసుఖముఁ గూర్చును; దానన్
నను సంతసట్టుపెము వే, గను జందునికరము చంద్రకాంతముఁ బోలెన్.

తాప—కుమారా! తండ్రిని సంతోషపఱుపుము.

కుమా—(రాజును జేరుచున్నాఁడు)

రాజు—(కుమారునిఁ గౌఁగిలించుకొని) కుమారా! నీతండ్రికిఁ బ్రియమిత్రుఁ డయినయీబ్రాహ్మణునికి నిశ్శంకముగా నమస్కరింపుము.

విదూ—ఏమి? శంక యేమిటికు? తపోవనమున నివసించుటచేత నీతనికిఁ గోఁతులతోఁ జాలఁగఁ బరిచయమే గదా!

కుమా—(చిఱునవ్వుతో) అయ్యా! నమస్కరించుచున్నాను.

విదూ—స్వస్తి భవతే, వర్ధతాం భవాన్.

(తరువాత నుర్వశియుఁ గంచుకియుఁ బ్రవేశించుచున్నారు)

కంచు— దేవీ! యిటిటు.

ఊర్వ — (కుమారునిఁ జూచి) ధనుష్పాణి యయిన యీకుమారుఁ డెవఁడు చెపుమా ? మహారాజీతనిఁ దనపీఠమునఁ గూరుచుండఁ బెట్టుకొని ప్రేమతోడఁ జుంచు దువ్వుచున్నాఁడు. (తాపసిని జూచి) ఓహో ! సత్యవతిని జూచుటచేత నిప్పుడు జ్ఞప్తికి వచ్చినది. ఇతఁడు నాకుమారుఁ డయిన యాయువు. ఓహో ! పెద్దవాఁ డయినాఁడు.

రాజు — (ఊర్వశిని జూపి) నాయనా ! కుమార !

ఆ. వె. పుట్టెఁ డాసతోడఁ బుత్రకు నినుఁ జూడఁ, గోరి నీదుతల్లి చేరవచ్చెఁ
జెప్ప నలవి గానిస్నేహంబుకతనఁ బా, ల్సేఁపు వచ్చి రవిక చినిఁగి పోవ.

తాప — నాయనా ! మీతల్లి కెదురు వోవుదము రమ్ము. (అట్లు చేయుచున్నది.)

ఊర్వ — అమ్మా ! నీకుఁ బాదాభివందనము సేయుచున్నాను.

తాప — కుమారీ ! భర్తృబహుమానము వడయుదువు గాక.

కుమా — అమ్మా ! నమస్కరించుచున్నాను.

ఊర్వ — (కొడుకును జేతులతో నెత్తి కౌఁగిలించుకొని) తండ్రీ ! పితృసమారాధన తత్పరుండవు గమ్ము (రాజును సమీపించి) జయము జయము మహారాజ !

రాజు — పుత్రవతీ ! కుశలమా ? ఇటు రమ్ము. (అర్ధాసన మిచ్చుచున్నాఁడు)

ఊర్వ — దేవా ! యందఱమును గూరుచుందము. (అట్లు చేయుచున్నారు.)

తాప — అమ్మాయీ ! నీకుమారుఁ డయిన యీయాయువు విప్పుడు విద్య లెల్ల నభ్యసించి కవచధారణవయస్కుం డయినవాఁడు. కాఁబట్టి నాచేతిలోఁ బెట్టినయాతని నీ పెనిమిటిసమక్షమున నీ కప్పగించితిని. నే నిట నాలస్యము చేసిన నాశ్రమధర్మములకు విరోధము వాటిల్లును. నన్ను శీఘ్రముగాఁ బంపుము.

ఊర్వ — అమ్మా ! నిన్నుఁ జూచి చిరకాల మయినది. అందుచేత నీ విప్పుడే పోయెద వన్న నాకు విచార మగుచున్నది. అయిన నాశ్రమధర్మమునకు విరోధము గలిగింపఁ రాదు. కావున నీపోకడకు సమ్మతింపవలసె. పునర్దర్శన మిమ్ము.

రాజు — పూజ్యురాలా ! చ్యవనునకు నానమస్కారము దెలుపుము.

తాప — అట్లే తెలిపెదను.

కుమా — అవ్వా ! నీవు వెళ్లెదవేని నన్నుఁ గూడ నాశ్రమమునకుఁ దీసికొని పో.

రాజు — కుమార ! నీవు పూర్వాశ్రమము నచటఁ గడపితివి. ఇది ద్వితీయాశ్రమానుష్ఠానమునకు సమయము గదా!

తాప—నాయనా! మీతండ్రిగారిమాటచొప్పున నుండుము.

కుమా—అవ్వా! మఱి యాలాగయిన—

తే. గీ. నేను జనపించె మల్లన నిమురు చుండ, హాయిగా నెప్పు డొడిలోన నాద మఱచి
కన్ను మూసెడునామణికంఠరుచిర, మైన పెంపుడునెమిలి నా కంప వలయు.

తాప—నాయనా! నీ కాలాగే పంపెదనోయి. మీ కందఱకు శుభ మగుఁగాక.

దంపతులు—పూజ్యురాలా! నమస్కరించుచున్నాము.

తాప—భద్ర మగుఁగాక. (నిష్క్రమించుచున్నది)

రాజు—(ఊర్వశిని జూచి) సుందరీ!

ఆ. వె. నేను బుత్రవంతు లైనవారలలోన, మొదటివాఁడ నీసుపుత్రువలన
వలశచీతనూజుఁ డైనజయంతుని, వలన దివిజలోకభర్త వోలె.

ఊర్వ—(తలఁచుకొని యేడ్చుచున్నది)

రాజు—(తొట్రు పడుచు)

చ. లలనరో! నాదువంశము నిలంబడె నంచు మహాప్రమోదవీ
చుల నిటు లోల లాడుతఱిఁ జోద్యము నీవు మదీయసన్నిధిన్
జలజల రాలుబాష్పకణజాలముచేతను నీపయోధరం
బులఁ బునరుక్త మౌనటులు ముత్తెపుఁబేరులు దాల్చె దేటికిన్?

(ఆమె కన్నీళ్ళను దుడుచుచున్నాఁడు)

ఊర్వ—దేవా! చిత్తగించి యాలకింపుము. మొదట నేను బుత్రునిఁ జూచిన సంతోషమునఁ బరాకుపడితిని గాని, యిప్పుడు దేవరవారు ప్రస్తావవశమున దేవేంద్రుని మాట దలపెట్టుటచేత నాకు జ్ఞప్తికి వచ్చినది.

రాజు—దేవీ! యది యేమి?

ఊర్వ—ప్రాణవల్లభ! పూర్వము నేను మీయందు మనసు దగిలియుండఁగా, మహేంద్రుఁడు నా కిట్టు లాజ్ఞాపించినాఁడు.

రాజు—దేవీ! యే మని?

ఊర్వ—మహారాజా! చిత్తగింపుము. అప్పు డామహేంద్రుఁడు నన్నుఁ జూచి "యూర్వశీ! నీయందుఁ దనకు వంశాంకురముగా నుద్భవించెడుకుమారుని మొగ మారాజేంద్రుఁడు చూచినతోడనే నీవు మరల నాయొద్దకు రావలయు" నని యానతిచ్చెను.

అందుకతన నేను దేవరవియోగమున కోర్వలేక, యీబిడ్డనికి విద్యాభ్యాసము కూడ నావశ్యకమే కదా యని, జనన మయినతోడనే దేవరకంటఁ బడకుండ నీకుమారుని, వదలలేక వదలలేక, కడుప్రయాసమునఁజ్యవనాశ్రమమందుఁ బూజ్యురాలయినయీసత్యవతి చేతిలోఁ బెట్టి వచ్చితిని. ఆమెయుఁ బిత్రుసమారాధనసమర్థ మయినయీడు వచ్చినదని యాలోచించి దీర్ఘాయు వయినయీయాయువును నాకు మరల నప్పగించి పోయినది. కాఁబట్టి దేవా! తమతోడిసాంగత్యము నా కింతమట్టువకే. ఇంక మీఁద ఋణము లేదు.

రాజు—(మూర్ఛిల్లుచున్నాఁడు)

ఊర్వ—మహారాజా! యూఱడిల్లు మూఱడిల్లుము.

విదూ—అయ్యయ్యో! యేమిగతి యేమిగతి!

రాజు—(ఊఱడిల్లి నిట్టూర్పుపుచ్చి) అన్నా! దైవ మెంతమే లోర్వ దాయెను. (ఊర్వశి జూచి)

చ. కొడుకుమొగంబుఁ జూచి మదిఁ గుందక యాఁటఁ జెంది యుండఁగాఁ
బడఁతుక! నీవియోగ మనివార్యత నిప్పుడ సంభవించెఁగా;
మిడిమిడిగ్రీష్మతాపము శమింప నవాంబుదవృష్టిఁ గాంచి యొ
ప్పెడుతఱిఁ జెట్టుపైఁ బిడుగు భీకరభంగిని బడ్డకైవడిన్.

విదూ—దేవా! యీశుభము ననర్థావహమునుగా నేను దలఁచుచున్నాను. నీవింక నారచీరలను గట్టుకొని యరణ్యమున కరుగవలయును.

ఊర్వ—మహారాజా! నేను మందభాగ్యురాలను, విద్యావినయసంపన్నుఁ డయిన కుమారునిముద్దుముచ్చటలు చూడకయే స్వర్గలోకమునకుఁ బోవలసినదాన నయినాను. నన్నూఱడింపుఁడు.

రాజు—సుందరీ! నీ వీలాగున విచారింపఁ గూడదు,

చ. పరులయధీన మౌబ్రతుకువారికి వింత లటే వియోగముల్?
జరుపఁ దరంబె వారికి నిజప్రియముల్? నిలు మింద్రునానతిన్;
దరుణిరొ! నేను నీధరణిఁ దావకపుత్రుకుఁ గైనయాయువం
ధ్రుమతి నిల్పి పోదు మృగయాధళరణ్యా కరణ్యభూమికిన్.

కుమా—నాయనగారూ! మహావృషభముపయి వేయవలసినభారము లేఁగదూడ మీఁద వేయఁ జూతురా?

రాజు—(కుమారుని దువ్వుచు) నాయనా! యాలాగునఁ గానోయి.

చ. కలభమె యయ్యు నోర్చెడును గంధగజం బితరంబు లైనకుం
భుల, మతి కోడెతాఁచుపసముం బరికింప నుదగ్రవేగమే!
యిలఁ బరిపాలనంబు నొనరించును బాలకుఁ డయ్యుఁ గ్షత్రియుం
డలతమజాతి గాక వయసా నిజకార్యభరోద్వహం బగుణే?

లాతవ్య! కుమారుఁ డయినయాయువునకు రాజ్యాభిషేకోపకరణములు సమకూర్పవలయు నని మాయానతిగా మంత్రివర్గముతోఁ జెప్పుము.

కంచు—చిత్తము దేవా! (దుఃఖముతో నిష్క్రమించుచున్నాఁడు)

అందఱు—(దృష్టిప్రతిబంధము నభినయించుచున్నారు.)

రాజు—(పైకిఁ జూచి) ఏమిది! మబ్బు లేనియాకసమున మెఱపు మెఱయుచున్నది.

ఊర్వ—ఓహో! భగవానుఁడు నారదుఁడు.

రాజు—(నిపుణముగాఁ జూచి) ఔ నీమహానుభావుఁడు నారదుఁడే.

చ. మకమక లేనిచంద్రకళమాదిరి జన్నిదముల్ దనర్పఁ, గో
రకములఁ గేరుముత్తెపుసరంబు లురంబున వ్రేల, రోచనా
నికషపిశంగవర్ణ కమనీయజటాపటలంబుతో మనో
జ్ఞకకనకప్రరోహ మగుజంగమకల్పనగంబుఁ బోలెడుణ్.

దేవీ! యీయన కర్ఘ్యము గొనిరమ్ము.

ఊర్వ—(అట్లు చేసి) ఇదిగో! మహర్షి కర్ఘ్యము.

[తరువాత నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

నార—విజయతామ్ మధ్యమలోకపాలః.

రాజు—(ఊర్వశిచేతనుండి యర్ఘ్యము పుచ్చుకొని) మహాత్మా! నమస్కరించుచున్నాను.

ఊర్వ—మునీంద్రా! వందనము చేయుచున్నాను.

నార—అవిరహితౌ దంపతీ భూయాస్తామ్.

రాజు—(తనలో) ఈయనయాశీర్వాదమహిమచేత మాకు వియోగము గాకుం

డునా? (కుమారునిఁ గౌఁగిలించుకొని ప్రకాశముగా) కుమార! మునీంద్రునకు నమస్కరింపుము.

కుమా—(మ్రొక్కుచున్నాఁడు.)

నార—దీర్ఘాయుష్మాన్.

రాజు—స్వామీ! మీ రీయాసనమున దయచేయుఁడు.

(నారదుఁడు కూరుచున్నాఁడు. అందఱు నాయన ననుసరించి కూరుచున్నారు)

నార—రాజా! మహేంద్రునిసందేశ మాలకింపుము.

రాజు—స్వామీ! సావధానుఁడఁగా నున్నాను.

నార—రాజా! వినుము. ప్రభావముచేత నింద్రుఁడు సర్వము నెఱింగినవాఁడై తపోవనంబునకుఁ బోవఁ గృతనిశ్చయుఁడ వయియున్ననీ కాయన యిట్టు లాజ్ఞాపించుచున్నాఁడు.

రాజు—స్వామీ! యామహామహునియాజ్ఞ యేమి?

నార—రాజా! భావికాలమున దేవాసురులకు యుద్ధము కాఁగల దని త్రికాలవేదు లయినమహర్షులవలన నాతఁడు దెలిసికొని, యాయుద్ధమున నీసాహాయ్య మావశ్యకము కావున, నీ వస్త్రసన్న్యాసము చేయవల దనియు యావజ్జీవము నీ కీయుర్వశి సహధర్మచారిణి యయి యుండెడు ననియు సెల విచ్చినాఁడు.

ఊర్వ—అమ్మయ్యా! యిప్పుడు నాహృదయశల్య మూడఁ బెఱికినట్లే యున్నది.

రాజు—స్వామీ! మహానుగ్రహము. నేను మహేంద్రున కాజ్ఞానువర్తి నేగదా!

నార—రాజా! యది యుక్తమే.

క. నీయిష్టము దేవేంద్రుం, డాయనయిష్టంబు నీవు ననుకూలముగాఁ
జేయుదురు సూర్యుఁ డనలుని, నాయనలుఁడు సూర్యుఁ బ్రోచున ట్లెల్లపుడున్.

(ఆకాశము వంకఁ జూచి) రంభా! కుమారుఁ డయినయాయువునకు యౌవరాజ్యాభిషేకార్థము తానుగ దేవేంద్రుఁడు సిద్ధపఱిచినసంభారములు దీసికొనిరా,

రంభ—(ఆవిర్భావముగాఁ బ్రవేశించుచున్నది)

రంభ—ఇవిగో! నభిషేకసంభారములు.

నార—ఈయాయుష్మంతుని భద్రసింహాసనమునఁ గూరుచుండఁ బెట్టుము.

రంభ—కుమారా! యిటు రమ్ము. (కుమారుని భద్రాసనమునఁ గూర్చుండఁ బెట్టుచున్నది.)

నార—(కుమారుని శిరస్సునఁ గలశము నుంచి) రంభా! యీతనికిఁ బట్టాభిషేకవిధిని నిర్వర్తింపుము.

రంభ—(యథోక్తముగా నిర్వర్తించి) కుమారా! మహర్షికిని నీతల్లిదండ్రులకును నమస్కరింపుము.

కుమా—(యథాక్రమముగా నమస్కరించుచున్నాఁడు.)

నార—స్వస్తి భవతే.

రాజు—కులసుసంధనో భవ.

ఊర్వ—నాయనా! మీతండ్రిగారిదీవన ఫలించుఁ గాక.

(తెరలో నిద్దఱు వైతాళికులు)

ప్రథముఁడు—జయము జయము యువరాజ!

చ. జలరుహగర్భు నాయమరసంయమి యత్రియుఁ బోలె, నత్రి నా
కలువలరాయఁడుం బలెను, గల్వలరాయని దక్షునందనుం
బలె, బుధు నీమహాప్రభువు భాతిని, లోకమనోజ్ఞసద్గుణా
వళులను దండ్రిఁ బోలుము; భవత్కుల మెల్లను బొందు దీవనల్.

ద్వితీ—

చ. అవనిపచక్రి! యుక్తములయందు మహోన్నతి నుర్వి యేలునీ
జనకు నకంపసత్త్వగుణశాలిని నిన్నును జేరి, యిప్పు డీ
ఘనతరరాజ్యలక్ష్మి యధికంబుగ శోభ వహించె మంచుఁ గొం
డచు జలధిన్ విభక్తసలిలం బగుచుం దగుగంగ వైనడిన్.

రంభ—(ఊర్వశిని జూచి) సఖీ! నీ వదృష్టవంతురాలవు. భర్తృగృహంబునకుఁ దలఁగి పుత్రునియౌవరాజ్యమహిమచేత వర్ధిల్లుచున్నావు.

ఊర్వ—చెలియా! యీమహోత్సవము మన కందఱకు సమానమే గదా!

రంభ—(కుమారునిచేయి పట్టుకొని) అబ్బాయీ! మీ పెదతల్లిగారికి నమస్కరింతువు గాని రమ్ము.

కుమా—(లేవఁబోవుచున్నాఁడు)

రాజు—ఉండు. మన మంపుజముఁ గూడ నామెయొద్దకుఁ బోవుదము.

నారద—ఇదిగో! నిప్పుడు—

ఆ. వె. అధిప! నీకుమారుఁ డైనయాయువు యశాన, రాజ్యలక్ష్మిఁ జూచి పూజ్యదేవ
సేన కెల్ల నింద్రుచే నభిషిక్తుఁడై, యాలరునలకూబరుఁ బలుచు చుంటి.

రాజు—మహేంద్రునిచే ననుగ్రహింపఁ బడితిని.

నారద—రాజా! నీ కింక దేవేంద్రుఁడు చేయ వలసినప్రియం బేమి?

రాజు—స్వామీ! యాయన ప్రసన్నుఁ డగుటకంటెఁ బ్రియం బేమి? అయిన నిట్లగుఁ గాక.

చంప. పరస్పరంబు గిట్ట కొక్కపట్టు చేరనట్టిశ్రీ
సరస్వతుల్ స్వకీయ వైరశత్రుభావ మంతయున్
దిరస్కరించి యింకఁ దాము నెమ్మి సజ్జనాళిమం
దిరమ్ములం దిరమ్ముగాను నిల్చియుండ్రు గావుతన్.

మరియు—

క. ఎల్లరుఁ గడచుతఁ గష్టము
నెల్లరుఁ గళ్యాణములను వీక్షింతురు గా
కెల్లరు నష్టము లొందరు
మెల్లరు సర్వత్ర రహిఁ బహింతురు గాతన్.

ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర నద్దాదిసాధు
వంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్రహారితస
గోత్రపవిత్రగుణాకరదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల
సూరపరాజప్రధానతనూభవ విబుధవిధేయ సుబ్బ
రాయనామధేయాంధ్రీకృత మగువిక్ర
మోర్వశీయనాటకము పంచమాం
కము.

కాళిదాసునాటకములందుఁ దనమేఘసందేశపుఁబోలికలు పల్లు చోట్లఁ గనఁబఱచినాఁడు. మాదిరి కొక్కటి యుదాహరింపఁబడుచున్నది.

ద్వి. కటిభారమున మందగమనంబు దాని, బటువైనయిఱుగుబ్బపాలిండ్లదాని
వలపించునిండుజవ్వనమున్నదాని, బలుచనికౌనుపల్లి భాసిల్లుదానిఁ
గలహంసలకు నడకలు దిద్దుదాని, సులలితంబగులేడిచూపులదాని
నీకానుటవిలో నేగెడుదాని, లోకసుందరిని నాలోకించితేని
హరిణమా! యావేల్పుటతివఁ జూపింపు విరహాబ్ధినుండి నన్వెసనుద్ధరింపు.

విక్రమోర్వశీయము

సీ. పలుచనిమైదీఁగ బాగైనయెలనాఁగ యౌవనమధ్యస్థ యైనచాన
మొనలు దేరినదంతముల నొప్పుకలికి బింబాధరోష్ఠంబున నమరుతరుణి
నడచిన నసియాడునడుమున్న నా లోలబాలమృగీవిశాలనయన
గంభీరమైనచక్కనినాభిఁ దగునాతి కటిభరాలసగతుల్ గలుగుచెలువ

గీ. పలుఁదఁటుమీఱ యిఱుకునిబ్బరపుగుబ్బ
చనులవ్రేఁగున నించుక వంగిననెలంత
కంటఁబడు నంత నొకవాలుఁగంటి యచట
మొదట నలువ సృజించినముదిత యనఁగ.

మేఘసందేశము

ఇందు మూఁడవయంకములో దేవి యాచరించినవ్రత
యుమాతృతీయను స్త్రీలుఁ నోఁచునట్టియట్లతద్దెనోమో

శ్రీ

# భామినీవిలాసము.

ఇది

పండితరాజబిరుదాంకితుఁ డగుజగన్నాథకవిచే
విరచిత మయినసంస్కృతకావ్యమునుండి

రాజమహేంద్రవరమునందలిదొరతనమువారి
మొదటితరగతిబోధనాభ్యసనకలాశాలయందుఁ
బ్రధానాంధ్రోపాధ్యాయుఁ
డగు
వడ్డాదిసుబ్బారాయఁడు.
తెలిఁగించినది.

ఇందుఁ గరుణవిలాసమున నొకయనుబంధము కూడఁజేరియున్నది.

మొదటికూర్పు 1000

సత్తిరాజు శీతారామయ్యగారిచే
దేశోపకారిముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది
ఏలూరు.
1903


వెల రు0-10-0

# శుద్ధపత్రిక.

| పుట | బంతి | తప్పు | ఒప్పు | పుట | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 20 | దా)చు | దాఁచు | ,, | 23 | వెఁడ | వెడ |
| 3 | 4 | ముసుం | మసుం | 31 | 1 | గారినీర | గారనీర |
| 5 | 29 | సా; | సా | ,, | 11 | కన్యా | గన్యా |
| 6 | 25 | గిలి | గిల | 32 | 20 | యు | యి |
| 8 | 4 | చింత | చింతి | 33 | 6 | థుం | థుఁ |
| ,, | 27 | యుండె | యుండ | 35 | 11 | కక | కరి |
| 9 | 8 | త్తై | త్లై | ,, | 24 | బు | బులు |
| 10 | 18 | భవము | భము | 38 | 4 | చె | క |
| 12 | 22 | రొుడ | రొుడఁ | 40 | 8 | నల | నలె |
| 14 | 29 | ఘూ | ధూ | 41 | 14 | ష్యాం | ష్య |
| 15 | 29 | లను | నను | 43 | 15 | గుం | గుఁ |
| 16 | 3 | జెయిజాలెఁగు | గయిజాలెఁ | 44 | 13 | ? | ; |
| ,, | 7 | దాయు | దాయా | ,, | 27 | కుర్ | కుల్ |
| 18 | 10 | వధ | మధు | ,, | 28 | లిల్ | లిల్ |
| 19 | 20 | దక్షు | దక్షి | ,, | ,, | వ్వి | ద్వి |
| ,, | 21 | నేనుసటందుఁదలపృశ్విని | నేననిరొు | 45 | 26 | చు | చుం |
| ,, | 28 | తది | దిత | 46 | 15 | దుఃఖ | కష్ట |
| 21 | 6 | యు॥ | యుత | 48 | 7* | బు | పు |
| ,, | 13 | స్థ | స్థ | ,, | 9 | లో | లో |
| 24 | 30 | ష్మి | ష్మిఁ | ,, | 10 | మునం | ము |
| 25 | 12 | మఁ | ము! | ,, | 23 | శాంతి | శ్యాంత్య |
| ,, | 19 | ష్ఫ | ష్ప | 52 | 9 | క్రా | వ్రా |
| ,, | 25 | ము, | ముఁ | 54 | 18 | మంధు | మందు |
| 26 | 20 | బాశి | బ్యాశి | 55 | 9 | లియ్య | లియ్యె |
| 28 | 2 | ల్లైదు | ల్లైదుఁ | ,, | ,, | మధు | మను |
| ,, | 15 | ము? | ము, | ,, | 13 | బుల్లను | బుల్లును |
| ,, | 18 | ధ | థ | ,, | 14 | నాటి | నాఁటి |
| 30 | 22 | బ్ర | బ్ర | ,, | 18 | ండు | ఁడు |
|  |  |  |  | ,, | 19 | ండా | ఁడా |

## పీఠికలోనివి.

| పే | బంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | 8 | వల | వలి |
| | 9 | యరూ | మురూ |
| | 20 | సస్త్రా | సిమ్త్రా |
| | 24 | యిక | యుక |
| | 18 | య్యి | యిన |
| | 18 | గ్రాంగ | గాంగి |
| | 15 | బునీతు | బవిత్రు |
| | 21 | ఫునీ | ఫూ |
| | 12 | త్రై | త్ర |
| | 21 | బంథ | బంధ |
| ,, | 22 | నౌకా | కౌకా |
| 8 | 20 | షట్శ్రీ | షట్ప్రా |
| 9 | 13 | దన్వ | దనన్వ |
| ,, | 23 | సినిరో | నిరో |
| 10 | 25 | తీత | తీప |
| 11 | 7 | తుజ్జ | త్రజ్జ |
| ,, | 17 | ఛ | భ |
| 13 | 8 | తార్థ | తాద్యర్థ |
| 14 | 10 | జ్ఞా | జ్జ్ఞా |
| ,, | ,, | పపం | ప్రపం |

శ్రీ

# భామినీవిలాసము

ఇది

పండితరాజ బిరుదాంకితుఁడగు జగన్నాథకవిచే

విరచిత మయిన సంస్కృతకావ్యము నుండి


రాజమహేంద్రవరము నందలి దొరతనము వారి

మొదటి తరగతి బోధనాభ్యసన కళాశాలయందుఁ

బ్రథానాంధ్రోపాధ్యాయుఁడగు

వడ్డాది సుబ్బారాయుఁడు.


తెలిఁగించినది.

ఇందుఁ గరుణవిలాసమున నొక యనుబంధముకూడఁ జేరియున్నది.


మొదటి కూర్పు 1000

సత్తిరాజు సీతారామయ్యగారిచే

దేశోపకారి ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది

ఏలూరు.

1902





వెల రు0-10-0

## శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | ౨౦ | ద్రాము | ద్రాఁచు |
| ౩ | ౪ | ముసుం | మసుం |
| ౫ | ౨౯ | సా ; | సా |
| ౬ | ౨౫ | గిలి | గిల |
| ౭ | ౪ | చింత | చింతి |
| ,, | ౨౮ | దయుం డె | దయుండ |
| ౯ | ౭ | తె | తె |
| ౧౦ | ౧౩ | భవము | భము |
| ౧౨ | ౨౨ | యోఁడ | యుఁడఁ |
| ౧౪ | ౨౯ | ధూ | ధూ |
| ౧౫ | ౨౯ | లను | సను |
| ౧౬ | ౩ | చెయిబాఁటఁగు | గయిబాఁటెఁ |
| ,, | ౮ | దాయ | దాయా |
| ౧౭ | ౧౦ | మధ | మధు |
| ౧౯ | ౨౦ | దక్షు | దక్షి |
| ,, | ౨౪ | సేమనటంచుఁదల | పృథ్వినిసేననియె |
| ,, | ౨౭ | తది | దిత |
| ౨౦ | ౬ | యి॥ | యిన |
| ,, | ౧౩ | స్థ | స్థ |
| ౨౪ | ౩౦ | మ్రి | మ్రిఁ |
| ౨౫ | ౧౨ | మఁ | మ! |
| ,, | ౧౯ | ష్ఫ | ష్ప |
| ,, | ౨౫ | ము, | ముఁ |
| ౨౬ | ౨౦ | వాళి | వ్యాళి |
| ౨౭ | ౨ | లెదు | లెదుఁ |
| ,, | ౧౫ | ము ? | ము, |
| ,, | ౧౭ | థ | థ |
| ౩౦ | ౨౨ | బ్ర | బ్ర |
| ,, | ౨౩ | వెఁడ | వెడ |
| ౩౧ | ౧ | గారినీరు | గారునీరి |
| ,, | ౧౧ | కన్యా | గన్యా |
| ౩౨ | ౨౦ | యు | యి |
| ౩౩ | ౬ | తుం | తుఁ |
| ౩౫ | ౧౧ | కక | కరి |
| ,, | ౨౪ | బు | బులు |
| ౩౭ | ౪ | చె | క |
| ౪౩ | ౧౫ | గుం | గున్ |
| ౪౪ | ౧౩ | ? | ; |
| ,, | ౨౮ | లున్ | లుల్ |
| ౪౬ | ౧౫ | దుఃఖ | కష్ట |
| ౪౭ | ౮ | బు | పు |
| ,, | ౯ | లో | లో |
| ,, | ౨౦ | మును | ము |
| ,, | ౨౩ | శాంత | శాంత్య |
| ౫౪ | ౧౭ | మంఘు | మందు |
| ౫౫ | ౧౩ | బుల్లదు | బల్లిదు |
| ,, | ౧౪ | నాటి | నాఁటి |
| ,, | ౧౭ | ండు | ఁడు |
| ,, | ౧౯ | ండా | ఁడా |

# పీఠిక.

---

సంస్కృతకవులచరిత్రమును సరిగాఁ దెలియఁజాలుటకు గ్రంథము లేవియు లేవు. అయిన భామినీవిలాసకృతికర్తయగు జగన్నాథపండితుని కాలనిర్ణయాదుల నిశ్చయముగాఁ దెలిసికొని, యాయనజీవచారిత్రమునుగూర్చి యసంపూర్ణముగా నయిన విశ్వాసపాత్రమగు చరిత్రమును వ్రాయుట చదువరుల కొక్కింత సంతోషము గలుగఁజేయక పోదు. హిందూదేశమున బహువిషయములయందుఁ గల్పనాకథలెన్నియో యుత్పన్నములయి కాలక్రమమున దట్టముగా నల్లుకొని విజృంభించి, యొకానొకప్పు డెవ్వరేని నిజమయిన చారిత్రమును జెప్పినను దానియందు జనులకు నమ్మకము గుదురనీయనంత దృఢముగా వేళ్లుపాఱియున్నవి. ఇటీవల కాలములో ప్రసిద్ధిఁ బొందినజగన్నాథపండితుని చరిత్రముగూడ నట్టియసంగతపుఁగట్టుకథలకు బుట్టి నిల్లయినందున యథార్థ మురూపుమాసినది. అయినను దత్పండితవర్యునిచే వ్రాయఁబడినగ్రంథము లామూలాగ్రముగాఁ జదివి చూచితిమేని నిజమైన తచ్చారిత్రము గొంత సంపాదించుట దుర్లభము కాదు. జగన్నాథకవి గ్రంథరచనయందు విద్వద్బృందములో నెంతవన్నెకెక్కినను బాపమాయన విరచించినకబ్బములుమాత్ర మంతగాఁ బ్రఖ్యాతిఁబొందినవి కావు. అవి చదివినవారు కొందఱుమాత్రమే కలరు.

ఈపండితుని గుఱించి యనేకు లనేకవిధములుగాఁ గట్టుకథలను లోకమంతట వ్యాపింపఁ జేసిరి. సత్యాసత్యము లెట్లున్నను వినుటకు మాత్ర మవి మిక్కిలి మనోహరములు కాఁబట్టి యాయన జీవితమును గూర్చి చర్చింపక పూర్వ మాకథలయం దనేకులు చెప్పుకొను వాని నిట నుదాహరించుచున్నాఁడ.

(౧) జగన్నాథపండితుఁడు మిక్కిలి ప్రఖ్యాతికెక్కినవాఁడయి తనకుఁ గర్ణాటరాజ్యాధిపతులవలనఁ దగినంతసన్మానము కాని కతమున, విత్తార్జనమున కుత్తరహిందూస్థానమునకు వెళ్ళి జయపురపుసంస్థానమున ననేకపండితుల నోడించి యచ్చో శాస్త్రిపరిశ్రమమునకొఱ కొక్క క్రొత్తయేర్పాటు కావించెను. ఆకాలమందు డిల్లీసంస్థానమునుండి విస్తార శాస్త్రపరిచయము గలఖాజీ యొకఁడు హిందూదేశ మంతటను సంచరించి తాను వెళ్ళినప్రదేశములందెల్ల మతవిషయికవాదములు జరిపి విద్వాంసుల నోడించుచుఁ బ్రపంచమునందు మహమ్మదీయమతమే సత్యమతమని స్థాపించుచుండెను. ఈవార్త వినా-

దములను గూర్చియుఁ దత్కారణమున ననేకులగు హిందూపండితులు మత భ్రష్టులగు
చుండుటను గూర్చియు, మిగుల నాలోచించి జగన్నాథకవి కట్టి పట్టుదలతోఁ దానొ
కసంవత్సరములోపలఁ బారసీభాష ననర్గళముగా నేర్చుకొని మహమ్మదీయమతగ్రంథ
ములను జదివి యాఖాజీతోఁ బ్రసంగము చేసి తుట్టతుదకాతనిఁ దనహేతువాదము
చేత నోడించి మహమ్మదీయులమునఁ బుట్టినవారి కెట్లుండిన నుండెఁగాక యితరమత
ములవారి నాకర్షించుటకుఁ దగినవిశేషమేమియు నీమతమందు లేదని చెప్పి యప్పటి
ఢిల్లీచక్రవర్తిని మెప్పించెను. తన్మూలమున జగన్నాథపండితునియందు మహానుగ్ర
హము గలిగి చక్రవర్తి యాతనను దనయాస్థానవిద్వాంసునిఁగాఁ జేసికొనిరి.

(౨)ఆకాలమున నక్బరుచక్రవర్తికి రాజపుత్రస్త్రీయందుఁ గలిగినయధిక సౌందర్య
వతియగు లవంగిక యనునొక కూతుఁరు గలదు. ఆమె పరిపూర్ణతారుణ్య మనోహరురా
లయి తనకు సహజమన్మథ వికారము లంకురించునప్పుడొక్కనాఁడు, తన తండ్రియా
స్థానమందు నిరంకుశపాండిత్యప్రకర్షము గల మనోజ్ఞరూపయౌవనసంపన్నుండు జగ
న్నాథుఁడను మహాకవి యొక్కఁడున్నాఁడని యాలకించి తద్దర్శనలాభంబున నేత్రసా
ఫల్యంబు గావించుకొన వేచియుండఁ గొండొకనాఁడు దైవయోగంబున దనకోరిక నె
రవేఱెను. సుప్పాంగి లవంగిక పెండ్లియాడినఁ జగన్నాథకవినే పెండ్లియాడవలెను. లేదా
యవివాహితగా నుండవలెనని తనమనంబున నిశ్చయించుకొనెను. అట్టిచో నొక్క దినం
బున నక్బరుచక్రవర్తియు జగన్నాథకవియుఁ జదరంగము నాడుచుండఁ జక్రవర్తి దప్పి
గొన్నవాఁడయి పానీయము గొనితెమ్మని యానతీయ నత్తియఁబోఁడి జలపూర్ణ మయిన
బంగారుభృంగారువును శిరంబునందుంచుకొని మురిపంబునఁ దండ్రిచెంతకుఁ నేగుదెం
చెను. అప్పుడా చక్రవర్తి తనముందు చక్కఁదనమున సుప్పాంగి లవంగికను భృంగారుసహి
తముగా వర్ణింపు మనికోరిన జగన్నాథపండితుఁడు తోడనే యీక్రింది శ్లోకమును జదివి
నాఁడు.

శ్లో॥ ఇయం సుస్తనీమ స్తకన్యస్తకుంభా
కుసుంభారుణం చారుచేలం వసానా
సమస్తస్యలోకస్య చేతఃప్రవృత్తిం
గృహీత్వా ఘటేన్యస్య యాతీవ భాతి ॥

పంచా॥ బలే! కెంగుఁజంద్రకావిపావడం ధరించి యా
దలన్ గళంతికన్ వహించి డాయునిబ్బరంపుగు
బ్బలాడి యామె దోఁచుమానవప్రపంచచిత్తవృ
త్తులన్ హరించి దీననుంచి తోన కొంచుఁబోవు నాన్ ॥

ఇట్లు చదువఁగానే రసవంతమయిన యాయాశుకవనమునకు ఆనందపరవశుండయి చక్రవర్తి కవిం జూచి నీయిచ్ఛ వచ్చిన దద్ది యేమిఁ గోరు మిచ్చెద ననియెను. జగన్నాథకవి యందుమీఁద నాశుగతిని మరల నీక్రింది శ్లోకములఁ జదివినాఁడు.

శ్లో॥ నయాచే గజాలిం నవా వాజిరాజిం
నవిత్తేషు చిత్తం మదీయం కదాచిత్
ఇయం సుస్తనీ మస్తకన్యస్తకుంభా
లవంగి కురంగి దృగంగి కరోతు ॥

శ్లో॥ యవనీ నవనీతకోమలాంగీ । శయనీయే యది లభ్యతే కదాచిత్
అవనీతల మేవ సాధు మన్యే । నవనీ మాఘవనీ వినోదహేతుః ॥

భుజంగ॥ తురంగంబులం గోరఁ; దుంగేభసంఘా
ధ్వరం బొందఁ; యాచింప ద్రవ్యంబుఁ; జేత
స్ఫురంగీదృశం, గోడకుంభోత్తమాంగన్
వరింతున్ లవంగిన్ నవప్రాయభంగిన్ ॥

క॥ నవనీతమృదులతను నీ । యవనీమణి యున్న శయనమం దలనాకే
దవనీతలమే మేల్ ; మా । ఘవని వని వినోదహేతుకం బని తలఁపన్ ॥

అని పలుకఁగాఁ దాను స్వప్నమందయినఁ దలంచుకొనియిట్టివిపరీతపుఁ గోరిక కాచక్రవర్తి యద్భుతవిషాదగోచరుండయి తనవాగ్దానము దప్పలేక యప్పండితునితో నీవు మాతోఁ బాత్తున భుజించితివేని గవ్యనిత్తునని యుత్తరంబిచ్చెను. జగన్నాథకవి లవంగికయందలి మోహంపుఁ బారవశ్యంబున జాతిబహిష్కారణమున కయిన వెనుకఁదీయక చక్రవర్తితో సహపంక్తిని విందారగించెను.

(3) ఈపండితుఁడు డిల్లీచక్రవర్తియాస్థానమున నున్నకాలములో నేపాళమహారాజు తనసభయందు పండితుఁడుగా నుండుమని యాయన కొకజాబు వ్రాయఁగాఁ గవి దానికిఁ బ్రత్యుత్తరముగా నీక్రింది శ్లోకము లిఖియించి పంపెను.

శ్లో॥ దిల్లీశ్వరో వా జగదీశ్వరో వా
మనోరథాన్ పూరయితుం సమర్థః
అన్యైర్నృపాలైః పరిదీయమానం
శాకాయవా స్యాల్లవణాయ వా స్యాత్ ॥

క॥ కోరికలను బూరింపఁగ । వారొక డిల్లీశ్వరుండుఁ బరమేశ్వరుఁడే
భూరమణు లితరు లిడునది । కూరాకునకో వా యుప్పకొ సరిపోనో ॥

(౪) జగన్నాథపండితుఁ డొకనాఁడు శారదాదేవి నారాధింపఁగా నాదేవి ప్రత్యక్షంబయి యీక్రింది శ్లోకముచే నాయనను నాశీర్వదించినది.

శ్లో॥ ఆకురుదేశం విచరేః మాకురు పరవాదినిర్జయే శంకామ్
 స్వీకురు వరమేకం మే వ్యాకురు భో వత్స! శాస్త్రాణి ॥

కం॥ ఆకురుదేశము దిరుగుము; । లేఁకువ పరవాదినిర్జితిం బొరయకుము; నా
 యేకవరంబును జేకొను; । వ్యాకృతి గావింపు శాస్త్రఫణితికి వత్సా ॥

(౫) అధునిక ప్రసిద్ధవైయాకరణుఁడైన నాగేశభట్టునకు నుపాధ్యాయుఁడగు హరిదీక్షితుఁడు చక్రవర్తికడ నెట్టి బహుమానము పడయఁ గోరి యొకప్పుడు డిల్లీ పట్టణమునకుఁ బోయి పాదుషాను సందర్శింపక మున్న పండితరాజును గలిసికొని వ్యాకరణశాస్త్రమున నీతోఁ బ్రభుసన్నిధిని బ్రసంగింపఁ గోరుచున్నాననెను. అందుకు జగన్నాథకవి యంగీకరించి రేపు దర్బారునకు విచ్చేయుమని చెప్పెను గాని వ్యాకరణశాస్త్రమందు హరిదీక్షితుఁడు తనకంటె నధికుఁడని తెలిసినవాఁడు గాన [illegible]క మంత్రపుఁగడియమును ధరించి సభకుఁబోయి యాత్రోత్త పండితుఁడు రాఁగానే యాయనను బ్రేమగలవానివలె గాఢముగాఁ గౌఁగిలించుకొనెను. అందువలన వెంటనే యతనికి నొకవిధమయిన బుద్ధిమాంద్యము సంభవించి ప్రసంగారంభముననే హరిదీక్షితుఁడు పరిహాసాస్పదములయిన ప్రశ్నోత్తరములకు దిగినవాఁడయి తుదకు నల్లుపురలో నవమానపడి యింటికిఁ బోయెను. ఆయన యంతటి పరాభవము రావలసినవాఁడు కాఁడు గావున నారేయెల్లఁ గన్నువాలక విచారించి ప్రతివాదిజయమునకుఁ దగినసాధనము తనకు సమకూరువఱకు మొదల నాఁటిరాత్రి పానీయత్యాగముఁ జేయువాఁడుగాఁ బ్రతిజ్ఞచేసికొని భక్తిపూర్వకముగా నిష్టదేవత నారాధింపఁగా నాదేవత యావిర్భవించి దత్కాలము దెలిపి యుపదేశించి ప్రతిక్రియను బ్రసాదించెను. మఱునాఁడు మరల నుభయపండితులు సభకుఁ విచ్చేసినప్పుడు మాయాపాశము పనిచేయనందున హరిదీక్షితునకే గెలుపుగలిగెను. అయినను దొలునాఁడు గెలిచినవాఁడు గావునఁ బండితరాజు హరిదీక్షితునిచేఁ బరాజితుఁడు గాఁడని సభ్యులెల్ల నుద్ఘోషించిరి.

(౬.) పండితరాజు తనపరువపుఁ బ్రాయమంతయు పోయినా ఢిల్లీశ్వరుని సంస్థానమందు యవనవనితతో వెళ్ళఁబుచ్చి తుట్టతుదకుఁ దనచరిత్రమునకూర్చి పశ్చాత్తప్తుఁడయి తనయాయుశ్శేషము నక్కడఁ గడపవలయునని [illegible] అప్పుడు క్షేత్రయాత్రాభిలాషి యగు నప్పయదీక్షితుఁడు తత్పుణ్యక్షేత్రమునకు యాత్రవచ్చి యొక్కనాఁటియుదయమున నదియొడ్డున జగన్నాథకవిని జూచి గంగాతటమున [illegible]

యువతితో నేకశయ్యానుభవశీలురై కానఁబడిరి. అప్పయదీక్షితుఁ డంతఁ జూచి నిర్విణ్ణుఁడై
తా వారిని మేలుకొన నట్లుగా నభినయించుచు నీక్రిందియర్ధశ్లోకమును జదివెను.

శ్లో॥ కిం నిశ్శంకం శేషే శేషే వయసః సమాగతో మృత్యుః॥

తే॥గీ॥ ముగిసెఁ బ్రాయము మృత్యువు మెసఁగె నకట!
దాఁట లేకిప్పుడా నిద్ర దూరి జీవ! ॥

అదివిని పండితరాజు శయ్యదిగి యప్పయ్యదీక్షితున కెదురువోయి కోడిచెప్పుచు శ్లోకార్థము నీక్రింది విధమునఁ బూరించెను.

శ్లో॥ అథవా సుఖం శయీథా నికటే జాగర్తి జాహ్నవీ జననీ ॥

తే॥గీ॥ అయినఁ గొదవేమి నిదురింపు మాదమఱచి
కడను యున్నది తల్లి గంగాభవాని ॥

(3) కాశీపట్టణములోని విద్వాంసు లందఱును జగన్నాథుని వ్యాసంగములను మన్నించి యాయనను గులములోఁ గలుపుకొనుటకు నిష్టపడిరి గాని తనకుఁ బ్రాణపదము యైన లవంగిని దొలఁగుట కంగీకారము లేనందునఁ బండితులు చెప్పిన పద్ధతుల యందు ద్దానికిని పండితరాజు సమ్మతించినాఁడు కాఁడు. యవనీసంపర్కము గలిగి యుండఁగా నీతనిఁ బునీతునిఁ జేయుట యనుకూలపడనందునఁ బండితరాజు చెప్పినపద్ధతులలో నెద్దానికిని పండితులును సమ్మతించినవారు కారు. అనంతర మొకనాఁడు జగన్నాథపండితుఁడు లవంగియుం దానుఁ గొండొక గంగాఘట్టమునందుఁ బయి మెట్టునఁ గూరుచుండి యా పవిత్రవాహినిని ధ్యానించి శ్లోకరూపముగా స్తోత్రము చేసెను. ఆఘట్టమున నేఁబది రెండు మెట్లు కట్టఁబడి యున్నవి. ఆతఁ డాటను బండితరాజు చదివిన ప్రతి శ్లోకమునకును గంగాదేవి యుప్పొంగుచు శ్లోకమున కొక్కసోపానముగా నేఁబదిరెండు శ్లోకములకేఁ బదిరెండు సోపానములును దాఁటి వచ్చి వారల నిరువురను దాఁకి పునీతులను గావించెను. వారిరువురు గంగలో మునింగి యదృశ్యులయిరనియుఁ జెప్పుట గలదు. పండితరాజు రచియించిన యాయేఁబదిరెండుశ్లోకముల స్తోత్రము గంగాలహరి యను పేరితో హిందూదేశమందంతట సాధారణముగాఁ బాఠము చేయఁబడుచున్నది.

జగన్నాథపండితునిఁ గూర్చి పూర్వోక్తప్రకారమున ననేక కథలు లోకమంతట వ్యాపించియున్నవి. అయినను వాని నన్నవిధమున నమ్ముటకుఁ గొన్నిచోట్ల నవకాశము లేదు. కావున నం దెంతవఱకు సత్యమున్నదో విచారింతము. ముందుముందు చెప్పఁడి కాఁ గల యాయువతంత్రిగారి పేరివిట్టియు, జాతిభేదమును బట్టియు మఱికొన్నియితరాంశములబట్టియుం జూడఁగా నీపండితుఁడు మనగోదావరిమండలమువాఁడనియుఁ దెఱకా

యుత్తరహిందూస్థానమున వసించినవాఁడనియు రూఢమగుచున్నది. పారసీ భాషయందీ యనకు విశేషప్రవేశము గలదన్నమాట నమ్మవచ్చును. సగము సంస్కృతముతోను సగము పారసీతోను నీయనరచియించిన శ్లోకము లనేకము లున్నవనియు విశేషించి పారసీ భాషయందలి యొకానొక జ్యోతిశ్శాస్త్రగ్రంథమును సంస్కృతములోని కీయన మార్చినాఁడనియుఁ జెప్పుచున్నారు. ఈ భామినీవిలాసము కడపట, నీయనపూర్వవయస్సంతయు ఢిల్లీచక్రవర్తియాస్థానమునఁ గడపినట్లు తెలియ వచ్చుచున్నది గాన, సంస్కృత భాషాపోషకు లని ప్రసిద్ధి గాంచిన పాదుషాలలో నెవరో యీయనయందు విశేషాభిమానము వహించియుండవచ్చును.

రెండవప్రవాద మగ్బరుచక్రవర్తితో సంబంధము కలిగి యున్నది. ఆచక్రవర్తిని గూర్చి యేస్వల్పాంశమును గూడ విడువకుండ వ్రాసిన „ ఐనయక్బరీ „ యనుచరిత్రములో నీపండితుని ప్రశంసగాని లవంగికసంగతిగాని గానరాదు. మహమ్మదీయుఁ డయిన యక్బరుచక్రవర్తి తనకూఁతు నొకవైదికబ్రాహ్మణునకిచ్చి పెండ్లి చేసినమాటయే నిజమైనపక్షమునకుఁ దచ్చరిత్రములో గ్రుచ్చవలసినవిషయరత్నములయందింతకు మించిన విలువగలది చరిత్రకారునకు వే ఱొక్కఁ డుండ దని నిశ్చయముగా వక్కాణింప నచ్చును. మఱియు మితి మీఱిన రాణివాసముగల మొగలాయిచక్రవర్తి కూతురు జల కలశమును దలమీఁదఁ బెట్టుకొని కొలఁకుకూటములోనికి వచ్చినదని చెప్పుమాటయందు వివేకముగలవారి కెవ్వరికి విశ్వాసము పుట్టును? మహమ్మదీయ ప్రభువులలో హిందువులకు మిగుల ననుకూలుఁ డయినవాఁడును వారిచే నెచ్చుగ మెచ్చఁ బడినవాఁడును నగ్బరు చక్రవర్తి గావునఁ దమకుఁ బరిచిత మయినపేరు, పండితరాజు నాదరించిన చక్రవర్తికి మనవారారోపించి యుందురు. ఇంతియ కాని యీపండితునకును నగ్బరు చక్రవర్తికిని లేశమును సంబంధము లేదు. యీకథలో నట్టికి యున్న శ్లోకములు పండితరాజు రచియించిన యే గ్రంథము నందును గాన రా వని తత్కర్తృత్వ మీకవియందు నునుచుట నొకానొక రనుమానించుచున్నారు; కాని వారి కట్టియనుమానము పుట్టవలసినపని లేదు. చాటుధారా శ్లోకములు లోకమందే పాఱికి యుండును గాని గ్రంథములయం దప్పుడు నిమిడి యుండవు.

విమర్శించి చూడఁగా నీకథ యంతయుం గేవల కల్పిత మని చెప్పుటకంతగా సంత లేనిదే గంపంత కా దనులోకోక్తిని బట్టి జగన్నాథ పండితునకు యవనీ సహవాస మున్న దనియే తలంచుట మంచిది గాఁ దోఁచుచున్నది. ఈ భామినీవిలాసమందలి కరుణావిలాసము సర్వము నీకవికిఁ దటస్థించిన జాయావియోగదుఃఖమునకే ప్ర చుచున్నది గదా! మహమ్మదీయ చక్రవర్తిగారి దివాణము నాశ్రయించి యున్న

మూఁడవకథ జగన్నాథ పండితుని ప్రభుభక్తిని సూచించుచున్నది. కనుక న ద్దానిని విశ్వసించుటకుఁ బ్రమాణాంతర మనావశ్యకము.

నాలుగయిదు కథలు హేతువాదమున కందక కేవల విశ్వాసముమీఁద వ్రేలాడుచున్నవి. దేవతాసాక్షాత్కారాదులయందు నమ్మకము గలవారే కాని లేనివారు వానినంతగాఁ బాటి సేయరు. ఈ రెంటిలోఁ గడపటి దానియందు నాగేశభట్టునొక నామము వినఁబడుచున్నది. నాగేశభట్టను నతఁడు జగన్నాథపండితవిరచిత మయిన రసగంగాధర మను నలంకారశాస్త్రమునకు గురుమర్మప్రకాశ మను వ్యాఖ్యానము చేసియున్నాఁడు. ఆవ్యాఖ్యానముపేరిఁ బట్టి యాలోచింపఁగా నాగేశభట్టను నతఁడు హరిదీక్షితునకుఁ గాక జగన్నాథపండితునకే శిష్యుఁడేమో యని తోఁచుచున్నది గాని త ద్వ్యాఖ్యానముఖశ్లోకమున "నత్వా గంగాధరం మర్మప్రకాశం తనుతే గురుః" మ్మనియున్నందున నందులకు మరల సందేహము గలుగుచున్నది. హరిదీక్షితాదుల కాలనిర్ణయమును గుఱించి ముంబాపురప్రకటితసంస్కృతభామినీ విలాసమునందలి యాంగ్లోభాషాలిఖిత పీఠికయందు నధికముగా వివరింపఁబడి యున్నది. వలయువా రందుఁ జూచు కొనునది.

ఆఱవకథ విషయమున—

శాఁ॥ జల్లించెం గడకెళ్ళ శాస్త్రములు; నిష్ఠన్ సల్పె నిత్యక్రియల్;
ఢిల్లీవల్లభుపాణిపల్లవమునన్ లేఁబ్రాయముం జేర్చెన్; గడున్
దుల్లన్ వాసనలిద్యౌవన్ మధురయాంగుం గొల్చు గోవిందు; నా
యుల్లోకంబునఁ జేసెఁ బండితసమూహోత్తంసుఁ డన్నింటెనిన్ ॥

అను భామినీచతుర్థవిలాసపద్యమునందుఁ బండితరాజు తనయంత్యదినములను మథురయందుఁ గడపినట్లు కనఁబడుచున్నను వారణాసియందు వసియించినాఁడని చెప్పుటకుఁగూడఁ గారణమున్నది. క్రీ శ. 1687సం॥ ప్రాంతమున సుప్రసిద్ధుఁడై యున్నట్లు తెలియఁబడిన ద్రవిడపండితుఁ డప్పయ్యదీక్షితుఁడు పండితరాజున కస్కాలమునఁ బ్రతిపక్షిగ నున్నవాఁడు. "నేదం రూపకం, రూపకే చ బింబప్రతిబింబభావో నాస్తీతి నాప్యలంకారికం మస్యోపప్రతారితస్య దీక్షితస్యోక్తి రశ్రద్ధేయైవ" అని రసగంగాధర రూపక ప్రకరణము. దీక్షితశ్యాలంబకర్ణస్య ద్రవిడస్యాప్పదీక్షితస్య అని పయివాక్యములోనిమాటకు నాగేశభట్టువ్యాఖ్యానము. పండితరాజున కప్పయ్యదీక్షితుఁడు ప్ర

తిపత్తియనుటకుఁ బూర్వోక్తసంస్కృత వాక్యమే సాక్షి. ఇట్టిస్థితిలో నీపండితు లిరు
వురును గథలోఁ జెప్పఁబడిన చొప్పున జెప్పడయినఁ గలిసికొనిరాయను విషయమే ప
రమసందిగ్ధము. ఇంక శ్లో॥ కింనిశ్శంకం శేషే (మునిగి సెఁబాఁ)యను ఇత్యాదిదాని తెలుఁగు)
అను నార్యను వారిద్దఱును గలిసి చెఱిసగము రచియించిరను విషయము చెప్పనలసినదే
మి? ఇంతియగాక యీశ్లోకము రసగంగాధరమున నాక్షేపప్రకరణమునందును గానవ
చ్చుచున్నది. దీనంజేసి తదార్యయం దప్పయ్యదీక్షితునకు భాగమీయ బొత్తిగ నేవలను
పడదు. ఏమనఁగా జగన్నాథపండితుఁడు తనరసగంగాధరమునందు.

శ్లో॥ నిర్మాయ నూతన ముదాహరణానురూపం
కావ్యంమయాత్ర నిహితం నపరస్య కించిత్ ;
అఘ్రాయతే సుమనసాం మనసాపి గంధః
కస్తూరికాజననశక్తిమతా మృగేణ॥

దీనికిఁ దెలుఁగు.

చ॥ కొననిటఁ గొంచె మేనియు నొకొండు రచించిన దాని; నేనె నూ
తనముగఁ జేసి యుంచితి నుదాహరణాను గుణంబుఁ గావ్యముల్ ;
మనసున నైన మూరకొను నా సుమనస్సులతావిఁ గస్తురిం
జననము నొందఁ జేయఁగను జాలుమృగంబు జగంబులోపలన్ ॥

అని గొప్పప్రతిజ్ఞ చేసికొన్నాఁడు. కంఠోక్తిగాఁ దెలియవచ్చుచున్న యీప్ర
తినకు విరుద్ధముగాఁ బుక్కిటిపురాణమును విశ్వసించుట విశేషపక్షము గాదు.

కడపటికథయందుఁ బర్యవసానము రెండంశములుగాఁ దేలుచున్నది మొదటి
ది జగన్నాథపండితుఁడు జాతిబహిష్కృతుఁడయ్యె ననుట. రెండవది గంగాస్తవము
గావించి యావెంటనే లవంగితోడ నాతఁడు గంగలో మునింగి యదృశ్యుఁడయ్యె న
నుట. ప్రథమాంశమును గుఱించి కొందఱభిప్రాయ మేమనఁగా గంగాలహరియం
దలి కొన్ని శ్లోకములు ముఖ్యముగా ౬, ౨౮, ౩౦, ౩౬, ౩౭, ౪౧, ౪౬, ౪౭ సంఖ్య
లు గలవి, తత్కథను మెఱుఁగుపెట్టునట్లు కనఁబడుచున్నవిగాని యవియొక ప్రమాణము
గా నేరవు. అంతేకన్నను దీనముగా ననేకకవులు స్తవములను జేసియున్నారు. అమ్మ
దిగా నున్నది. అయినను.

చ॥ భవ మనుపాదునూతఁబడి బాముల నొందెదు నన్ను నీగతిం

దవ్వున యుపేక్ష సేయఁ గరుణావరుణాలయ! శౌరి! తొల్లి నీ
పవన మొనర్ప పెట్టితి కటా! ప్రకటాఘను బింగళాఖ్యా
రవనిత; దుష్టవర్తనుని భ్రష్టు నజామిళ భూసురబ్రువున్ ॥

భామి, శాంత. [illegible]

అను నర్థముగల మూలశ్లోకమును జదువునప్పుడు తక్కిన తిన్నను దనలవంగిక మహాపాపులం జేయుమని భగవంతుని గూర్చి మొఱ్ఱవెట్టుకొనినట్లు లెవరు తలంపకుందురు? ఇట్టి ప్రార్థనము వేఱొకరిది మనము వినము. ద్వితీయాంశము కేవలము విశ్వాసానర్హము గానున్నది. కొందఱు చెప్పెడులాగునఁ బండితరాజు నిజముగా గంగాలహరి రచియించిన కోడనే గంగాప్రవేశ మయిన పక్షమునఁ దదనంతర మాయన వేఱొక గ్రంథము విరచించుట కవకాశము గలుగదు గదా! ఈక్రింది యాంశమును బట్టి విచారింపఁగా గంగాలహరికిఁ దరువాత నాయన తనకృతుల నన్నిట ముత్కృష్టతమ మనఁదగిన రసగంగాధర మను నలంకారశాస్త్రమును విరచించి నట్లు కనుపట్టుచున్నది. ఆగ్రంథమునం దన్వయప్రకరణమున.

ఉదాహరణ మస్మృతలహర్యాఖ్యే మదీయే గంగాస్తవే—

శ్లో॥ కృతక్షుద్రాఘౌఘా నథ సపది సంతప్తమనసః
సముద్ధర్తుం సంతి త్రిభువనతలే తీర్థనివహాః।
అపి ప్రాయశ్చిత్త ప్రసరణపథాతీతచరితా
న్నరా నూరీకర్తుం త్వమివ జనని త్వం విజయసే॥

పైసంస్కృతమునకుఁ దెలుఁగు

మదీయ మగునమృతలహర్యాఖ్య గంగాస్తవమునం దుదాహరణ మని

ఉ॥ పొనరించి యాత్మపాతక సమూహము లుమ్మలికించు వారలన్
మనుపఁగ నున్న వెన్నొ భువనత్రితయంబునఁ దీర్థసార్థముల్;
జననిరో! నీవు నీవెకుమి పాటివి నిష్కృతిమార్గదూరవ
ర్తనములు గల్గు మర్త్యసముదాయము నైనను నుద్ధరింపఁగన్॥

అనునర్థమిచ్చుపయిశ్లోకమును జెప్పియున్నాఁడు. గంగాస్తవమునందుఁ గడపటిదయిన

శ్లో॥ ఇమాం పీయూషలహరీం జగన్నాథేన నిర్మితాం.

యాః పశ్యేత్సద్ద్వస్య జాయంతే సుఖసంపదః॥

ఈ శ్లోకమునందుఁ జెప్పఁబడిన చో ష్పానఁ దద్గ్రంథమును పీయూషలహరియనవ లసియుండఁగా నీయన్వయప్రకరణమున ఁనమృతలహర్యాఖ్యేయని యుండుట లేఖకా ప్రమాదముగాఁ దలంప నయ్యెడిని. పండితరాజు రచియించినది యమృతలహరియని వే రొకటి యున్నది. అదియమునా స్తవముగాని గంగాస్తవముగాదు. ఈ దాహృతశ్లోకము గంగాస్తవమునందుఁ గానఁబడుచున్నది. పీయూషలహరిలోని ప్రతిశ్లోకమునకును గంగ యొప్పెంగును వచ్చినమాట తల్లహరీమాధుర్యాతిశయ ద్యోతకమగు నత్యుక్తిగా విచ క్షణులు భావించుకొందురుగాక.

కథలవిషయ మిట్లు ముగిసినది గనుక నిటుమీఁదటఁ గాలనిర్ణయము చేయవలసి యున్నది. అందును గుఱించి నిర్వివాదముగా నిశ్చితాభిప్రాయ మిచ్చుటకు జగన్నాథ పండితుఁగు రచియించిన గద్యపద్యములే సిద్ధముగానున్నవి. కాఁబట్టి వానినీక్రింద వ్రా యుచున్నాను.

౧ శ్లో॥ సురాణాం పారామా దిహరఘుపతి ర్ఘుంర్ఘానిలహతాః
పతేయుః శాఖీంద్రా యది తదఖిలో నందతి జనః
కిమేభిర్వ్యాకార్యం శివశివ వివేకేన వికలై
శ్చిరంజీవన్నాస్తా మధధరణి ఢిల్లీనరపతిః॥

రసగంగాధరము. ఆక్షేపప్రకరణము.

౨ శ్లో॥ సృష్టస్ఫలిష్టిక్రతా పురాఽపి పరిత్రాతుం జగన్మండలం
త్వం చండాంశుప నిర్దయం దహసి యజ్జ్వాలాజటాలైః కరైః
సంరంభారుణలోచనో రణభువి ప్రస్థాతుకామో ఘనా
జ్ఞాతిమో భవతా వసంత విదితో ఢిల్లీధరావల్లభః॥ ర. గం. ప్రతీప ప్రకరణము.

౩ శ్లో॥ మాహాత్మ్యస్య పరోవధి ర్నిజగృహం గంభీరతాయాః పితా
రత్నానా మహమేక ఏవభువనే కోవాపరో మాదృశః
ఇత్యేవం పరిచింత్యమాన్న సహసా గర్వాంధకారంగమో
దగ్ధాబ్ధే భవతా సమో విజయతే ఢిల్లీధరావల్లభః॥ ర. గం. ప్రతీపప్రకరణము

౪ శ్లో॥ అనుకూలభావ మథవా పరాఙ్ముఖత్వం సమాహ్వానరలోకే
అన్యోన్యవిహితమంత్రౌ విధిఢిల్లీశ్వరభౌ వహతః॥ ర. గం. సహోక్తి ప్రకరణము

౫. గ॥ మూర్తిమతేవ నవాభాసఫఖానమనః ప్రసాదేన ద్విజకులస్నేహాహ్వాకేవా ష్టేనః కాయేన మాథురకులసముద్రేందునా రాయముకుందేన వాదిష్టేన సా ర్వభౌమ శ్రీశహాజహాం ప్రసాదాధిగతపండితరాజపదవీవిరాజితేన తైలింగకు లావతంసేన పండిత జగన్నాథేనాసఫవిలాసాఖ్యేయ మాఖ్యాయికా నిరమా యత. ఆసఫవిలాసపీఠిక.

౩ శ్లో॥ శ్యామం యజ్ఞోపవీతం తవకిమితి మషీసంగమాత్కుత్రజాతః
సోయంకిం తాంశుక వ్యాపయసి కథమభూ తుజ్జ్వలం కజ్జలాక్తం
వ్యాకుప్యన్నారరీతి క్షితిరమణ రిపుక్షోణిభృత్పత్నీలాక్షీ
లక్షాక్షీణాశ్రుధారాసముదితసరితాం సర్వతస్సంగమేన॥ ఉత్తర ప్రకరణము

౪ శ్లో॥ భూమీనాథశహాబుదీన భవతస్తుల్యా గుణానాం గణై
రేతస్మాత్ భవప్రపంచవిషయే నాస్తీతి కిం బ్రూమహే
ధాతా నూతన కారకౌశల్యాది పునస్సృష్టిం నవాం భావయే
న్నస్యాదేవ తథాపి తావకతులాలేశం దధానో నరః॥ అసత్ప్రకరణము.

పైసంస్కృతమునకుఁ దెలుఁగు

౧ వ॥ అమరారామమునుండి క్రిందఁబడఁగా నత్యుగ్రఘుంఘుమాహత
ద్రుమరాజంబులు సంతపింతురు జనుల్ ఘోరంబుగాఁ; బైని లా
భ మదేమీ యకటా! వివేకవికలత్వం బొందునవ్వానిచేఁ
తను ఢిల్లీనరనాథచంద్రుఁ డెలమిన్ బైవాత్రుకుంచయ్యోకన్॥

౨ శా॥ పాలింపం గదరా ధరావలయమున్ భానూ! నినుం జేసిన
న్నాళీకాసనుఁ డెత్తు నిర్దయతఁ జండత్వోగ్రరజ్వాలః మ
ద్వేలాటోపత రక్తనేత్రుఁ డగుచుం ఢిల్లీశుమాపల్లభుం
డాలంపుందమి బైలుదేఱు నను జీవాలింప వేమ్మో కటా॥

౩ శా॥ మాహాత్మ్యంబున కల్గి లోఁతునకు ధామంబన్, బిరన్ రఙ్నసం
దోహంబంతకు; మాద్రుశౌండు జగమంతుం గల్గునే యుస్వుఁడం
చూహంజేయుచు దర్పదాంధుఁ తవు గా క్షీరవారాశి; ఢి
ల్లీవాంపీరవతంస మన్నట భవల్లీలన్ బ్రిఁబద్ధిల్లెడున్॥

౪ క॥ ఢిల్లీవల్లభుఁడును విధి! ముల్లపు తనోళ్ళ మణి విహితమంత్రిత వ

హాను రాజ్యము చేసినది ౩౦ వ సంవత్సరములు. ఆ కాలమంతయు నీయన తదాస్థానమం
దుండి, యౌరంగజేబు (షాజహానుని తృతీయపుత్రుఁడు) తనతండ్రిని చెఱపెట్టిన కాలము
నకో యన్నయగుదారాషు సంహరించిన కాలమునకో తన్నాదరించుచుండిన ప్రభువు లేక
పోవుటచేత వార్ధకమున మధురయందు గోవింద సన్నిధానమున దినములు వెళ్ళఁబుచ్చి
యుండును. రసగంగాధరము చే కాలము షాజహానుని ప్రభుత్వమధ్యమునందలిదే కా
వచ్చును. గావునఁ దద్గ్రంథము కఁ బూర్వపుదియగు గంగాలహరి రచియించునప్ప
టికిఁ బండితరాజు ముసలి యయి యుండఁడుగాని "ముగిసెఁ బ్రాయము మృత్యువు మొ
గిసె" నిత్యర్థమిచ్చు శ్లోకమునుబట్టి చూడఁగాఁ "కాశ్యాంతు మరణాన్ముక్తి" యను
వచనము ననుసరించి యవసానమునకు నతఁడు వారణాసిఁ బ్రవేశించి యుండునేమోయ
నియుఁ దోఁచుచున్నది. పండితరాజు జహాంగీరునికడపటి కాలముననే దద్ధాస్థానమునఁ జే
రియుండునని కొన్నను దత్పుత్రుఁడగు షాజహాను రాజ్యాంతమునప్పటి కాయన కెనిమిది
వపది సమీపించి యుండవలసివచ్చును. ఇట్టిస్థితిలో షాజహాను పితామహుఁడగు నక్బ
రు చక్రవర్తికడ నీయన పండితుఁడుగా నుండెననుమాట యెట్లుపొసఁగును? భామి. శాం.
౮ ౪ శ్లోకమునందు "దిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః" యని తన యౌవనప్రా
యమును దిల్లీశ్వరుని కిచ్చినట్లు కంఠోక్తిని జెప్పుచున్నాఁడు. ఈ దిల్లీశ్వరుఁడక్బరుచక్రవ
ర్తియేయై యతనిపాణియందే పరిపూర్ణసకలశాస్త్రపాండిత్యాతిశయ సంపాదనాంతర
స్వీయనవీనప్రాయం బీయనచేత నీత మయిన పక్షమునందు నక్బరుమీఁదఁ బండితరాజు
చెప్పిన శ్లోక మొక్కటియైన లేక పోవుటయు షాజహాను మీఁదఁ జెప్పిన వనేకము
లుండుటయుఁ బైగా నీకడపటిచక్రవర్తిచేతనే యతనికిఁ బండితరాజబిరుద మీయఁబ
డుటయు నెట్లు సంభవించును? పూర్వోక్తప్రకారమున నుత్తరముల చక్రవర్తివర్యు
లమీఁద నే కాక షాజహానున కేలాగుననో సంబంధముగలసిసవాఁడగు నాసఫఖానుమీఁ
దఁగూడ నొకయాఖ్యాయిక పండితరాజు రచియించినట్లు చదివియుంటిమిగదా! అక్బ
రుకాలమున నీపండితుఁడున్నయెడల నాయన వర్ణన మీయన చేయకుండుట సర్వథా య
సంభవము. కాఁబట్టి రసగంగాధరమునందుండి పైనుదాహరించిన ౧, ౨, ౩, ౪, శ్లోకముల
లోఁ జెప్పఁబడిన దిల్లీవల్లభుఁడు నిశ్చయముగా షాజహానే కాని వేఱొకరు కారు. త
త్కారణమునఁ బండిత జగన్నాథునివిమహోచ్ఛ్రదశ క్రీశ. ౧౬౨౦ మొదలుకొని
౧౬౬౦ సం॥ వఱకు నైయుండవచ్చును.

జగన్నాథపండితుని తండ్రిగారిపేరు పేరుభట్టనియుఁ దల్లిపేరు లక్ష్మియనియు యతఁడు తెలుఁగునాఁటివాఁడనియు సకలశాస్త్రపారంగుఁడగు జనకునియొద్దనే విద్యలన్నియు నభ్యసించెననియు నీ క్రిందిశ్లోకముల వలనఁ దెలియవచ్చును.

౧ శ్లో॥ తైలంగాన్వయమంగళాలయమహాలక్ష్మీదయాలాలితః
శ్రీమత్పేరమభట్టసూనురనిశం విద్వల్లలాటంతపః
సంతుష్టః కమఠాధిపస్య కవితామాకర్ణ్య తద్వర్ణనం
శ్రీమత్పండితరాజపండితజగన్నాథోవ్యధాసీదిదమ్ ॥ ప్రాణాభరణము ౫౨

౨ శ్లో॥ పాషాణాదపిపీయూషం స్యందతే యస్యలీలయా
తం వందే పేరుభట్టాఖ్యం లక్ష్మీకాంతం మహాగురుమ్॥ ర. గం. పీఠిక.

3 శ్లో॥ శ్రీమజ్జ్ఞానేంద్రభిక్షోరధిగతసకలబ్రహ్మవిద్యాప్రపంచః
కాణాదీరాక్షపాదీరపి గహనగిరో యో మహేంద్రాదవేదీత్
దేవాదేవాధ్యగీష్ట స్మరహరనగరే శాసనం జైమినీయం
శేషాంకప్రాప్తశేషామలభణితిరభూత్సర్వవిద్యాధరో యః॥ ర గం. పీఠిక

వీనికిఁ దెలుఁగు.

౧మ॥ శ్రుతలక్ష్మీకరుణోపలాలితుఁడుఁ బేరంభట్టుసూనుండుఁ బం
డితరాజాంకుఁడుం ద్రిలింగకులుఁడున్ విద్వల్లలాటంతపుం
డతితుష్టిన్ విని కామరూపవిభుదివ్యంబౌ కవిత్వంబుఁ, ద
త్ప్రతివర్ణింపఁ జేసెఁ బండితజగన్నాథుండు దా నీకృతిన్ ॥

౨క॥ పాషాణమునుండియుఁ బీ । యూషము స్రవియించు నెబుధోత్తములీలన్,
భూషించుము నాలక్ష్మీ । యోషావిభుఁ బేరుభట్టు నొజ్జను దలుతున్ ॥

౩మ॥ గ్రహియించెన్ శ్రుతబ్రహ్మవిద్య విమలజ్ఞానేంద్రయోగీంద్రుచే,
గహనంబైన కణాదగౌతములవాక్యంబుల్ మహేంద్రార్యుచే,
మిహికాశీపురి ఖండదేవువలనన్ మీమాంస, శేషాంకుచే
నహిరాడ్భాష్యము; పేరుభట్టఖిలవిద్యాశాలి సామాన్యుఁడే ॥

మఱియు జగన్నాథపండితుఁడు రాజమహేంద్రవరమండల నివాసి యని తద్వంశ్యుఁడగు నొకకాశీపండితుఁడు వ్రాసియున్నాఁడు. పండితరాజుతండ్రి పేరుభట్టు గదా ! అన్యదేశీయున కట్టిపేరు సాధారణముగా నుండ నేరదు. కాఁబట్టి యాకాశీపండితుఁడు వ్రాసినమాట నిజమే కావచ్చును. జగన్నాథపండిత విరచితములయిన గ్రంథములనుగుఱించి కొంచెము వివరించి యీపీఠిక ముగించుచున్నాను.

ఈయన గంగను, యమునను, లక్ష్మిని, విష్ణువును, సూర్యునిస్తోత్రము చేయుచు వరుసగా, ౫౨, ౧౦, ౪౧, ౬౦, ౩౦ శ్లోకములుగల పీయూషలహరి, యమృతలహరి, లక్ష్మీలహరి, కరుణాలహరి, సుధాలహరియని పంచలహరులను రచియించినాఁడు. వీన్ని లోఁబీయూషలహరిని గంగాలహరియని సాధారణముగా వ్యవహరింతురు. సుధాలహరి యనునది మయూరకవిరచిత సూర్యశతకమువలె స్రగ్ధరావృత్తములు గలిగి యున్నది.

రసగంగాధరము. ఇదియొకయలంకారశాస్త్రము. జగన్నాథపండితుఁడు రచియించినగ్రంథములం దన్నిట విది యుత్తమము. సరస సాహిత్యసంపాదనాభిలాషులకి ది యవశ్యపఠనీయము. మనీషులు దీనిని గవి కల్పకమని సన్నుతింతురు.

మనోరమాకుచమర్దన. ఇది భట్టోజీదీక్షితుఁడు సిద్ధాంతకౌముదికిఁ జేసిన మనోరమ యనువ్యాఖ్యమీఁద ఖండనగ్రంథము.

అశ్వధాటి. ఇది తనమనుమనిప్రార్థనమునఁ గవి రచియించిన ట్లీక్రిందిశ్లోకమువలనఁ దెలియవచ్చుచున్నది. శ్లో॥ రామస్వామ్నః స్వపౌత్రస్య కామనాపూరణోత్సుకః అశ్వధాటీంజగన్నాథో విశ్వహృద్యా మకీరచత్ ॥ ఇది యమకప్రధానము లగు ౨౫ శ్లోకములు గల బహుదేవతాస్తవ గ్రంథము. అశ్వధాటీవృత్తములనుబట్టి దీనికాపేరుపెట్టఁబడినది.

ప్రాణాభరణము. ఇదికామరూపదేశాధీశ్వరుఁడైన ప్రాణనారాయణుని పరాక్రమాదులను వర్ణించుచు రచియించిన చిన్నగ్రంథము. ఇందలిశ్లోకమొకటి యీజిల్లాలోఁదెలుఁగుపద్యముతోఁగూడ నీపీఠికలోనే వ్రాయఁబడియున్నది. అది చదివిచూడఁగా నీగ్రంథముఁ గామరూపాధిపునికవిత్వమున కలరి పండితరాజు రచియించినట్లు గోచరించెడును. ఈగ్రంథమందలి మొదలిశ్లోకము భామినీవిలాసమందలి ౮౨ శ్లోకము నొక్కటిగానున్నది.

జగదాభరణము. ఇది షాజహానుజ్యేష్ఠపుత్రుఁ డగుదారాసుకోను వర్ణించుచుఁ గవి రచియించినది. దారా సంస్కృతభాషాపోషకుఁ డగుట సుప్రసిద్ధము.

ఆసఫవిలాసము. ఇది కేవలగద్యకావ్యము. కవి దీని నాసఫఖానను నవాబునుగూర్చి రచియించినాఁడు. ఈసంగతి స్పష్టపఱుచునొక వాక్యము తద్గ్రంథపీఠికలోని దని యింతకుఁబూర్వ మీపీఠికలోనే యుదాహరింపఁబడియున్నది.

భామినీవిలాసము. ఇది భర్తృహరివిరచితమైన సుభాషితరత్నావళివంటిది. ఇందు నానారసప్రధానములయిన మనోజ్ఞశ్లోకములు గలవు. జగన్నాథపండితుఁడు తన రసగంగాధరములో లక్ష్యములుగా నుదాహరించుకొనుట కీగ్రంథము రచియించినాఁడనియు, గంగాలహరీప్రముఖనిజగ్రంథములలో దొరకనిలక్ష్యముల నిందుండి గ్రహించుచు వచ్చెననియుఁ జెప్పుదురు. రచనాకారణము నెవరేమి చెప్పినను గ్రంథముమాత్రము

సరసమైనది. ఇందలి శ్లోకము లలంకారాదులకు లక్ష్యములుగావున వీనిని జదువుటవలనఁ దత్తద్విషయములు స్ఫురణకు వచ్చుచుండును.

ఇదిగాక చిత్రమీమాంసాఖండనము మొదలుగాఁగలబహుగ్రంథము లీపండితరాజు రచియించెనని చెప్పుదురు. వసుమతీపరిణయము రతిమన్మథము నను రెండు నాటకములు గలవు. వానినిరచియించిన కవి జగన్నాథుఁడని యందున్నదిగాని యాజగన్నాథుఁ డీజగన్నాథుఁడు గాఁడని నిశ్చయముగాఁ దలంపవచ్చును. తన్నాటక ప్రస్తావనలయందుఁ గవి తండ్రిపేరు బాలకృష్ణుఁడని యుండుటయే కాక విశేషించి వసుమతీపరిణయమందుఁ దన్నాటకమప్పుడు రాజ్యముచేయుచున్న పీష్వాబాలాజీబాజీరాయనియాజ్ఞచొప్పున రచియించినట్లు చెప్పఁబడినది. ఇందువలన నీనాటకద్వయకర్తయగు జగన్నాథుఁడు బాలాజీ బాజీరాయుని కాలమందనఁగా 18 వ శతాబ్దము నడుమ నున్నవాఁడని తేలుచున్నది. భామినీవిలాసకర్త 17 వ శతాబ్దము నడిమివాఁడనియు నతని తండ్రిపేరు పేరుభట్టనియుఁ బూర్వమే తెలుపఁబడెను గదా!

భామినీవిలాసమందలి కడపటిపద్యములవలన జగన్నాథ పండితుఁ డాత్మస్తుతిపరాయణుఁడని స్థూలదృష్టిని దోఁచునుగాని సూక్ష్మదృష్టి నాలోచించినచో సర్వశాస్త్రకూలంకష ప్రజ్ఞగల యవ్విద్వాంసునకట్టి యుత్కర్ష మతిశయోక్తిగాదని తోఁచనే స్ఫురియింపకపోదు. పండితరాజు తనకవనమందుఁ బ్రసాదము సాధారణగుణమని యాక్రిందివాక్యమువలనఁ జెప్పియున్నాఁడు. "శ్రుతమాత్రా వాక్యార్థం కరతలబదరమివ నివేదయంతీ ఘటనా ప్రసాదస్య. అయంచ సర్వసాధారణో గుణః, ఉదాహరణాన్యత్ర ప్రాయశో మదీయాని సర్వాణి పద్యాని." ర. గం - అననము ౧. ఇట్టికవనమును సరిగఁ దెలిఁగించుట యశక్యమే యయినను మనీషులు గుణగ్రాహులను నమ్మికతో నేనీ ప్రయత్నమును జేసినాఁడను. జగన్నాథపండితుని గురించి కొంతవివరముగా వ్రాయుటకై నాకు, ఎల్, ఆర్ వైద్యులనువారు ౧౮౮౭ సం॥ ప్రకటించిన సంస్కృత భామినీవిలాసములోని యాంగ్లోపీఠిక విశేషసాహాయ్యము చేసినందునఁ దత్పండితులకు నేను మిగులఁ గృతజ్ఞుఁడనగుచున్నాను.

ఎన్నఁడో నాయొద్ద నేర్చుకొన్నకొంచెపాటి తెలుఁగునకై సదా నాయెడల గురుభావము వహించి యీగ్రంథము ముద్రాభృతి గయికొనకయే యచ్చొత్తించిన దేశోపకారి పత్రికాధిపతి సత్తిరాజా సీతారామయ ప్రధానునిఁ బరమేశ్వరుఁ డాయురారోగ్యాది సంపన్నునిఁ జేయుఁగాక యని కోరుచున్నాఁడను.

రాజమహేంద్రవరము.
1902 సం॥ డిసెంబరు.

వడ్డాదిసుబ్బారాయఁడు.

## అవతారిక.

సతీస్మృతి యనఁగాఁ బతివ్రతను గూర్చిన స్మరణము. వేణీసంహారాద్యాంధ్ర గ్రంథకర్త యయిన వడ్డాది సుబ్బారాయకవి తనభార్య యగు నన్నపూర్ణాసతిచరమకాలమునఁ దజ్ఞాపకముగా దీనిని రచియించినాఁడు. పండితరాయఁడనుబిరుదునామముతోఁ బూర్వము షాజహాను ఢిల్లీచక్రవర్తి యాస్థానమున విద్వాంసుఁడుగా నుండిన జగన్నాథకవి సంస్కృతమున రచియించినభామినీవిలాసమనుచతుర్విలాసగర్భిత మయిన గ్రంథముఁ దానాంధ్రీకరించినందునఁ దద్గ్రంథమందలి తృతీయముకరుణావిలాసము జగన్నాథపండితుని ధర్మపత్నియగుకామేశ్వరి మరణమును స్మరింపఁ జేయునది యగుటచేత విషయసాదృశ్యమును బట్టి కవిచే నీగ్రంథము భామినీవిలాసకరుణావిలాసమున కనుబంధము కావింపఁబడినది. ఇందు మొదటినుండి నలుబదియేడు పద్యములు కేవలము కవి విలాపమును దెలుపునవి యయినను దత్తదవస్థాభేదమును బట్టి యవి ప్రథమ ద్వితీయ తృతీయ తురీయ విలాసములని నాలుగు భాగములు చేయఁబడియున్నవి.

భార్య లంకణములు చేయుచున్న పిడుగు సమాచారము దెలుపు నొకయుత్తరము నరసాపురము సమీపమున వసిష్ఠాతీరమం దొకపల్లెయయిన కలగముపూడి పోలవర మనుతన యత్తవారియూరనుండి రాఁగాఁ దత్క్షణమే కవి యచ్చటికిఁ బోయి, నాఁటి కేడులంకణములయితన్నానవాలు పట్టుపాటి తెలివి యయినను లేక సంధిచే నేమేమో కలవరించుచున్న ప్రియురాలిని జూచి, యింక జీవింప దన్నధైర్యముతో, నామె సప్రాణయయియుండఁగా శోకించుట ప్రథమభాగమును, మృతసతికి దహనసంస్కారకర్మ మాదినమున నే జరిగినను సంచయనకర్మనిమిత్తము తత్పోలవరగ్రామమునఁ గవి మఱి నాలుగు దినము లాఁగవలసి వచ్చినందునఁ బ్రాణోత్క్రమణానంతర మాయూర దారకు జరిగించినకర్మములను నామెవిలాపాదులను దలంచుకొని దుఃఖించుట ద్వితీయభాగమును దద్గ్రామము నుండి రాజమహేంద్రవరము వచ్చి నిజగృహమున మృతసతీప్రతిచ్ఛంద దర్శనాదులవలన మనోవైకల్యముగలిగి బహువిధముల విలపించుట తృతీయభాగమును, స్త్రీదక్షత లేమి మొదలుగాఁగల పలుకారణములవలన రాజమహేంద్రవరమున జరపవలయు ష

డక, కవి తనకుమారుని (తృతీయకళత్రసంజాతుని) మాతామహస్థానమయి నలువదిరెండు మయిళ్ళదూరమున నెల్లూరికాలువదరినున్న సుప్రసిద్ధమగు మంగుటూరుగ్రామమునకు పోయి నిజజాయ కక్కడఁ బారలౌకికక్రియలు నిర్వర్తించుచు వార్తఁబొందుట చతుర్థ భాగమును దెలియఁజేయుచున్నవి.

తురీయకళత్రవియోగము ప్రాప్తమయినప్పుడనఁగా నైదేండ్లక్రిందటి దుర్ముఖిసంవత్సరశ్రావణమాసమున నీయన్నపూర్ణాసతియక్కగారగు సుబ్బలక్ష్మియను కళత్రము కాలము చేసినప్పుడామెను స్మరించుచు నీకవిసతీస్మృతియనుపేరితోఁ గొన్నిపద్యములువ్రాసి యందు ద్వితీయకళత్రములపద్యములుకూడఁ జేర్చి యచ్చొత్తించెను. కాని దీనింబోలెదానిని గరుణ విలాసానుబంధమని చెప్పఁగనలేదు. ఈకవి భామినీ విలాసము నప్పటికే కొంతవఱకుఁ దెలిగించియుండెను. అయినను గరుణవిలాసములోని విషయమిట్టిదని నాఁటికిఁజూచియుండలేరు. ఇటీవల నయ్యంశము దెలియ నయినందున బూర్వకాలముననుగూడఁ గళత్రవియోగవిషయమునఁ గవులిట్లుగ్రంథరచనసేయు నాచారము గలదని సూచించుట కిదిదాని కనుబంధ మొనర్చినాఁడు. ఇయ్యనుబంధగ్రంథమునందలి పద్యములలోని భావములు గొన్నిచోట్లగూఢముగానున్నవి. పవిత్రమయినచరిత్రము గలిగి బహిఃప్రాణమయినభార్య పరలోకమునకేగినప్పుడు కవియగుభర్త యామెపేరుశాశ్వతము గావించుటకుఁ జేయవలసిన దింతకన్న వేఱుకార్యము లేదు.

వసురాయకవి మున్నొకసారి తురీయకళత్ర వియోగ సాగరమం దీఁదులాడుతఱిఁ బరామర్శించుచు నొక మిత్రుఁడు వ్రాసి ప్రకటించుటకు నాయొద్దకుఁ బంపిన పద్యమొకటి యీక్రిందఁ బొందుపఱుచుచున్నాను

ఉ॥ పరకవితాలతాంగి ననవద్యమతిన్ గవగూడిరేవగల్
చిరతరసౌఖ్యకీర్తులను జెందుచుఁ దమ్మొక రీతిఁజూడనీ।
సురుచిరగాత్రలందఱిది చూచి సహింపఁగలేక గాదదు।
ర్భరతరచింతతోడ నెడఁబాసిరి మిమ్ములనిట్లు మిత్రమా॥

ఏలూరు.
ది 10 ఫిబ్రవరి 1908. } సత్తిరాజు సీతారామయ్య

స్ఫురదరవిందమా! దరిని సొంపుగఁ దుస్స్వాద లేమొ పాడెదుం!;।
బరమహితుం డనంగఁ బవమానుఁడె సు మ్మొకకోర్కి లేక నీ।
బరిమళముల్ నిరంతరముఁ బర్వఁగ జేసెడు సర్వదిక్కులన్॥ ౫.

క॥ ఏ లెంచెను దైవికముగ। నీతుస్స్వాద యిటదు నన్వకే కుటజంబా;।
జాతిగ మకరందము గల। వౌ తామరపూలు దీని నొదలఁ బూనన్॥ ౬.

తే,గీ॥ కేఁటికూటునతో నొందు దీయమావి। మోక విలసిల్లునందాఁకఁ గోకిలంబ!।
వెడలఁ బుచ్చుము నీ పెటో, విరస మైన। వాసరము లివి, కాననాభ్యంతరమున॥ ౭.

క॥ బకము లవివేకములు; దలఁ। పకు నీ కవి సలుపుపరిభవము లిల జైవా।
తృకములు గావుకేఁ గమలిని!। మకరందసుధారసైకమాత్రికము లళుల్॥ ౮.

తే,గీ॥అయ్యయో! నేను గడునీచమైతి ననుచుఁ।గూపమా! యెప్పుడునునీవు గుందఁబోకు?।
సరసహృదయంబ వొగుచును బరులగుణము। లెల్ల కాలము నీవు గ్రహింతు గాదె?॥ ౯.

క॥ విరివిగ మకరందము గల। విరిదమ్మిని వాసరములు వెడలించినబం।
భర మిప్పుడు కటకట! యె। క్కరణిని గుటజంబునందుఁ గడపునొ దినముల్?॥ ౧౦.

క॥ హరిచందనమా! యెవ్వని। గిరలకు గోచరము తావకీనమహిమ? యీ।
గిరళంబు గాృయుచిలునలఁ। బరిమళములు బుగులుకొలిపి భరియింతువుగా॥ ౧౧

క॥ పాటీరము! తావకపరి। పాటిని బాటింపఁ గలదె పాటవ మెందునం।
దోటెల్ల కొరయునరులకుఁ। బాటు మఱచి పించి పయ్యెఁ బరిమళ మీవే?॥ ౧౨.

ఆ,వె॥పాలు నీరు నేఱుపఱుచుటలోన రా। యంచ! నీవె యాలసించితేని।
లోకమందు నెవ్వఁడో కులవ్రతము మింకఁ। బాలనంబు నేయువాఁడు నేఁడు?॥ ౧౩.

ఆ,వె॥పైకె గత్తివాలిపగిదిని, జెనుదాృమఁ। బాములట్ల కూృరభంగిఁ దోఁచి,।
లోన గోస్తనీసమానులై పఱలెడు। వారుఁ గొందఱుండ్రు వసుధయందు॥ ౧౪.

ఉ॥ పానము నేయు చెప్పుడు భవన్మకరందరసంబు స్వేచ్ఛమై।
గానము నేయుఁగాక గమకంబుగఁ జెంగటఁ జంచరీకముల్।
వీనిరవప్య సౌరభము నిచ్చలు సర్వదిగంతరంబులన్।
మానితభంగి నింపఁ బవమానుఁడె సుమ్మి ప్రవీణుఁ డబ్జమా!॥ ౧౫.

ఉ॥ వేసఁగి వేఁడి వెల్లుబలువెట్టను నే వఱువట్లుగొన్న, సా।
యాసపిపాసు లధ్వగుల కాదరు విం దెవ రంచు నెప్డు, లో।
గాసిలు చుంటఁ జేసి, తనుకార్శ్యము నొందెడువారి చెర్వదే।
వాసికె నైక్కజీవనము; వాంఛలప్పట్టు ప దేల గాల్వనా?॥ ౧౬.

చ॥ కొలకొల మంచు నెల్ల ఫలుఁగుల్ దివి నేగుచు, దీయమావిమో
గ్గలగమి ఝుమ్ముఝుమ్మనుచు గండుటళుల్ వెస మూఁగు, నీవు శో
షిలఁగఁ ; గొలంక ! యింక పరిఁ జేరని దింపెన తీయుఁగా కయో
కలుకు మునుం గదా పసను, గాంచిన నీయతిదీనమీనముల్॥ ౧౭.

క॥ తుమ్మెదవలె సౌరభలో। భమ్మున నినుఁ జేరె ననుచు భావింపకు మీ।
తెమ్మెరను; లోకహితముగఁ। పమ్మా ! యిలఁ దర్థి యగు సుదారుం డయ్యెన్॥ ౧౮.

క॥ మానముఁ బూనకు మాలతి ! । మానుగ గుంజితము సలుపుమధుకరమునెడన్ ; ।
దానకళాగురువులు సం । తానతరువు లెల్ల దీనిఁ దమతలఁ దాల్చున్॥ ౧౯.

ఆ॥వె॥ సకలగుణము లున్న, సానుసేవ్యత లేక । పోయె, నేద్విజిహ్వాములకతమున,।
వానిని వ్వహింతు, పాటీర ! తావకా । న్నత్య మహాహా ! యేమనంగ వచ్చు ?॥ ౨౦.

క॥ గహనము సకలము వెదకెను; । బహువిధముల మ్రాఁకు లన్ని పరికించె; నోహో ।
సహకార ! యెక్కడను మధు । లిహము భవత్సమము గాంచ లే దీజగతిన్॥ ౨౧.

క॥ కలపూలతావి, దనకడఁ । దలపెట్టఁగ రాని దేవతరుకుసుమముపై ।
నిలిపి పద మొందు విరి పాం । తల పోఁ దలపోయ వేని, ధన్యుఁడవె యళీ॥ ౨౨.

క॥ పావనివి వింధ్యసంభవ । వో వాహిని ! యివురుచున్న నుచితమె యిది ? లో ।
భావించి చూడు లెస్సగ; । నీవీథులకలుషజలము లీవు గ్రహింతే ?॥ ౨౩.

క॥ పండులుఁ బత్రంబులుఁ, బూ । లుండున దెన్నండు లేదయో ! బర్బురమా ! ।
ముండుల నెప్పుడు నింపుక । యుండెదు; నిన్నెవ్వి గోరి యుపసర్పింతుర్ ?॥ ౨౪

క॥ ఈకానను, గోకిలమా ! । యేకాకివి; కం మెత్త కట్లే మనుమా ;।
కాకు లివి నిర్దయాంబులు । నీ కెగ్గొనరింప కుండు నిజకుల మనుచున్॥ ౨౫.

క॥ స్ఫురితతరువిసరసుషమా । పరిహారక మఖిలజంతుబాధాకర మీ ।
యఱుతుహీనము, నేగొనమున । భరియించెద వెపుడు విడక పాంథశ్రీజనకా॥ ౨౬.

క॥ నీయొద్దకు నేతెంచిన । యీయళికి నవజ్ఞ సేయ కేనుఁగుగున్నా ! ।
నేయమ్మున దానస్తన । నీయమ్ములు కరులు, దీని నెత్తిని బూనుర్॥ ౨౭.

క॥ దేవతరుకుసుమసౌరభ । సేవం గోరికలు దీటి చెలంగెడునళికిన్ ।
బూ వన్య మైనదానిని । సేవించుట కేవలంబుఁ జిట్టకము గదా॥ ౨౮.

క॥ గాలించె నెల్లమ్రాఁకుల । నాలించెను గోకిలముల నడిగి రసాలా ! ।
పోలింప నీకుఁ జాలిన । దీలోకములోనఁ గాన విందిందిరముల్॥ ౨౯.

చ॥ నెనరున నోయిమాలకరి ! నీ వుడు కెండల మండు వేసఁగిం ।
గనుఁగొని కొంచెపాటి యుదకంబు నొసంగి మునర్ప్పుప్రష్టిఁయీ ।

వనిచిన మొక్క కెల్ల భువనంబును జల్లుల ముంచు మేఘనా।
థున మయినన్ యథార్థముగఁ గల్గఁగఁ జేయ నశక్యమౌఁ జుమీ॥ ౩౦.

ఉ॥ వెంగలి తోఁటవాఁడు? పృథివిం గలతేమ హరించిపోయె; నా।
త్యంగ గడుకావిరుల్ గవిసె నాశల; నెండలు మెండు లయ్యె; నం।
పంగియు కీమరుత్స్థలి సహాయకరంబులె యున్నె; యిట్టు ల।
య్యుం గమలాకరం బేచటనుండియొ నిన్ననిచెం బయోముచా!॥ ౩౧.

ఉ॥ ఏకడ దానవార్ఛ్రిము దనేకమిళింపము లేసికల్ భయో।
ద్రేకవిలోలలోచనతఁ దేహబలం బఱు, మౌక్తికవ్రజం।
జేకడఁ బొర్లుచుండెదు, మృగేంద్రుఁడు దాఁ బరలోకమేగ, నా।
వ్వాకట నిస్త్రుటిన్ శ్రమ శివా! చెవి సోఁకు శివావిరావముల్॥ ౩౨.

ఉ॥ మాకరి మ్రాఁకు లన్నిటి సమానప్రయోజనమె పెంచెఁగాని, ప్ర।
త్యేకముఁ జూపఁ డీపగిది కేసక్కనయుక్కటికంబు; నైన ని।
న్నొక క్రమప్రస్పృష్టమయి పూచి, నితాంతలతాంతసౌరభ।
శ్రేకము చేసె లవ్వనరి చేన్ మధుపౌరసపూరితంబుగన్॥ ౩౩.

చ॥ వలము మొదల్కుడుఁ; దిటము సాఁతు, పటిష్ఠము లెల్ల కొమ్మలున్;।
నెల వొరు లెక్కరానిమల; నీ కిఁగ నేజెగ డోనగాధిపా!।
పెలుకులఁ బుట్టు నైన వెఱవేఁకి యొకం డెడనెంచ; నిర్ఘృణుం।
డోలసెదు భుగ్నకీలల మహోగ్రపవాంసఁ గాస్తరుం డయో॥ ౩౪.

ఉ॥ వేసఁగి వేళ వేవలుఁగు వేఁడివెలుంగుల వేఁగి, దీర్ఘము।
లాసరము ల్మనున్ మదిఁ దలంచుచు నెన్నెటొ నెట్ట, నెట్టకేఁ।
జేసినలొంటి పుణ్యమునఁ జేసి కనంబడి నేఁడు? నీరదా!।
గాసిలు చాతకంబుఁ గరకంబుల మొత్తను జిత్తగింతువే?॥ ౩౫.

చ॥ దరికొని కారుచిచ్చు మిను దాఁకెడుమంటల నేర్చుటం, గళా।
బెఁసితీవియ ల్వాదలి చెట్టుగ మాఁడుచుఁ జెట్టు లుండ, నీ।
సిరిగయుచం బిదేటిది? వచింపుము నీలపయోద! సర్వదా।
గురిసెదు కొండకొమ్ములనె కుండల ముంచిన లాగు సోనలన్॥ ౩౬.

క॥ ఓరీ తెరువరి! వెఱవకు। దారి నితని పరుషగర్జితము చెవి సోఁకన్;।
ఘోరభువనార్తిహారణ। కారణజలదాత యితఁడు ఘనుఁ డని వినవో?॥ ౩౭.

ఉ॥ సౌరభమా జగన్నుతము; శైత్య మికఁ స్వచనోత్తరంబె పో;।
కీరితి దిగ్వ్యనానిలయ ఖేలన మైనను జంపనద్రుమా!।
ఘోరవిషానలార్చులను గోటరకోటిని గ్రాయుచుండు క్రూ।
రోరగముల్ త్వదీయసుగుణోత్కరమెల్లను మ్రింగెడుం గటా॥ ౩౯.

క. కోరిక, మోమోటమి, చెలి। కారము, గారిమియు నేది గానము; మైనన్।
ఘోర మగుభువనతాపము। దూరము గావించు నున్నతుఁడు ఘనుఁ డౌరా॥ ౩౯.

ఉ॥ అప్పపుఁగొల్నఁ బుట్టు; రవిహస్తమునన్ విడిమట్టు; లచ్చికిన్।
రచ్చవు; వాఁచు వేల్పులమనంబులఁ దావి; మ ఱేఁగొనంబులం।
దొచ్చెము లేదు; మచ్చిక ద్విజోత్తమహంసము నాదరించు మన్।
వచ్చిన, నిఁక కన్న నెఱవాసికి నెక్కుడు నీవు పద్మమా॥

ఉ॥ ప్రొద్దున సద్ది యామణులు పొగ్గెడు వేలను జాలతాలతో;।
నిద్దురవోవు లచ్చిదొర, నీరచరంబులతో జలంబులన్;।
బెద్దతనంపుసొంపు నవివేకము నీకడ రెండుఁ దోఁచు; నిం।
దద్ద పయోధి! భూషణ మొనర్తునొ? దూషణముం బొనర్తునో?॥ ౪౧.

క॥ నీయీమణు లేమిటి క। భ్రాయిత మీకాయ మేల? రత్నాకరుఁడా!।
వా యొండినవారలకున్। నీయొద్దను బచ్చిమంచినీ ళ్ళోసపవుగా॥ ౪౨.

ఉ॥ నీరము లిన్ని యుండఁగనె నీవు తృషార్తుడప్పిడీర్పఁగా।
నేరవ యేని, యొల్లెడల నిప్పుకలం గురియించు కొంచు, ఁగా।
సారమ! మండువేసఁగి వెసం జనుదే, వఱువట్లు వట్టునాఁ।
డేరిదగన్ హరింపఁ గల వించుక లోఁ బరికించి చూడుమా॥ ౪౩.

క॥ కోపం బెవ రాదుగదా। కూపారమ! నిన్ను నే నొకొం డనియెద; నీ।
దాపునఁ గొని ఘనుఁ డోసఁగెడు। నాపొఘుము గూడఁ బట్టి హరియింతు వయో॥౪౪.

ఆవె. వేల్పుఁటేటిలోఁ బ్రవేశించునిన్ను మే। మాఁగఁ బోము గాని వాఁగు కాన!।
యొక్కమాట విను మయుక్త మానది మోల। నీతరంగలీల నెగడఁ జేయు॥ ౪౫.

ఉ॥ వాసవునందనంబునను వాసికి నెక్కినయాగి మ్రాఁకులన్।
వాసనఁ జూచి తా విడుచుప్రావిరులన్ దెలిగంట్లు మూరుకో,।
భాషిలు తేఁటి, నిన్ను విధివక్రతఁ గోరఁగ, లోభి వాచుఁ బు।
ష్పాసవ మీడి తే వహాహ! యంబుజమా! నిను నేమనంగలన్?

క॥ బిసవిసరము మెసవితి సా;। రసముల సేవించి తసమరస మానితి; నీ।
వసమె కలహంస! మరు మే।లిసు మంతయు సలిపికొనఁగ నీసరసునకున్॥ ౪౭.

ఉ॥ కన్నులపండువై నననకాయనఁ దోఁచినపూవుగుత్తులం
దున్నెలపాటఁ బాడుచు, మనోజ్ఞత నీవు ఘటించినట్టి యీ
చిన్నిరసాలశాఖ, విధిచెల్గుని నేఁడు కృశింప, దీనిచోఁ
దిన్నన వప్పి వర్తిలిరఁ, దేఁటి! త్వదన్యము నీచ ముండునే ?॥ ౪౮.

చ॥ గరువముచేత నిత్రి! కనుగానక నీ విటు లేటిపిండుతోఁ
సరసవిహారఖేలనము సల్పెద పీవనమందుఁ; జూడుకోఁ,
గురునఖరప్రభిన్నకరికుంభగళద్రుధిరార్ద్రమౌక్తిక
స్ఫురితము దీనిఁ గేసరికిశోరవిహారధరాగ్రసీమముల్ ॥ ౪౯॥

క॥ అఁకట నకనకపడియును । దేఁకువ లే కెదురుపడినపీనమృగాళిన్ ।
వీఁకను బోకార్చునె కరిఁ । దాఁకి కెడపు బొబ్బమెకము దానుబ్బెసఁగన్ ?॥ ౫౦.

క॥ భిన్నకరికుంభముక్తా చ్ఛన్నవసుంధరము, సింహసత్త్వము మెట్టుల్ ।
విన్నపముఁ జేసికొను మృగ । సన్నిధి, నాత్మీయశౌర్యసాహసగరిమన్ ?॥ ౫౧.

ఉ॥ ఓరిమదాంధవృష్టి! గజయూధప! సంగడికాఁడ! ఘోరకాం
తారముమధ్యమం దిట క్షణంబును నల్వక సాటిపోర; స్తం
బేరమబుద్ధి శాతనఖభిన్నపృథూపలభీర మైనకం
ఠీరవశేఖరంబు శయనించిన దీగిరిగహ్వరంబునన్॥ ౫౨.

క॥ గిరిగహ్వరములఁ గలభమ! । గురుగర్వమునం జరింపకుమ; మేల్కొనినన్ ।
హరిశిశువు పాలకంపువు, । కరిణీపరిశేషితంబు గహ్వరి గాదే ?॥ ౫౩.

ఉ॥ మొక్కలు పెంచువాఁడుకను, బుణ్యుఁడు నాటెను దోఁటవాఁడు, దా
నొక్కెడ మూలగాఁ బొగడయున్ వనమందు; ని దేమొయుండు వాఁ
డక్కడ నుండి యీమొలక, యంతట రెక్కొని చక్కఁ బూచి పెం
పెక్కిన కమ్మతావులను నెల్లజగంబుల ముంచె నొక్కటన్॥ ౫౪.

శా॥ స్తోకాంతఃపరిఖేలనభ్రమితపాఠీనోల్లోలకల్లోలమా
లాకోలాహలమున్, హరిద్విరదము ల్లంఘాద్రిసంక్షోభ మం
చాకర్ణించుతిమింగిలాంగగిలినప్రౌఢాస్య మారాఘువం
బీకంధిం బొలయల్క వీడునెడ నిం కేచోటఁ గ్రీడించెదున్ ?॥ ౫౫.

ఉ॥ కొన్నిటి నేనుఁగు ల్విటిచెఁ; గొన్ని నెగళ్ళకు భిన్నమయ్యెఁ; ద
క్కున్నవి గ్రీష్మభానుకిరణౌఘముచే మసి యయ్యెఁ జెట్టు లి
ట్లన్నియుఁ బోవ, మూలఁ గన నౌనిది గూడ లవంగవల్లి, కా
నన్నివు అయ్యెడున్, దవమునన్ భువి దావి బువుల్కొనన్ గటా॥ ౫౬

ఉ॥ నాకముమాళిమానికము వర్ధ్ఛితగ్రామము కీగిచెట్లకున్,।
శాకవిరోధికిన్ శచికిఁ బండిన పున్నెపుఁ బంటవైనయో।
ప్రాకటనందనంబ! బుధవర్గము, ఖాండవరంగతాండవా।
స్తోకనటుండు నీకు శిఖి దూరము గా, విధి నెవ్వఁడేడున్॥ ౫౭.

చ॥ తనతనవ్యాప్తిలోం జనము దారిన నాకడనుండి, చంచుకో।
టిని బగిలించి తల్పును, బ్రదీన మొనర్చెద గూఁటినుండి నే।
నని, శుకపోత మిట్టులు మనోమృతపానము సేయుచుండ, లో।
ననుగరితుండ సన్నిభఫణాధర ముద్ధతిఁ దూకెఁ దారునన్॥ ౫౮.

చ॥ కడిఁది కరళ్ళు పెల్లెగయ, గట్టులు పొట్ట నడంగఁ, బొల్చని।
క్కడలిపడంతుకన్ వెడపెకంబులు డిగ్గఁ దలంతురేల? యి ।
క్కడనె సముచ్ఛలచ్ఛటులకాండమునన్ సుడిగుండమందుఁదాఁ।
బడి, గిఱు గిఱ్ఱునం దిరిగి, భద్రగజం బడు గంటె వెంటనే॥ ౫౯.

చ॥ కోదమ! శమించి పొల్గుడుచుకో; కలుకుంగడకంటిచూపులన్।
మదకరిబుద్ధి దిక్కులను మాటికి నేటికిఁ జిమ్మెదీవు? ఆ।
హ్లాదవెడుమూఁడులోకములయుంబరితాపము శాంతి పొందఁగాఁ।
జడల నవాంబు వంబుదము శబ్దము సల్పెడు ధీరధీరతన్॥ ౬౦.

క॥ చాలింపుము నీగర్జిత। మాలించిమనీయగర్భమం దొకనెల వో।
చూలిది గదలెడు మదశుం। డాలం బనునచ్చలంబునం జలధరమా॥ ౬౧.

క॥ వేదండగండకండూ। చ్ఛేదనపాండిత్యమహితసింహము, దానా।
వేదించు నేమిశౌర్యము, । మేదిని క్షుద్రంబులైనమృగములతోడన్?। ౬౨.

చ॥ జల మమలంబు పుట్టినిలు; చామలమోములఁ గేరు సౌరు; గా।
ములదొరకేలు గీము; క్రతుభుక్సతిచోరము సౌరభంబు; చే।
శలకవివాక్సుభాండమవు; సర్వధనంబవు సూనధన్వికో।
జలజమ! నీ వయో మధుపజాలికిఁ గూర్చిన నేమనం గలన్?॥ ౬౩.

క॥ నయనములు మొగిచి లీలగ। శయనించెద వేమినిదుర? సామజవ! నీ।
కయినది పగ హరితో; ని। శ్చయముగ నిది పెరిఁగి పెరిఁగి చావై మూఁడున్।౬౪.

ఆ,వె,విబుధునోరనుండి వేవేగ నడుపులు। వెడల వెట్టకేని వెడలె నేని।
మరలఁబడవుస్తుమ్మి, మాతంగపోతంబు। వదనమున మనోజ్ఞరదము లట్లు॥ ౬౫.

శా॥ ఔదార్యంబు జగచ్ఛ్రుతం బఖిజనం బంభోనిధానంబు; నా।
నాదిత్యాశయహారి సౌరభము; శక్రారామ మావాస మో।

పహో దేవాంగన ! యర్థికోట్ల కిడు గో, నున్నత వివేకం బొకం।
డేదాతల్ సరి నీవు ? సర్వసుగుణోత్కృష్టంబ వీవేసుమీ॥ ౬౬.

ఉ॥ ఏ నొకరుండఁ గానె హరియింతును నన్నిన ప్రాణిప్రాణముల్।
లో నెన రింత లేక ? యని లుబ్ధక ! నింపెలఁ బోను ; పార్థివా।
స్థానములందుఁ, దీర్ఘములఁ, ద్వాస్సుకత్యాభిలుల్ నిగూఢను।
గ్రాసము లెంప ఋంపెరు, నిరంతరసాధుసమాజహింసకుల్ ? ॥ ౬౭.

క॥ కమ్మనిమాటల నటివిన । యమ్మన నమ్మించి చెఱుతు రఁట సాధుల ; నీ।
వమ్మొయివారికి మోసెవ । వమ్మ ? నీ తెలివి యేమి కరిగెం ? బుడపా॥ ౬౮.

చ॥ ఇత వెపుడుం జగంబునను నెంచుమనోగతి సాటిలేని పం।
చితవచనావళీరచన చెప్పఁగ నస్యను ; యాత్రహృద్య మా।
కృతి ; భువనోత్తరంబు కృతి ; యీయది యాయది నాఁగ నేల ? పం।
డితులది యేది చూచినను నిక్కము వాక్కులకుం దవీయమే॥ ౬౯.

తే,గీ॥ ఆపదల కగ్గ మగుచు మహానుభావుఁ । డకృతపూర్వము నౌదార్య మగపఱచెడు ;।
నగ్నిదమును బడియె నల్లగలు మిగుల । బుగులుకొలిపెడుఁ గదల నబ్బురపుపలపు॥ ౭౦.

క॥ భువనాభిరామగుణగౌ । రవగుంఫితబుధులరుపయు రమ్యను ; దివ్య।
ల్బ్బవులుకొన వలచుకుంతుమ । పువుకటుతయు నతిమనోజ్ఞముగ నుండుఁగదా॥ ౭౧.

ఉ॥ లీలగ శారదాపురములిబ్బుల దోఁచినవారిమోళ్లు, వి।
ద్యాలయనిగ్రహైకకణహారులు పామరు లింత తుళ్ళిరా,।
కాలిడు నేఁట జేపట నిఁకన్, ఫణినెత్తిని బక్షిపిల్ల, శుం।
డాలమునౌదలన్ శశము, నవ్వుచు సింగముమూళి వేఁపియున్॥ ౭౨.

క॥ పరుషాక్షరవచనంబుల । గురుజన మదలింప, నరులు గొప్పతనంబుం।
బొరయుదురు ; సాన నొరయక । నరనాథులశిరము లెక్కునా రతనంబుల్ ? ॥ ౭౩.

తే,గీ॥ త్రాఁచుఁబాముల్క బూను గంధంపుమ్రాను ; । దీప మెప్పుడు మసిని నెత్తిని ధరించుఁ ;
జందమామయునాలాగె కందుదాల్చుఁ । గొండెగాండ్రనుగద చేర్చుకొందురు ప్రేండ్లు॥ ౭౪.

క॥ కోరక యుండెనె జగ మప । కారంబులఁ గరముఁ దనుపుఁ గద సజ్జనుఁ డే।
రారాధించిరి చంద్రు ? ను । దారకరంబులను గలువ నతఁ డలరించున్॥ ౭౫.

క॥ కైకొని పాలునుబోలెన । నేకము లగు మేలు లొంచ కేసందియు మా।
రా ! కడఁగను దోఁగింపఁగ ! । గాకోదరసోదరుండు ఖలుఁ డీజగతిన్॥ ౭౬.

శా॥ పాండిత్యం బది వోయి యేనిక్కాలా కాష్ఠం బనొ్య నందిన్నె మొ।
వ్వం దుంపంబడె నష్టకష్టముల నుష్పాత్రిపోత్పవంబందు, రూ।
ఢుం డై యున్నట వాఁడు, మేల్చఁ యచి, తాటోటుంపనానక్ గదుక్। ౧
మెం దోష్టంగను, నిప్పు డేమనుచు దీనిక్ వేసికిం దెల్పుదుక్?॥ ౨౭.

తే.గీ॥ జనిత కాపట్యదోపంబు సరసి,మాఁటఁ। జేటు పమ కని, దవ్వుల నజ్ఞమిత్రు ఖలుని,
దారుణం బైన గరళసంబు కారణముల్, । సకలమానవు లాశీవిషమ్మును బోలె;॥ ౨౮

చ॥ అసురుపరాస్త్రసంగతిని స్వార్థపరత్వము వీడుచుక్, స్వధా।
వనమున నఖేంద్రత్రైర్య మొందనక్, గుణభూతసమూహమం దుదా।
త్త మహిమ నొందఁ సఁగా లలితతక్ వనలోఁ గడ, వశ్రులక్ నితాం।
తమును సమగ్రతక్ బురుషనామముచే నొకఁ డున్నతస్థితిక్;॥ ౨౯.

తే.గీ॥ వంశభవుఁ డయ్యుఁ దాగుణవంతుఁ డయ్యుఁ । జెందు మహిమను సంగవిశేషమునన ;
వీణాదండంబు వలుఁద తుంబీఫలంబుఁ । బొరయ దుండినచో సభాపూజ్య మగునె?॥ ౩౦

తే.గీ॥ అపరిమితములు సుగుణము లన్ని యున్న,। దూష్యమగు వస్తు వొకమహాదోషమునను,
మహిని సకలరసాయనమహిత మయ్యు । నుగ్ర మగుకంపుచేత వెల్లుల్లి వోలె;॥ ౩౧

క॥ హితమే యొనరించు విప । ద్గతుఁ డైనను సద్గుణుండు ;దార్కాణ మిదే;।
క్షితి సమ్మూర్ఛిత మైనను, । మృత మైనను, పారదంబు మే ల్సలుప దొకో?॥ ౩౨

ఉ॥ చూచి వనంబులో శశశిశోరము, నాడుచు నుల్కఁ,భీతికిం ।
బాచెడిభర్తృబాహువులమాటున దాఁగెడుసీత, ఘోరదో ।
షాచరనీత యై సుడువ శక్యము గానియవస్థ కయ్యయో!।
గోచర యయ్యె, లాంగలపుఁగోఁటలసోఁకులు చుట్టు మూఁగఁగక్;॥ ౩౩

చ॥ ఘనభుజశక్త్యహోపురుషికక్, బలుమా అమరాళిసమ్ముఖ।
మ్మునఁ బ్రకటించి,పూఁచి, శరముం బురభేదనుమీఁద నేయఁగా,।
ననిమిషబాలికామణికటాక్షసుమార్చనయోగ్య మైనయా।
తనిమెయి, ఫాలకీలిభసితచ్ఛట కాస్పద మయ్యె; నయ్యయో!॥ ౩౪

తే.గీ॥ ఉచిత మగుఁ జామ్మి క్రోఁతులకూలగమునఁ,। బృసుల కిరుశాఖ లున్నతపీఠములుగఁ,
గిచకిచలు చారుసల్లాపనిచయములుగఁ,। గజపులును జుక్క లతిథిసత్కారములుగ;॥

మ॥ ఎది తీర్థంబు?ముకుందపాదభజనం బే; రత్న మే దచ్ఛపుక్।
మది; శాస్త్రి యెది? యేది విన్న నడఁగుక్ ద్వైతాంధకారంబ ది।
య్యది మిత్రం బనిశోపకారకము తత్త్వార్థానబోధం బరుం।
డుద మాశత్రువు నేది? తెల్పు సఖుఁడా!దుర్వాసనాపుంజ మే;॥ ౩౫

। వేదాంత మంత నేర్చిన । సా దెట్లగు దుర్జనుండు? సంద్రమలోనన్ ।
బాదుకొని యున్న, మెత్తన । గాదుర మైనాకనగము, కాసంతైనన్ ;॥ ౮౮

ఆ॰బాగు సుమీ నైర్గుణ్యమె ; । ఛీ! గుణ గౌరవము ; కడమచెట్టులు మిగులన్ ।
రాగిల్లు చుండఁ, బాటీ । రాగంబులు ఖండితంబు లగు మొదలంటన్ ;॥ ౮౯

। పరపతిసర్పణచింతా । భరవహనాప్సులకు నగ్గపడనిజాంతః।
కరణముతోడ సుఖంబుగ । ధరణీరుహనివహములు సదా జీవించున్ ;॥ ౯౦

తే,గీ॥ నైజగుణజాలమునను శూన్యమునఁ గూడ । గుణగణంబును గల్పించుకొనుచు నెపుడు,
విరరములఁ గన్న మాటుచు వెలయు, సాలె । పురుగువోలెను నుత్తమపూరుషుండు;॥

॥ సాదు లనుమాదివాముల । నేదుటకును జాత వేదుఁ డితరులమదిపై ।
రావ యనుచిచ్చు నార్పగఁ । నీఁడ గదా ఖలుఁడు; వాని నెవ్వఁడు పొగడున్ ?॥ ౯౧

॥ పరగుహ్యగుప్తి నిపుణుఁ । నిరతజనాపేక్షణీయునిన్ గుణమయు నం ।
బరమును బోనిమహాజను, । గరముం జెఱుపంగురు మూషకములట్లు ఖలుల్ ;॥ ౯౨

తే,గీ॥ వసుధఁ గీర్తిసౌరభనముకు వెల్లుగ్గి, । యొరుల శైత్యమునకు హుతవహుండు,
గనికరంపుఁగుసుమమునకును గగనంబు, । దుర్జనుండు సుజనదుఃఖదుండు;॥ ౯౩

తే,గీ॥ పుష్పఫలపత్రచయభారమును వహించి, । గ్రీష్మబాధకు శీతార్తికిని సహించి,।
యితరులసుఖంబునకు దేహ మిడువదాన్య । గురువు తరువున కేను మ్రొక్కుదును మదిని; ॥

క॥ హాలహాలముఁ గ్రోలఁ, గాలా । నలమును జుంబింప, భీషణవ్యాళముఁ గౌఁ ।
గిలిగొనఁగ, నిచ్ఛగింతురు, । ఖలులను లోఁబఱుచుకొనఁగఁ గడఁగెడువారల్ ;॥ ౯౫

ఆ,వె॥ వాడఁ బాఱు పేదవారిపై రులమాని । నేలతాల్పులందు నెఱపెదీవి;।
యున్నతంపుఁ బదము నొంది మత్తిల్లుతా । వకవివేక మెఱుకపడియె ; జలద!॥ ౯౬

క॥ గిరులు గురు లంతకంటెను । గురువు ధరణి దానికంటె గురువు జగంబుల్ ;॥
గురు లంతకున్ మహాత్ములు, । పొరయరు చలనంబు ప్రళయమునను వారల్ ;॥ ౯౭

క॥ విత్తనములు వి త్తెడును వి । యత్తలమున, వ్రాయు నీట నక్కరములు, మే ।
ల్చిత్రరువు లిఖించెదను మ । రుత్తున, ఖలు నెడల మేలు జరుపువాఁడు మహిన్ ;॥ ౯౮

తే,గీ॥ అజ్ఞుఁ డెన్వఁడేని హారంబు మెడ వేయ, । మర్కటంబు దానిమహిమఁ గను నె? ।
నాకి మూరుకొని యనంతరం బిడుకొను, ముడిచి ముద్దఁ జేసి మూడిక్రింద;॥ ౯౯

చ॥ మలినుఁడవైన నీ విది సముంచితరాగమునం దనర్చెదుక్ ;।
గలకల నవ్వుమోము నిది నైకొనుఁ, జేరిలరి వైన నీవు; చం ।
చలుఁడవె యైన నీ విది యజస్ర మగున్ సరసాంతరంగ; యూ ।
వలినిని నేమికారణమునన్ ద్యజియించెద వీవు ముప్పుదా!॥ ౧౦౦

ఆ.వె.॥ధనికువలన ధనము తననిమిత్తము గొన్న, । మోముతెలివి దప్పు టేమి వింత?
యబ్ధినీరు లిన్ని యన్యార్థమే కొను । ఘనునియొడలె తాల్పు గాళిమంబు;॥ ౧౦౧

తే.గీ.॥జనరుడొకకొండ సత్త్వంబు; జాతికట్టె; । చెలిమి చిలువలతో; నైన నలయజ్ఞాత!
జగతిలోపల నీకు విస్తారమహిమ । గలుగుటకు, నీగుణంబులే కారణములు;॥ ౧౦౨

ఉ.॥ ఏమిప్రయోజనంబునకు నీవు గడించెద వక్కటా! గుణ ।
స్తోమము? సజ్జనుండ! విను; శోభకు నన్ను హితంబు జెప్పెదన్;।
భామిని రామణీయకమనోహరవస్తువు లేవి దానిచే ।
నోముకొనుం గళేబర ముసద్ధతు డీకలి ప్రత్యహంబునన్;॥ ౧౦౩

ఉ.॥కోమలపల్లవాగ్రమతరుగుంజదళిప్రకరాభిరామ! యో ।
యామని! నీవు లేనిసమయంబున గోయిలకున్, వికాసన ।
త్తామరసంబులై పొలుమదచ్చికడల్, పొగగ్రమ్మినట్టు లై; ।
వేమరు దేహదాహ మొనవించెడు గాలులు, గీలులుం బలెన్;॥ ౧౦౪

క॥ గిరిగండశిలలు, నిఝర । తరనఖరశిఖరములకు, మదావళిబుద్ధిన్ ।
మురియలుగ జేయుహరికిని, । దురదృష్టపువేళ, నెఱచి దొరకద యెంకున్;॥౧౦౫

ఆ.వె.॥నడికిరేయి పుట్టినది యయ్యు, సింగంపు । గొదమ, యూలకించి కొంచె ముఖము,।
తల్లియంకమున మెదల కుంప నొడ లెల్ల । గుంచి యట్టె యుఱుక బొంచియుండు;॥

క॥ గుణపక్షపాత మే మని । ప్రణుతింతును నీది? ఖలుడ! పటుదివ్యమతీ!।
గుణసేవధులను సాధుల, । నణుమాత్రము మఱచి పో వహర్నిశ మహహా;॥ ౧౦౭

క॥ వాకొనుదునురా ఖలుడా! । నీకథ వివరముగ బుధులనికటమునందున్?।
ఛీ! కాదటు పాపాత్మక! । నీకథ దగ్ధంబు గాను! నే నుడువనురా;॥ ౧౦౮

క॥ ఆనందరుచిరవనదావానల ముసుశీలనూనుహాస్వోద్వవము, వి ।
జ్ఞానవరదీపికాపవ । మానమ్ము, ఖలజనసమాగమము, దలపోయన్;॥ ౧౦౯

క॥ సాధుహితకృత్యములకున్ । బాధకములు బన్న, ఖలులె ప్రజ్ఞావంతుల్; ।
శీధ్రమలె నిపుణము లవ । రాధలవము లేనివారి ప్రాణము దీయన్;॥ ౧౧౦

ఉ॥కాలభుజంగి నంచె ముఖగహ్వరమందును గొండె గాంధ్రమున్ ।
నాలుగు మోము లున్నదొర, నాలుక పేరిట; గా దటన్న, మం ।
త్రాలతెఱం గెఱుంగనిజనమ్ము లయో! యది తమ్ము నాకగా, ।
వైళమ ప్రాణవాయువుల బాయుట, యేగతి సంభవించెడున్?॥ ౧౧౧

క॥ సలిపితి ఘనకావ్యము; ని । ర్మల మగుచిరకీర్తి యుక్త సమార్జిత మయ్యెన్;।
గలకాలము దీవనలన్ । ఖలికాడా! నీకు నేను జేయుచు నుందున్;॥ ౧౧౨

క॥ అమృతంబు వాక్కు మాధు । ర్యమునన్, మానసము వారిరాశి, వరచ్చం ।
ద్రముచంద్రిక తలయశ మని । శము పరకార్యము ఘటించుసత్పురుషులకున్; ॥౧౧౩

క॥ కూయంగ రాక యడఁగిన । మాయొలుఁ గిఁక వచ్చి యిచ్చు మాధవుఁ డనుచున్, ।
గోయిల తలపోయుతఱిన్, । బోయఁడు శర మచ్చిపోవఁ బొట్టను గ్రుచ్చెన్; ॥ ౧౧౪

ఆ,వె॥ నిర్గుణుండు గాంచ నేరఁడు శోభ, సాడంబరంబు మిక్కుటముగ నున్న, ।
నరయఁ దావి లేనియాపాతరమణీయ । పుష్పసంచయమున బూరుగట్లు; ॥ ౧౧౫

క॥ పంకంబు లేనిసరసును, । మంకులు లేనట్టిసదసు, మఱి కటువర్ణో ।
ట్టంకణము లేనికృతి, విష । యాంతరములు లేనిమతియు, నతిహృద్యంబుల్; ॥ ౧౧౬

ఆ,వె॥ అట్టి దిట్టి దనుచు నన రానికావ్యంపు । దత్త్వ మెఱుఁగువారు ధరణి నరుదు;
మాధురీధురీణమకరందరసకోవి । దంబు బంభరంబు దక్క నేది? ॥ ౧౧౭

తే,గీ॥ పాండువర్ణను గంటకప్రకరపూర్ణఁ । గేవలరజోవతిని గేతకిని, నయారె! ।
చంచరీకమ! నీలోన నించుకైన । సిగ్గుఁ బొందక, యెట్లు భజించె దీవు? ॥ ౧౧౮

క॥ తానంబు లేనిరాగము, । మానం బనుమాట లేనిమానవవిభుఁడున్, ।
దానంబు లేనిదంతియు, । జ్ఞానము లేనట్టియతియు, జగతి సమానుల్; ॥ ౧౧౯

ఆ,వె॥ పరులచేతఁ గాక, నరులసద్గుణములు । తమకుఁ దామ వెలయు, ధరణియందు; ।
బ్రస్తుతింపఁ దగినకస్తూరికాపరి । మళము, శపథమునను తెలియఁబడుట? ॥ ౧౨౦

ఉ॥ సకలామోదశిరఃకిరీట మగుయుష్మద్భూరిసౌరభ్య మెం ।
చుక నీ వెప్పుడు విట్టువీఁగకుమి; కస్తూరి! కిరాతాళిదృ ।
ష్టికి మా లోఁగిరిగహ్వరంబునను నొంటిం దాఁగునీతండ్రి కీ ।
వకటా! దానన కాదె తెచ్చెదవు ప్రాణాపాయముం జెచ్చెరన్? ॥ ౧౨౧

క॥ కుమతిఁ దొలఁగించుఁ; జిత్తము । నమలముఁ గావించు; నఘము నడఁగించును; సూ ।
తములయెడ గరుణ పెనుచును; । సమకొన దేమంగళంబు సజ్జనమైత్రిన్? ॥౧౨౨

క॥ నిరతేతరోపకారా । చరణపరామలమనస్క సత్పురుషోక్తుల్, ।
పరఁగుఁ బరమౌషధంబుల । కరణిం, దాత్కాలిక మగుకటుభావమునన్; ॥ ౧౨౩

తే,గీ॥ మొకరి తేఁటులపాటలపొగడికలను । విని, నయాతిశయంబున వృక్షములను ।
లడవిలో నిట నేలకు నంటునట్టు । లొదలలు వాంచుకొని యున్న వని తలంతు; ॥౧౨౪

ఆ,వె॥ మృతునిజీవితేచ్ఛ, కృపణునిదానేచ్ఛ, । చెడిప కాత్మభర్తయెడల నిచ్ఛ, ।
కోడెత్రాఁచుతాల్మి, కుటిలునిచెల్మి, య । దృష్టచరము లజునిసృష్టియందు; ॥ ౧౨౫

తే,గీ॥ ఉత్తములకాంతలైనను గ్రొత్తదులుగ । నుండు రని విశ్వసించుట యొప్పదాపుడు
రాజవల్లభ లైనకైరవిణు లకట! । మధుపవర్గముతోడ సమ్మతి రమించు; ॥ ౧౨౬

క॥ యాచితము గాక సుఖ మిడు, । యాచించిన నిడదు నరుల కఖిలధనంబుల్ ।
చూచుచు నుండఁ హరించున । హా! చెప్పెడి దేమి దైవ ముచ్ఛృంఖలమే;॥ ౧౨౭

మ॥ గురుదోరర్గళఖండలీకృతమహాకోదండచండాంశుగో ।
త్కరవిధ్వస్తవిపక్షమండలుని నిన్ గన్గొంచు యుద్ధావనిన్; ।
వరగాండీవవిముక్తకాండవలయజ్వాలావళీభ్రష్టని ।
ర్జరరాట్ఖాండవరుష్టపాండవుని నెంచం దేక్షితీశుం డహో? ॥ ౧౨౮

క॥ మంజుతరఖండితాష్ప । క్కుంజాళీరంజనప్రగల్భంబులు, ది । గ్కు
క్పుంజాభరణంబులు, ప్రో । చుం జేటు లడంచి, బాలసూర్యాతపముల్? ॥ ౧౨౯

చ॥ ఎడలినఁ జేరిను, హత్తదు సుమీ త్వరపుం బలెఁ;వత్తుకొన్ననున్ ।
సడలును బాగ్రియికంబుగను, జాలఁ బ్రయత్నము చేసి నిల్పినన్; ।
సడలక యుండినం గనదు సామ్యము;సామ్యము గన్న మొక్కపో ।
రేఁడు;శిథిలత్వ మింత స్మరియించినచో గ్యనపెట్టు డెందమున్;॥ ౧౩౦

ఆ॥వె॥ పరుల దుఃఖమునకు భయముఁ బొందుచు నుందు । రాత్మదుఃఖమునకు నడల రెపుడు;।
నర్థములను లోభులై యుండ రెంతయుఁ । బిపినిగొట్లు సుజను లసమునందు;॥ ౧౩౧

క॥ విమలజ్ఞానులు బుధవ । ర్గమునను, యతిసంతతిని విరక్తులు, గలరే ।
క్షమ, జ్ఞాతులందు నరయా । పమున గరోద్గారు లుంద్రు పరమదురాత్ముల్;॥ ౧౩౨

ఈక్రిందివి పండితరాజశతక మనఁబడు వేఱొకప్రతినిబట్టి

మొట్టమొదట నేఁ జెలిఁగించినవి.



చ॥ గుమగుమఁ గమ్మతావులు బుగుల్కొనఁ జేసితి వెల్లదిక్కులం ।
దము నరుసాభిరామముగఁ దాల్చితి వైన, ఫలోత్తమా! రసా ।
లమ! నినుఁ జూచి నాకు మిగులన్ దగ పర్యేతఁ జుమ్మి;నీదు డెం ।
దము పలుముళ్ళమారి,కఠినంబును గా, దలపోయఁగాఁ?గటా! ॥ ౧౩౩

క॥ చిరకాలశిక్షితులు నరు । లరుదుగఁ జిత్రమున నేర్చి రలరులు వ్రాయన్; ।
బరిమళము వాని కేగతి । దొరకొను? మధు వెట్టు లానుఁ దుమ్మెద లందున్?॥ ౧౩౪

క॥ భువిఁ దిరిగితి వెల్లెడఁ, జె । ప్పవె తుమ్మెద! మాని పక్షపాతము; నెందేఁ ;
జవిగొంటివొ? కంటివొ? విం । టివొ? జాజిం బోలుపూవు నిజ ముండదుగా? ॥ ౧౩౫

క॥ వమ్మసుమి తమ్మిసంభవ । మిమ్మహి జాబిల్లిఁ జూచి యెఱుఁగమి; నటు లే ।
పుష్పవిభుజమ్మమ్మును, । గమ్మనివిరి నమ్మి నెమ్మిగమ్మున గనమిన్;॥ ౧౩౬

క॥ భ్రమ్మరుచు వనకుసుమగు । చ్ఛమ్ముల నళి మూరుకొనదు సంవేగ;నది ర।
మ్యమ్ముగ నుండదొ? యొల్లదొ । తమ్మిదపు వీర్య్వరాజ్య దుర్లంఘ్యము గా?॥ ౧౩౭

క॥ భేకము బకబక లాడుఁగ । దాఁకలుషపుఁబడియనీరు ద్రావుచు;నవ్వరా! ।
కోకిలము గరువ మొందదు; । మాకందరసంబు నిరుపమానముఁ గ్రోలున్;॥ ౧౩౮

క॥ గంధపుమలసంగాతముఁ । బొందినఁ, జందనము లగునె బొంగులు? బోలం ।
డెందము గలవారల కే । చందంబున సంభవించు సరసత్వంబుల్? ॥ ౧౩౯

క॥ వెఱపించెదు కోరడంబుల; । నుఱుమక నోరడఁగి యుండు మోసాగర!నీ।
తెఱఁగట దగగాని తెరువరి । చిఱుదొరు వరసెడును నీకు నిగ్గటు గాదో?॥ ౧౪౦

క॥ నను మాని, యాను సానుగు । నన, వీషట్పద ము టంచు, నవయుచు; జాజీ!।
విను;నాలుగు కాళ్ళది పశు । వనఁబడు, శాటింటఁ బశువునర యిది గాదో?॥ ౧౪౧

క॥ నీతోయకణంబులకే । చాతకపోతంబు రాదు, సరసత్వమున ।
త్వాశయములకే; కాదే । నాతతపద్మాకరంబు లంబుద! లేవే? ॥ ౧౪౨

క॥ ఎందాఁక దీని నెఱుఁగవు । మందారం బనుచు, నంతమట్టునకును, నిం।
దిందిరములు, పొదరుంబొద । రుం, దరువుందగువుఁ, గ్రుమ్మరుటయే సుమ్మీ;॥ ౧౪౩

ఉ॥ నేరెడుఁబండు సల్లఁబడు,నీ రగు నారికడంబు లోనఁ,దా।
మారక హృత్స్ఫుటం బవిసి యుండును దాడిమ మూను నక్కునన్।
భారపుశూలముల్ బనసపండు, త్రిపార్శ్వభయాభ్యసూయలన్,।
పారగు శాకృతుల్ గలరసాలమహాఫలరాజు రాజిలన్;॥ ౧౪౪

మొగడల్ దోఁచిన దాదిగా, దినదినమ్మున్ నిన్ను సేవించునీ।
భ్రమగదేటుల్ వెలి యయ్యెఁ బంటికి;నయో! మాటాడ వీక్షించి;నీ।
మొగ మైనం గన వింతనున్; జోరఁబడెన్ బుర్వుల్ ఫలాభ్యంతరం।
బగువా రెవ్వరొ కానివా రెవరొ, నీ కాదల్వి లే దామ్రమా! ॥ ౧౪౫

ఉ॥ జొత్తిలి సత్తుటన్, వనవసుంధర నేనుఁగునొంగగోళ్ళఁ గ్రొ।
మ్ముత్తెపు లూడి ధ్వాలఁ, గని మోదిలి మ్రాఁకినరేఁగుఁబండు లం।
చెత్తి యొడిం గిరాతి, యిసు మెల్లను బో నుసుమం గొలంకులో,।
నత్తఱి నున్నరూ పెఱుఁగ నైనను, జల్లె నయో! సుపాణిన్;॥ ౧౪౬

మ॥ పసు లేణాదులు; నీ! నిషాదులు సఖిత్వశ్రీగుణగ్రాహులా?।
మసలన్ రా రెవ రిందు నాగరులు; సన్మానుల్ విరాగుల్, గటా!।
దెసలన్ ధూమముచేత నైతమును నెంతేఁ గొల్చు చామోదమున్।
మసిగాఁ గాలు సమూల మీతరుబ్రాహ్మం చేసెం దెబ్బనున్?॥ ౧౪౭

చ॥ నను మధుపం బనాదర మొనర్చి న టంచును, గాంచనంబ!! యి
చ్చను దురపిల్లె దమ్మలినజంతువుతో డిది యేమి? విశ్వమో।
హనవనీలనీరదనిభాకృతి నొప్పు బిసప్రసూనలో ।
చనలయరాశి మేచకకచంబులకుం గుశలంబు గావుతన్;॥ ౧౪౭

ఆ.వె॥ ఇచ్చ ద్రిమ్మరంగ నెల్లపులుంగు లీ । పంజరంపుఁగాఁ బంధిగమున ।
నిచ్చ లిట్టు లుంట, నీ కయో! చిన్నారి । చిలుక! తేనె లోలుసు పలుసు ఫలము;॥ ౧౪౯

క॥ చిలుకలకలభాషణములు, । కలికితనంబులును, మాటకారితనంబుల్ ।
కులశీలము లిన్నియు, ని । ష్ఫలము లె మార్జాలచక్రవర్తులపాలన్;॥ ౧౫౦

ఆ.వె॥ నీదుకడుపులోనఁ బొ(ర్చి)ది వర్ధిలి, నీస । మృద్ధి కెలిమిఁ బొంగు మీనుజీవ।
నంబు నీదుజీవనములోన చెల్లఁగా । కేమ బ్రతుకు నింక నిది? కొలంక!॥ ౧౫౧

చ॥ కనుఁ గనకంబు గాజు సరిగాఁ, జిరకాలమునుండి నీవు పో(షిం)
పున మఱి పూని మాధుకరవుంబని, బంభర మిప్పు డీవు దై।
వనియతి గొడ్డటన్ నఱుకఁబడ్డ, రసాలమ! పొట్టకోస మే।
యనువునఁ, జెట్టుచెట్టు దిరియం గలవో వనమందుఁ? జెల్పుమా;॥ ౧౫౨

క॥ సౌరు గర్యై నాను లన్నియు, । ధరఁ దొరఁగెను బండులున్, నిదాఘంబున మున్;।
పరమాధవ! నీకరుణను । మరలం దరుణత్వ మూను మాకంద మిఁకన్;॥ ౧౫౩

ఉ॥ జాలరి చేతికిం దొరకి చయ్యన జాతి [illegible] భ్రాంత [illegible] తేక త।
జ్జాలములోఁ దగుల్కొని, విసారము [illegible] తెట్టె [illegible] దన్నినన్;।
గూళికంబు వట్టుకొని గొబ్బున [illegible]
యేల విధాత వక్రత వహించిన [illegible] పవల?॥ ౧౫౪

ఉ॥ నేటికిఁ బొద్దుచుట్టటిక మేటికి [illegible]।
చేటికి లచ్చి నెచ్చెలిమి? యేమిటి కించ [illegible]
దీ టాకటమ్మి పుష్పునకు నెన్నిక కెక్కినదాని కక్కటా!।
పాటిలుమంచుఁదువ్వరయుఁ బద్దవ మెవ్వరు దోఁప రైరిగా?॥ ౧౫౫

మ॥ అనఁగా! యించుక సడ్డ చేసి యొకమా టాలించి పో; చాలకా!।
ఘనముల్ మిన్నున నెన్నొ యున్న వయినం గా వన్నియేకక్రమం।
బొనరించున్ ధర వృష్టి నార్ద్రముగఁ గొ న్నత్తే చనుం గొన్ని; ము।
ల్కన వోర్వెచ్చక, మబ్బుమబ్బుకడఁ బల్కం బోకు దీనోక్తులన్; ౧౫౬

చ॥ పటలు ఘటించి మూఁపులను, జాగిలమం గొని పోయి, యొక్కటా।
అటవిని సింహసింధకవిహారము వాటిలుచోట మంచినన్,।

బటపటఁ గుంభికుంభతటపాటనముం బొనరించుసింగము ।
లొటువలె బొబ్బరింపఁ గల దీశునకంబు ! మొఱుంగ గా కటకే ;॥ ౧౫౭.

ఉ॥ మాలిమితా ల్మి దాకెఁ;జలమధ్యమునం జెయి జాకెగుఁ ద్రెద్దు;శై।
లాళులఁ గూరి దారి; చవి లంతట మబ్బులు మీకె;నయ్యయో! ।
ప్రీలెడు నోడ ;సంద్రము తరింపఁగ రానిది;ముంచె దో యిటన్? ।
దేలిచి యొడ్డుఁజేరిచె దొ?నీకయి నున్నవి రెండు;మారుతా!॥ ౧౫౮.

శా॥ఆమూలాగ్రము మేను ముం డ్లడుప లే దాయసముల్ నీడ;లే।
దామోదంబు సుమంబులన్;దనుప లే వాఁకొన్నఁ బండుల్;బుధుల్ ।
నీమేలన్ నిల రాక్రమింతు రెవు వింతే కాదు, బర్బూరమా! ।
నీ మేల్; పండినమంచిచెట్లకడకున్ వేంచేయవో కంచె వై?॥ ౧౫౯

ఉ॥అక్కట!వట్టిపస్తులుగదా పలునాళ్లుగఁ;గారుచిచ్చునన్ ।
మిక్కిలి శోషిలెన్;పగ శమింపఁగఁ జాతకపక్షి కిప్పుడే।
గ్రుక్కెఁడు నీ రొసంగు;ప్రతికూలపుగాలి యొకింత వీచెనా,।
యొక్కడ నీవు?నీయుపక మెక్కడఁ?జాతక మేడ?నీరదా!॥ ౧౬౦.

క॥ ధారాధర!తావకజల। ధారల ధర యెల్లఁ బూరితం బయ్యె;నిఁకన్ ।
సారంగతొ్రిటీపుట। పూరణ మన నెంత నీకు?భువనశరణ్యా!॥ ౧౬౧.

క॥ నిందించవానిని మఱి మఱి। నిందించెద వేమిగుణము నీ కంబుద?నో।
రెండిన సారంగమునకుఁ। గొం డొక చినుకొసఁగి కొలఁదిగొద దీర్ప వయో!॥౧౬౨

క॥ ఓరియవిచార! నీరద!। యూరక వారాశిఁ గురిసె దొరు నరయక నిన్।
జేరి, చినుకిడినఁ దనిసెడు। సారంగము, నేల చూడఁ జాలవు జాలిన్;॥ ౧౬౩

క॥ ఖరకిరణునికిరణంబులఁ । బరిశోషిలి, కారుచిచ్చుబారిని బడి, కం।
ధర!శిఖులును బ్రదుకు నిరం। తరతావకభూరివారిధారలచేతన్;॥ ౧౬౪

ఆ,వె॥వానకారును గొన్నాళ్లలోనె పోవు; । జెల్లు పొ ల్లగు నీనీటివెల్లువలును;।
గూలమున నున్నఫలతరుల్ గూలఁ ద్రోయు। నీయఘుంబే, ధునీ! చిరస్థాయి గాని;॥

చ॥మృదులదళప్రసూనఫలబృందముఁ బొందని వేవి తావకా ।
భ్యుదయమాచేత భూరుహసమూహములందు?వసంత!యేమి చె।
ప్పుదుఁ?గొలనోము నోఁచికొని పుట్టినమాబపరీద్రుమాళికిన్,।
బ్రిదిలెను బాడ్లు;పైగను నికృత్తము లయ్యె శిఖాగికాయముల్;॥ ౧౬౬

తే,గీ॥అడుగఁ దలఁచినఁ బర్జన్యు నడుగు నొండె;। దారుణోదన్యచే నొండె దోరు;నార!।
వానకోయిలయే సుమీ మానవంత । మాశకుంతము డిగ్గాయు వగునుగాత;॥ ౧౫౭

ఉ॥ కాల మతిక్రమించెదను; గంధర ! సాకులు మాని నామ్రమీ।
పోలినమాధవాశ్యతరువుం, దడ వేటికి? నీటిబొట్టులన్;।
మూలము లాఱ, రాల దళముల్, బర డెండఁగ నేని కిచ్చె ద।
వ్వేళ? గ్రహించు నెవ్వఁ డతివేలవిషాదము నేల పొందఁగన్?॥ ౧౧౯

తే,గీ॥ ప్రాణ మైనను బాసినఁ బాయుఁ గాని। మానమును మాత్ర మభిమాని మానఁజాలఁ।
డగ్ని హోత్రుఁడు నీ చైన నౌను గాని,। శీతలత మాత్ర మేనాఁడుఁ జెందఁ బోఁడు;॥

క॥ అకట! కుతు కొండి చాతక। మొకచిను కకలంక మెట్టెటో కనుఁగొని, దా।
నికి నోరు దెఱవ, నది దై। వికముగఁ బెనుగాలిఁ జెదరి, పెఱచోఁ బడియెన్;॥ ౧౨౦

క॥ వనద ముఱుముచును రాలుచు। చినుకులు చాతకము లాసఁ జేకొను; దాతల్।
గనలు చిడుకాసువీసము। లవన్యగతికులు గ్రహింతు రతిదైన్యమునన్;॥ ౧౨౧

ఉ॥ నీయెడఁ బన్వళింప హరి, నిల్వ గిరుల్, దిగిభాళి మున్నగు,నా।
త్మాయతముల్ తిమింగిలముఖాంబటముల్ మనఁ, బొట్ట నోసికోఁ।
దోయదముల్, సదా రవివిధుల్ సరిపంతులఁ గ్రుంకఁ దేలఁగా,।
నీయుపకంబుఁ గ్రోల రవ నింపరయొ నీకుఁ? బయోనిధానమా!॥ ౧౨౨

ఉ॥ దండము విద్రుమంబులకు; దండము తావకరత్నరాశికిన్;।
దండము ముత్తియంబులకు; దండము శుక్తుల కోయితోయధీ!।
దండమువండ మన్నియును దక్కువ లేక లభించె మాకు; నే।
వెండియు నివ్వలం బడితి, క్రీలక నక్రకరాళ దంష్ట్రలన్;॥ ౧౨౩

చ॥ ఎరగలి చుట్టుముట్ట దిట; నేయరు బోయలు సాయకంబులం;।
దెర లురు లుచ్చు లొగ్గరు; జనింపదు నైకవిధాతిభీతి; యుం।
చరసి కురంగ మైందవపదాశ్రయ మయ్యె; నెఱుంగునే యటన్।
మరల విరించి రాహురదనవ్రణముల్ ఘటియించు నం చెపన్?॥ ౧౨౪

చ॥ సకలగుణాస్పదం బయినసత్కుసుమంబును నన్ను మాని, యిం।
చుకయును దావి లేని చెడుసూనము నమ్మెత నాను, నయ్యయో!।
మొకరిమిళింద మంచుఁ, గడుఁ బొందకు డెందమునందుఁ గుందు; దం।
పక! యవకాశ ముస్నె మధుపవ్రజమందు వివేకవృత్తికిన్?॥ ౧౨౫

చ॥ మును పమరావతీనగరిముంపటి సుందరనందనంబునం।
దనయము పారిజాతకుసుమాసవ మాని, మనోజ్ఞగానగా।
యన మగుచంచరీక మిపు డక్కట! నోరును గొంతు నెండి, జా।
మ్మనుమృదునాద మేది, రస మానఁగ నేగెను రేఁగుఁబువ్వులన్;॥ ౧౨౬

ఉ॥ ఎత్తుగ మిన్ను ముట్టుసంపహించము లీతడు లేలా? యొరుగు।
బ్బెత్తను మెప్పు జేటివరి నుండుకదై, నది మున్గువారికై।
కెత్తుగఁ జేతి కూలి యయి, యెల్లవిధంబులఁ ; దప్పి జేని, యు॥
న్నెత్తుగ వారితో మునుక పెట్టుగు, నంచుఁ దలంచుఁ గావునక ;॥ ౧౭౫

ఉ॥బంగరుడాలు, గన్నునుసువాసన గల్గి, ప్రసిద్ధి గన్న నే।
చంగిని గాంచి, తమ్మియని దారునఁ గుస్మోప మూఱ గానిలో,
బ్రుంగెను భూమిఁ గన్నుఁగన బ్రుద్ధిగ ; ముంగ్ల గజాల్ గునిగా ; హా!।
భృంగము నిల్వ నేర దట కేనియుఁ బోవఁగ నేరనుం ; జేసీ!॥ ౧౭౬

మ॥ తలఁపక బంధన మొందఁ బుండు ; ప్రాణిఘాతంబున్ మదిం బెట్ట ; మాం।
సల మాంసం బిటు లెక్కలోక్కడున్నం జూడ ; దేశాంతరం।
కలనంబుక స్మరయింప; దీని కడ లోఁ; గంఠీరవ్రతిస్తముల్।
కలభంబుల్ గలనాదుయూథమున కింకం గానఁ గా పెద్దరో ?॥ ౧౭౭

చ॥ దిరిసెనమందు వ్రాలినను, ద్రిప్పరినం గడిమిం జిరంబు, దా।
మరపయిఁ గ్రొత్తపూవటిరను, మత్కానతోఁ గొరవిం జరించినక,।
జరపిన మల్లియం దినము, పట్పద మోహహం కార ! కాలపుక।
వయసను, నెంతమాత్రము భవద్గుణముల్ మఱవంగఁ బోదు సూ ;॥ ౧౭౮

క॥ రాతిరితటి ఖద్యోతము। శీతాంశుఁడు పొడుకనంపసేవు వెలుంగక ;।
ద్యోతింపదు ఖద్యోతము। శీతాంశుఁడు గూడ, వేయిచేతులదొర రాక ;। ౧౭౯

క॥ దోసిట నుండినపూవులు,। వాసించును గాడ యెక్కవగ నిరుగేలా।
హా! సుమనస్సుల పేరిమము। దా నొంపెల్లెడును వామపక్షణసము మై;॥ ౧౮౦

ఉ॥ చిచ్చునకాలకూటము భుజించినశంభుఁడు నీలకంఠుఁడే;।
వచ్చి విపాహులక మొసవుబట్టినముఖ్యుఁడు నీలకంఠుఁడే;
పచ్చికమీఁద మునగిటను బాల్కెడుపుర్వులపేరువి త్త! యో।
పిచ్చుక! నీలకంఠుఁడనె నేను నటించుఁ దలంచుకొంటువో?॥ ౧౮౧

ఆ॥ వె॥ సకలబుధులు రసికసారరసానుమో। దమలె గాక, భిన్నధర్మ లెవరు?।
కుసుమసమయమందుఁ గోకిలస్వర మింపా। కాకియఖపు సొంపా కర్ణములకు? ౧౮౨

క॥ ఇది యోలువేలవంతా। భ్యుగితుఁడు నసుచాయఁ దాంధ్ర
మొనరించినయ। ట్టిది, భామినీవిలాసని। గరిదము,
పాస్తావికాఖ్యకవిలాస
మసక ;॥ ౧౮౩

శ్రీరస్తు.

# భామినీవిలాసము.



ఉ॥ కుంతయు రాహురోషమున సోఁకగు భీతి; కలంకసంగమం।
బింతయు॥ం గనంబడ దేమియుఁ దోఁపదు పాండుభావముం; ।
గాంతరొ! యిట్టి దట్టి దనఁ గానియొకానొకశోభ, సంతతం।
బంతటఁ! దావకీన మగునాననమం దభివృద్ధియై కనున్; ॥ ౧

క॥ నీమేనిగోము నారయఁ, । దామరపూసరము బెట్టిదపుబిజుసు; మృణా।
ళీమార్దవ మనుమానము; । కామిని యిఁకఁ బల్లవాళికథ యేమిటికిన్? ॥ ౨

ఉ॥తోరపుఘర్మబిందువులు దొప్పఁగఁ దోఁగుకపోలపాళిపై।
నూరక కర్ణకుండలము లుయ్యాల లూఁగఁగ, శ్లాఘ్య మాచు నో।
ప్పారెడువస్మదీయమదిరాక్షియవస్థ యొకానొకండు,దా।
నీరిక లెత్తఁ జేయు, స్మరియించినమాత్ర మదిం బ్రమోదమున్; ॥

చ॥కలకల నవ్వునంవపుమొగంబునఁ గస్తురిబొట్టుఁ దీర్చి, కో।
మలి! యలరింపు నేఁడు మునిమాపట, సౌధశిరఃప్రదేశమున్; ।
గలువలగుంపు లాతతవికాసముచేతను భాసితంబు లై; ।
నలుఁగడలున్ స్వకీయవచనంబుల నిండుముదంబు దాల్చెడున్;॥ ౪

ఉ॥ ఆనెఱమందహాసములు, నానిబిడశ్వసితప్రచారముల్, ।
మానిత మైనతాదృగకలంకమనోహరవక్త్రలక్ష్మియున్,।
జానదినావసానవలినప్రతిమానవిలోచనంబులున్, ।
మానస మస్మదీయమును, మత్తిలఁ జేయు నయారె! యిప్పుడున్; ॥ ౫

ఉ॥ పొద్దుట మొక్కఁ నంఘ్రులకుఁ, బుత్రవతీ భవ యంచు ముద్దునన్ ।
బెద్ద లొసంగుదీవనను, వేడుకతోడను నాలకించి యా।
వద్దనె యున్న వల్లభునివైపున కల్లన నింతి దారిచెన్, ।
నిద్దపుమోచ మాదరము నిండినసోగ మెఱుం గపాంగముల్; ॥ ౬

చ॥ ననుఁ గనుప్రీతియుం, గురుజనంబు నెడం గలభీతి, రెండునుం।
బెనఁగొని, చిత్త ముత్తలము పెట్టెడుభీతకురంగశాబలో।
చనదరఫుల్లతామరసచారుతరాక్షివిలాసవైఖరిన్, ।
దనువులు వేయి యెత్తినను దథ్యము నే మఱవంగలేను జూ॥ ౭

చ॥ అలతటి, రేఁగుఁబండులయు నామలకంబుల మాతనాఁడివా।
ఫలముల యున్నతిన్ వయసుఁ బట్టి హరించిననీకుచంబు లో।
చిలుకలకొల్కి! యిప్పుడు విశేషపరిశ్రమ మాచరించు, శ్రీ।
ఫ్కల వెలయింపఁగాఁ గలఘనకుంభరమాహరణోన్నతప్రథన్॥ ౮

తే.గీ॥ లికుచఫలసంపదను మీఱి లీలవోలెఁ, । గనకకలశంబులను దాస్యమున కమర్చి,।
మేరుగిరితోడ నిప్పుడు వైర మాడుఁ । గదవె, యిందీవరాక్షి! నీ[illegible]బ్బిచనులు॥ ౯

క॥ లలితాలకంబు వైశ్రవ । ణలక్ష్మియుత మైననీకనద్గండతలం।
బలరారెడు, నోకలికీ! । తిలకింపఁగ నుత్తరాశ్యగిరియుం బోలెన్॥ ౧౦

చ॥ ఉదయపువెల్గు దోఁపఁగ నె యొయ్యన మేల్కని, సెజ్జ వీడుచున్,।
బ్రిదిలిననీవి చక్క సవరించుమహోత్పలపత్రనేత్ర సాం।
పొదవెడునాభిశోభ, జలజోదరసోదర మైన దౌర! నా।
హృదయములోననుండి యొనరింపదు సుమ్మనరోహ మెన్నఁడున్॥ ౧౧

క॥ బాలిక, యాటలచనవున । నాళులతో నాదుమాట లాడుచు, నాలో,।
దౌలను నానుడిసవ్వడి । యాలించి, బిఱాన మెఱుపుహాసుం జూపెన్॥ ౧౨

క॥ లేనియపరాధమును దన । పై నారోపించి, కైతవపురుషతో నేఁ।
బో నెంచ, సాశ్రులోచన । యై, నెలఁతుక యొప్పుకొనియె నన్నది యెల్లన్॥ ౧౩

చ॥ హరిణకిశోరలోచనలయాయతసుందరదృగ్విలాసముల్,।
చరణము మోప వెందనుక స్వాంతములోపల, నంతదాఁక నే,।
సరసము లైనవేదములు, శాస్త్రములుం, స్మృతులుం, బురాణముల్।
చిరము పఠింపఁ గల్గినవిశేషవివేకము, వీతశోక మౌ॥ ౧౪

ఉ॥ నీరమణుండు వచ్చె నని, నెచ్చెలిపిం డరుదెంచి చెప్పఁగా,।
దారున నున్న దున్నటుల తత్తఱపాటునఁ జేరి ద్వారమున్,।
శారదవేళ సాంద్ర యగుచంద్రికపోలిక, నాకనుంగవన్,।
జారుకురంగలోచన నిజంబుగ నెన్నఁడు చల్లఁ జేయునో?॥ ౧౫

చ॥ అనుదిన మేను వచ్చుసమయంబున నస్తమయంబునందు, జ।
వ్వని నయనద్వయంబు తలవాకిటిద్వారమునం గదించి, యం।
తను జనుదెంచునాదువదనంబు గనుంగొని, శారదైణలాం।
ఛనునిఁ దిరస్కరించెడుహాసన్ముఖమున్ ధరియించి భాసిలెన్॥ ౧౬

ఉ॥ ఇంచుక కేలితోడ స్పృశియించి కుచాగ్రము. దౌల నిల్చున।
వ్వంచన కాత్మవల్లభునివక్త్రసరోజము, కాంచనాంగి, శో।

జారునిలలోచనంబులను నట్టి రసంతయయూర గన్నుఁ దెప్పలన్।
వాంచక చూచి చూచి, తల వంచుక యూరక యుండె నంతటన్॥ ౧౭

క॥ గురుజనపరివృత యయ్యును । తరముఖి, నను గెఱ్ఱ గోఁకికొనుచుఁ, నా పై।
నెరపెఁ గటాక్షకంటి మాపుం । దరపర్వితబాహుకాంచనవ్యాళిక యై॥ ౧౮

ఉ॥ఆసత గాత్రి తా గురు జనాంతికమందు వసించి యుండఁగా।
నే నొకతమ్మిమొగ్గ గొని యించుక నెమ్మొయి సోఁక వ్రేసితిన్॥
దానికిఁ గుంచి కన్గొనలఁ బల్, పరకుండలతాడనంబుగా।
మానిని నన్నుఁ జూచి, తనమానసమం దనయంబు ఘూర్ణిలెన్॥ ౧౯

ఉ॥ఏ వినయంబుఁ జూప, నెఱు పెక్కును ద్రుక్కును సంబు లశ్రుధా।
రావిలుతన్ వహించె వచనాంబుజ మంద్రఘుల నేను వ్రాలఁగా।
నావల కేను బోవను బ్రయాణముగా, నసుసంశయంబె సం।
భావిత మయ్యె; నేమిటను భామరో! నీ వింక మోచ మెండెదో?॥ ౨౦

ఉ॥ఓ దయావిహీన! కుటోక్తినిధానమ! లెస్స యయ్యె నీ।
కూరిమి; చాలుఁ జాలు; విడు కోక చెఱంగని, జాలు వాఁగఁ గ।
న్నీరు, నిగస్తనస్థ యగు నీరజనేత్రను, నీవుఁ దక్కనె।
వ్వారిక నాకుఁ జూపఁ గలవారలు? సద్గుణభద్ర! నిర్దరో!॥ ౨౧

తే,గీ॥ కమలఁ జారుహాస మాసారి మోము । నీరమున సవికాస మా వారిజంబుఁ,।
గాంచి మకరందపల్యుగ్ధముగ్ధద్విరేఫ । శాబకావళి, యిందుఁ జక్కఁ జరగఁ బఱచె॥ ౨౨

ఉ॥వారిజపాణి, ప్రాణవిభు వక్షమునందు విపక్ష భామినీ।
హారము సంగమచ్చముగ, వంకర లేక నుండఁ గొని, తోల్తి నమ్మనో।
హారుని యంసభాగమున నర్తిలఁ దాఁ గదియించినట్టి వా।
హారుడి ప్రసూనసర మాత్మణమే సవలా వెలారిచెన్॥ ౨౩

క॥ ఇంచుక వంచిన మెడయుం । గొంచెము మోడ్చిన నును గనుదామర, కే।
రించి యూరుపు, సలసత । గాంచిన యొడ లైకలికికలయిక దలఁతున్॥ ౨౪

చ॥అలుకను లేచి యాలఁ జని, యద్దమరేయి వెండి వచ్చి, నేఁ।
దలుపుకడన్ స్వనామమును దాఁచి యలీకపుఁ బేరు దెల్పఁగన్।
మెలఁకువఁ గాంతరాక్షి, యది నే నవియే గ్రహించి, కేళికా।
నిలయమునుండి లక్ష్మివలె నిర్గత యయ్యెను, మెల్లమెల్లగన్॥ ౨౫

ఉ॥చారువనప్రదేశమున శైవలవల్లరు లుల్లసిల్లఁగా।
సారెకు సంగకంబులను శయ్యకు నిట్టటు వైచుకొం చ్మృదం।

భోగము దీనవృష్టులను గొయ్యగఁ దాఁ బొలయించెఁ, బస్సగీ।
వారము నంతఁ బ్రాణవిభు వార్తకుఁ జొచ్చినదాని మోమునన్ ;॥ ౨౬

ఆ వె॥ గురు సంబు చుట్టుకోఁ, గొమ్మ యీలాగు । తనగృహమ్మునకును జనుచు, నన్ను।
గన్నుబొమలు వంచి, పిన్ననవ్వున మెఱ । దిప్పి కనిన మోము తీరు దలఁతు ;॥ ౨౭

చ॥ మలయభుజంగవాంతములు మారుతముల్ పొలయాఁ గృతాంతముల్,।
చెలియరో! జీవితాశ యెటు చేకుఱు నాకిఁక? మావిమోకయా।
దల నిటు మంజుగుంజిత మదారత సత్పదునీద్విరేఫపుం।
జిలుకయు నక్కటా! యొకటఁ బీల్చుచు నున్నది నాదు ప్రాణముల్ ;॥ ౨౮

క॥ హాలాహలంబుతో సరి । పోలెదు, ప్రాణాపహరణమున నా మది కిన్ ;।
జేలతనంబున నెఱఁ డో । ప్రేలెదు నమృతాంశుఁ డని, భువిన్ నిన్నుఁ జలదా! ౨౯

తే, గీ॥ పాటిపోవు పెట్టి పావురాయిని బట్టి, । కూజితమున దానిఁ గూడ గుసుకు।
కలరసంబు నెమర నిలుపునన్ గని, కల్కి । మొలకనవ్వుతోడ మోము వాంచె॥ 30

క॥ రూపవతి యిసలచీఁకటిఁ, । దాపాస్త్రలతాప మార్చుఁ, దామరసిరులం।
దేపకు ముద్రించుఁ, జకో । రోపదవృత్తి! యుష్మదాననోద్భూతరుచుల్ ;॥ 3౧

చ॥ కుచకలశంబులారయఁ, గొనగోరను నే రచియించునంకముల్ ।
ప్రచురముగా, నొడళ్ళు గరుపాఱఁగ మెల్లనఁ జూచుకొంచుఁ, దా।
నచటిసమీపజాలకమునందు మొగం బిడు నన్నుఁ జూచి, బా।
ల చకితనమ్రగాత్రియయి, లాఁగొకటన్ జొరఁ బాఱె లోఁగటన్ ;॥ 3౨

క॥ అడుగఁగ వడుగఁగ సాకం । గడజాముౘ వచ్చి నిద్ర గనఁ బఱచిన నా।
పడఁతుకచుబుకము మెల్లన । బుడుకం బోఁ, దయ దొలంగెఁ బ్రొద్దెటకటకటా ;॥ 33

క॥ వదనమునకుఁ దన చుబుకము । నెదురుగఁ గదియించి నాదుహృదయము మీఁదన్ ।
మొదిత శయనించి, యింద్రుని । పదవిని నాఁ డెట్టు క్రిందుపఱిచినది గదా!॥ 3౪

ఉ॥ మానశరాసనాలమున సోలినముద్దులగుమ్మకమ్మనా।
నానపద్మమందు నుదయం బగుచారునకారమూం బలెన్,।
మానితసాంగవేదపఠనం బలభారతపాత్రమైన, మా।
న్మానసవేదనాపహరణం బొనరింపఁగ నేర దంలగన్ ;॥ 3౫

క॥ లవలిం గబళించుఁ గదే, । యనలీలను దావకీన మగునునుఁ జెక్కుం।
గవ, యవిరళముగ వగపులు । ధవళాంబుజనివహమునను దావలమునొనున్ ;॥ 3౬

ఉ॥ చాలఁగ నిన్నుటెల్లు నెఱజవ్వనపుంబని చేత జంకుచున్,।
శీలము శౌర్యమున్ బలముఁ జెన్నగు కాంతియుఁ జూడ నుంకుచున్,।

జాలువు పేరినారిసరసస్తుతపక్ష్మలలోచనాబ్జముల్, ।
మీలనముక్, వికాసమును, మేళగానెడుక్ రఘురాముముందఱక్; ॥ ౩

క॥ ముక్కంటివిల్లు మెక్కుఁడి, । పొక్కెడుబంగుగులతాపమును మానిచి, మా ।
చక్కనిసీతాయిని, దా । నక్కటా! యీయువ వివాహ మవునో కాఁడో? ॥ ౩౭

క॥ వరుఁడు నవోఢను, భుజపం । జరమున నేకాంతమంను సంధింపఁగ, న ।
త్తరుణమున నై వలఁ జిక్కిన । తరుణహరిణి వోలె, బాల తత్తఱపడియెక్; ॥ ౩౯

తే॥గీ॥ సారెఁ గ్రోలితి నుపనిషత్సార మెల్ల! । గీతయును మన్ననఃపదానీత యయ్యె! ।
నైన నాయంతరంగంబులోననుండి । యంగనామణి వెలుపలి కరుగ దహహా! ॥ ౪౦

క॥ అకరుణహృదయుఁడ! ప్రియుఁడా! । యిఁకమీఁదట నిన్ను విడువ నే నెపుడనుచుక్
సకియొక రాజ్యము పట్టుక, । వికలాత్మ యొకర్త యాలపించెను జాలిక్; ॥ ౪౧

క॥ ఎల్లప్పుడు గన్నులకై । మల్లడిగొనుమనసుతోడ మాపటిదాఁకన్ ।
జల్లమ్ము గొల్ల పిల్లకు, । నల్లనిరతనమ్ము వీథినడుమను దొరకెన్; ॥ ౪౨

క॥ తూపొఱుచి నిరసింపను । గోపాలునిమోముకాంతి గ్రోలెడుచెలికిన్, ।
సోపాధికలోకముపయి । నాపాడిలె నరుచి, కటకటా! త్రుటిమాత్రన్; ॥ ౪౩

క॥ హేమాభము నామే నని । యేమిటికే చెప్పకొనెద వెఱుఁగవు కట్టా!
కోమలి! యది చిచ్చుఁజొకిన, । నామీఁదటఁ గాదె సాటి కర్హత గలుగుక్ ? ॥ ౪౪

క॥ మెవలుచు నౌత్సుక్యంబునఁ, । గొదుకుచు సిగ్గునను సారెకుక్, బడ కింటక్ ।
మొదటికలయికను జెలువునఁ । బొదలెడుగోనాళ్ళయనములు భాసిల్లుక్; ॥ ౪౫

తే॥గీ॥ గౌరవమును గలువగంటులగుబ్బల । పాలు సేసి, లాఘవమును బొందు ।
నట్టికోడెకాండ్రయవివేకధైర్యంబ! । నీకు వందనంబు నే నొనర్తు; ॥ ౪౬

ఆ॥వె॥ బాల్య మెల్ల జాఱి పరువంబు మొలతేరఁ । నుడువునడులయందు, నడలయందు, ।
విభ్రమములయందు, వింతమాధుర్యంబు । గలుగుఁ జుమ్మి, వాలుఁగంటులకును; ॥ ౪౭

తే॥గీ॥ అంచితానోన్యపర్యనాప్లవవిరహ । మునను బోలెను, జంచలంబులు నతాంగి ।
భాసురాలోకనంబు లపారకాంతి । పూరసౌభాగ్యలక్ష్మికిఁ బుట్టినిండ్లు ? ॥ ౪౮

క॥ తెలవ తనగురుజనంబుల । కుఱఁగట నుండంగ, నేను గొట్టఁ దలంపం ।
జెలువ పెలలఁ, గొనసాలుకఁ । గఱభుక వారించె నన్నుఁ గనుసన్నలచేక్; ॥ ౪౯

క॥ నయనాంచలావమర్శం । బయినను మును సయిఁపలేని దాలింగితయై ।
ప్రియుచేత నూర కుండెను । బయిదలి, యీూరికి నతఁడు పయనం బగుటక్; ॥ ౫౦

తే॥గీ॥ మానమునఁ బెడమోమును బూని నిదుర । నూరినదివోలెఁ బ్రియురాలు కుంచి మెడను ।
బాహువల్లరు లొక్కింత పైకి నిగుడఁ । జెలువుచేవమ్మి దనతళ్కుఁ జెక్కుఁ జేర్చె ॥ ౫౧

కం॥ కనువిరిదామరదోయిని । నొనరిన పేరాస జెంప ముత్యాల లూఁగం।
గను, గస్తురిబొట్టునెపం । బునఁ, దుష్మిద నీదునుదుటఁ బొలుచుం గలికీ!॥ ౫౨

ఆ,వె॥ పెద్ద లెట్టకేనిఁ బెనిమిటియొద్దఁ బ్ర । వేశపెట్ట రాత్రివేళఁ దన్ను,।
నేమి జరుగు నొక్కొ యింక మీఁదట? నని । శంక నొందుచుండెఁ బంకజాక్షి;॥ ౫౩

చ॥ మరుఁడు విచారసంకుచితమానసుఁ డయ్యె; సఖీజనంబు కాం।
తిరహిత మయ్యె; వల్లభుఁడు స్నేహసమాకులుఁ డయ్యె; వీని కే।
మరసి హితంబుగాఁ గొనిన నాదట నీ శోకమాట చెప్పెదన్;।
బొరయకు మానమున్; ముగుద! మో మిది చంద్రవినిర్జితం బగున్;॥ ౫౪

మ॥ తొలుతన్ వీనులయందుఁ జెర్వకొను చెంతో నొవ్వనన్ సీత్కృతిన్।
బెలుచన్ సల్పుచుఁ, దిర్యగావలిత మౌనెమ్మోముతో నొప్పను।
గ్గలిచేదామరచెయ్యముల్, సుకృతపాకంబుల్, చవిం జూడి తో।
లలితోత్తంసమఁ నీదుజన్మ మఖిలశ్లాఘార్హమై భాసిలున్;॥ ౫౫

ఉ॥ రాతిరి యయ్యె; రేదొరకరంబుల నిండె దిగంతరాళముల్;।
నాతుక లింట్లయం దొడవులన్ నగలం గయిసేసికొంద్రు; నీ।
వీతఁడె గూడ నీసున నొకింతయు మానము మాన వుంటివా,।
హా! తనుమధ్య! ముగ్ధ! భవదంగము వాడును దూఁడుమించు మన్;॥ ౫౬

ఉ॥ మంగళవాక్యముల్ జనులు మాటికిఁ బల్కఁ, బ్రయాణవేళ మో।
ముం గదియించి కేళిగృహాపుంగిటిచెన్, జిగిమోవి యూర్పటా।
విం గసిగందఁ, బిచ్చలెదు వెచ్చనిబాష్పపునీటఁ జిన్కి చ,।
న్నుంగవ దోఁగ, వల్లభుఁ గనుంగొను బాల, విలోలనేత్రయై;॥ ౫౭

ఆ,వె॥ జీవితేశ్వరుండు దైవవశమున నా । నయనములకు దూర మయిన దాది,।
యస్మదింద్రియంబు లాత్మకృత్యములందు । నాదరింబు లేని వయ్యెఁ; జెలియ!॥ ౫౮

ఉ॥ ఓసఖి! దూరదేశముననుండి సమాగతుఁడైనవల్లభుం।
డూసులు చెప్ప, నూఁకొనుచు నుండఁగ బల్లునఁ జెల్లవాఱెఁ; నేఁ।
జేసితి రేయి జాగరముం; జెప్పఁగ లేనధికంబుగా నికన్;।
గాసిలదష్ట నీ దినుప నాలుక; నశ్నక! పల్కరింపకే;॥ ౫౯

క॥ రాలెడుబాష్పకణంబుల । లోలోపల నాఁపఁ, దరలు చలింపఁగ, యే ।
ణీలోచననయనస్ఫుట । నీలాంభోజంబు లెపుడు నేఁ జూతు నొకో?॥ ౬౦

తే,గీ॥ లేడిచూపులయమ్ముద్దుఁ జేడె, నాదు । కంటఁ బడదేని, లక్ష్మణా! కలుగు నేమి।
ఫల మచేతనమైన నా బ్రదిమిమైన, । విఫలమైనట్టి యీజగద్విభూతిమైన?॥ ౬౧

క॥ ఇలు సేర వచ్చి, చిలుకల । కొలికి, మరల సెలవుఁ గోరుగో వాళ్ళపయిం ।
బొలయించెను, గారుణ్యము । గల దయి, నయనాబ్జమాలికను మార్గమునన్ ;॥ ౬౨

ఉ॥ సీతనె వెళ్ళఁగొట్టితిని; జేసితి దోస మహో! హతుండనై ;న।
చ్చీతకరాస్య నన్విడిచి జీవితముల్ వనిఁ బూనునా? కటా!।
ఖ్యాతుల హోము నే నెటులు గాంతును? వారలు నేమి యండ్రు న।
న్నాతతరాజ్య మిద్ది యడు గంటఁగ నీ; మనఁ గోర నే నిఁకన్ ;॥ ౬౩

క॥ వఱువ త సవతివసతని। దొఱఁగి యరుగుదెంచి, సరసఁ దోఁపంగఁ బ్రియుం।
డెఱుపు గడకన్నులను బిఱ్ఱబిఱ నావిర్భూత మయ్యె బిసరుహదృశకున్ ;॥ ౬౪

క॥ పదముల నపరాధక్షమ । పదముల వ్రాలఁగనె ప్రియుఁడు, భామామణికిన్ ।
సుదలఁ గనుదామరల మును। పుదయించినయరుణకాంతి, యొకట శమించెన్ ;॥ ౬౫

చ॥ లలనలలోనితాలిమి వెల్గారుచువెన్నునిమేనిచెన్ను, క।
న్నులఁ దనుపారఁ గ్రోలఁగ, మనోహరబాలకురంగనేత్రకున్,।
బళిర! చిరాపరాధకరణస్మరణంబునఁ జేసి యెంతయుం।
బలిసిన దయ్యు, నయ్యె క్షణప్రాహుణికం బపు డెల్లరోషమున్ ;॥ ౬౬

తే,గీ॥ రమణి! మత్ప్రతికూలుఁ డౌరాజువలన,। నకట! సంప్రాప్త మైనమహాభయంబు।
వారణం బొనరింపుము, పాంథుఁ డైన । నాకు, నీకడ వాసదానంబుఁ జేసి;॥ ౬౭

క॥ రవగాలిఁ గీలిగను, మణి । భవనము వనముగను, విరహభరమునఁ జేతః।
ప్రవికలతఁ జెంది తలఁచుచు, । శివశివ! చెలి నేలమీఁదిచేఁపను బోలెన్ ;॥ ౬౮

క॥ కాలాగురుద్రవంబును । హాలాహలముగఁ దలంచు; ననయంబును ద।
ద్బాలామణి, నీలాంబుజ । మాలను వాలియను బోలె మదిభావించున్॥ ౬౯

క॥ ప్రియుసంకేతస్థలమున । కయయో! విధివంచితాత్మ నయి పోనయితిన్ ;।
బయి నిఁక వలరాయఁడు మన్నియ, నన్నెటు సేయువాఁడో నే నెఱుఁగఁ; జెలీ!॥

క॥ విరహవికలాత్మ యై, ప । ల్మరు దయితా! దయిత! యని విలాపించుచు సుం ।
దరి, చేర వచ్చుతటిఁ బ్రియుఁ, । బరిచయ మొకయింత లేనిపగిదిం జూచున్॥ ౭౧

శా॥ దారిద్ర్యంబు భజించుఁ జంద్రుఁడు, నితాంతమ్లాన మా రాక, యే।
పారుం గైరవకాననంబులను నత్యంతంబు మాలిన్య మెం।
తే రాజిల్లు దిగంతరంబులు, సుహృద్బృందంబు మోదిల్లునో।
సారంగాక్షి! ముఖాంబుజంబున వికాసశ్రీని నీ వొందినన్ ;॥ ౭౨

ఉ॥ గందపుఁ జెట్లఁ ద్రాఁచుల మొగంబుల వెల్వడినట్లు, గాడ్పు వీ।
చుం దపియించుచున్; గనుల నేర్పుఁ దలిర్చినతీయమామిడుల్ ;।

క్రందుగఁ జిల్కుఁ గూజితహాలాహల మక్కట! యీపికాళి; యే।
చందమునం దృజింప దసుసంతతి బాలమృణాలకోమలన్?॥ ౪౩

ఉ॥ మా పిద వచ్చెఁ; గామినులమానస ముప్పిళు లూరఁ జొచ్చె; నే।
రూపున నాదుమానము సురుంగక యింకిట నిల్చె? నంచు, లో।
లోపల నిట్లు తామరసలోచన దాఁ దలపోయు చుండఁ, బూఁ।
గూపులపాదుసాగొడుగు, దోఁచె సుధాకరబింబ మంతలోఁ;॥ ౪౪

చ॥ వలపునఁ గాంత, లోపలికి వచ్చెదు వేకువవెల్గు మాటఁగాఁ,
జెలువునికన్నుఁదామరలు చేతులతోడను మూసె, నాటగాఁ;
లలితపుఁబద్మినీపరిమళంబులు దొంగిలి తారునాలిగా
లులవలనం గ్రహించెను వెలుంగుల తేఁ డుదయించు టాతఁడున్;॥ ౪౫

మ॥ అతిదూరంబున విస్మయస్తిమితమై యా వెన్కనీషత్స్వరి।
జ్ఞతఁ జాంచల్యముఁ గాంచి, మీఁదఁ బరితస్సంవర్ధితద్యోతముం।
ప్రతిపాదించి, తరంగలోచనసు నేత్రం బాల లజ్జావిఘూ।
ర్ణితతారం బగు, నే గురుప్రకరమున్ వీక్షింపగా నేగినన్;॥ ౪౬

చ॥ పులకము లంతురించెడుకపోలము లే మెలమెల్లఁ బుణ్కు, లోఁ।
దోలఁ కెడుపిన్ననవ్వు ముఖతోయజకాంతిని దొంతు లుంపఁ, బె।
ల్లాలికెడుగోస్తనీఫలరసోరుగురిం బురుడించుమాధురిన్।
బలికెడునామృగాక్షికలభాషణముల్, ప్రణుతింప శక్యమే?॥ ౪౭

శా॥ రాజుంగా నొనరించె మున్ను సువిచారం బేది యెవ్వండు ని।
న్నో చైవాత్మక! యావిధాత, దితశక్త్యుత్సాహుఁ డయ్యెన్ జరన్;।
భ్రాజన్మూతనధాత మన్మథుఁ డఖండం బీజగత్త్రాభవం।
బోజన్ ఖంజననేత్రవక్త్రమునకున్ యోజించు నిత్యశ్రికిన్;॥ ౪౮

శా॥ తేనెల్ చిందుట దృక్షిళిందముల బందిం బెట్టునందాంగనా।
సూనుగాత్రిమణిమోహనాంగకరుచుల్, చూపట్టులే యాధిగా, ।
గానవ్ వచ్చెఁ గులీనకాంతలకు, దీర్ఘశ్వాస మాస్యంబునన్,
లో నత్యంతము శూన్యవృత్తి, వెలిడాలుం గర్ణమూలంబునన్;।. ౪౯

చ॥ తమితోని కృష్ణలీలలను దా విని గోపకవృద్ధగోష్ఠి, తేఁ।
జెమరు గగుర్పునుం బొడముచెక్కులతోఁ గులకాంత, తత్క్షణం।
బమరికగాఁ, గరాళగరళార్చులు గ్రోయుమహాహిభోగము।
ధ్యమున నతం డఖండధృతిఁ దాండవ మాడుట దెల్ప వింతగన్;॥ ౫౦

మ॥ సరవిన్ బాల్యము జాఱి, మేన భృతవిశ్వప్రాభవుం డారతీ।
శ్వరుఁ డారూఢుఁడు గా, ఘటిల్లెడు దదాజ్ఞన్ నాఁడు, నెమ్మోమునన్।
బరిపూర్ణేందుల, మందహాసమున నవ్యాబ్జామృతాభేదమున్ ,।
బరమార్థంబు కనుంగవన్ బఱఁటికిం బంకేజతాదాత్మ్యమున్ ;॥ ౮౧

చ॥ చెలి నవచంద్రరేఖవలెఁ జిక్కియు, జిక్కని చెల్వుతోడఁ జే।
శలజలనీలికారచితశయ్యను జొంపునఁ బవ్వళించి, పే।
రలమటఁ దోఁగుచుండుతఱిఁ, బ్రాణవిభుం డరుదెంచి చెంగటన్।
నిలిచినఁ, దియ్యమాపులనె నెయ్యము దోఁపఁగ సత్కరించెడున్॥ ౮౨

ఆ॥ వె॥ చెలియమోవిసొబగు చిగురాకు రాకొట్టు ; రామమోము చంపమామఁ గేరు ;।
బోటిమేనినిగ్గు సాటి లే కొప్పారు ; నీవిధాత సేయఁ డీవధూటి ;॥ ౮౩

చ॥ ఒకమఱి వీడ్వడం బలుకు, నొక్కపు డూరక యుండు, నెందు నిం।
చుక తగులంబు లేనివెడమా పొకచోఁ బచరించు, నూరుపుల్।
సెక లెగయన్ నిగుడ్చు, ధృతిఁ జేకొనఁ డేమియు నంగకంబులన్ ,।
వికటవిదేహజావిరహవేదనచే దశకంఠుఁ డక్కటా !॥ ౮౪

క॥ ఉదయించెను శశిమండల।ము ! దహించెను విరహిహృదయమును ; మదనుని దో।
ముదలను, మానవతీజన।ము, దలను బెనుమానికమును బోలెను బూనెన్ ;॥ ౮౫

చ॥ కలువములోన నూరునూనుగాటుకతీరున, నింగి నీలమై।
యలరును, బాంథలోకహృదయం బెటఁ గన్నఁ గగంబు రక్తమై।
తలరును, ముద్దులేఁగొమలతిక్కఁగ పోలము లట్టె తాలుచున్।
వెలరును, వెల్లతేజిదొరవిల్లును దాను బయోధ మేగుదేన్ ;॥ ౮౬

క॥ ఫుల్లాంబుజముల నిండిన దల్లదె లిలకింపు కొలఁకు ; నకటకటా ! నా।
యుల్లంబుఁ గాల్చుచున్నవి।పల్లవపదలోచనములు, పదరకు ; సఖుఁడా !॥ ౮౭

క॥ ఇపుడును మానవు కోపము ; ద్విపగమనా ! మేఘమాల దివి దోచెను ; నా।
నపురూప మాప్రియోక్తులు, ।చపలాక్షీయపాంగరాగ సంపదఁ జెలిచెన్ ;॥ ౮౮

ఉ॥ సుందరి ! మందహాస మున శోభిలునీవదనంబుఁ జూచి, యా।
నందము నొందు చుండఁగ ఘనంబుగఁ దేం ట్లరవింద మంచు, నే।
మందును జంచలాక్షి హరిణాంకుఁ డటంచును శంక సేయుచున్ ,।
సంపడిగాఁ జకోరములు చంచుపుటంబులఁ జప్పరించెడున్ ;॥ ౮౯

చ॥ సరసపునవ్వుగా దిది ; ని సర్గమనోహర మౌవికాస మె।
వ్వరు మొగ మంద్రు దీనిఁ? సువాసనలన్ వెదచల్లుపుష్ప మ।

చ్చెరువు, చనుంగవా యిది? పసిండిరుచుల్ గలప గ్గగుత్తి; య।
ద్దిర! నిరతాళి సేవ్య మగుతీవియు; ముద్దియ గాదిదారయన్;॥ ౯౦

ఉ॥ భీకరభండనాభిముఖభిన్నవపుఃకియదుగ్రశూరక।
ర్ణీకృతమధ్యభాగబిలదృశ్యఖనీలిమఁ డెల్లలోకమున్।
జేకొని నిప్పుకల్ చెరుగుచేతుల, మ్రింగుచు దోఁచు వేవేలుం।
గీటు కొంచ లేక, పతు వెవ్వఁడొ వీని శశాంకుఁ డంచనెన్;॥ ౯౧

చ॥ నలుపును డెల్పు నివ్వి, యెలనాగకనుంగవరూపు గాదు నూ;।
హాలహాలసారమూం బ్రవిమలామృతపూరమూ నిశ్చయంబు;నా।
పలుం కిది కల్పితం బనెడుపక్షమునం దవి సోఁకునంత నే।
కలుగఁగ నేల మోహము, నఖండసుఖంబును, గోడెకాంద్రకుణ?॥ ౯౨

క॥ భ్రమరంబో, హరిణంబో, । రమణీయవిలోచనంబొ, రాజ[illegible] విచటన్;।
కమలంబో, కమలారియొ, ।కమలాయతనేత్రనెమ్మొగంబో? దెలియన్;॥ ౯౩

క॥ పలపలనిముత్తెములు చు।క్కలు; పలిపము వెన్నెలలు; మొగము నెన్నెల; నా।
యెలనాగ! నిన్ను, వెన్నెల। పులుఁగులతోలిపున్నె మైపున్నమ వంచున్;॥ ౯౪

క॥ రూపామృత,నాభిభ్రమ,।వ్యాపకకచభుజగ, చంచలాక్షి, నిమజ్జ।
త్తాపస, యీతరుణీమణి, । యేపగిదిం దాఁటరావియే అగుఁ జుమ్మీ;॥ ౯౫

క॥ కెమ్మోవిరుచులతోడను । సమ్మిశ్రము లయినదంతచయకాంతులు, నీ ।
నెమ్మోముఁదమ్మియందుం, । గొమ్మా! కేసరములట్లు తోఁచలుం జుమ్మా;॥ ౯౬

క॥ పలుకుచురుడాలు నెపమునఁ । గలికిరో! కింజిల్కములు ప్రకాశిల; నిదిగో!
నలకలపేరిటెతుమ్మెద । పిలుకలు, మకరందమం దపేక్ష వహించెన్;॥ ౯౭

తే॥గీ॥ అలతిలోత్తమ కన దైవహరిణశాబ। నయనచేతను, రూఢిగా నాదుమాన।
సంబునను, నించుకైన భేదంబు లేక, నాకనీకాశ మయ్యె మానవజగంబు;॥ ౯౮

ఉ॥ అంకముపోలికన్ నుదుట నందము మీఱఁ, గురంగనాభికా।
పంకముఁ దాల్చునీమొగము బాగుగఁ జూచి చకోరవారముల్,।
పంకజనేత్ర! మోదమునఁ బల్లవితంబుగఁ బక్షమూలముల్,।
శంక వహింప కిం మకయుఁ జంచుపుటంబుల నల్లలార్చెడుర్;॥ ౯౯

క॥ కమలము శిశిరమునను బలె, । నమృతాంశునిమండలం బహంబునఁ బోలెన్,।
రమణీమణి! నీవదనము । కొమరొప్పదు లేశ మయినఁ, గోపముపేర్మిన్;॥ ౧౦౦

క॥ తుమ్మెదలు మొదలు విప్పం । దమ్మియుఁ బోలెను, నధీరనయన మ్మగునా।
కొమ్మమొగముఁ గాంచితివా, । కమ్మనివిలుకాఁడు కినియఁ గాకే మటుపై?॥ ౧౦౧

తే॥గీ. అమృతమయమూర్తి కాచకోరాక్షి కకట! ।నన్ను వజ్రకఠోరాత్ము, నంటుకానిఁ।
గాఁగ సృజియించినట్టియాకమలభవుఁడు,।దెలివి గలవాఁడు కాఁ డని పలుక వచ్చు॥

క॥ పైదలి! నల్లనిచిహ్నం।బేదో నెన్నుగుటఁ దోఁచి యొసఁగెడునీమో।
మాద మఱచి లోఁ దుమ్మెద। బోద నిదురపోవుతమ్మిపూవుం బోలుక్॥ ౧౦౩

తే॥ గీ॥ అద్వితీయుఁడఁ గాంతిచే ననుచు నీవు ।మిన్నుముట్టెదు; గర్వ మేమిటికిఁ? జంద్ర!
మందమతి! పంచకోటిభూమండలంబు.। చొచ్చి శోధించి యెవ్వఁడు చూచినాఁడు?॥

క॥ నీలాంచలసంవృతమై। బాలకురంగాక్షి మొగము భాసిల్లుఁ గడుక్,।
గాళిందీనదిఁ దోఁచిన। లాలితహరిణాంకమండలంబుం బోలెక్॥ ౧౦౫

ఆ॥ వె॥ గుబ్బచంటిమీఁదఁ, గుటిలకుంతలచెక్క। నుండి వ్రేలుచలక మొప్పమీఱు।
చుండె, రేవెలుంగుమండలంబుననుండి। పైఁడికొండఁ బ్రాఁకుబాముపోలె;॥౧౦౬

తే॥గీ॥ పూవుగుత్తుల నొరగినతీవ కతివ! ।స్తనభరానత వీ వెట్లు సాటి వయితి,।
వల్లె, గర్వితురాల! శోణాధరకును।పాటి యగు నీకుఁ, బల్లవసహిత లతయు;॥ ౧౦౭

క॥ మంజరుల నొరగుతీఁగల। రంజిల్లెడునీవనాంతరము సేవ్య మగుక్,।
మంజులకుచభారానత। కంజాతేక్షణలు మనసు గలఁగింపనిచోక్;॥ ౧౦౮

ఉ॥ ముద్దియ నేను వచ్చుప్రమోదము చేతను, రాత్రి యంతయుక్।
సుద్దుల ముద్దుముచ్చటలఁ జొక్కఁగ బల్కుచఁ దెల్లవార్చి, తాఁ।
బ్రొద్దుటిమోముఁదావికిని మూఁగి యళుల్ రొద సేయఁ జొచ్చినన్,।
విద్దురమేలుకో దిపుడు; నీరరుహానన గంటివే? చెలీ!॥ ౧౦౯

ఆ॥వె॥ సకియ! యప్రమేయశక్తిసంపన్నత,। సుప్రసిద్ధుఁ డయినమానశరుని।
మహిమ, నీదువదనము హిమాంశుభానంబుఁ,। గనులు కమలసదృశతను, వహించు;॥

ఆ॥వె॥ కనుల మీనవతియుఁ, గచమున శైవాలవతియు, మృదులపాణిపాదములను।
బ్రస్ఫుటారవిందవతియును, సురస యా। చారుగాత్రి యీమె సరసి గాదె?॥ ౧౧౧

క॥ ఓరోరివేఁడఁగుఁబాంథుఁడ! । యీరీతిని బరితపించె దేటికి నిచటన్? ।
జేరు పయోధరసన్నిధి;।నారాటం బెల్ల నీకు నంతన తీఱుక్;॥ ౧౧౨

క॥ అతిమాత్రతన్వి. యాభా, । సితలోకయు, నైనయల్లచెలియం గనినన్।
మతి నిది సౌదామినియో,। సితయామినియో యటంచుఁ జెందరె శంకన్!॥ ౧౧౩

తే॥గీ॥ తొగరుజిగిపాణిపాదముల్, నగుమొగంబు,। నమరి విలసిల్లునీకోమలాంగిఁ జూచి,
చిగిరిచినతీఁగయో, వికసితపయోజపద్మినియో,యంచు సందేహపడరె [illegible]॥

క॥ కన్నుంగవ నందం బగు। వన్నెలతెలమిన్న మోము నందఱుఁ గనుచున్,।
గ్రన్నన శంకించిరి సం। భిన్నాంబురుహాంబొ చంద్రబింబమొ యనుచున్;॥ ౧౧౫

క॥ బంగారిసీరుచాయను । రంగారెడురమణితోడిరాముం గని, సా।
రంగంబులు గాన నటిం। పం గడఁగు మెఱుఁగుతోడిమ బ్బనుబుద్ధిన్;॥ ౧౧౬

క॥ జను లంద తీమెఁ గనుఁగొని । యనుదురు వనిత యని; వారి న ట్లనుకో ని।
మ్మనుకొనిరొద నే, నిది యువ। జనపరిణతచిరతపస్య, సత్య మటంచున్;॥ ౧౧౭

ఆ॥వె॥నగుమొంగంబు గలుగుసొగసరి నామె, న । చ్చటఁ జకోరవారచంచరీక।
సంచయములఁ గాంచి, సమధికసంతోష । తోయరాశియందుఁ దొప్పఁదోఁగె;॥

క॥ స్మితసుషమాలేశము నం । చితవదనాబ్జమునఁ దాలిచెద వెపు డపుడే ।
సతి! యీజగ మఖిలంబు వి । జిత మయ్యెడుఁ బంచబాణుచే, ననుకొందున్;॥ ౧౧౯

తే॥గీ అమలయమునాజలంబుల నర మునింగి, । గొంతుకల నెత్తి కూసెడుకొంగ లొప్పెఁ
జిమ్మచీఁకటి పగఁ బట్టి తమ్ము బ్రిమింగఁ,। బెల్లు వాపోవుజాబిల్లిపిల్ల లనఁగ;॥ ౧౨౦

క॥ అన్యోన్యసంగసుఖమునఁ । కన్యామణిచన్నదోయి గన నున్నదె, ద।
ద్ధన్యత్వంబున కోర్వమి, । హైన్యంబును బొందె మధ్య మని భావింతున్;॥ ౧౨౧

క॥ సకలజనమోహకము,నీ । చికురంబులపేరిచిమ్మచీఁకటి, ముఖచం ।
ద్రకరాప్రచారమునన్నో, । సకియా ! జిగి మిగిలి నెగడు సత మని తలఁతున్;॥ ౧౨౨

తే॥గీ॥ పగలు రేయును గుత్తుకబంటినీట । నర్కు నారాధనము సేయు నబ్జపంక్తి;।
పక్ష్మలేక్షణవక్షోజభావమునకు । ఘోరతప మాచరించు నొక్కొ తలంప?॥ ౧౨౩

ఆ॥వె॥ఘోరవిరహవహ్నికుండంబు నాఁ దగు । నీదుహృదయమునను నీరజాక్షి !
తపము సేయుచున్న దిపుడు ముక్తాహార । మెనయఁ బ్రియసమాగమైకసుఖము;॥

సీ॥లావణ్యంబున కాకరంబుగ, ననల్పప్రౌఢి నీమోముఁ దాఁ।
గావించెం జతురాస్యుఁ డైన, నుచితజ్ఞత్వంబు గానంగ రా।
దావం తాతనియం దదేమనిన, సారంగాక్షి!నీ వుండఁగా।
రేవెల్గున్ మఱి రాజుఁ జేసెను గదా, రిక్తున్ గళాహీనునిన్;॥ ౧౨౫

ఆ॥వె॥సకియ!నీదుగుబ్బచనుదోయినడుఁజిక్కి,। గాన వచ్చుమానికంబు వొలిచె,।
సానురాగ మైనమానస మాత్మేశుఁ । గాంచ, వెలికి నిర్గమించె ననఁగ;॥ ౧౨౬

క॥ జగదంతర మమృతమయం । బగుకిరణోత్కరముచేత నహహా! నిండెన్;
మృగనయనమొగముసెవమున । దొగరాయఁడు, జిగి దొలఁకఁ దోతెంచె నొకో?॥

మ॥ అమవసచిమ్మచీఁకటియు, నచ్చపుఁబున్నమచందమామయున్,
గమలములున్, శరద్విశదకౌముది, కాంచనకోరకంబు, వి।
ద్రుమమును, నెప్పు డేని యొకతూరి జగంబునఁ బొందినన్ సమా।
గమ మప్పు డించుకంత గజగామినిమోమున కింతు సామ్యమున్;॥ ౧౨౭

క॥ ఓదయిత! మాను నీదువి । పాదం బని, ప్రియుఁడు వలుక సాదరఫణితిన్,।
భేదలికిఁ గనులబాష్పము, । నూఁదినమదిలోనిమాన మొక్కటి జాఱెన్;॥ ౧౨౯

తే॥గీ॥శంబరాసురగర్వభంజనునిసుప్త । సిద్ధసామ్రాజ్యపట్టాభిషేకమహము ।
వేళ, లోకంబులకు నెల్ల వెల్ల చలుచు । జోక, నొప్పారె రాక, సుధాకరుండు;॥

క॥లోలాలకావృతం బగు।బాలామణిమోననంబుఁ బరికించి, భ్రమ।
ద్రోలంబసంకులం బగు।నాళీకము సంస్మరింతు నాహృదయమునన్;॥ ౧౩౧

క॥ గురుజనములతో నరుగుచు, । దరహాసము మోముఁదమ్మిఁ దళుకొత్తను, సుం।
దరి దిరిగి చూడఁగా, నది । పరుఁ జంటం డుస్సి చనెఁ బ్రపంచంబునకున్;॥ ౧౩౨

తే॥గీ॥బహుశిఖంజరీటభంగభాగ్యంబును । గలికికన్నుదోయి గాంచుఁ గాక,।
నిత్యశోభ మైనసెమ్మోము, భంగుర । సంపదబ్జమునకు సాటి యగునె?॥ ౧౩౩

క॥ తెమ్మెర, గంధము, కోడుల్ । దమ్ము లుశీరమ్ము, శైవలము, నపగత్మై।
త్యమ్ములుగఁ దోఁచు, విరహభ।రమ్మునఁ జైతన్య మెడయుప్రాణుల కహహా!॥ ౧౩౪

క॥ తనకరముల నిమురుచుఁ, బ। ద్మిని ముద్రితవదన నల్ల మేల్కొలిపి, కరం।
బనురాగపూర్ణుఁ డగుచుం । దనరారెడు భాస్కరుం డుదయకాలమునన్;॥ ౧౩౫

ఆ॥వె॥మ్రొక్కి వినయవచనముల బతిమాలుచు । నడ్డగించినను, మహాగ్రహమున।
వెడలిపోవునన్ను, వ్రేలిసన్న మెలంగు । పిల్లికూనచేత, వెలఁది యాఁగె;॥ ౧౩౬

చ॥ అమృతముఁ జిల్కుచుండ భవదానన మోననఁబోణి!యంతటన్,।
సుమశరచాపపున్నహిమ సుంతయినం గన దంతరాయమున్;
దిమిరముతో మహీప్రజకు దృష్టులతాపము గూడ రూపరెన్;
రమణిరో! శ్వేతుఁ డీశశి, ని రంతర మి ట్లుదయంప నేటికిన్?॥ ౧౩౭

ఉ॥ చాల వివేకమున్ సుగుణజాలముఁ దాలుచువార లయ్యుఁ గో ।
జాలులు, వారిహృత్పుటము, వాగ్ధరవారిని గేలఁ బూనకే।
చీలిక లింత లింతలుగఁ జీలుపఁ జాలువినీలవారిజా।
క్షీలసమానజాలమయచిత్రవిలాసము భాసమాన మా;॥ ౧౩౮

ఆ॥వె॥నివ్వటిల్లె నెపుడు నెలఁతకు నిండుజ । వ్వనము నవవిలాసభవన మగుచు,।
నప్పు డాది గాఁగ, నిప్పు లేకయె, కోడె । కాండ్రమానసములు మండఁ దొడఁగె;॥

ఉ॥చూడదు కన్నులం దెఱచి సుంతయు;నవ్వుమొగంబుతోడ మా।
టాడదు; తావకీనకథలం దది భ్రూకుటిఁ బూను; నంచు నీ।
జాడ, సపత్నిచేష్టలు నిజప్రియుతో నెఱిఁగించునంతనే।
యీడెను భర్తకుం దనపయిన్ మును పుండినయిందుప్రేమముల్;॥ ౧౪౦

క॥ హాలాహలౌర్వానలముల । బోలిక మకరధ్వజిహ్వములతోఁ బేరిఁ గాక
నాళీకవైరి ; లోకుల । కేలా ప్రాణాంతహేతు విఁకఁ గాకుండుఁ ? ॥ ౧౪౧

క॥ సుకృతంబున సుకళత్రము, । సుకళత్రముచేత దొడ్డసుతులు, సుతులచే ।
నకలంకస్థిరయశము । య్యకలంకస్థిరయశమున నాకము, నొదవుఁ ; ॥ ౧౪౨

క॥ ప్రభువైనను యాచించిన, । లభియించును లాఘవంబు ; లలనామణి ! నే
నభిరుచిపడి యధరమునకు, । నభిభూతుండఁ గానె విముఖి పగునీచేతఁ ? ॥ ౧౪౩

ఆ॥వె॥ కొలఁకునందు ముంచి జలపూర్ణకుంభంబు । నెత్తికొనుచు వేగ యింటి కేగు
నీరుతటనికుంజనిర్వృత్తగూఢసం । భోగ మొకమనోభవున కొసఁగ ; ॥ ౧౪౪

ఆ॥వె॥ పాంథ ! నీవలె నా ప్రాణవల్లభుండు, ముందుఁ గన్నను, గడగండ్లు పొందుచుండు;
నింతకన్నను గుశల మింకేమి చెప్ప ? నిప్పటికి జీవములతోడ నిట్టు లుంటి ; ॥ ౧౪౫

క॥ తరుణీ ! చిక్కితి వేటికిఁ ? । బరకీయోదంతమునను బని నీ కేమీ ? ।
పరితోషించెదఁ జెపుమా ; । తెరువరి ! నీ తెఱఁగు నీవుఁ దెలుపుము బొమ్మా ; ॥ ౧౪౬

క॥ ఆలోకింపక నీకుం । బోలిక, నత్యంతగర్వమును బొందకువే ;
బాలిక ! బహుఫల భరమున, । వ్రాలినలత లెన్ని లేవు వనములలోనఁ ? ॥ ౧౪౭

ఆ॥వె॥ ఉల్లసిల్లుచున్న దువిద ! నీనెమ్మోము ; । కన్నుఁదమ్ములును వికాస మొందె
జలదమయముగాను జగ మెల్లఁ గావించు । నీలమేఘ మెచట నేనిఁ గంటె ? ॥ ౧౪౮

క॥ ఆసాయముఁ దోయముల ను । పాసించుచు సవిత్రుఁ, జిరతపశ్చరణమునఁ,
గాసంత యిపుడు సారస । మోసఖి నీముఖముతోడ నుపమం బొరసెన్ ॥ ౧౪౯

క॥ మందస్మితమధురంబుగ, । సుందరి ! నీమొగ మొకింత చూపించితివా,
డిందుపడు నిపుడె పున్నమ । చందురు సామ్రాజ్య మెల్ల క్షణమాత్రమునఁ ;॥ ౧౫౦

ఆ॥వె॥ తలుచు నవ్వుకొనుచుఁ, దనలోన నే మేమొ । యుల్లసిల్ల మాట లాడుకొనుచుఁ
గోకనదముఁ జేసికొనుచు లోకత్రయిఁ । జూచు మద్యపాయి శూన్యదృష్టి ! ॥ ౧౫౧

ఆ॥వె॥ మధురసంబుకంటె మగువ ! నీయధరంబు । మధురతరము ; చూనుపు మస్తుఖమున;
పపప, పదుమ నయయొ ! పుపుపు, పుడమిఁ బట్టు । శాకరాంబుజంబు నీకరమున; ॥ ౧౫౨

ఉ॥ అంగద నెట్టకేలకు నుపాయశతంబునఁ బ్రాఁకి సౌధముఁ,
బొంగెడుతాలవెల్లి నురువు న్నగుబ్రొన్నవసెజ్జ, నొంటి సు
ప్తింగనుదాని మేల్కొలిపి, భీతమృగేక్షణ సస్మితాస్య రా
జాంగనఁ గౌఁగిలించు, నహహా ! సుకృతాత్ముఁడు నిద్రసించుచుఁ డెస్ ;॥ ౧౫౩

క॥ గానము సేయును షట్పదము । గా, నంతటఁ దిరిగి యభిముఖముగాఁ బలుమన్,
దో నెగయు, మరలు, వెరలును, । మానితకాసారములను మధుకరచయముల్॥౧౫౪

ఆ॥వె॥ నిరతరాగాతిశయమున, నేను వచ్చి ।సారె సేవించుకొలఁది, నాశ్చర్యముగను,
లలన మెలమెల్ల నన్నింటిపలనఁ దిగిచి, । తద్వికభవోలైన స్నేకతామఁ జేసె॥౧౫౫

తే,గీ॥ లోలమృగశాబనయన యిల్లాలు గానఁ। బడక యుండిన లోనఁ, జెప్పెడిది యేమి?
యఖిలసంపదలన్ను బూర్ణ మగుచు నున్న, । భవన మది గాదు,నిర్జనవనమె గాని॥౧౫౬.

ఉ॥ గాలికి నిట్టటుం గపలు కాటుకనిగ్గులు దేరుముంగురుల్,
లోలవిలోచనంబులును, లోవలమూపుల నెల్ల నాచికో,
పాళిని గీము సేరుజనరాలివిలాసగతిం గనుంగొనం
దూలక నంటుకానిమద్ది నూల్కొని తాలిమి నిల్వఁ జాలు నే ?॥ ౧౫౭

చ॥ ప్రవిమలదంతకాంతిరుచిరంబు, సుధామసృణంబు, నంబుజో
త్సవహరమును ద్వదాననముఁ, జక్కఁ సృజించినవాఁడు వారిజో
ద్భవుఁడు విపశ్చిదగ్ర్యుఁడు గదా మృగశాబకనేత్ర ! యాతఁడో
యువిద ! దొలంపఁ డేమి కతమో పునరుక్తముఁ జంద్రబింబమున్?॥ ౧౫౮

ఆ॥వె॥ సానుకంపములు మహానురాగంబులు । శీలశీతలములు చెలియనతుర
చిత్తవృత్తు లేమి చెప్పుదు ? నయ్యారె! । యస్మదీయహృదయ మపహరించె॥౧౫౯

ఆ॥వె॥ అహికిశోరశీల మలకజాలము, నెలి । వాఁడితూపురూపు వాలుఁజూపు,
తాను జంచలోపమాన, లోకంబునఁ । జాన యెట్లు సౌఖ్యసాధనంబు ? ॥ ౧౬౦

తే॥గీ॥వదనమున నంశమాధురి,మృగుల మైన । హృదయమున నంతకారుణ్య మెసఁగుహరిణ
శాబలోచన!యిది యేమి చంద మిపుడు। గుణగతులు నీవి వేఱుగా గోచరించు?౧౬౧

తే॥గీ॥ అనిశనయనాభి రామశోభాతిశయము । కలిమి గర్వించునీదుముఖంబుతోడ,। ఱ
నిశను శోభావిహీన మానీరజంబు,। నెటులు తుల సేయఁ దగు,నింతి!యంచు కైవ॥౧౬౨

క॥ సుకుమారతరము లగునం । గకములఁ, గుసుమములశోభ కాంత హరించున్; ॥
వెకలించును నాప్రాణము । లకటకటా ! కుసుమబాణుఁ డంబకతతులన్;॥ ౧౬౩

క॥ దురపిల్లు వలుఁదపిఱుఁదుల ।బరువునఁ, దెరువునను మృగులపద నడుచుచు ; న
త్తరుణీమణిఁ గని యకటా ! । దురపిల్లును నేను నేమి తోఁపనిబుద్ధిన్;॥ ౧౬౪

ఆ॥వె॥ మధునిషూదనుండు మధురాపురప్రయా । ణాభిముఖుఁడు గా, వ్రజాంగనలకుఁ
బ్రాశయనహిమ యయ్యెఁ బంతువెన్నెలరేయి;। వారిరాశి యయ్యె వాసగృహము;॥౧౬౫

చ॥ శయనగృహంబు సొచ్చి, చెయిసన్నల నెచ్చెలి నల్లఁ బుచ్చి, నేఁ
గయికొని పీవనన్ విసరఁగా, గుపితాంగన, కూటనిద్ర నం
తయుఁ గను మూసియున్, గననిదానివలెన్ గరుమోడ్పుతోఁ, గడుం
బ్రియసఖి! డస్సితంచు నెదమీఁదఁ గదించె మదీయహస్తమున్॥ ౧౬౬

క॥ గమనము బాల్యముతో మాం। ద్యము నొందెన్, దక్క మదెల్ల స్వాంతముతో నో
ష్ఠము, హరిణీదృశకు, నితం। బము సర్వోన్నతిఁ దనర్చె మన్మథుతోడన్;॥ ౧౬౭

తే॥గీ। ఊరు పనుమాన వేద్య మూ;నొడలు కలుగు। కాదె గైకొనది; యూహేమి యాడకున్న
దామెకృత్రాంత మింక నీవట్టు లుంచి,।చెప్పు మన్యచరిత్రంబు;చెలిమికాఁడ !॥ ౧౬౮

ఆ॥వె॥ పరిణయమున రామభద్రుండు పట్టఁగో, । స్వేదకంపములను సీలకరము।
సాంద్రహిమసమేతఝంఝానిధూతప్ర। భాతపారిజాతభాతిఁ దనరె;॥ ౧౬౯

తే॥గీ॥ అరుణ మైనను బగడంబు నతికఠించు, । మృదుల మైనను జివురాకు గదిమి మైచు
నిరతిశయమాధురీరమానిలయ మగుటఁ, । దానకీనాథరోష్ఠ మెంతటిరుఁబోణి !॥ ౧౭౦

తే॥గీ॥ అణిముత్యాలకోవలఁ గ్రేణి సేయు । కాంతసుదతాంతఘర్మాంబుకణిక లామె
కుందనపుఁబాయనొసటిపై గూడి చెప్ప । రానియనోన్య శోభాకరతఁ దనర్చె॥ ౧౭౧

క॥ పరపురుషదృష్టిపాతభీ। దురహంకృతిఁ జెందిచి సీత దూఱెఁ బ్రియహృదిన్;
జొరఁబడె నతిఁడును బరనా। ర్యురగీభయమునను నా మెయుల్లము సరగన్;॥ ౧౭౨

తే॥గీ॥ అంగికము లిచ్చి మనుజులప్రాణములను। గొనిన, నది యుక్త మగుఁ గాని;
సరసిజాక్షి!నయనపద్మద్వయంబుకోణమునొసంగి। ప్రాణములఁగొంట,నీకిదిపాడిగాదు;

తే॥గీ॥ ముత్తియంబులసిరులకు మురిచ్చు లయిన । దంతములచెంత వసియించినంతిసించు
నంచు, నతిసాహసంబునఁ జంచలాక్షి! । ముక్కుతల దొరిక్కినిలిచె నీము త్తియంబు॥

ఆ॥వె॥ నాసికాగ్రమునను నవమౌక్తికము గల్గి । భాసమాన మయ్యెఁ బడఁతిమోము,।
బుధసమాగమమునఁ బొలుచుపున్నమనాఁటి । లలితచంద్రమండలంబు వోలె;॥

క॥ నీమేనిపసిమి చూచక । వేమా ఱిమిటికి విట్టుడిఁగుగు ? ముగుదా !
నీమెయిచాయం బోలిన । హేమంబు దొరలు చుండవే యింటింటన్ ?॥ ౧౭౬

క॥ భువిని సిరంకుశు లనఁబడు। కవులు, కుచంబులకుఁ బోల్పఁ గరికుంభములన్ ।
ఒవిలి చెలి! యేల వినియెద। వువిదలు విపరీతకథల నూఁకొందురు కా?॥ ౧౭౭

ఉ॥కోమలి నక్కుచేర్చి యది కోపముచేతఁ దిరస్కరింపఁ ద।
న్నామెగ మైపరుండెఁ బతి; యమ్మెయి నాథమనంబు నొచ్చెనో
యేమొ గదంచుఁ దల్లడిలి, యేణవిలోచన వాని వెక్కలన్
జేరిచను ముద్దుఁ బెట్టుకొని, పెద్దయుఁ బొత్తుగుడించెఁ గాఁగిటన్॥ ౧౭౮

క॥ కనుఁగొని మారిఁ, జేలచెఱం । గున వదనసుధాంశు మాటుకొను వేఁ్రితలకున్,
జనితస్మరకంపవశం । బునఁ దత్సమయమునఁ జోకముడి బిగి సడలెన్॥ ౧౭౯

తే॥గీ॥ మోవితోడిసమాగమమునను జేసి । రదనధావళ్య మరుణిమాక్రాంత మయ్యెఁ
నైన సిత మైనలోలాక్షివాసితమునను । మరల నది జాతపక్షమై మాఱు మలసె॥ ౧౮౦

ఆ॥వె॥ దొండపండు మోవి, తోయజంబులతావి, । గలుగునీదు నెమ్మొగంబునందు,
మణిసమానరదన ! యణుమాత్రమైనఁ దాం । బూల మెట్టు లెఱుఁగఁ బోలుఁ జెపుమ॥

క॥ చేసుక శయనించియుఁ దన । కోరిక లన్నియును దీర్చుకొనఁ జాలక, బా
లారత్నము దయితానన । మారా ! దరమీలితాక్షి యయి వీక్షించున్॥ ౧౮౨

ఇది యాఱువేలసంకాభ్యుదితుఁడు
వ.సు. రాయఁ డాంధ్రము
నరించినయష్టిగి, భామినీవి
లాస నిగదితము, శృం
గారనాయికావిలా
సము.

## కరుణవిలాసము.

---

క॥ దైవము కట్టా ! విముఖము । గావుట, బంధుమణి యీజగంబును విడిచెన్ ;
నీవెత లెవరికిఁ దెలిపెద । వేవారు ప్రియోక్తిఁ దేర్తు రిఁక నిను? మనసా ! ॥

చ॥ మునుపటిలాగునన్ వినయపూర్వముగా నెదు రేగుదెంచి, క్ర
న్నన నవవిల్లువిందు లగు నవ్వుమొలుంగుట నుంగుఁజూపులన్,
జనికడుజుంటితేనియరుచిం బచరించెడుమంజులోక్తులన్,
బ్రణయిని ! నేఁడు నామది లవంబును జల్లన సేయ వే మయో ! ॥ ౨

ఉ॥ పట్టున నింద్రియార్థములు సర్వము విస్మరణంపుమార్గముం
బట్టెను ; విద్యయున్ విముఖభావముఁ బొందెను గుందుపేరిమిన్ ;
మిట్టెడుగందుమీలపస మెచ్చనికన్నవ గల్గుకల్కి, యే
పట్టున నాదు డెంద మెడఁబాయదు తా నధిదేవతాకృతిన్ ; ॥ ౩

తే॥గీ॥ నీవు నిర్వాణమంగళనిలయమునకుఁ । ద్వరితగతిఁ బోవుచును దయావతిరొ! దయయు
వీడితె? ప్రభాతనీలారవిందసుంద । రాయతకటాక్షములఁ జూడ వయయొ! నన్ను ॥

ఉ॥ అడుగుఁ జిగుళ్ళ ద్రొక్కుటకు నన్నభయంబునఁ జేసి పెండ్లిలోఁ
బడఁతి ! మదీయహస్తమును బట్టుక యెక్కితి గాదె నన్నుక
ల్లెడఁద సహస్రమార్గముల నేగుచు నున్నది, సన్నుతాంగి ! యీ
యొబ్బడ విడనాడి నన్ను నెటు లెక్కితి వో త్రిదివంబు ? నక్కటా ! ॥ ౪

ఉ॥ గొనములు గల్గి, దోసములఁ గూడ కలంకృతులం దనర్చి, మె
త్తనినిజవర్ణరాజి శ్రుతిఁ దన్పుచు, భావరసప్రపూర్ణ యై,
యనయము మామకీనకవితాకృతిఁ బొల్చుమనోభిరామ రా
మ, నిముసమేని నా దయినమానసముం బెడఁబాయ కుండెడున్ ॥ ౫

చ॥ జలరుహసంచయంబునకు స్వాంతమునం గలచింత యంత యున్
బొలిసెను, జంద్రమండలముఁ బొందెను నిస్తులభూరిశోభ, బ
ల్కులకల మెచ్చెఁ గోకిలకులంబుల కక్కట ! యొప్పు డీ విటం
దలఁగి దివంబు చేరితివి; నాఁటను గోలెను; ప్రాణవల్లభా ॥ ౬

చ॥ మిలమిలలాడి మాయ మగుమించులసంపద హాసించు భ్రాంతులం
గాలిపెడునింద్రభోగములు, గొన్నిదినాల్ ఘటిఁ జూపి, మంత్రిపుం
బలము దొలంగినట్టినరపాలునియుజ్జ్వలరాజ్యలక్ష్మియున్
బలెఁ, గలికీ ! యకాలమున నాచెయి జాఱితె భాగ్యవిద్యుతిన్ ? ॥ ౮

ఉ॥ ఏ నొనరించినట్టి నెర సేయదిరా మదిఁ దోఁప సంభ్రమం
బైనయఖండరోషమున కయ్యొ ! వశంవద నైతివే ? సఖీ !
ప్రాణమునంటినన్ను విడనాడి, పతివ్రత నయ్యు, ముక్తికాం
తానిలయంబు సేరితివి, దయ్యన కివ్వడి ; నేమి సేయుదున్ ? ॥ ౯

చ॥ అమృతపుఁదేటలుం బలె మహారసవంతము లైననీవిలా
సములె, మదాత్మలో మునుపు చారుగతిం బరిణామ మొంది, కా
వ్యము లగు చుండు ; నిప్పు డవి యయ్యెఁ గదా గగనారవిందముల్ ?
రమణిరో ! మాకు నెట్లు సుకరంబు లిఁకన్ సుకవిత్వసంపదల్ ? ॥ ౧౦

చ॥ ప్రవిమలతావకీనమధుర స్మితరోచులచేత, భాసిలన్
గువలయ మెల్ల, సత్కృపులకున్ హృదయం చెది దోఁచెఁ గొల్లి ని
ష్కృవముగ నల్లపూర్ణిమ, చకోరవిలోచన ! నీవు డీఱి, ని
య్యవసరమం దముంపవిజయింబునఁ బొంగుచుఁ బొందె నింగిరన్ ; ॥ ౧౧

శా॥ నాకున్ సుందరమందహాససుధచే స్నానంబు గల్పించి, దృ
గ్వ్యక్తోచ్చాప్రతిమోత్పలంబులను నిత్యం బర్చులన్ సల్పఁ, దా
నేకళ్యాణమయస్వరూప, ప్రియురా లిట్లేల పోచెల్ల ! , యా
నాకామేశ్వరి సుంత పాయదు గదా, నామానసం బిప్పుడున్ ; ॥ ౧౨

ఉ॥ నవ్వుచు, నెవ్వనిన్ రమణ ! నాథ ! మనోహర ! యంచుఁ బిల్చి, నీ
వివ్వసుధం జరించుచును నెక్కుఁగఁ జేసితివో దినంబు, నో
జవ్వని ! యట్టివాని నను, స్వర్గ్భవనంబున కేగి యయ్యయో !
యివ్వడి ఘూళి బ్రుంగ మహి నెవ్విధిఁ గూలఁగఁ ద్రోయఁ జాలితో ? ॥ ౧౩

శా॥ లావణ్యంబు సముజ్జ్వలంబును, నతుల్యంబున్ సుశీలంబు, న
ర్థావాసంబు నయం బనన్యజనలభ్యంబున్ విధేయత్వమున్,
నీవాసిన్ నను, నిశ్శరణ్యలను గా నీ విందఱిన్ వీడి, నా
దేవీ ! యీవిధి నొంటి మింటి కరుగన్ డెం పెట్లు గావించితో ? ॥ ౧౪

చ॥ కనకముకన్న మిన్నయగు కాంతిఁ, బ్రసిద్ధవిశుద్ధి, నెప్పుడున్
దనశిఖలన్ బరాభవ మొనర్చుచు నుండు పటంబు, నెంతయున్
గనలు మనంబునం గదిరి కాదె మనోహరురాల నైన ని
న్ననలుఁడు నిగ్రహించె నకటా! దయ మాలి? మృణాలకోమలా! ॥ ౧౫

ఉ॥ చల్లనఁ జేయుఁ గన్నులను జయ్యనఁ గప్రికవట్రమాడ్కి, సం
ఫుల్లసరోజమాలికయుఁ బోలెను గంఠసుఖైకహేతువై,
నుల్లము వ్రేదన్ను సత్కవితయుం బలెనే, జగదేకరమ్య నా
పల్లవపాణి; తాను సురభామినిరీతి నరిగినయ్యెడా;॥ ౧౬

ఉ॥ పెనిమిటికంటె నన్ను మఱి వేనిని స్వప్నములోన నైనఁ గ
న్గొనవు గదా యొకప్పుడును, గోరికఁ గూరినమానసంబునన్ ?
వనజపలాయతాక్షి ! తెలుపం గదవే, యటు లుండునీవు, నేఁ
డేఁయుఁగఁ బోయి తెట్లు, గుణహీనుఁడునుం బరుఁ డైనపూరుషున్ ? ॥ ౧౭

ఆ॥వె॥ హృదయమందు జీవితేశ్వరుగుణములు । సంస్మరించుకొనుచు, శయనమందు
క్షణమునను ముందు గానఁబడ్డకృశాంగి, । పలుకరింప నిపుడు పలుకదకట !॥ ౧౮

చ॥ చెవి నమృతంపుఁదుంపురులు చిల్కెడుకల్కియనంగఁబల్కులన్,
కవికభివందనీయ మయి, క్రాలెడుబాలమనోజ్ఞరూపమున్,
నెవము లవమ్ము లేనిదయ నిండిన వాసతిభవ్యకృత్యముల్,
స్మృతి నొనరింపఁ జిత్తము ప్రసన్నతఁ బూనక పోవు నేనికన్ ?॥ ౧౯

ఇది గరుడవేల వంశాభ్యుదితుఁడు
వ.సు.రాయఁడాంధ్రమొన
రించినయట్టిది, భామినీ
విలాసనిగదితము,
కరుణాభిధాన
కవిలాస
ముగిసెన్॥

## సతీస్మృతి

## కరుణావిలాసానుబంధము.

### ప్రథమ విలాపము.

॥శ్రీకైవల్యరమాధిరాజ్యపదవీసింహాసనాస్థానకా
శ్రీకాంతుం డపమృత్యుఁ దోలి నిను రక్షింపంగ రాఁ డయ్యె; నే
సా కాత్యాయనసతీసనామగుణవిఖ్యాతివాత్సల్యుఁడై
నీ కాత్మైక్యము నీఁ దలంచె నా॥సు॥ పత్ని! యన్నపూర్ణాసతీ॥

శా॥ పేరంటంబున కేగి రాఁగ నయినం బే తీవు నాయాజ్ఞకై
చేరం జూచును వెండి రానిసెలవుల్ జేకొంటి స్వాతంత్ర్యమున్?
హా! రామా! పిలువంగఁ బల్కవిది యే మన్యాయ మెవ్వారితో
నే రేయుం బవలున్ ప్రసంగము? పరాకే? యన్నపూర్ణాసతీ॥

మ॥ పిలుచం గొంచవలెన్ బయిం బడఁగఁ దన్వీ! సన్నిపాతజ్వరం
బలఁతిం బొందుము, దత్ప్రతిక్రియను న న్వారాణ్మహోంద్రంబునం
గల న న్నెంత దలంచుకొంటివో గదా! కష్టంబిది నే పచ్చులో
పల నీ తెల్విని దెల్లవార్చె హతదైవం బన్నపూర్ణాసతీ॥

మ॥ పతి యన్నం బిడియంబు వోనితరుణప్రాయంబుచేఁ జెప్ప నో
డితి గా కిచ్చను, జన్ని దోఁప, నమఁ దోడ్తే వేగమీ యన్ననో,
పితనో, వేఁడవె? యేమలంకరణములా? వే ఱయ్యె నీతీరహో!
స్మృతి లేదే? పెఱవాఁడనే? పలుకవేమే? యన్నపూర్ణాసతీ॥

మ॥ అపుడేఁ బండుగముందు మార్గశిరమాసాంతంబునన్ వచ్చి చూ
చి పునర్దర్శన మాత వైళ మనునీచే వీడుకోలందనే?
యిపు డీతీరునఁ జూడ నయ్యె మరలన్; హేయంబు సంసార మీ
వపువుల్ బుద్బులు; జీవితంబు చపలాభం బన్నపూర్ణాసతీ॥

మ॥ సరి పుట్టింటికి నీవు వచ్చి నెలపక్షం బయ్యె; నీమధ్య నే
మరలం బండుగముందు వచ్చితిని; నీమైఁ జూచి యుప్పొంగితిన్;
తరుణీ! యింతటిలోనె న న్మఱచితే? దాంపత్య మిట్లుండునే!
యెరవై పోవని యెప్డు నిన్ దలఁప లేదే? యన్నపూర్ణాసతీ॥

మ॥ అవురా ! పండుగుపేరఁ దన్నభిజనం బందుం గనన్ రాఁగఁ, బో
లవర గ్రామము నిన్నుఁ బట్టి యవలీలన్ మ్రింగెనే వ్యాఘ్రియై ?
దివితో రాయకరణ్ముఁ బొందెడుభవచ్ఛీకృద్వియోగవ్యథా
ర్ణవ మే నెట్లు తరింతు ? స్వర్ణసమవర్ణా ! యన్నపూర్ణాసతీ॥ ౧౩

మ॥ ప్లవమాఘాది వ్రతీన్, వ్యయాశ్వినమునం బా మింతయల్పాయు వ
య్యె విధాత్రుండెటు వ్రాసె నీ కెటులొ పోయుం గాక, నీయక్కకున్
సవతిన్ జేయఁగ నేటి కేటిపయి మాసం జే గదా నీకుపొం
దవురా ! యేమి దురాగతం బిది యపర్ణా ! యన్నపూర్ణాసతీ॥ ౧౪

మ॥ పదునై దేఁడులమూఁడుమాసములు నీప్రాయంబు ; నీకాఁపురం
బుదినంబుల్ పదియేనుసప్తమునఁ బట్టూన్నెల్లు ; దుర్వారసం
ధిదురంతజ్వరసన్నిపాతములతో నీయుస్కి మంచానఁ దొ
మ్మిదినాళ్ ; నీమృతి యెప్పహాటె గృహలక్ష్మీ ! యన్నపూర్ణాసతీ॥ ౧౫

శా॥ సాపత్న్యం బని యీసడింప కజహాత్సోదర్యజప్రేమఁ గా
నోపుం బూనితి సుబ్బలక్ష్మిచరితం బో చెల్ల ! భర్తృప్రియ
వ్యాపారంబులు వోలుఁ గాక పెఱవిం బాటింతువే తత్క్రియల్ ?
పాపిష్ఠజ్వరదగ్ధ వైతి; నుతరూపా ! యన్నపూర్ణాసతీ ॥ ౧౬

మ॥ పతిశుశ్రూషయు బంధుసత్కృతియు సాపత్న్యత్మజాతప్రియం
బతిథిప్రాశనదానపూజలును దేహానస్త్యసంశోధనం
బిత పాలించుట లోను గా స్వసగొనా లీ వ్రూని తుత్కర్షమే ;
మృతి యే లొందితి యౌవనాద్యదశలో నే ? యన్నపూర్ణాసతీ ॥ ౧౭

శా॥ నేఁ బెండ్లాడి గృహప్రవేశమునకున్ మీయక్కఁ దోడ్తెచ్చునాఁ
డాబండిన్ సుచ నుండి నీవు పడ, డాయన్ వచ్చి కేల్పట్టి గా
రాబం బొప్పఁగ నెత్తినాఁడ ననుచున్ బ్రాస్తంబునన్ నాకె యా
లై బత్తిం బచరించుకొత్తడివి రు త్తై తన్నపూర్ణాసతీ॥ ౧౮

శా॥ బావా ! యం చలవాటునం గదియు దో ? ప్రాణేశు నన్నంచు నే
భావంబం దనుకొంటే; దొంటిచన పెప్పాటం బొలంగించితో,
శీవం బీఁటలమీఁదనుండి యపుడే లే డైతి వాసిగ్గుతో
నీ వెం తైనను దాఁగి యుండెవు గదా నేఁ డన్నపూర్ణాసతీ॥ ౧౯

మ॥ మధురా కీవు గ్రహించి మంచికవటన్ మోహాన నా కిచ్చుచో,
నది తా ర్త్వా లోఁ నరించున న్నిది మహాన్యాయంబు నావే, హస
ద్వదనాబ్జంబున నర్థగర్భితముగాఁ దాంబూలవేళం? బ్రియా!
యిది యేన్యాయము ముందు రాలితి వయో ! యీ వన్నెపూర్ణాసతీ॥ ౨౦

మ॥ తడి వో సన్నరుమాలుపైఁ దుడిచి, మీఁదన్ రాచి లోఁ సున్నమున్,
బెడయీనెల్ పార వాపి, వెన్నడుగుగా వే పాయలన్ వంచి, నె
న్నడి మీనెం బోడిమం గొనం దోలఁచి, యొన్నం డిచ్చితో సిరికల్ !
విడియా కిచ్చితె నేఁడు నా కకట ! సాధ్వీ ! యన్నపూర్ణాసతీ॥ ౨౧

శా॥ మాయల్ మర్మము లే మెఱుంగమిని బ్రేమం బంచు నూహించి యా
హా ! యామోదముతో గ్రహించితిఁ ద్వదత్యంతోపచారంబులన్ ;
స్వీయం బౌబుణ మెల్ల నీవిధమునన్ వేవే నివర్తించితే ?
నాయం బే యిటు మోసపుచ్చ నను మిన్నా ! యన్నపూర్ణాసతీ॥ ౨౨

శా॥ వేసంగిన్ మన మేగి యిద్దఱము నీ పేరింటి దేవేరిఁ గా
శిస తేశ్వరిఁ జూచి వత్త మనుచున్ జింతింపమే ? మాఘపున్
మాసానన్ మనపోఱగాని వడుగుం గావింప భావింపమే ?
యే సంతోషము లేక మాయ మయితే యీ వన్నపూర్ణాసతీ॥ ౨౩

శా॥ తాలిం గట్టితి హేమలంబిని సముత్కంఠన్ మెడన్ ; శార్వరిం
జాలిం గట్టితిఁ గోకణంగునను హేమంబుల్ ; ప్లవాబ్దంబునన్
శైలప్రాయకఠోరచిత్తతఁ బటచ్ఛన్నాస్యఁ గావించి యి
ల్గాలిం బాడెను బెట్టి కట్టెదవె నిన్ ? హా ! యన్నపూర్ణాసతీ॥ ౨౪

మ॥ కదుపుం బోలెను దిన్ననై యుదిరి బంగారంబు నాఁ బచ్చనై,
మృదువై తామర మొగ్గ మాదిరి, లతారీతిన్ విలాసోచ్ఛ్రయా
స్పదమై, యాణిమెఱుంగు ముత్తెము వలెన్ భాసిల్లు నీ మేనయో !
సొదపై నే నిడ వ్రాసెనే హతవిరించుం డన్నపూర్ణాసతీ॥ ౨౫

మ॥ పువుసెజ్జన్ మడి వీడి తేఁటితెగ నాఁ బొర్లాడు పెన్నెర్లకా
తవిలించెం జెడుగుం గరీషచితి నిద్రాక్షీణ్యదైవంబు ? పం
దువు గాఁ బోలును నేఁడు పావకున కెట్టాల్ వెల్గుచున్నాఁడొ నీ
నీ తాఘశరీర మాహుతి గొనం దా నన్నపూర్ణాసతీ॥ ౨౬

గా. కుంకుంబెం గ నొక్కక టూడ లాగి, యటుపైఁ గొ న్నాద నీపెన్నెఁగల్,
పించెం బెన్నఁడు ముట్ట నీ దనపై కేళీబర్హి ముఖ్యట్టినీ
పాలించత్కేలిక్యము ధూమకేతుఁడు గొనెం; బచ్చాకుఁ గచ్ఛాభరమే
పంచం బాఱఁగ నైతు నే? ఘనతురంభా! యన్నపూర్ణాసతీ॥ ౨౭

మ॥ అనురాగాంబుధి బూదిలోఁ గలసెనే? యందమ్ము వమ్మయ్యెనే?
పనిసేర్పుల్ పద డాయెనే! పుడమి నీబత్తెంబు చెల్లాయెనే?
వనితా! తామరలంప మర్యాదను సావంశంబు నీచేత నం
తనుకో, నీవును సుబ్బలక్ష్మివలెనే యైతన్నపూర్ణాసతీ॥ ౨౮

శా॥ నిన్నున్ వీడ్కొని నాఁడు రత్నమణిఁ గనన్ నేఁ బోయి నర్సాపురం
బన్నా! నేఁ డిట నిల్వఁ దంచు ననుఁ దోడల్లుండు రన్నంబుగా
రన్నన్ మేనని, రేలు గన్నోయి కీడం బిడ్డనీనాపటిం
బున్నెఁ గొంటి; నిఁకం దెగాదె మనకుం బొం దన్నపూర్ణాసతీ॥ ౨౯

శా॥ సంగీత గ్రోస్నలరేక, మించు మెగులున్ వీడున్ మతిం గూడు? న
ర్భాంగం గాక హారాగ్రతిన్ దొడిమఁ బూభాతిన్ ననుం బాసితే?
తుల్యంగం దీపిక, వస్త్రరూపెటు లటుల్ తోఁచుం గటా! మామకో
త్సంగం బెప్పటిఁ గాంతు నిన్న? మణిప్రూసా! యన్నపూర్ణాసతీ॥ 30

తృతీయవిలాపము.

శా॥ నీకళ్ లెప్పలు వాలకుండు నెపుడుం; దేవత్వ మీ పొందితో?
పైకం బాకులపాటు నొంద నధరస్పందంబు లే దెన్నితో?
హా! కన్గొంటిని దత్త్వ మద్భుతపుణ్యాయాగాంత్రిహాయింత్రంబునన్
వ్యాకృష్టం బిది నీదునీడ; యెట నున్నావన్నపూర్ణాసతీ॥ ౩౧

శా॥ అన్నన్నా! సుకుమారగాత్రిని విశ్వచలమై యంపత్స్వస్పృష్టమై
హా నాన్నంజాయ నెసంగునీయొడ లటక్ హేయామంబుగా వించి వ
హ్నిన్, నిన్నరూపు పటంబులో నిప్పుడు నే నీక్షించుచున్నా నిటన్;
వెన్నం బాఱఁగ నైచి నాక వలసెన్ గ్రవే లన్నపూర్ణాసతీ॥ ౩౨

శా॥ గ్రేవేలన్ దగ్గఁ గూర్చి తేఁతచిగురుం గ్రేణించు మం గ్రాలుకెం
గేలిన్ నందొడఁ జేర్చి తన్విజయలక్ష్మీచ్ఛాయఁ దప్పించి; నీ
కాలిం బూసవు; మట్టె లే దొకటిఁ; బోఁ గాలంబు దాపించి కా
కే లానీ శుభచిహ్ననిస్పృహ? లతాంగీ! యన్నపూర్ణాసతీ॥ ౩౩

మ॥ గొడవర్త్యాఖ్యనియోగివంశజుఁడు నాకున్ రామదాసుండు సం
గడికాఁడై యిట బోధనాభ్యసనసంగా లేచి నీయేఁడు, నే
ర్పడరన్ నీడను జూచి వ్రాసినట్టి యాలేఖ్యమున్ నిల్చితిం
బడ కింటం; గని మెచ్చ చే మతనశిల్పం బన్నపూర్ణాసతీ॥ ౩౪

శా॥ మాసా లన్నిట శుక్లకృష్ణము లనం బక్షద్వయం బుండు నం
డ్రోసాధ్వీ! యదినిక్క మంచు మది నే నూహింప లేనయ్యెడన్;
నీసాంగత్యము గల్గునాళ్ళ నెల లన్నిన్ శుక్లరాత్రంబు లి
ప్డో సర్వంబును గృష్ణరాత్రములు నా కోయన్నపూర్ణాసతీ॥

శా॥ అయ్యయ్యో! కొనినాళు లుండి వెస రా నట్టేగఁ బుట్టింటికిన్,
దయ్యం బెత్తుక పోయెనే చెలియ! నిర్దాక్షిణ్యతన్ ని న్నటన్?
కుయ్యో! మొఱ్ఱో! యనంగ నాలుమగలన్ జోడుల్ విడం గొట్టున
క్కొయ్యం బాపము గొట్టదే? కుడుపదే గో డన్నపూర్ణాసతీ॥ ౩౬

మ॥ చదువన్ వ్రాయను నేర్చి మూన్నెలల దీక్షన్, ప్రేమ నీవ్రాసిన
ట్టిది జాబేను సువర్ణపత్ర. మని పెట్టెం దాఁచితిం, గాన నేఁ
డది కన్నీటను దడ్దయుం దడిపెదన్; హా! యేరి కంపింతు నీ
పెదమైబాష్పలతా రుచీరలను? సాధ్వీ! యన్నపూర్ణాసతీ॥ ౩౭

శా॥ కాసం గుత్తుక మెచ్చి పెంటిఁ గొని పోఁగా బోయ, నీడంబునం
దానుం బిల్లయు మేఁత మానుక కపోతం బున్నచందంబునన్,
నేనుం బిడ్డఁడు నింట నుంటి మలఁతన్, ని న్నిత్తి గొంపోవఁగా;
హా! నా కెప్పటియవ్వరే మరల దిక్కా? యన్నపూర్ణాసతీ॥ ౩౮

మ॥ జడుప్రం. గొల్పుమహాసముద్ర మనుచున్ సంసారముం బల్కినన్,
బెడఁ గొఁ గంటికిఁ బాన్పు నీకరన మున్ ఫేనాకృతిన్ నాకు; ని
ప్పుడో విస్ఫూర్జిత పూత్కృతియోత్థఫణి రాడ్భోగంబునుం బోలె న
న్నడలం బెట్టుచు నున్న దయ్యొ సమరీడ్యా! యన్నపూర్ణాసతీ॥ ౩౯

శా॥ మీరున్ మల్లిక గూరుచుండుఁ దనుచున్ జేరినున్ గేళికా
గారంబం దిడుపాడ మొక్కనిసి వేగన్ వెన్కకుం డీయవే?
యీరే మల్లిక మాని యెంతుఁ గద నిన్నే; చేర రా వే మయో!
స్మారస్త్రీసుతరూపవక్త్రవిలాసా! యన్నపూర్ణాసతీ॥ ౪౦

శా॥ అద్దం బుండిన నొవ్వ, దిద్దుదులపై నాసక్తి రెట్టింపదే?
ముద్దుంగుమ్మరో! నీకతమ్మునను బెంపుం బొందె శృంగారపుం
బద్దెంబుల్ రచియించుచున్నహా; యది యీపైఁ దోఁపఁగా నోపునే;
గిద్దుం గాక స్వకారణంబువలె నే వేయన్న; పూర్ణాసతీ॥ ౪౧

మ॥ అతివల్ నీకనుముక్కుతీరు గని యాహా పుట్టి చేతోశపుం
బతి మంచుక్ నిను వర్ణనల్ సలుపఁగా భావంబునం బొంగితిన్;
కుతలంబందుఁ గురూప వైనను మఱింగా నెన్నంగ్లు మం దేమొహా!
లత ము ల్ల ట్లల రున్నె యెన్నఁ జిరకాలం బన్నపూర్ణాసతీ॥ ౪౨

మ॥ పసరుంజాయ దొలంగి పాకరుచితోఁ బాళంపుఁబూఁబాళ సొం
పెసఁగున్ సంజను నాగగొల్లుఁబొవ; రే యెల్లన్ వికాసంబుతో
డసలం దావుల పిజ్జఁ జల్లుఁ; బగ లేతే రాలెడున్; దీని కా
యు సయో! స్వల్ప మటంటె; నీకు నటె కాదో? యన్నపూర్ణాసతీ॥ ౪౩

శా॥ ఈలోకంబుఁ బరిత్యజించితివి నీ వెంతేని ధన్యాత్మ వం
చాలోచింప మనస్సు కొల్ప దెటు; భోగైకనష్టం బౌనయః
కాలం బందు కకాల పాట; సుఖమో దుఃఖంబొ కొన్నాళ్ళపా
టేలంగా వలెఁ గల్గి కాఁపురమ దేనే? యన్నపూర్ణాసతీ॥ ౪౪

శా॥ ఎన్నో మాటలు నీవు నూతు ననఁగా హీరిఁ బోలె నీముందటన్
గన్నుల్ విప్పని నెమ్మి యిప్పుడు సదా కావించు నృత్యంబు సం
భిన్నస్వీయకలాపమై; యొటిఁగనో పెగ్గప్పఁగొ వృన్నని
వన్నాకంబున కేగి తన్నజనవాక్యం బన్నపూర్ణాసతీ॥ ౪౫

తురీయవిలాపము.

శా॥ కావింపన్ భవదుత్తరక్రియలు, నేఁ గాల్వ స్నానంగం దిగన్,
శైవాలంబు ప్రవాహవేగమున నాసందిటిలో నిండె; హా!
దేవీ! నీతెగబారెఁడేసికురు లాడీప్తాగ్నిసాత్గాఁ, బగన్
దా వచ్చెన్ నను దెప్ప, మెచ్చ ననుచుం దన్నన్నపూర్ణాసతీ॥ ౪౬

మ॥ నావణిల్లన్ రహి, శాకపాకముల మృష్టాన్నంబు నా కిడ్డనీ
వు విచారింపక యుంగటూర నకటా! గొడ్డోర మేలూరికా
లువయ్యోరన్ బడ వైతు, వాయసతతుల్ గొంపోవఁగా మూఁగి, హా!
యువనిన్ మాదృశఘోరకష్టుఁడు గలండా? యన్నపూర్ణాసతీ॥ ౪౭

మ॥ నిను సన్మంపుఁ జివుళ్లపోట్లమునఁగున్ దీర్ఘైనసీపట్టిటన్
బెనఁగుం గ్రొవ్విరవాఁజి మొగ్గలగమిన్ నిందించు శాల్యన్న మె
న్నఁడు సద్యోదితపత్రిభాజనమునన్ నడ్డించి నీ వర్థిలిన్
గడుపారం గుడుపింకఁ బెట్టితివు గదా నా కన్నపూర్ణాసతీ॥ ౪౭

పరలోకబంధుపరిసంగము.

---

శా॥ బంగారంబున కబ్బెఁ దావి యన గూపశ్రీకిఁ దోడ్తోడ నీ
కుం గల్యాణగుణౌఘ మీశుకృపఁ జేకూరన్ విలోకించి, చె
ప్పం గాంక్షించితిఁ గొన్నివాక్కులు; దివిన్ బంధుల్ గలా రెండటో;
పొంగింప న్వలె వారి నీమెలఁకువన్ ము న్నన్నపూర్ణాసతీ॥ ౪౯

మ॥ సవతుల్ నల్వుర తోడ నీ వెనయఁ బంపత్వంబు ప్రాప్తించెనే?
కవుఁగింటం దొలుతన్ ఘటింతు వటె యక్కన్ సుబ్బలక్ష్మిన్ వెసన్?
మివులన్ మన్నన సేయుమీ విజయలక్ష్మిన్; దన్నిమిత్తంబునన్
దివియుం బుత్రిసతీనివాప మొదవెన్ మీ కన్నపూర్ణాసతీ॥ ౫౦

శా॥ కోరంగిం బిననాఁటఁ దండ్రి తలి మాకుం గూఁకటుల్ గొల్చి చే
యారం బొమ్మలపెండ్లి సేయఁ బదునాఱౌనేఁట నీడేఁజి సం
సారం బబ్బె సమాప్తి గాఁ బ్రసవమై సంతేది మున్ సన్నచి
న్నారిన్ వేంకమ నీ వెటింగి యొరఁగన్ ల గ్గన్నపూర్ణాసతీ॥ ౫౧

శా॥ నీవాల్గన్నుల నీరు గాఱ వినవే నేఁ బ్రేయసీరత్నతా
రావళ్యాఖ్య రచించి యచ్చిడినపద్యశ్రేణిఁ? దాదృగ్గుణ
శ్రీవాసిం గని చన్నరత్నమువరాంఘ్రిద్వంద్వమున్ సోఁక నీ,
లావణ్యాకర మైన నీకుటిలఫాలం బన్నపూర్ణాసతీ॥ ౫౨

మ॥ పటసందర్శనజాత మా పరిచితిం బ్రత్యక్షనిధ్యాన ము
త్కటముం జేయఁగ డాసి, యక్క! యని తన్ గారామునన్ బ్రొక్కఁగాఁ
గిటికాసింపఁగ నీవు, నా విజయలక్ష్మీదేవి నైజేక్షచే
నటుమోహా దివి; దెప్ప మా మెననసూయా! యన్నపూర్ణాసతీ॥ ౫౩

మ॥ ముకురంబుం గడసారియక్క యగుటం, బుచ్చక్కయుం జీవు మ
చ్చికమైఁ బిల్చెడుసుబ్బలక్ష్మిని సతీస్మృత్యుక్తి, నామాలుగం
బికాఁగింట మ ఱొక్కమా లునుపుమీ; మీ రేగురుం గోటరం
బొగిఁ జేయం బిత లెంతసంతసముఁ గండో! యన్నపూర్ణాసతీ! ౫౪

శా॥ మూఁడు ర్విన్నతఁ గూర్చి మీరు సవతుల్, భోగుంతగోంచత్కుల
పాత్రిగాద్యబ్ధిచళ్లక్కసంభవమణుల్ భక్తిందముం గొల్చువో,
నే గాటంబు వియోగవహ్నిశిఖలన్ రేయుం బగల్ వేఁగుదు
ర్యోగంబున్ సైరియింప కుండుతేఁ బితా ళ్లోయన్నపూర్ణాసతీ॥ ౫౫

మ॥ పరలోకం బిహలోక మిర్వహారువుల్ భావింప; నిక్కంబు లో
నరయన్ లే కిటు శోఁ మొందితి నిసీ! యం దేను రా కుంను నే?
పరిరంభంబునఁ దేర్ప కుండు దె ననున్? భద్రం బగుం గాతఁ; ద
త్పరమాత్మున్ భజియింతు శాంతి కిఁక నిత్యం బన్నపూర్ణాసతీ॥ ౫౬

## శాంతిపంచకము.

మ॥ తనుతాపంబు నడంపఁగా నవనదీధారాతటాకహ్రదాం
బునిధానాదులు గల్గు నెన్నొ; హృదయంబు న్నిచ్చలుం గాఁచు నీ
ఘనతాపంబు భవాబ్ధిజం బుడుపఁగాఁ గానన్ మఱొండెందు; నన్
మనుఁగన్ జేయవె నీదయాసుధను శంభూ! భక్తచింతామణీ॥ ౫౧

మ॥ ఘనసారంబును గంధసారమును రాకాచంద్రికా పూరముల్
వనజాతంబును వాతపోతమును హిమవారితంబు జన్నింబలెన్
బెనుచుం గా కడఁగింప లేవు సుమి సామీ! నామనోవేదనన్;
జినుకన్ వేఁడెద నీదయాశిశిరవృష్టిన్! భక్తచింతామణీ॥ ౫౨

మ॥ తెత్తైనందివతర్పణాంజలిని దుర్దాహోపశాంత్యర్థమై
సుతు యాచింత్రు పితాళ్లటన్; బిత నినున్ నూనుండయాచింతునిం
దతిదాహంబునఁ; దావకీనసదయాపాంగంబునన్ దర్పణం
బు తగం జేయవె నాకు నన్వహము శంభూ! భక్తచింతామణీ॥ ౫౩

మ॥ పరమాత్మా! భవదీయశీతలకృపాపాంగోనిధానైకశీ
కరమే చాలును మామకోగ్రభవదుఃఖజ్వాల చల్లార్పఁ; జె
చ్చెర నేతెంచిన చిన్నచీమకడుపుం జిచ్చార్చి రక్షింపఁ, గుం
పురగా కేటికిఁ దేనె బానెఁడును శంభూ! భక్తచింతామణీ॥ ౬౦

మ॥ భవనైదాఘదురాపతాపము శమింపం ద్వత్కృపాపారసిం
ధువుతీరంబున భాగ్యవంతులు వసింతుర్! పేద నౌనాకుఁ ద
త్సవిధంబం దిసుమంత నిల్వ వసతిన్ స్వామీ! ప్రసాదింపవే?
భువనాధారుఁడ వేమి నీకుఁ గొద? శంభూ! భక్తచింతామణీ॥ ౬౧

గద్యము.

ఇది యాత్రీయతురీయానంతర
ద్వితీయాకస్మిక సంస్థితటస్థ
మానసాన్వస్థ్యాంతరాయ
వడ్డాది సుబ్బరాయ
ప్రణీతము
సతీస్మృతి.

భామినీవిలాస కరుణవిలాసానుబంధము.

సమాప్తము.

## శాం త వి లా స ము.

చ॥ గురువిషయకూటపీవలయఘోరవిలగ్నదవానలప్రస
త్వరబహుళార్చులన్ వికలభావము నొందినమామనంబు, స
త్వరము చకోరభృట్టు లగుతన్, మిళదిందిరమాధురీధురం
ధరకమలామనోహరకనన్ముఖచందిర మండలంబునన్॥ ౧

చ॥ జలనిధిసార్వభౌమతనుజానయసాంబురుహావలంబనా!
జ్వలనవిజిత్వరజ్వరజవత్వరథంగురుఁ డైనవన్ను శీ
తలునిఁగఁ వేగ సేయఁగదె తండ్రి! జగత్త్రియరోచనంబు లా
లలితవిభాతసారసవశీస్తయహారివిలోచనంబులన్;॥ ౨

ఉ॥పంబినబాలి నాతపముఁ బాపుచు లోకులకుం దలంచుమా
త్రంబున, విద్యుతుల్ బహుళతంబు లభంగరుచిన్ వెలుంగఁ, జి
త్రం బగునంబుజప్రియసుతాతటకల్పనగావలంబికా
తంబిని, మామకప్రణిపతన్ స్థితి మంబిని గావుతన్ సదా;॥

చ॥ అలరఁ గళిందశైలతనయాఘునతీరవనాంతరంబు, పా
ణుల కడుగన్ గతాగతతనుశ్రమ మవ్వమునన్, లతాతతం
బలముకొనంగఁ దన్, మధుర మారుచిఁ గ్రాలుతమాలభూజ మ
గ్గల మగుమామకశ్రమముఁ గ్రిక్కునఁ దా హరియించుఁ గావుతన్॥ ౪

మ॥భువనవ్రాతముఁ జంద్రికామయసుధాపూరంబునం దన్పుచున్,
త్రివిధం బౌపరితాపమున్ నరులకున్ శీఘ్రంబ చల్లార్చుచున్,
దివిషద్బృందసదాభినంద్య మగుచున్, బృందావనం బున్కి యై
[illegible]ఘనూత్నం బు ధరంబుమామకమనోధ్వాంతంబు మాయించుతన్॥ ౫

[illegible] మండలభీష్మకీల । మైనసంసారమున ననయంబు వేఁగు
[illegible] దెంబుదంబు । మాడ్కిఁ జల్లార్చు, వృష్ణికుమారవరుఁడు;॥ ౬

[illegible] మున్ గనక, వేమఱు దుస్తరసంస్కృతిన్, మరీ
[illegible] పిపాసమ మార్గమునన్, గమియించుచున్, దగన్
[illegible] నన్నుఁ దేర్చుతను, వారిజబాంధవనందినీతటా
పసథము నందగోపకతపఃఫలబాలతమాల మూదటన్;॥ ౭

ఉ. కోరిక లూరి పాల్కడలికూరిమికూఁతురు, గ్రుచ్చి కౌఁగిటన్
జేరుపఁ, బ్రేంకణంపులతచేఁ బరివేష్టిత మాతమాలసా
మీరుహముం బలెం, బొలుచు మేచకవర్ణుఁడు దోఁచుఁ గాత మిం
పార, నసుప్రయాణసమయంబున, నాహృదయంబులోపలన్;॥ ౮

క॥ తుందిల మగు నానందము । గందోయికిఁ జేయువింతకాదంబిని, నా
డెందముఁ గడు నడికించెడు । క్రందగు నారంట ముదుపుఁ గాంతెన్ వేగన్॥ ౯

మ॥ కరమున్ స్వచ్ఛము లై, సుధాఘుటిక లై, కన్పట్టునీశాసనా
క్షరముల్, నేఁ గల నైనఁ బాటి సలుపన్; సత్వేశ! గర్వాంధుఁడన్;
నెరసుల్ నాయెడ వేనవే లిటులు నీ వీక్షించి, నన్ స్వీయుఁ గన్
భరియింతెందును నిన్నువంటి సదయుల్ నావంటిగొం ట్లుందురే॥ ౧౦

మ॥ శరధుల్ దాఁటుము; ప్రాఁకు మేరుశిఖరముల్; స్వర్లోకపాతాళముల్
చొరు; మూర్ఖా! భవదాశ తగ్గదది పోవచ్చున్; వ్యాసు లాధుల్ నినున్
బరిపీడింపక యుండ, నిత్యసుఖమున్ వాంఛించితేఁ, గొమ్ము చె
చ్చెర శ్రీకృష్ణరసాయనం బితరసంసేవల్ సృహాయాసముల్॥ ౧౧

భవ మనుపాడునూతిఁ బడి, బాముల నొందెడు నన్ను నీకెటన్
దవ్వునె యుపేక్ష సేయఁ? గరుణానయనాలయ! శౌరి! తొల్లి న
వనన మొసర్ప వెట్టు లకటా! ప్రకటాఘుని బింగళాఖ్యవా
రవనిత, దుష్టవర్తనుని బ్రష్టు నజామిళభూసురబ్రువున్॥ ౧౨

ఉ॥ దిక్కని పాలు గోరితి; భుజించితి మంచిరసాంతుఁ జక్కెరన్;
మెక్కితి పక్వగోస్తనుల; మింట సుధం జవి గొంటి; పంటితోఁ
నొక్కితి రంభకెంపెదవి; నోరి కొకండును, కృష్ణ యన్న రెం
డక్కరముల్ బలెన్ మధురమా? పలుమాములఁ బద్దతిసమా!॥ ౧౩

మ॥ భవసిద్ధామయసిద్ధభేషజము, పాపగ్రావదంభోళి, సం
భవపజ్ఞానవిభావరీతిమిరభాస్వన్మండలం బుగ్రప
వివిధక్లేశపలాశిదావశిఖి, కృష్ణా యన్న నక్షద్వయం
బవురా! యీనుడి ముక్తిగారమునకున్ ద్వారంబు నా రంజిలున్;॥ ౧౪

ఉ॥ నే వినిపించెదన్, హితము నీకిది; డెందమ! యాలకించు ప్రా
దావనిఁ గామితోండకఘువాఘునకాయుతిచాయ [illegible]
బోవకు; చారుతామృతముపూరము జాఱుచున్నాం[illegible]
వే వలపించి నిన్నలిఁడు, నీప్రియభోగములన్ హరించెడున్॥ ౧౫

ఉ॥ నెమ్మది నాటి యొయ్యది యనిర్వచనీయసుఖంబు బొసంగుఁ, గం
తమ్మున లగ్నమై యెది యడంచును జ్ఞానితమమ్ము, దేనితో
పమ్ముగ గోస్తనీక్షుపనసాదులు మెచ్చెదు, నట్టికృష్ణనా
మమ్ము భజింపుమా రసన! నాటికి, నీవు రసజ్ఞవైనచోన్॥ ౧౬

చ॥ ఇల నళరూపపుంబులుఁగు లెన్నియొ యున్నవి గాని, వానలో
యిలవలె వానిలోపల మఱేదియుఁ గాదు ప్రియంబు నాకుఁ; గ
న్నులఁ బడునంతనే తనయనుంగుఘనం బది తోఁపఁ జేయుటన్,
నిలఁబడుఁ గృష్ణనామక మనిర్వచనీయము బ్రహ్మ మాత్మలోన్॥ ౧౭

శా॥ క్రాలున్ విశ్వము సర్వ మవ్విభునివిష్వగ్గీచి యానాభచే,
నాలంబంబు నిగూఢ మేపరుఁ డహ మ్మన్ తెల్వి కవ్విష్ణునిన్
గాలింతుర్ పెఱగోటులన్, స్వహృదయజ్ఞానానభిజ్ఞుల్; కటా!
వ్యాళాధీశుఁడు బాలఁ డీజనులయన్యాయంబు వర్ణింపఁగన్;॥ ౧౮

చ॥ కొలువఁ దలంచితే మనస! కొల్వుము కోరిక దీఱ శ్రీపతిన్;
దలఁపఁ దలంచితే నెపుడుఁ దాలిమి మీఱఁ దలంపు మాధవున్;
బలుకఁ దలంచితేఁ దెలిసి పల్కుము పన్నగశాయిగాథలన్;
వలసిన నిద్ర, భద్రసుఖవాసమునన్ నిదురింపు హాయిగా॥ ౧౯

మ॥ భవనైదాఘదురాపతాపమున కోపన్ లేక యాపన్నులై
తవులం బౌనవివేకశృంఖల బలాత్కారంబునం ద్రెంచి, సం
భవనైరాశ్యసుశీతలప్రవిమలాత్మధ్యానడిండీరఘు
న్యపగాహంబు బొనరింత్రు కల్మషసమూహధ్వంసకుల్ సజ్జనుల్॥ ౨౦

మ॥ క్రతుముఖకర్మపాశములు గాం బొనరింతురు బంధముక్తికై;
స్మృతిశతచింతనంబు గప చేయుదు రంతరశాంతి కగ్రగు
ప్రకృతిజలరాశిపారగుని జేరఁ గదా యది ముస్ఫ చంద్రము; సం
స్మృతిని బరిభ్రమించె నసురీపుల కీయఖిలంబు మాధ్యమే॥ ౨౧

తే,గీ॥ చరణములు ముందు ముద్దాడి, జంఘికలును, । జాను లూరులు నాభి విశాలవక్ష
మునల నక్కునఁ జేర్చి, నాయంతరాత్మ । హరిముఖాంభోజరుచి నోలలాడుఁ గాత॥

తే,గీ॥ కలయుపమానమున హాలాహలమునందుఁ, । దరుణిభ్రూవిలాసముజడ నల్లత్రాఁచునందు,
శ్వపచునందును నేనజ్ఞానియందుఁ, । బోనిముత ము భేదపరమాత్మబుద్ధి నాకు.। ౨౩

క॥ జగమే సర్వము నశ్వర । మగు భంగుర మంతకంటె నంగము ; కట్టా ?
మిగుల శ్రమపడెద రవ్విధ । మగుదాని జను లి దేమియవివేకంబో?॥ ౨౪

క॥ దినదినమును మృత్యుముఖం । బునఁ జొచ్చెదు నెల్లమానవులఁ గనుఁగొనుచున్
మనము విరమింప దిప్పటి । కిని దా విషయములవలనఁ గించి త్తైనన్॥ ౨౫

తే,గీ॥ పోయనీ రాజ్యలక్ష్మి, కృపాణధార । లట్టె పయిపయిఁ బడనీ, భయంకరముగఁ
దల యముఁడు దీయనీ ; సుంత ధర్మపథము । దప్ప నుండెదు న్గాత డెందంబు నాది॥

క॥ పగవాఁడు నెత్తిమీఁదను । బగబగ మండింపుఁ గాక పావకు, నపిచేఁ
దెగఁ గోయుఁ గాక కాయము, । తెగ వెడలినపలుకు నేఁ బదర లేశంబున్॥ ౨౬

క॥ తరణోపాయము నాకుం । దొరకద యని యేల పొగిలెదుర ? జీవుఁడ ! నీ
స్మరణంబున నెన్నఁడు నుం । దరనందకుమారునాననము దగుల దొక్కో?॥ ౨౭

ఉ॥ మాకు నిమేషమున్ వలను, మాద్యదనేకపదానమత్తభృం
గీకలఝుంక్రియారుచిరఖేలనహృద్యము లైనసంపదల్ ;
కైకొనువారి నెల్ల నవి గన్నులు గప్పి, రమామనోహర
శ్రీకరపాదయుగ్మసరసీరుహసేవకు దవ్వు సేసెడున్ ;॥ ౨౮

తే,గీ॥ ముగిసెఁ బాల్యము; మృత్యువు మొగిసె; నకట! యొంట లే కిప్పుడా నిద్ర? ఓరి జీవ!
యైనఁ గొద వేమి ? నిదురింపు మూద మఱచి ; । కడనె యున్నది తల్లిగంగాభవాని ;॥

క॥ ధారుణి నిట్టటుఁ బఱచుచు । నారాటంపఱుప నేటి కంతఃకరణం
బారూఢుఁ డెపుడు నందకు । మారకపరమప్రభుండు మచ్ఛిరమందున్ ;॥ ౩౧

చ॥ మనస ! నమున్, మనోభవవిమర్దనపాదసరోజయుగ్మపూ
జన మతిభక్తి సంతతము సల్పెదువానిని, నాజవంజవం
బను పెనుగర్తమందు నకటా ! పడఁ ద్రోసెద వింతమాత్రచేఁ
దనయవియోగదుఃఖశిఖితాపము నీకును గాక పోదు సూ ;॥ ౩౨

క॥ మరకతమణిభూధరమో, । తరుణతగం బగుతమాలతరువో యనుచున్,
బొరసిరి శంకను మునిసం । జరు లవలోకించి రామచంద్రుని దొలన్ ;॥ ౩౩

చ॥ ఇది యమునాతరంగిణి యొ ? యెట్లది తోయమయస్వరూప యౌఁ
గద ; యిది పచ్చచాతకుఁడొ ? కా దది మాధురిఁ గాంచు నెట్టు లం
చెదలను సంశయంబు జనియింపక యుండెడు నేరి కాదియం
దుదితకుతూహలంబున రఘూద్వహు నెమ్మెయిచాయఁ జూడమిచోన్ ?॥ ౩౪

ఆ॥వె॥ మేఘమునఁ బాయు మెఱుపుఁదీఁగ గన్నుగాని పొందునకును బాయు పుష్పలతయొ
యని తలంచి, పిదప హనుమానుఁ డెళ్లఁగ వి॥ యోగినిగను నిడుదయూరుపులను॥

ఉ॥ సంపద నీచగేహముల; సద్విజాలిఁ దుల లేమిగోల; పు
ణ్యంపుజనుల్ గతాయులు; చిరాయులు పాపులు; నీయనీతి వీ
క్షింప మహోగ్రకోపశిఖికీలలు పర్వెడు; నైన నేమి గా
వింపను నిన్నుఁ దిట్టుఁడను; విశ్వవిభుండవు నీవు; శంకరా!॥ ౩౬

కృత్యంతమున జగన్నాథునిస్వోత్కర్షము.

మ॥ అమరాగారనగంబుఁ దొట్టి మలయాహార్యావృతాంభోధిసీ
లముదాఁకం గలకావ్యకల్పవచనుల్! శంకింప కీ రానటిం
డి; మదన్యుం డురుగోస్తనీరసధునీనిస్సీమమాధుర్యధు
ర్యమ్మృదూక్తిప్రభుతాపదానుభవధన్యత్వంబు వాఁ డుండు నే? ౩౭

ఉ॥ పీనులఁ దా సుధానుయము వేనిచకోరస మాని వాణి, చేఁ
బూనినవీణతంతునయముం బలికింపఁ దలంప మానుఁ, ప
ద్మానులేపంపి తేశు[illegible]భూషణభూషణ మాలకింప, వె
ణ్వానిశిరంబు కంపిలదు, వాఁడు ద్విపాత్పశు వెద్దు మొద్దగున్ ౩౮

ఉ॥ తేనెయు ద్రాక్షపండు సుధ స్త్రీయధరామృతమేనికైన, నె
వైన ముఖంబుఁ దార్చనివి యైనను, బండితరాజువాణి యె
మానిసి కీను మోద మలమంఘుఁడు ప్రాణము బొంది యుండెనన్,
దీనుఁగు నిశ్చయంబుగను దీనుఁగు పీనుఁగు పీనుఁగే సుమీ॥ ౩౯

మ॥ కమియుం బండి స్రవించు ద్రాక్షరసపుంగర్వంబు వాపన్ సమ
గ్రము లౌ వాక్కులఁ, గావ్యకల్పన మొనర్పన్ నీకు నే ర్పున్నప
క్షమునన్, జెప్పుము కాని మాప్రశసమక్షంబందు; లేకున్న దం
డమునం[illegible] వెలార్పఁ బోకు మది, మిత్రా! త్వత్కృతాఘక్రియన్॥ ౪౦

ఉ॥ నాకవితాకుమారి! వచనమ్మును వారంచకువమ్మ, నిన్నుఁ బ
ల్గాకి నిరాకరించి మన; కాలను నాఁడటు లోర్వ లేము; నీ
కాకథ యేల? కావ్యకమలాంతరసీధుసుసీమసుప్రవా
నీకముమోములం జెలఁగి నిత్యము కృత్యము నీ వొనర్పవే॥ ౪౧

మ॥ పరవాక్యార్థునపక్షమం దనిశముఁ బాచంయముల్ పండితుల్;
ధరణీశుల్ కమలావిలాసమం దిరాత్తందా(?)మదాఘూర్ణితుల్;
స్మరపీడాలససారయోషిదధరస్వారస్యధిక్కారి మం
ద్వరవాణీపరిపాక మేరసికజిహ్వాఁ సల్పు లాస్యం బిలన్? ౪౨

క॥ ద్రాక్షేక్షుక్షీరసుధా । మాక్షికములనిరుపమానమధురిమలుతు, ద్రా
మాక్షిడిఁ బండితరాజన । నోక్షురమాఘసుఖ కహా! జూహా రానరముఁ, ౪౩

శా॥ జల్లించెం గడ వెళ్ళ శాస్త్రములు; నిష్ఠఁ జల్పె నిత్యక్రియల్;
ఢిల్లీవల్లభుపాణిపల్లవమునన్ తేఁ బ్రాయ ముంచెన్; గడున్
దుల్లన్ వాసన లియ్యదన్ మధురయందుం గొల్చు గోవిందు; హా
యుల్లోకంబుగఁ జేసెఁ బండితసమూహోత్తంసుఁ డన్నింటినిన్;॥ ౪౪

క॥ లంజలకొడుకులు హరియిం । పం జూతురు మామకీనపద్యప్రముఖా లం
చుం జనియించిన శంకన్ । మంజూషను దీనిఁ జేసినాఁడం జాండీ॥ ౪౫

శా॥ కబ్బం బుల్లదు; దైన నాకురచనోగ్రవ్యాఘ్రదంష్ట్రాళి కే
నబ్బా! కవితాలతాంగి నెర సేయం జాల; నానాటికిం
జబ్బంబాగ గోరసాదు విడుణొంచుం బెంచి, యబ్బాలచే
నుబ్బింతుఁ రసికాంతరంగముల; బి ట్టూరింతు విద్వాంసులన్;
సుబ్బారాయుఁడ; మేఘువేణిసుమనస్సాత్త్వాదు లస్మత్కృతుల్;॥

ఇది యూబువేలవంశాభ్యుదితుండు
ఏ. సు. రాయండాంధ్రమొన
రించినయట్టిది భామినీ
వి లా స నిగదితము
తుదిశాంతనామ
క వి లా స
ముగున్



# ఆర్తరక్షామణి

ఇది

రాజమహేంద్రవరమునందలి దొరతనమువారి

మొదటితరగతి కళాశాలయందు

నాంధ్రోపాధ్యాయుఁడుగ నుండి విశ్రాంతి నొందియున్న

'సూక్తిసుధానిధి'

వడ్డాది సుబ్బారాయ కవిశేఖరుఁడు

రచించినది.

మొదటికూర్పు 1000 ప్రతులు.

రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్‌నందు ముద్రితము,

రాజమహేంద్రనగరము.

1935

 [వెల రు 0—4—

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః

# అవతారిక

మహాజనులారా! సంసారసముద్రమున మునిఁగి యుక్కిరి బిక్కిరి యగుచుండు మానవకోటి, కొంచెము తల యెత్తి యూపిరి పుచ్చుకొనుచు విశ్రాంతి నొందుట కనుకూలముగా లోకోపకారపరాయణులు జ్ఞాననిధులు మహర్షులు పరమార్థసాధకము లగుబహుగ్రంథములు రచియించి కీర్తిశరీరముతోఁ దేజరిల్లుచున్నవారు; వారట్లు విరచించినగ్రంథము లన్నిటియందు నాబాలగోపాలము సర్వజనామోదసంధాయకము లయి విలసిల్లుగ్రంథరాజములు మూఁడు. అవియే భారత భాగవత రామాయణములు. సాధారణముగ నీ మూఁడిటియందలి యంశములను స్వీకరించియే యాంధ్రగీర్వాణమహాకవులనేకులు సరసము లయినసుప్రసిద్ధకావ్యనాటకములను గల్పించి వాసికెక్కినవారు.

భారతకథయందు నాకుఁ గలప్రీతిచేత భట్టనారాయణమహాకవిప్రణీత మగువేణీసంహార మనుసంస్కృతనాటకము నేను గొన్నిసంవత్సరములక్రిందటఁ దెలిఁగించి యాంధ్రమహాజనులమన్ననకు భాజనము గాఁ జాలితిని. అట్లే భాగవతమునందలిపరమభక్తిం జేసి శ్రీకృష్ణభగవానునిమహిమాదులను బొగడుచు ముందుగ నందనందనశతకము, పదపడి యాపదుద్ధారకశతకము విరచించి ప్రకటించితిని.

ఇప్పుడు శ్రీమద్రామాయణ మనునాదికావ్యము ననుసరించి తారక
నామముఁ డగు శ్రీరామచంద్రునిసుగుణముల సంకీర్తనము సేయుచు
భగవదనుగ్రహమున నాకుఁ దోఁచినకల్పనాదులతో నీయార్తరక్షా
మణి రచియించితిని. ఇందలిపద్యభావములు పెక్కులు చదువరులకు
రామాయణకథాంశముల జ్ఞప్తికిఁ దేఁజాలినవిగా నుండును. శ్రీరామ
చంద్రునిభక్తజనుల కీకృతి యత్యంతముదావహము, హృదయాకర్షక
ము కాఁగల దని నావిశ్వాసము.

రాజమహేంద్రవరవాస్తవ్యుఁడు కీ. శే. ముడుంబ కృష్ణమా
చార్యుల సత్పుత్రుఁడు ప్రతివర్షముఁ జైత్రశుద్ధనవమిని శ్రీ సీతారామ
కల్యాణమహోత్సవము హరికథాకాలక్షేపాదులతో నతివైభవమున
నిజభవనమున జరిగించు బాలభక్తుఁడు, శ్రీరామాచార్యుఁ డీభావ
సంవత్సర ఫాల్గునమాసాంతమున నొక్కనాఁ డార్తరక్షామణిలోని
కొన్నిపద్యము లర్థసహితముగ నాకడ నాలకించి, యువసంవత్సరచైత్ర
మునఁ దాను జరుపనున్నకల్యాణోత్సవమున కేతత్కృతిపఠన మొక
యంగము గావలయు నను నుత్సాహముతో ముద్రాభృతి నొసఁగి,
శీఘ్రగతి నీకృతిఁ బ్రకటింపఁ గోరెను. ఈ కోరికయే పూర్వోక్త
మగు నావిశ్వాసమునకు ముఖ్యకారణము.

బాలభక్తుఁ డగు నీశ్రీరామాచార్యునిచేత స్థాపిత మయిన
శ్రీమద్భగవద్భారతసేవాసమాజ మఖిలజనమనోరంజక మగుచు నాచం
ద్రార్కము వర్ధిల్లుఁ గాక.

ఈ యార్తరక్షామణి నితఃపూర్వము సుప్రసిద్ధ మగుతమ
యాంధ్రసాహిత్యపరిషత్పత్రికయందుఁ బ్రకటించిన తత్సంపాదకులకు
మత్కృతజ్ఞతాపూర్వకవందనములు. అగ్రజ యగుభక్తచింతామణి,
నార్తరక్షామణి యనవరత మనువర్తించుఁ గాక.

శా. ఆమంత్రించుచుఁ దారకాఖ్యుఁ బ్రతిపద్యంబార్తరత్నామణీ
రామా యంచు రచించునాదుకృతి, శ్రీరామేందుకల్యాణ మ
త్యామోదంబునఁ జైత్రచైత్రము స్వగేహంబందుఁ గావించుశ్రీ
రామాచార్యుఁడు వేఁడ, ముద్రిత మొనర్పన్ భక్తి భావన్ దుదిన్.

క. శ్రీరామాచార్యుఁడు కొ
మారవయస్కుండు యువను మచ్ఛృతకము స్వో
దారత ముద్రిత మొనరిచి,
శ్రీరాముని పెండ్లి విందుఁ జేసె బుధులకున్.

ఆ. తనముదుంబకులము ధన్యమై వర్ధిల,
భక్తి రామచంద్రుపాదయుగళి
సేవ శైశవాది సేయురామాచార్యుఁ
డఖిలశుభసమృద్ధి నలరు సతము.

వడ్డాది సుబ్బారాయుఁడు.







శ్రీరస్తు

శ్రీపరమాత్మనేనమః

# ఆర్తరక్షామణి.

---

శ్రీసీతాజలజేక్షణాహృదయరాజీవస్ఫురద్ద్యోమణీ!
కౌసల్యోదరశుక్తిమౌక్తికమణీ! కల్యాణచింతామణీ!
వ్యాసాదిస్తుతిపాత్రపాలకమణీ! వాల్మీకిసత్కృత్యుప
న్యాసాకల్పమణీ! తమస్తరణీ! రామా! యార్తరక్షామణీ.

మ. అవివంశంబున భారతక్షితి నయోధ్యన్ మర్త్యతం దేవ్రిత ను
ద్భవమై, సంక్తిరఘుండు తండ్రిగఁ, దత్కౌసల్య తల్లింగ, గా
రవ మారంగఁ జెరంగి, సీత సతిగా, రాజై చిరం బేలి తీ
వవనిన్, భక్తి భజింప నేఁడుఁ బ్రజ; రామా! యార్తరక్షామణీ. ౧

మ. జనసందోహ ముహూర్పుఁ గన్గొన నదక్షం బంచు విశ్వంభరుం
డను వొందం దను భక్తిఁ గొల్చి ప్రజ, నైకాపత్కరంబుం దరిం
పను సంసారము, ధారిణిన్ వెలసె భాస్వద్వంశరాణ్మౌళి వై
యనుచుం బ్రాజ్ఞార్యులు; నీవ సత్ప్రభువు; రామా! యార్తరక్షామణీ.

శా. శ్రీనాథుం డని, చిన్మయుం డని, ఋషిశ్రేష్ఠుల్ ప్రశంసించి రే
లా నిన్నొక్కని? సూర్యచంద్రకులజుల్ లాంతుల్ నృపుల్ లేరె? యం
దేనిం గాని వచించిరే యటు? మహోత్కృష్టక్రియల్ సల్పరే
యీనాఁ డా ప్రభు? లీవు శ్రీహరివె; రామా! యార్తరక్షామణీ. ౩

మ. తనయుల్ సల్పినతప్పు లెప్పగిదినైన౯ దండ్రుల్ దయం దిద్దుకో౦,
డ్రనిశంబు౯ క్షమియించి; నీవ గుణి యిం; దారావణబ్రహ్మకు౯
వసజాతాసను( డిడ్డచెడ్డవరముల్ పాటించి, లోకంబు లో
మ, నరుం డై తి, వికుంఠధాము(డవు; రామా! యార్తరక్షామణీ.౬

శా. వైకుంఠంబున( దావకప్రియతమద్వాఃపాలకుల్ శప్తులై
శోకింపం గని, వారి కిర్వురకు( దచ్ఛ్రద్ధాంతసేవాస్థితి౯
జేకూర్పం గద, యెత్తి మర్త్యతనువు౯ నీకుం దటస్థించె; నె
రా! కారుణ్యము; రాయి పాలకయి; రామా! యార్తరక్షామణీ.

మ. నరు లాహారమె కాన, వారివలన౯ నాశంబు రా దన్మతిన్
వరవారంబున వారి రావణుడు చేర్పం డయ్యె; వాదించిన౯
నరులే కావున నల్లె వానరుల; దానం దత్సురుల్ వానరుల్,
హరి నీ వౌట, ఘటిల్లె( దద్వధకు; రామా! యార్తరక్షామణీ.౮

మ. భువనక్షోభము రావణాదిదనుజుల్ పూర్ణంబు గావించి; ర
ట్లవుటన్ వారల దూషణంబు పొనరిం; తొ్రెం గాని, నీయట్టిసా
ధ్వనమున్ పౌనవతారమూర్తి భువియం దావిర్భవింపం గతం
బవుట౯, వారల కొప్పు భూషణము; రామా! యార్తరక్షామణీ.౯

మ. అవతారంబుల( దర్జనీప్రభృతు లౌహస్తాంగుళంబుల్ బలెన్,
హవణిల్లు౯ వరుస౯ మనోహరపురామాభిఖ్య మూ( డున్నతి౯;
మిపుల౯ మూ(డిట మధ్యమంబువలెనే మించుం ద్వదీయంబు హా
ర్యవతారంబు, మహోత్తమం బగుచు; రామా! యార్తరక్షామణీ.

మ. బిరుదుం బొందెను దారకం బనుచు నీపే; రద్రిరాట్కన్య కీ
శ్వరు( డద్దానిమహాప్రభావ ముపదేశం బిచ్చె(; గాశీపురి౯
మరణంబప్పుడు దిప్పుదేహికుడికర్ణంబందు( దద్వర్ణముల్
హరు( డూ(దుం; బరమాత్మ నీ వరయ; రామా! యార్తరక్షామణీ.

శా. కాంతారాంతరవాసు లౌముషులు, స్వర్గస్థాదు లస్వప్ను, ల
శాంతంబున్, బహుభంగులం దమకు దుష్కృత్యాదసంతాన మ
త్యంతంబుం బొనరించుబాధ లుపశమం బ్రార్థింప, మర్త్యుండ వై;
తంతే కాని, నిజానకుఁ హరివి; రామా! యార్తరక్షామణీ. ౧౧

శా. సీతకా సృష్టికి మూల మాపత్రికృతి గాఁ, జిత్సత్సుఖాత్మం బరం
జ్యోతిం గా నిను నెంచి, జ్ఞాననిధు లౌయోగుల్, దశాస్యాదిదు
ర్దైతేయోద్ధతులం బొకార్చి బుధబాధం బాపఁ, బృథ్విఁ సరుం
డై తం, బ్రాత్మ నెఱింగి నీమహిమ; రామా! యార్తరక్షామణీ. ౧౨

శా. నీ వాపుట్టినచైత్రశుద్ధనవమిఁ సీతాంబకల్యాణముం
గావిం తెల్లరు, భారతక్షితిఁ బురగ్రామంబులం బల్లెలఁ;
భావింపఁ నిను నుంతురి బిడ్డలకు నీనామంబుఁ బ్రేమించి; భ
క్త్యావేశావహుడై వరత్నమవు; రామా! యార్తరక్షామణీ. ౧౩

శా. స్త్రీలోకంబున కొజ్జబంతియ గదా సీతాచరిత్రం; బటే
బాలప్రాయమునుండి పూరుషులకుం ద్వత్పూతచారిత్రముఁ;
భూలోకంబు తరింపఁ బుట్టితిరి నీవుఁ, నీకళత్రంబు; మీ
రాలక్ష్మీకమలేక్షణుల్; నిజము; రామా! యార్తరక్షామణీ. ౧౪

మ. తమకే నన్యులకేని కష్టములు పాప్తం బౌతటిన్, గూరకృ
త్యము నేఁ బాపపుఁగర్మ మేని, కనిన స్థాలించినప్డుఁ, మహా
యమబాధం బడుప్రాణిఁ గన్నపుడు, నై కాపత్తులన్, నీదునా
మమె కా, మానవు లుచ్చరించెదరు; రామా! యార్తరక్షామణీ. ౧౫

మ. హృదయస్థం బగుసర్వకల్మషముఁ బై కేగం గ, నాద్యక్షరం
బు దెటఁ ముఁ దలవాఁకిటిఁ, సరగునఁ మూయుఁ ద్వితీయంబు, లో
నది వెండిం జొరకుండఁ; దారకము నా, నాఖ్యం ద్వదీయంబు, నే
నదియే కారణ మంచు నెంచెదను; రామా! యార్తరక్షామణీ. ౧౬

మ. కలుషప్రాయపుజీవనంబును ద్రుటిం గావించెదున్ స్వేచ్ఛమున్
దలఁపంగాఁ గతకంబు వోలెను భవన్నామంబు భవ్యంబు; మ
ర్త్యులకున్ మస్తడ సక్కఁ జేసకలమున్ దోల్తోల్తఁ గల్పించితీ;
వలసుల్ కానరు దాని వాడుకొనఁ; రామా! యార్తరక్షామణీ ౧౭

శా. మీవంశంబున కాద్యుఁ డౌనికి, పవల్ మింటం గనన్ వచ్చుచున్,
గావించుం దన వేయిచేతులను సంతాపంబు లోకాళి; కిం
కీవో, కానఁగరాకయుం, బగలు రేయుం ధాత్రిఁ జందాంకితం
బై వెల్గొందెడు నేరఁ గూర్తెలమి; రామా! యార్తరక్షామణీ. ౧౮

శా. మాలల్ మాదిగబోయవాండ్రు మొదలౌ మర్త్యాధమవ్రాతముల్
మైలం బాసి తరింప వేఱు గలదే మార్గంబు? నీనామమే
మే లౌ మంత్రము వాండ్ర; కిందు గుఱి వాల్మీకిండె; హేమంబు గా
దా లోహంబును స్పర్శవేధి? రఘురామా! యార్తరక్షామణీ. ౧౯

మ. తలక్రిందైనను మంచివిత్తు, ఫలవంతం బైన నేలన్ మహా
ఫల మీఁ జాలు; మరామరా యనుచు నవ్వాల్మీకి నీనామమున్
దలఁపైఁ బుట్టలు వెట్టునట్టు తపముం దాఁ జల్పి, కల్పించెఁ గా
వ్యలలామంబు, భవచ్చరిత్రమును; రామా! యార్తరక్షామణీ. ౨౦

మ. అమరించెం గవి వేయి కొక్కటిగ, గాయత్రీమహామంత్రరా
జమువర్ణంబులు; నాలుగిర్వది సహస్రంబుల్ ఋషిప్రోక్తముల్
విమలత్వచ్చరితంపుశ్లోకములు; తద్వ్యాఖ్యాతసత్కావ్య మా
ద్యము, చాటున్ జగతిన్ భవన్మహిమ; రామా! యార్తరక్షామణీ.

మ. చెదపుర్వుల్ మెయిఁ బుట్ట వెట్టఁ, దపమున్ సిద్ధింపఁ గావించి, శా
రద నాల్కన్ నిల, నీవు నారదుఁడు కర్ణంబందు, వాల్మీకి, బ్ర
హ్మదయన్ నవ్వె మెఱింగి నీచరితఁ, గావ్యం బల్లి దా మోక్షసం
పదఁ జూఱాడె; మనుష్యమాత్రుఁడవె? రామా! యార్తరక్షామణీ.

శా. *నీ వత్త్రోల్కవి కర్థమే, నవసియేనిన్, దానముం జేసి యుం
దో విష్టుం డనిపించుకో ననినఁ, బద్యోగీంద్రుఁ డాద్యం గృతిన్,
గావింపండు భవద్భవంబునకు వెన్కన్; జ్ఞానసేత్రిబునన్
[illegible] గాంచి [illegible] సంపు రిగి; రామా! యార్తరక్షామణీ. ౧౩

శా. కౌపీనంబును నారె గట్టుఁ, గసురుల్ గాయల్ దినన్, బండుకోఁ
జాఁపల్ పూరి, యుండ నారె గుహసెల్, సన్యాసి కొం డేల? మో
క్షాపేక్షన్ రచియించె సీచరితఁ గావ్యం బాది వాల్మీకి, ని
న్నాత్మాపతి గా నెఱింగి మది; రామా! యార్తరక్షామణీ. ౧౪

మ. కవులందుం గనుపట్టఁ గొండఱయెడఁ గష్కర్తి; నారల్ ప్రశం
సనివేశంబుగ మూర్త్య, స్వర్గతకు మించన్ జేయుచుం; ద్రుంమనన్
రవళిన్ రాతికి భేద మేమి తెలియన్ రామిన్, మహర్షి ద్వ్యకా
వ్యాసిభున్ సిన్, నరుఁ డందు రొక్కొకరు; రామా! యార్త
రక్షామణీ. ౧౫

మ. మును యమ్మ్యెం గవి యమ్మ్యబోయ, జపమున్ మున్ సల్పి నీనా
[మమున్;
గని సీతం గపి, కంథ దాఁటి చులుకం, గ్రాఁ బాల్చి నీముద్ర; నిన్
మనమందున్ మనుజుండు పెట్టుకొని, సంసారార్ణవం బీఁది, చ
య్యన ముక్తిం గను, నశ్చయంబుగను; రామా! యార్తరక్షామణీ.

---

పా ఠాం త ర ము.

శా. *నీ వత్త్రోల్కవి కర్థమే, నవసిఃయేనిం, దానముం జేసి యుం
దో విష్ణుం డనిపించుకో ననినఁ, గన్గొకే నినుం, దత్కృతిన్
గావించెం, గథ దెల్ప నారదుఁడు, ప్రజ్ఞన్ బ్రహ్మ యీఁగా, నతం
డావాగ్ధవి వసింప నాల్కకొన; రామా! యార్తరక్షామణీ. ౧౩

మ. శ్రుతులున్ శాస్త్రములుం బురాణములు, దారుల్ మంచికై మ
[ర్త్యసం
తతికిం జూపు హితోక్తులన్; నడిచి తన్మార్గంబులందున్ మను
ష్యత ధన్యం బొనరించుకొంట కుపదేశంబీయఁ గష్టాలకుం
బ్రతుకీ నంతయు ధారవోసితివి; రామా! యార్తరక్షామణీ. ౨౮

మ. వడుగుం గుఱ్ఱఁడవై వసిష్ఠజనకుల్ వంపంగ, నై దోడు వెం
బడి రాఁ, గౌశికు సల్పు జన్నమును గావం బోయి, మారీచునిన్
జడధిన్ వ్రాల్చి, సుబాహుఁ గూల్చితివి, తన్మౌని ప్రసాదంబునం
బడయం గాంచి మహాస్త్రశస్త్రములు; రామా! యార్తరక్షామణీ.

మ. పదధూళిన్ శిల భామ యయ్యెఁ; బ్రబలుల్ పై కెత్త శక్యంబు గా
నిది, వి ల్లెక్కిడుచోఁ దునింగె; నృపులన్ వెన్నాడి ము ద్యోదుమా
ర్లు, దలల్ గొట్టినదట్టు, నీయెదురఁ గేల్ మోడ్చెన్; చరిత్రంబు నీ
యది చిత్రం, బతిగానుపంబు గద; రామా! యార్తరక్షామణీ. ౨౯

మ. వనితం జంపిన, నద్ది శూరతకు లోపం బంచు, దుర్శీల శూ
ర్పణఖం బుచ్చితి చెక్కి ముక్కుసెవు; లుగ్రం దాటకం, బ్రహ్మఘా
తిని గానన్, గురునాసతిం గెడపి ఖ్యాతిం గాంచి, తాబాల్య మ
త్యనఘశ్లాఘ్యగుణాకరుండ వని; రామా! యార్తరక్షామణీ. ౩౦

మ. తల దంష్ట్రాగ్ర మంత పిండిన ఫణీంద్రంబుం బలెం, బుచ్ఛమం
దలిము ల్లూడ్చినమంద్రగబ్బవలె, హస్తంబందు బల్గంద్రగో
డ్డలి చూపట్టెదు రాముఁ డొప్పె, విలుతోడం జేతఁ దత్తేజ మీ
వలనాఁ డద్వమునందు నాఁచికొన; రామా! యార్తరక్షామణీ. ౩౧

మ. భవుఁ డేమేఁ దలపెట్టెనే నిజధనుర్భంగ ప్రసంగంబు, భా
ర్గవరాముండు మహాభిమానమున మార్గంబం దెదుర్కొ నినున్
శివశిష్యుండ నటంచు ? నందులకు నీచేఁ గాంచె నాతండు త
గ్గవమానంబును, గర్వభంగమును; రామా! యార్తరక్షామణీ. ౩౨

మ. పునకల్ వేచి భూమినుండి దివికిం బోఁ బన్ని పెన్నిచ్చెనన్,
మునుకర్ చేసెను, వీఁక నెక్కి డినసీతూ పొంచు, ద్వీపస్థులె
గనుచున్ మర్త్యులఁ, ద్రుళ్లుద్రెళ్లదుల, ద్రమందించెన్ మహోండున్,
[దమున్
మునుపన్ భార్గవుఁ, డబ్ధి, వేఁడ నిగు; రామా! యార్తరక్షామణీ. 33

శా. క్రైకం దూఱుట నీమచిత్తమునకుం గష్టంబుగాఁ జూఁచినన్,
లోకుల్ మానరు; తల్లి కెక్కుడుగఁ దిన్నుం గాం మచోఁ, దొత్తువా
కాకర్షించి, నిజేశుఁ గోడ్పఱిచి, నీ కారుణ్యవాసంబు దా
నాకాంక్షించి, వరంబు గాఁ బడసె; రామా! యార్తరక్షామణీ. 3౪

మ. భవదీయానుజలక్ష్మణుండు, ముని నీపా న్నైవసపెన్నాఁపతే
నవతారం బనిపించె, బున్నని, యతం డాతంద్రిపైఁ, గైకపై,
హవిచే నగ్గియుఁ బోలె మండి, వనవాసాజ్ఞాశ్రుతిన్ వీఁకమై;
నవినాభావము నీకు నాతనికి; రామా! యార్తరక్షామణీ. 3౫

మ. మణిసింహాసన మెక్కుపాదములకుం బాటిల్లె శైలాధిరో
హణ; మూనెన్ మఱిపాల్ జడల్, మకుటభూషాగ్ర్యాంగకం ;బుత్తర
క్షణమం దౌన దెఱుంగ రెవ్వరు; భవత్సంసిద్ధపట్టోత్సవం
బణఁగారెన్ క్షణదాంత మాసరికి; రామా! యార్తరక్షామణీ. 3౬

మ. నది దాఁటించె గుహుండు మున్; శబరి పండ్లం బెట్టెఁ దర్వాత; న
ప్పిదపన్ భానుజుతోడ నేస్తమును గల్పించెన్ హనూమంతుఁ; డి
య్యది యిమ్మూఁటికి సాటి గాదు త్వదరణ్యావాసవృత్తంబులం;
దది, య, ద్దయ్యది, భక్తిపూతములు; రామా! యార్తరక్షామణీ.

మ. తలవాకింటి నెఱుంగనట్టిసతి, కాంతారంబులన్ మెట్టఁగా
వలసెన్; జేర్వని యుల్కుభీరువు, నిలం బాటిల్లె నేతచ్చరా
రులమధ్యంబున; హా! విధిం గడవ నేరుం జాల; రంతఃపురిన్
మలయం బుట్టినసీత కెట్టిగతి; రామా! యార్తరక్షామణీ. 3౮

శా. ప్రాసాదోగ్రము పర్ణశాల, పరివారం బుగ్రసత్త్వౌఘముల్,
ఘాసంబుం గోరునాకుఁ బట్టుఁబడుపుల్, కందాది రాజాన్న, మౌ
వాసంబుల్ వని, వల్కలంబులు జరీవస్త్రంబులున్ నీకుఁ గా,
హా! సీతాయుతిఁ బుచ్చితెం డ్లెట్టులు? రామా! యార్తరక్షామణీ. ౩౯

శా. చేతం జాపము, మేన వల్కలములున్, శీర్షంబునందుం జడల్,
సీతాలక్ష్మణు లుండ ముందు వెనుకన్, జెల్లింపఁ బిత్రాజ్ఞ, దు
ర్దైతేయోగ్రమృగేంద్రకంటకభయస్థానాటవిన్, వీతశం
కాతంకస్థితి సంచరించితివి; రామా! యార్తరక్షామణీ. ౪౦

మ. నెలతాలం దసరారుకుట్టిమములన్ మెట్టంగఁ బస్పృష్టి నీ
లలనారత్నము, నీవుఁ, దమ్ముఁడును, ముండ్లం గండ్ల నేలీల వ
ర్తిలఁగాఁ జాలితి? రేఁ దలంచెదను, గూర్మిన్ బంధుమున్, నేలతో
య్యాలి మీకి మెమ్మెనరించెఁ గాన నని; రామా! యార్తరక్షామణీ. ౪౧

మ. అటవీసంచరణంబు సత్యమును వంశాచారమే నీకు; బా
సటగాఁ జంద్రమతీసతీమణి, హరిశ్చంద్రుండు లేఁగుంకుతో
నెటు కష్టంపడె; యుష్మదస్త్రగురుఁ డీ వృత్తాంత మాద్యంతముం
బటు వాఁ దెల్పను బూనకుచ్చినటు; రామా! యార్తరక్షామణీ.

మ. అకటా! యర్వదివేలయీడున మహాయోగంబు సాగించి, పు
త్రికులం బంక్తిరథుండు గాంచి, తుదకుం బ్రాణాలు నీమీఁదఁ బె
ట్టుక, హా! రామ! యటంచు మైదొరఁగె సందున్; మేలెకా, మోక్షదా
యక, మాతారకమంత్ర మబ్బెఁ దుది; రామా! యార్తరక్షామణీ.

మ. కనినన్ నల్వురు సూనులం దశరథక్ష్మాభర్త, కట్టా! భవ
జ్జనకుం, డొందె నపుత్రిసన్నిధి మృతిన్ శాపంబుచేఁ; బాపపుం
బని, యేదైన నెఱుంగకే సలిపినన్, బ్రాపింత్రు వా రాఫలం
బనఁ, దార్కాణగఁ దోఁచుఁ దన్మృగయ; రామా! యార్తరక్షామణీ.

మ. పదుమూఁడేఁడులు, పుష్పకల్పవరణాత్మైకాదికందర్పసం
పద కేకాస్పద మైనకాన, విలసద్భ్రాత్రాయుతిన్, బ్రహ్మచ
ర్యదశం, గాలము పుచ్చుమానవుఁ డెవం డన్యుండు ప్రాయంబునన్;
మదిని న్నెంతు నతోకుజుం డనియె; రామా! యార్తరక్షామణీ. ౧౪

మ. ఎలుఁగుంగోష్ఠులొ, కొండముచ్చులొ, ఖగేంద్రుం కేకోఁతులో, రావణుం
గెలువన్ సాయము లంకఁ గల్గె; నడవిన్ సమాంటిమై మానవా
దులఁ బద్మాలుగు వేగురన్ రణమునం దుంపన్ సమర్థుండ వై;
తలవే యప్పని మర్త్యమాత్రునకు? రామా! యార్తరక్షామణీ.

మ. అడవిం బగ్గున మండుచుండ ననివార్యత్వత్ప్రతాపానలం,
బెడగా నూడనిఁబొడ కాశరగణం, బేతెంచి పైఁ దూఁకెడున్,
మిడుతల్ పెండకఁ ఉత్స్వరూపమున జన్మింపంగఁ బోలున్; భయం
పడ కొండే నటు మూఁగి ప్రగ్గెడునె? రామా! యార్తరక్షామణీ.

మ. అరిశేషం బగునం డరిపాయకర; మిట్లాతాటకాపుత్రులి
ద్వరలోఁ గ్రుంచి సుబాహువున్, మిగిలెఁబెం గ్రూరాత్ము మారీచు నీ
మరుదస్త్రం; బెడఁబాటు వానికతనం బాటిల్లె నీ కింతికిన్;
హరిణం బై కనుఁబ్రామె వాఁడె గద; రామా! యార్తరక్షామణీ.

శా. ద్యోవీథిన్ వడి రావణుండు గొని పో, దుఃఖార్తయై సీత, తన్
గావం గూయిడ, దాయఁ దాఁకి, తెగి తెక్కల్, కూలి, వేచావనై,
తోరివం దరఁచుజటాయుసంత్యవిధిఁ బుత్రుండుం బలెం జల్పి; తా
హా! విశ్వైకకృతజ్ఞతానిధివి; రామా! యార్తరక్షామణీ. ౧౮

శా. ప్రారంభంబున సర్వకార్యముల భావ్యర్థంబు చూపట్టెడున్
జూ, రూపింపఁగ; రావణాసురుఁడు గొంచుంబోయి యానాఁ డశో
కారామంబున భూమిజాత నిడినాఁ, డారామశోకంబు చ
ల్లారున్ వేయన సన్నిమిత్త మది; రామా! యార్తరక్షామణీ. ౨౦

మ. నరమాత్రోచితవర్తనంబులును గానన్ రాకపో, వెంచ నీ
చరితంబందును; మాయలేడివెనుకం జాపంబుతోఁ బోవె? బం
గరుజిం కుండునె? కొండగుండు లగలంగా నేసితి వాలికై;
యరయన్ నీ వొకమాయమానిసివి; రామా! యార్తరక్షామణీ.

శా. భావంబుం బరికింతు గాని, మఱి పైపై వేవి నీ వారయం
బో; వాబోయత కాస నెంగిలిఫలంబుల్ వెట్టఁగా నాఁడు, మే
లావిందుం బలె నారగించితివి, యాప్యాయంబుగా; నిన్ను సం
భావింపం దగుకాన్క భక్తి సుమ; రామా! యార్తరక్షామణీ. ౪౨

శా. కేయూరాదివిభూషణంబులను సుగ్రీవుండు దోతేర, సీ
తాయోషామణి వౌనో కావో యని, నీతమ్ముం బరీక్షింపు మం;
టాయాలోచన దోఁచులోపలను నీ దౌచూపు బాష్పాకులం
బాయెం; బోలిచె నూపురాలతఁడు; రామా! యార్తరక్షామణీ.

మ. ప్రియజాయావిరహంబు, కాంతమృతిఁ బ్రాప్తింపంగ, నెట్లేనియున్
సయిఁపన్ వచ్చును గాని, శత్రుకృత మైనం దుస్సహం; బందునన్
జయశీలుం డగునిన్నుఁ బోఁటి కది నిచ్చల్ ఱంపపుంగోఁతే; యె
న్నయినం దాన జనించు వేదనలు; రామా! యార్తరక్షామణీ. ౪౩

శా. కాకం బక్షిని బోలె నీచిలుకునం గాంతారవాసంబునం,
బైకం బెల్లును బాసె నీపలుకునన్ భార్యావియోగంబునన్,
గాఁకం దూలిచి లోకులన్ మనుచుతోల్కారెట్టు, లట్లద్ది, నీ
కాకాలంబున దుస్సహం బగుట; రామా! యార్తరక్షామణీ. ౪౪

శా. కాకిం గోకిల యించుమించుగ నొకాకారంబునం దోఁచెడిం
గా; కంఠస్వర ముప్పు గప్పుర మనంగా నొప్పు నారెంటి; కిం
తే కాకా నవి గర్భశత్రు; లొకదానిం గేర కుండంగ నొం,
డొక న్నెల్లను, వాని కూడ్చితివి; రామా! యార్తరక్షామణీ. ౪౫

మ. కడగండ్లం దొలఁగింపు మం చెపుడు నీకాంతారవాసంబునన్,
బడుచుం దైన్యము, వేల్పు నేని నయినం బ్రార్థించుటల్ గానరా;
ఘనుపం గోడులు నీకు, నీపయి నొకం డున్నం గదా వేఁడుకో;
ఈక లన్నట్టిది నీకు వేడబము; రామా! యార్తరక్షామణీ. ౫౮

శా. వాలిన్ వృక్షముచాటునన్ నిలిచి చావం గొట్టుటం దక్క, నే
మాలిన్యం బది యేని వేరి ల్మడఁచి, యుష్మచ్ఛర్యలం జూపఁ గాఁ
జాలం; డందులధర్మసూక్ష్మత గనన్ శక్తుండు వాల్మీకి యే;
యాలిం దమ్ముని దాని, వాలి గొనె; రామా! యార్తరక్షామణీ. ౫౯

మ. తొలుతన్ నీదుపరాక్రమం బరసి, నీతో సల్పునఖ్యంబుచే
నలుకుం బాసి, స్వభార్యతోఁ బడసి రాజ్యం బన్నదారన్, బయిన్
జెలిమిన్, నిన్, దలపెట్ట కర్కజుఁ, డతిస్త్రీలోలుఁడై యుండ, నీ
యలుఁగుం జెల్పి తొలంచి తత్తగులు; రామా! యార్తరక్షామణీ.

మ. సరసీజాంతరకర్ణికాకృతిని హస్తంబందు నీముద్దుటుం
గర మొప్పన్, హనుమానుఁ డర్ణవము చుల్కం దాఁటి, గాలించి మా
పు రహస్యంబుగ లంక, సీతఁ గని, త్వన్ముద్రన్ సమర్పించి, క్ర
మ్మఱి తచ్ఛీర్షమణిన్ నినుం దరిసె; రామా! యార్తరక్షామణీ. ౬౦

మ. ధరియించెం దనహస్తమందు, నిజచిత్తంబందు, నీముద్ర; య
బ్బురమే మారుతి యొక్కగంతున మహాంభోరాశి లంఘించు? టా
హారి సీతం గనుమాత్రితో మరలెనే? యాలంక, నీలెంకలా
వరయం జల్పెను భస్మసాత్కృతము; రామా! యార్తరక్షామణీ.

మ. పరదారాపహృతిం బ్రతిష్ఠ చెడు; సంప్రాప్తించు నాపత్పరం
పర; సీతన్ విడు మన్న, నన్న సభఁ గోపం బెత్తి తన్ దన్న, నీ
దరిఁ జేర్కొన్న విభీషణుం దనుజు, నీతమ్ముం బలెం గన్నవు
న్నా! రఘూత్తంస! దయాపయోనిధివి; రామా! యార్తరక్షామణీ.

మ. ఎడఁబాటుం దవకీలి, క్రోధశిఖియున్, హృద్వ్యాధి మండించునిన్
జడిపింపంగ, మహాజి నింద్రజు మహీజన్ నిల్పి, ఖండింపఁగన్
మెడ, నబ్బంగరు లేడి యంటి యని దానిం దల్పలే కొంటిమనీ
యడలుం, దెల్పి విభీషణుం డుడిపె; రామా! యార్తరక్షామణీ. ౬౩

మ. కలశంగొడ్డట నెన్ని, యెన్నఁబడవల్ ఖండించె మున్నీల వా
పులకీయల్ ముంపటిరాముఁ, దన్నితల లీవున్ రావణబ్రహ్మవే
తలుగం గాంచితి, హృత్సుధాకలశవృత్తాంతం బెఱింగింప కే
మఱెఁ గానం దొలుతన్ విభీషణుఁడు; రామా! యార్తరక్షామణీ.

మ. వనవహ్నిప్రతిమానశోకదహనజ్వాలావలీఘంబునం
దనపాయస్థితిఁ దాపకీనహృదయంబం దొప్పునై దేహి, లం
కను దా నొక్కముహూర్త మగ్గి నిలువం గాఁ గాలు టప్రంబె? య
య్యనలుండున్ సతి సంటలేఁడు సుమ; రామా! యార్తరక్షామణీ.

మ. అరియాకుల్ బలె, నెంతవారలకు నే నాపత్తులున్ సంపదల్,
దిరుగం గాలము, వచ్చు వంతుమెయు; నేదిం గాద యాగెండిటం
దిర; మిక్కట్టులఁ గాచు ధైర్యము యసన్ ప్రస్తాంత మహాదీవ; శ్రీ
హరికిన్ నీకె ఘటిల్లెఁ గష్టములు; రామా! యార్తరక్షామణీ. ౬౬

మ. భవదంఘ్ర్యభ్యటనంబు గౌతమికి సంపాదించె భాగీరథీ
ప్రవరత్వంబు, బదర్యరణ్యముఖతీర్థశ్రేష్ఠతం దండకా
టవికిన్, హైమనగాదు లొందినప్రతిష్ఠన్ రామనామాద్రికిన్;
భవనాశంబు భవత్పదాంకనము; రామా! యార్తరక్షామణీ. ౬౭

మ. తనకున్ విశ్రవసుండు తండ్రి, పులస్త్యబ్రహ్మ తాతైన, దు
ష్టనిశాటుం డయి రావణుం, డఖిలవిశ్వక్షోభముం జేయుచుం
టను, వానిం దునుమాడి, బ్రహ్మవధ గానన్, రామలింగేశ్వరుం
డన సేతుస్థలి నిల్పితీశ్వరుని; రామా! యార్తరక్షామణీ. ౬౮

మ. శివలింగంబుఁ బ్రతిష్ఠ సల్పితివి తత్సేతుస్థలిన్ భక్తి, వి
ష్ణ్వవతారప్రథితుండ; వీశ్వరుఁడు ని న్నాయాంజనేయాకృతిం
వలున్ రేయి భజించు భక్తుఁ డగుచున్, భావింపఁ దత్త్వంబునం
దభేదం బగు మీకు నిర్వురకు; రామా! యార్తరక్షామణీ. ౧౯

శా. వేదోద్ధారక! మంథభూధరధరా! పృథ్వీసముద్ధర్త! ప్ర
హ్లాదోపాసిత! యాచనాపహృతబల్యైశ్వర్య! దుష్టేడ్వన
చ్ఛేదీ! శైవధనుర్విభంజనుఁడ! దుశ్చేష్టత్రిశీర్షాదిను
ర్వ్యాసపారిణమరుత్ఫణిప్రదర! రామా! యార్తరక్షామణీ. ౨౦

శా. భల్లూకంబులచేత, వానరులచే, వారాశిఁ గట్టింపఁ గాఁ
జెల్లున్ వారధి యేనరాధిపతికిన్? సీతాపహారిం బగన్,
ముల్లోకంబులు గెల్చి విక్కుదనుజుం, బోకార్చి రాఁ గంటి శుం
భల్లీలం బురిఁ; గంబుజాక్షుఁడవు; రామా! యార్తరక్షామణీ. ౨౧

మ. సరి చూడం బొగలేఖ పైఁ దనరుభాస్వజ్జ్వాలతో, నట్లు ని
ల్పిరొ నాఁ, జిచ్చున నేకవేణి యగుచున్ వెల్గొంది, సౌశీల్య మె
ల్లరకుం దెల్పినసీతతోఁ, గనఁ బ్రజల్ బల్వేడ్క, విచ్చేసి తం
బరయానంబున నీ వయోధ్యకును; రామా! యార్తరక్షామణీ. ౨౨

శా. శ్యామంబై నవనీరదంబు నయనాహ్లాదంబు గావించున,
ట్లా మోదంబు ఘటించు నుల్లమునకున్ ధ్యానింప నీమూర్తి; నీ
నామం, బాకృతిఁ గాంచి, నీకుఁ బిత యన్వర్థంబుగాఁ బెట్టె; నా
హా! మోహించిరి నిన్ మహామునులె; రామా! యార్తరక్షామణీ.

మ. వనభూమిన్ సరిగాఁ జతుర్దశసమల్ వర్తించి, వైదేహితో
ననుఁగుందమ్మునితో నయోధ్యకు మహాహ్లాదంబుతో వచ్చి నిన్
హనుమన్ముఖ్యవిభీషణప్రముఖులున్, నైకప్రభుల్ చుట్టి, జే
యనఁ, బట్టంబును గట్టుకొంటి గద; రామా! యార్తరక్షామణీ. ౨౪

మ. భరతుం బేర్కొని పేరుకో నొరుని సాపత్న్యానుజుం గాంతుమే?
ధరణీరాజ్యముఁ జేరఁ దల్లి యిడ, నాతం డప్డు గైకోక, త్వ
ద్వరపాదూద్వయసేవఁ జేసి, తుదకుం బద్మాలు గేం జ్లైన, సం
బర మారం ద్వదధీనముం జలిపె; రామా! యుత్తరచూడామణీ. ౭౫

మ. హనుమం బోలెడుభక్తుఁ డుండునె? మణీహారంబుఁ బట్టాభిషే
కనిమిత్తోత్సవవేళ, సీత వయివం గంఠంబునం బ్రేమమైఁ,
దన కింపైనవి రామవర్ణములు తద్రత్నంబులం గాన రా
వని, యాభూషను ద్రోసి వేసె నఁట; రామా! యుత్తరచూడామణీ.

మ. ప్రమదోత్కర్షమునం బ్రజల్ బ్రదుక, ధర్మంబుల్ నడల్ నాల్గుపా
దములన్, వ్యాధులు క్షామడామరము లుత్పాతంబు లేగోడు లే
క మనన్ లోకులు నూఱుహాయనములున్, క్ష్మానేలవే రామ రా
జ్య మనంగాఁ బదొకండు వేల్ సమలు; రామా! యుత్తరచూడామణీ.

మ. అవనీశుండు ప్రజాతతిం బలెనె వర్ణాచారధర్మంబులుం
దవ్వుఁ బాలింపను; విద్వరంబు లోదవుం దదీప్తిఁ గాకున్న; శై
శవసంప్రాప్తను విప్రపుత్రకుమృతిన్, శంబూకునిం బొందఁ జే
యవె నీ వారసి దండకాటవిని; రామా! యుత్తరచూడామణీ. ౭౮

మ. మనుజాధీశులు లోకరంజనము సామాన్యంబుగాఁ జూడ, కి
చ్చను వర్తింతురు: ప్రజానుకూలతయె యుష్మన్ముఖ్యకృత్యంబు; ప
త్తనమం దైనజనప్రవాద ముడుపం, ద్విజ్ఞాయఁ, జూలాలి, న
త్యనఘుం, జానకిఁ, గాన కంపితివి; రామా! యుత్తరచూడామణీ. ౭౯

మ. పలుపూఁబోండ్లను బెండ్లియాడు టవనీపాలస్వభావంబు; నీ
వలె ముల్లోకములన్ వినంబడెడు, నెవ్వం డేకపత్నీవ్రతుం?
డిలు వెల్వించుట సీతఁ, దత్ప్రతిమతో నీ వశ్వమేధంబు ని
ర్మలతం జేసితి వార్యసమ్మతిని; రామా! యుత్తరచూడామణీ. ౮౦

మ. బరితు కంతఃపురమధ్యమందు, నిజకార్యస్థానమున్ జెప్ప యా
పితమున్ జేసెదుతేని, కెట్లగుఁ బరీపీడల్ గ్రహించం సను
క్షతిఁ సౌఖ్యానకు సామె తయ్యెఁ గద త్వద్రాజ్యంబు; వేయేల? నీ
యుశికష్టంబున కస్తియే ఫలము; రామా! యార్తరక్షామణీ. ౮౧

మ. అభియాత్యాశరభీతిఁ గాంచ వెపు డావం జైన; లోకాపనా
దభయం బెక్కుడు దోఁచు నీకడ; నయోధ్యం దగ్ని జానన్నిధిన్
శుభచారిత్రను సీతఁ గోతి పుసశ్శుద్ధిప్రమాణంబు; రా
మ భువిం జొచ్చెఁ దుదిం దదర్థము; రామా! యార్తరక్షామణీ.

మ. తనజన్మంబునకుం బరియోజన మసద్దైతేయనాశంబ కా
వున, నక్కార్యము నిర్వహిల్లుటను దా భూగర్భమున్ జొచ్చి, వ
చ్చినదారిం జనె నుప్పరివాదపుమిషన్ సీతామహాదేవి; నీ
మను వెల్లన్ విరహవ్యథం గడచె; రామా! యార్తరక్షామణీ. ౮౩

మ. కరుణం బొందె నొకో మహాపురుషునాకారం బలంచున్ మదిన్
స్ఫురియించున్ భవదీయ మైనచరితంబుం గాంచినన్; జానకీ
విరహం బొందకముందు తండిరిమృతిన్, భీమాజి సౌమిత్రి ము
మ్మరపుమూర్ఛను నెంత వందురితి? రామా! యార్తరక్షామణీ.

శా. తారంబుల్ పగడాలు లో నగుమణుల్ తామగ్గి నై బుగ్గి, ని
త్యారోగ్యం బొనగూర్చు రోగులకు; నీవారాటమున్ బొందుచున్,
నీ రాజ్యప్రజకష్టముల్ దొలఁచి శాంతిన్ సేమమున్ గూర్చి; తా
హా! రాజన్నుడి సార్థకంబుగను; రామా! యార్తరక్షామణీ. ౮౫

మ. మనుజుల్ దుష్టులబాధ తేండ్లకడ సామాన్యంబుగాఁ జెప్పికొం
డరినయం; బట్టులు మొట్ట వెట్టెడునె తిర్యగ్జంతు లెందేనియున్?
శునకోక్తిన్ విని శిక్ష చేసితివి భిక్షున్; నీ మహీపాలనం
బనుకూలంబు సమస్తజీవులకు; రామా! యార్తరక్షామణీ. ౮౬

శా. ఏనాఁ డేలెనొ భారతక్షితి, చిరం బేకాతపత్రంబుగా,
నానందాంబుధి నీఁడ భూప్రజ, లయోధ్యం బొల్చి నీమూర్తి, నే
రీనాఁ డట్టులె హృత్ప్రపంచ మఖిలం బేలున్, రసజ్ఞోరుస
మ్మానాస్థానిని గొల్వుదిద్ది; రఘురామా! యార్తరక్షామణీ. ౮౬

శా. నీ సూరణ్యనివాసపుంగుఋతులన్ నేఁడుం గనుంగొం; డ్రి వే
వా? యేకం బగుదృక్కు వాయసమునాస్యంబందు, నంభోధి న
త్యాయామం బగుసేతు; విప్వి సతమున్ ద్వాద్దివ్యతామానుష
త్వాయోగం బెఱిఁగింప సాక్షులును; రామా! యార్తరక్షామణీ.

మ. బహుధా నీహృదిఁ జేసె వేదనలపాల్ పాపిష్ఠుఁ డారావణుం;
డహితున్ వానిని బుత్రమిత్రసహితం, బ ట్లాహవక్షోణిలో
నిహతుం జేసి, తదుగ్రవిక్రములకా విం చెంతొ శ్లాఘించి; తీ
వహీయుందుం గుణమే గ్రహించెదవు; రామా! యార్తరక్షామణీ.

మ. తలిదండ్రుల్ గలబిడ్డలుం బలెను భక్తవ్రాత, మేభార మా
దల లేశంబును లేక, లోకమున సీతామాత, నీ విర్వురున్
గల రన్నమ్మిక, నోలలాడుచు మహానందాబ్ధి, జీవించుఁజు,
మ్మలజ ళ్లిన్న వెఱుంగ కెల్లపుడు; రామా! యార్తరక్షామణీ. ౯౦

మ. అమరజ్యేష్ఠముఖార్థితా! దశరథజ్యాభర్తసత్పుత్ర! సం
యమియాగారిసుబాహుజీవహా! యహల్యాశాపసూపఘ్న! శ
ర్వమహేష్వాసనభంజనా! జనకజాప్రాణేశ్వరా! జామద
గ్న్యమనోగర్వహాశౌర్యధుర్య! రఘురామా! యార్తరక్షామణీ.

శా. నీచారిత్రము క్షీరసింధి; యటనా నీసద్గుణంబుల్ మణుల్;
నీచుల్ రాక్షసు లందులో మకరముల్; నీవే మహావిష్ణు వం;
దాచంద్రానన సీత తత్తనయ; నే నాసక్తిమైఁ దద్రసం
బాచాంతిం బొనరించుచుం దనియ; రామా! యార్తరక్షామణీ.

మ. మును గల్పించితి నందనందనశతంబున్: భక్తచింతామణీ!
యని పాడించితి వెన్కఁ; గష్టమునఁ గృష్ణా! యాపదుద్ధారకా!
యని నుడ్వించితి పిమ్మటన్; ముదిమి సర్వాఘాపహం బౌట, న
ల్లనిపిం జీభవదాఖ్య తారకము; రామా! యార్తరక్షామణీ.

మ. ముదిమిన్ వెండియుఁ దోఁచు శైశవగుణంబుల్ దేహి, కన్మాటద
ప్పదు; చిన్నప్పుడు నీదు మోవిలఁ జిఱుతల్ వాయించుకొం చింపుగాఁ
బదముల్ వాడుచు సల్పితిన్ భజనముల్; వార్ధక్యమం దీగతిన్
బదముల్ నీవి భజింతు మత్కవిత; రామా! యార్తరక్షామణీ. ౯౪

మ. నరలోకప్రభుకొల్వు సల్పి బలిమిన్, మత్త్వాయపున్నాళ్ళఁ, ద
ద్వరలాభంబును బొందుచున్, ముదిమిఁ ద్వత్పాదంబులం గొల్చెదం,
బరలోకప్రభు వౌట; నీకొలువునం బాటిల్లినన్ మెప్పు, నే
మరలం గొల్చుట గల్గ దేప్రభువు; రామా! యార్తరక్షామణీ. ౯౫

మ. చరమావస్థను గాశిఁ బ్రాణి, కుడిపార్శ్వంబెత్తుఁ బైకందు; ర
క్కరణిం దారకనామ! వృద్ధదశ రాఁగా, గౌతమీతీరస
త్పుర మారాజమహేంద్రిమందు హృదయంపుందమ్మి నీవంకకున్
మరలెన్; సంసృతితంతువుం దునుము; రామా! యార్తరక్షామణీ.

మ. అపురూపంబుగ వేలు లక్షలును సప్తాహాదులన్ రాజ్మహేం
ద్రిపురంబందు భజించుపావనభవన్నామంబు నాలించి, శే
లు పవల్లుం బ్రతిగేహమం, దెలమి స్త్రీలుం బూరుషుల్ గొల్చునీ
యపవర్గప్రదపద్ద్వయిం దెలుతు; రామా! యార్తరక్షామణీ. ౯౭

శా. రామా, లక్ష్మివరాలయం బతిపవిత్రంబుల్, మహోత్కృష్టముల్;
నామంబై భవదీయ, మెల్లకడలన్, మాంత్రీకగోష్ఠీరద్రా
క్షామాధుర్యధురీణతన్ బ్రజలనాల్కల్ నిచ్చ రంజించు, చా
హా! ముక్తిం జలుపుం గరస్థమువి; రామా! యార్తరక్షామణీ. ౯౮

మ. వయసున్ హాయిగ భోగభాగ్యవిభవైశ్వర్యాదులం బుచ్చువాఁ
డయినన్, లోకులకష్టనష్టముల నెట్లాతం డెఱుంగం గలాఁ
డు? యువత్వంబుననుండి యిక్కటులు గోడుల్ గన్న రావేల్ప! సం
శయ మొందన్ గుఱి వెట్ట నీకడను; రామా! యార్తరక్షామణీ.

మ. హృదయస్థుం డగునీదుసమ్ముఖమునం దే నేల వాక్రువ్వఁగా?
బదముల్ దిన్నగఁ దెల్పలేని దెసకుం బా లయ్యె భావంబు; త్వ
త్పదముల్ గొల్చుట చిత్తశాంతికొఱకున్, భద్రాప్తికిం, గాదె? శ
ర్మద! తల్లాభము సంఘటింపఁ గదె; రామా! యార్తరక్షామణీ.

మ. ఒకయూ, లొక్కలుఁ, గొక్కప, ల్కనుప్రశంసోక్తిం గనం జాలునే
లికవే ల్పెవ్వఁడు నీవె కాక? బొమకల్కిం, గాకిరాకాశి, వా
లికిఁ దమ్ముం, డిట సాకిరుల్; భవము దూలింపన్ నిరున్ ముక్తినా
యకు భక్తిం గొలుతుం; దృతీయ మిదు; రామా!యార్తరక్షామణీ.

శా. పాపాల్ గొన్నిటి, బుద్ధిపూర్వకముగాఁ, బైప్రేరణం గొన్ని, లో
క్యాపత్తుల్ మరలింపఁ గొన్నిటి, నిటుల్ నైకప్రకారంబులన్
మాపున్ రే పొనరించి, నేఁడు, మయిపై మైలం దొలంగించుకో
నాపంబుం బలెఁ గంటి నీపదము; రామా! యార్తరక్షామణీ. ౧౦౨

శా. కైకేయీగుణదూషణోక్తులు, భవత్కార్యప్రశంసోక్తులుం,
దాఁకన్ నీచెవి కొప్పికోమిఁ, బరనిందాత్మస్తుతుల్ సహ్యముల్
నీకుం గామి యెఱింగియుం జరిత, నిన్ మెత్తున్ ననున్ దూఱుకొం;
చాకృత్యంబు క్షమింపు దీనుఁడని; రామా! యార్తరక్షామణీ.౧౦౩

మ. ప్రతియాగంబును గాచుటో, భవధనుర్భంగంబు గావించుటో,
పితృవాక్యప్రతిపాలనార్థ మడవిం బెక్కేండ్లు వర్తించుటో,
సతికై సంద్రము గట్టి శాత్రవుతలల్ చక్కాడుటో, కూర్మితు
ల్యత భక్తప్రజఁ బ్రోచు టేభరము? రామా!యార్తరక్షామణీ.౧౦౪

మ. గుడులుం, గోపురమండపంబులును, నీకున్ సత్రముల్ సావడుల్,
తొడవుల్ లోనుగ నెన్నియో పరమభక్తిం జేయుచుఁ గల్పింప, నె
య్యడు వెచ్చించుటఁ బాదుషాహిధనమున్, గోల్కొండలోనం జెఱం
బడునీదాసునిగాసి మానుపవె? రామా! యార్తరక్షామణీ. ౧౦౫

మ. ధనమాన్ రక్షణసాధనం బనియె కాదా, లక్ష్మిఁ బెండ్లాడి ప్రో
తనపాయస్థితి? విష్టపత్రయకుటుంబా! శక్తుఁడే నిర్వహిం
పను సంసార మకించనుండు దినమేన్? భక్తాళి నిప్పచ్చరం
బను ఘోరాపద కంటఁ బెట్టకుము; రామా! యార్తరక్షామణీ. ౧౦౬

మ. హాలసంబంధము నీకు, నీయనుఁగుటిల్లాలైనవైదేహికిం
గలదంచున్ వినవచ్చినందునను, నేఁ గావించెదం డెందపుం
బొలమున్ నాయది నీయధీన; ముచితంపుందోహదం బిచ్చి, ని
ర్మల; పండింపవె ముక్తిపంట; రఘురామా! యార్తరక్షామణీ. ౧౦౭

మ. భవదీయామలనామవర్ణములు నేఁ బత్రంబుపై వ్రాసి రెం,
డవి నీలంబులు యుష్మదద్భుతమనోజ్ఞాకారభావంబుతో
సవిశేషం బగుభక్తిఁ గాంచుతఱి, బాష్పం బస్మదానందసం
భవ మయ్యెం బ్రతిబంధకం, బకట! రామా! యార్తరక్షామణీ. ౧౦౮

శా. దైతేయారివి మర్త్యుఁడైతి వని, నిన్ ధ్యానించుచుం గూర్కఁ, బ్రేఁ
గై తోఁచెన్ క్షణ మస్మదీయ నుగుకాయం బర్ధరాత్రింబు; మ
చ్చేతోబ్జంబునఁ జొచ్చి తీ వనుచు నేఁ జింతించి, నాలోన వే
లాతీతం బగుహర్ష మొందితిని; రామా! యార్తరక్షామణీ. ౧౦౯

మ. స్వరముం బ్రాణిఁ ద్యజించి యోష్ఠ్యము,హరిశ్చంద్రేట్చరిత్రన్ నినుం
దొరఁ గావించి రచించి కొంత, యది యెందో నష్టమై పో, భవ
చ్చరితం గూర్చినకుందమాల యనుదృశ్యంబుం దెలింగించి, నే
మరలం బల్కితిఁ దృప్తినొందకిది; రామా! యార్తరక్షామణీ. ౧౧౦

శా. నీనామంబు గలంతకాలము నిలం దీపింపు మీనీకృతిన్;
భానుండున్ సితభానుఁడున్, భగణముల్, పంచోరుభూతంబులున్,
గానన్ రానిమహాలయంబుకతిఁ, దద్గాఢాంధకారంబునం
దైనన్ నామము నీది పొస్పడను; రామా! యార్తరక్షామణీ. ౧౧౧

శా. నీతోఁ బెంచినరీతిఁ బల్కితిని బున్నెంబు బబ్బఁ, బాపంబు వో,
నోతండ్రీ! తొలుకబ్బమున్ జనివి, యార్యుల్ వల్క నాలించియున్,
జేతోహ్లాదులు త్వచ్చరిత్రలు; కృపం జేకో మదీయం గృతిన్,
ఖ్యాతంబుల్ గల వే, యిదే లసక; రామా! యార్తరక్షామణీ. ౧౧౨

మ. వరవర్ణాదిమహాన్వయాబ్ధివిధు సుబ్బారాయవాణీసుధా
ఝరసమ్మిశ్రిభవత్పవిత్రిచరితస్వాదిష్టసిద్ధాపథం
పురసంబున్ భవహంబుఁ గోరెడుజనంబుల్ నిత్యజీవంబునం
బరమానందముఁ బొంద, నీ వగుము; రామా! యార్తరక్షామణీ.

మ. శకవర్షంబుల వేదభూతవసుభూసంఖ్యం దదాంగీరసన్
మకరంపున్నెలఁ గృష్ణపక్షదశమిన్ మందాఖ్యవారంబునం
దొకపద్యంబు రచించి, మాసమునకున్ యుష్మత్కృపాలబ్ధి నీ
యకలంకార్థకృతిన్ ముగించితిని; రామా! యార్తరక్షామణీ. ౧౧౪

మ. పరమప్రేమను మాత సీత తనగ్రీవంబెట్టు ముక్తామణీ
సరమున్, మున్ మరుదాత్మజుం డరసి, మెచ్చం డయ్యెనం చందు;కే
సరి, నూఱుం బదునాఱు పద్యమణులన్ సంస్యూతముం జూచెనా?
హరివర్యుం డతఁ డేమి చేసెడునో? రామా! యార్తరక్షామణీ. ౧౧౫

---

౧౧౦ పద్యమునకు పాఠాంతరము—

మ. చరితం బాదిమచక్రవర్తిది నిరోష్ఠ్యమ్ముంగ, మున్నే నినుం
దొరఁ గావించి రచించి కొంత, యది యెందో నష్టమై పోఁ ద్వదు
త్తరవృత్తోత్తమకుందమాల రసవంతంబుం దెలింగించి, బా
మఱ భక్తిన్ శతకంబి దల్లితిని; రామా! యార్తరక్షామణీ.

మ. జననీ! క్ష్మాసుత! మంగళంబు; భరతా! శత్రుఘ్నుఁడా! లక్ష్మణా!
హనుమా! యంగద! జాంబవంత! రవిపుత్రా! నీలుఁడా! మంగళం;
బనఘస్వాంత! విభీషణా! దనుజరాజా! మంగళం; బార్తులన్
మనుపం బుట్టిన శ్రీశ! మంగళము; రామా! యార్తరక్షామణీ.౧౧౬

గద్యము.

ఇది శ్రీపరమేశ్వర ప్రసాదసమాసాదిత సరసకవితాధురంధర, పండిత
ప్రకాండపరిషద్బహూకృత, 'కవిశేఖర' 'సూక్తిసుధానిధి' బిరు
దాంకిత, సద్ధాది సాధువంశక్షీరనీరాక రాచ్చనామాత్య
పౌత్ర, హరితసగోత్ర, పవిత్రగుణకదంబలక్ష్మాంబా
గర్భశుక్తిముక్తాఫల, సూరపరాజప్రధానతనూ
భవ, విబుధవిధేయ సుబ్బారాయనామధేయ
ప్రణీత మార్తరక్షామణి
సంపూర్ణము.
రామార్పణము
శ్రీరస్తు.

ఆంగీరస సం॥ మాఘ బ॥ ౧౦ ఆదివారము. క్రీశ.
౧౯౩౩ ఫిబ్రవరు ౧౯ తేది.

భక్తచింతామణి 22 వ కూర్పులోఁ జేర్పఁబడనున్నవి.

మ. కరుణాసాగర! కామితప్రద! జగత్కల్యాణసంధాత! దు
స్తరసంసారసముద్రతారక! వినిద్రాఘాంధకారప్రభా
కర! సర్వామయశోకనాశకర! రాగద్వేషమోహాపహా!
స్మరణక్షాళితపాపసంఘ! పరమాత్మా! భక్తచింతామణీ. ౧

మ. కులశైలోన్నతి తోడుగాఁ, బృథుతమక్ష్మోణీరుహశ్రేణియా
దల లూర్ధ్వంబుగఁ జాఁగి సాఁగి, నడుమం దా మాఁగుఁ,గా కభ్రపుం
గొలఁదిం గాంచునె? దేవ! నీమహిమ వాక్కోటేపు సుమ్మెంత లెం
త, లటుల్ మూకత గంద్రు గాని; పరమాత్మా! భక్తచింతామణీ. ౨

మ. నలుసంతైనను, దిమ్మచీఁకటిని గెంటం జాలు దీపంబు; పె
న్వెలుఁగై యుండనిచోటు లేదు గద! తండ్రీ! పాయు దేమీ యిరుల్?
తలఁపం జోద్యము మాయ నీది; వెలుఁగుం దాఁచుం దమోరాశిలోఁ;
వెలికన్ గానఁగ లేదు నీదుపృథుదీప్తిన్; భక్తచింతామణీ. ౩

మ. రవిరశ్మిన్ బుర వెండ దేని, పవిధారం గొండ భేదిల్ల దేన్,
దవకీలిన్ వని గాల దేని, జడివానం జిమ్ము చల్లాఱ దేన్,
దివియం జీఁకటి మాయ చేసె, లత హేతిం దెగ్వ దే, నీశ! పా
య వశుంబుల్ నిజుఁ దల్ప నాఁ జను; మునీడ్యా! భక్తచింతామణీ.

మ. నలుపై తెల్పయి యొప్పునిప్పెడల గంటల్ మోఁగు సన్నంపుటా
కు లసంఖ్యంబులు గల్గుచక్రము నిటుల్ గుర్తుండవా తిప్పికొం
చలపున్ వేసట లేక యాడుకొనె? దారా! భూరు లేంన, నీ
తలఁ గానన్ సర; విశ్వరూపుఁడ! యనంతా! భక్తచింతామణీ. ౫

మ. దివముల్ నీదుకిరీట మంచు, నచటం దీపించుతారాళి త
న్నవరత్నప్రకరం బటంచుఁ దలఁతుర్, బ్రహ్మాండపుంజక్రవ
ర్తివి, సర్వోన్నతమూర్తి వౌటను; మహాదేవా! జగత్కోటులం
బవలున్ రే కొలు విచ్చి యేలెదవు ప్రేమన్; భక్తచింతామణీ. ౬

మ. అడవుల్ ఘోరమృగాకులంబులు మహోద్యానంబు, లాభీలపుం
గడలుం బాడబవహ్నిగర్భములు కేళాకూళు, లుత్తుంగముల్
పెడగొండల్ బహురత్నకాంచనఖనుల్ వే పెన్నిధుల్ నీకు, ను
గ్రపు తారాపథ, మీశ! నీకొలువుసాలల్; భక్తచింతామణీ ౭

మ. పిడుగుల్ బిట్టడరించు సభ్యము; మహావృక్షోరుసౌధాదులం
బడఁద్రోయుం బెనుగాలి; కీలి సలుపుల్ భస్మంబు వేశాఖి; ముం
చెడుఁ దీపస్థపురంబు లబ్ధి; ధర కుక్షిం దేశముల్ పూడ్చు; నీ
సడుమల్ మ మిన్నడి ప్రోతు; వెం తరు!గసంతా! భక్తచింతామణీ.

శా. స్వాతంత్ర్యం బిడ కేని కొక్కలవముం, బద్నాల్గు లోకంబు లీ
వే తేజఃక్షమ లూని యేలెదు గదా యేకాతపత్రంబు గా;
భూతంబుల్ దలఁ దాల్చి సీముదల సల్పుల్ స్వస్వకృత్యంబులల్
భీతిల్, విశ్రమ మొంద కొక్కత్రుటి యేనిల్; భక్తచింతామణీ.

మ. బుడగల్ వోలె నుడుల్ దనర్చెడుతమోంభోరాశి నిర్మగ్న మై
జడతం జేష్టలు దక్కి స్రుక్కుజగముం జాగ్రత్తఁ గాపాడి, యు
య్యోడరుం బాపను, గుంభసంభవనిభోత్కృష్టప్రభారాశి రా
కడ గల్పించెదు దేవ! నిల్ దెలుతు వేగల్; భక్తచింతామణీ. ౧౦

మ. నిదురం గల్పన సేయ కుండితివయేనిల్ రేలు పుచ్చంగఁ జా
లుదుమే మేము? దయాపయోధి! యెటు లాలోచించితో, యీశ్వరా!
సదుపాయంబులు ప్రాణికోటుల సదా సౌఁకంగ? నీయేరుపా
టెది గన్నం బరమాద్భుతంబు గద!; తండ్రీ! భక్తచింతామణీ. ౧౧

మ. జనముల్ వెల్గునఁ, జీఁకటిం బగలు రే, స్వమ్ము న్వ్యయం పెట్టుచుం
బనులుం గూరుకు మాని, బాలము సినీమా లేల వీక్షింప? నీ
కనుకట్టుం గలలుం గనుంగొని చెలంగల్ రాదె? కోట్యంశ మై
న, నజా! యిందలివింత యందుఁ గన నౌనా? భక్తచింతామణీ.

మ. పవ లెల్లం బనిచేసి బొగ్గులను జంబాలంబునం గూలికిం,
దివసాంతంబున శుభ్రతోయమున శుద్ధిం గాంచి నిద్రించువా
నవులం గానమె? పాపి మోక్షసుఖముం బ్రాపించు నేచింత లే,
కవసానంబున నిన్ స్మరించి; పరమాత్మా! భక్తచింతామణీ. ౧౩

మ. సమకూరంగఁ ద్వదానుకూల్యము, మహాశత్రుండు మిత్రుం, డధ
ర్మము ధర్మంబు,విషంబు పథ్య,మగు;యుష్మత్ప్రాతికూల్యంబు ప్రా
ప్తము గా నౌ నటె తద్విపర్యయము; దేవా! యీభవార్ధిన్ భవ
త్సుముఖత్వం బనిశంబు వేఁడుకొను చుందున్; భక్తచింతామణీ.

మ. పొడమిం తప్పిన నిప్పు, నిప్పునఁ దదప్పున్; మంచినే చెడ్డగాఁ
జెడుగున్ మంచిగ మార్పనేరుతువు; త్వచ్చిత్తానుసారంబు గా
నడుచున్ విశ్వము; దుర్ఘటార్థఘటనం దక్షుండ వీ వంచు, నీ
యడుగుల్ వట్టితిఁ; బాపిఁ, బాపు మఘు; మీశా! భక్తచింతామణీ.

శా. ఆకాశంబునఁ గాలచక్రమును బ్రహ్మాండంబునం ద్రిప్ప, దే
వా! కల్పించితి సూర్యచంద్రులను; బిండాండంబునన్ వారి నా
డ్యాకారంబున నాస నిల్పి; తెపు డత్యాశ్చర్యముం గూర్చెదున్
నాకున్ నీద్వివిధాండసర్జన; మఖండా! భక్తచింతామణీ. ౧౬

శా. కాలంబో, గ్రహచారమో, ప్రకృతియో, కర్మౌఘమో, నీమహా
జాలంబో, మఱి యన్యమో, తెలిసికో శక్యంబు గా దేదియో,
మేలుం గీడు, సుఖంబు దుఃఖ, మరు దిమ్మేఁ గూర్చు చాకస్మిక,
మ్మిమ్మలోకాళిని ద్రిప్పు; గుహ్య మిది; స్వామీ! భక్తచింతామణీ.

మ. ఘటనల్ నీవి నిగూఢభావము; లెఱుంగన్ రావు, మమ్మవ్వి ప్రో
చుటకో, యేఁచుటకో? యొకండు కనుఁకోఁ, జోద్యం బిఁకొక్కండు కాఁ
బటుమాయాబహుళాంధకారమున, దేవా! జీవులం బెట్టె దే
మిటికిం జాలి యి? యేమి లీల యిది? స్వామీ! భక్తచింతామణీ.

ఆంధ్రసాహిత్యపరిషత్తునకు నద్దాడి సుబ్బారాయఁడుగారు

వ్రాసి పంపిన యభిప్రాయము.

బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారికి:

మహాశయా !

పరిష్కృత మాంధ్రభాషావాఙ్మయపద్ధతులయందుఁ గొంతకాలముగఁ గలుగుభిన్నాభిప్రాయములనుబట్టి సంభవించినవాదప్రతివాదముల నిమిత్తమై నిగ్గు దేల్చి, భాషాసంస్కరణము గావించుటకయి పాటుపడిన యాంధ్రసాహిత్యపరిషత్తువారిపక్షమున వారు సాదరముగాఁ బంపినయనుబంధసహిత మగు నాహ్వానపత్రిక చదువుకొని, పరిషన్మహాజనముల మాతృభాషాభిమానమును ఘనతను బహుధా కొనియాడుచు, తదీయస్థితి పరిస్థితియు పరిశీలనము చేయుచుండుటం జేసి, యేతద్విషయకనియమ్ముల భాషాప్రసంగవినోదముల నాహ్వానితుఁడయ్యు సమక్షమునఁ జూడఁ జాలనయితినిగా యనుచింతతో, నిప్పటికి ననుబంధసహితభాషావిషయాంశముల నాయభిప్రాయము కొండొకవిపులముగ నీక్రింద విశదపఱచుచు, సభకు ముఖ్యముగ రావలసిననావిధిని నెఱవేర్పలేకపోయినలోపమును మన్నింపఁ బరిషత్తును వినయముతో వేఁడుకొనుచున్నాను.

ఇప్పుడు పరిషన్మహాజనులు చర్చించి సిద్ధాంతీకరింపవలసినవి గ్రామ్యపదప్రయోగము లయినభాషావిషయము లయినను, శృంగారవర్ణనవిషయ మొకటియు, వేసియాఖ్యవిషయము లయినట్లును, వానినిగూర్చి భాషాభిమానులు తమతమయభిప్రాయములు వ్యాసరూపమునఁ దెలుపఁ గోరఁబడుచున్నట్లును, పత్రికవలనఁ దెలియ వచ్చుచున్నది. వాదప్రతివాదములు సలుపునిరుపక్షములవారిలో మొదటివారు గ్రాంథికభాషకుఁ గొత్తరూపము గలిగింప వలయు ననుచున్నారు. రెండవవారు ప్రాచీనరూపమే యుంచ వలయు ననుచున్నారు. నాదృష్టికిఁ బ్రాచీనరూపమే మనోహరముగా గోచరించుచున్నది. అట్లు గోచరించుటకుఁ జిరపరిచయము గూడ నొకకారణము గావచ్చును. ఈరెండవవారియభిప్రాయమును స్థిరపఱచుటకు ననుభవజ్ఞు లయినపండితులు చెప్పఁదగిన యుక్తులయందుఁ బ్రధానము లయిన పన్నియుఁ బ్రతివిషయమునకు నీయనుబంధపత్రికయందుఁ గానవచ్చుచున్నవి. అయినను మహాజనులముందల నుపేక్షించుట యనుపచారమని, వాని ననుసరించుచు నాకుఁ దోఁచినయభిప్రాయ మీక్రింద వ్రాయుచున్నాను.

1 గ్రామ్యపదప్రయోగము:—ఆంగ్లభాషయందు గ్రామ్యపదములు ప్రాయిక
ముగా లోకులసంభాషణమునందు వాడఁబడునవి గావున, నవి యనాదినుండియు నున్నవి
గాని నడుమ వచ్చినవి గావు. భాషయందుఁ బుట్టినవ్యాకరణము లన్నిటియందును
తత్సమాదులతోఁ గూడ గ్రామ్యమును నొకభాషాభేదముగా గ్రహింపఁబడుచుండుటయే
దానికి నిదర్శనము. పత్రికలు మొదలుగా వ్యాపారమున కుపయోగించువానివ్రాఁతలయందు
దానికిఁ బ్రయోజనము. రసవంతములుగా నుండవలసినసత్కావ్యములయం దాదినుం
డియుఁ బండితులు గ్రామ్యములకుఁ జో టిచ్చుట లేదు. అందులకుఁ గారణము వానియపరి
శుద్ధియే. వానికి సంస్కారము లేదు. నియమము లేదు.

ఒకరియభిప్రాయము మఱియొకరికిఁ దెలుపుటే భాషోద్దేశము గాదు. అది కూడ
దానియుద్దేశములలో నొకటి. అయినను నట్టియభిప్రాయములు పండితపామరులవి యేక
రీతి నుండవు. అందుచేతఁ బామరులయభిప్రాయములను దెలుపుడు సేయుటకు గ్రామ్యము
పనికివచ్చినను గ్రంథరూపమున బయలువెడలెడుపండితాభిప్రాయప్రకటనమునకు నియమ
వంత మయినభాషయే కావలయును. అట్టియభిప్రాయములను దెలిసికొని యానందింప
వలసినవారు పండితులే కావున, వారి కవి గ్రాహ్యములును గావు. మహాశయుల
యభిప్రాయములను గ్రామ్యభాషలోఁ దెలుపుట విరసము. విరసత నొప్పుకొని తెలిపి
నను వానిని యథాజాతులు తెలిసికొనుట దుర్లభము.

గ్రామ్యమును గ్రంథములలో నుపయోగింపవలయు ననువారివ్రాఁతలలోఁ బడుచు
గానవచ్చుగ్రామ్యపదములు "రాశాడు, కోశాడు, కొడతాడు, పెడతాడు," మొదలైన
క్రియాపదములును, ముఖ్యకస్థానమున నిండుసున్న నుపయోగించు "భారతం, భాగవతం"
మొదలయినప్రథమాంతరూపములును, "వాళ్ళు, వీళ్ళు, వాటి, వీటి" మొదలయిన
సర్వనామములు నిట్టివిగా నున్నవి. నీ వనుటకు నువ్వనియు, రెం డనుటకు రొం
డనియు నుత్తమజాతివారలే వ్యవహరించుచున్నారు. అట్టివి గూడ వారికిఁ బ్రయోక్త
వ్యములే కావచ్చును. ఇట్టిపరిమితగ్రామ్యపదముల నుపయోగింపకపోవుటచేత భాష
దుర్బోధమును నిష్ప్రయోజనము నగు ననియు, నుపయోగించుటచేత సుబోధమును
లోకోపకారకము నగు ననియు, నే నూహింపఁ జాలను. 'రాశా' నన్నమాట గ్రహింపఁ
గలవాఁడు వ్రాసినాఁ డన్నమాటను గూడఁ జక్కఁగఁ దెలిసికొనఁ గలుగుచున్నాఁడు.
"వాని, వీని" యనుమాటలు సందిగ్ధార్థము లనియు, గ్రామ్యము లయినను "వాటి, వీటి"

యనుమాటలు స్పష్టార్థముల నియ్య నందు లేవో; ఆపక్షమున "రాశాడు" మొదలగు గ్రామ్యపదములు మాత్రము పెక్కులు సందిగ్ధార్థములు గావా? "రాశా" వనఁగా లిఖించినాఁ డని యర్థమా? చరించినాఁ డనియర్థమా? ఏకపదము విన్నప్పు డిట్టిసందేహము గలిగినను, వాక్యములో సందర్భమునుబట్టి, యర్థనిశ్చయము చేయవచ్చు నని యందు రేని, "వాని, వీని" యనుమాటలకుఁ గూడ నాయుక్తియే చెప్పవచ్చును. కాఁబట్టి గ్రామ్యపదప్రయోగమువలన భాష కేయుపకారమును గలుగనేరదు. పయిగా నియమము లేక వ్యవహరింపఁబడునవి గనుక, సుద్గ్రంథములయందుఁ [illegible] నవకాశము దొరకినట్లే, దేశభేదమునుబట్టియు, జాతిభేదమునుబట్టియు, నానావిధవికారము[illegible]లఁ బొందుచు గ్రామ్యపదములు పోల్చుకొనుటకు శక్యముకాని వగుచు, భాషకు [illegible] నపకారకములే కాఁగలవు.

భాషానిబంధనములకు లోఁబడి యాంగ్లమునందు నవీనముగా గ్రంథములు వ్రాయుటయు, నట్టిసద్గ్రంథములభావములను గ్రహింపఁగలుగుటయు నెల్లవారికి సులభము కానిమాట నిజమే కాని, యట్లని కట్టుబాట్లు త్రెంచివేసి, భాషను గట్టు తెగిన యేటికి సాటిసేయుట న్యాయ మగునా? ఆంగ్లమున సంస్కృతము విశేషముగాఁ గలసి యుండుటచేత నవ్యుత్పత్యర్థములవిభాగమును, బ్రయోగములయందు వానిని నిలుపవలసినవిధమును, ఉత్తమగ్రంథముల రూపసౌష్ఠవమును, నివి మొదలగు ననేకవిషయములు దెలిసి యుండుట తద్భాషాప్రవీణుల మనిపించుకొనఁగోరువారికి నావశ్యకములు. కాఁబట్టి నన్నయతిక్కనాదిమహాకవులభారతాద్యుత్తమగ్రంథము లనేకు నిత్యపారాయణముల భక్తితో సేవించుచుఁ, పద్యాత్మకమయప్రపంచ మందరయుఁ బలుమారు దిరిగి వచ్చి భాషాభిమానులు సామర్థ్యసిద్ధిఁ బడయవలయును. అంతటిపరిశ్రమనుఁ బాలుమాలువారికి గ్రామ్యపదములే గాని యొండుపదములు సుబోధములు కానేరవు. అట్టివారినిమిత్తము గ్రామ్యపదములు ప్రయోగించి భాషావిధ్వంసము సేయుటకంటె, శక్తికిఁ దగినట్లుగ సద్గ్రంథములు పఠించుచుఁ గాలక్రమమునఁ జక్కఁగ మాతృభాషాజ్ఞానము సంపాదించుకొనునట్లు వారినే ప్రోత్సాహపఱుచుట మేలు.

పూర్వమహాకవిప్రయోగములు కొన్ని నియమములను మీఱి యున్న వనియు, నయినను నవి గ్రాహ్యము లనియు, భాషాకోవిదులు వచించియున్నారు. ఆంగ్లవాఙ్మయప్రపంచమునకు మహోపకారు లయి భాషావిషయమున మనలను గన్నుదెఱపిన మహానుభావులయెడల నట్టిగౌరవము చూపుట మనకృతజ్ఞతను బ్రకటించుకొనుట గాని వేఱు కాదు. అయినను నేయేకవులలక్షణవిరుద్ధపదములు మనకు గ్రాహ్యములో, యీ సందర్భమునఁ బరిషన్మహాజనులు నిర్ణయించుట యావశ్యకము. ఇందువలన నాధునికకవులకుఁ గొన్నినిర్బంధములు దొలఁగవచ్చు నని యెంచుచున్నాను.

2 అర్ధానుస్వారము:—ఆంధ్రభాషయం దుచ్చారణమునకు రానట్టియు నిరర్థకము లయినట్టియు వర్ణము లున్న వని నాకుఁ దోఁపదు. ఆదియందు భాషకు వర్ణముల నేర్పఱచినవారు దానిధ్వనులను జాగరూకతతోఁ బరిశీలించియే వానికిఁ దగినగుఱుతులఁ గల్పించినట్లు మన మూహింపవలయును. అనుబంధమున వ్రాసినట్లు 'ఖండబిందు వను నాసికోచ్చారణము సూచించుచున్నది. "తోఁక, పోఁక, మేఁక, లోనుగాఁ గల తెలుఁగు శబ్దములను, సంస్కృతములోని "లోక, శోక, భేక" శబ్దములవలెఁ గాక, యర్ధానునాసికోచ్చారణసహితముగా దేశజనులు పలుకుదురు. భాషాజనులయుచ్చారణమే వర్ణోత్పత్తికిఁ గారణము గావున, నప్పలుకుబడి కనుగుణముగాఁ బూర్వు లర్ధానుస్వారమును గల్పించినారు. ప్రాసస్థానమున సాధారణముగా నేకవిధోచ్చారణమే వినఁబడును గావున, బ్రథమపాదద్వితీయవర్ణము ఖండబిందుపూర్వక మయినయెడలఁ దక్కినపాదములందుఁ గూడఁ బ్రౌఢకవు లట్లే ప్రాసము గూర్చుచున్నారు. చూడుఁడు. నన్నయభట్టారకునిపద్యము

"ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె, ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతము, నిష్ఠ మెయిన్ భవదగ్నిహోత్రముల్
పోఁడిమి వేల్వఁగాఁ బడియెఁ, బొద్దును బోయెఁ, గచుం డదేమొకో
రాఁడు, వనంబులోన మృగరాక్షసపన్నగబాధఁ జెందెనో."

ఇట్టినియమము తప్పినప్రాసములు గూడ లేక పోలేదు గాని, యవి "పద, శస, వశా" అనుప్రాసములవంటివి గాఁ దలంపవలయు. అర్ధానుస్వారమున కుచ్చారణభేదము గల దనుటకే యీయుదాహరణము చూపఁబడినది. కాఁబట్టి తక్కినచర్చ యిట ననవసరము.

నైషధ్యములోని "నేఁడు" శబ్దమువంటిది తెలుఁగున నాఁడుశబ్దము వే ఱొక్కటి గలదు. అది "మే" యనుసర్వనామశబ్దముతో సమసించునప్పుడు వికల్పముగా నకారమునకు ద్విత్వమే కాక, తద్దీర్ఘమునకు హ్రస్వము గూడఁ గలిగి, యెన్నఁ డనుశబ్దమువలె "నెన్నఁ" డని మాఱి, మొదట దీర్ఘముమీఁది దయినయరసున్న యీమార్పువలన హ్రస్వముమీఁది దయినందున, నేఁ డనునది యెన్నం డని యయినట్లే, యెన్నఁ డనునది యెన్నం డని పూర్ణబిందుసహితరూపమును బొందుచున్నది. నాఁడుశబ్దములో నాది నను నాసికోచ్చారణసూచక మగు నరసున్నయే లేనియెడల నీవిధమునఁ బూర్ణానుస్వారము గలుగనేరదు.

మఱియు సానునాసికోచ్చారణము లయిన “యేఁడు, గూఁడు, మొదలగుశబ్దంబులకును, నట్టియుచ్చారణము లేని “యేడు, కూడు” మొదలగుశబ్దంబులకును, బహువచనమున వరుసగా “నేండ్లు, గూండ్లు; ఏళ్ళు, కూళ్ళు” నని రూపభేదములు గనంబడుచున్నవి. వీనిలో నేకవచనమున నర్ధానుస్వారము గలదానికి బహువచనమునఁ బూర్ణానుస్వారము గలుగుటయు, నం దది లేనిదానికి బహువచనమున బిందువు లేకపోవుటయుఁ జూడ నరసున్న యుచ్చారణము లేనినిరర్థకవర్ణ మని యెట్లు నమ్మనగును?

భాష సంభాషణమాత్రప్రయోజన మనువా రందు రేని వారల కిట్టిమార్పు లంత యుపయోగకరములుగాఁ గానరావు గాని, యనల్పశిల్పకళానైపుణ్యమున నేనుఁగు మోము నెద్దుమోమునుగాఁ గూడఁ గనఁబడునట్లు వ్రాయఁజాలుప్రౌఢచిత్రకారునివలెఁ, ఘనకావ్యమున బహువిధచమత్కారములు దోఁపింపఁ బ్రయత్నించెడుమహాకవికిని సాహాయ్యవిశేషములుగాఁ జూపట్టకుండునా? దశరథుఁడు మునికుమారు నేసియుఁ, బాండురాజు మునిదంపతుల నేసియుఁ, దమపుత్రమరణమునకుఁ బశ్చాత్తాపపడుటకు ఘట్టమ్మున, నేనీకావ్యమున నర్థప్రయోజనము చేయఁబూనుకొన్న రాఘవపాండవీయకర్త పింగళిసూరనార్యునకిప్పు డెత్తివేయఁజూచుచున్నయర్ధబిందు వెంతయుపకారక మయినదో చూడుఁడు.

“కం. ఏనుం గని కర మరయక
పూనితిఁ గా కిట్టితెఱఁగులఁ బొసఁగునె యేయన్
గానమె కాలనియమగతి
తో నావేఁట మునియుగము దుంగించెఁ దపజా.”

ఈపద్యమున రాఘవార్థమునందు, హ్రస్వముమీఁద ఖండబిందువు గలయేనుఁగనుపదమును లక్షణమునుబట్టి యేనుం గని మార్చుకొన నవకాశము గలుగుటవలనఁ, బాండవార్థమునందు దానినే “యేనుఁగ గనికర మరయక” యని కరుణారసానుగుణ మయినయర్థము వచ్చునట్లు చమత్కారజనకముగాఁ గవి శబ్దశ్లేషము చేయఁ గలిగినాఁడు.

అర్ధబిందువులవలనఁ గొన్నిచోట్ల శబ్దోత్పత్తి దెలియుటయు నచ్చుట మొదలగుప్రయోజనములు సాధారణముగాఁ గానవచ్చుచున్నవి. అవి గాక యిప్పటికి నాకు స్ఫురించినవిశేషములు మఱికొన్ని నేను వ్రాసినాఁడను. అరసున్నను భాషనుండి బహిర్వెట్టవలయు ననువారు దానిసంతతితోఁ గూడ, ననఁగా దానఁ బుట్టినరూపభేదములతోఁ గూడ దానిని బహిష్కరింపవలయు ననరా? దానికి మాత్రమే బహిష్కారము విధింపవలయు నం

దురా? రూపభేదములతోఁ గూడ దానిని దోసివేసినపక్షమున భాషకు మహానర్థము సంభవించును. దానిని మాత్రమే తతిమివేసినయెడలఁ దజ్జన్యరూపభేదములను గ్రహించుట కాధార మేమి? ఇట్టిబాధ లనేకములు కనఁబడుచున్నవి గనుకను, సాధారణవ్యవహారమున కది యెంతమాత్రము పుష్టి నిచ్చుట లేదు గనుకను, బహుపరిశీలనముతో భాషనుఁ బెద్ద లనుగ్రహించి యిచ్చినయర్ధానికోలికిఁ బోక "స్వదత్తా ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలన" మ్మనుసూక్తిని స్మరించుచుఁ, బూర్వమునుండి ధరించెడుభూష నెడలించిన యోషాపదంబులవలె భాషాపదంబు లెఱిఁగినవారికిఁ జిన్నవోయి కానఁబడకుండునట్లు లర్థానుస్వారమును నిలఁబెట్టుటయే యుక్త మని విన్నవించుచున్నాను.

3 శకట రేఫము:—"లఘ్వలఘు రేఫముల కుచ్చారణమందు భేదము లేదు గనుకను, ఇట్టిపదములం దలఘురేఫ ముండవలయు నని విధి లేనందునను, పూర్వులు కొంద ఱుభయ రేఫమైత్రి యంగీకరించియుండుటను నిఁక నాయక్షరద్వయంబున భేదము పాటింపవలసినయక్కఱ లేదని కొంద ఱనుచున్నారు." అని యనుబంధమున నున్నది. రద్వయభేదనిరాసమునకుఁ బయిమూఁడుఁ గూడఁ దగినహేతువులు గావు.

ఉచ్చారణమునందు భేదము లేదనుటనుగూర్చి—

భాషకు పక్షము లేర్పఱిచినవారిని మనము వివేకు లందుము గాని యవివేకు లనము గదా! వివేకు లయినవా రేకోచ్చారణమునకు రెండువర్ణము లేల కల్పింతురు? మఱియుఁ బరస్పరసాంకర్యము గలుగకుండునట్లు మహాకావ్యములందు తాలిబొమ్మలవలె యతిప్రాస స్థానముల వాని నేల పాదుకొల్పుదురు? సంస్కృతభాషానుసరణముగాఁ దెలుఁగునకు లక్షణము చేయుటచేతను, దద్భాషలోని రేఫోచ్చారణముకంటె భిన్నమయిన రేఫోచ్చారణము గొన్ని తెలుఁగుమాటలలో వినఁబడుటచేతను, మఱికొన్ని కారణములచేతను, దీర్ఘాలోచనము చేసియే పోలిక లేనిరూపములతోఁ బూర్వులు రేఫద్వయమును గల్పించినారు. అయినను గాలక్రమమున జనులకు నన్యభాషాపరిచయ మెక్కువ యయి స్వభాషాపరిజ్ఞానము దఱిఁగిపోవుటచేత ననేకభాషావిషయములతోడిపాటుగ నీనాఁటికి రేఫద్వయోచ్చారణభేదము నశించినదే యనవచ్చును. ఉచ్చారణము నశించినను రూపము గనఁబడుచున్నది గనుకఁ, బోయినదానినిబట్టి యున్నదానిని గూడఁ బాడు చేయుటకంటె నున్నదానినిబట్టి పోయినదాని నుద్ధరించుట భాషోపకారక మని తలంచెదను.

ఇట్టిపదములయం దలఘురేఫ ముండవలయు ననువిధి లేదనుటఁగూర్చి—

ప్రతిభాషయందును విధికి లోఁబడనివిషయములు సామాన్యముగాఁ గొన్ని గనఁబడుచునే యుండును. వానిని భాషాభిమానులు శిరసావహించి నేర్చుకొందురు గాని, పరిత్యజింపరు. అట్టివానియందు దృఢమయిన తెలివి సంపాదించుకొనుటకుఁ జేయుప్రయత్నమే భాషావాఙ్మయప్రపంచ మంత తిరిగి చూచుటకును, గాన నైపుణ్యానుభవజ్ఞానము గడించుకొనుటకును గారణ మగును. మఱియు నిది దేశము నెఱుఁగ లేనివిషయము కూడఁ గాదు. సంస్కృతభాషయందు లింగభేదము తెలిసికొనుటకయి నామలింగానుశాసనాదినిఘంటువులు పుట్టినట్లు తెలుఁగున లఘుగురురేఫజ్ఞానవిషయమున ననేకలక్షణగ్రంథములు పుట్టియున్నవి. వానిని చదువుచు విమర్శించిన నాభేదము తెలిసికొనవచ్చును.

పూర్వులు కొందఱు ఉభయరేఫమైత్రి యంగీకరించి యుండిరనుటఁ గూర్చి—

అట్లు లంగీకరించినమాట సత్యమే కాని, మైత్రి నంగీకరించినా రనుకొనినను వానిభేదమే పాటింప నక్కఱ లేదనుట యేమిన్యాయము? మైత్రి నంగీకరించినస్థలము లింకను ననేకములు లేవా? అక్షరములభేదము కూడఁ బాటింప నక్కఱ లేదని చెప్ప నవచ్చునా? రేఫద్వయభేదమును బాటించుటవలనఁ గలుగునష్ట మేమి? కవిత్వమున నాభేదమును తెలిసికొనలేనివారికి సదుపాయముగాఁ గొందఱు ద్వైతమైత్రి నంగీకరించియే యున్నారు గదా? కళేబర ముండిన ముసలి బ్రతికినాఁ డని కదుమునఁ గాంచి భస్మము చేసినారఁట. ఏనాఁడో వాగనుశాసనుఁడు స్థాపించి యూరాయుగ పోయఁగాఁ బ్రతికి, రానురా నీనాఁటికి ధ్వని తగ్గి, నియమము చెడి, యదృష్టము గనుక నెట్టెటో ప్రాణముతో నిలఁబడి యున్నయీయలఘురేఫమును, రూపుమాపఁ దలఁచుట, యాపూర్వగాథను స్ఫురియింపఁ జేయుచున్నది.

మహాజనులారా! పయిమూఁడుకారణములవలన నిప్పుడు మనము "రఱల" భేదము పాటింప నక్కఱ లేదని సిద్ధాంతము చేసిన, మఱియొకప్పుడు హేతువులతోనే "బుసు" ల భేదము పాటింపనక్కఱ లేదని మఱియొక్కవాదము రావచ్చును. స్థూలదృష్టిని జూచువారికి "బుసులు" గూడ "రజ" లవంటివే. "ధష" లు మాత్రము విపరీతగతిలోనికి రావా? అప్పటికి నింకను మఱికొన్ని వివాదములు పుట్టవచ్చును. ఇప్పుడు పాశ్చాత్త్యు లనేకులు మనభాషను నేర్చుకొనుచున్నారు. తట, దడ, నణ, యనువర్ణములయం దుచ్చారణభేదమును వారు

సులభముగా గ్రహింపలేకున్నారు. వానిని సరిగాఁ బలుకలేకున్నారు. వారిదృష్టికి నివి కూడ మన ‘‘ఋ’’లవంటివే కానచ్చును. కాఁబట్టి రద్వయభేదము పాటింపవలయు ననియు, నట్లు పాటించువారలకు నిదర్శనము; శక్తి కొలఁది యతిప్రాసములలో వానిఁ దప్పకుండఁ బ్రయోగించుటే యనియు; నాయభిప్రాయము. తప్పిపోదు మనుజంకుతో నియమ ముండఁ గూడ దనుట మంచిది కాదు. ఎట్టిసత్ప్రవర్తనము గలవాఁ డయినను దేవునిసన్నిధిని పాపి నని చెప్పుకొనునట్లు లెట్టిపండితుఁ డయినను భాషాసన్నిధిని దోషి నని యొప్పుకొనక తప్పదు. అంతమాత్రమునఁ బండితుఁ డెంతమాత్రము నపండితుఁడు కాఁడు.

శకటరేఫము నున్నదానిని సన్నూలనుండి తగ్గింపఁ గూడ దని దానిపక్షమున వాదించుటకు నా కనేకము లయినయుక్తులు స్ఫురించుచున్నవి గాని, యీపత్రికే గ్రంథవిస్తర మయిన దనుభీతితో నీకడపటివిషయమును మాత్రము వ్రాసి విరమించుచున్నాను.

1878వ సంవత్సరమున నొకనాఁటిసాయంకాలమున మారాజమహేంద్రవరపౌరసభామందిరమున మ॥ రా॥ రా॥ రావుబహదూరు కందుకూరి వీరేశలింగముపంతులుగారి యాధిపత్యమున జరగించిన యాంధ్రవిద్యార్థిసమాజప్రథమవార్షికోత్సవము నప్పు డాంధ్రభాషాభివృద్ధివిషయమున నేను గావించినప్రసంగము ప్రస్తావముగా, నగ్రాసనాధిపులు తమయుపన్యాసములో రేఫఱకారభేద మనావశ్యక మని చెప్పుచు, నందుల కుపబలముగా ‘‘నీరు’’ లఘురేఫ మయినప్పుడు జల మనియు, నలఘురేఫ మయినప్పుడు భస్మ మనియుఁ బూర్వులు చెప్పుచున్నను, లఘురేఫ మయినదానికే పయిరెండర్థములు నున్న వనుకొని సైంధవాదిశబ్దములకుఁ బోలె సందర్భానుసారముగా నర్థగ్రహణము కావింపవచ్చు నను నభిప్రాయము తెలిపి యున్నారు. అయినను నింతమాత్రప్రసవరణచేత నీవిషయము నిర్వాహ మగునది గా నాకుఁ దోఁప లేదు. ఈ ‘‘నీరు, నీఱు’’ శబ్దములవంటివి వీం ట నేకశబ్దము లున్నవి గాని, యన్నిటిని విడిచి ప్రస్తావమునకు వచ్చినపయిరెండు శబ్ద విమర్శించుచున్నాను. శబ్దరత్నాకరనిఘంటువునందుఁ జూచితి నేని లఘురేఫ మయి జలార్థక మయిననీరుశబ్దము నైకృత మనియు, గురురేఫ మయి భస్మార్థక మయిన నీఱుశబ్దము ‘‘నిగుఱు’’ నను రూపాంతర మయినదేశ్యశబ్ద మనియుఁ, గానవచ్చెడును.

నీర మనుసాంస్కృతికశబ్దమునుండి పుట్టిననీరుశబ్దంబును, నిగు అనుదేశ్యపుమాటకు మాఱురూప మయిననీఱుశబ్దంబును, నొక్కటిగా మనము భావింప వచ్చునా? ఈరెండు శబ్దములకు వ్యాకరణకార్యములయందుఁ గూడ నధిక భేదము గలిగి యున్నది. లఘురేఫ మయిననీరుశబ్దమునకుఁ బ్రథమాబహువచనమున "నీరులు, నీళులు, నీ" ళ్లనియు, ద్వితీయాద్యేకవచనంబుల "నీటిని, నీటిచేత, నీటికొఱకు, నీటివలన, నీటికి, నీటియం" దనియుఁ, దృతీయాసప్తమ్యర్థక మయినయత్వము వచ్చునప్పుడు "నీట" యనియు రూపం బు లేర్పడుచున్నవి. గురురేఫ మయిననీఱుశబ్దమున కిట్లు రూపసిద్ధి కానేరదు గదా! కాఁబట్టి వర్ణభేదంబును, నర్థభేదంబును, నుచ్చారణభేదంబును, వ్యుత్పత్తిభేదంబును, వ్యాకరణకార్యభేదంబునుగలిగి యున్న "నీరు, నీఱు" శబ్దంబులు రెండును నర్థద్వయము గలయేకశబ్ద మని యాలోచించుటకు భాషాతత్త్వమును విమర్శించువారు సమ్మతింతురా?

ఆంధ్రలిపియం దార్యులు సవిమర్శముగా సప్రయోజనముగా శకటరేఫమును గల్పించి యుండిరి. తత్సమతద్భవములందు బండిఱా లే దని ఘోషించుచుండిరి. ఇట్టి స్థితిలో, దేశ్య మయి గురురేఫ మయిన "నిగుఱు" నకు రూపాంతర మయిన "నీఱు"ను, దద్భవ మయి లఘురేఫ మయిన "నీరు"ను నేకశబ్దమే యని చెప్పుకోవలసినంత యవసరము మన కేమి వచ్చినది? "గొఱ్ఱె, బఱ్ఱె" మొదలగుశబ్దములను గురురేఫద్వయముతో వ్రాయుటకు మాఱుగా "గొర్రె, బర్రె" యని లఘురేఫద్వయముతో వ్రాయుట, యాంగ్లేయభాషాపదమును గాని, మహమ్మదీయభాషాపదమును గాని, సంస్కృతలిపితో నయినను, దెలుఁగులిపితో నయినను వ్రాసి చదువుకొనునట్లు దెలిసినవారికి వికారముగాఁ గనఁబడును. తెలుఁగుకవిత్వమున సంస్కృతపదములు విశేషముగాఁ బ్రయోగించుచు న్నారు. అట్టికవనము భాషాకోవిదు లధికముగా శ్లాఘింపరు గదా! ఇతరవర్ణములు ప్రాసస్థానమున నుంచినప్పుడు పద్య మంతయు సంస్కృతపదములతోఁ జెప్పినను జెప్ప వచ్చును గాని, ఱకారము ప్రాసస్థానమున నుంచినప్పుడు మాత్ర మట్లు రచించుటకు వలను పడదు. చూడుఁడు.

"స్రగ్ధర॥ మాళిస్రక్సంగరంగన్మధుకరపటలీమానసాకృష్టవిద్యా
శాలిస్ఫారాబ్జరేఖాంజలిపుటఘటనాచారుఫాలస్థలత్మా
పాలశ్రేణీవిశాలాంబకకుముదవనీబాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతిస్మితవదనరుచిస్ఫీతు నాగేంద్రకేతుఁ."

విరాటపర్వము.

“ఉ. సింగం బాఁకటితో గుహాముఖమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.”

పయిపద్యములోఁ దెలుఁగుసంధులతే కాని సంస్కృతసంధులకు నేను గుఱుతుంపలేదు. అన్వయకాఠిన్యాదులతోఁ గూడినపద్యమునందే సంధులను, గొంచె మయిన భాషాజ్ఞానము గలవారికి బాధ లేక యుండఁగా, సంతకంటె సులభ మని చెప్పఁ దగిన గద్యమునందు దాని విడువవలసినయవసర మేమి? సంధి విడిచినపుస్తకములను విద్యార్థులచే మనము చదివించినయెడల, వ్యాకరణమువలన నేర్చుకోవలసినసంధికార్యములకు లక్ష్యములను వారల కెక్కడఁ జూపఁగలము? సంభాషణములోనా? అది యెట్లు సాధ్యము? ఆజ్ఞానము దృఢపడనియెడల భాషలోనియుద్గ్రంథములు వారల కెట్లు పనికి వచ్చును? ఇట్టివిషయముల నాలోచింపఁగా విసంధిగఁ బుస్తకములు వ్రాయుట భాషాజ్ఞానమునకు సాయపడు నని నాకుఁ దోఁచదు. బాలురు గాని బాలికలు గాని శైశవదశయందుఁ జదువఁ దగినచిన్నపొత్తములందుఁ బ్రారంభమున శబ్దస్వరూపము వారు సరిగా గ్రహింపఁ గలుగుటకయి “ఇది ఏమి” అని సంధి వేఱు చేసి వ్రాయవచ్చును. విద్యావృద్ధిఁ బొందుకొలఁది సహజ మయినభాషాస్వరూపమే వారికిఁ జూపవలయును. విద్యార్థులను భాషాప్రవీణులను జేయుట కదియే యుక్తమమార్గము. కొంతకాలముక్రిందట సంధులఁ బ్రిదిలించి యచ్చొత్తించినభారతోద్యోగపర్వ మొకప్రతి నేను చదివి చూచి నాఁడను. తెలుఁగులోనిపద్యగద్యగ్రంథముల కన్నిటికి నట్టిగతియే పట్టియున్నయెడల నిఁక భాషసొంపు చెప్ప వలసిన దేమి? లక్షణానుసారముగా సమాసమున సంధి విడుచుట గద్యమునందు హాస్య మగును. పద్యమునం దిదియుఁ దఱచు గాఁ గూఢ మని నాయభిప్రాయము.

అన్యదేశ్యములు:— “అటఁ జనక మేఁత నడచునే హంసములకు” నన్న పరిభాషతి పరిద్యుమ్నమునఁ బింగళి సూరన్న వ్రాసినట్టు ఈకాలమున నన్యభాషాపదములను ముట్టు

కుండఁ గావ్యరచనము చేయుట మనకు సాగ దని యే చెప్ప వలసి యున్నది. "క్రొత్త పదార్థములకుం బేరు కల్పింప వలసి వచ్చినచో సంస్కృతాంధ్రభాషాపదములనుండియే నూతనశబ్దముల నిర్మింపవలయు ననియు, నటు చేయుటకు వలను పడనియెడల నిదివఱకే వాడుకయం దుండునట్టిపదముల గ్రహింప వచ్చు ననియు, అట్లు విధి లేక గ్రహించుపద మయినను మనభాషాసంప్రదాయము ననుసరించి సంస్కారము పొందినతరువాతనే దానిని గ్రహింప వలయు ననియుఁ" గొందఱయభిప్రాయ మయినట్టు లనుబంధమువలనఁ దెలియ వచ్చుచున్నది. నాకును నదియే మంచిమార్గముగాఁ దోఁచుచున్నది గాని, యట్టిపదము లందఱు నేకవిధమునఁ బ్రయోగించునట్లు నియమమును వానికి నిఘంటువును గావలయును. విచ్చలవిడిగాఁ బ్రతిపదము నుపయోగించుట విరసము.

శృంగారవర్ణనము:—పూర్వగ్రంథములందుఁ గొన్నిట శృంగారము వచ్చిగా వఁబడి యున్న దన్నమాట నిశ్చయమే. అయినను దానివలన లోకమున కపకారమ గలుగుచున్న దనుమాట మాత్రము సత్యదూరము. ఆపుస్తకముల పే ళ్ళయినను నెఱుంగనివారు మిక్కిలి నీతిబాహ్యులయి చరించుచున్నారు. వానిం జదివినవారు సత్ప్రవర్తనము గలిగి సరసముగా గ్రంథరచన మొనరించి లోకోపకారు లగుచున్నారు. ఎటువంటివచ్చి శృంగార మయినను స్త్రీలు గాని పురుషులు గాని భాషాజ్ఞానము గలవారు తమంతటఁ దాము చదువుకొని యానందింపవచ్చును. "తీఁగ లాగిన డొంక గదలును." కాఁబట్టి, పూర్వగ్రంథముల సవరించునుద్యమము మాని, ముందు రచించుగ్రంథములలో నశ్లీలవ్రీడామంగళశబ్దంబులు దొరలకుండఁ జేయుప్రయత్నమున జాగరూకు లయి యుండుట శ్లాఘనీయము.

రాజమహేంద్రవరము,
18—5—1912

విధేయుఁడు,
వడ్డాది సుబ్బారాయఁడు
ఆంధ్రసాహిత్యపరిషదాహ్వాతుఁడు

శ్రీ ర స్తు.

# దై వ భ క్తి.

ఇ ది,

రాజమహేంద్రవరమునం బ్రాచీన సదాచారపరాయణు లగు

విద్యార్థులు సభక్తికముగా నాచరించిన

శ్రీరామకల్యాణపు టుత్సవదినములలో

[illegible] వరపు హైస్కూలునందు

ముని [illegible]

నెల్లపాధ్యాయుండగు

వడ్డాది - సుబ్బారాయునిచే

నీయబడిన నుపన్యాసము.





ఏలూరు

దామరాజు - శివరామయ్యగారి

శ్రీమత్త్రిపురసుందరీ ముద్రాక్షరశాలయందు

ముద్రితమయినది.

౧౮౯౩ సం॥ జూన్ నెల.

శ్రీ ర స్తు.

# దైవభక్తి.

రాజమహేంద్రవరమునఁ బ్రాచీన సదాచారపరాయణు లగు విద్యార్థులు సభక్తికముగా నాచరించిన శ్రీరామకల్యాణపు టుత్సవ దినములలో వడ్డాది సుబ్బారాయకృత మగునుపన్యాసము.

శ్లో॥ ప్రహ్లాదనారద పరాశరపుండరీక । వ్యాసాంబరీషశుక శౌనకభీష్మదాల్భ్యాన్ । రుక్మాంగ దార్జున వసిష్ఠవిభీషణాదీన్ । పుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి॥

సుహృదులారా! నేనిప్పుడు మీతోఁ ముచ్చటింప దలచినవిషయము దైవభక్తి యని తెలుపుటకు మిక్కిలి సంతసించుచున్నాను. మనజీవితకాలములో నెల్ల సఫలము లయిన వని యెంచి మన ముల్లాసపడ వలసిననిమిషము లీలాటియంశములయందు వెళ్ళఁబుచ్చినవే గదా! ప్రస్తుతాంశమును గూర్చి మాటలాడుటకు ముందు మనయాయుష్యమును గుఱించియు మనలను గుఱించియు నించుక విచారించుట యావశ్యక మయి యున్నది.

చూడుఁడు, మనము మేలుకొన్నను, నిద్రపోవుచున్నను, బనిచేయుచున్నను, నూరకున్నను, ఓటికుండలోని నీటిచుక్కలవలె మనయాయుష్కాల మనుక్షణమును దఱఁగిపోవుచునే యుండును, తనయాదాయవ్యయంబులను మెలఁకువతో నెప్పుడుగాని లెక్కచూచుకోక చేతిపైక మంతయు విచ్చలవిడిగా దుర్వినియోగముఁజేసి, పదంపడి దుఃఖపడియెడునవివేకధనికునివలె మూఢమతులు తమజీవితకాలమునువృథా గడపి విలపించుచున్నారు.

నే నూరక మాటవరుసకుఁ గాలమును ధనముతోఁ బోల్చినానుగాని, పట్టు మని విచారించిన లక్షలకొలఁది వరా లయినను మన

జీవితకాలమందలి యొకయఱనిమిసమున కేని సాటి రావు. కోట్లకుఁ బడగలెత్తినవారుగాని, సకుటుంబముగాఁ దులాభారములు దూఁగిన వారుగాని, తుదకుఁ జతుస్సముద్రముద్రిత మయినభూమండల మంతయు నేకచ్ఛత్రముగా నేలినవారుగాని తమయాయుష్కాలము నొకనిమేషములో నఱవీస మయినను దమసంపదలచేఁ బొడిగించుకొనఁ జాలినారా? ఇకఁ జాలువారా? ఎవ్వరును దమతమబ్రదుకుకాలమున ధనాదికము సంపాదింపఁ గలరుగాని, ధనాదికముచేతజీవితకాలమును మాత్రమె, యెన్నఁటికిని సంపాదింపఁ జాలరు. ఎంతవిలువ గలిగినపదార్థముగాని, యెట్టియుపయుక్త మయినవస్తువుగాని, దానినిగుఱించి యాలోచింప నప్పుడును దానియక్కఱ తటస్థింప నప్పుడును సామాన్యముగానే యగపడునుగాని, యంతటిమహనీయ మయినదిగాఁ గానరాదు, చూడుఁడు.

నిరుపమానసర్వక్రపరాక్రమంబునఁ ద్రిలోకాధ్యక్షుం డగు సహస్రాక్షునకుఁ గ్రూరరాక్షస సంహారకృత్యంబునఁ దోడు సూపి, సమస్తసుమనస్స్తుతులచేత నతులనుతులఁ గాంచి, యెల్లసంపదలు కలిగి యాసేతుశీతాచలం బగుభూచక్రం బేకాతపత్రంబుగాఁ బాలించుచు నఱువదివేలసంవత్సరములకాలము జీవించినవాఁడు దశరథమహారాజు తుదకు హా! రామ! హా! లక్ష్మణ! హా! పుత్రులార! యని విలపించుచుఁ దననిమిత్త మెదురు చూచుచున్ననిముషమునకుఁ దన యసువు లప్పగించినాఁడేకాని, దూరమందు నడవులలో నున్నరామలక్ష్మణులు గాకపోయినను జేరువ మేనమామలయింట నున్నభరతశత్రుఘ్నులయినను వార్త దెలిసి వచ్చుదాఁక నేధనముచేత నేసాధనముచేతను దనయాయువు నిసుమంత యదనముగాఁ జేసికొనఁ జాలఁడయ్యెను గదా! తానా వఱలో జీవించినయఱువదివేలయేండ్లకాలము నంతముఖ్యముగా నతఁడు పాటించి యుండకపోయినను, దత్కాలమునఁ దనయనుఁగుఁదనయులలో నొక్కరయినను దనకంటఁ బడునందాఁక బ్రతికియుండుటను గుఱించి యతఁడు బహుధాప్రయత్నించి, తుదకు దేనిచేతఁగాని సంపాదింప రానినిరుపమానోపయుక్తపదార్థ మొక్కకాలమే యని తెలిసికొని దానిమహిమను గుఱించి యతఁడాశ్చర్యపడి యుండక పోఁడు-

ఈలాగునఁ దరిచితరిచి విచారించి నప్పుడు మనజీవితకాల మ మూల్య మైన దని నిర్వివాదముగాఁ దేటపడునది యైనను దానివిషయ మున మనము మిక్కిలి యలక్ష్యముగా నేమఱిల్లి యున్నాము, ఇ ట్లే మఱుటను గుఱించి జ్ఞానసంపన్నుఁ డయినభ ర్తృహరి యీలాగునఁ జెప్పుచున్నాఁడు.

శ్లో॥ ఆదిత్యస్యగతాగ తై రహరహ స్సంక్షీయతే జీవితం।
వ్యాపారై ర్బహుకార్యభారగురుభిః కాలోఽపి నజ్ఞాయతే। దృష్ట్వా
జన్మజరావిప త్తిమరణం త్రాసశ్చ నోత్పద్యతే। పీత్వా మోహమ
యీం ప్రమాదమదిరా మున్మ త్తభూతం జగత్॥

సూర్యునిరాక పోకలచేత దినదినము నాయువు క్షీణించుచున్న ది. అయినను బహువిధప్రయోజనములు గలవ్యాపారములలో ము నిఁగిపోయి యున్నందునఁ ద జ్జీవితక్షయము మానవులకుఁ దెలియరా కున్నది. అంతియకాక పుట్టుక, ముదిమి, యాపద, చావు ననువీనిని గన్నులారఁ జూచుచున్నను భయము నయితము వారికిఁ బుట్టక యు న్నది. అయ్యో! అజ్ఞానరూపమయినసురా కనెడుకల్లును లెస్సగాఁ ద్రాగి యీజగత్తు మ త్తెక్కి యున్నది సుమీ " యని పైశ్లోకమున కుఁదాత్పర్యము.

ఓహో! యీమాటలు మనయనుభవమునకు నెంత సరిగా నున్నవి! ఆమహాత్ముఁడు చెప్పినట్లు నిజముగాఁ బ్రమ త్తతయే కాక పోయిన, నంతటి యనర్ఘ మయినయీయాయువు తమ కెవ్వానియను గ్రహమున సంప్రా ప్త మయినదో, దాని నెట్టివిషయమున వినియోగిం పవలయునో, తన్మూలముగా గడియించుకో వలసినపరమలాభ మే దో యొకరు గాకపోయిన నొక రయినను విచారించుకొనుచున్నారా? లేదులేదు. ప్రతివాఁడును మరల నీక్రిందిశ్లోకమునఁ దద్భ ర్తృహరి చెప్పినచొప్పున జరిగించుచున్నాఁడు.

శ్లో॥ క్షణం బాలోభూత్వా క్షణమపి యువా కామరసికః।
క్షణం విత్తైర్హీనః క్షణమపిచ సంపూర్ణవిభవః। జరాజీర్ణై రంగై ర్న
ట ఇవ వళీమండితతనుః। నర స్సంసారాంతే విశతి యమధానీ
యవనికామ్॥

"కొంతకాలము బాలుఁడుగాను గొంతకాలము కామాభిలాష గలయౌవనవంతుఁడుగాను. గొంతకాలము దరిద్రుఁడుగాను, గొంతకాలము ధనవంతుఁడుగాను, సంసారమందు నుండి, తుట్టతుదకు నోడలెల్ల ముడుతలుపడి ముసలితనమున నవయవములపట్లు వదలి, నాటకము ముగిసినతరువాత నావలఁబోఁక ననేకవేషములువేసి వేసటపడినశైలూషునివలె యమపుర మనెడు తెరమఱుఁగున కరుగుచున్నాఁడు.

ఓమిత్రులారా! అత్యుత్తమజన్మ మెత్తినమనము నీచము లయినపశుపక్ష్యాదులవలె బ్రతికినన్నినాళ్ళు బ్రతికి కడకు నిరర్థకముగా నశించి పోవుట ధర్మువుగాదు . ఎవఁ డీసమస్తభూతకోటులను సృజియించినాఁడో యాయీశ్వరుఁడు సృష్టివర్గములోఁ గానవచ్చెడుతక్కిన వానికంటె మన కనేకమహోత్తమసాధనములను బ్రసాదించి యున్నాఁడు. అయినను మనముమాత్ర మాయనయుపకారములనుగాని, మనయుత్తమత్వమునుగాని, యెంతమాత్రము చింతించుకొనుచుండుట లేదు. వేయి చెప్పనేల ? బహువిధముల విచారింపఁగా నీసృష్టిలో మనుష్యజాతియంతటికృతఘ్న మయినది మఱేదియు నాదృష్టికిఁ గాన రాకున్నది . అయ్యో! "పెంచినకుక్క కాలుగఱచె నన్నసామెత నిజముగాఁ గొందఱు మనుష్యులు భగవంతుఁడు ప్రసాదించినయుపకారములను గుఱించి కొంచె మయిన విచారింపక పోవుట యటుండఁగా మీఁదుమిక్కిలి యాయన యునికికే సంశయము నూహించుచున్నారు. అట్టియూహ వారికి వాదమాత్రప్రయోజనము నఁగాక నిజముగా నమ్మకముచేతనే యయినపక్షమునఁ గటగటా! వివేకసంపన్న మయినమానవజన్మ మెత్తియుఁ దమ తెలివిఁబదటఁ గలుపుకొనుచున్నారేయని వారిని గూర్చి మనము దుఃఖింప వలసి యున్నది. ఓపరమేశ్వరా! నీవు బయలువలె బాహ్యాభ్యంతరములయందన్నిటఁ బూర్ణుఁడ వయి, జ్ఞానమయుఁడ వయినందున జ్ఞానైకగోచరుఁడ వయి యున్నావు. అందుచేతనే నిన్నుఁ దెలిసికొని యానందించుటకుఁగాను మానవులకు సర్వోత్కృష్ట మయినజ్ఞానమును బ్రసాదించినావు. అయినను మందమతులయంతరంగములం దది పొగగ్రమ్మికొన్నసన్న దీపమువలె నంతగా బ్రజ్వరిల్లక కనుకు చున్నంది

న దాని ప్రయోజనము వారికడ వ మ్మగుచున్నది. ఓమహాదేవా!

శా॥ ఎల్లన్ నీ వయి యుండ నజ్ఞునకు నీ వెందుం గనన్ రావు; వి,ద్యుల్లేఖాయుతకోటి భాస్వర! నినుం దోల్గన్నులా చూచుటల్? ముల్లోకంబు జడంబు; జీవమును దన్మూలంబు నీ వెట్టులా। కల్లాడంగ ల దీవులేక పరమాత్మా! భక్తచింతామణీ! ॥

మ॥ వరిముల్లంతటిపాప లోప మయి విశ్వం బంతయుంబో లెని। వ్వరిముల్లంతవివేక మాత్మం గల వై బ్రహ్మాండకోటుల్ సదా। పరమాణుక్రియ రోమకూపచయ మన్వాతాయన శ్రేణిలోం। దిరుగన్ భాసిలు నిన్నుం గానరఘుభేదీ! భక్తచింతామణీ! ॥

మ॥ గెలిపింప గదెధర్మ మెల్లప్పుడు రక్షింపంగ దేదీనులన్ । గొలిపింపంగదె నీపదాంబు జములన్ గుయ్యాల కింపంగదే । తలపింపంగదె నీదుప్రేమ మపరాధంబుల్ క్షమింపగదే। వలపింపగదె ని న్నజస్ర మెదదేవా! భక్తచింతామణీ! ॥

హితులారా! పరమ కారుణికుండయిన సర్వేశ్వరుండు కాల క్రమమున నెల్లవారలకు జన్మపరంపరా వశమున నాత్మజ్ఞాన మొసంగక మానండు గాని, ప్రకృతము కొందరుమానవులు పూర్వోక్త ప్రకారమున నంత నికృష్ట బుద్ధులుగా నుండుటకేమి కారణమోయిం చుకంత విచారింతము.

ఈసృష్టిలోని భూతకోటు లన్నియు స్థావరములుం గ్రిములు, జలచరములుం, బక్షులుం, బశువులు, మనుష్యులు, దేవతలు, నని స ప్తవిధములు. అందుం దేజోరూపులయిన దేవతలుగాక తక్కినయా ఱు దెరంగుల జీవులలో నెనుబది నాలుగులక్షల యంతర్భాగములు న్నట్టు లీక్రింద పద్యము వలనం దెలియవచ్చు చున్నది.

క॥ వృక్షము లిరువదిలక్షలు। పక్షులు పదిలక్ష లుదక భవన వలక్షల్ । లక్షత్రి దశము క్రిమి; పశు లక్షలు పదొకండు; నరులు * నాలుగులక్షల్॥

చైతన్య స్వరూపుం డయిన పరమాత్మ యాయన్నిటి యందు

* ప్రసిద్ధముగా నిట్లీపద్యము చదువం బడుచున్నది గాని యీయ తిచింత్యము, ఇట్లు నలలకు యతిప్రాసముల మైత్రి యక్కడకక్కడం గానవచ్చుచున్నది.

ను వ్యాపించియున్నాఁడు. అయిన నుపాధిభేదమునుబట్టి యయ్యాయి ప్రాణులతెలువు లొండొంటికిని నీఁటి యుండును. వృక్షాది స్థావర కోటికిఁ గూడఁ జైతన్య మున్న దనియు, వానికిం గరణపాటవంబు లేక పోవుటంజేసి యవిసుఖదుఃఖములు లోలోపల ననుభవించుచు నూర కుండును గాని మనవలె వెలువరింప నేర వనియు నార్యులు నమ్ముచున్నారు. ఇందుకు నిదర్శనముగా, స్వభావవిశుద్ధాంశముల నెన్నఁడుగాని వర్ణింపఁ బూనఁడని ప్రసిద్ధి నొందినకాళిదాసమహాకవి విక్రమోర్వశీయ నాటకమునఁ దెలిపియున్నయీక్రింది సంగతులను విమర్శింపుఁడు.

పూర్వము పురూరవశ్చక్రవర్తి యూర్వశి యనునప్సరసను బరిగ్రహించి యామెతో స్వేచ్ఛావిహారమునకయి గంధమాదనపర్వతమునకుఁ బోయి యందలిసుందరవనంబులఁ గ్రుమ్మరు చుండఁ, గొండొకచో నూర్వశి యతనికన్నుల కగోచరురా లయి యెంతవెదకిన నెచ్చోటను గాన రాదయ్యె. ఆమెయందు నారాజేంద్రున కతిప్రేమ గావునఁ దద్వియోగకారణమున నపస్మారి యయి యయ్యడవిలోఁ జెట్టుచెట్టును గుట్టగుట్టను నడుగుకొనుచుఁ దిరుగుచుండ, నొక్కయెడ నాతని కొకరత్నము దొరకెను.

అది చేతఁబట్టుకొని పోవుచుండి, యాచేరువ నొక తీఁగ యుండఁగాఁ, దిచ్చియెత్తి యున్నాఁడు గావున, దానిని దనభార్య యని కౌఁగిలించుకొనెను. అట్లు కవుఁగిలించుకొన్నతోడనే యాతనిపు ణ్యంబున నావల్లికయే యూర్వశి యయ్యెను. అప్పుడు రాజునకు నూర్వశికి నీక్రింది సంభాషణము జరిగినది.

రాజు—(తెలివినిబొంది) ప్రియురాలా! ఇప్పుడు గదా నేను బ్రతికితిని.

ఊర్వ—దేవా! అవశేంద్రియురాల నయియేమియు జేయలేక పోయితిని గాని దేవరవారివృత్తాంత మంతయు నాయంతఃకరణమునకుఁ బ్రత్యక్ష మగుచునే యుండెను.

రాజు—సుందరీ! "అవశేంద్రియురాల నయి "యను నీమాటభావ మేమో నాకుఁ దెలియ కున్నది.

ఊర్వ—దేవా! చిత్తగింపుము. పూర్వము మహానుభావుఁడయిన కుమారస్వామి శాశ్వత మగుకుమార వ్రతము నవలంబించి గంధ

మాదనవనంబునందలి యకలుషంబనుకచ్ఛంబునందుఁ బ్రవేశించి
యచ్చో నొకనియమముఁ జేసెను.

రాజు—ఏ మని?

ఊర్వ—ఆవనమున నేస్త్రీ ప్రవేశించునో యది తీగగామాఱిపోవు-
ననియు- గౌరీసంగమనీయమణివలనఁ దక్క వేఱొకటి విమో
చనముగలుగ దనియు నిట్టిసమయముచేసెను. నేను గురుశా
పవశమైనమూఢాత్మురాల నయి దేవతానియమమాట మఱచి
పోయి వనితాజనపరిహరణీయ మయినకుమారవనము ప్రవేశిం
చితిని. ప్రవేశించిన తోడనే నారూప మీకాననోపాంతమున
లతాకారమునఁబరిణమించినది.

రాజు—ప్రియురాలా! ఇది యంతయు సత్యమే. నీవుచెప్పినట్లు
భవదీయపునస్సంగమకారణం బయినయీరత్నము నాకీశ్వరా
నుగ్రహమున దొరకినది (అనిమణినిజూపినాడు.)

ఈపైయంశములవలన, నూర్వశి లతగాఁ బరిణమించి యున్న
పుడు పురూరవుని దైన్యమును జూచియుఁ గరణపాటవము లేమిని
నాయన నూఱడింప లేకపోయినట్లు తేటపడుచున్నది గదా! స్థావర
ములకుఁ దెలివి గల దనుటనుగుఱించి మఱియు ననేకనిదర్శనములు
గలవు. దాని కేమి? ప్రస్తుతాంశము నాలకింపుడు.

ఈలోకములోఁజిన్నచిన్నయుద్యోగములయందు గడిదేఱినవా
నికిస్వతంత్రముగా నధికారముఁ జెల్లింపఁదగినమహోద్యోగము ముం
దుగా నేలాగున నీయఁబోయాలాగుననే యీశ్వరుండును హీనము
లయినస్థావరాదిజన్మములు పలుమాఱెత్తినవానికేగాని సర్వోత్కృష్ట
మయినయీ మానవజన్మము ప్రసాదింపఁడు. ఈసంగతి మనకుఁ
గ్రొత్తగాదు. మన మర్థవిచారము సేయరాకున్నాముగాని నే నీవ
ఱలోఁ దెలిపినయంశము లోకోక్తులయందు సయితము దఱచుగ
నాలకించుచున్నదే- చూడుఁడు- ప్రస్తావ వశముగా మనలో స్త్రీలు
గాని పురుషులుగాని యప్పుడప్పుడు "సప్తజన్మా లెత్తినను వీఁడు
చక్కఁబడనేరఁడు" అనుమొద లగుమాటలమూలముగా స్థావరాది
సప్తవిధజన్మములను దలపెట్టుచున్నారు- మఱియుఁ బూర్వోక్తాంశ
ములు కరతలామలకము లగునటుల చక్కని శ్లోక మొక్కటి యిక్కడ

సుదాహరించుచున్నాను- భక్తుఁ డొక్కఁడీవిధమున నీశ్వరుఁ బ్రార్థించుచున్నాఁడు.

శ్లో॥ ఆనీతా నటవన్మయా తవపుర శ్రీకృష్ణయాభూమికా।
వ్యోమాకాశ ఖఖాంబరాబ్ధివసవ స్త్వత్ప్రీతయేద్యావధి। ప్రీతో యద్యసి తా విలోక్య సహసా యత్ప్రార్థితం దేహిమే। నోచే ద్బ్రూహి కదాచిదానయ పునర్మైతాదృశీ ర్భూమికాః॥

ఓ శ్రీకృష్ణమూర్తీ! నేను నటునివలె నీప్రీతికొఱకు నీవఱకు నెనుబదినాలుగులక్షల వేషములు గట్టుకొని నీయెదుటికి వచ్చినాను- ఆవేషములను జూచి నీవు సంతసించితివా నేను గోరినకోరికను బ్రసాదింపుము; సంతసింపకపోతివా నీ వీలాటివేషముల నికఁ గట్టఁబోకు మని నాకాజ్ఞాపింపుము- అనఁగా జన్మరాహిత్యమును గలుగఁ జేయు మని శ్లోకతాత్పర్యము- రెండవపాదమునందలి" వ్యోమాకాశఖఖాంబరాబ్ధివసవః" అను దానిలోని యాకాశపర్యాయము లయిదు, నైదుసున్న లనియు నబ్ధి యనఁగా నాలు గనియు, వసు వనఁగా నెనిమిది యనియు భావించి సంఖ్యానాంవామతోగతి యను న్యాయమున నాయంకెలను దుదమొదలుగా వ్రాసి లెక్కించి ౮౪౦౦౦౦౦-లని యెఱుంగునది.

ఇట్టులాత్మలకుఁ గలుగున నెడుజన్మ పరంపరయుక్తికి సయితము సరిబడినయంశమేకాని విపరీతము గాదు- మెలఁకువ, కల, నిదుర యని ప్రతిప్రాణికి మూఁడవస్థలు గలిగియున్నవి గదా! అవి మూఁడును బరస్పరభేదము గలవిగాని యేకరీతివి గావు- శ్రోత్రము మొదలయినజ్ఞానేంద్రియము లయిదింటితోడను, వాక్కుమొద లయిన కర్మేంద్రియము లేనింటితోడను గూడి, మనస్సు శబ్దాదివిషయముల యనుభవము గలిగియుండుట మెలకువ- అట్టిమెలఁకువ క్రమక్రమముగా క్షీణించి గాఢనిద్రను బొందక తొల్లిటిమెలఁకువయందలివిషయముల యనుభవము గలిగియుండుట కల- మనస్సు మొదలుగాఁ గలసర్వేంద్రియములవ్యాపారము శూన్య మయిపోవుట నిదుర. ఈమూఁడవస్థలు నిట్లు తేజస్తిమిరన్యాయముగాను బాషాణపర్వతాదులకును మనకును నున్నంతభేదము గలవిగాను గానవచ్చుచున్నను దద్భేదమును బాటింపక యాత్మ యొక యవస్థలోనుండి వేఱొకయవస్థలోఁ

ప్రవేశించి తత్తత్స్వభావములను దెలిసికొనుచున్నది. ఈలాగుననే మనయాత్మ లన్నియు వేఱువేఱుకాలములయందు వేవ్వేఱుజన్మములను బొంది యీశ్వరకటాక్షమున నీనాఁటి కీయుత్కృష్టజన్మ మెత్తఁగాంచిన వనుకొనుట కేమియాక్షేపము? మఱియుఁ బైని వివరించిన మెలఁకువ మొదలయినమూఁడవస్థలను గొంచెము సూక్ష్మదృష్టితోఁ బరీక్షించితి మేని యమ్మూఁటిలోఁ బ్రతిదానియందును మరల నవస్థాత్రయమునకుఁ గాన వచ్చెడును.

గురుసన్నిధానమున శాస్త్రశ్రవణము సేయునప్పు డడుగఁదగినవిషయముల నడిగి తెలిసికొని మనసున మఱపులేక యుండుట మెలఁకువలో మెలఁకువ. ఈలాటి మెలఁకువ గలిగింపఁదలఁచియే యుపాధ్యాయులు తమశిష్యులను జాగ్రత్తతో వినుఁ డని పలుమాఱు హెచ్చరికించుచుందురు.

గురువునొద్ద శాస్త్రవిషయములను వినునప్పుడు పరాకుగ నుండుటచేత నావిషయములు జ్ఞప్తియందుండియు నుండకుండుట మెలఁకువలోఁ గల.

గురువుకడ సద్విషయములను వినవలయు నని ప్రారంభించి వినునప్పుడు హెచ్చరిక లేమిచే నవి యేమియు నెఱుక లేకపోవుట మెలకువలో నిదుర.

ఈలాగుననే కడమ రెండవస్థలయందును గూడ భేదములు గలిగియున్నవి; కాఁబట్టి మనుష్యజన్మమెత్తినంత మాత్రమున మనుష్యులందఱును జ్ఞానముగలవారే యని మన మూహించుకొనుటకు వీలు లేదు. మెలఁకువలోనే కలయొక్కయు నిదురయొక్కయు ధర్మములు మన కగపడుచున్నట్లు కొందఱియందు వెనుకటి యధమజన్మములధర్మములెచ్చుగాఁ గానవచ్చెడును. ఈలాటిజ్ఞానతారతమ్యమును బట్టియే "నరులు నాలుగు లక్ష" లనిమనుష్యులలో నాలుగులక్షలభేదములుచెప్పఁబడియున్నవి. పువ్వు పిందెయుఁ, బిందె కాయయుఁ, గాయ దోరయు, దోర పండును నయినటు లీశ్వరవిషయమునఁ గేవలజడమతులుగా నిప్పుడున్నవారు సయితము కాలక్రమమున నంతఃకరణపరిపాకము గలవా రయి తదనుగ్రహపాత్రులు గాఁగలరు. అయినను మానిసిపుట్టువు పుట్టియు నజ్ఞానులముగా సంచరించెడు నపథాధమ

క్షమించుకొలఁకుఁ బరాత్పరు నొక్కమాఱు ప్రార్థనచేసికొని యనం
తరము ప్రకృతాంశమునువిచారింతము.

శా॥ ఓనిర్హేతుక జాయమానకరుణా! యోనిర్వికారప్రభూ!
యోనిర్వ్యాజపరోపకారసుకృతీ! యోనిత్య! యోనిర్మలా! యోనా
నాంతరయామి! విశ్వసృజ! విశ్వోపాస్య! విశ్వాత్మకా! జ్ఞానానంద
మయస్వరూప! వరదా! సద్భక్తచింతామణీ!॥

మ॥ మనుజుం డై పశు వాటకంటెఁ బశుజన్మం బెచ్చు; నీ
వెట్లు దానిని సృష్టించితి వట్లుచేయు నది; హా! నిర్భాగ్యత జ్ఞాన
మెల్లను వ్యత్యస్తముఁ జేసి నీవిధుల నుల్లంఘించెదఁ నేను; దం డన
కర్హుండను; బ్రోవవే ననుదయ న్సద్భక్తచింతామణీ॥

ఓనెయ్యురారా! యింతదనుక మనము మానవ జన్మమును
కొక్కయాత్కృష్ట్యమునుగుఱించియుఁ, దదాయుష్యముయొక్క య
మూల్యతను గుఱించియు, నాలెండిటియందును మనకుఁ గలప్రమత్త
తనుగుఱించియుఁ గొంతవఱకు ముచ్చటించినాము గదా! "యుక్త
యుక్తవచోగ్రాహ్యంబాలాదపిసుభాషిత" మ్మని యున్నదిగావున వ
యసున నైదేండ్లవాఁడె యయినను దత్త్వజ్ఞానసంపన్నతను బట్టి
పరమభాగవతోత్తముఁ డని మునిసత్తములచేతఁ బొగడ్తగన్నప్రహ్లా
దకుమారుఁ డేతద్విషయమున నేమనుచున్నాఁడో యించుక విచారిం
తము. అక్కుమారుండొకనాఁడు దనకు సహపాఠులు, సవయ
స్కులు నగురాక్షసబాలురు గొందఱు దన్నాటలకుం బిలువ వారి
యవివేకమునకుఁ బెద్దవగచి కరుణాయుత్తచిత్తుం డయి మెత్తమెత్తన
వారి కిట్లనియె-

ఉ॥ బాలకులార! రండు మనప్రాయపుబాలురుగొంద ఱుర్వి
పైఁగూలుట గంటిరే? గురుఁడు క్రూరుఁడనర్థచయంబునందు దుశ్శీల
త నర్థకల్పనముఁ జెప్పెడిగ్రాహ్యము గాదు శాస్త్రముల్। మే। లె
ఱిఁగించెద విని మీకు నిరంతరభద్ర మయ్యెడున్॥

వ॥ వినుండు సకలజన్మంబులందును ధర్మార్థచరణకారణం
బయినమానుషజన్మంబు దుర్లభంబు-అందుఁబురుషత్వంబు దుర్గమంబు-
అదియు శతవర్ష పరిమితం బయినజీవితకాలంబున నియతం బయి
యుండు- అందుసగ మంధకారబంధురం బయి రాత్రి రూపంబున

నిద్రాదివ్యవహారంబుల నిరర్థకం బయి చను-చికిఁ నపంచాశద్వత్సరం
బులందును బాల్యయౌవనకౌమారకైశోరవయోవిశేషంబుల వింశతి
హాయనంబులు గడచు. కడమముప్పదియబ్దంబులు నింద్రియంబులచేతఁ
బట్టువడి దురవగాహంబు లయినకామక్రోధలోభమోహమదమత్స
రంబులనుపాశంబులం గట్టువడి విడివడ సమర్థుండు గాక ప్రాణంబు
లకంటె మధురాయమాణయయినతృష్ణకు లోనయి భృత్యతస్కరవ
ణిక్కర్మంబులఁ బ్రాణహాని యయిన నంగీకరించి పరార్థంబుల నర్థిం
చుచు రహస్యసంభోగచాతుర్యసౌందర్యవిశేషంబుల ధైర్యవల్లికాలవి
త్రంబులయినకళత్రంబులను, మహనీయమంజులమధురాలాపంబులు గ
లిగి వశు లైన శిశువులను, శీలవయోరూపధన్య లగుకన్యలను, వినయ
వివేకవిద్యాలంకారు లైనకుమారులను, గామితఫలప్రదాత లగుభ్రా
తలను, మమత్వప్రేమదైన్యజనకు లగుజననీజనకులను, సకలసౌజన్య
సింధువు లయినబంధువులను, ధనకనకవస్తువాహనసుందరంబు లయిన
మందిరంబులను, సుకరంబు లయినపశుభృత్యనికరంబులను, వంశపరం
పరాయత్తంబు లయినవిత్తంబులను వర్జింపలేక సంసారంబు నిర్జింప
నుపాయంబు గానక, తంతువర్గంబున నిర్గమద్వారశూన్యం బయిన
మందిరంబుఁ జేరి చిక్కువడి వెడలెడిపాటవంబు చాలక తగులువడు
కీటకంబుచందంబున, గృహస్థుండు స్వయంకృత కర్మబద్ధుం డయి
శిశ్నోదరాదికృత్యంబులఁ బ్రమత్తుం డయి నిజకుటుంబపోషణపారవ
శ్యంబున విరక్తిమార్గంబు దెలియ నేరక స్వకీయపరకీయ భిన్నభావం
బున నంధకారంబునం బ్రవేశించుఁ గావునఁ గౌమారసమయంబున
నాయుర్వ్యయంబు సేయం దగదు- హరిభజనంబున మోక్షంబుసి
ద్ధించు- విష్ణుండుసర్వభూతంబులకు నాత్మేశ్వరుండు, ప్రియుండు; ము
ముక్షుండగుదేహికి దేహావసానపర్యంతంబు నారాయణచరణారవిం
దసేవనంబు కర్తవ్యంబు అనిమఱియు ననేకతత్త్వ రహస్యంబు
లుపదేశించెను.

ఔరా! యస్మదాదుల ప్రవర్తనం బంతయు నచ్చునఁబోడిచి
నట్లీచిన్నికుమారుఁడే ప్రకారము చెప్పఁ గలిగెనో! తెల్లవాఱి మేలు
కొన్నది మొదలు మరలమయిమఱచి నిదురించువఱకును మనప్రవర్త
నం బంతయుఁ బయిని ప్రహ్లాదకుమారుఁ డుగ్గడించిన విధముగానే

గాని వేఱు వేఱుగునఁ గాన రాకున్నది గదా! మన మింకను నీలాగున నే యుపేక్షించి యుంటిమేని “ మేలుకొన్నది మొదలు నిదురించువఱకు” ననుమాట, పుట్టినది మొదలు గిట్టువఱకు ననుమాట కుపలక్షణముగా నేర్పడిపోవును జుండీ.

“క్షణంవిత్తంక్షణంచిత్త” మనిమనీషులు భాషింతురుగావున, నిప్పు డుదయించినబుద్ధి యుత్తరక్షణమున నేమి గాఁగలదో! పయిని వివరించినవిధముగా మనయందుఁ గలిగినలోపములనుగుఱించి యొక్కమాఱి యీశ్వరప్రార్థనమును జేసికొని యనంతరము వక్తవ్యాంశ ముపక్రమించెదను.

మ॥ కలువల్ దామరపూవులున్ మడుఁగులోఁ గన్గొంచు బాలుండు లోఁ గల లోఁ తెంచక వాని కందు దిగి మున్కల్ వేయుచం దంబునన్। బలుసంసారమునందు భోగపరతన్। మగ్నుండ నై మోహావల్లులఁ దొల్రంటిని నుద్ధరింపవె కృపాళూ! భక్తచింతామణీ॥

శా॥ పిన్నం గారడివాఁడు వింతగ మహావేణ్వగ్ర మెక్కించులా। గన్నన్ మానవజన్మ ముత్తమము నన్నెత్తించినా వజ్జు! నన్నన్నా! హానికరంబు సుమ్మిది మహాత్మా! కాచి యెట్లుండెదో। నిన్నే నమ్మిక యున్నవాఁడఁ జుమితంద్రీ! భక్తచింతామణీ॥

మ॥ వనమం దాకులు గాలిచేత బలె విశ్వంబందు జంతూత్కరం బనఘా! మృత్యువు జేత రాల్పఁబడి మన్నైపోయెడున్; మోక్షసాధన మీమేను వృథా నశించు నని సంతాపించెదన్; వేగమీ తను వెత్తించినమే లొసంగు పరమాత్మా! భక్తచింతామణీ॥

సుహృదులారా! యింతదాఁక మనయాయుష్యాదులయశాశ్వతత్వముగుఱించియు నీశ్వరజ్ఞానహీనులబుద్ధిజాడ్యమునుగుఱించియు నించుక ముచ్చటించితిమి గావున, నిఁకమీఁదట మనము మానవుల మనిపించుకొనుటకు నాచరింపవలసినపరమప్రయోజన మేదో దానింగూర్చి మాటలాడుదము.

ఈవఱలో వివరించినస్థావరాదిపశుపర్యంతముగల నైయితరగతులభూతములను వానిలో నవి తెలివినిబట్టి కొంచాకతారతమ్యము గలవియే యయినను మొత్తముమీఁద నివి యన్నియు వివేకశూన్యములే గనుక, వానికంటెపయితరగతిలోనివాఁ డయి వివేకసంపన్నుఁ

డయినమనుష్యుఁడు సర్వజంతు సామాన్యము లయినకుక్షింభరిత్వాది తుచ్ఛసుఖములలోఁదృప్తినొందక నిరుపమానము నిష్కలంకమునగు శాశ్వతానందమును సంపాదించుకొనుటకు సర్వవిధములఁ బ్రయత్నము సేయవలయును గానియిప్పటియైశ్వర్యాదులను జూచుకొ[illegible]మ్ముకొనియొడలు మఱచియుండరాదు.

మ॥ తరుశాఖాగ్రమునందుఁ బెంటిగమితోఁ దాంపత్యసౌఖ్యం
బుతత్పరతంబొందుచుఁ గ్రింద బోయఁ డనుకంపాశూన్యుఁ డైవింటఁ
దీవరపుంఖా పరివోయుటల్ గననిగువ్వల్ సువ్వెకాలుండు నిష్కరు
ణుండౌట దలంప కెప్పు డిహభోగం బెంచు నుచ్చస్థితుల్॥

చూడుఁడు మనకన్నులముందఱఁబాఠశాలలోఁ జదువుకొనునొకపిల్లవాఁడు విద్యార్థిదశలోనున్నప్పుడేలాగు నడచుకొనుచున్నాఁడు? వాఁడేయదృష్టవశమున నొకానొకయున్నతపదమున నుద్యోగమునొందియున్నప్పుడేచొప్పునఁ బ్రవర్తించుచున్నాఁడు? చదువుకొనుదినములలో వానకిఁ గలస్వేచ్ఛ, యధికారపదమున నున్నప్పుడు గానరాకున్నది గదా! ఈయంశమునకంతగ నాలోచింప వలసిన దేమి? నేలమీఁద వానివలె మ్రానిమీఁదిమానవుఁడు నిర్భయముగాఁ బ్రవర్తింపఁగలఁడా; తా నెంతయున్నతస్థానమందున్న నంతయసిధారావ్రతముగా సంచరింపవలెను- లేనిచో దానివలనఁ గలుగుసిలుగులు నంతయెక్కుడుగానే యుండునని తేటపడుచున్నది. దీనింబట్టి చూడఁగా నీమానవజన్మము మిక్కిలియుపాయకర మైనదిగాఁగూడఁ గానవచ్చుచున్నది.

అయిన నేమి? ఈలోకములో భూపాలు రనుగ్రహించి తమకిచ్చినమహోన్నతాధికారపదంబుల నుండి క్రిందుమీఁదుఁ దెలియక ప్రజాక్షోభము గలిగించి వారియొద్ద నన్యాయముగా లంచములు పట్టి చెడ్డనడతలునడచినవారికే కారాగృహవాసము గలుగుచున్నది గాని, చక్కనివర్తనమున ముక్కునకు సూటిగాఁ బోవువారి కేహాని గాని గలుగుచున్నదా?

పైగ నట్టిసత్ప్రవర్తన గలవారు వారివారివార్ధకమునందు మహారాజులవలెఁ గాలిమీఁదఁ గా లిడుకొనికూరుచుండి వందలకొలంది వేలకొలఁది యుపకారవేతనములఁ గూడ హాయిగా ననుభవించుచు నున్నవారు మనకుఁ గలుగఁబోవుకీడులు మనదుష్ప్రవర్తనను బట్టి

యుండుదును గాని కేవలము మనుష్యజన్మమును బురస్కరించుకొని యుండఁబోవు. ఈజన్మమున మన మీశ్వరశాసనము మీఱక భూతదయ, సత్యము, శౌచము మొదలుగాఁగలయుత్తమగుణముల నవలంబించినవార మైయాపరాత్పరునిఁ బ్రత్యక్షముగాఁ జూడలేకున్నను, భావనచేత సర్వపదార్థములయందు నాయన యాభిముఖ్యమును సందర్శించుచుఁ గలనయినఁ బాపకార్యములను బాపపుఁదలంపులను హృదయమునఁ జేరనీక యీదినములు నాలుగు నేలాగో జాగరూకతతో వెళ్ళఁబుచ్చుకొని బయటఁ బడితిమా, యిఁక నేభయమును నెన్నఁటికిని లేక పరలోకమందు శాశ్వతానందముఁ బొందఁగాంతుము. మనుష్యమాత్రులగు ధాత్రీపతులే తమయాజ్ఞకు లోఁబడి న్యాయముగా నడుచుకొన్నతమసేవకులకుఁ గొంతకాలము తరువాత వారుజీవించియున్నంతకాలము పనిపాటు లక్కఱలేకుండ నిరభ్యంతరముగా సుఖజీవనమును బ్రసాదించుచుండఁ, గరుణాసముద్రుఁ డగుసర్వజగత్ప్రభువు నిష్కళంకులయిన తననమ్మికసేవకులకు దేహయాత్రానంతరమున శాశ్వతానందమును బ్రసాదించు ననుట కేమిసందేహము? అయ్యో! యిప్పుడుమాత్రమా మహాప్రభువు మన కేమితక్కువచేసెను? సర్వథా మనకు సుఖమేకలుగఁ జేసియున్నాఁడు- దుఃఖము నవివేకమువలన మనము దెచ్చిపెట్టుకొనుచున్నాము. ఆసర్వేశ్వరుఁడు మనకు దయచేసిన సర్వసాధనములును సముచితముగా నుపయోగించుకొనఁ జాలితిమేని దుఃఖ మన్నది యేపగిదినుండునో దానిజాడ యయిన మనకుఁగానవచ్చునా? మీమనంబుల ధీరత్వంబు పాడుకొలుపుఁడు- మనముతప్పులేకుండ నీపాపపులోకమున జీవింపఁగలమా యనియూరక యధైర్యపడి వెనుకదీయఁకుఁడు. తానుసృజియించిన పదార్థములశక్తియుక్తులాసర్వాంతర్యామికిఁ దెలియరానివి కావు.మనచుట్టును నుండునిచ్ఛాకర్షకవిషయములప్రబలత్వము, మనదుర్బలత్వము నాసర్వజ్ఞుఁడు లెస్సగ నెఱింగి యున్నాఁడు.

ఓయన్నలారా! తిన్ననినడతకయి మన మెన్నెన్నియో యోచింపవలసినయవసర మిసుమంతయు లేదుసుండీ. త్రికరణశుద్ధిగా నొక్కపనిమాత్రము మనము చేయఁ గలిగితిమా యామీఁదఁ దప్పులకు మనకు నెంతదూరము? ఆయొక్కపని యయినను మనకు శ్రమకరముగా

నుండఁ బోవు నని యోచింతు రేమో. ఎంతమాత్రము నది యాలాటిది
కాదు. మిక్కిలిసుకర మయినదే. అదియేదందురా? వఱియేఁడియును
గాదు. సదామనహృదయ మాసదయునిపదములపయిఁ బడిలపఱుచు
టయే. ఇదియే దైవభక్తి యనుమాటకు నిజమైనయర్థముసుండీ- ఇది
నామాటగా మీరు భావింపవలదు. ఏతద్విషయమున షణ్మతస్థాపకులు,
నద్వైతమతోద్ధారకులు, జగద్గురువులు నగుశ్రీమచ్ఛంకరభగవత్పా
దులవారు తమరచియించినశివానందలహరియం దీలాగున నిర్వచిం
చుచున్నారు.

శ్లో॥ అంకోలం నిజబీజసంతతి రయస్కాంతోపలం సూచికా
సాధ్వీ నైజవిభుం లతాక్షితిరుహం సింధుస్సరిద్వల్లభం। ప్రాప్నోతీహ
యథా తథా పశుపతేః పాదారవిందద్వయం। చేతోవృత్తి రుపేత్య
తిష్ఠతి సదా సాభక్తి రిత్యుచ్యతే॥

ఊడుగుఁజెట్టును దానిగింజలును; ఝుంబకమునుసూదియును,
పతివ్రత. తనపెనిమిటిని, నదిసముద్రమును బొందుచందమున సదా
యీశ్వరునిపాదారవిందయుగళమును బొంది మనస్సుండుటయే భక్తి
యనఁబడు నని శ్లోకతాత్పర్యము.

ఈభక్తి యన్నది మనము తెచ్చి పెట్టుకొనిన వచ్చునది గాదు
అది సహజముగా నుదయింపవలెను. అందుకుఁ గారణము భగవం
తుఁడే. చూడుఁడు. పైయుపమానములయం దీయర్థమే తోఁచుచు
న్నది. ఆహా! యిదియెంతవింత! ఉఱు ముఱిమినప్పుడు తొలకరివేళ
నూడుగుగింజలు భూమిమీఁద రాలియున్న విఱివ్వఱివ్వనఁ దుమ్మెదల
వలె నెగసియే చెట్టువి యాచెట్టు మొదల నంటుకొనుచున్నవి, ఆలా
గుననే కర్మపరిపాక మగునప్పటికి మనమనస్సులు బరమజనకుఁ డగు
నీశ్వరుని పాదారవిందములను దగులుకొని యెన్నఁటికిని నెడబాయ
వు. పయిని జెప్పినయూడుగుసామ్యము, తద్వృక్షమును బ్రత్యక్ష
ముగాఁ జూడనివారికి నస్వభావముగాఁ దోఁచవచ్చును. అయిన నట్టి
వారలయనుమానమును దీర్చుటకు నెక్కడనో గాక మనపురమునకు
సమీపముననే ధవళేశ్వరమునొద్ద రాచబాటకుఁ బ్రక్క నొకచెట్టు
గను పెట్టుకొనియున్నది-జడము లైనయాగింజలు తద్వృక్షమునేలాగు
ననంటుకొనఁగలిగినవి? దైవయోగమే దానికి మూలము. అందుచేతనే

భక్తాగ్రేసరుఁ డయినప్రహ్లాదుఁడుకూడ నీచొప్పునఁ జెప్పుచున్నాఁడు.

తే॥గీ॥ ఇను మయసాంతసన్నిధి నెట్లుభ్రాంత। మగుహృషీకేశుసన్నిధి నావిధమునఁ। గరఁగుచున్నది దైవయోగమునఁజేసి। బ్రాహ్మణోత్తమ! చిత్తంబుభ్రాంత మగుచు॥

పై శ్లోకములోని తర్కానయుపమానములకుఁ గూడ బుద్ధిమంతులు భావమును సవిమర్శముగాఁ బరికించుకొనునది.

మిత్రులారా! మనకు నాలాటిభక్తి లేనియెడల మన మెంక నెన్ని చేసినను నిరర్థకములే "బత్తి లేనిపూజ పత్తిరిచేట"న్నలోకోక్తి నాలకింపమా? ఇట్లు కేవలములోకోక్తిమాత్రమేకాదు,

శ్లో॥ గభీరేకాసారే విశతి విజనే ఘోరవిపినే। విశాలేశైలే చ భ్రమతి కుసుమార్థంజడమతిః। సమర్ప్యైకంచేత స్సరసిజముమానాథ! భవ తే। సుఖేనా వస్థాతుంజనఇహ నజానాతి కిమహో॥

ఓయీశ్వరా! బుద్ధిహీనుఁ డైనయీమానవుఁడు పువ్వులకొఱకు లోఁతయినచెఱువులలో దిగుచున్నాఁడు. భయంకరమయినవిర్జనారణ్యములోఁ జొరఁబడుచున్నాఁడు. విరివి యయినపర్వతము మీఁదఁ దిరుగుచున్నాఁడు. అయ్యో! యిన్నిపాట్లు పడుచున్నాఁడుగాని, తన యొద్దనే సదా యుండెడుతనహృదయకమలమును నీకు సమర్పించి సుఖముగా నుండ లేకున్నాఁడే యని, సాక్షాదీశ్వరావతారు లయిన శ్రీమచ్ఛంకరాచార్యులవారుగూడ సెల విచ్చుచున్నారు. మనుష్యమాత్రులు బాహ్యదృష్టిగలవారు గనుకఁ, దమ్మునితరులు చేసెడుముఖస్తుతులకు నొకవేళ నుబ్బిన నుబ్బవచ్చునుగాని, హృదయజ్ఞుఁ డయిన సర్వజ్ఞునియొద్ద మనమాయలు, మర్మములు సాగనేర్చునా? ఆయన మనమనస్సును జూచునుగాని క్రియల నెంతమాత్రము పాటిసేయఁడు. అందుచేత నేఒకవేళఁ గ్రియలలో మన మాయనయెడల నపచారముచేసినను మనసునమాత్రము మాలిన్యములేక యుంటిమేని యాయపచారములను సయితము నుపచారములనుగా నంగీకరించును. ఇందుకుఁ దార్ఘాణగాఁ। జిన్నకథగల దాలకింపుఁడు.

కాళహస్తి యనుపుణ్యక్షేత్రమున శ్రీకాళహస్తీశ్వరనామకమగుసుప్రసిద్ధలింగ మొకటి గలదు- ఆలింగమునందుఁ, గన్నఁ డని యెన్నిక కెక్కినబోయవాఁడొక్కఁ డెక్కుడుగా భక్తిగలవాఁడయి

యనుదినము నుదయముననే లేచినోటిలో నిండ నీళ్ళు పోసికొనివా
నింబుక్కిటం బట్టి, యొకచేతితోఁ బత్తిరియును, రెండవచేతితో, నావ
ఱలోఁ దాను రుచ్యముగానున్నదో లేదోయని కొంచెము గొఱికి తిని
చూచిన మాంసమును బుచ్చుకొని, వేవేగఁ గాళ్ళకు నాకుఁ జెప్పులఁ
దొడుగుకొని శీఘ్రముగా శ్రీకాళహస్తీశ్వరునిగర్భాలయములోనికిఁ
బోయి, యాలింగముమీఁద నున్నతొలినాఁటినిర్మాల్యమును దనచెప్పుఁ
గాలితోఁ దొలఁగఁద్రోచి, తోడనేతనపుక్కిటఁ బట్టి యుంచినమంచి
నీళ్ళ నాలింగముమీఁదనుమిసి, యావెనుక నెడమచేతిలోనిపత్తిరి నెత్తి
మీఁదవయిచి కుడిచేతిలోనిమాంసభారమును నివేదించి పోవుచుండు
ననియు వానిని భక్తావతంసునిఁగాఁ గైకొనిపార్వతీపతి వానికిఁ గైవ
ల్య మిచ్చెననియు శ్రీకాళహస్తి మాహాత్మ్యమునఁ జెప్పఁబడి యున్న
ది. ఈగాథ మనసున నుంచుకొనియే శ్రీమదాచార్యస్వాములవారు
శివానందలహరియందు భక్తిమహిమ నిట్లువిధమున వర్ణించుచున్నారు.

శ్లో॥ మార్గావర్తితపాదుకా పశుపతే రంగస్యకూర్చాయతే।
గండూషాంబు నిషేవణం పురరిపోః పీయూష ధారాయతే। కించి
ద్భక్షితమాంస శేషకబళందివ్యోపహారాయతే। భక్తిః కిం నకరోత్య
హోవనచరో భక్తావతంసాయతే॥

మార్గమందు సంచరించెడుపాదరక్ష పశుపతిశరీరమునకు
నిర్మాల్యసమ్మార్జనము సేయుకుంచె గాను, బుక్కిటినీటియభిషేకసేవ
పురారికి నమృతధార గాను, గొంచెము దినఁబడినయెంగిలిమాంసము
కాత్యాయనీధవునకు దివ్యోపాయనము గాను, మృగప్రాయుఁ డయిన
బోయవాఁడు మృడునకుఁ పరమభక్తుఁడుగానునగుచున్నారు. ఓహో!
భక్తి దేనిని గావింపఁజాలదు? అని శ్లోకతాత్పర్యము.

సఖులారా! భక్తిలేనివాఁడు పసిఁడికలశములతో బన్నీట నభిషే
కించినను భక్తి గలిగిన యాబోయవానిగండూషతోయాభిషేచనమున
కు సంతసించినట్లు ఈశ్వరుఁడు సంతోషింపఁడు. ఇందు కేమిసందేహము.
ఈశ్వరుఁడు-నిత్యతృప్తుఁడుఆయనకు మనవలనఁ గావలసినదేమి? మనమే
మిచేసినను మనభక్తి నగపఱుచుకొనుటకేగాని యీశ్వరునికొఱకుల

సృజించిన శిలాదులతోఁ దదాలయము నిర్మించుచున్నాము. ఆయన కలిగించిన పుష్పములతోఁ దత్పూజనము చేయుచున్నాము. ఆయన పుట్టించినయుదకములతోఁ దదభిషేచనము సేయుచున్నాము. మఱియుఁ దద్విషయమున మన మేమే యుపచారము చేసినను దత్సృష్టములైన పదార్థములతోడను దదనుగ్రహదత్తములైనయవయవాదులతోడను జేయుచున్నాము.అంతేగాని తత్స్వామ్యము లేనిదానితో నామహానుభావునకు మన మేమియుఁ జేయుట లేదు- అట్లు చేయుచున్నామని తలంచు వా రెవ్వ రేనియున్న వారిని వెఱ్ఱివారినిగాఁ దలంపవలెను. భక్తిలేక పెట్టరు, పగలేక తిట్టరనులోకోక్తినిబట్టి సాధారణముగాఁ బ్రజలు, పూజలు మొదలగునవి చేయువారిని జూచి, యొకానొకప్పుడు దాంభికులను సయితము భక్తులనుగా నెంచుకొందురు గాని యీశ్వరుఁ డాలాగునఁ దలంచుకోఁడు. కాఁబట్టి యాయన ప్రతిదినమును దుదకుఁ బ్రతినిమిషమును మనకుఁ జేయు నసంఖ్యమహోపకారములను స్మరించుకొని, తద్విషయమున మన మెంతధనము వినియోగించినను, నెంత దేహాయాసము పొందినను నది యొకపెద్దగాఁ దలంచుకొనక గర్వ ముడిగియయ్యో? నారక్షకుఁడు నాకుఁ జేసిడును పకారములతో నేనాయనవిషయమునఁ జేసినది పోల్చిచూడఁగాఁ బర్వమునొద్దఁ బరమాణువుగ నయిన నుండలేదే యని నిజముగా ననుతపమును వ్యసనపడుచుఁ దత్ప్రీతికొఱకుమనకుఁ కలిగిన దేదియును దాఁచక యుత్సాహముతోనీయవలయును.

అట్టి యీవులకే పరాత్పరుండు పరితోషించును అట్టివానియందే యెట్టిలోపములు గలిగిననాయనసయిరణ సేయును కాఁబట్టి నిష్కపట మయినయంతరంగమువలెనీశ్వరుని సంతోషపెట్టున దేదియు లేదని యెఱింగి తాదృశహృదయము నాయనకర్పించుటయే సర్వశ్రేయము. అది యర్పించినవాఁ డన్ని ధనములు నర్పించినవాఁడే అన్ని పున్నెములు జేసినవాఁడే. ఏ తేవంకకుఁ బోయినదానిలోనివన్నియు నావంకకే పోవునట్లు మనహృదయమీశ్వరునితట్టు దిరిగినమనవన్న వన్నియు నప్రయత్నముగా నాయనవయిపునకే పరుగువాఱును-ఈర

ష్టమార్గంబునం బ్రవర్తిల్లుదము- ఐహికసుఖవాంఛలను వదలుకొని నిస్సంగు లయి కేవలవైరాగ్యముతో వానప్రస్థు లయి యుండుఋషులకుఁగాక, సంసారుల మయి దారపుత్రాదిబంధములందగులుకొని యున్న మనబోంట్లకు దైవభక్తి యెట్లు కుదురుకొనునని శంక నొందకుఁడు. పూర్వపుణ్యా మున్నవాఁ డీసంసారములో నున్నను లేనియట్లే సంచరించును. కుమ్మరపురుగు బురదలో దూఱినను దానిదేహమున కా యస లంటుచున్నదా? చూడుఁడు. ప్రహ్లాదునిచర్యలనుగుఱించి శుకయోగీంద్రుఁడేమనుచున్నాఁడో.

శా॥ పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్ భాషించుచున్ హాసలీలానిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత శ్రీనారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదసం।ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా॥

కాఁబట్టి యీసంసారములో నుండియే మన మీశ్వరునందు భక్తి సలుపవచ్చును. భక్తియనుమాటకుఁ బ్రేమ యని యర్థము. ఆప్రేమ పూజ్యులయెడలఁ బొడమినప్పుడు దానిని భక్తియనుచున్నారు. అంతకంటె దానియందుఁగలవిశేష మేమియును లేదు. ఇట్లనుటచేతఁ బ్రేమయందు మీరు నైచ్య మున్న దని భావింతు రేమో. ప్రేమతో సమాన మయిన దీలోకములో నేదియును లేదు. దానికంటె బలవత్తర మయినది గూడ వేఱొకటి మనకుఁ గానరాదు, దేని కయినను లోఁకువ గానివాఁడు గలఁడు గాని ప్రేమకు లోఁబడనివాఁడు మాత్ర మెచ్చోటను గానిపింపఁడు. తృణప్రాయు లయినమనుష్యులమాటయటుండనిండు. సర్వజగత్తులకుఁ గర్త యైనయీశ్వరుఁడు గూడఁ బ్రేమబద్ధుఁ డయి తనకు సేవ సేయువానికి లో నయి తిరుగుచున్నాఁడు. ఈచిన్నశ్లోకము నాలకింపుఁడు.

శ్లో॥ మహాదేవ మహాదేవ మహాదేవేతివాదినః। వత్సం గౌరివ గౌరీశో ధావంత మనుధావతి॥

తనదూడ యేదారిని బారిన నావుగూడ నాదారిని బాఱునట్లు మహాదేవ! మహాదేవ! మహాదేవ! యనితన్నుస్మరియించు భక్తుఁ డెందుఁ బోయిన నీశ్వరుఁడును వాని ననుసరించు నని శ్లోకతాత్పర్యము. చూచితిరా యెంతటియాశ్చర్యమో! సర్వభువన ప్రభు వగునీశ్వ

ఱుఁ డెక్కడ? ఆయననామమును స్మరించునీమనుష్యమాత్రు డెక్కడు.
అంతవాని నింతవానికి లోఁబఱిచినది ప్రేమయేగదా! నీరు నిమ్నోన్న
తములను గానరా నీనిలాగునఁ ప్రేమ హెచ్చు తగ్గులను విచారింప నీయ
దు. దానికిగుణదోషములు గూడ సమానములే. ఇన్ని చెప్ప నేల? ప్రే
యందే సర్వజగమును నిలిచి యున్నది. అది లేనియడల నీసృష్టియే
నశించిపోవును. పిపీలికాదిబ్రహ్మపర్యంతము దానిరాజ్యమే చెల్లుచున్న
ది. అదిలేనిది చీమ గాని సామజము గాని గానరాదు.

ప్రేమచేతనే పక్షులు తమముక్కులలో మేతను గఱచి తెచ్చి
గూడులలోఁ నున్నతమపిల్లలకుఁ బెట్టి పోషించుచున్నవి. క్రూరస్వభా
వము గలపులిసయితము ప్రేమకు లోఁబడియే తనపిల్లలను బాలిచ్చి
పెంచుచున్నది. వానియన్నిటిమాట యటుండనిచ్చి మనలను బెంచిపెద్ద
వారినిజేసినమాతృదేవతలనుగుఱించి విచారింపుఁడు. ఒకబిడ్డనిమిత్త
మొకతల్లి యనుభవించినశ్రమము, రోఁత, పరితాపము మొదలుగాఁ
గలవిమొట్టమొదటనుండియు మనము జాగ్రత్తతోఁబరిశీలించి చూచి
తిమా హృదయము కరఁగి నీరయిపోవును గదా! అంతేసియేవపుఁ
బనులు మొదలగువానికి వారిని లోఁబఱిచియాలాటిసహనము వారికిఁ
గలిగించినది ప్రేమగాక మఱియేమి? భూవ్యాకాశములను గాగిత
ముగను, సముద్రమునుసిరాబుడ్డిగను జేసి లోకములోఁ వ్రాయసకాం
డ్రందఱును జేరి వ్రాయబూనినను ప్రేమయందలిమహిమలను చెలు
వుడు సేయుటకు సాధనసామగ్రితక్కువగు నని నే నూహించుచు
న్నాను. ఇట్టిచో నల్పబుద్ధి నగునేను దానినిగూర్చి యేమివిశేషముగ
వివరింపఁగలను? అదియటుండనిండు. తాదృశమహిమాతిశయము
గలప్రేమ యనునది మనయం దున్నదా? లేదా? లే దని పశువైనను
జెప్పలేదే! మనుష్యులము మన మెట్లుచెప్పఁ గల్గుము! మఱియునాప్రే
మ తక్కినవానియందున్నదానికంటె మనయం దధికముగా నున్న
దని యుత్తర మీయవలసివచ్చును. ఱెక్కలువచ్చి మేఁతపట్టినతోడనే
పిట్టలు తమపిల్లలను విడిచిపెట్టుచున్నవి. ఆపిల్లలును దమతల్లులయె
డల నప్పుడు తొంటిప్రేమమునగపఱుప కున్నవి. తిర్యగ్జంతువులయం
దెల్ల నీలాగే గానవచ్చుచున్న ది. మనుష్యుల మయినమన మావిధ

వారు వీరు జీవించి యున్నంతకాలము దృఢముగానుండుటయే గాక వారిలో నొకరు పోయి మఱియొకరు జీవించి యున్ననుగూడ విడిపోక యున్నది.

ఓసోదరులారా! ఇక్కడనే యొక్కసంగతి మిక్కిలిశ్రద్ధతో మనము విచారింపవలెను.మనకును మనతల్లిదండ్రులకును బ్రేమానుబంధము దేహధారణమును బట్టిగదా సంభవించుచున్నది. ఈదేహములనిత్యములుగావున నయ్యనుబంధము స్థిరము గాక పలుమాఱు దెగిపోవు చుండును. అయినను బశుపక్ష్యాదులయందుఁబోలెఁగాక మనయందది యంతకంటె నెన్నోమడుఁగులు దృఢముగా నుండు నని యీవఱకే దెలిసికొనియున్నాము. అట్టిదార్ఢ్యము మనయందు దానికిఁగలుగుట కేమికారణము? ఇందుకుఁ బ్రత్యుత్తరము జ్ఞానమని చెప్పక తప్పదు గదా!అజ్ఞానము మనకు నేలాగునఁ గలుగుచున్నది?ఈశ్వరానుగ్రహమునఁ దక్క వేఱొకట్టఁ గలుగనేరదు, ఈసమస్తభూతములను సృజించి వానివానికిఁ దగిన తెలువులను బ్రసాదించిన వాఁడీశ్వరుఁడు గాక మఱియెవఁడు? మఱియుఁ దనసృష్టవర్గములోఁ జీమ నైన పరాకు పడక ఱాతిలో నిమిడియున్న కప్పవఱకుఁ గూడఁ దత్తదనుకూలము లగునయన్నపానాదికము లనుదినమును బ్రసాదించుచున్న వాఁడీశ్వరుఁడు గాక మఱియెవఁడు? మనసుఖముకొఱకుఁ గాలాద్యనుసారముగా సకలవిధము లైనమార్పులను జేయుచుఁ గంటికి ఱెప్పవలె నిద్రావస్థయందుఁ గూడ మనకు సంరక్షకుఁ డగువాఁ డీశ్వరుడు గాక మఱియెవఁడు? మానుషమునం దీర్పరాని పేరాపదలు సంప్రాప్తమగునప్పుడు వానివేదనలకు సైఁపలేక మొఱ్ఱోయని విలపించు నాపన్నులకు దుఃఖోపశమనము గావించు పరమకారుణికుఁ డీశ్వరుఁడు గాకమఱియెవఁడు? ఈలాగు మనము నిశ్చలభావముతోఁ నీశ్వరస్వభావాదికము విమర్శింపఁ బూనితిమేని యాయనకు మనకును గలసంబంధ మెంతమందమతి కయినను గరతలామలకము గాకపోవునా? అయినచో నప్పరమజనకునిఁ బ్రేమించుట కేలబుద్ధిపొడమకుండును? అట్లుపొడమకుండుట మనుష్యస్వభావమునకుఁ గేవలవిపరీతమే గదా! మన మాయనను బ్రేమింపక యెట్లు మానఁగలము? దారపుత్త్రాదులను

ము తెలియుటచేతనే మన కాలాంతరసము స్వయముగా నావిర్భవిం
చుచున్నది. కృషికుడు దోహదముమాత్రమే చేయవలెను; ఫలరూప
ము తనకు దానయేర్పడగలదు ఈశ్వరునిగురించి మనము విచారించి
నం జాలు ; భక్తి తనంతనే సహస్రముఖముల గంగాప్రవాహమువ
లె నుద్భూతమగును. అట్టిభక్తి యుద్భవించినప్పుడే ఈశ్వర ప్రీతికరము
లైనకార్యములు చేయుటయు నాయనకు గిట్టనిపనులు దలఁపునకైన
రానీక పోవుటయుఁ దటస్థించును. సాజముగాఁ బ్రేమాస్పదు లయి
నతల్లితండ్రులకైనయినను వారి నెఱుఁగనప్పు డెవ్వరుఁ బ్రేమింపఁ జాల
రు. ఇంతయేల తాను దూరమం దున్నప్పుడు తనకు నొకపుత్రుడు గ్రొ
త్తగా నుదయించినను, ముం దున్నచిన్నవాఁ డొకఁడు మడిసినను ద
త్తత్సమాచారము దెలిసి వచ్చినప్పుడే తనకు మోదఖేదములు
పుట్టుచున్నవి తెలియనప్పుడు మోదము లేదు. ఖేదము లేదు.

కాఁబట్టి యోసుహృద్వరులారా! ఈశ్వరునకును మనకును గల
సంబంధము మన మిప్పుడు విమర్శించుకొనుచున్నాము గనుక నియ్యా
దనున నడకువతో నాపరమపితయడుగులకడకుఁ బోయి యీలాగున
మనలోఁ బ్రార్థించుకొందము.

ఓసర్వలోకజనక! ఓపరమేశ్వర! ఓదీనశరణ్యా! ఓకరుణాసముద్ర!

మ॥ జననీగర్భములోన నుండఁగ విదేశం [illegible] బేగి పెకేఁండ్ల
కుం|జను దేఁ చంద్రిని గాంచుబిడ్డవలె నీసంబంధముల్ [illegible] ముందునేఁ గన
కీవేళ నెఱింగి స్నేహభయశంకాముక్తి పాశ్చర్య[illegible]। జనమై నిల్చితిఁ
జేరఁ దీసికొనవే సద్భక్తచింతామణీ॥

మరియు నేతద్విచారణావశమున మనమనోక్షేత్రములయందు
నిప్పు డుప్పతిల్లినభక్తిరూపము లగుచిఱుజాళ్ళు [illegible] గ్రమ్మఱ భీకరావివే
కనిదాఘమ్మున నింకిపోక, పొరింబొరి విరివి యగు[illegible] ప్రవహించి సర్వా
ధారుఁ డయినతనయందు లీన మగునట్లు కరుణాసముద్రుం డగుపర
మేశ్వరుఁ డాత్మీయకృపారసాసారమును [illegible] సర్వదా ప్రసాదించుగాక
యని ప్రార్థించుచు నీయుపన్యాస మిప్పటివఱకు విరమించుచున్నాను.

---

సంపూర్ణము.

శ్రీ

మదభిజ్ఞాన

# శాకుంతల నాటకము.

---

ఇది

కాళిదాసకవికృత ప్రౌఢసంస్కృతనాటకమునుండి

రాజమహేంద్రవరమునందలి కొరతనవారి

మొదటితరగతిబోధనాభ్యాసనకలాశాలయందు

నాంధ్రోపాధ్యాయుఁడగు

**వద్దాది - సుబ్బారాయనిచే**

తెలిఁగింపఁ బడినది.

మొదటికూర్పు, 2000 ప్రతులు.

రాజమహేంద్రవరము :

యస్. వస్నేశ్వరరావు బ్రదర్సువారి

శ్రీ చింతామణీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.



1906.

# వసురాయ చాటుప్రబంధము

డెమ్మీసైజు గ్లేజు 304 పేజీలు. } క్యాలికో రు 2—0—0
రేపరు 1—8—0

ఉ. నన్నయతిక్కనాదిరసనల్ గురియించినచాటుధార లీ
మన్నన నింకఁ బోలు; నణుమాత్రముఁ దద్రస మబ్బ దెందు; హా!
జొన్నలలోనఁ జిన్నిపువుజొన్నటు, లట్టులు పద్దియంబులన్
మిన్నలు చాటువుల్, రససమృద్ధి ననిర్వచనీయమాధురిన్.

ప్రాస్తావికప్రకరణము; పద్యము. 2

క్రీ. 1926. ఇప్పటికి సుమా రొకయర్ధశతాబ్దమునుండి నేనప్పుడప్పుడు వివిధప్రస్తావముల రచించుచు వచ్చినట్టియు, సమకాలీనులైన పండితకవుల మెప్పును బొందినట్టియు, బహుజనులకుఁ గంఠస్థము లయినట్టియు, సహస్రాధికము లయినపద్యము లాకకోశమున భద్రపఱుపక పోయినయెడలఁ గాలము గడచినకొలఁది నవి వినాశము నొందునో, యేమవునో, యనుసందియమున నానాముఖములఁ జెల్లాచెదరుగ నున్నవాని నన్నిటిని గ్రమక్రమముగా సమకూర్చి వసురాయచాటుప్రబంధ మనునామమునఁ బ్రకటించితిని. మనువసుచరిత్రాది ప్రబంధములయందుఁ బోలె నిందు నాదినుండి యంతమువఱకు నేదేని పురాణగాథ గాని, కల్పితకథ గాని ప్రత్యేకము గానరాక పోయినను, విందునందు విస్తరిలోని వివిధరుచ్యపదార్థములవలె నిందలి చిన్నచిన్న ఖండకావ్యములు ప్రకృతివర్ణనములు, ప్రాస్తావికములు మొదలగునవి చదువువారి జిహ్వకు సంతుష్టిపఱుపఁ జాలియుండు నని తలంచెదను. తెలుఁగున నిట్టిగ్రంథ మిప్పటి కరుదు.

విషయసామ్యమునుబట్టి నాయీపద్యము లన్నిటి నైదుతరగతులుగా విభాగించి యాభాగములకు వరుసగాఁ బ్రశంసాప్రకరణము, ప్రకృతిప్రకరణము, ప్రాస్తావికప్రకరణము, ప్రకీర్ణప్రకరణము, స్వవిషయప్రకరణము, నని పేళ్ళుపెట్టితిని. ప్రకీర్ణప్రకరణములోని పద్యములు మాత్ర మన్నియు స్వకపోలకల్పితములు కావు. అందుఁ గొన్ని సంస్కృతమునుండి

తెలిఁగించినవి. ఆవివరణ మాపద్యముల శీర్షికల వలనఁ దెలియఁగలదు. సంస్కృతకవులలో సుప్రసిద్ధపండితరాయ బిరుదాంకితుఁడగు జగన్నాథ కవి విరచించిన భామినీవిలాస మను గ్రంథ మించుమించుగా దీనివంటిదే. దానిని నేను తెనిఁగించి 1902 వ సంవత్సరమున ముద్రింపించితిని. వివిధ విషయములను గూర్చి వేఱువేఱు తరుణముల రచియింపఁబడిన యాశ్లోకములనెల్ల నొకసంపుటమునఁ గూర్చుటను గూర్చిన తనమనోభావము తద్గ్రంథాంతిమశ్లోకమున నింతగా జగన్నాథకవి వ్యక్తీకరించినాఁడు. పాఠకవినోదార్థము తచ్ఛ్లోకార్థము దెలుపు తెలుఁగుపద్య మిట నుదాహరించెదను.

క॥ అంజలికొడుకులు హరియిం । పం జాతురు మామకీనపద్యమణు లటం
చుం జనియించినశంకన్ । మంజూషను దీనిఁ జేసినాఁడం జుండీ॥

మఱియుఁ దద్గ్రంథాంతమున నతఁడు రచించినయింకొక శ్లోకమునకుఁ దెలుఁగుపద్యము—

చ॥ నాకవితాకుమారి! వదనమ్మును వాంచకుమమ్మ! నిన్నుఁ బ
ల్గాకి నిరాకరించునని, క్రాఁగును వాఁ డటు లోర్వ లేమి ; నీ
కాకథ యేల? కావ్యకమలాంతరనీధుధునీమధువ్రతా
నీకము మోములం జెలఁగి నృత్యము నిత్యము నీ వొనర్పవే!

ఈచాటుప్రబంధమునం దితరవిషయవినోదములకంటెఁ బురాతనమును, బుణ్యతమక్షేత్రమును, లక్ష్మీసరస్వతీలాస్యరంగమును నయిన యీ గౌతమీతీర రాజమహేంద్రవరనగరరాజమునకు సంబంధించిన విశేషము లెక్కుడుగా నెక్కొని యున్నవి. ఏనాఁడో యొకటిరెండుపద్యములు శ్రీనాథాదు లీపట్టణమును గుఱించి వ్రాసినవి యిప్పుడు చదువుకొనుచు సంతసించెడు నాంధ్రుల కీకాలమునను, భావికాలమునను గూడఁ దత్పురీ విశేషము లనేకములు దెలుపునీచాటు ప్రబంధపద్యములు డెందముల కమందానందసంధాయకములు కాకపోవని నాయాశయము.

గ్రంథస్వభావ మవగత మగుటకు నావశ్యము లయినకొన్ని వాక్యము లిట నేను బొందుపఱిచితిని. దీనిగుణాగుణములను గుఱించి పండితులే ప్రమాణము.

వడ్డాది సుబ్బారాయఁడు
ఇన్నీసుపేట, రాజమండ్రి.

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమండ్రి—3847_1000_28.

# పీఠిక.

శ్రీమహాభారతమునందుఁ గౌరవపాండవుల వంశానుక్రమముఁ దెలుపు సందర్భమున
దుష్యంతుని చరిత్ర మాదిపర్వములో నిట్లు వ్రాయఁబడినది. దుష్యంతుఁ డొకనాఁడు
వేఁటకుఁ బోయి, కణ్వాశ్రమ మచ్చటికిఁ జేరువగుటచే నాఋషిని సందర్శింపవలయు
నని పోఁగా, ముని యాశ్రమమున లేనందునఁ దత్పుత్రిక యగు శకుంతల రాజున కాతిథ్య
మిచ్చి, తనతండ్రి వచ్చునంతకు నతని నుండుమని కోరెను. ఆమె సౌందర్యలావణ్యాదులను
జూచి యద్భుతపడి, యాశ్చర్యరసుఁడయి వనకన్యమహర్షి కీమె యెట్లు కూఁతురని శంకించు
కొని, యతఁడు శకుంతల నాసందేహ మడిగెను. విశ్వామిత్రుఁడు మంచుఁగొండపయిఁ
దపస్సు చేయుచుండఁగా, మేనక యామునీశ్వరునకు భంగముగా నచ్చటి కేతెంచి,
యామెవలనఁ దన్నుఁ గని, మాలినీనదీతీరమున విడిచి వెళ్ళినట్లును, పిమ్మట శిష్యులతోఁ
గణ్వమహర్షి తన్నదీప్రాంతమునకు వచ్చి, యచ్చటఁ దన్నుఁ జూచి యెత్తికొనిపోయి
పెంచినట్లును, ముని తనకుఁ దండ్రి యయిన యావృత్తాంతము, నాయన యొకనాఁ డొకఋషితోఁ
జెప్పుచుండఁగాఁ దా నాలకించి తెలిసికొన్నట్లును, శకుంతల రాజుతోఁ జెప్పెను.

అనంతరము పరస్పరానురాగము గలుగఁగా, దుష్యంతుఁడు దన్ను
గాంధర్వమునఁ బెండ్లియాడు మని శకుంతలను బ్రార్థించెను. తత్ప్రసాదమునఁ దనగర్భ
మున నుద్భవించు కుమారుని, యువరాజును జేయునట్లు రాజుచేత బాస గయికొని, శకుంతల
యాతని ప్రార్థన మంగీకరించెను. పిమ్మట రాజు సంపూర్ణమనోరథుఁడయి తనరాజధాని
యగు హస్తినాపురమునకుఁ బోఁగా, నిట శకుంతలయుఁ బుణ్యవశమునఁ దోడన గర్భ
వతి యాయెను. తనపుత్రిక మామునకు ముని యేమనునో యని వెఱచుచుండఁగా, నతఁడు నిజ
ప్రభావమువలన నంతయు నెఱింగి, శకుంతల వెఱపు మాపి, తద్గర్భరక్షణాదులు గావించు
చున్నంత, సంవత్సరత్రయమునకుఁ జక్రవర్తిలక్షణలక్షితుండగు భరతుఁ డనుకుమారుఁ
డామె కుదయించి, కణ్వనిర్వర్తితజాతకర్మాదికుండయి యాయాశ్రమమునఁ బెరుఁగు
చుండఁ, గొంతకాలమునకు మహర్షి తనశిష్యులఁ దోడిచ్చి యామెను గొడుకుతోఁ
గూడ భర్తయొద్దకుఁ బంపెను.

శకుంతలయుఁ దానును దక్క నవ్వివాహ మెవరికిఁ దెలిసినది కాదు
గావునఁ, బుత్రవతి నామెను గయికొనిన లోకులేమనుకొందురో యని సందేహించి,
దుష్యంతుఁడు నే నీమె నెఱుఁగనని శకుంతలను నిండుసభలో నిష్కారుణ్యముగా నిరాక
రించెను. అందుమీఁదట శకుంతల తనదురదృష్టమును గుఱించి పరిపరివిధములఁ బరిదేవనము
సేయుచుండఁగా, నాకాశవాణి యందులయాథార్థ్యము సభ్యులకెల్ల వెల్లడించెను.
అప్పుడు రాజు, మొట్టమొదట శకుంతలను దా నెఱుంగనని నిరాకరించుటకుఁ గలకార
ణమును బహిరంగపఱచి, సభ్యులయనుమతిని సంతుష్టిపూర్వకముగా నామెను బరిగ్రహించి,

యభీష్టభోగములను బరితృప్తుం డయి కాలాంతరమున దౌష్యంతికిఁ బట్టము గట్టి శకుంతలతోఁ దపోవనమునకుఁ బోయెను.

ఈ చిన్నకథను దృశ్యప్రబంధముగా నిర్మింపఁ గోరి, కవికిఁ గలస్వాతంత్ర్యమును బట్టి కాళిదాసుఁ డిందుఁ జెక్కుమార్పులు గావించినాఁడు.

వేఁటతమిని దా నొక జింకను దఱుముచుఁ గణ్వాశ్రమమునఁ బ్రవేశించి శకుంతలను దుష్యంతుఁడు చూచి వలచినట్లును, గణ్వుఁ డప్పటిలోఁ దీర్థసేవార్థ మొకానొక పుణ్యస్థలమునకుఁ బోయి యున్నందున, రాక్షసులు నిర్భయు లయి తమయజ్ఞకర్మమునకు విఘ్నము గావింతు రని, యాశ్రమఋషులు దీక్షాదినములయందు సారథిద్వితీయుఁ డగు వారి రాజుసాహాయ్య మపేక్షించినట్లును, దుష్యంతుఁ డట్టియవకాశమున శకుంతలను గాంధర్వమునఁ బరిగ్రహించి, దీక్షాంతమున ఋషులు దన్ను విడుకొలుప రాజధానికిఁ బోవుచుండి, నిజనామాంకిత మగునయుంగర మొకటి ప్రియురాలి వ్రేల నుంచి వెళ్ళినట్లును, రాజవిరహమును సహింపలేక శకుంతల యస్వస్థురా లయి చింతిల్లుచున్నసమయమున దుర్వాసుఁ డతిథి యయి వచ్చి, యామె పరధ్యానము గల దయి తన్ను సత్కరించి నది కాదని కోపించి, తిన్ననోగతుఁ జూచెను మఱచునట్లుగ శాప మిచ్చియుఁ, దత్సఖీప్రార్థనమునఁ గొండొకప్రసన్నుం డయి, యభిజ్ఞానాభరణసందర్శనమున శాంతియు నాతఁడు జ్ఞప్తి నొందు నని శాపావధిఁ బ్రసాదించినట్లును, శకుంతల దుష్యంతతేజము ధరించి యున్నదని యాకాశవాణి యగ్నిహోత్రగృహమునఁ దనకుఁ దెలియఁజేయఁగాఁ గణ్వమహర్షి సంతోషించి, గర్భవతి యయినశకుంతలను, దనశిష్యులను నొక తాపసిని గూడఁ దోడిచ్చి దుష్యంతునొద్దకుఁ బంపినట్లును, దుర్వాసశాపమున నతఁడు పూర్వవృత్తాంతమును మఱచి తన్ను నిరాకరింపఁగా, శకుంతల తనవ్రేలియుంగరము నవకాసవాలుగాఁ జూపఁదలఁచి, యది యెక్కడనో జాఱి పోయినందునఁ దనదురదృష్టమునకు దుఃఖించినట్లును, నట్టిస్థితిలోఁ గనికరపడి కొండొకనిమిత్తమునఁ బ్రసూతపర్యంత మామెను దనయింట నుంచుటకు సర్థించి, రాజానుమతిని పురోహితుఁడు శకుంతలను గొనిపోవుచుండఁగా, మధ్యమార్గమున నాకస్మికముగాఁ దేజోరూపమున మేనక పుత్రిక నెత్తుకొని పోయి మారీచాశ్రమమున నుంచినట్లును, నక్కడనే యామెకు భరతుఁ డనుకుమారుఁ డుదయించి పెరుఁగుచున్నట్లును, నీలోపల నొకపల్లెవాని యొద్ద రాజనామాంకిత మగునయుంగరముఁ జూచి తలవరులు వానిని దొంగనుగాఁ బట్టుకొని రాజసన్నిధికిఁ గొనివచ్చినట్లును, దా నాయుంగరమును జూడఁగానే పూర్వవృత్తాంత మంతయు నాకళింతకు వచ్చినందున, నృపుఁడు దొరకినసమాచారము తెలిసికొని పల్లెవానికి బహుమాన మిప్పించి పంపివేసి, శకుంతలావిషయమునఁ దాను [illegible] మనమును గూర్చియుఁ, దన్మూలమునఁ బ్రాప్త మయినవిరహసంతాపమును

గూర్చియు, రాజు భ్రమరబాధ నివారించినట్లును, సప్తమాంకమున నింద్రుని సారథి యగు మాతలి వచ్చి, తా నదృశ్యుఁడయి యుండి, క్రోధోత్పాదకక్రియమున రాజు నకుఁ గోపముఁ దెప్పించినట్లును, పిదప నమ్ము దొడిగి తన్నుఁ జంప నున్న రాజునకు మాతలి ప్రత్యక్షమయి, కాలనేమిసంతతి యగు దానవగణమును దునుమ నింద్రుఁ డతనిఁ గొని రమ్మన్నాఁడని, యాసమయమున నివేదించినట్లును, దుష్యంతుఁ డతనితో నత్యుత్కృష్టమగు నింద్రరథము నధిరోహించి, స్వర్గమున కేగి కృతకృత్యుండై యారథముమీఁదనే మరల భూలోకమునకు వచ్చుచు, మార్గములో వహ్నిసందర్శ నార్థము మారీచాశ్రమమున దిగి, యక్కడ భరతుని శకుంతలను గలిసికొన్నట్లును, గడకు భార్యాపుత్రసహితుఁడయి యతఁడు మహదాశీర్వాదము నొంది హస్తినాపురము చేరి సుఖమున్నట్లును, సందర్భోచితముగా లోకానుభవసిద్ధములు, స్వభావావిరుద్ధములు, జ్ఞాననీతిప్రతిపాదకములు, మనోహరశృంగారహాస్యకరుణాదిరసోపబృంహితములు, ననల్ప కల్పనాచమత్కారవంతములు, గంభీరభావసమృద్ధములు, సహృదయహృదయాహ్లాదజన కములు, నయి యొసంగెడు ప్రసంగములచేత నయ్యాయివిషయములను విస్తరించి, యే డంక ములుగా సంస్కృతమున నీనాటకము రచియించినాఁడు.

సంస్కృతనాటకములలో నెల్ల నిది ప్రథమగణ్యము. మిగిలినచమత్కృతు లన్ని యటులుండఁగా, నిందు పద్యపాత్రములసంభాషణము సాధారణముగా వారివారి యవస్థనములలో నున్న స్పష్టాంశాదులతోఁ గూడియుండి, కవికిఁ గల లోకజ్ఞానము నుచి తజ్ఞతయు నద్భుతావహముగాఁ బ్రకటించుచుండును. భావగాంభీర్యమే గాని భాషాకాఠి న్యము ప్రాధాన్యముగా దీనఁ గానఁబడదు. కవికల్పితములో లేఖకాదిప్రక్షిప్తములో నిర్ణయించుట యశక్యము గాని, మాతృకాంతరములయందు దేశభేదమును బట్టి పాఠభేదము లనేకములు దీనఁ జూపట్టుచున్నవి. అయినను పాఠభేదము లన్ని యొక దేశమునఁ గానఁబడునట్లు, నానాదేశమాతృకల నధికప్రయత్నమున సంపాదించి, ప్రతిపత్తియును బ్రౌఢపాఠమును బాఠాంతరములను దిర్యగ్రేఖచే వేఱుపఱుచుచు, గీర్వాణ సంస్కారయుత నాగరలిపిలో బొంబాయిని పండితవరులు మహోపకార కముగా ముద్రించి ప్రకటించిన ప్రతి యొకటి యున్నది. నాయాంధ్రీకరణముఁ దనేకస్థలములయందు దానిసాహాయ్యమును నేను బొందియున్నాను. ప్రసిద్ధమున కంటె భిన్నమయిన యర్థము నే దేని తెలిఁగింపవలసి వచ్చినప్పుడు పాఠకుల కది వెంటనే తెలియవలయు నను తలంపుతో నవ్విషయము పాదటిప్పణియందు సూచిం చుచు వచ్చితిని. మఱియు నక్కడక్కడ నవసర మయినచోట శబ్దముల కర్థములను, వాక్య ములకు భావమును గూడ వ్రాసి యుంచితిని. మఱికొన్ని తావులయం దావశ్యకత బట్టి వ్యాఖ్యాసహితముగను, దద్రహితముగను, మూలము గూడ గనఁబఱచి సర్వ

## ఈనాటకమునందు వచ్చుపాత్రములు.

### ప్రథమాంకము.

సూత్రధారుఁడు, నటి—ప్రస్తావనయందు వచ్చువారు.
దుష్యంతుఁడు—కథానాయకుఁడు.
సూతుఁడు—రాజసారథి
వైఖానసుఁడు, ఇద్దఱుశిష్యులు—కణ్వాశ్రమవాసులు.
శకుంతల—కథానాయిక.
అనసూయ, ప్రియంవద—శకుంతల చెలికత్తెలు.

### ద్వితీయాంకము.

దుష్యంతుఁడు.
మాఢవ్యుఁడు—రాజునకు వేడుకచెలికాఁడు.
రైవతకుఁడు—దౌవారికుఁడు.
సేనాపతి—సైన్యాధిపతి.
ఇద్దఱుఋషికుమారులు—ఆశ్రమవాసులు.
కరభకుఁడు—రాజుతల్లి వద్దనుండి సందేశము తెచ్చినవాఁడు.

### తృతీయాంకము.

దుష్యంతుఁడు.
యజమానశిష్యుఁడు—ఒకఋత్విజుఁడు.
శకుంతల, అనసూయ, ప్రియంవద.
గౌతమి—వృద్ధతాపసి, కణ్వుని తోఁడఁబుట్టు వంటిది.

### చతుర్థాంకము.

శిష్యుఁడు—నిశాశేషముఁ దెలియఁ గణ్వునిచేఁ బంపఁబడినవాఁడు.
ఋషికుమారులు—శకుంతల కాభరణములు తెచ్చినవారు.
కణ్వుఁడు—శకుంతలపెంపుడుతండ్రి.
శార్ఙ్గరవుఁడు, శారద్వతుఁడు—శకుంతలతో హస్తినాపురికిఁ బంపఁబడ్డ కణ్వశిష్యులు.
శకుంతల, అనసూయ, ప్రియంవద, గౌతమి.
మునిపత్నులు (ముగ్గురు)—శకుంతలను వీక్షించుటకయి వచ్చినవారు.

## పంచమాంకము.

దుష్యంతుఁడు, మాఢవ్యుఁడు, శార్ఙ్గరవుఁడు, శారద్వతుఁడు.

వాతాయనుఁడు—కంచుకి.

సోమరాతుఁడు—రాజపురోహితుఁడు,

వైతాళికులు—(తెరలో)

శకుంతల, గౌతమి.

వేత్రవతి—ప్రతీహారి.

## షష్ఠాంకము.

దుష్యంతుఁడు, మాఢవ్యుఁడు, వాతాయనుఁడు.

స్యాలకుఁడు—రాజాగారిబావమఱఁది, పురరక్షకుఁడు.

జానకుఁడు, సూచకుఁడు—తలారులు.

ధీవరుఁడు—ఉంగరముతోఁ బట్టుపడిన దొంగ.

మాతలి—ఇంద్రసారథి.

వేత్రవతి.

సానుమతి—మేనక చెలికత్తె.

మధుకరిక, పరభృతిక—ఉద్యానవనపాలికలు.

చతురిక—ఒకరాజపరిచారిక.

## సప్తమాంకము.

దుష్యంతుఁడు, మాతలి.

భరతుఁడు—దుష్యంతపుత్రుఁడు.

కశ్యపుఁడు—మరీచిమహామునికుమారుఁడు, దేవదానవులతండ్రి.

గాలవుఁడు—కశ్యపశిష్యుఁడు.

శకుంతల.

తాపసపురంధ్రులు—భరతు నాడించు తాపసస్త్రీలు.

అదితి—కశ్యపుని భార్య.



శ్రీరస్తు

శ్రీపరమాత్మనేనమః.

# ఇష్టదేవతాప్రార్థనాదికము.

---

శ్రీలు ఘటింపఁ జాలుతనచిత్రతరాఖిలలోకసృష్టి, ధీ
శాలులబుద్ధి యన్మణికి శాణ మొనర్చి, *తదంతరంబునన్
లీలను సర్వదా ప్రతిఫలించెడుచిన్మయమూర్తి, మంజువా
గ్జాల మొసంగి నాదుకృతి సాధుజనాదరణీయఁ జేయుతన్. ౧.

ఆ. వె. వెలయఁ జేసినాఁ డభిజ్ఞానశాకుంత
లమును గాళిదాసుఁ డమరభాష
లోనఁ, దద్రసప్రలుబ్ధచిత్తుఁడ నౌచు
దానిఁ దెలుఁగు సేయఁ దలఁచినాఁడ. ౨.

ఉ. ఎంతటొ తెల్గు చేసినది యేఁ దెలిఁగించుట †వీటిపాటు నా
కిందుఁ బరీక్ష చేసి, కొనుఁడీ గుణ ముండినఁ బండితుల్! రస
స్యందినిఁ గాళిదాసకృతి నందఱు దూఱుఁడు, దానిదోషమే
యింపఱుబుద్ధి కిచ్చె శ్రమ మీదృశ మున్నదె నాటకంబులన్? ౩.

ఉ. టీకలు దీనిమీఁదఁ బ్రకటించినసంస్కృతహూణపండితా
నీకముఁ, దెల్గులోనికి ననేకముఖంబుల దీనిరాకకున్
వాకలఁ ద్రాఁకు లిడ్డయధునాతనపుంగవిలోకముం, దద
స్తోకపరోపకారగుణధుర్యవివేకముకై స్మరించెదన్. ౪.

క. కవనమునకుఁ గావలసిన
వివిధము లగుపరికరముల వెలయించిన ప్రా
క్కవిలోకమణుల‡పాదము
లవతంసము లగును గాక యెపుడును నాకున్. ౫.

చ. అనుపమకాంతిసారభరసాదుల §లాఁతివిలాతి గోచరిం
చినసుమమంజరిం జతురశిల్పి లిఖించి స్వకీయదేశపుం

---

*తదంతరంబునన్=ఆమణిలోపల; †వీటిపాటు నాక=వ్యర్థపరిశ్రమమనక; ‡పాదములు=అడుగులు, కిరణములు; §లాఁతివిలాతి=అన్యదేశము.

జనులకుఁ జూపఁ దెచ్చుగతి సాగును గా *కవతార †మాదిభా
షను గన నా విశేషములు సర్వము నం దెటు సంఘటిల్లెడున్ ?
చ. తెలిసినతప్పులే సరిగ దిద్దుటకుం గన రాక పోయెడున్;
దెలియని వెన్ని యుండు నొకో దీనను దోషము లైనఁ జింతిలన్;
గలుగ గదా విమర్శకులు గ్రంథవిశుద్ధికిఁ; బావకంబునన్
నలుసులు దాఁగుటల్ పొసఁగునా యెసఁగన్ వడగట్టువస్త్రముల్?
తే. గీ. మొదట మేఘసందేశముఁ, బిదప విక్ర
మోర్వశీయముఁ, దెలిఁగించి యుంటిఁ గానఁ,
గలితపరిచయుఁడను గాని కాళిదాసు
కబ్బముల కేను గ్రొత్తను గాను; ‡వ. సు. ఁడ.



*అవతారము=భాషాంతరీకరణము; †ఆదిభాష=మూలభాష. ‡వ. సు. ఁడ=వద్ద

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

అభిజ్ఞాన

# శాకుంతల నాటకము.

## ప్రథమాంకము.

ఏది విధియాదిసృష్టి, వహియించు హుతం బేది, యేది హోత్రి, యే
*వన నొనరించు రెండు, †శ్రుతి కందుగుణంబున విశ్వపూర్ణ మే
దె దఖిలభూతపుంబ్రకృతి, యెందునఁ బ్రాణులు ప్రాణవంతముల్,
తదధిగతాష్టదృశ్యతనులం దగునీశుఁడు మిమ్ముఁ బ్రోచుతన్. ౧.

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు—(తెరవంకఁ జూచి) సుందరీ! యలంకరించుకొనుట యయిన పక్షమున నీ విటు రమ్ము.

నటి—(ప్రవేశించి) ఇదిగో! వచ్చితి నార్య! నేను జేయ వలసిన దేమో యాన తిండు.

సూత్ర—భాసురాంగీ! పూర్వము గీర్వాణభాషయందుఁ గాళిదాసమహాకవి చేత విరచిత మయి, యిప్పు డభినవముగా వడ్డాది సుబ్బరాయకవి చేత నాంధ్రీకృత మయినయభిజ్ఞానశాకుంతల మను నాటకరాజము చేత, నభిరూపజనభూయిష్ఠ మైన యీసభను మన ముపాసింప వలయును.

నటి—వినూతనవస్తువులయందుఁ బ్రీతి సమస్తజనులకు విస్తరిల్లుట కటస్థించును గావున, మీయానతి యతిశ్లాఘ్యము. సరేగాని యార్యా! యభిజ్ఞాన శాకుంతలమున

---

*అవనము=కాలము; †శ్రుతి కందు=(శ్రుతికిన్+అందు) శ్రోత్రగోచరమగు.

నటి—అట్లే (పాడుచున్నది).

తే. గీ. *క్రమనుకుమారకేసరాగ్రములు గలిగి,
తుమ్మెదలచేత †దరచుంబితమ్ము లగుశి
రీషకుసుమములను దయాహృదయ లగుచుఁ
దాల్తు రింతులు కర్ణావతంసములుగ. ౪.

సూత్ర—సుందరీ! చక్కగాఁ బాడితివి. రాగరసమునందుఁ జిత్తవృత్తి దగిలి రంగ మంతయుఁ జిత్తరువు వ్రాసినట్లే యున్నది. మఱి మన మేనాటకము ప్రయోగించి యీసభ నారాధింతము?

నటి—అభినవముగా వడ్డాదిసుబ్బరాయకవిచేత నాంధ్రీకృత మయినయభిజ్ఞానశాకుంతలనాటకమును బ్రయోగించి యని యార్యమిశ్రు లిదివఱకే యానతిచ్చి యుంటిరి గదా!

సూత్ర—సుందరీ! చక్కగా జ్ఞప్తికిఁ దెచ్చితివి. నే నది యంతయు నింతలోనే మఱచి పోయితిని జుమీ. ఏ మనఁగా

క. నీగీతరాగ మిం పయి
లాగెను దూరముగ నను బలాత్కృతి, నెంతే
వేగంబున సారంగం
బీగతి దుష్యంతధారుణీశునిఁ బోలెన్. ౫.

ప్రస్తావన.

[తరువాత రథమెక్కి, విల్లుపూని, లేడిని దఱుముచు రాజును, సూతుఁడును బ్రవేశించుచున్నారు.]

సూతు—(రాజును లేడిని జూచి) ఆయుష్మంతుఁడా!

క. కనుఁగొనుచుఁ గృష్ణసారం
బు, నధిజ్యశరాసనమునఁ బొలుచు నిను, మృగం
బును వెను దవిలెడుసాక్షా
త్పినాకధరుఁ గాంచుచున్నవిధమున నుంటిన్. ౬.

రాజు—సూతుఁడా! మనల నీసారంగ మతిదూర మాకర్షించినది. అది యిప్పుడును

చ. వెనుకొను తేరివంక నొకవింతగ గ్రీవ మలంచి సారెఁ గ
న్గొని, శరపాతభీతిఁ గడుఁ గుంచుచు ముందఱికుం బిఱిందిమై,

*క్రమ=మనోహరమైన; †దరచుంబితమ్ములు= కొంచెముగా స్పృశింపఁబడినవి.

తనయురదిన్న దర్భలతి దారి వగర్చెడునోర జాఱ, నే
*ల నలఁతి, నింగి నెక్కుడుగ లంఘనదీర్ఘత నేగుఁ జూడుమా. ౭.

(విస్మయముతో) ఏ మిది? వెనువెంటనే వచ్చుచున్నను, నాకు దీనిని జూచుట ప్రయత్న సాధ్య మగుచున్నది.

సూతు—ఆయుష్మంతుఁడా! నేల మిట్టపల్లముగా నున్న దని, వాగెలు లాగి పట్టి రథవేగము తగ్గించితిని. అందుచేత నీ కామృగము దూర మయినది. ఇప్పుడు సమప్రదేశమున నేగుచున్న నీ కది దురాసదము గాదు.

రాజు—అటు లయినఁ బగ్గములను సడలింపుము.

సూతు—(రథవేగము నిరూపించి) ఆయుష్మంతుఁడా! ఇప్పుడు చూడు.

చ. వదులుగఁ బట్టి వాగెలను, వాజవముల్ తమపూర్వకాయముల్
కొద వడ కుండఁ జాఁచి, †వినిగూఢత నొందిన నిక్కువీనులుకా
గదలనిచామరాగ్రములుఁ గల్గి, కురంగజవంబునందు నీ
సాదవినభంగిఁ జాఱుఁ దమయుత్థితధూళికి నంద రాని వై. ౮.

రాజు—సత్యముగా నీహయములు సూర్యాశ్వముల నతిక్రమించి పోవుచున్నవి.

ఉ. అన్నువగాఁ గనంబడున దప్పుడ గొప్పది యౌను; మధ్యవి
చ్ఛిన్నము గాన నొఁ గలయఁ జేర్చినటుల్; సహజాతివక్రముకా
దిన్ననిరేఖఁ దోఁచెడును; దేరివడి న్నిమిషార్ధమేని నా
కన్నుల కింత దవ్వులను గల్గదు దాపున నిల్వ దేదియుకా. ౯.

---

*ల నిల కుదగ్రలంఘనములకా మిగులం జను మింటఁ జూడుమా.
(అని యయినఁ జదువవచ్చును.)

† "నిష్కంపచామరశిఖా నిభృతోర్ధ్వకర్ణా" యనుమూలమునందలినిభృతశబ్దమునకు వ్యాఖ్యాతలు నిశ్చల మని యర్థము వ్రాయుటచేత "ఎటులుం జలియింపని చామరాగ్రముల్ కదలని నిక్కువీనులును గల్గి" యని ముందు తెలిఁగించియుఁ, బ్లుతగతియందుఁ దోఁచునశ్వస్వభావమును బట్టియు, "నిష్కంపచామరశిఖా" యని నిశ్చలత్వవర్ణన మీవఱ కొకదానికిఁ జేసి యున్న కాళిదాసమహాకవిస్వభావమును బట్టియు, నిభృతశబ్దమునకు నిశ్చలార్థ మిక్కడఁ బొసఁగ దని యూహించి నిగూఢ మనునర్థము గ్రహించితిని. తృతీయాంకమునందు "యేనావిలంబితం నిభృతంచ సఖీమనోరథం సంపాదయావః" అనుచోట "నిభృతంగూఢమ్ అప్రకాశమితి యావత్" అని వ్యాఖ్య చేయఁబడియున్నది. రసికు లిష్టమైన పాఠము గ్రహింతురుగాక.

సూతుఁడా! దీనిని నేను జంపెదను జూడుము. (వింట నమ్ము దొడుగుచున్నాఁడు.)

[తెరలో]

ఓహో! రాజా! యిది యాశ్రమమృగము. చంపరాదు. చంపరాదు.

సూతు—(ఆలకించి చూచి) ఆయుష్మంతుఁడా! నీకును, బాణపాతదూరములో నున్న యీకృష్ణసారమునకును, నడుమఁ దాపసులు వచ్చి యున్నారు.

రాజు—(సంభ్రమముతో) అట్లయిన గుఱ్ఱముల నిలుపుము.

సూతు—చిత్తము. (రథము నిలుపుచున్నాఁడు.)

[తరువాత నిద్దఱుశిష్యులతో వైఖానసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

వైఖా—(హస్త మెత్తి) రాజా! యిది యాశ్రమమృగ మాశ్రమమృగము.

ఉ. ఏయకు మేయ కావిశిఖ మీసుకుమారపుజింక మేనిపైఁ;
ద్రోయఁగ వచ్చునయ్య *యలరుంగుమిమీఁదను వీతిహోత్రమున్ ?
హా! యతిలోల మాహరిణకావళిజీవిత మేడ? నేడ నీ
సాయకముల్ నిశాత†ఫలసంకలితంబులు ‡సారపుంఖముల్ ? ౧౦.

మఱియు

క. అరిఁ బోసినయ మ్ముపసం
హరింపుమా ధార్మికోత్తమా! తావక మా
శర మార్తత్రాణమున క
పరాధదూరులను దోయపను గాదు సుమీ. ౧౧.

రాజు—(నమస్కరించి) ఇదిగో! నుపసంహరించితిని. (అట్లు చేయుచున్నాఁడు.)

వైఖా—(హర్షముతో) మేలు! పురువంశప్రదీపకునకు నీ కిది యుచితమే?

క. జననంబును బురువంశం
బునఁ బొందినవనికి యుక్తము గదా యిది; నీ
గొనములె గలిగినవానిని
గను పుత్రునిఁ జక్రవర్తి గాఁ దగువానిన్. ౧౨.

కడమయిద్దఱు—(బాహువు లెత్తి) సర్వథా చక్రవర్తి యగుపుత్రునిఁ బడయుము.

రాజు—(ప్రణామముతో) బ్రాహ్మణవచనము పరిగ్రహించితిని.

---

*అలరుంగుమి=పుష్పరాశి; †ఫలము=బాణాగ్రము; ‡వజ్రసారముల్ అని పాఠాంతరము.

వైఖా—రాజా! మేము సమిధలనిమిత్తము వచ్చినారము. ఇదిగో! మాలినీ తీరమునఁ గులపతు లగుకణ్వమహర్షులవారియాశ్రమము గనఁబడుచున్నది. కార్యాంతర ప్రతిబంధము గలుగ కున్నపక్షమునఁ దా మిందు విచ్చేసి యాతిథ్యము గ్రహింప వలయును.

ఆ. వె. రమ్యములు నిరంతరాయము లగుతపో
ధనులసత్క్రియలను గనులఁ గాంచి,
మౌర్వికిణము లడపమద్భుజం బెంత ర
క్షించుచున్న దంచు నెంచుకొందు. ౧౩.

రాజు—కులపతు లాశ్రమమున నున్నారా?

వైఖా—కూఁతుశకుంతల నతిథిసత్కారమునకు నియోగించి యాబాలిక ప్రతికూల దైవము నుపశాంతి సేయుటకయి వా రిప్పుడ సోమతీర్థమునకు వెళ్లినారు.

రాజు—(తనలో) కానీ. ఆమెనే చూచెదను. (ప్రకాశముగా) నాభక్తిని మహర్షి కామెయే తెలుపఁగలదు.

వైఖా—మేము పోయి వచ్చెదము. (శిష్యులతో నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—సూతుఁడా! గుఱ్ఱములను దోలుము. పుణ్యాశ్రమదర్శనమునఁ బవిత్రత గలిగించుకొనియెదను.

సూతు—చిత్తము. (మరల రథవేగముఁ జూపుచున్నాఁడు.)

రాజు—(అంతటఁ జూచి) సూతుఁడా! ఇది తపోవనప్రాంత మని చెప్పకయే తెలియ వచ్చుచున్నది.

సూతు—అది యేలాగున?

రాజు—నీవు చూడవా యేమి? ఇక్కడ—

చ. నివరులు ¶కీరగర్భబిలనిర్గళితంబులు చెట్లక్రింద; నొం
డువలన గారకాయలను నూఱుట జిడ్డగుఱాలు దోఁచెడుఁగన్;
రవమును సైఁచి క్రుమ్మరుఁ గురంగము లెప్పటియట్ల నమ్మికన్;
వావణిలు వల్కలాంచలపయస్స్రుతిజాడల రేవుఁద్రోవలుకన్. ౧౪.

సూతు—సర్వము సరిగా నున్నది.

రాజు—(కొంచెము దూరము నడిచి) మఱియు—

---

¶కీర...తంబులు = చిలుకలు లోనఁగల తొఱ్ఱలనుండి పడినవి.

*చ. కదుగును వృక్షపాదముల గాలిఁ జలించెడు కాల్వలో యముల్;
పొడమినయాజ్యధూమమునఁ బో ల్పబుఁ గెంజిగి గ్రొంజిగుళ్లయం
దట్టు గిడు మెల్ల మెల్ల హరిణార్భకముల్ మును దర్భ గోయఁగాఁ
బడినమనోహరోపవనభాగములన్ మది శంక దక్కుచున్. ౧౫

సూతుఁడా! తపోవనవాసులకు నాటంకము కాఁగూడదు. రథ మిచ్చటనే నిలుపుము. నేను దిగియెదను.

సూతు—పగ్గములను బట్టితిని. దేవర దిగ వచ్చును.

రాజు—(దిగి) వినీతవేషములతోఁ గదా తపోవనములఁ బ్రవేశింప వలయును. వీనిని బట్టుకొమ్ము. (ధనుస్సు నాభరణములు సూతునిచేతి కిచ్చి) నే నాశ్రమవాసుల సందర్శించి వచ్చునంతలో నీవు గుఱ్ఱములను గడుగుము.

సూతు—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు).

రాజు—(నడచి) ఇదె యాశ్రమద్వారము. నే నిందుఁ బ్రవేశించెదను. (ప్రవేశము నభినయించి నిమిత్తము సూచించి)

క. ఇది శాంతం బాశ్రమపద
మదరెడు భుజ మెట్లు దీని కగు ఫల మిచో
నది యేలా? భవితవ్యము
లొదవుట కెల్లెడల దారు లుండున కాదే? ౧౬

[తెరలో]

సఖులారా! యిటు, ఇటు.

రాజు—(చెవి యొగ్గి) ఓహో! వృక్షవాటికి దక్షిణమున మాటలవలె వినఁబడుచున్నవి. అక్కడకుఁ బోయెదను. (నడచి చూచి) ఇదిగో! నీమునికన్యలు తమయీడు నకుఁ దగినజలకలశములతో లేఁతచెట్లకు నీళ్లు పోయ నీలాగుననే వచ్చుచున్నారు. (నిరూపించి) ఆహా! వీరిదర్శన మెంత మనోహరము!

†తే. గీ. రాణివాసంబులకు నైన ప్రాఁతి యిట్టి
తనువు వనవాసిజనమున కానరాదేని,
యట్టి యుద్యానలతల నధికరించు
దమగుణంబులచేతఁ గాంతారలతలు. ౧౭

* దీనిమూలము ప్రక్షిప్తమందురు.

†రాణివాసములకు=అంతఃపుర స్త్రీలకు; ప్రాఁతి=దుర్లభము; అధఃకరించు=క్రిందుపఱుచును; అడవితీఁగెలే యుద్యానలతలకంటె గుణాధికము లని యొకపాఠమున్నట్లు గనఁబడుచున్నది గాని యది స్వాభావిక మని తోఁపదు.

నే నీచెట్లనీడనుండి వీరిజాడలఁ గనిపెట్టెదను. (చూచుచుఁ గూర్చున్నాఁడు.)

[తరువాత ముందు చెప్పినట్లు సఖులతో శకుంతల ప్రవేశించుచున్నది.]

శకుం—సఖులారా! యిటు, ఇటు.

అనసూయ—సఖీ! శకుంతలా! తండ్రిగారు కాశ్యపులకు నీకంటె నీయాశ్రమ వృక్షములే ప్రియతరము లని నే ననుకొనుచున్నాను. నవమాలికాకుసుమసుకుమారి వయిననిన్నుఁ గూడ వీనిపాదులను దదుప నియోగించినారు గదా!

శకుం—ఇది కేవలముఁ దండ్రిగారినియోగ మే కాదు. నాకును వీనియెడల సోదరస్నేహమే. (చెట్లకు నీళ్లు పోయుచున్నది.)

రాజా—ఈమె కణ్వమహర్షులకుఁ గూఁతు రగుట యెట్లు? పూజ్యు లయిన కాశ్యపులు సరిగా నాలోచించినవారు కారు. ఈమె నాశ్రమధర్మమున నియోగించినారు గదా!

క. వపు విది సహజమనోజ్ఞము
తపస్సహము సలుపఁ దలఁచుతాపసుఁడు, ప్రయ
త్నపడును నీలోత్పలప
త్రపుధార సమిల్లతావితానముఁ గోయన్. ౧౫.

కానీ. చెట్లమఱుఁగుననే యుండి యనుమానము దోఁప కుండ నీమెను జూచెదను. (అట్లు చేయుచున్నాఁడు.)

శకుం—అనసూయా! నా స్తనవల్కలమును ప్రియంవద యదయముగా బిగించినది. నీవు దీనిని వదులు చేయుము.

అన—మంచిది. (వదులు చేయుచున్నది.)

ప్రియం—(నవ్వుచు) ఇప్పుడు నీగుబ్బల నుబ్బించెడునీజవ్వనమును నిందించుకొనుము. నన్ను దూషించెద వేమి?

రాజా—ప్రియంవద చక్కఁగాఁ జెప్పినది.$

*తే. గీ. మూఁపునను జిన్నముడి గట్టి మొలక చన్నుఁ
గవవిరివి గప్పుచున్నవల్కలముకతనఁ
దనచెలువు వెల్ల దీమెకొందలకు మేను,
పాండుపర్ణాంతరితమైనప్రసవ మట్లు. ౧౬.

ఈమెవపువునకు (వయసునకు) వల్కల మెంత మాత్రముఁ దగినది కాక పోయిన, నలంకారశోభను మాత్రము పోషింపక పోయినది కాదు.

---

$, * వీని మూలములను ప్రక్షిప్తము లందురు.

*చ. సరసిజము న్నాచుతోఁ జెరసినం గన నొప్పెడు దర్శనీయమై;
చలువలఱేనికిం జెలువొసంగు మలీమస మయ్యు నంక మీ
చెలియ తరుత్వచంబున విశేషమనోహర; మాధురీగుణం
బలవడినట్టియాకృతుల కాభరణంబెది కాక పోయెడున్? ౨౦.

మఱియు—

†ఉ. అందము పెంపుఁ గాని చిరు పయ్యెద వల్కలము గల్గియేన, నా
డెందమునందు నంతయు ఘటింపదు సూ రుచిభంగ మబ్జినీ
సుందరఫుల్లతామరసశోభిత నించుక కంఠసీమ ద
క్కం దలచూపుతద్విశిఖకర్కశవృంతసమూహముం బలెన్. ౨౧.

శకుం—(ముందు చూచి) ఇదిగో! గాలిఁ గదలుపల్లవాంగుళులతో నీపొగడ గున్న నన్నుఁ దొర పెట్టుచున్నట్లు లగపడుచున్నది. దీని నాదరించెదను. (నడచుచున్నది.)

ప్రియం—సఖీ! శకుంతలా! నీ వక్కడనే ముహూర్తమాత్రము నిలువుము. నీచేరికచే నీపొగడగున్న తీఁగతోఁ గూడినట్లు గానఁబడుచున్నది.

శకుం—ఇందుచేతనే గదా నీవు ప్రియంవద వయితివి.

---

* మలీమసమయ్యు = మలినమైనను; అంకము=కలంకము; తరుత్వచము= వల్కలము. ఈపద్యము సులభముగా నర్థమగునదే యయినను దీనియందు నన్వయాదిక్లేశమున సరసము లయినబహుభావము లిమిడి యున్నవి గాన, మూల మిట వ్రాయఁబడుచున్నది. శ్లోకమునందు "సరసిజమపి, హిమాంశోరపి" యని యన్వయించునెడలఁ బద్యమున "సరసిజమును, జలువలఱేనికిని" వని యప్యర్థకావ్యయము లోపించి యున్నదని తెలియవలయు.

శ్లో. సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలిన మపి హిమాంశోర్లక్ష్మ లక్ష్మీం తనోతి,
ఇయ మధికమనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివహి మధురాణాం మండనం నాకృతీనామ్.

గ్రంథవిస్తరభీతిని భావము వివరింపలేదు. "ఇయ మపిచ" అను పాఠము [illegible]. † దీనిమూలము ప్రక్షిప్తమందురు.

రాజు—కేవలము ప్రియంవద కాదు. ప్రియ మయినను సత్యమే చెప్పినది. ఈమెకు—

ఆ. వె. చిగురు తొగరుమోవి, చేతులు నవకంబు
గలుగుకట్టివిటపములకు సాటి,
జవ్వనంబు పుష్పసరణి నంగకముల
నివ్వటిల్లె లోభనీయ మగుచు. ౨౧.

అన—సఖీ! శకుంతలా! నీవు వనజ్యోత్స్న యని పేరు పెట్టిననవమాలిక బాలసహకారమునకు స్వయంవరవధు వయినది. దీనిని మఱచి పోయితివి గదా!

శకుం—నేను దీనినే మఱచితినా నన్నుఁగూడ మఱచి పోఁగలను. (లతను చేరి చూచి) సఖీ! రమణీయకాలమున నీలతాపాదపమిథునమునకు సంయోగము సమకూరినది. నవకుసుమయౌవన యీవనజ్యోత్స్న; బద్ధపల్లవత చేత నుపభోగయోగ్య మీతియమావిగున్న; (చూచుచు నిలుచున్నది.)

ప్రియం—(చిఱునవ్వుతో) సఖి! యనసూయా! శకుంతల వనజ్యోత్స్న నంత గాఁ నెందులకుఁ జూచుచున్నదో యెఱుఁగుదువా?

అన—నే నెఱుఁగను. నీవు చెప్పు.

ప్రియం—"వనజ్యోత్స్న యనురూపపాదపముతో నెట్లు పెనంగొని యున్నదో నే నట్లు దగినవరునిఁ బొందఁ గాంతునా?" యని.

శకుం—(అసూయతో) ఇది నిజముగా నీమనస్సులోనికోరిక.

*(కలశమును వంచుచున్నది.)

అన—సఖి! నాయనగారు నిన్నుఁ బోలె స్వహస్తములతోఁ బెంచినమాధవీలత యిది. దీనిని నీ వేలాగున మఱచితివి?

శకుం—అట్లయిన నన్నును నేను మఱతును. (లతను సమీపించి చూచి హర్షముతో) ఆశ్చర్య మాశ్చర్యము! ప్రియంవదా! నీకు నేను ప్రియముఁ జెప్పెదను.

అన—సఖీ! నా కేమి ప్రియము?

శకుం—ఈమాధవీలత యకాలమున నామూలము మొగ్గ దొడిగినది.

ఇద్దఱు—(త్వరితముగా సమీపించి) సఖీ! నిజమా? నిజమా?

శకుం—నిజమే; మీరు చూడరా?

---

*దీనికిని వక్ష్యమాణమగు "కలశమును వంచుచున్నది" యనుమాటకును నడిమి ప్రసంగము మూలమున కలశత్వాప్రతిపత్తి మాత్ర మున్నది. ప్రక్షిప్త మవి తోఁచెడు

ప్రియం—(హర్షముతో నిరూపించి) సఖీ! దీనంజేసి నేను నీకుఁ బ్రతిప్రియము చెప్పెదను.

శకుం—నాకుఁ బ్రతిప్రియ మేది?

ప్రియం—నీకు వివాహము సమీపించినది.

శకుం—ఇది నీమనసులోనికోరికః నీమాట నేను వినను.

ప్రియం—సఖీ! నేనిది పరిహాసమునకుఁ జెప్పను. నీకిది కల్యాణసూచకమైన నిమిత్తమని పితకు లగుకాశ్యపులవలననే విని యున్నదానను.

అన—సఖీ! ప్రియంవదా! యందుచేతనే శకుంతల తానంతప్రేమతో మాధవీలతకు నీళ్లు పోయుచున్నది.

శకుం—అది నాకు సహోదరి, దానికి నేను నీళ్లు పోయకుందునా? (కలశమువంచుచున్నది.)

రాజు—(తనలో) ఈమనోరథము దుర్లభము గదా! * కులపతుల కీమె యసవర్ణక్షేత్రసంభవ యయి యుండునా? అయినను సంశయముతోఁ బని లేదు.

ఉ. సందియ మేల? యీలలన క్షత్రపరిగ్రహయోగ్యరాలె; నా
డెందము నిర్మలంబిది పడెం దృఢమానభిలాష నీమెయం
దెందును సంశయమ్మునకు నిమ్మగువస్తువులందు సజ్జనుల్
కొందురు గా ప్రమాణముగ లోపలియింద్రియప్రవృత్తులన్. ౨౩.

కానీ. ప్రత్యక్షముగానే యీమె నెఱింగెదను.

శకుం—(సంభ్రమముతో) సఖీ! సలిలసేచనమున రేఁగినదయి, నవమాలికను విడిచి తుమ్మెద నాముమోఁదికి వచ్చుచున్నది. (భ్రమరబాధ నభినయించుచున్నది.)

రాజు—(చూచి యాసతో) బాగు! ఈమెబాధయు రమణీయముగానే యున్నది. †

తే. గీ. తేఁటి యొందెందు మోఁది మోఁదికిని వచ్చు,
బోటి యందంద బెళుకుఁజూపులను బుచ్చు
భ్రూవివర్తనములతో, నిపుడిది దృష్టి
విభ్రమ మకామ యయ్యుఁ దా వెలిచి కలచు. ౨౪.

(సానూయముగా)

---

* ఈవాక్యము కొన్నిప్రతులలో లేదు. "తగినవరుని బొందఁ గాంతునా?" యనుమనోరథము దుర్లభ మని తాత్పర్యము. † ఈ వీనిపూఁచనలు ప్రక్షిప్తములందురు.

*చ. కనుఁగొన జంక నిక్క గనెడుకంపవతిన్ స్పృశియింతు వేకతం
బు నుడువునట్లు చేరి చెవిచెంతను పాడెదు; చే విదిర్చినన్,
బోవరతు చుంబనంబు రతిమూలధనం బధరంబు; సారె క
న్నను గృతి వీవ, మేము చెడినారము తత్త్వపరీక్షఁ దుమ్మెదా! ౨౪.

శకుం.—సఖులారా! రక్షింపుఁడు రక్షింపుఁడు. దుర్వినీత మయినయీమధు పము నన్నుఁ బీడించుచున్నది.

ఇద్దఱు—(చిఱునవ్వుతో) నిన్ను రక్షించుటకు మే మెవరము? దుష్యంతునికి మొఱ పెట్టుకొనుము. తపోవనములను రాజు గదా రక్షించువాఁడు!

రాజు—నన్నుఁ గనఁబఱచుకొన నిదే సమయము. ఎవ రక్కడ? (అర్ధోక్తియందు లోచించుకొని) రాజభావము వెల్లడి యగు నేమో! కానీ యిట్లు పలికెదను.

శకుం—ఈచెన్నఁటి నన్ను విడుచుట లేదు. నేను మఱియొకచోటికిఁ బోయె దను. (ఒకయడుగు వేసి నిలిచి చూపుజంకనతో) ఏ మిది? ఇక్కడకుఁ గూడ వెంబ డించెను!

రాజు—(సత్వరముగా సమీపించి)

ఆ. వె. ఎవఁడు వీఁడు ముగ్ధ లవునీతపస్వి క
న్యకలయెడల నవినయమును సలుపు,
దుర్వినీతజనులగర్వం బడంచుపౌ
రవుఁ డొనర్ప నుర్విరక్షణంబు? ౨౫.

అందఱు—(రాజును జూచి యించుక తొట్రుపడుచున్నారు.)

అన—అయ్యా! మ కేమియు నుపద్రవము లేదు. మా ప్రియసఖి యీ తుమ్మెద చేతఁ గలఁత నొంది బెదరినది. (శకుంతలను జూపుచున్నది.)

రాజు—(శకుంతల కభిముఖుఁ డయి) తపస్సు వర్ధిల్లుచున్నదా?

శకుం—(భెదరున మాటాడ కూర కున్నది.)

అన—ఇప్పుడు; అతిథి విశేషలాభమువలన. ఆర్యునకు స్వాగతము. సఖీ! శకుంతలా! పర్ణశాలకుఁ బోయి ఫలసహితముగా నర్ఘ్యము గొని రమ్ము. ఇది పాదోదకము గాఁ గలదు.

---

* దీనిమూలమునందలి మొదటిపాదములోఁ బాఠభేదము లున్నవిగాన, వానిలో «శ్లో. చలాపాంగాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీ'' మ్మను ప్రశస్తపాఠ మిం దనుసరింపఁబడినది. తుమ్మెదమీఁదఁ బెట్టి రాజు తనయభిలాషము నిందుఁ దెలుపుకొను చున్నాఁడు. కనుఁగొన జంకె=అపాంగము చలింప.

రాజు—చాలు. మీప్రియవచనములచేతనే నా కాతిథ్యము జరిగినది.

ప్రియం—అట్లయినఁ బ్రచ్ఛాయశీతల మయినయీసప్తపర్ణవేదికయందుఁ గూరుచుండి బడలిక దీర్చుకొనుఁడు.

రాజు—మీరు నీపనిచేత మిక్కిలి యలసితిరి గదా!

అన—సఖీ! శకుంతలా! మనకు నతిథిసపర్య సముచితము, కాఁబట్టి యిక్కడఁ గూరుచుందము.

అందఱు—(కూరుచున్నారు.)

శకుం—(సవిమర్శముగాఁ దనలో) ఏ మిది? ఈయనను జూచి తపోవనమునఁ గారానివికారమునకు లో నయినదానను!

రాజు—(అందఱను జూచి) సమాన మయినయీడుచేతను, జక్కఁదనముచేతను మీస్నేహ మెంతరమణీయముగా నున్నది!

ప్రియం—(జనాంతికముగా) అనసూయా! యీయన యెవరో? చతురగంభీర మయినయాకారముతో మధురప్రియవచనములు పలుకుచుఁ బ్రభువువలెఁ గాన వచ్చెడును!

అన—(జనాంతికముగా) సఖీ! నాకును గౌతూహలము గలదు. ఈయన నడిగెదను. (ప్రకాశముగా) ఆర్యా! తమమధురాలాపములవలనఁ గలిగినవిశ్వాసము న న్నిందుకు సంభాషింపఁ బ్రేరించుచున్నది. ఏరాజర్షివంశము దేవరచే నలంకృతము? ఏదేశప్రజను లార్యునిచే విరహపర్యుత్సుకులు? సుకుమార మయ్యు నీశరీర మెందులకయి తపోవనపరిశ్రమమునకుఁ బాత్రీకృతము?

శకుం—(తనలో) హృదయమా! యుత్తలపడకు ముత్తలపడకుము. ఇదిగో! నీ వనుకొనుచున్న దిప్పు డనసూయ యడుగుచున్నది.

రాజు—(తనలో) నే నిప్పు డేలాగున నన్నెఱింగించుకొందును? ఏపగిదిని దాఁపుర మయినఁ జేసికొందును? కానీ. ఈమెతో నిట్లు చెప్పెదను. (ప్రకాశముగా) కల్యాణీ! పౌరవుఁ డయినరాజుచేత ధర్మాధికారనియుక్తుఁడ నయి, యాశ్రమవాసుల నిర్విఘ్నక్రియానుష్ఠానముల నరయుట కీధర్మారణ్యమున కేతెంచితిని.

అన—ఇప్పుడు గదా ధర్మచారులు సనాథులు!

శకుం—(శృంగారలజ్జ నభినయించుచున్నది.)

సఖులు—(ఉభయులయాకారముఁ దెలిసి జనాంతికముగా) సఖీ! శకుంతల! నాయనగా రిప్పు డిచ్చట నుండిరా—

శకుం—(రోషముతో) ఉన్న నేమి?

సఖులు—తమజీవితసర్వస్వముచేత నయిన నీయతిథిని గృతార్థునిఁ జేయుదురు.

శకుం—సఖులారా! లేచి పొండి. మీ మనస్సులో నేదో పెట్టుకొని మాట లాడుచున్నారు. మీమాటలు నేను వినను.

రాజు—మేము మీసఖిని గూర్చి కొంచె మడిగెదము.

సఖులు—ఆర్యా! యీప్రార్థనము మా కనుగ్రహము గదా!

రాజు—భగవానులు కాశ్యపులు శాశ్వతబ్రహ్మనిష్ఠు లని గదా సుప్రసిద్ధులు! మీ చెచ్చెలి యీయమ యాయనతనయ యనెద విది యెట్లు?

అన—దేవర యవధరింప వలయును. కౌశికుఁ డని గోత్రనామము వహించిన మహాప్రభావసంపన్నుఁడు రాజర్షి కలఁడు.

రాజు—కలఁడు. విని యున్నాము.

అన—ఆయనయే మాప్రియసఖిని గన్నవాఁడు. అతఁడు విడువఁగా శరీరవర్ధనాదులు గావించుటవలనఁ గాశ్యపు లీమెకుఁ బితరు లయిరి.

రాజు—"విడువఁగా" నను మాటవలన నాకుఁ గౌతూహలము పొడముచున్నది ఆమూలాగ్రము వినఁ గోరుచున్నాను.

అన—ఆర్యా! యాలకింపుఁడు. పూర్వ మారాజర్షి యుగ్రతపస్సు చేయుచుండఁగా, దేవత లెంతయు భీతి నొంది, యాయన నియమమున కంతరాయముఁ జేయుటకయి మేనక యనునచ్చరను బుచ్చిరి.

రాజు—పరతపోభీరుత్వ మాదిత్యులకు సర్వదా యున్నదే. తరువాత?

అన—తరువాత వసంతావతారసమయమునందు సున్మాదకారి యగు నామె చక్కఁదనముఁ జూచి—(సగము చెప్పి సిగ్గు వడుచున్నది.)

రాజు—అవలఁ దెలియవచ్చుచునే యున్నది. ఈమె సర్వథా యప్సరస్సంభవయే.

అన—మరేమి?

రాజు—సరిగా నున్నది.

ఆ. వె. ఇట్టిరూపమునకు నెట్టులు పుట్టువు
కలుగు మర్త్యజాతికన్యలందుఁ?
బ్రస్ఫుటాద్భుతప్రభాతరళం బగు
జ్యోతి ధాత్రినుండి యుదిత మగునె? ౨౭.

శకుం—(తల వాంచుకొనుచున్నది.)

రాజు—(తనలో) నామనోరథమున కవకాశ మున్నది. కాని నవ్వులాలకు సఖి

యుదాహరించిన యీమెవరప్రార్థనావిషయ మాలకించి నామనస్సు ద్వైధీభావమునఁ దల్లడిల్లుచున్నది.†

ప్రియం—(చిఱునవ్వుతో శకుంతలను జూచి నాయకాభిముఖి యయి) అయ్యా తా మేమో మరలఁ బలుకఁ దలఁచినట్లు కనఁబడుచున్నారు.

శకుం—(సఖిని వ్రేలితో బెదరించుచున్నది.)

రాజు—కల్యాణీ! నీవు చక్కఁగాఁ దెలిసికొంటివి. సచ్చరిత్రశ్రవణమునందలి యభిలాషవలన నింకొకటికూడ నడుగ వలసి యున్నది.

ప్రియం—సంశయ మేటికి? తపస్విజనుల నేప్రశ్న మయిన సంకోచింపక యడుగఁ దగును గదా!

రాజు—మీసఖిని గూర్చి తెలియఁ గోరుచున్నాను.

ఉ. దాన మొసంగుదాఁకఁ దను, దర్పకకృత్యనిరోధి యైనవై
ఖానసదుష్కరవ్రతముఁ గన్నియమిన్న సమాచరించునో?
యీనియమంబుతోన మదిరేక్షణవల్లభ లోకురంగపుం
జానలతోడ సఖ్యమును సల్పుచు నెల్లపుడుఁ వసించునో.§ ౨౦

ప్రియం—అయ్యా! యీజనము ధర్మాచరణమునందు సయితముఁ బరాధీనమే. అనురూపవరున కీమె నిచ్చుటయందుఁ దండ్రిగారిసంకల్పము.

రాజు—ఈప్రార్థనము దుర్లభము కాదు గదా? $

(హర్షముతోఁ దనలో)

---

† నవ్వుటాలకు......తల్లడిల్లుచున్నది—అనఁగా వెనుక శకుంతల వనజ్యోత్స్నను జూచుచున్నప్పుడు ప్రియంవద యన్ననవ్వుటాలమాట స్మరించి, "యీమెకు నేను దగినవరుఁడ నగుదునా?" యనుతలంపుతో నట్లనుకొనుచున్నాఁడు.

§ ఈవ్రతము పెండ్లి యగుపర్యంతమే చేయునా? పెండ్లియే లేక యెల్లపుడు నిట్లే వైఖానసవ్రత మవలంబించి యుండునా? యని తాత్పర్యము. ఇందు 'మదిరేక్షణ' యనుచో 'సదృశేక్షణ' యని పాఠాంతరము.

$ ఈప్రార్థనము......గదా? ఇది కాక్వర్థకము గాన, ననురూపవరున కిచ్చు సంకల్పము, సిద్ధించుట దుర్లభ మగు నేమో యని భావము. ఈభావమువలన శకుంతలా సౌందర్యాదులు వ్యంగ్యములు. ఈవాక్యము కొన్నిప్రతులలో స్వగతము.

తే. గీ. డెంపమా! పొందు మభిలాష, సందియంబు
నందు నిర్ణయ మిప్పుడు పొందు పడియె ;
ముందు నిప్పను శంక నీ కెందు మిగుల
జెందె నది యంట నగుసుసువింప మయ్యె.                    ౨౯.

శకుం—(కోపించినట్లు) అనసూయా ! యిదిగో ! నేను వెళ్ళెదను.

అన—ఎందునిమిత్తము ?

శకుం—ఈయసంబద్ధప్రలాపినిని గూర్చి పూజ్యురాలగు గౌతమికి నివేదించుటకు.

అన—సఖీ ! వచ్చి యున్నయతిథివరుని సత్కరింపక విడిచిపెట్టి స్వచ్ఛందముగా వెడలి పోవుట యాశ్రమవాసిజనమున కుచితము కాదు.

శకుం—(ఏమియు ననక వెడలి పోవుచున్నది.)

రాజు—(తనలో) అయ్యో ! వెళ్ళి పోవుచున్న దేమి ? (పట్టుకొనఁ గోరుచుఁ దన్నుఁ దాను నిలుపుకొని) ఓహో ! కామిజనమనోవ్యాపారము చేష్టాప్రతిరూపముగానే యుండును గదా! ఇప్పుడు నేను—

క. చనఁ జూచి తెగువ మునిసుత
వెనువెంటను, నిలుపఁబడితి వినయముచే ; దా
వునఁ గదల కుండియును, బో
యి నివృత్తుఁడ నయినయట్టులే భావింతున్.                    30.

ప్రియం—(శకుంతల నాఁపి) సఖీ ! నీవు వెళ్ళిపోవుట యుచితము కాదు.

శకుం—(బొమముడిపుతో) ఎందుచేత?

ప్రియం—నీ వీరెండుచెట్లకు నీళ్ళు పోయ నాకచ్చి యున్నావు. నాయప్పు దీర్చి పోదువు గాని రా. (బలవంతముగా మరలించుచున్నది.)

రాజు—ఓదయామతీ! ^(1)^వృక్షసేచనముచేతనే యీమె యలసిన దని నేను దలంచుచున్నాను. చూడు.

---

(1) వృక్షసేచనముచేతనే—కాముకుఁ డయినరాజు పలికినయీమాటలోన వ్యంగ్యార్థమే మయిన నుండక పోదని తోఁచెడిని.

†సీ. పూన ఘటంబుఁ ద్రిప్పంగఁ గడు మూఁపులు; గెలెఱు పెక్కె మిక్కిలిచేఁ
ఘూనగు మీఱె నూర్పదుసు మానదు చన్గవ యిప్పుడున్ ; చెవిం
బూనుశిరీష మంటుకొన, మోమునఁ జెమ్మట గ్రమ్మెఁ ద్రస్తమై
వేనలి, వ్యస్త మౌ సెఱు లివే ముడువంబడు నొక్క చేతితో. 30.

కాఁబట్టి యీ మెఋణమును నేను దీర్చెదను. (ఉంగరము నీయఁ జూచుచున్నాఁడు.)

సఖులు—(నామముద్రాక్షరములను జదువుకొని యొండొరులఁ జూచుకొనుచున్నారు.)

రాజు—అన్యథా తలంపకుఁడు. ఇది రాజప్రతిగ్రహము గావున నన్ను రాజపురుషునిఁ గాఁ దెలిసికొనుఁడు.

ప్రియం—అట్లయిన నీయుంగరమునకు భవదీయాంగుళీవియోగ మర్హము గాదు. మీమాట చేతనే యీ మెయప్పు దీఱిపోయినది. సఖీ! శకుంతలా! కనికరము గలయీ యార్యుఁడు, కాదీమహారాజు నిన్ను విడిపించినాఁడు. నీ విఁకఁ బొమ్ము.

శకుం—(తనలో) నేను స్వతంత్రురాలనే యయితినా—(ప్రకాశముగా) నన్ను విడుచుటకుఁ గాని నిలుపుటకుఁ గాని నీ వెవతెవు?

రాజు—(శకుంతలను జూచుచుఁ దనలో) ఈమె మీఁద నా కెట్లున్నదో యీ మెయు నామీఁద నట్లే యుండునా? ఉండ కేమి? నామనోరథమున కవకాశ మున్నది.

---

† ఘూనగు=[illegible]; [illegible]. అంటుకొనన్—అనఁగా దిరిసెపుఁబువ్వు [illegible] గలది గనుక, నది చలింపక యంటుకొని. [illegible]—[illegible]యిన దనుట; వేనలి=కొప్పు; వ్యస్తము= [illegible]; [illegible]......నొక్క చేతితో—అనఁగా ముడి వీడి వెండ్రుక లంతట [illegible]గా, నొక హస్తము కుండను బూని యున్నందున రెండు చేతులతో ముడి వేసికొన వలనుపడక యొక్క చేతితో ముడుచుకొనుచున్నదనుట; వృక్షసేచనవ్యాపారము చేత నలసినశకుంతలాలక్షణంగియుండు స్వాభిలాషానుగుణముగా రాజు రతివిశేష జనితచిహ్నములను గల్పించి వర్ణించుచున్నాఁడని యిందు వ్యంగ్య మూహించునది. “బంధే స్రంసిని చైకహస్తయమితాః పర్యాకులా మూర్ధజాః” అనుమూలమునందలి బంధస్రంసనము మూర్ధజపర్యాకులత్వమునకును, బర్యాకులత్వము యమితత్వమునకును గారణములుగా నూహించుట రమ్యము.

తే. గీ. మానవులతోడఁ గలుపదు గాని తనదు
పలుకు, నిటు వీను లొగ్గి నేఁ బలుకు మన్న;
కాక యభిముఖి గాక యున్నను, నితాంత
మన్యవిషయము గా దీయ దతివదృష్టి. ౩౨.

[తెరలో]

ఓహో! యాసన్నతపస్వులారా! తపోవనసత్త్వములఁ గాపాడుకొనుఁడు. మృగయావిహారి దుష్యంతమహారాజు చేరువ నున్నాఁడు. అందుచేత నే గదా—

తే. గీ. సంజనీరెండ రేఁగినజవనతురగ
ఖురపుటమ్ములధూళి, వ్రేల్గొమ్ములందు
నార్ద్రవల్కలసంచయం బాఱఁ గట్టు
తరువులను నిండు మిడుతలదండు వోలె. ౩౩.

మఱియు—

శా. చండాఘాతవిఖండితక్షితిరుహస్కంధంబు దంతాగ్రమం
దుండన్, గాళుల శృంఖలాకృతి లతావ్యూహంపుఁ జెంజుట్ట రా,
శుండాలంబు రథావలోకనభయక్షుబ్ధం బిదే యాశ్రమం
బుం డాసెం బొరిగొంచు జింకలఁ †దపోమూర్తిర్భవద్విఘ్న మై. ౩౪.

అందఱు—(విని సంభ్రాంత లగుచున్నారు.)

రాజు—(తనలో) అయ్యో! యెంత కష్టము! సైనికులు నన్ను వెదకుచుఁ దపోవనము నరి కట్టుచున్నారు. కానీ నేను వెళ్లెదను.

అన—ఆర్యా! యీయడవియేనుఁగువృత్తాంతమువలన మాస్వాంతములు గలంతఁ జెందినవి. పర్ణశాలకుఁ బోవ ననుజ్ఞ యొసఁగుఁడు.

రాజు—మీరు వెళ్లుఁడు. నే నాశ్రమపీడ గా కుండఁ బ్రయత్నించెదను.

అందఱు—(లేచుచున్నారు.)

సఖులు—ఆర్యా! సత్కారము పడయఁ గాంచనిమీతోఁ బునర్దర్శనార్థము విన్నవించుటకు లజ్జించుచున్నాము,

రాజు—అట్లు కాదు. మీదర్శనముచేతనే నేను సత్కృతుఁడ నయితిని.

శకుం—అనసూయా! సూదివంటిక్రొత్తదర్భ నాపాదమున గ్రుచ్చుకొన్నది. నావల్కలము కురవకవృక్షశాఖను దగులుకొన్నది. దీనిని వదలించుకొని వచ్చునంతకు నాకోసరము నిలువుఁడు.‡

(సవ్యాజముగా నాలసించుచు, రాజును జూచుచు సఖులతో నిష్క్రమించుచున్నది.)

---

† తపో...విఘ్నమై=మునులతపములకు విఘ్నము గజరూపము దాల్చి వచ్చెనో యని గమ్యోత్ప్రేక్ష. ‡ ఈవాక్యత్రయము కలకత్తాప్రతియం దున్నది.

రాజు—(నిట్టూర్పు పుచ్చి) అందఱును వెళ్ళిపోయిరి. కాని. నేనును బోయెదను. శకుంతలాదర్శనమున నాకు నగరగమనౌత్సుక్యము తగ్గిపోయినది. వెంట వచ్చినవారిని గలసికొని తపోవనమునకుఁ గొంతదూరమున విడియించెదను. శకుంతలావ్యాపారమువలననుండి నామనస్సు మరలింపఁ జాలకున్నాను.

ఆ. వె. నడుచు ముందటికిని నాశరీరము, పఱ
చెడును వెనుక కపరిచితము మనము,
గొప్పగాలి కెదురు గొంపోవుకేతుచీ
నాంబరంబు వోలె నవశ మగుచు. 3౫.

అందఱు—(నిష్క్రమించుచున్నారు.)

గద్యము. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వర్ధాదిసాధు
ఫంకతీరనీరాకరరాకాసుధాకరాచ్చనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్ర
గుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధాన
తనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధేయాంధ్రీ
కృతాభిజ్ఞానశాకుంతలనాటకంబునందుఁ
ప్రథమాంకము.



శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

అభిజ్ఞాన

# శాకుంతలనాటకము.

## ద్వితీయాంకము.

[తరువాత విదూషకుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

విదూ—(నిశ్వసించి) అయ్యో! మృగయాశీలుం డయినయీరాజునకుఁ జెలి కాఁడ నయి నేను జచ్చిపోవుచున్నాను. ఇదిగో! లేడి, యిదిగోఁ! పంది, యిదిగోఁ! పులి యని, మండువేసంగి యగుటచే నంతగా నీడ లయిన లేనికానలయందు మట్ట మధ్యాహ్నమునఁ గూడఁ దిరుగులాడ వలసి వచ్చినది. కాకులు ముల్లి కుల్లి పోవుటచేఁ గషాయ మయినవెచ్చవెచ్చనికొండవాఁగులనీళ్లు ద్రాగ వలసి వచ్చినది. వేళగానివేళలఁ, దఱుచుగఁ గఱుకుట్లమాంసము తిండికి సంభవించుచున్నది. గుఱ్ఱముతోఁ గూడఁ బరుగు వాఱుటచేఁ గీళ్లు సడలి నాకు రాత్రి యయినను దిన్నగా నిద్ర పట్టినది గాదు. అందుపయి నెంతో తెల్లవాఱుజామునఁ దొత్తుకొడుకులు వేఁపివేఁటకాండ్రు గావించువనసీమాగ్రహణకోలాహలము, పట్టినకునుకు పాడుచేసినది. ఇంతటితో నయినఁ గష్టము గట్టెక్కినది కాదు. పుండుమీఁదఁ బొక్కు పొక్కినది. నిన్న మే మందఱము వెనుకఁ బడఁగా వేఁటవెంబడి నాశ్రమపదము చొత్తెంచినయామహాత్మునికి నా దురదృష్టమున శకుంతల యనుజడదారికన్నియ కంటఁ బడిన దంట. ఇప్పు డతఁడు నగరగమనముమాట యేనిఁ దలపెట్టఁడు. రేయెల్ల నాయమ్మనే తలపోసి కొనుచుండు నాతనికన్నులనే బల్లునఁ దెల్లవాఱినది. ఏమిగతి? సమయకృత్యములు సలిపి యలంకృతుఁ డయి యున్నవయస్యుని సందర్శించెదను. (నడచి చూచి) ఇదిగో! విండ్లు చేతఁ బట్టుకొని, యడవిపువ్వులదండలను దాల్చినయవనవనితలు చుట్టును బలసికొలువఁ జెలికాఁ

దీలాగుననే వచ్చుచున్నాఁడు. కానీ. ఒడలు వశ మంతి కదల లేక యున్నవానివలె నుండెదను. ఈవిధి నయిన నించుక విశ్రాంతి నొందెదను. (చేతికఱ్ఱ సానుకొని నిలుచున్నాఁడు.)

(ప్రవేశకము.)

[తరువాత ముందు చెప్పినపరివారముతో రాజు ప్రవేశించుచున్నాఁడు.]

రాజు—(చింతతో నిట్టూర్పు పుచ్చి తనలో)

క. ప్రియ సులభ గాదు గాని, హృ
దయ మూఱడిలుం గ్రహించి తద్భావం బా
శయజాఁ డకృతార్థుఁ డయినం
దయితుల కొండొరులప్రార్థనమె రతి నొసఁగున్.† ౧.

(స్మృతి నభినయించి నవ్వి) ఇట్లు కాముకుఁడు తనకోరిక కనుగుణముగాఁ దా వలచిన మత్తకాశినిచిత్తవృత్తిని సంభావించుకొని మోస పోవుచున్నాఁడు.

చ. కనుఁగవఁ దాఁప్పు చొండెడను గన్నియ చూచినకూర్మిచూపులుం;
బెనుకటిఁ ద్రేఁగునన్ నడచుమెత్తలయొయ్యారపుమందయానముల్,
చన వల దంచు సాఁపుసఖి నైఁపనిచానయసూయవాక్కులీ
యనియు మదర్థ మందు; నహహా! నిజభావమె తోఁచుఁ గామికిన్.‡ ౨

విదూ—(అట్లుండియె) ఓయి చెలికాఁడ! నాకుఁ గాలుసేతులు గదలవు. కాఁబట్టి వాఙ్మాత్రమున నిన్ను గెలిపించెదను. విజయ మొందుము.

రాజు—(చిఱునవ్వుతో) ఈయంగవైకల్య మెక్కడిదోయి?

† దీనిమూలమున రెండవపాదము "మనస్తు తద్భావదర్శనాయాసి" యని యొకప్రతిని, "...దర్శనాశ్వాసి" యని వేఱొకప్రతిని గనఁబడుచున్నది. అందుఁ బ్రశస్తమైన "ఆశ్వాసి" యనుపాఠమును బట్టి "ఊఱడిలు" నని తెలిఁగింపఁబడినది. ప్రియురాలు దొరకుట కష్టమే; అయినను దనయందు ననురాగ మున్నట్టు లామె భావము గనఁబడుచుటచే మన స్సూఁదాఱ్పును బొందుచున్న దనియుఁ బ్రేమ గలవారికిసంయోగసౌఖ్యములభింపక పోయినను బరస్పరానురాగప్రకటనమే యట్టియానందమిచ్చునని యు భావము. నిజమయినయనురాగమున కిదే లక్షణము.

‡ ఈయనియు=ఇవి యన్నియు; మదర్థమందుక్=నానిమిత్తమే యనుకొందును; నిజ......కామికిన్—తాను గామించినస్త్రీ చేయువిలాసచేష్ట లన్నిటియందును గాముకుఁడు తన భావమునే యూహించుకొను ననుట;

విదూ—ఎక్కడి దా? కన్ను పొడిచి కన్నీటికిఁ గారణ మడుగుచున్నావు.

రాజు—నా కేమియు బోధ పడ లేదు.

విదూ—వయస్యా! యీప్రబ్బలిచెట్టు మఱుగుజ్జును బోలి యుండుట స్వభావము చేతనా? నదీవేగప్రభావముచేతనా?

రాజు—నదీవేగమే దానికిఁ గారణము.

విదూ—నాకును నీవే.

రాజు—ఎట్లు గాను?

విదూ—ఆవిధముగా నీవు రాజకార్యములను మానివేసి యిటువంటివ్యాధులప్రదేశములయందు వనచరవృత్తికిఁ జాలు వడితివి. ఇఁక నేనో, నిజముగాఁ బ్రతిదినమును ఘాతుకమృగములను దఱుముటచేతఁ గీళ్లు పడిపోయినయవయవములతో వివశుఁడ నయి యున్నాను. కాఁబట్టి యిదిగో! నిన్ను బతిమాలుకొనుచున్నాను. మిత్రుఁడా! క నొక్కదిన మయిన విశ్రమింపు మని విడిచి పెట్టుము.

రాజు—(తనలో) వయస్యుఁ డీలాగునఁ బలుకుచున్నాఁడు. కణ్వపుత్రికను దలఁపోయుచు, నామనసును వేఁటకు విముఖ మగుచున్నది.

చ. గొనయముఁ గోటిఁ గూర్చి యలుఁగుం దొడి యుంచినయీధనుస్సు వం
పను మన సొప్ప దీమృగసమాజముపై, నెదఁ బ్రేమ మూరఁగా
ననయము నొద్ద నుండి ప్రియురాలికి సజ్జక మైనచూపుటొ
జ్జనమును బుజ్జవంబునను సల్పెడునట్లది నాకుఁ దోఁచుటన్.† 3.

విదూ—(రాజు మోముఁ జూచి) మిత్రుఁడా! నీ వేదో మనస్సునఁ బెట్టుకొని యాలోచించుచున్నావు. నే నరణ్యరోదనము చేసితిని గదా!

రాజు—(చిఱునవ్వుతో) మఱి వే ఱే మున్నది? సుహృద్వచనము దాఁట రా దనుకొనుచున్నాను.

విదూ—కలకాలము జీవింపుము. (లేవఁ బోవుచున్నాఁడు.)

రాజు—మిత్రుఁడా! కూర్చుండుము. నీతో నింక ను జెప్ప వలసిన దున్నది.

విదూ—మఱి చెప్పు.

రాజు—నీ వలసట దీర్చుకొన్నపిమ్మట ననాయాస మయినయొకపనిలో నాకుఁ దోడుపడ వలయును.

విదూ—లడ్డువములు దినుటలోనా?

---

† గొనయము=నారి; కోటి=ధనురగ్రము; సజ్జకము=మనోజ్ఞము; చూపుటొజ్జనము=చూపులు నేర్పుట కుపాధ్యాయత్వము; బుజ్జవంబు=లాలనము.

రాజు—ఎందులోనో చెప్పెద నుండు.

విదూ—సావధానుఁడఁగా నున్నాను.

రాజు—ఎవ రక్కడ?

దౌవారికుఁడు—(ప్రవేశించి మ్రొక్కి) దేవా! యాన తిండు.

రాజు—రైవతక! సేనాపతిని బిలిచికొని రా.

దౌవా—చిత్తము. (నిష్క్రమించి సేనాపతితో మరల వచ్చి) ఇదిగో! ఏదో యాన తీయఁ గోరి దేవరవా రివయిపే చూచుచున్నారు. సన్నిధి కరుగుము.

సేనా—(రాజును జూచి తనలో) దోషయుక్త మయినను వేఁట యేలికకు మేలే కలుగఁ జేసినది.

చ. అనవరతంబు విల్లు దివియన్ మునివైపున గట్టి వాజీ, చు
ట్టినురవిరశ్మి కోర్చి, లవ మైనను జెమ్మట లేక, చాలఁ బ
ల్చని దయినన్ దృఢత్వమును సత్వసమృద్ధియుఁ గల్గుసారపుం
దనువునఁ గాన వచ్చెడు నితం †డచలప్రచరద్విపాకృతిన్. ౪.

(సమీపించి) దేవా! జయము జయము. అడవిమృగముల నరికట్టితిమి. ఇంక నూర కుండ నేల?

రాజు—సేనాపతీ! మాఢవ్యుఁడు వేఁటను దూషించినందున, మాయుత్సాహము తగ్గి పోయినది.

సేనా—(జనాంతికముగా విదూషకునితో) సఖా! నీపట్టు నీవు వదలకుము. నే నేలినవారిచిత్తవృత్తి ననుసరించెదను. (రాజును జూచి ప్రకాశముగా) దేవా! యీ పాలసునిఁ బ్రేలుకోనిండు. ఈవిషయమున దేవరయే తార్కాణము.

చ. కరఁగుటఁ గ్రొవ్వు, పల్చ పడుఁ గడ్పెడలుం గడు లేవఁ జుల్కనౌ;
దొరకొను ‡సత్వచిత్తవికృతుల్ గనఁ దద్భయకోపవేళలన్;
శరము చలించులక్ష్యమున నాటిన ధన్వికి మెప్పు; వేఁట నెం
తురు వ్యసనంబుగా; *మృష, వినోద మిఁ కీదృశ మెందుఁ గల్గెడున్. ౫.

విదూ—(కల్లకోపముతో) ఓరీ! ప్రభువువారు స్వస్థచిత్తు లయినారు లే. నీవే యొకయడవినుండి యొకయడవికిఁ దిరుగుచు, మానిసిముక్కుఁగండల మెక్కఁ గోరు కొం డొకముదుసలియెలుఁగుగొడ్డువాతను బడి పోయెదవు.

---

† అచలము=పర్వతము. ‡ సత్వచిత్తవికృతుల్ = ప్రాణులచిత్తవికారములు;
*మృష=అసత్యము.

రాజు—భద్ర! సేనాపతి! పెక్కేల? మనమిప్పు డాశ్రమసమీపమున నున్నాము. కాఁబట్టి నీమాటను మేము పాటి సేయఁ జాలము. మఱి యిప్పుడు—

ఉ. కొమ్ములఁ జిమ్ము *చెన్ను ‡లుపకూపజలాశయవారి మున్గుతన్;
గొమ్మలనీడ లేళ్లు గుమి గూడి పరుండి నెమర్లు వేయుతన్;
నమ్మికఁ జేరి §పల్వలమునన్ గిటిసంఘము ముస్త లెత్తుతన్;
గొమ్మునరయెక్కుడించితిమి, కొండొక మావిలు విశ్రమించుతన్. ౬.

సేనా—దేవర వారిచిత్తము.

రాజు—అట్లయిన ముందుగా నడవి నరికట్టఁ బోయి యున్నవారిని మరలింపుము. తపోవనమున కిబ్బంది గా రాదు. సైనికులను దూరముగాఁ దొలఁగి పొమ్మను.

ఆ. వె. పరమశాంతు లౌతపస్వులలో దాఁగి
యుండు దహనశీల మొండు తేజ
మంటఁ దగిన వైనయర్కకాంతము లట్లు
యన్యతేజ మొరయ నది †వెలార్చు. ౭.

సేనా—చిత్తము దేవా!

విదూ—నీయుత్సాహవార్త లడఁగినవి. పోరా బానిసకొడుకా!

సేనా—(నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—(పరిజనులను జూచి) యవనికలారా! మీ రీవేఁటవేషమును దీసి వేసి కొండి. రైవతక! నీవును నీపనిమీఁద నుండుము.

పరి—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నారు.)

విదూ—నీ విప్పు డీఁగను గూడ లేకుండఁ జేసితివి. ఇఁక నీచల్లనిచెట్టునీడను దట్టముగాఁ దీఁగ లల్లుకొనినయాసనమునందుఁ గూరుచుండుము. నేనును సుఖాసీనుఁడ నయ్యెదను.

రాజు—ముందు నడువుము.

విదూ—రారమ్ము. (ఉభయులు నడిచి వెళ్ళి కూరుచున్నారు.)

రాజు—చెలికాఁడా! మాఢవ్య! నీవు కన్నులు గలఫలమును బొందక పోయితివి. చూడఁ దగినది నీకంటఁ బడ దయ్యెను గదా!

---

* ఎన్ములు=మహిషములు; ‡ఉప...శయము=నూతిదరిగుంట; §పల్వలము=అల్పసరస్సు. † వెలార్చు=వెడలింతురు.

విదూ—ఓయీ! నీవు నాయెదురనే యున్నావు గదా!

రాజు—ఎల్లరును స్వకీయమును మనోజ్ఞ మనియే తలంచుకొందురు. నే నిప్పు డాశ్రమాలంకార మయినయాశకుంతలను గుఱించి ప్రస్తావించితిని.

విదూ—(తనలో) కానీ. నే నీతని కవకాశ మీయను. (ప్రకాశముగా) వయస్యా! నీవు తాపసకన్యకను గామించినట్లు కనఁబడుచున్నావు.

రాజు—మిత్రుఁడా!

తే. గీ. అభిముఖ్యము వహియించి యఖిల మయిన
జనము, లెప్పలు వాల్పనిక మలతోడ,
నెలపొదుపునాఁటిజాబిల్లి కళను నెట్టి
కైవశీమనంబులోఁ డను గంద్రు? చెపుమ. † గా.

పరిహరింపఁ దగినవస్తువులమీఁదికిఁ బౌరవులమనస్సు పోవదు సుమీ.

విదూ—అట్లయిన నిది యేమి?

రాజు—తే. గీ. పుట్టె నఁట యప్సరసకడుపునను, నామె
విడువ, బిడ్డగ మునికి లభించె నంట,
వనిని నవమాలికాప్రసవంబు జాఱి
ప్రోల జిల్లేడుమీఁదను రాలి నట్లు. గా.

విదూ—(నవ్వి) మిత్రుఁడా! స్త్రీరత్నములను దిరస్కరించుచున్న నీ కామె మీఁద వాంఛ పుట్టుట, మధ్దఖర్జూరము దిని విసిగి పోయినవానికిఁ జింతపండుమీఁద మనసు పోవుట గదా!

రాజు—వయస్యా! నీ వామెను జూచి యెఱుఁగవు. కావున నిట్లు పలుకుచున్నావు.

విదూ—నీకుఁ గూడ విస్మయము పుట్టించునది రమణీయమే కావలయును గదా!

రాజు—వయస్యా! పెక్కు లేల?

† దీనిమూలము కొన్ని ప్రతులలో లేదు.

†ఉ. వ్రాసి పటంబులోన విధి ప్రాణము వోసెనొ, మానసంబునన్
జేసెనొ రూపసంచయము చేతను? గాదటు; వేధశిల్పవి
న్యాసవిభుత్వమున్, గలికి యంగకసౌష్ఠవ మింత చింతసం
జేసినఁ, గన్య యన్యవిధి స్త్రీమణిసృష్టి య టంచుఁ దోఁచెడున్. ౧౦.

విదూ—అట్లయిన నీకిఁ జక్కనిచుక్కల కెల్లఁ బరాభవమే.‡

రాజు—నామనసున నిది కూడఁ దోఁచుచున్నది.§

---

“శ్లో. చిత్రే నివేశ్య పరికల్పితసత్త్వయోగా
రూపోచ్చయేన మనసా విధినా కృతా ను
స్త్రీరత్నసృష్టి రపరా ప్రతిభాతి సా మే
ధాతు ర్విభుత్వ మనుచింత్య వపుశ్చ తస్యాః.” అని యీపద్యమునకు మూలము.

† ఈపద్యమునందు శకుంతల కసామాన్యసౌందర్యప్రాప్తివిషయ మయి హేతువులఁ గల్పించి రాజు వర్ణించుచున్నాఁడు. ఎట్లనఁగా గర్భస్థపిండమును స్వాభిలాషానురూపముగాఁ జక్కఁ బఱచుట కవకాశము గలుగదు గావున, బ్రహ్మ తన మనస్సు తృప్తి పొందునట్లుగా నత్యద్భుతసౌందర్యము గల యొకస్త్రీని చిత్తరువున లిఖించి దానికి జీవము పోసియుండునా? హృదయమున నూహించినంతచక్కఁదనము వ్రాఁతయందుఁ దెచ్చుట యసాధ్యము గాన, హస్తాదిస్పర్శము లే కుండఁ జంద్రచంచలాద్యుపమానవస్తుసామగ్రితో నీమె నవ్విధి మనస్సుచేతనే నిర్మించి యుండునా? ఈ రెండుపక్షములును సరి గావు. (స్త్రీలలో నెల్ల నెక్కుడుసౌందర్యము గలయప్సరః ప్రభృతుల సృజించిన) విధాత సామర్థ్యమును, (దాదృశదేవతాస్త్రీలలో నెవరిని గాని పోల్ప రానిలోకోత్తరసౌందర్యము గల) శకుంతలారూపమును నీరెంటిని విమర్శించి చూడఁగా, నింతచక్కనిస్త్రీని నిర్మించుసామర్థ్యము ప్రాఁతవిధాతకు లే దనియు, నిది యొకానొకనూతనవిధాతచేత నయినస్త్రీరత్నసృష్టి యనియుఁ దోఁచుచున్న దని తాత్పర్యము.

‡అట్లయిన......పరాభవమే—ఈమాట పయియర్థము స్థిరపఱుచుచున్నది.
§నామన......చున్నది—బ్రహ్మకుఁ గలసామర్థ్యములలో నొకటి యగుసృష్టివిషయ మయి యూహించుట యయినది గావున,నీకిఁ దదనురూపఘటనవిషయ మయి చెప్పఁ బోవుచున్నాఁ డని యెఱుంగునది.

¶ సీ. కానని రత్నకందళము, *కైకొనగిల్లని పల్లవంబు, మూ
ర్కొనని లసత్ప్రసూన మెవరున్ రస మానని యట్టి క్రొత్తపూఁ
దేనె, యఖండమైన సదదృష్టఫలంబును బోలె నీ చెలువంబు
నూనని యీ మెఱుం బెవనిఁ బొందఁగఁ జేయునో ధాత యిమ్మహిన్. ౧౧.

---

*కైకొనన్ = హస్తాగ్రమున.

¶ భావనిశ్చయమునకయి దీనిమూలము నే ముందుగ విమర్శింప వలసి యున్నది.

"శ్లో. అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదితరసమ్
అఖండం పుణ్యానాం ఫల మివచ తద్రూప మనఘం
నజానే భోక్తారం క మిహ సముపస్థాస్యతి విధిః."

శాకుంతలనాటకములో నీశ్లోకము సుప్రసిద్ధమైనది. ఇది ముఖస్థము గాని సంస్కృతపండితులు సాధారణముగా నుండరు. ఇందు శకుంతలారూపమునకుఁ బుష్పముఁ, గిసలయము, రత్నము, మధువు, ఫలము ననునయి దుపమానములు చెప్పఁబడి యున్నవి. ఈయయిదింటిలో నట్టనడుమఁ బడినరత్నమునకుఁ దక్క, దాని కీవల నావల రెండు రెండుగా నున్నవాని కుపమానములకును బరస్పరసంబంధము మిక్కిలి గనఁబడుచున్నది. రత్నమునకు మాత్రము మిగిలినయుపమానములలో దేనితోఁ గాని లేశమును సంబంధము గానరాదు. మఱియు సంబంధము గలయుపమానము లయినను పౌర్వాపర్యక్రమము గలిగి యుండక, ముందు పుష్పము, తరువాతఁ గిసలయము, నావెనుక మధువు నని యిట్లు వ్యత్యాసపడి కనఁబడుచున్నవి. ఈకారణములచేత నీశ్లోకమునఁ గవికల్పిత మయినపాఠమున కిటీవల నేమయినఁ బ్రమాదము తటస్థించి యుండు నేమో యని తోఁచుచున్నది. ఈవ్యత్యాసమును గుఱించి వ్యాఖ్యాతలేమియు వ్రాసి యుండలేదు. పుస్తకాంతరములయందుఁ బాఠభేద మయినను గానఁబడ లేదు. దీనిప్రథమద్వితీయపాదముల మొదళ్లు పాఠకులచేఁ దార్మాఱు పఱుపఁబడి యుండు నేమో యని యూహింప నయ్యెడును. కాఁబట్టి యీరెండుచరణము లీక్రిందివిధమునఁ జదివి చూడుఁడు.

"శ్లో. అనావిద్ధం రత్నం కిసలయ మలూనం కరరుహై
రనాఘ్రాతం పుష్పం మధు నవ మనాస్వాదితరసమ్."

శేషము సమానమే. ఈమార్పువలన 'అనావిద్ధం రత్న' మ్మనునది తొంటివలె సంబంధము లేనిదిగానే యున్నను, మిగిలినవానికి మాత్రము "చిగురు, పువ్వు, తేనె, పండు" నని యొకక్రమ మేర్పడుచున్నది. ఈక్రమమునుబట్టి యాలోచింపఁగా శ్లోకారంభ

మందలియుపమానము, చిగురుకంటెఁ బూర్వమునఁ బొడమునంకుర మయి యుండ వల యును. రత్నపదమున కంకురార్థము గానఁబడదు గాని యట్లుండినచో నప్పు డది చక్షురింద్రియమునకును, దానితరువాతిమూఁడును వరుసగాఁ దృగ్ఘ్రాణరసనేంద్రియము నకును,గట్టకడపటి దగుఫలము శ్రోత్రేతరము లయినసర్వేంద్రియములకును విషయములు గాఁ దగిన వయి, శకుంతలారూప మింద్రియముల కనిర్వాచ్య మయినయత్యద్భుతానం దము గలిగించునది యనుసరస మయినవ్యంగ్యము దోఁచింపఁ గలవు. శ్రోత్రేంద్రియ గోచర మయినయుపమాన మేదియుఁ దత్కాలయాదులకుఁ బొసఁగనందునఁ గాఁబోలు నిందుఁ జెప్పఁబడలేదు. పాఠక్రమమును గూర్చి చర్చించుట యయినది గావున నిఁక నర్థమును గూర్చి కూడ నించుక విచారింప వలయును.

"అనాఘ్రాతం పుష్ప" మ్మనఁగా నాఘ్రాణింపఁబడనిపు వ్వని యర్థము. ఈ యర్థమువలన "నిట్టిపుష్ప మీవఱకేలోకములోను లేనందున నిది యనాఘ్రాతమా? ఉండియు నిప్పటి కనాఘ్రాతమా?" యని మనస్సు సంశయాధీన మగుచున్నది గాని, దీనికిం బూర్వశ్లోకమునందు "స్త్రీరత్నసృష్టి రపరా ప్రతిభాతి సా మే" యని శకుంతల నూతనబ్రహ్మసృష్టిగా వర్ణింపఁబడి యున్నది గనుక, "నీవఱకేలోకము లోను లేనందుననే" యనాఘ్రాత మని సిద్ధాంతము చేయ వచ్చును. మఱియు మూలమునందు "మధు నవ మనాస్వాదితరస" మ్మని నవ,రసపదములఁ బ్రయోగించుట పైభావమునే స్పష్టపఱుచుచున్నది. అట్లు గాక "ఉండియు నిప్పటి కనాఘ్రాత" మనెడుపక్షమున నట్టిస్థితి కన్యకాజనమున కెల్ల సాధారణమే గాన నందువలన శకుంతల కుత్కర్ష మేమియుఁ గలుగనేరదు. ఆపక్షమున "అనాస్వాదితం మధు" వని యున్నం జాలును. నవ,రసశబ్దము లనావశ్యకములు. "కిసలయ మలూనం కరరుహైః" ఇత్యాదుల యందుఁ గూడ నీలాగుననే భావ మూహించుకోవలయును. అనేకజన్మసంచిత మయిన యెవనిపుణ్యమో శకుంతలారూపమున నపూర్వముగా నంకురించి, చిగిరించి, పుష్పించి, ఫలించి యున్న దనియు, దాని ననుభవించుతత్పుణ్యాత్ముని విధాత బయలు పఱుపఁ గలఁ డనియుఁ దాత్పర్యము. ఈభావము ననుసరించి పయిపద్యము వ్రాయఁబడినది "అనావిద్ధం రత్న" మ్మనుపాఠమే సరి యన్నచో నీక్రింది పద్యము చదువునది.

తే. గీ. గోర గిల్లనిచిగురు, మూర్కొననిపువ్వు,
చవి గొననిక్రొత్తతేనెఁ దొలువనిరతన
మా మెయిరూప మఖండపుణ్యఫల మనఘు
నెవ్వ నిట విధి యెవనిఁ జేయునో యెఱుంగ. ౧౮

విదూ—అట్లయినఁ దలకు గారసూనియు మెఱుఁగు వెట్టుకొనుకొండొకజడ దారియడవిమానిసి చేతిలోఁ బడి పోవు నేమో, శీఘ్రముగాఁ గాచుకొమ్ము.

రాజు—ఆమె పరాధీనురాలు, జనకులును జెంత లేరు.

విదూ—మఱి నీపయి నామె చూపులతీపి యెట్టు లున్నది?

రాజు—తాపసకన్యలు సహజముగాఁ బ్రగల్భురాండ్రు గారు గదా! అయినప్ప టికిని—

చ. తెలివ గిలుక్కనం దనదుదృష్టి మరల్చెను నేఁ డనుం గనన్;
జెలునగ వన్యకారణముచే బలె నవ్వెను బువ్వుఁబోణి; యి
ట్లెలుఁగున లేదు దా ‡నిజసృతిన్ వినయంబున నడ్డగించుటన్
మఱుఁగు వడంగ నేరఁడును మారుఁడు బైలు వడంగఁ జాలఁడున్. ౧౨.

విదూ—ఏమి? మఱి యట్లు గాక చూచినంతమాత్రాన నాయమ్మ నీతొడ మీఁద వచ్చి కూరుచుండునా?

రాజు—సఖులతోఁ గూడ దాను వెడలి పోవునప్పుడు వినయవతి యయ్యును నాయెడ నధికముగా నిట్లు తనభావముఁ గనఁబఱిచినది.

చ. తనపదమందుఁ గ్రుచ్చుకొనె దర్భతృణాంకుర మంచు నల్లనం
గొనియకుఁగుల్ గమించి లతకూన నిలంబడె నూర కొక్కచోఁ;
వెనుకకుఁ ద్రిప్పె నెమ్మొగము వృక్షలతానిచయంబునం దగుల్
కొనకయ యున్నవల్కలముఁ గోదులి దా విడిపించు చొక్కచోన్. ౧౩.

విదూ—§అట్లయిన వేవేగ మామెసహగమమునకుఁ దగినసన్నాహము గావిం పుము. నీ వీతపోవనము నుపవనముఁ జేసికొంటి వని తలంచెదను.

రాజు—మిత్రుఁడా! యిక్కడ నున్నందున నన్నుఁ దపస్వులు బాగుగ నెఱింగి యున్నారు. మన మేనెపమున మఱియొకమా టాశ్రమపదమునఁ బ్రవేశింతము.

విదూ—వేఱునెప మేమి యున్నది? నీవు రాజవు గావా?

రాజు—అయిన నేమి?

విదూ—నివ్వరిపంటలో మా కారణ్యకు లాఱవపా లిత్తు యప్పనము సేయ వలయు నని ప్రవేశింప వచ్చును.

---

‡ నిజసృతిన్=తన(మారుని)మార్గమును. § అట్లయిన... గావింపుము—"గృహీతపాథేయో భవ" అని మూలము. "గృహీతపాథేయో భవే త్యనేన శకుంతలాసమాగమాయ సన్నద్ధో భవే త్యయ మర్థో లక్ష్యతే" అని కుమారగిరిరాజీయవ్యాఖ్యానము.

రాజు—మిత్రుఁడా! వీరలరక్షణమువలన, రత్నరాసు లయిన విడిచి కోరఁదగినవే యలోకభాగధేయము వచ్చుచున్నది. చూడు—

తే. గీ. వర్ణములవారివలన నృపాలురకును
వచ్చునట్టిఫలం బెల్ల వెచ్చ మగును;
నిచ్చ లారణ్యకులు మన కిచ్చునట్టి
తపమునాఱవపాలు వర్ధనముఁ బొందు. ౧౪.

[తెరలో]

ఓహో! కృతార్థుల మైతిమి.

రాజు—(విని యాలోచించి) ఆహా! యిది ధీరప్రశాంత స్వరము. తపస్వులు కావలెను.

దౌవారికుఁడు—(ప్రవేశించి) జయము దేవా! ఋషికుమారు లిద్దఱు వాకారమున వచ్చి యున్నారు.

రాజు—వారిని శీఘ్రముగాఁ దోడి తెమ్ము.

దౌవా—ఇదె తోడ్కొని వచ్చెద దేవా! (ఋషికుమారులతోఁ బ్రవేశించి) మహాత్ములారా! యిటు. ఇటు.

ఇద్దఱు—(రాజును జూచుచున్నారు.)

ప్రథముఁడు—ఓహో! తేజోవంత మయ్యు నీతనిమూర్తి యెంత విశ్వసనీయముగా నున్నది! లేదా ఋషికల్పుఁ డయినయీరాజునం దిది యుక్తమే కదా!

†ఉ. అందఱు సేవ్యభోగ్య మగునాశ్రమమం దితఁడు వసించు; దై
నందినపుంపపుంయు రక్షణక్రియ నీతఁడుఁ గూర్చు; సుందరీ
బృందముతోడఁ జారణులు సేయుచుఁ బాడఁగ నీజితాత్ముమే
లందెడుమున్యభిఖ్య నదె లందెడుఁ గేవల రాజపూర్వమై. ౧౫.

---

† అందఱు...(వసించు—అనఁగా ఋషులవలె స్వశాస్త్రాభిమానము లేక, యిది సకలాశ్రమధారణ వర్ణాశ్రమ అరణ్యమున నెట్లు వసింతురో, యట్లు దుష్యంతుఁడు సర్వాంకారము లక సాధ్వాశ్రమపదమున నున్నాఁ డనుట. దైనం...గూర్చు—అనఁగా రక్షణక్రియచే నితఁడును బ్రతిదినముఁ దపస్సు సేయుచున్నాఁ డనుట. సుందరీ......పూర్వమై—అనఁగా జితేంద్రియుఁ డయినయీరాజును జారణదంపతులు రాజఋషి యని దేవలోకమునఁ గీర్తింతు రనియు, ఋషికి నితనికిని రాజోపపదమాత్రభేదమే గాని వేఱుభేదము లే దనియుఁ దాత్పర్యము. మే లందెడుమున్యభిఖ్య= దేనిచే మేలు (పుణ్యము) గలుగునో యట్టిముని యనుపేరు.

ద్వితీయుఁడు—గౌతమ! యీతఁడ దేవేంద్రసఖుఁ డయినయాదుష్యంతమహారాజా?

ప్రథ—మఱేమి?

ద్వితీ—అందుచేతనే కదా!

ఉ. మేదిని నీటిపాముకకు మేరదఖండ మొకండ యేలు నీ
ఱేఁడు పురార్గళాయతభుజాండ దనఁ, గాదది వింత; వేలుపుం
బైదలు లాహవంబు దలపడ్డ సురారులతో, జయార్థ మై
యీతని యెక్కు వెట్టు విలు, నింద్రునివజ్రముఁ గోరుదుర్ గదా! ౧౮

ఇద్దఱు—(సమీపించి) రాజా! జయము జయము.

రాజు—(ఆసనమునుండి లేచి) మీ కభివాదనము చేయుచున్నాను.

ఇద్దఱు—స్వస్తి భవతే. (పండ్లు కానుక యిచ్చుచున్నారు.)

రాజు—(ప్రణామములోఁ గైకొని) మీయాజ్ఞకుఁ బ్రతీక్షించుచున్నాను.

ఇద్దఱు—తా మిచ్చట నున్నారని యాశ్రమవాసు లెఱిఁగి యున్నారు గాన మీ రొక్కటి గోరుచున్నారు.

రాజు—వా రేమి యాన తిచ్చుచున్నారు?

ఇద్దఱు—పూజ్యు లయినకణ్వమహర్షులు సన్నిధి చేసి యుండనందున రాక్షసులు యజ్ఞమునకు విఘ్నము నాపాదించెదరు. కాఁబట్టి సారథిద్వితీయు లాయుధసహాయులు నయి తాము కొన్నిరాత్రు లీయాశ్రమమును సనాథముఁ జేయ వలయు నని వేఁడుచున్నారు.

రాజు—నా కిది యనుగ్రహము గదా!

విదూ—(అపవారించి) ఇప్పు డీప్రార్థన మహానుకూలము.

రాజు—రైవతక! బాణబాణాసనసనాథ మయినరథమును దోలుకొని రమ్మని సారథితో మామాటగాఁ జెప్పుము.

దౌవా—జే దేవా! చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు.)

ఇద్దఱు—(సంతోషముతో)

---

మేదిని... మేరది=సముద్రపునలుపు సీమగాఁ గలది. లేక సముద్రపువేల యవధిగాఁ గలది. రెండవయర్థమునఁ (గల) లఘురేఫము. సముద్రపర్యంతము వ్యాపించిన దనుట. అర్గళము=తలుపుగడియ; పైదలులు=స్త్రీలు.

క. మీపూర్వుల కందగు కను
రూపుఁడ వగునీకు యుక్తరూపము యిది యౌ;
‡నాపన్నాభయసత్ర
వ్యాపృతదీక్షితులు గారె పౌరవు లెల్లన్? ౧౬

రాజు—మీరు ముందుగా నేగుఁడు. నేనును మీవెనువెంటనే వచ్చెదను.

ఇద్దఱు—రాజా! జయము. (నిష్క్రమించుచున్నారు.)

రాజు—మాధవ్యా! నీకు శకుంతలాసందర్శనకుతూహలము గలదా?

విదూ—మొట్టమొదట నది వెల్లి వొడిచినది గాని యిప్పు డీరాక్షసవృత్తాంతము వలన నొక్కచుక్క యయినను మిగుల కుండ నిగిరి పోయినది.

రాజు—భయపడకు. నాదగ్గఱనే యుందువు గదా!

విదూ—అట్లయిన రాక్షసులబారికిఁ దప్పితిని.§

దౌవా—(ప్రవేశించి) దేవా! జయము జయము. తే రాయితం బయి దేవరవారు విజయంచేయుట కెదురు చూచుచున్నది. మఱి యిదె పట్టణమునుండి దేవిగారి యానతిని గయికొని కరభకుఁడు వచ్చియున్నాఁడు.

రాజు—(సాదరముగా) అమ్మగారు పంపినారా?

దౌవా—మఱేమి!

రాజు—అయినచోఁ బ్రవేశపెట్టుము.

దౌవా—చిత్తము. (నిష్క్రమించి కరభకునితో మరల వచ్చి) అదె రాజుగారు, సన్నిధికిఁ బొమ్ము.

కర—(సమీపించి) దేవా! జయము జయము. ¶"నాలవనాఁడు పారణ చేయఁదగినకొండొక యుపవాసవ్రతము నేను జేయఁ బోవుచున్నాను. ఆదినమునఁ జిరం

---

‡ఆపన్నా......దీక్షితులు=ఆపద నొందినవారి కభయదానము చేయుపని యందు దీక్ష గలవారు. §"ఎవ్వఁడును వచ్చి విఘ్నము సేయనియెడల నీరథమునకుఁ జక్రరక్షకుఁడ నయ్యెదను." అను నర్థ మిచ్చుపాఠ మొకటిమాతృకాంతరమున నున్నది.

¶ నాలవ......బోవుచున్నాను—"ఆగామిని చతుర్థే దివసే నిర్వృత్తపారణ ఉపవాసో మమ భవిష్యతి" అని మూలము. ఇది జ్యేష్ఠమాసపూర్ణిమను జేయఁబడు "వటసావిత్రీవ్రత" మని తద్విధానము గూడ స్కాందపురాణమునుండి కుమారగిరి రాజీయవ్యాఖ్యయందు వ్రాయఁబడినది. నాటకాదిని గ్రీష్మఋతువు వర్ణింపఁబడినది గావున నీవ్రత మదియే కావచ్చును.

జీవి యవశ్యము సన్నిహితుఁడు గావలయు" నని దేవిగారు తమ కాజ్ఞాపించి యున్నారు.

రాజు—ఇక్కడఁ దాపసకార్యము, అక్కడ గురుజనాజ్ఞ. రెండును దాఁట రానివే. ఇందులకుఁ బ్రతివిధాన మేమి?

విదూ—త్రిశంకునివలె నడుమను బ్రేలాడు చుండుము.

రాజు—నీపరిహాసము చాలింపుము. నిజముగా నేను జాలచింత పడుచున్నాను.

క. ఇరుకృత్యంబులు నొకచెనఁ
*బరఁగమి నామనసు ద్వివిధభావము నొందున్,
గిరి యెదురం బ్రతిహతమగు
సరిత్ప్రవాహంబుతోడ సామ్యము గనుచున్. ౧౭.

(ఆలోచించి) మిత్రుఁడా! నిన్నమ్మగారు పుత్రుఁడని ప్రతిగ్రహించి యున్నారు. కాఁబట్టి నీ విక్కడనుండి తిరిగి వెళ్లి, నా దగుతపస్వికార్యపరాయణత్వము నివేదించి యమ్మగారికిఁ బుత్రకృత్యము నిర్వహింప వలయును.

విదూ—నన్ను రాక్షసులకు భయపడినవానిని గాఁ దలంచుకోవు గద?

రాజు—ఓయి మహాబ్రాహ్మణ! నీయందట్టితలంపు నా కేలాగునఁ గలుగును?

విదూ—అట్లయిన రాజుగారి తమ్ముఁ డేలాగున వెళ్ళ వలయునో నే నట్లు వెళ్ళెదను.

రాజు—తపోవనమున కాటంకము రాఁ గూడదు గనుక, వెంట వచ్చినపరిజనుల్ల నందఱ నీతోఁ గూడ నంపెదను.

విదూ—అట్లయిన నే నిప్పుడు యువరాజ నయితిని.

రాజు—(తనలో) ఈబ్రహ్మచారి చపలుఁడు. నాకోరిక నొకవేళ నంతఃపుర జనములతోఁ జెప్పెడు నేమో; కాని. ఈతనితో నిట్లు పలికెదను, (విదూషకుని చేయి పట్టుకొని ప్రకాశముగా) వయస్యా! మహర్షులయందలి గౌరవముచేత, నే నాశ్రమమునకు బోవుచున్నాను. మునికన్య యయినశకుంతలమీఁద నాకు సత్యముగా నభిలాష లేదు సుమా. చూడు.

క. మన మెక్కడ? నంగజుమొగ
ము నెఱుంగక చిఱుకురంగములతోడఁ బెరిం

*పరఁగమి=ఉండమి—ఇది గిరి కుపమానము.

గీ. నిజమ నెక్కడ? మేలం
బున కనినది గొనకు నిక్కముమ్ముగా. నమఁగా! ౧౨.

విదూ—మంచి దాలాగే.

అంకము—(నిష్క్రమించుచున్నాడు.)

గద్యము. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధరసకవితాధురంధర వద్దాదిసాధు
షంకక్షీరనీరాకరరాకాసుధాకరాన్వనామాత్యపౌత్ర హారితసగోత్ర పవిత్ర
గుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధాన
తనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధేయాంధ్రీ
కృతాభిజ్ఞానశాకుంతలనాటకంబునందు
ద్వితీయాంకము.



శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

అభిజ్ఞాన

# శాకుంతలనాటకము

## తృతీయాంకము.

[తరువాతఁ గణ్వశిష్యుఁడు దర్భలు పట్టుకొని ప్రవేశించుచున్నాఁడు.]

శిష్యు—ఓహో! దుష్యంతమహారాజు మహానుభావుఁడు గదా! ఆయన యీయాశ్రమపదమునఁ ప్రవేశించినంతమాత్రముననే మాయజ్ఞకర్మములు నిరుపద్రవముగాఁ బ్రవర్తిల్లినవి.

క. అలుఁగు దొడుగుకథ యేటికిఁ
దలపెట్టఁగ? ధనువుహుంకృతము నా నారిం
గలిగినటంకృతి చేతనె
తలఁగించెను విఘ్నముల నతఁడు దూరముగన్. ౧.

వేదికను బఱచుటకయి యీదర్భలు ఋత్విజులకు సమర్పించెదను. (నడచి చూచి యాకాశమున) ప్రియంవదా! యీవట్టివేళ్ళకలపమును, దూఁడులతోడితామరపాకులును, నీ వెవరికొఱకుఁ గొనిపోవుచున్నావు? (వినుట నభినయించి) ఏ మనియెదవు? "ఎండతాఁకున శకుంతల మిగుల నస్వస్థురాలుగా నున్నది. ఆపెదేహతాపముఁ బాపుట" కందువా? అట్లయిన యత్నముతో శీఘ్రముగాఁ జికిత్సింపుము. ఆమె కులపతులకుఁ బ్రాణము గదా! నేనును యాగసంబంధి యగుశాంత్యుదకము నామెనిమిత్తము గౌతమి కిచ్చెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

(విష్కంభము.)

[తరువాత మదనావస్థతో రాజు ప్రవేశించుచున్నాఁడు.]

రాజు—*క. ఎఱుఁగుదుఁ దపఃప్రభావముఁ;
జెలువ పరాధీన యగుట దెలియుదు; నయినన్ గ్ర
మ్మఱుపంగఁ జాలనయ్యెదఁ
దలఁగక యత్తరుణిమీఁదఁ దగిలినమనమున్. ౬

(మదనబాధ నభినయించుచు) ఓభగవానుఁడా! ప్రసూనబాణ! నీవును జలివెలుఁగును నమ్మఁ దగినవారలు గాక కానఁబడుచుఁ గామిజనసమూహమును వంచించుచున్నారు. చూడు.

ఉ. తావకపుష్పబాణత, సుధానిధిశీతమయూఖభావమున్,
గావలె నుండువారికిఁ గనంబడు రెం డయథార్థపద్ధతిన్;
రేవెలుఁ గగ్నిహోత్ర మడరించుఁ గటా! హిమగర్భరశ్ములన్;
నీవును వజ్రసారములనే పొనరించెదు పూవుఁదూపులన్. ౭

భగవంతుఁడా! కామదేవ! నీకు నామీఁదఁ గనికరము లేదా? (మదనబాధను నిరూపించి) నీవు పూములుకులసామివి గదా! ఇంతవాఁడిమి నీ కెట్లు గలిగినది? ఓహో! తెలిసినది.

చ. జడనిధి బాడబానలముచందమునన్ హరకోపవహ్ని నీ
యొడఁ గడుఁ బ్రజ్వలించుచును నిప్పుడుఁ జొప్పడి యుండుఁ; గానిచోఁ,
గడ లటు గాలి పోయి †పద డొక్కుఁడు మాత్రమె చిక్కి యున్న నీ
పుడుకుగ ముమ్మఁ బోఁటులకు నుండుటకుం గత మేమి మన్మథా? ౮

అయినను—

క. అనిశము నాకు మనోవే
దన మదనుఁ డొనర్పఁ గా కతండు హితుం డె
వ్వన జేక్షణకై గద నను
వనతూపులఁ ‡బింజపింజ నాటఁగఁ జేయున్. ౯

భగవానుఁడా; పంచబాణ! నిన్నిట్లు ఉపాలంభించుచున్నను నాయెడలఁ గనికరము చూపకున్నావు గదా!

---

* దీనిమూలమునందు "నచ నిమ్నాదివ సలిలం నివర్తతే మే తతో హృదయ" మ్మని పాఠభేద మున్నది. కాఁబట్టి 3,4, పాదము లీక్రింది రీతి నైనను జదువ వచ్చును:

"మ్మఱ దువిదనుండి పామది! నెఱపల్లపునీరు మిట్టనేలకుఁ బోలెన్."

† పదడు=భస్మము; ‡పింజ=బాణముక్రిందిచివర.

తే. గీ. సుకృత మూరక సంకల్పశతశతముల
చేత నినుఁ బెంచి పెద్ద చేసితి ననంగ!
*యారసంబునఁ జెవి యంట నారి దిగిచి
†నారసంబుల నను నేయ న్యాయ మగునె. ౬.

(ఖేదము నభినయించి) యజ్ఞకర్మము సమాప్త మయినందున సదస్యులచేత ననుజ్ఞాతుఁడ నయినను, నొగిలి యున్న నాహృదయము నెట్లు వినోదపెట్టుకొందును? (నిట్టూర్పు విడిచి) ప్రియురాలిని సందర్శించుటకంటె వేఱు శరణము నా కేమి యున్నది? నే నామె నే వెదకెదను. (సూర్యునిఁ జూచి) ఈమిడిమిడియెండవేళను, దీఁగపొదరిండ్లు గలమాలినీనదీతీరమునఁ జెలికత్తియలతో శకుంతల కాలక్షేపము చేయుచుండును. నే నక్కడకుఁ బోయెదను. (నడచి చూచి) ఈబాలపాదపవీథిని విలోకింపఁగా, నా సుగాత్రి యిప్పు డిప్పుడే యీలాగున వెళ్ళిన దని తోఁచుచున్నది.

తే. గీ. కుసుమకోమల పుష్పములు గోసికొన్న
ముచ్చికలు కొంచె మైనను ముడుఁగఁ బోలు
వోడుచున్నట్టిపాలతోఁ జూడఁబడెడు
స్నిగ్ధ మగుచును గిసలయచ్ఛేదములును. ౭.

(స్పర్శసుఖము నభినయించి) ఓహో! ప్రకృష్ట మయినవాయువుచే నీప్రదేశ మెంత మనోజ్ఞము!

తే. గీ. తమ్మిపూవులకమ్మనితావి గొనసి,
మాలినీవీచికాశీతుంపరలఁ దడిసి,
మలయుగాలులఁ గౌఁగిలింపఁగఁ దగు న
నంగతప్తములగు మదీయాంగములును. ౮.

(నడచి చూచి) ప్రబ్బలిఁగ లల్లుకొన్నయీలతామంటపమున శకుంతల నిశ్చయముగా నుండవలయు. ఇదిగో!

క. మునిమైపున మిట్టును, వెను
కను బల్లము నగుచు జఘనగౌరవమునఁ, దె
ల్లనియిసుకను గనఁబడు నూ
తన మగుపదసంక్తి యిచట ద్వారమునొద్దన్. ౯.

---

* యారసము = క్రోవము; † నారసము = బాణము.

౭, ౮, ౯ పద్యములయు, వానిపయి నున్నవచనములయు, (నడచి చూచి) మొదలుకొని ౬వ పద్యముచివరవఱకును గలదానియు మూలములు ప్రక్షిప్తము లందురు.

నే నీ కొమ్మలచాటున నుండి చూచెదను. (నడచి యట్లు చేసి) అహో! నాకు నేత్రోత్సవ మగుచున్నది. ఇదిగో! నామనోరథప్రియతమురా లిద్దఱు చెలిమికత్తెలు దన దాపునఁ గూరుచుండఁ బువ్వులు పఱచినశిలాపట్టమునఁ బవ్వళించి యున్నది. కానీ. ఇప్పుడు వీర లాడుకొనెడువిస్రంభసంభాషణము నాలకించెదను.

[తరువాత ముందు చెప్పినట్లు సఖులతో శకుంతల ప్రవేశించుచున్నది.]

సఖులు—(విసరి) సఖీ! శకుంతలా! నీ కీతామరపాకుపీవనగాలి హాయిగా నున్నదా?

శకుం—సఖులారా! మీరు నాకు విసరుచున్నారా?†

సఖులు—(విషాదము నటించుచు నొండొరులఁ జూచుకొనుచున్నారు.)

రాజు—కాంతాలలామము శకుంతల మిక్కిలి యస్వస్థురాలుగాఁ గనఁబడు చున్నది. ఇది యాతపదోషమా? మన్మథదోషమా? నామనసు రెండింటియందును బ్రవర్తించుచున్నది, అయినను సందేహ మెందుకు?

§చ. చనుఁగవయం దుశీరపురసం బయి, శీర్ణబిసైకకంకణం
బును నగుచు, న్నలంగుచునె ముద్దియ మే నిది హృద్య మయ్యెడున్;
మనసిజఘర్మసంప్రసరణంబులతాపము తుల్య మయ్యు, నం
గనలయెడం గరంబు సుభగంబె నిదాఘకృతాగ మీగతిన్? ౧౦.

---

† సఖులారా!......చున్నారా?—"కిం వీజయతి మాం సఖ్యౌ" అని మూలము; విసర వల దనునభిప్రాయము కూడ నీమూలమువలన రా వచ్చును గాని, వారు తనకు విసరుచున్నసంగతియే తెలియనిస్థితిలో నున్న దనుభావము కవి హృదయ మని తోఁచినది. దీనితరువాతిసఖీచేష్టలు కూడ నీయర్థమునకే మిక్కిలి యనుకూల మగును.

§ ఉశీరపురసం బయి=వట్టివేళ్ళరసము గలిగి;—దీనిభావి తాపము చల్లార్చు నని యెఱుంగునది. శీర్ణ......ణంబు—ఇది మేనికి విశేషణము, చిక్కుట చేతఁ జేతులబిసకంకణములు జాఱిపోయిన వనుట; నలఁగు=పీడిత మగు; నిదాఘకృతాగము=వేసంగిచేఁ జేయఁబడినదోషము.

మనసిజ......మీగతిన్—మన్మథసంబంధముచేతను, వేసవిసంబంధముచేతను గూడఁ దాపము సమానముగానే కలుగును గాని వేసంగిచేత నయినతాపము స్త్రీల కిట్టియందము గలిగింప నేర దని భావము.

ప్రియం—(జనాంతికముగా) అనసూయా! యీరాజర్షిని వొలుసారి చూచినది మొదలు తహతహపడుచు శకుంతల యీపన్నరాలివలె నున్నది. ఈయాయాస మంతయు యీయననిమిత్తమే యయి యుండునా?

అన—(జనాంతికముగా) సఖీ! నాకును మనసున నిట్టిదియే సందేహము. కానీ. ఈమె నడిగెదను. (ప్రకాశముగా) సఖీ! నిన్నొకటి యడుగ వలసి యున్నది. నీ సంతాపము బలవత్తరముగా నున్నది గదా!

‡రాజు—అడుగఁ దగినదే.

క. అమృతకరుకిరణములు బలె
విమలము లీకోమలాంగిబిసవలయంబుల్
కమలి విశీర్ణము లయి స
త్యముగాఁ బ్రకటించు దుస్సహనిదాఘంబున్. ౧౧.

శకుం—(పుష్పశయ్యనుండి సగము లేచి) సఖీ! నీ వేమి యడుగఁ గోరుచున్నావు?

అన—సఖీ! శకుంతలా! $మన్మథవృత్తాంతమునకు మేము వెలి యయినవారము గదా! అయినను బురాణాదులయందు వలపు గలవారల కెట్టి యవస్థ వినఁబడు చుండునో నీయవస్థ యట్టిదిగాఁ గనఁబడుచున్నది. మఱి చెప్పు. నీ కీయాయాస మెందు నిమిత్తము? వికారము సత్యముగాఁ దెలియక చికిత్స కారంభింప రాదు గదా!

రాజు—నాయూహయే యనసూయకును గలిగినది. కేవల మిది స్వాభిప్రాయ నిర్ణయము కాదు గదా!

శకుం—(తనలో) నాయనురాగము బలువయినది గదా! వీరికిఁ గూడ నెట్టన నివేదింప లేక యున్నాను.

ప్రియం—సఖీ! యీమె చక్కఁగాఁ బలికినది. నీయాయాస మేల యుపేక్షించు కొనెదవు? అదినమున కాదినము నీయవయవములు కృశించి పోవుచున్నవి గదా! కేవలము లావణ్యమయ మయినచాయ యొక్కటియే నిన్ను విడువక యున్నది.

రాజు—ప్రియంవద యథార్థము పలికినది.

---

‡ ఈ రాజసంభాషణము కలకత్తాప్రతియందు మాత్ర మున్నది.

$ "అనభ్యంతరా ఖలు వయం మదనగతస్య వృత్తాంతస్య" అని మూలము. "అనభ్యంతరా అవిషయా" యని వ్యాఖ్యానము.

† ఉ. చెక్కులు చిక్కె మోము, బిగి చెంగుచనుంగవ యొప్పుఁ, బాండిమం
బెక్కిన మేను, భేదిలె నడిమి దినకౌనును, భుజంగమూఁపు లై,
మిక్కిలి శోచ్య దీనయయ్యుఁ [illegible] కనుమెచ్చు, [illegible]
జొక్కఁగఁ జేయుమారుత [illegible]

శకుం—(సిగ్గుతో) సఖి! నీకుఁ గాక మఱి యెవ్వరికిఁ జెప్పుదను? మఱి యేమియు లేదు గాని, మీ కాయాసము గలిగించుదాన నయ్యెదను.

ఇద్దఱు—అందుకే యీనిర్బంధము. సుహృజ్జనము పంచుకొన్నప్పుడే గదా దుఃఖవేదన సహింపఁ శక్య మగును;

‡ రాజు—చ. అడిగిరి సౌఖ్యదుఃఖసమ లౌ చెలికత్తెలు తన్నుఁ; గావునన్
నుడువక పోదు బాలిక మనోగత మైననిజాధిహేతువున్;
నడుమ మోముఁ ద్రిప్పి తమి, నాతి నను గనె నెన్నొ సార్లు; నే
నడలుదు నింతలో, నయిన, నంగనయుత్తర మాలకింపఁగన్. ౧౩.

శకుం—(సిగ్గుతో) సఖి! తపోవనమును గాపాడెడునారాజర్షి నాచూపు త్రోవ నెప్పుడు దగిలెనో (సగము చెప్పి సిగ్గుపడుచున్నది.)

ఇద్దఱు—ప్రియసఖీ! చెప్పవమ్మా చెప్పవమ్మా.

శకుం—అది మొదలుకొని యాయనమీఁదియభిలాషముచేత నీయవస్థకు వచ్చినదాన నయితిని.

రాజు—(హర్షముతో) విన దగినది వింటిని గదా!

తే. గీ. మారుఁడే నాకు సంతాపకారణుండు,
తాపనిర్వాపకుండును దానె నాకు,

† చెంగు=క్రాలఁగు; ఐ=కలిగి; శోచ్య=శోకింపఁ దగినది; కనుమెచ్చు=కంటికింపు—ప్రియదర్శన యనుట; మదనార్తమన్మథపీడితురాలు; చొక్కఁగ=ఎండినవిగ;—పువ్వులగురివెందను మలయమారుతస్పర్శముచేత నాకు లెండి శోభ తగ్గినను మరల నందుచేతనే యంకురములు గలిగి సొంపు హెచ్చునట్లు మన్మథపీడచేత శకుంతలకుఁ గృశత్వాదులు సంభవించినను దద్విలాసములచేత దర్శనీయత్వమే తోఁచుచున్నదని భావము.

‡ నే......మాలకింపఁగన్—అయినను శకుంతల చెప్పునది వినుట కింతలోనే నేను భయపడుచున్నా ననుట.

జంతుసంతానములకు గ్రీష్మాంతమందు
నంబుదశ్యామ మగువాసరంబు వోలె. ౧౪.

శకుం—కాఁబట్టి మీ కిష్ట మయినపక్షమున నారాజర్షి నన్నెలాగునఁ గనికరించునో యావిధమును గావింపుఁడు. లేదా, నా కిఁక నీళ్ళుచుక్కలు వదలకొనుఁడు.

రాజు—ఈమాట సంశయము దీర్చివేసినది. ఆహా! †యేతావదవస్థయు నన్ను సుఖపెట్టుచున్నది!

ప్రియం—(జనాంతికముగా) అనసూయా! ప్రియసఖికి వలపు తలమునుకలయినది. ఇఁకఁ గాలవిలంబనమున కోర్వఁ జాలదు. ఈమె కామించినయాతఁడు పురుషవంశలలామభూతుఁడు, కాఁబట్టి నెచ్చెలియభిలాష మెచ్చుకోఁ దగినది సుమీ.

అన—(జనాంతికముగా) సఖీ! నీవు చెప్పినది నిజమే. (ప్రకాశముగా) సఖీ! యదృష్టవశమున నీయనురాగము నీ కనురూప మయినది. సాగరమును విడిచి మహానది మఱి యెందుఁ గలియును?

ప్రియం—తియ్యమావిగున్న దక్కఁ జిగిరించినపూలగురివెందకు నర్హ మయిన దేది యుండును?

రాజు—‡విశాఖ చంద్రలేఖ ననుసరించుట చిత్రము గాదు గదా!

అన—శీఘ్రముగాను నిగూఢముగాను సఖీమనోరథమును సంపాదించుట కేది యుపాయము?

ప్రియం—నిగూఢముగా నన్నఁ జింతాకరము గాని, శీఘ్ర మనిన సుకరమే.

అన—అది యెట్లు?

ప్రియం—సఖీ! యారాజర్షి తననెయ్యంపుఁజూపులచేత నీమెయం దభిలాషము సూచించియే యున్నాఁడుగదా! మఱియు నీయన్ని నాళ్ళును గంటికి నిదుర లేక యెంతో చిక్కినట్లు కనఁబడుచున్నాఁడు.

రాజు—నిజమే. నే నట్లే యున్నాను.

§ఉ. ఏనిసియుం గవోష్ణ మయి, హృద్వ్యథచేఁ గయి నాను కొన్నక
న్గోనఁ దొలంగునశ్రుల, మణుల్మిస మాసినకంకణంబు, మం

---

† ఏతావదవస్థయు=ఇట్టియవస్థయు; ‡ విశాఖ—నక్షత్రములలో నొకటి. ఇందు రెండుచుక్కలుండును. అందుచేత సంస్కృతమున సాధారణముగ నిది ద్వివచనప్రయోగము గలది. అనసూయాప్రియంవద లిద్దఱు సఖులు గావున విశాఖ వారి కుపమాన మని యెఱుంగునది. § కవోష్ణము=గోరువెచ్చనిది; కన్గోన=కంటికొన; మిస=కాంతి.

కే నిది, *జ్యాకిణాంకములచే తుద మాఁగుచు జాఱుజాఱఁ గా,
నే నెగఁ ద్రోసికొందుఁ గద యున్నియు పాములు మీఁదివీఁగినన్. ౧౫.

ప్రియం—(ఆలోచించి) సఖీ! యిప్పు డాయన కొక మదనలేఖ వ్రాయవలయును. నే నద్దానిని పువ్వులలోఁ బెట్టి కొనిపోయి దేవతాప్రసాద మనుమిషమున నారాజు చేతి కందఁ జేసెదను.

అన—ఈసుకుమార మయినయుక్తి నామనస్సున కెంతో చక్కఁగా నున్నది. ఇందులకు శకుంతల యే మనునో.

శకుం—మీనియోగము నన్యథాకరింతునా?

ప్రియం—అట్లయిన నీయవస్థను దెలియఁబఱచెడునొకలలితపదబంధన మాలోచింపుము.

శకుం—సఖీ! యాలోచించెదను గాని †యవధీరణాభయంబున నాహృదయంబు తల్లడిల్లుచున్నది.

రాజు—(తనలో)

చ. నిను గణియింపఁ డంచు నెవనిం దలపోసెదో భీరురాల! యు
ద్ధనె నిలుచున్నవాఁ డతఁడు తావకసంగమ మాస సేయుచున్;
డను నెవఁ డైనఁ గోరుకొనినన్ సిరి యబ్బును నబ్బకుండు; నెం
దును సిరియే వరించినను దుర్లభుఁ డయ్యెడునా తఁ డుండునే? ౧౬.

ప్రియం—ఓసిస్వగుణావమానిని! మేనికాఁకను జల్లార్చి హాయి గూర్చెడుశరత్కాలచంద్రికను బటాంచలమున నెవ్వఁడు వారించుకొనును?

శకుం—(చిఱునవ్వుతో) ఇప్పుడు నీవలన నేను గుదురుకొన్నదాన నయితిని. (కూరుచుండి యాలోచించుచున్నది.)

రాజు—ఱెప్పపాటు మఱచినకనులతోఁ బ్రియురాలిని జూచెదను. ఇది సమయము గదా!

తే. గీ. పదములను రచియించుచు భామ యూమె
యొక్కకనుబొమ్మఁ బయి కెత్తి యున్నమోము,
తెలుపుచున్నది నామీఁదివలపు నిదిగో!
పులకరించెడు తనదుకపోలమునను. ౧౭.

శకుం—సఖులారా! గీతిక నాలోచించితిని గాని, లేఖనోపకరణములు చెంతలేవు.

* జ్యాకిణాంకములు=అల్లెత్రాఁటిరాయుటగుఱుతులు; †అవధీరణ=తిరస్కారము.

ప్రియం—ఇదిగోఁ! చిలుకపొట్టవలె సుకుమార మయినయీలేఁత తామరపాకు మీఁద నీగోరులతో వర్ణవిన్యాసము గావింపుము.

శకుం—(చెప్పినట్లు చేసి) సఖులారా! యిదిగో! సర్థము పొసఁగి యున్నదో లేదో యాలకింపుఁడు.

ఇద్దఱు—సావధానల మయి యున్నాము.

శకుం—(చదువుచున్నది.)

తే. గీ. నిర్దయుఁడ! నీదుహృదయంబు నే నెఱుంగ;
నైన నీమీఁద వాంఛను బూని యున్న
నాయొడళ్ళను, గటకటా! రేయి పగలుఁ
గాముఁడు వేఁచుచున్నాఁడు గాటముగను. ౧౮.

రాజు—(చటాలున సమీపించి)

*క. నిను వేఁచుఁ గాని మదనుఁడు,
నను మాఁడుచుచున్నవాఁ డనారతమును, చం
ద్రుని వసి వాడించుగతిన్,
దిన మబలా! కమలుపడు గదే తొగతీఁగన్. ౧౯.

ఇద్దఱు—(చూచి హర్షముతో) అవిలంబితమనోరథస్వరూపునకు స్వాగతము.

శకుం—(లేవఁ గోరుచున్నది.)

రాజు—ఆయాసపడ కాయాసపడకు.

క. విరిపఱుపు గఱచికొని చె
చ్చెర బిసభంగములఁ గమలిచి మఱిం గెడు నీ
సురభిళ గాత్రంబులు సుం
దరి! మన్నుల నుపచరింపఁ దగనివి సుమ్మీ. ౨౦.

అన—ప్రియవయస్యు లిక్కడ నీశిలాతలైకదేశ మనుగ్రహింతురు గాక.

రాజు—(కూరుచున్నాఁడు.)

శకుం—(సిగ్గు పడుచున్నది.)

ప్రియం—వయస్య! మీయిరువురయన్యోన్యానురాగము ప్రత్యక్షమే. అయినను సఖీస్నేహము నన్నుఁ బునరుక్తముగాఁ బలికించుచున్నది.

---

* చంద్రుని......తీఁగన్—పగలు చంద్రకాంతిని బోఁగొట్టినట్లు కలువతీఁగ శోభను హరింపదు గదా యనుట.

రాజు—కల్యాణీ! యిది యపరిహార్యము సుమీ. చెప్పఁ దలఁచినదానిఁ జెప్ప కుండుట యనుతాపము నాపాదించును.

ప్రియం—రాజు స్వదేశమునందలియాపన్నజనమున కార్తిహరణుఁడు కా వలయు, నిది మీధర్మము గదా!

రాజు—అంతకన్న వేఱు లేదు.

ప్రియం—అట్లయిన నిదిగో! నీమాప్రియసఖిని మిమ్ము గురించి భగవానుఁడు మన్మథుఁ డిట్టియవస్థాంతరము నొందించినాఁడు. కాఁబట్టి యనుగ్రహించి యీమె జీవితమును మీరు గాపాడ నర్హులు.

రాజు—కల్యాణీ! యీప్రార్థన మాకిరువురకును సాధారణమే. నేను సర్వథా యనుగ్రహింపఁబడితిని.

శకుం—(ప్రియంవదను జూచి) సఖీ! యంతఃపురవిరహపర్యుత్సుకు నీరాజర్షి నేల నిరోధించెదవు?

రాజు—చ. హృదయములోన నిన్ను మదిరేక్షణ! నే ధరియించి యుండ, నా
హృదిని ననన్యతత్పరము నీవు దలంచితి వేని వేఱుగాఁ,
బవ నగుబంచసాయకునిబాణములం బ్రహతుండ నైననే
నదనముగాఁ బునర్హతుఁడ నౌదును గా కనకాంగి! యిత్తఱిన్. ౨౧.

అన—వయస్యా! రాజులు బహువల్లభలఁ బరిగ్రహించువా రని వినికి. మాప్రియ సఖి బంధుజనశోచనీయ గా కుండువిధ మాచరింప వలయును.

రాజు—కల్యాణీ! పెక్కుమాట లేల?

†క. కలిగిన బహుభార్యలు, మ
త్కులప్రతిష్ఠలుగ నుండుదురు వీ రిరువుర్,
జలనిధిమేఖల యయి తగు
నిలయును స్మరజీవనాడి యీచెలియున్. ౨౨.

ఇద్దఱు—సంతుష్టిని బొందితిమి.

ప్రియం—(చూపు సారించి) అనసూయా! యిదిగో! నీలేడిపిల్ల యిటునటుఁ జూచుచుఁ దల్లికోసము వెంగ పెట్టుకొని వెదకుచున్నది. దానిని దల్లితోఁ గూర్తము రమ్ము.

ఇద్దఱు—(బయలు దేఱిరి.)

---

†స్మరజీవనాడి=మన్మథునికి జీవనాడి;—ఇది మూలమున లేనిదైనను సరసము.

శకుం—(రాజునెదుర నిలిచి) ఆర్యా! దారినడుమఁ దలఁపు రాఁగా, నే నీ చేతినుండి జాఱిన నామృణాళవలయమునిమిత్తము తిరిగి వచ్చితిని. మీ రది తీసికొంటి రని హృదయము నాకుఁ జెప్పుచున్నది. దాని నిట్టు పాఱవేయుఁడు. మునిజనము న కది నన్నును మిమ్మును బట్టి యిద్దఱను జూఁడీ.

రాజు—ఒకపద్ధతి నిచ్చెదను.

శకుం—ఏపద్ధతిని?

రాజు—దీనిని యథాస్థానమున నన్ను నుంప నిమ్ము.

శకుం—(తనలో) అయ్యో! యేమి గతి?

రాజు—ఈశిలాపట్టమున నే కూరుచుందము.

ఇద్దఱు—(నడచి కూరుచున్నారు.)

రాజు—(శకుంతలాహస్తమును బట్టుకొని తనలో)

తే. గీ. ఫాలలోచనుకోపాగ్నికీలచేతఁ
    గాలి పోయినయులనాఁటికామతనువు
    మీఁద, ననుకూలదైవ మమృతపు వాన
    గురిసి గలిగించెనో తదంకురము మరల? ౩౨.

శకుం—(హర్షరోమాంచము నిరూపించుచు) త్వరపడు మార్యపుత్ర!

రాజు—(తనలో) ఈభర్తృభాషణముచే నిప్పుడు నేను విశ్వసించితిని. (ప్రకాశముగా) సుందరి! యీమృణాళవలయము బిగువుగా సంధింపఁబడ లేదు. నీ కిష్టమయినచో నే నిది వేఱువిధముగాఁ గూర్చెదను.

శకుం—(నవ్వి) కాలక్షేపము సేయుటకు మీరు గట్టివారు. మీయిచ్చ వచ్చినట్లు గావింపుఁడు.

రాజు—(సాకున జాగు సేయుచు వదలించి పట్టుకొని) సుందరి! దీనిం జూడుము.

ఉ. శ్యామలతామనోజ్ఞనవచంద్రమసుండు విశేషశోభకై
    వ్యోమమునందు మాని తనయునికి *సుసంగతశృంగయుక్తుఁడై,
    కోమలి! యీయతిసాకృతిని గోరిక నీకర మాశ్రయింపఁగాఁ
    దా మహి కేగుదెంచె నని తద్దయు నామదిలోఁ దలంచెదన్. ౩౩.

శకుం—నే నిప్పు డది చూడఁ జాలను. కర్ణోత్పలపరాగము గాలి కెగిరి పడుటచేత నాకన్నులు మెఱయుచున్నవి.

---

* సు......స్తుఁడు=కలసినకొనలు గలవాఁడు.

రాజు—(చిఱునవ్వుతో) కోపవతీ! నీ వనుమతి యిచ్చిన పిమ్మటగా నూఁది నే నవి లేట పఱిచెదను.

శకుం—నన్ను నుగ్రహింపవలయు. మిమ్ముల నేను నమ్మఁజాలను.

రాజు—సుందరీ! యట్లనఁ గూడదు. క్రొత్త సేవకుఁ డలిక యానతిచ్చినదాని కంటె నధిక మేమియుఁ జేయువాఁడు గాఁడు సుమీ.

శకుం—ఈయతివినయమే నా కపనమ్మిక పుట్టించెడును.

రాజు—రమణీయ మయిన సేవావకాశము నే నట్లు చెడఁగొట్టుకొందునా! (ముఖము నెత్తఁ బోవుచున్నాఁడు.)

శకుం—(ఇష్ట ప్రతిషేధము నభినయించుచు నివారించుచున్నది.)

రాజు—పద్మగంధీ! నీకంటను నీసు గ్రమ్ముచున్నది. నే నపినయము చేయుదు నని యెంచుకోకుము. మో మెత్తుము.

శకుం—(కొంచెము చూచి సిగ్గున మోము వాంచుకొని యున్నది.)

రాజు—(రెంచు ప్రేమతో మోము నెత్తి తనలో)

క. పలుగెంపు లోలయమిని మి
క్కిలి కోమల మయిన చెలియ కెమ్మోవి యిదే
లలిత ¶స్ఫురితమిషమున ము
దల దయ సేయుం బిపాస దగిలిన నాకున్. ౩౮.

శకుం—ఆర్యపుత్రు లనినమాట మఱచిన ట్లున్నారే?

రాజు—సుందరీ! మఱచుట కాదు. కర్ణోత్పలము సరస నుంటచే నీమొగ సాదృశ్యమునఁ దెలియ లేక పోయినాఁడను. (కన్నులలో నూఁదుచున్నాఁడు)

శకుం—చా... ప్రకృతిని బొందితిని. ప్రియకారు లయిన యార్యులకు నుపకరింపని [illegible]

[illegible]

రాజు—[illegible] కావలె?

క. ఇదియు నుపకృతియ కాదా?
సుదతీ! మూర్కొంటి నీదుసురభిశ్వాసమున్ ;
మదిఁ దుష్టిఁ బొందదే ష
ట్పదము ప్రఫుల్లారవిందపరిమళమునకున్? ౩౯.

శకుం—సంతుష్టి లేమి నేమి సేయుదును?

---

¶ స్ఫురితమిషమునన్=అదురు నెపమున; ముదల=అనుజ్ఞ.

రాజు—ఇది చేసెదను. (ఆమె మోమును బయి కెత్త గోరుచున్నాఁడు.)

శకుం—(పరిహరించుట నభినయించుచున్నది.) (తెరలో) ఓ జక్కవపొలఁతీ! నీ సహచరుని వీడుకొనుము. రాత్రి సమీపించుచున్నది.

శకుం—(చెవి యొగ్గి తొట్రుపాటుతో) పౌరవ! నాశరీరవృత్తాంతము నరసి కొనుటకు నిజముగాఁ బూజ్యురా లయినగౌతమి యీలాగున వచ్చుచున్నది. కాఁబట్టి యీకొమ్మలచాటున దాఁగికొనుఁడు.

రాజు—(అట్లు దాఁగి యున్నాఁడు.)

[తరువాతఁ బాత్రహస్త యగుతాపసియు, సఖులును బ్రవేశించుచున్నారు.]

సఖు—ఇటు ఇటు.

గౌత—(శకుంతలను సమీపించి) బిడ్డా! నీ మేనికాఁక తగ్గినదా?

శకుం—ఇప్పుడు కొంచె మారోగ్యము కలిగినది.

గౌత—మంత్రించిన యీదర్భోదకముచేత నీ శరీరబాధ సర్వము నివర్తిల్లును. (శకుంతల తలపయి నీళ్లు చల్లి) బిడ్డా! యెండ చల్లపడినది. పర్ణశాలకుఁ బోదము రమ్ము.

అందఱు—(బయలు దేఱుచున్నారు.)

శకుం—(తనలో) హృదయమా! మొదల సులభముగా నీమనోరథము సిద్ధించునప్పుడు నీకాతరభావము మానవయితివి. ఇప్పుడు విఘటనమున నిట్టు లనుతాపముపాలగుచున్నావు. ఇంకఁ జేయవలసిన దేమి? (ఒకయడుగు వేసి నిలిచి ప్రకాశముగా) తాపహారమా! లతావలయమా! పునఃపరిభోగము గోరుచు నిన్నిప్పుడు వీడుకొనుచున్నాను. (అతిదుఃఖమునఁ సక్కినవారితో నిష్క్రమించుచున్నది.)

రాజు—(మునుపటిచోటికి వేగి నిట్టూర్పుతో) అయ్యో! కోరినకోరికలు సిద్ధించుటకు విఘ్నము లనేకములు గదా!

తే. గీ. మాటిమాటికి వ్రేళ్ళతో మాటుమోవి
గలిగి, † ప్రతిషేధవర్ణవిక్లబమనోజ్ఞ
మంసపరివర్తి యగుపక్ష్మలాక్షిమోము
మీఁది కెట్లో యెత్తియును జుంబింప నైతి. ౨౬.

నే నెక్కడకుఁ బోదును? కాని. ఇక్కడనే ప్రియురా లనుభవించి విడిచినయీలతామంటపమున ముహూర్తమాత్రము నిలిచెదను.

† ప్రతి......మనోజ్ఞము=వలదు వల దనునిషేధవర్ణములు గలిగి బెదరుగలది యగుటచే సుందర మయినది. అంసపరివర్తి=మూఁపువైపునకుఁ దిరుగునది;

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

అభిజ్ఞాన

# శాకుంతల నాటకము.

## చతుర్థాంకము.

[తరువాతఁ బువ్వులు గోయుట నభినయించుచు సఖు లిద్దఱు ప్రవేశించుచున్నారు.]

అన—సఖీ! ప్రియంవదా! గాంధర్వవిధ్యుక్తముగాఁ బెండ్లియాడి, శకుంతల తన కనురూపుఁ డగు పెనిమిటిని బడసిన దని నాహృదయ మానందమును బొందుచున్నది; గాని యొకవిచారము మాత్ర మున్నది.

ప్రియం—సఖీ! యది యేమి?

అన—ఇప్పు డారాజర్షి, యాగపరిసమాప్తిని ఋషులు దన్ను వీడుకొలుప, స్వనగరమునఁ బ్రవేశించి యంతఃపురగతుఁ డయిన వెనుక, నిచ్చట జరిగినవృత్తాంతముఁ దలంచునో తలంపఁడో గదా!

ప్రియం—సఖీ! నీ వందులకయి దిగులు పడకు. అటువంటియాకారవిశేషము గుణవిరుద్ధముగా నుండదు సుమీ. దాని కేమి గాని, తండ్రిగారీవృత్తాంతము విని యేమందురో తెలియ రాదు.

అన—నా కొకటి తోఁచుచున్నది. అదే యాయన యిష్టము నగును.

ప్రియం—అది యేమి?

అన—గుణవంతునకుఁ గన్య నీయ వలయు నని యాయనగారిముఖ్యసంకల్పము. అది దైవమే నెఱవేర్చినప్పుడు వారు సులభముగాఁ గృతార్థత నొందుదురు గదా!

ప్రియం—(పూలసజ్జ చూచి) సఖీ! దేవతార్చనకుఁ జాలునన్నిపువ్వులు గోసితిమి గదా!

అన—మఱి శకుంతలా సౌభాగ్యదేవతకుఁ గూడఁ బూజ చేయవలయును గాదె?

ప్రియం—అవు నవును. (పూలు మరలఁ గోయుచున్నారు.)

[తెరలో]

ఓహో! యిదిగో! నేను.

అన—(ఆలకించి) అతిథులమాట వలె నున్నది.

ప్రియం—మఱి శకుంతల పర్ణశాలకడ నున్నది గదా!

అన—ఉన్నది గాని హృదయముతో లేదు.

ప్రియం—అవును. పువ్వు లివే చాలును. చెప్పుదము రమ్ము. (బయలు దేఱుచున్నారు)

[తెరలో]

ఓసీ! యతిథిపరిభావిని!

శ్లో. తెలియక యుంటి వెట్టు లతిథిన్ నను వచ్చినవాని సంయమిన్;
దలఁచుచు నీ వనన్యపరతన్ మది నెవ్వనిఁ, బజ్జనుండు నిన్
దెలియక పోవుఁ గావుత మనేకవిధంబులఁ దెల్పుకొన్ననం
బలికినదాని నప్పుడె ప్రమత్తుఁడు విస్మృతి నొందులాగునన్. ౧

అన—అయ్యయ్యో! మన మనుకొన్నదే జరిగినది. పరధ్యానమున శకుంతల పూజ్యు లయినయెవ్వరియెడలనో యపరాధము సలిపినది. (మరలఁ జూచి) కటకటా! వారి వీరి యెడలఁ గాదే. ఇదిగో! ముంగోపి, దుర్వాసోమహర్షి యీలాగున శాప మిచ్చి యడ్డగింపరానిశీఘ్రగమనమున మరలి పోవుచున్నాఁడు. *సహించుట కగ్నిహోత్రుఁడు గాక మఱి యెవ్వఁడు సమర్థుఁడు. పద పద. పాదములమీఁదఁ బడి యాయనను మరలింపవే. ఇంతలో నర్ఘ్యోదకమును బట్టుకొని నేనును సమీపించెదను.

ప్రియం—ఆలాగే. (నిష్క్రమించుచున్నది.)

అన—(అడుగు వేసి తొట్రుపాటు నభినయించి) అయ్యో! తొందరచేతఁ గాళ్లు తడఁబడ నా చేతిలోనిపూలసజ్జ జాఱి పోయినది. (పువ్వులు పోగుచేయుచున్నది.)

ప్రియం—(ప్రవేశించి) సఖి! స్వభావవక్రుఁ డయిన యామహర్షి నెవరు బతిమాలిన ననుగ్రహించును? అయినను గొంచెము గనికరము గలిగించితిని.

అన—(చిఱునవ్వుతో) అతనియం దది గొప్పయే. చెప్పు చెప్పు.

---

శ్లో దీనిమూలము ప్రక్షిప్తమందురు. *దీనిమూలము చూడుము.

ప్రియం—సఖీ! యెంత బతిమాలుకొన్నను మరలుట కంగీకరింపనప్పుడు నే నాయనతో నిట్లు పలికితిని.

అన—ఎట్లు?

ప్రియం—"స్వామీ! యిది మీబిడ్డ. మీతపఃప్రభావ మెఱుఁగక తప్పు చేసినది. పూర్వము మీయెడల నది చూపుచు వచ్చినభక్తిని బురస్కరించుకొని యిప్పటిదానియేకాపరాధము మీరు క్షమింప వలయు" నంటిని.

అన—తరువాతఁ దరువాత?

ప్రియం—తరువాత నతఁడు "నావచన మన్యథా కానేరదు. అయిన నభిజ్ఞాభరణసందర్శనమున నాశాపము గ్రమ్మఱిల్లు" నని పలికి తోడనే యంతర్హితుఁ డయ్యెను.

అన—ఇప్పుడు మన మూఱడిల్లి యుండ వచ్చును. ఆరాజర్షి బయలుదేఱి వెళ్లునప్పుడు స్మరణీయ మని శకుంతలవ్రేలను దానుగ నుంచినస్వనామధేయాంకితాంగుళీయక మొకటి యున్నది గదా! అందుచేత శకుంతలకుఁ దదుపాయము స్వాయత్తమే.

ప్రియం—రా మఱి. ప్రియసఖినిమిత్తము దేవకార్యము నిర్వర్తింతము.

ఇద్దఱు—(నడుచుచున్నారు.)

ప్రియం—(చూచి) అనసూయా! తనయెడమచేతను మోముఁ జేర్చుకొని ప్రియసఖి చిత్తరువులాగునఁ జూపట్టుచున్నది. వీక్షింపుము: భర్తృగత మయినవిచారముచేత నీమె తన్నుఁ దానే యెఱుఁగకున్నది. ఇఁక నతిథిమాట చెప్ప వలసిన దేమి?

అన—ప్రియంవదా! యీవృత్తాంతము మనయిద్దఱినోటనే యుండ వలయును. ప్రకృతిసుకుమారురా లగుసఖిని రక్షింప వలయును గదా!

ప్రియం—సఖీ! నవమాలికను వేఁడినీ ళ్లెవరు పోయుదురు?

ఇద్దఱు—(నిష్క్రమించుచున్నారు.) (విష్కంభము.)

[తరువాత నిద్రనుండి లేచినశిష్యుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

శిష్య—ప్రవాసమునుండి తిరిగి వచ్చినకణ్వమహర్షులు వేళ చూడు మని నా కాజ్ఞాపించినారు. కాఁబట్టి వెల్లడిచోటికిఁ బోయి రాత్రి యెంత యున్నదో చూచెదను. (తిరిగి చూచి) ఓహో! తెల్లవాఱి పోయినదే!

శ్లో* మ. బదరీవృక్షశిరస్సు పారకణికం బ్రాక్సంధ్య దోఁచించుఁ గాం
పు; దిగుం బర్ణకుటీరదర్భపటలంబుం బర్హి చాలించి తా
నిదురన్; లేచి ఖురాంచలోల్లిఖితభూస్వేదీసమీపస్థలిన్
—మృదులీలం బెఱుఁ దత్తి† మై విఱుచుకొం చేణంబు నిల్వంబడున్.

---

*దీని మూలము ప్రక్షిప్త మందురు. †మై...కొంచున్=ఒడలు విఱుచుకొనుచు.

†శా. తపము నడంచి విఘ్నవిధానము మించి క్రమించి, భూధరో
త్తమగుహ పోసి మేరుతలఁ బోఁబడ మూఁకినచండమారు, కుం
త మిగులు వెల్గులోఁ డగగనంబుననుండి నిపాత మొందెఁ; నెం
త మహిమవారి కైనఁ బతనంబున కే పయి నెక్కు నెక్కటల్. ౩.

‡ పుష్పవంతు లీజగత్తునకు సంపద్విపత్తులయనిత్యత్వముఁ జూపువారునం బోలెఁ జూపట్టుచున్నారు గదా!

చ. అరిగెడు నోషధీశుఁ డిదె యస్తధరాగ్రమునందు నొక్కచో,
నరుణపురస్సరుం డగుచు నర్కుఁడు దోఁచు నిఁకేమ నొక్కచో,
పరియుచుబోలె నిట్టు లొకసారి నాశనోదయంబులన్
గర ముపదిష్ట మయ్యెడు జగంబు స్వకీయదశాంతరాప్తి నాన్. ౪.

మఱియు—

చ. అడపొడ గాన రాక కుముదాప్తుఁడు పోవుడుఁ, గల్వతీఁగ సొం
పుడిగిన డాచు నానయనయుగ్మము దన్పక యున్న దక్కటా!
తడుఁ దమకూర్పువారి కెడ గావుటచేతను తాఁడువారికిన్
బొడమున వేయదుఃఖములు భూతలమందు సదుస్సహంబులే. ౫.

అన—(తెరను జిమ్ముకొని ప్రవేశించి) అన్నన్నా! యిటువంటిరాజు శకుంతల విషయమున నింత యన్యాయము జరిగించెను! ఇది విషయపరాఙ్ముఖ మయినజనమునకుఁ [illegible] వచ్చుచున్న దిగదా!

శిష్య—హోమసమయము సమీపించిన దని గురువులకు నివేదించెదను. (నిష్క్రమించుచున్నాఁడు.)

అన—సరే. తెలిసి మాత్రము నే నేమి చేయఁగలను? చేయఁదగ్గవి చేయుట కయినను నాకుఁ గాలుసేతు లాడకున్నవి. కాని [illegible] మన్మథుని కిప్పుడు సఫల మగును. మాయమర్త్యుఁ డయినవానిని శకుంతల నాయసత్యసంధునియందుఁ [illegible] మీవికార్యము నకుఁ [illegible] అక్కటా [illegible] యింతకాలము [illegible]? అనవాలుగా నిచ్చినయంగులీయక [illegible]. శోకశీల మయినతపస్విజనము నెవఁడు గోరును? దుష్యంతుని [illegible] గర్భవతి యయిన దని ప్రవాసమునుండి వచ్చిన

† దీని మూలము ప్రక్షిప్త మందురు. ‡ పుష్పవంతులు=చంద్రసూర్యులు.

నాయనగారికి నివేదింపఁ జూచుచున్నాను గాని, ప్రియసఖిమీఁదికిఁ దప్పు వచ్చునేమో యని యప్పనికి మరల నొప్పకున్నాను. ఇట్టిస్థితిలో మేము చేయఁదగిన దేమి యున్నది ?

ప్రియం—(ప్రవేశించి హర్షముతో) సఖీ ! త్వరపడు త్వరపడు. శకుంతలకుఁ బ్రయాణమహోత్సవము సమకూర్ప వలయును.

అన—సఖీ! యది యేమి?

ప్రియం—విను. “సుఖముగా నిద్రపట్టినదా ?” యని యడుగుట కయి నే నిప్పుడు శకుంతల యొద్దకుఁ బోయినదానను.

అన—తరువాత ?

ప్రియం—అంతలో, సిగ్గుచేతఁ దల వాంచుకొని [illegible] ప్రియసఖి యొద్దకుఁ దండ్రిగారు వచ్చి, యామెను కౌఁగిలించుకొని “[illegible] ! [illegible] గన్నులు [illegible] రాక యున్నను, యజమానునియాహుతి యగ్నిహోత్రమునం [illegible] తల్లీ ! [illegible] నీవు మంచిశిష్యున కిచ్చినవిద్యవంటిదాన వయితివి. నిన్నుఁ గూర్చి నేను విచారింప వలసినది లేదు. రాజర్షిపరిగృహీత వయిననిన్ను నీభర్తయొద్ద కిప్పుడే పంపుచున్నా” నని యానతిచ్చిరి.

అన—సఖీ! నాయనగారికి వృత్తాంతము [illegible] సూచించిరో ?

ప్రియం—ఆయన యగ్నిహోత్రగృహమునఁ బ్రవేశించి యుండఁగా ఛందోమయ మయినయశరీరవాణి దెలిపినది.

అన—(ఓటునవ్వుతో) చెప్పు చెప్పు. అది యెట్లు?

ప్రియం—సఖీ! విను.

†క. భూభూతికి దుష్యంతమ
హీభర్త్రాహితము తేజ మిది ధరియించెన్,
లో భావింపుము సుత బ్ర
హ్మభుండ! కృశానుగర్భ యగుశమిఁ బోలెన్.                                        ౬.

ఇట్లు వినఁబడినది.

అన—(ప్రియంవదను కౌఁగిలించుకొని) సఖీ ! సంతోషము, సంతోషము ! అయినను శకుంతల నిప్పుడే పంపుదు రనుటచే నాసంతోషము కొంతవంతతోఁ గూడిన [illegible].

---

† భూభూతికై = భూమియొక్క సమృద్ధికై. దుష్య...తము = దుష్యంతరాజుచే నుంపఁబడినది. కృశానుగర్భ = అగ్ని లోపలఁ గలది; శమి = జమ్మి.

ప్రియం—సఖీ! మనచెంగ నెట్లయినను దీర్చుకో వచ్చును లే. పాప మాతపస్విని సుఖపడనీ.

అన—అట్లయిన నిదిగో! నీమామిడికొమ్మను వ్రేలుచున్న కొబ్బెరకాయల పెట్టెలో నెబ్బెలినిమిత్తము నే నొక పొగడదండను దాఁచి యుంచితిని. అది చిరకాలము నిలువ యుండును. దానిని చేత నందుకో, నే నింతలో, గోరోచనముతోను, తీర్థమృత్తికతోను, గఱికచిగుళ్ళతోను బ్రియసఖికి మంగళాంగరాగము రచియించెదను.

ప్రియం—సరే. అట్లే చేయుదము.

అన—(నిష్క్రమించినది.)

ప్రియం—(పూలసజ్జ నందుకొనుట నభినయించుచున్నది.)

[తెరలో]

...గా! శకుంతలను దోడుకొని పోవుటకయి శార్ఙ్గరవాదుల కాజ్ఞాపింపుము.

ప్రియం—(చెవి యొగ్గి) అనసూయా! త్వరపడు, త్వరపడు. ఇదిగో! హస్తినాపురమునకుఁ బోవుఋషులను బిలుచుచున్నారు.

అన—(అంగరాగమును గయికొని ప్రవేశించి) సఖీ! పోదము రా. (నడుచుచున్నారు.)

ప్రియం—(చూచి) ఇదిగో! సరుణోదయవేళనే యభ్యంజనస్నానము చేయించి, ...స్త్రీ... నీవారాక్షతములు చేతఁ బట్టుకొని స్వస్తివాచకములతో నభినందించు...గా, శకుంతల యిక్కడఁ గూరుచున్నది. దగ్గఱకుఁ బోవుదము.

ఇద్దఱు—(సమీపించుచున్నారు.)

[తరువాత చెప్పినట్లు లాసనస్థురాలయి శకుంతల ప్రవేశించుచున్నది.]

ఒకతాపసి—(శకుంతలను గూర్చి) బిడ్డా! భర్తృబహుమానసూచక మగుపట్టపుదేవి యనుపేరు వడయుము.

ద్వితీయ—కుమారీ! వీరమాతవు గమ్ము.

తృతీయ—పుత్రీ! భర్తృబహుమత వగుము.

[దీవన లిచ్చి గౌతమి దక్కఁ దక్కినవారు నిష్క్రమించిరి.]

సఖులు—(సమీపించి) సఖీ! మంగళస్నాన మయినదా?

శకుం—నాసఖులారా! మీకు స్వాగతము. ఇటు కూరుచుండుఁడు.

సఖులు—(మంగళపాత్రములను జేతఁ బట్టుకొని కూర్చుండి) సఖీ! శకుంతలా! సరిగాఁ గూరుచుండుము. నీకు మేము మంగళాంగరాగ మలందెదము.

శకుం—ఇది నా కెంతో బహుమానపాత్రము. సఖు లలంకరించెడుభాగ్యము నా కింక దుర్లభము గదా! (కన్నీరు విడుచుచున్నది.)

సఖులు—సఖీ! శుభసమయమునఁ గంటఁ దడి పెట్టుకొనుట మంచిది కాదు. (కన్నీరు తుడిచి యలంకరించుచున్నారు.)

ప్రియం—సఖీ! భూషణార్హ మయిననీరూపమునకు, నాశ్రమసులభము లయిన యలంకారములచేత వికారముఁ దెచ్చి పెట్టుచున్నాము.

[తరువాతఁ గానుకలను జేతఁ బట్టుకొని యిద్దఱు మునికుమారులు ప్రవేశించుచున్నారు.]

మునికు—ఇదిగో! నలంకారములు. ఈమె కలంకరింపుఁడు.

అందఱు—(చూచి విస్మయపడుచున్నారు.)

గౌతమి—కుమార! నారద! యివి యెక్కడివి రా?

ప్రథముఁడు—అమ్మా! జనకు లయినకాశ్యపులప్రభావమువలనఁ గలిగినవి.

గౌతమి—ఆయన వీనిని దనమనస్సుచేత సృజించినాఁడా?

ద్వితీయుఁడు—లే దమ్మా! ఆలకింపుఁడు.

శా. మాంగల్యం బని చంద్రపాండురము ‡ క్షౌమ మ్మొక్కఁ డావిష్కరిం
చెం; గల్పించెఁ బదోపభోగసులభశ్రీలాక్ష నొక్కండు; చె
ట్లెంగం దక్కిన విచ్చె సొమ్ములఁ, జివుళ్లౌ వనీదేవతా
చంగాపర్వబహిఃప్రసారితసముంచత్పాణులన్ గానలోన్. 3.

ప్రియం—(శకుంతలను జూచి) సఖీ! యీవనదేవతాప్రసాదము, భర్తృగృహమున నీ వనుభవింపఁ బోవురాజ్యలక్ష్మికి సూచకము సుమీ.

శకుం—(సిగ్గు పడుచున్నది.)

ప్రథముఁడు—గౌతమ! రారా, స్నానమునిమిత్తము నదికిఁ బోయినకాశ్యపులవారికి వనస్పతులసేవ నివేదింతము.

ద్వితీ—మంచిది. (నిష్క్రమించుచున్నారు.)

అన—సఖీ! మే మెప్పుడు నాభరణములను ధరియించుకొన్నవారలము కాము. అయినను జిత్తరువులు వ్రాయునట్టివారలవాటున నీయవయవముల కీవగల నలంకరించుచున్నాము.

శకుం—సఖులారా! మీనైపుణ్యము నాకుఁ దెలియును.

ఇద్దఱు—(అలంకరించుట నభినయించుచున్నారు.)

---

‡ క్షౌమము=తెల్లచీర; ఒక్కఁడు=ఒక చెట్టు; ఆవిష్కరించెన్=వెలయించెను—కలిగించెనని; లాక్ష=లక్క; ఇంగన్=ఇంక నని; చంగము=పక్కనిది; ఆపర్వ=మ్రేలికణుపులదాఁక.

[తరువాత స్నానము చేసి వచ్చి కణ్వుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కణ్వు—చ. హృదయము బెంగఁ గాంచె నిపు డేగు శకుంతల యంచు; నెల్లుగ
ద్గద మగు బాష్ప మాఁచుకొనఁ దర్శనముం దెరలెం జింతచేఁ గానలోఁ
బ్రతికెడు నాకె యింత పగ పాటిలఁ గూరిమిఁ, గన్నకూఁతులన్
వదలుట † సాభిమానవ్రతవంత గృహస్థుల కెంత దోఁచునో? ౮.

(నడుచుచున్నాఁడు.)

సఖు—సఖీ! శకుంతలా! నగ లన్నియు నలంకరించితిమి. ఇంక నీక్షౌమాంబర యుగళమును ధరించుకొనుము.

శకుం—(లేచి ధరించుకొనుచున్నది.)

గౌతమి—కుమారీ! యిదిగో! ఆనందము నిట్లు వొరలుచున్న తనకన్నులతో నిన్నుఁ గవుఁగిలించుకొనుచున్నాఁడువలె మీతండ్రి వచ్చి యున్నాఁడు. ఆచారము జరుపుము.

శకుం—(సిగ్గుతో) నాయనగారూ! నమస్కరించుచున్నాను.

కణ్వు—క. తొలి శర్మిష్ఠ యయాతికి
బలె, బహుమతి వగుము నీవు భర్తకు; మఱి యా
లలనామణి పూరుని బలెఁ
గులదీపకుఁ జక్రవర్తిఁ గొడుకుం గనుమా. ౯.

గౌతమి—మహాత్మా! యివి యింతకును దీనికి వరములే గాని దీవనలు గావు.

కణ్వు—అమ్మా! యిటు వచ్చి యిప్పుడే హోమము చేసినయాయగ్నులకుఁ బ్రదక్షిణము చేయుము.

అందఱు—(నడుచుచున్నారు)

కణ్వు—(ఋక్ఛందముచేత నాశీర్వదించుచున్నాఁడు.)

---

† సాభిమానవ్రతవంత=తో[illegible]దినపు పుత్రీవియోగదుఃఖము.

శ్లో. యాస్యత్యద్య శకుంతలేతి హృదయం సంస్పృష్టముత్కంఠయా
కంఠ స్తంభితబాష్పవృత్తికలుష శ్చింతాజడం దర్శనం
వైక్లబ్యం మమ తావదీదృశ మహో స్నేహా దరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథం ను తనయావిశ్లేష దుఃఖై ర్నవైః." అనియూలము.

*‘‘శ్లో. అమీ వేదిం పరితః క్లృప్తధిష్ణ్యాః
సమిద్వంతః ప్రాంతసంస్తీర్ణదర్భాః
అపఘ్నంతో దురితం హవ్యగంధైః
వైతానాస్త్వాం వహ్నయః పాలయంతు.’’ ౧౦.

ఇఁక నడువుము. (పాఱఁ జూచి) శార్ఙ్గరవాదు లేరీ?

శిష్యులు—(ప్రవేశించి) స్వామీ! యిదిగో! వచ్చినారము.

కణ్వ—శార్ఙ్గరవా! మీ చెలియలికి దారి చూపుము.

శార్ఙ్గ—అమ్మా! యిటు, ఇటు.

శకుం—(నడుచుచున్నది.)

కణ్వ—ఓహో! దేవతాసాన్నిధ్యము గలతపోవనవృక్షములారా!

ఉ. పోయక మీకు నీ రెవతె పూనదొ ముందుగఁ ద్రావ, దేని కా
నో యెద ప్రియమ్మదావ్యకుసుమోదయవేళను పండువ చేసి గాఁ
గోయదొ మీ యిగుర్లఁ గోరికఁ గూరిమి, భర్తయింటికిన్
బోయెడు నా శకుంతల; యనుంగున కందఱు అనుజ్ఞ యీయరే? ౧౧.

‘‘యిలకూఁతను సూచించి)

ఉత్సాహ. అదిగో! విపినవాసబంధు లవనిజంబు లన్నియున్
ముదల యిడె శకుంతలకును బోవ పతిగృహంబునకున్;
బదులు పలికె నిపుడు సేన పలికినవచనమునకున్
మృదులతరమధురతరపరభృతవిరుతము కృతమునన్. ౧౨.

కాశమున)

ఉ. తామరతీఁగ లల్లినప్రహదంబు లెడం గనువింపొనర్ప, ఛా
యామహిజాతముల్ ఖరకరాతపతాపము మాఁప దవ్వులన్,
†దామరసంప్రబుష్పోద్విధంబున మెత్తనిరేణు వొప్ప, నీ
కోమలి కాత మార్గ మనుకూలమృదుశ్వసనంబు భద్రమున్. ౧౩.

అందఱు—(విస్మయముతో వినుచున్నారు)

---

* ఇది వేదబుక్కువలె స్వరయుక్తముగాఁ జదివి దీవింప దలచినది గనుకఁ, (తెనిఁ)గింప లేదు. ప్రియమ్మ......వేళను—మీ ప్రథమపుష్పోత్పత్తికాలమున.

† దామ...వొప్ప—‘‘కుశేశయరజోమృదురేణు’’ వని మూలము.

గౌతమి—బిడ్డా! నీయందు సోదరీవాత్సల్యము గలయాతపోవనదేవతలు నీప్రయాణమున కిదిగో! ననుమతి యిచ్చినారు. వీరికి నమస్కరింపుము.

శకుం—(నమస్కరించి నడచి జనాంతికముగా) సఖీ! ప్రియంవదా! నే నార్యపుత్రసందర్శనమునం దతిలాలసురాల నయినను, నాయడుగు లీయాశ్రమపదము విడువవలసి వచ్చినందున ముందున కత్యంతదుఃఖముతో సాగుచున్నవి.

ప్రియం—సఖీ! తపోవనము నెడఁ బాయఁ జాలక నీవు మాత్రమే యధైర్యపడుట కాదు. నీ నెడఁ బాయఁ జాలక తపోవనము గూడ నీతోడ సమాన మంయిన యవస్థనే పొందుచున్నది. చూడుము.

తే. గీ. హరిణములు దర్భకవణముల్ దొరఁగ విడిచెఁ
మానెఁ బురి విచ్చి యాడుట లీనెమిళ్లు;
కరము కన్నీటిబొట్టులకరణి నిదిగోఁ!
బండుటాకులు రాలుచు చుండె లతలు. ౧౪:

శకుం—(తలంచుకొని) నాయనగారూ! నాలతాసోదరిని వనజ్యోత్స్నను సెలవడిగి వచ్చెద నుండుండి.

కణ్వ—అమ్మా! నీకు దానిమీఁదిసోదరీస్నేహమును నే నెఱుఁగుదును. ఇదిగో! నది యీపడివైపున నున్నది.

శకుం—(లతను సమీపించి) వనజ్యోత్స్నా! నీ వీక్రొమ్మావిగున్నతోఁ గూడుకొని యున్నను, న న్నొక్కమాఱు నీశాఖాభుజములతో గట్టిగాఁ గౌఁగిలించుకో; నే నిది మొదలుకొని నీకు దూరస్థ నగుదును గదా!

కణ్వ—మ. మును పే రెవ్వని నీకు భర్త యనురూపుం డంచు నే నెంచితిన్,
దనయా! వాని న పొందఁ గాంచితి విటం ద్వత్పూర్వపుణ్యంబునన్;
గనెఁ దా నీనవమాలికాలతయు సాంగత్యంబు గ్రొమ్మావితోఁ;
గాన నే నిం కిట దీనికోసరము నీకోసంబు నే బెంగయున్. ౧౫:

అమ్మా! యిటు దారిలోనికి రమ్ము.

శకుం—సఖులారా! దీనిని మీయిద్దఱచేతులలో నప్పగించుచున్నాను.

సఖులు—సఖీ! యిప్పుడు మమ్మిరువుర నెవరిచేతులలో నప్పగించి వెళ్ళెదవు! (కన్నీరు విడుచుచున్నారు.)

కణ్వ—అనసూయా! యేడువ వలదు. మీ రిద్దఱు గదా శకుంతలకు ధైర్యము చెప్ప వలసినవారు.

అందఱు—(నడుచుచున్నారు.)

శకుం — నాయనగారూ! యిదిగోఁ! పర్ణశాల చేరువ గర్భభారమున మెల్ల మెల్లగాఁ దిరుగుచున్న యీ జింక పొలఁతి సుఖప్రసవ గాఁగానే నా కా శుభవర్తమానము చెప్పుట కెవరి నయినఁ దప్పక పంపుఁడీ.

కణ్వ — సరే. ఈమాట మఱువనమ్మా!

శకుం — (గతి భంగము నభినయించి) ఎవ రిది? సారె సారెకు నాచీరకొంగును బట్టుకొని లాగుచున్నారు! (వెనుక దిరిగి చూచుచున్నది.)

కణ్వ — ఉ. మూతికి సూదిదర్భ మొన మోపుగ గ్రుచ్చుకొనంగ, నిచ్చలుం
ప్రీతిని గారనూనియను మెల్లఁగ రాయుచుఁ బుండు మాన్పుచున్,
జేతను శామ లుంచుకొని నీ వటు మేపితి పిన్నరంగపుం
బోతముఁ; బల్లిరో! కృతకపుత్రుఁడు వెంబడి రాక మట్లనే? ౧౬.

శకుం — బిడ్డా! సహవాసుల వదలుకొనుచున్న నన్నేల వెంబడించెదవు? పురిటిలోనె కన్నతల్లి నీకుఁ గఱ వయినను, గారాబమున నిన్ను నేను పెంచితిని గదా! అట్టి నేను గూడ నిప్పుడు నిన్ను విడుచుచున్నాను. అయినను గొదవేమి? నాయనగారే నిన్ను విచారించుకొందురు. ఇంక వెనుకకు మరలుము వెఱ్ఱికుఱ్ఱా! (ఏడ్చుచు నడచుచున్నది.)

కణ్వ — మ. *భవదుత్పక్ష్మకనేత్రయుగ్మమున నిర్బంధంబు నొందించున
శ్రువుఁ దాల్మిన్ విరతానుబంధముగ నిచ్చో నీవు గావింపు; తె
న్నువిదా! యిచ్చట నన్నతోన్నతముగా నున్నందునం దిన్నగా
నవలోకింపఁగ రాక నీపదయుగం బట్టిట్టుఁ దొట్రిల్లెడున్. ౧౭.

శార్ఙ్గ — స్వామీ! స్నిగ్ధజనము నుదకపర్యంతమే గదా సాగనంపుట యాచారము. ఇదిగో! నిది సరస్తీరము. ఇక్కడ మీరు మాకు సెలవు దయచేసి మరలఁదగును.

కణ్వ — అట్లయిన మన మీపాలచెట్టునీడను నిలుతము.

అందఱు — (నడచి నిలుచున్నారు.)

కణ్వ — (తనలో) మహాత్ముఁ డయిన దుష్యంతునికిఁ దగినట్లుగా, నే నే పని సందేశ మంపుదును. (ఆలోచించుచున్నాఁడు.)

---

*భవ...గ్మమున=నీ యొప్ప లెత్తిన కనుఁగవయందు; నిర్బం...శ్రువు=(అమంగళశంకచేఁ గ్రిందఁ బడ కుండ) నిరోధించుచున్న కన్నీరు; తాల్మిన్=ధైర్యముతో; విర...ముగన్=అనుబంధము లేనిదానినిగా—మరల లోపలనుండి నీరు పయినుండిపోఁ గలియనట్లు; విరతానుబంధ మనునది యశ్రువు విశేషణము.

శకుం—సఖీ! కుడివైపునఁ జూడు. తనసహచరము తామరయాకుచాటున నున్నను, దానిని జూడ లేనంతమాత్రమున నార్తపడుచు నీజక్కవపెంటి యెట్లు కూయుచున్నదో! నేను కఠినురాలను జుమీ. దుష్కరమును జేయుచున్నాను.

అన—సఖీ! నీ వాలాగున ననుకోకు.

క. తనప్రియుఁ బాయువిషాదం
బున నిదియును జాలదీర్ఘముగఁ బుచ్చు నిశిన్;
మనమున నాశాబంధమె
జనము విరహదుఃఖములను సైఁపం జేయున్. ౧౭.

కణ్వ—శార్ఙ్గరవా! శకుంతలను ముందుంచుకొని నీ వారాజుతో నామాటగా నిట్లు పలుకుము.

శార్ఙ్గ—స్వామీ! యాన తిండు.

కణ్వ—

కవిరాజవిరాజితము. తలఁచి తపోధనులన్ మము నెన్నగఁ, దావక మైనమహాకులమున్,
నెలఁత కబంధుకృతంబుగ నెట్టులొ నీయెడఁ గల్గినయాచెలిమిన్,
సలుపుము నీవు సమప్రతిపత్తిని జాయలలోపల దీనికి; న
వ్వలిది యదృష్టవశంబది బాలికబంధులు వాకొన రాని దగున్.

శార్ఙ్గ—స్వామీ! సందేశము గ్రహించితిని.

కణ్వ—బిడ్డా! నీకు బుద్ధులు చెప్ప వలసి యున్నది. చూడు. మేము వనవాసుల మయ్యును లోకజ్ఞానము గలవారమే సుమీ.

శార్ఙ్గ—స్వామీ! ధీమంతులకు గోచరింపని దొకటి యుండునా?

కణ్వ—అమ్మా! నీ విటఁ బిమ్మట భర్తృగృహము చొచ్చి—

చ. పని విని కొల్వు పెద్దల; *సపత్నులచోటఁ బ్రియాళివృత్తిఁ గై
కొను; పతి యల్గ నల్గి ప్రతికూలవు గాకుము; భోగభాగ్యముల్
గనుఁగొని పొంగఁ బోకు; దయ గల్గుము సేవకులందు; నాతి కాం
చును గృహిణీపదం బిట్టులు; చూడఁగ లాఁతి కులాధియే సుమీ. ౧౮.

గౌతమి యే మనునో?

---

*సపత్నుల......గైకొను—సవతులయొద్దఁ జెలికత్తెవలె నడుచుకొనుము—సవతులను జెలికత్తెలవలె నాదరింపు మనిన నతి గర్వోక్తి యగును. "కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే" అని మూలము. లాఁతి=తదన్యురాలు; కులాధి=ఇంటికి, శోక కంటకమనఁ దగును.

గౌతమి—ఆడుబడుచులకుఁ జేయవలసినయుపదేశ మింతే. కుమారీ! నీ విది యంతయు మనస్సున నుంచుకొనుమీ.

కణ్వు—అమ్మా! శకుంతలా! నన్నును నీసఖురాండ్రను గౌఁగిలించుకొమ్ము.

శకుం—నాయనగారూ! ప్రియంవద మొద లయిన నాసఖురాండ్రు ఇక్కడ నుండియే మరలి పోవుదురా?

కణ్వు—అమ్మా! వీరు కూడ నొకరిచేతిలోఁ బెట్టఁబడ వలసినవారే. అక్కడికి వచ్చుట వీరికిఁ దగదు. నీతోఁ గూడ గౌతమి వచ్చును.

శకుం—(తండ్రిని గౌఁగిలించుకొని) నాయనగారూ! మలయపర్వతతటము నుండి పెల్లగించినచందనలతవలె మీయుత్సంగమునకుఁ దొలంగినదాన నయి, దేశాంతరమున నాజీవితము నేలాగునఁ గాపాడుకోఁ గలను?

కణ్వు—అమ్మా! నీ వీలాగున నేల యధైర్యపడియెదవు?

చ. అభిజనవంతుఁ డౌపతికి నర్హపుఁబట్టపుదేవి వౌచుఁ, ద
ద్విభవగురుక్రియాకలనఁ దీఱిక లేక ప్రతిక్షణంబుఁ, దూ
ర్వ్యభిముఖుఁ డైనయర్క్కు బలె సాత్మజునిం గని నీవు, మద్వియో
గభరమునన్ జనించెడువగం గణియింపక యుండు నెమ్మదిన్. ౨౦.

శకుం—(తండ్రిపాదములకు మ్రొక్కుచున్నది.)

కణ్వు—నీవాంఛితము సిద్ధించును గాక!

శకుం—(చెలికత్తెలను జేరి) సఖులారా! మీ రిద్దఱు నన్నొక్కమాటుగాఁ గౌఁగిలించుకొండి.

ఇద్దఱు—(అట్లు చేసి) సఖీ! నిన్నారా జొకవేళ నానవాలు పట్టలేక పోయెనా, యాయనపేరు చెక్కినయాయుంగరము గనఁబఱుపుము.

శకుం—సఖులారా! మీకుఁ గలిగినయీసందేహమును బట్టి నాదేహ మేమో కాని గడగడ లాడుచున్నది.

ఇద్దఱు—సఖీ! భయపడకు. అతిస్నేహము కీడును శంకించునది కదా!

శార్ఙ్గ—అమ్మా! చాలఁ బ్రొద్దెక్కినది. త్వరపడ వలయును.

శకుం—(ఆశ్రమమువంకకుఁ దిరిగి) నాయనగారూ! నే నెప్పు డయిన మరల నీతపోవనముఁ జూడఁ గాంతునా?

కణ్వు—అమ్మా! విను—

మ. చతురంతక్షితికిన్ సపత్నివయి నిష్ఠం బెద్దకాలంబు, భ
వ్యత నుద్వాహితుఁ జేసి యప్రతిరథుం దౌష్యంతి సూనున్, దద
ర్పితవిస్తీర్ణకుటుంబభారుఁ డగుచున్ విశ్రాంతుఁ డౌభర్తతో
నతిశాంతం బగునాశ్రమం బిది పదం బై యుండి నీవుం దిటన్. ౨౧.

శార్ఙ్గరవు—బిడ్డా! ప్రయాణముహూర్తము దాఁటి పోవుచున్నది. నాయన గారిని బంపివేయుము. (కణ్వునితో) ఇది యెంతసేపయిన మరల మరల నీలాగుననే పలుకుచుండును. కావున మరలుఁడు.

శకుం—(తండ్రిని మరలఁ గౌఁగిలించుకొని) నాయనగారూ! తపశ్చరణపీడిత మయిన మీశరీరము నామీఁదిబెంగచేత మఱింత కృశించి పోవును గదా!

కణ్వు—(నిట్టూర్పుతో)

క. మును నీ వుటజద్వారం
బున నిడునీవారబలి యిపుడు మొలకలెత్తెన్;
గనుఁగొన నది, నామదిఁ బొడ
మిన శోకం బెట్టు లుపశమిల్లును దల్లీ!. —౨౨.

అమ్మా! నడు. నీప్రయాణము శుభప్రద మగును గాక!

(శకుంతలయు నామెతో వెళ్లువారును నిష్క్రమించిరి.)

సఖులు—(శకుంతలను జూచి) అయ్యో! ప్రియసఖి శకుంతల మనకుఁ గనఁబడ కుండ వృక్షపంక్తి చాటు వచ్చినదే!

కణ్వు—(నిట్టూర్పుతో) అనసూయా! మీచెలికత్తె వెళ్ళినది. దుఃఖ మడఁచు కొండి. నేను మరలుచున్నాను. నాతో రండి.

సఖులు—నాయనగారూ! శకుంతల లేక పోవుటచేతఁ బాడుపడిన ట్లున్న తపోవనము నే మెట్లు ప్రవేశింతుము?

కణ్వు—బిడ్డలారా! మీస్నేహప్రవృత్తి మీ కాలాగునఁ దోఁచుచున్నది. (సవిమర్శముగా నడచి) ఆహా! శకుంతలను బంపివేసినందున నామన సెంత స్వస్థముగా నున్నది!

తే. గీ. కన్య యన్యునియర్థంబె కాన, దాని
బరిగృహీతచెంతకు నేఁడు పంపుకతన,
స్వచ్ఛ మయ్యెను నాయంతరాత్మ మిగుల
నిల్లడ యొసంగినది వెండి యిచ్చినట్లు. —౨౩.

అందఱు—(నిష్క్రమించుచున్నారు.)

గద్యము. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వర్ధాదిసాధు
వంశశేఖరనీరాకరరాకాసుధాకర రాచ్చనామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర
గుణాకరదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల మూరపురాజప్రధాన
తనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధేయాంధ్రీ
కృతాభిజ్ఞానశాకుంతలనాటకంబునందుఁ
జతుర్థాంకము.



శ్రీకృష్ణ.

శ్రీపరమాత్మనే నమః.

అభిజ్ఞాన

# శాకుంతల నాటకము.

## పంచమాంకము.

[తరువాత నాసనస్థుఁడగు రాజును, విదూషకుఁడును ప్రవేశించుచున్నారు.]

విదూ—(చెవి యొగ్గి) ఓహో! వయస్య! యవధానముతో సంగీతశాలాభ్యంతరమున నాలకింపుము. అవ్యక్తమధుర మయిన శుద్ధగీతిక యందు స్వరయోగము వినఁబడుచున్నది. హంసపదికాదేవి వర్ణముల నలవఱుచుకొనుచున్నదని నే నూహించెదను.

రాజు—ఇదిగో! నాలకించెద, నూరకుండుము.

(ఆకాశమునఁ బాట వినఁబడుచున్నది)

తే. గీ. అభినవంబైన తేనెకాపేక్ష నట్లు
మావిమంజరిఁ జుంబించి మధుకరంబ!
కమలసంవాసమాత్రసుఖంబు గనుచు
నేవిధిని విస్మరించితి వీవు దీని? ౧.

రాజు—ఓహో! యీగీతి రాగపరివాహిని కదా!

విదూ—వయస్యా! గీతి కేమి? అక్షరార్థము నీవు గ్రహించితివా?

రాజు—(చిఱునవ్వుతో) ఒకసారి యీజనమును నేను వరించితిని. కాబట్టి వసుమతీదేవిని గురించి నన్నుపాలంభించుచున్న దనుకొనియెదను. మిత్రుఁడా! మాధవ్య! నీవు పోయి హంసపదికతో "చక్కగా నన్నుపాలంభించితి వంటి" వని చెప్పుము.

విదూ—మంచిది. (లేచి) సరే గాని, మిత్రుఁడా! యీ మె యాజ్ఞవలన నక్కడి చేడియలు నాజుట్టును బట్టుకొనిరా, యచ్చరలచేతులలోఁ బడినవిరాగులకుఁ బోలె నా కింక విముక్తి గలుగదు.

రాజు—నీవు పోయి నాగరికత తోఁపఁ దెలియఁ బలుకవోయి.

విదూ—అకటా! యిఁక నేమి గతి? (నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—(తనలో) ఇటువంటియర్థము గలగీతమును వినినవాఁడ నయి, యిష్టజనవియోగము లేక యున్నను, దహింపఁబడుచున్నా నేమి చెప్పుదు? అయినను—

ఉ. తిన్ననివస్తువుల్ గనియుఁ, దీయనిపల్కుల నాలకించియున్
†మున్నెరికం దకింనుఁ గర ముత్ సుఖ మండియుఁ బ్రాణి దా నిటే
మన్న, నబోధపూర్వజనవాంతరభావనిరూఢసౌహృదో
త్పన్నవినూతనస్మృతియె తథ్యము దానికి హేతు వారయన్. ౨.

(ఆకులపడుచున్నాఁడు.)

కంచుకి—(ప్రవేశించి) అవురా! నా కింతటియవస్థ పట్టెను గదా!

ఉ. తాలిచినాఁడ నేను గులధర్మ మటందును హెచ్చరింతలో
నేలికరాణివాసముల నెల్లను నీపృథువేత్రయష్టి మున్;
గాలము పెక్కు నాళ్లు చనఁగా, నడకం దడఁబాటు గల్గునీ
వేళను నేవలంబు నిది వింతగఁ జేతికి నూఁతకోల యయ్యె. ౩.

ఇప్పుడె లోపలికి విచ్చేసినయేలినవారితోఁ, గాలవిలంబము గాకుండ ననుష్ఠింప వలసిన యీసమాచారము నేను నివేదించెదను. (రెండడుగులు వేసి) అయ్యో! నేను జెప్పఁ దలఁచిన దేమి? (స్మృతి నభినయించి) ఆ! జ్ఞప్తికి వచ్చినది. కణ్వశిష్యు లయినతపోధనులు దేవరను జూడ వచ్చిరి గదా! ఔరా! యిది యెంతచిత్రము!

‡క. పొరయుం దెలివి క్షణంబున,
మరలం ద్రుటిలోన నాదుమతి మఱి పొందున్
జరచేత, నాతి పోయెడు
తరుణంబునదీపకళిక తాక్కణముగాఁ జే. ౪.

---

† మున్నెరిక=పూర్వరాగమువలనఁ గలిగినవిరహతాపము; అబోధ...స్మృతి=పూర్వ మెఱుఁగనిదియు, జన్మాంతరమందు మనస్సున నాటినదియు నైనచెలిమివలనఁ బుట్టినక్రొత్తజ్ఞప్తి. ‡ దీనికిని దీనిపై యుపక్రమపదమునకును మూలము గొన్ని మాతృకలలో లేదు. కాన యుండఁదగనదే.

రాజునకు ధర్మకార్య మెంతయు ననతిక్రమణీయమే. అయినను ధర్మాసనమునుండి యిప్పుడే లేచినయీయనకు వెంటనే మరల నిర్బంధముగా నీకణ్వశిష్యులరాకను నివేదింప నొల్లకున్నాను. కాని తప్పదు. లోకతంత్రాధికారమునకు విశ్రాంతి లేనిదిగదా!

ఆ. వె. పూన్చె నొక్కమాఱె ప్రొద్దు గుఱ్ఱాలను;
రేయుఁ బగలు వీచు వాయు వఖిల
భూమిభార మెపుడుఁ బూనును శేషుఁడు;
నిదియె †షష్ఠభాగవృత్తి పాడి. ౫.

కావున నాపని నేను జేసెదను.

(నడచి చూచి) ఇదిగో! దేవర—

తే. గీ. ప్రజలఁ దనబిడ్డలనుగఁ గాపాడి స్వస్థ
చిత్తుఁ డయి యేకతంబ వసించు నితఁడు,
నడచి యూధాళి, బీరెండ కుడిచి పగలు
చలువనెలవున గజరాజుచందమునను. ౬.

(సమీపించి) దేవా! జయము జయము. హిమవత్పర్వతప్రాంతారణ్యవాసు లయినతాపసులు కణ్వసందేశమును గయికొని స్త్రీలతోఁ గూడ నిదె వచ్చి యున్నారు. ఏలినవారిచిత్తము.

రాజు—(ఆదరముతో) ఏమీ కణ్వులవారిసందేశము తెచ్చినారా?

కంచు—చిత్తము దేవా!

రాజు—అట్లయినచో నయ్యాశ్రమవాసులను శ్రౌతవిధ్యుక్తముగా సత్కరించి తోడ్కొని రావలసిన దని మామాటగా నుపాధ్యాయు లయినసోమరాతుగారితోఁ చెప్పు. నేనును దత్తపస్విజనులను సందర్శించుటకుఁ దగినచోట వేచి యుందును.

కంచుకి—చిత్తముదేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—(లేచి) ఎవ రక్కడ?

ప్రతిహారి—(ప్రవేశించి) దేవా! యాజ్ఞాపింపుఁడు.

రాజు—వేత్రవతి! యగ్నిహోత్రగృహాభిముఖము మార్గము చూపుము.

ప్రతి—దేవా! యిటు. ఇటు (నడచుచున్నారు.)

రాజు—(అధికారఖేదము నిరూపించి) ఎల్లప్రాణులును దాము గోరినయర్థమును బొంది సుఖింపదురు. రాజులకుఁ గృతార్థతయు దుఃఖోత్తరమే గదా!

---

† షష్ఠ.....వృత్తి=రాజు—పన్ను పుచ్చుకొనుటఁ దని భావము.

† మ. కలితౌత్సుక్యమునే ప్రతిష్ఠ యుడుపుం; గావించు నీలీలఁ గే
వలముం గ్లేశము లబ్ధపాలనపువ్యాపారం బతిశ్రాంతిసం
దలఁగింపన్ దగ దశ్రమార్థ మయినం దోఁ గాదు రాజ్యంబు మం
డలనాథాగ్రణికిన్, స్వహస్తధృతదండం బాతపత్రంబటుల్. 2.

---

† దీనిశ్లోకమునందు, విశేషించి తత్తృతీయపాదమునందుఁ, బాఠభేదము లున్నవి గాన గుణగ్రహణార్థము వాని నిటఁ బరిశీలింప వలసి యున్నది.

“శ్లో. ఔత్సుక్యమాత్ర మవసాదయతి ప్రతిష్ఠా
క్లిశ్నాతి లబ్ధపరిపాలనవృత్తి రేవం
నాతిశ్రమాపనయనాయ నచ శ్రమాయ
రాజ్యం స్వహస్తధృతదండ మివాతపత్రమ్.”

ఇది వైఖానసశ్రీనివాసాచార్యవ్యాఖ్యాసహిత మయినయాంధ్రలిపిముద్రితగ్రంథములోనిపాఠము. ఈపాఠమునకే దానియందు వ్యాఖ్య చేయఁబడి యున్నది గాని దీనఁ బాఠభేదము లున్నట్టు లందుఁ జెప్పఁబడ లేదు. అయినను దీనిని విచారింతము. ఇష్టవస్తుస్మరణాదులచేఁ గాలవిలంబన మోర్వ లేమి యౌత్సుక్య మనఁబడును. ప్రతిష్ఠ యనఁగా రాజ్యలాభము(కర్త) రాజునకు నౌత్సుక్యమును మాత్రము పోఁగొట్టు ననియుఁ, దత్పరిపాలనవ్యాపార మీలాగున మనఃక్లేశమునే కలిగించు ననియుఁ, బ్రథమద్వితీయపాదముల వివరించి, యీరెండింటిఫలితార్థములను మూఁడవపాదమున నాతిశ్ర మేత్యాదివాక్యద్వయముచేఁ గ్రమముగఁ జెప్పుచున్నాఁడు; కనుక నవ్వాక్యద్వయము పైరెండు వాక్యములకు ననుకూలముగా నుండ వలయును. అయినను నుదాహృతపాఠమున మొదటిది మొదటిదానికిఁ బోలి, రెండవది రెండవదానికిఁ బొసఁగి యున్నట్లు గనఁబడుట లేదు. ఎట్లనఁగా—

1. ‘అతిశ్రమాపనయనాయ=అధికశ్రమమును బోఁగొట్టుటకొఱకు, న=కాదు;’ ఇది ప్రథమపాదఫలితార్థము. రాజ్యలాభ మౌత్సుక్యమాత్రమే యపనయించు నని యందుఁ జెప్పియున్నాఁడు గనుక మాత్రశబ్దప్రయోగసారస్యముచేత నది యతిశ్రమాపనయనము చేయ లే దను భావ మిందున స్పష్టపడుచున్నది.

2. “శ్రమాయచ=శ్రమముకొఱకును, న=కాదు;” ఇది ద్వితీయపాదఫలితార్థము గావలసిన దయినను నట్టిదిగా నుండ లేదు. లబ్ధపరిపాలనవృత్తి యీవిధముగాఁ గ్లేశపఱచు నని తా నిప్పు డనుభవించుచున్నశ్రమమును రాజు ముందు దెలిపికొని యున్నాఁడు గనుక, శ్రమముకొఱకును గా దనునీవాక్యము కేవల మనతనికి స్వవచన

వ్యాఘాతదోష ముత్పాదించుచున్నది. క్రమముకొఱకే యగునను నర్థ ముపపాదిత మయినప్పుడు గాని తద్దోషము పరిహరింపఁబడదు. కాఁబట్టి "న చ క్రమాయ" యను నీతృతీయపాదద్వితీయవాక్యము "న చాక్రమాయ" యని సముచ్చయార్థకచకార దీర్ఘముతోడ నుండుఁగాఁ బుట్టి, కాలక్రమమున నాకీతిని మాఱి పోయిన దేమో యని తోఁచుచున్నది. దీర్ఘ మయినయెడల "అక్రమాయ చ=క్రమాభావముకొఱకును ; నప కాదు; అనఁగా నిందు నఞ్ను .. రెం డున్నవి గనుక, క్రమము లేమికిని గా దనఁగా క్రమముకొఱకే యగు ననునర్థము నుత్పాదించియది పూర్వోక్తదోషముఁ బరిహరించును. కాటవేమభూపాలునివ్యాఖ్యానమందు "న నక్రమాయ" యని కనఁబడుచున్నట్లు మానియర్ విలియమ్సు తనయాంగ్లవ్యాఖ్యానమున వ్రాసియున్నాఁడు. ప్రస్తుతదోష పరిహారమునకుఁ జాలినది గాన, నాపాఠ మయినను ప్రశస్తమే. ఇది యిట్లుండఁగా "నాతిక్రమాపనయనాయ యథా క్రమాయ" యని క్రమముకొఱ కయిన ట్లతిక్రమాపనయనముకొఱకుఁ గా దనునర్థ మిచ్చు నొకశ్లోకపాఠము నాగరప్రతియందుఁ గనఁబడుచున్నది. ఇది "న చ క్రమాయ" యనుపాఠమునందు దోష మున్నట్లు సూచించుచు-దానికంటె మంచిది గానే చూపట్టుచున్నది గాని "నచాక్రమాయ", "ననక్రమాయ" యనువానిలో నేదేని యొకటి కవిహృదయ మని తోఁచుచున్నది. కానిచో "అధికారఖేదం నిరూప్య" యనుచేష్టితమునకును, సర్వః ప్రార్థిత మర్థ మధిగమ్య సుఖీ సంపద్యతే జంతుః. రాజ్ఞాం తు చరితార్థతా దుఃఖోత్తరైవ." యనుతనయుపక్రమవాక్యములకును శ్లోకార్థము విరుద్ధ మగును.

ఇంతవఱకును జేసినవిమర్శనమువలన "నచక్రమాయ" యనుపాఠమునందు దోష మున్నట్లు దేలుచున్నది గదా! అట్లు దోషమే యున్నయెడలఁ బండితు లేల దాని నాదరించుచున్నా రనుసందేహ మిది చదువువారికిఁ గలుగ వచ్చును. అయినను శ్లోకము నాలవపాదము గూడఁ బరిశీలించినమీఁదటఁ దత్సంశయ ముపశమింపఁబడును.

"రాజ్యం స్వహస్తధృతదండ మి వాతపత్రమ్" ఇది ౧, ౨, 3 పాదములఁ జెప్పఁబడినయంశమున కుపమాన మయినచతుర్థపాదము. రాజ్యము స్వహస్తముతోఁ గాఁడను బట్టుకొన్న గొడుగువంటి దని దాని కర్థము. గొడుగు తన్ను మోయ వలసి వచ్చినందునఁ బాంధునికిఁ గొంతశ్రమమును నాతపాదినివారణముచేత సౌఖ్యముఁ గూడ నిచ్చుచుండును గాని కేవల మాయాసమే యాపాదింపదు గావున, నీయుపమానమునుబట్టి రాజ్యముకూడ నట్టిదే యగునని యోజించి 'నచక్రమాయ' యనుపాఠమును బెద్దలాదరించుచున్నారు. అయినను నుపమేయ మయినరాజ్యముధర్మము లిట్టి వని పయిని జెప్పఁబడి

రాజా—(ఆలకించి యాత్మగతము) కార్యానుశాసనపరిశ్రాంతుల మయిన మేము వీనిచే మరలఁ బ్రొత్తవార మయితిమి గదా!

* విదూ—(నవ్వి) మిత్రుఁడా! నీవు † గోపతివి గదా! పరిశ్రాంతి నీకుఁ గా కుండు టెట్లు?

రాజా—(చిఱునవ్వుతో నడుచుచున్నాఁడు.)

ప్రతీ—దేవా! యిదిగో! దాపున హోమధేనువు గలిగి యున్న యగ్నిహోత్ర గృహంబు ముంగిటిమంటపము. ఇప్పుడే తుడిచి శుభ్రపఱుచుటచేత శోభిల్లుచున్న దీనిని దేవర యారోహింతురు గాక.

రాజా—(ఆరోహించి పరిజనము మూఁపుపైఁ జేయి వేసికొని నిలుచుండి) వేత్రవతీ! మహానుభావు లయిన కణ్వమహర్షులు నాయొద్దకు ఋషుల నేయుద్దేశముతోఁ బంపి యుందురో?

ఉ. సంచితపుణ్యు లౌ ఋషులు సల్పు తపంబులు విఘ్నమొందెనో,
కొంచెనో యెవ్వఁ డేని కుజనుండు తపోవనజంతులన్, నిరో
ధించెనో నా యసచ్చరిత దీవలకుం ‡ బ్రసవంబు, నిశ్చయం
బెంచక నామనం బిటు లనేకవితర్కసమాకులం బగున్. ౧౦.

ప్రతీ—దేవా! ఋషులు సచ్చరిత్రము లను నానందించువారు గనుక, దేవరను సంభావించుటకు నిట వచ్చి యుందురని నేను దలంచెదను.

[తరువాత గౌతమితో శకుంతలను బురస్కరించుకొని మునులును, వారికి ముందుఁ బురోహితుఁడును, కంచుకియుఁ బ్రవేశించుచున్నారు.]

కంచు—మహాత్ములారా! యిటు, ఇటు.

శార్ఙ్గ—శారద్వత!

శా. భావింపన్ మరియాగ [illegible]
దేవర్ణంబున నల్పుఁడుం గుపథమం డెవ్వండుఁ బోఁ [illegible]
నే వేళన్ వసియింతుఁ గాన [illegible]
[illegible] ౧౧.

శార—పురప్రవేశమువలన నీ విట్లగుట యుచితమే. నేనును—

* [illegible] † గోపతి [illegible] ‡ ప్రసవ [illegible]

రాజు—అగుఁ గాక. పరదారను తేఱి చూచుట పాడి గాదు.

శకుం—(గుండెలమీఁదఁ జేయి వేసికొని తనలో) హృదయమా! యార్యపుత్రునియభిప్రాయము తెలియకయే నీ విట్లు తల్లడిల్లెద వేమి? ధైర్యము నవలంబింపుము.

పురో—(ముందఱకు వచ్చి) దేవా! ఈ తాపసులు యథావిధిగాఁ బూజించి కొనివచ్చితిని. వీరు తమయుపాధ్యాయులయొద్దనుండి యేదో సందేశము తెచ్చినా రఁట. దేవర యాకర్ణింప వలయును.

రాజు—నేను సావధానుఁడ నయి యున్నాను.

ఋషులు—(చేయెత్తి) రాజా! జయ మగుఁ గాక!

రాజు—మీ కందఱ కభివాదనము చేయుచున్నాను.

ఋషులు—స్వస్తి యగుఁ గాక! అభీష్టము సిద్ధించుఁ గాక!

రాజు—మునులారా! మీతపస్సులు నిర్విఘ్నములే కదా?

ఋషులు—క. తమ ధర్మక్రియలకు వి
ఘ్నములా సజ్జనుల నీవు గాచుచు నుండన్?
తమము దల యెత్తు నెట్టు ల
ర్యముఁడు ప్రకాశించు చుండ నంబరశిఖిన్? ౧౫.

రాజు—అయిన నా రాజశబ్దమున కర్థ మున్నది. మఱి భగవానులు కాశ్యపులు లోకానుగ్రహార్థము కుశలు లయి యున్నారా?

ఋషులు—తపస్సిద్ధి గలవారికిఁ గుశలము స్వాధీనమే కదా! వారు మిమ్ముఁ గూర్చి *అనామయప్రశ్నపూర్వకముగా నిట్లు పలుకుచున్నారు.

రాజు—వా రేమని యాజ్ఞాపించుచున్నారు?

ఋషులు—"నాకూఁతును దీని బరస్పరసంకేతమున నీవు పెండ్లియాడితివి. అందులకు నేను సంప్రీతిఁ బొంది మీయిరువురకు ననుజ్ఞ యిచ్చుచున్నాను.

చ. అనఘులలోపలన్ మిగుల నగ్రగణ్యుండవు నీవు; రూపమం
దారసి సద్వ్రతక్రియయుతాకృతి శకుంతల తుల్యగణ్యయౌ
ట్కుటదలగ నాథునాథులఁ జా సుమకాంచి పెద్దవార్యకున్
బరసిపురాణి నాటికొనఁ గాదె సుఖారవిజ్ఞాపరాధమున్. ౧౬.

---

* అనామయము=ఆరోగ్యము—ఇది క్షత్రియుని గుశల మడుగుట కుపయోగించునది.

కపటహృదయు నగువన్ను, నాఁ డాశ్రమపదమున నట్లు బాసలు చేసి మోసపుచ్చి, యిప్పు డీవిధము లయినయక్షరములచేతఁ బ్రత్యాఖ్యానము చేయుట పాడి గాదు.

రాజు—(చెవులు మూసికొని) పాపము శాంతించుఁగాక. పాపము శాంతించుఁగాక.

క. దరిఁ గోయునేఱు, తేఱున
ధరజలమును బడెని యొడ్డుద్రుమమును బలె, మ
త్పరవంశయశము కలుషిత
బఱియురపన్ను నన్నుఁ గూల్పఁ బూనెద వేలా ? ౨౨.

శకుం—కానిండు. సత్యముగాఁ బరదారశంకచేతనే మీ రిట్టు లయితిరేని, యిదిగో! నీ యానవాలుచేత మీసందేహము దీర్చివేసెదను.

రాజు—అది యుత్తమపక్షము.

శకుం—(ముద్రికాస్థానము దాఁకి చూచి) అయ్యయ్యో! నావ్రేల నుంగరము లేదే! (విషాదముతో గౌతమిని జూచుచున్నది.)

గౌతమి—శక్రావతారాభ్యంతరమున శచీతీర్థమునకు నీవు మ్రొక్కినప్పు డది జాఱి పోయినది. నిశ్చయము.

రాజు—(చిఱునవ్వుతో) స్త్రీలు ప్రత్యుత్పన్నమతు లని చెప్పుదు రదియిది.

శకుం—దైవము తన ప్రాభవ మిందుఁ బూర్ణముగాఁ గనఁబఱిచెను. పోనిండు. మీకు వే రొకటి చెప్పెదను.

రాజు—ఇప్పు డది మరల వినఁ దగినది యయినదో!*

శకుం—ఒకనాఁడు నవమాలికామంటపమున నీరు నించిన తామరపాకుదొప్ప తమచేతిలో నుండెను. †

రాజు—వినెదను. తరువాత ?

శకుం—అప్పుడు నా పెంపుడుబిడ్డ దీర్ఘాపాంగ మను లేడిపిల్ల యచ్చోటికి వచ్చినది. రాఁగానే మీరు కనికరముతో "ముందుగా నిదియే దప్పి దీర్చుకొనుఁ గాక" యని యానీరు చూపి దానిని బిలిచితిరి; కాని పరిచయము లేనందున నది మీచేతి దగ్గఱకు వచ్చినది కాదు. పిమ్మట నానీరే నాచేత నుంచుకోఁగా, వెంటనే యది చన

---

* "శ్రోతవ్య మిదానీం సంవృత్త" మ్మని మూలము. చూపఁ దగినది యయినదా యని వెక్కిరించుట. † రాజు పానము చేయునిచ్ఛతో ముందు దొప్ప తనచేత నుంచు కొన్నాఁ డని యూహించునది.

వున తెనను దీసి చేయుటకు వచ్చినది. అది చూచి "పొల్లవారును పసపారియెడల విశ్వాసముంతురు. మీర లిరువురు నడవివారే గదా!" యని మీరు పరిహాసము చేసితిరి.

రాజు—తమ పనుల నిట్టే తీర్చుకొను ప్రయత్నములో జవరాండ్రు పలుకునీ మొదలగు బూటకపుఁ దేనెమాటలకుఁ గేవలవిషయాసక్తులు లోఁబడుచుందురు.

గౌతమి—మహాభాగ ! నీ విలాగునఁ దలంపఁ గూడదు. తపోవనమునఁ బెరిఁగినయీబిడ్డ కపట మన్నమాటే యెఱుఁగినది గాదు.

రాజు—ఓవృద్ధతపస్విని !

* చ. అగపడు మానుషీతరులయందు నశిక్షితపాటవంబు డెం
బుగఁ బొడచూపుఁ బోండ్లలో; నిఁకఁ బ్రబోధసమేతలఁ జెప్ప నేటికిన్?
గగనపథంబునం దెగయఁ గానక మున్ను దపరద్విజాళిచేఁ
దగ బెదిగింపవే పరభృతల్ తమకన్నయపత్యజాతముల్? ౨౩.

---

* ఇది గంభీరభావములు గలది. వానిం దెలియుటకు మూలము కూడ నెదుట నుంట యావశ్యకము గాన నది యిట వ్రాయఁ బడుచున్నది.

"శ్లో. స్త్రీణా మశిక్షితపటుత్వ మమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః
ప్రా గంతరిక్షగమనా త్స్వ మపత్యజాత
మన్యై ర్ద్విజైః పరభృతాః ఖలు పోషయంతి."

ఈమూలమునందలి "యమానుషీషు" అనుసప్తమి తప్పనియు, స్త్రీణా మ్మనుదానికి విశేషణ మయ్యెడునట్లుగా దాని "నమానుషీణా"మ్మని దిద్దవలయు ననియుఁ గొందరు చెప్పుచున్నారు. వ్యాఖ్యానమునందు "స్త్రీణాం కామినీనాం నతు శకుంతలాయా ఏకస్యా ఏవ భవతి...అమానుషీషు మనుష్యజాతి వ్యతిరిక్తాసు తిర్యగ్జాతిష్వపి [illegible]" అని శ్లోకోక్తరీతినే యున్నది గాని వారు చెప్పినట్లు దిద్దఁబడ లేదు. స్త్రీలలో రెండు; అమానుషులు మానుషులు నని ; అమానుషులయందే యశిక్షితపటుత్వ [illegible] కనఁబడుచుండగా నిఁక మానుషులను గుఱించి చెప్పవలసిన దేమి? యను [illegible] యర్థము ప్రాచీనపాఠమువలనఁ దోఁచుచున్నది. మఱియు [illegible] దిద్దినచో స్త్రీణా మ్మను పదము నిరర్థకమే కావచ్చును. కాఁబట్టి దిద్దవలసినయవసరము కనఁబడ లేదు.

[illegible] శ్లోకమును తాత్పర్య మిట్లు యున్నది. దానికి వ్యాఖ్యాన మిట్లు వ్రాయఁబడి యున్నది. "అత్ర విచ్ఛేదకారకబీజానుగుణం కావ్యార్థో విద్యోత్యతే. తథాహి,

శకుం.—(రోషముతో) కుటిలుఁడా! నీమనసులోనియనుమానమును బట్టి సర్వము నీవలెనే చూచుకొనుచున్నాఁడవు. పయికి ధర్మకవచమును దొడుగుకొని పచ్చికఁ గప్పిన పాడునూతివలె నున్న నీ వేషము మఱి యెవ్వరు వేయఁగలరు? *

రాజు.—(తనలో) నన్ను సందిగ్ధమనస్కునిఁ గావించుచు నీపడఁతుక కోపము నిష్కపట మయినది గాఁ గాన వచ్చుచున్నది. ఇదిగో!

చ. మన మదయంబు గాఁగఁ బొడమం గడు విస్మృతి, వృత్తమా రహః
ప్రణయము నే నెఱుంగ నని పల్కినతోడనె, కల్క మిక్కిలిం
గను లెఱ్ఱ చేసి, వక్ర మగు కన్నుబొమల్ విఱుచుచున్ గఠోరపుం
† గినుకను, రెండుగా నడిమికిన్ స్మరచాపము ద్రుంచులాగునన్. ౨౮

---

అంతరిక్షగమనాత్ప్రాక్=దుష్యంతస్యమాతలినా సహ స్వర్గగమనా త్పూర్వం, స్వమపత్యజాతమ్=స్వకీయంపుత్రమ్, అన్యైర్ద్విజైః=మారీచాదిభిః, పోషయంతీతిప్రకృతార్థం నపరిత్యజతి,—(దుష్యంతుఁడు మాతలితోఁ గూడ స్వర్గలోకమునకు వెళ్ళక పూర్వము తన పుత్రుని మారీచాదులచేఁ బోషింపించిన దనుప్రకృతార్థము విడువకున్నది)'' ఇందువలన మూలములోనున్న ద్విజశబ్దము నే తెలుఁగునఁ గూడఁ బ్రయోగింపవలెను. మఱియు వ్యాఖ్యాత చెప్పక పోయినను బరభృతా శబ్దము గూడ సాభిప్రాయముగాఁ గనఁబడుచున్నది. కోకిలవలె శకుంతలయుఁ బరభృతయే కదా! "తపోవనమునఁ బెరిఁగిన యీబిడ్డ కపట మన్నమాటే యెఱిఁగినది కాదు'' అని గౌతమి యనినమాటలలో, నాగరికు లయినభవాదృశులయందుఁ గపట ముండు నను వ్యంగ్యము దోఁచుచున్నది గావున, దపోవనమునఁ బెరిఁగియు స్త్రీలు కపటకృత్యములు చేయుదు రనువ్యంగ్యము మరల నాతాపసస్త్రీకిఁ దోఁచెడునట్లు పరభృతను దృష్టాంత మిచ్చినాఁ డని యొకసారస్యము; సజాతీయ మయినకోకిలమువలనఁ దాను గర్భము ధరించి తదపత్యమును గాకముచేతఁ బెనిపింపఁగాఁ జూచుపరభృతవలె, గర్భవతి యగు శకుంతలయుఁ దన్ను మోసపుచ్చఁ దలఁచి వచ్చిన దని యూహించి నిరసించి పలికినాఁ డని యొకసారస్యము నెఱుంగవలెను. ఇట్టిభావములు గ్రహించియే పద్యము వ్రాయఁబడినది. కాన దానియందును నివి యోజించునది.

*పైపద్యములోనివ్యంగ్యార్థము పూర్ణముగా గ్రహించుటచేతనే శకుంతల యోఁపరానికోపము వచ్చి యిట్టిమాట యన్న దని యెఱుంగునది.

†కినుకను... ద్రుంచులాగునన్—కోపమున విరక్తిఁ జెంది మన్మథుని జయించులాగున నని భావము.

(ప్రకాశముగా) కల్యాణీ! దుష్యంతునిచరిత్రము జగత్ప్రసిద్ధము. అం దిది గనఁబడదే!

శకుం—మేలు! నాలుక తీపు, లోను విషము నని యెఱుంగక, పురువంశ మను నమ్మిక చేత నిట్టివానిచేతిలోఁ బడి స్వైరిణీస్థితికిం దేఁబడితిని గదా! (మొగమునఁ జెంగు వేసికొని యేడ్చుచున్నది.)

శార్ఙ్గ—స్వయంకృత మైనయిట్టిచపలకృత్యము తన్నుఁ దప్పక దహించివేయును.

తే. గీ. చేయునది యెల్లఁ బరికించి చేయ వలయు;
నందును రహస్యసంగత మనఁగ నేల?
యిట్లు లజ్ఞాతహృదయులయెడల సలుపు
సౌహృదము ప్రాణగొడ్డంపుశత్రు వగును. ౨౫.

రాజు—ఇదే మయ్యా! యీమెమాటలు నమ్మి, సదోషపరుషాక్షరముల మమ్ము దూషించెదరు?

శార్ఙ్గ—(అసూయతో) తమరు విపరీతముగా గ్రహించితిరి.*

క. జననము మొదలుగఁ బరవం
చన మెఱుఁగనిజనముపలు కసత్యము, తద్వం
చనమే చదువుగ నేర్చి
మనువారలె గావుతం బ్రమాణవచస్కుల్. ౨౬.

రాజు—ఓసత్యవాదీ! మంచిది మే మట్టివారమే. అయినను మా కీమెను వంచించుటవలన నేమి లాభము?

శార్ఙ్గ—అధఃపతనమే.

రాజు—అధఃపతనమును బౌరవు లపేక్షింతు రనుట విశ్వసనీయము గాదు.

శారద్వ—శార్ఙ్గరవా! మాటకు మాట యెందుకు? గురువుగారియాదేశము జరిపితిమి. మనము మరలి పోవుదము. (రాజుతో) రాజా!

క. కొనినఁ గొను; విడిన విడు; నీ
మన నిది యె ట్లయిన నీదుమగువయె; భార్యా
జనమునెడం గలప్రభుత, మ
గని కుర్వర సర్వతోముఖం బగును గదా! ౨౭.

గౌతమి—ముందు నడువుండి. (బయలుదేఱుచున్నారు.)

---

*"శ్రుతం భవద్భి రధరోత్తర" మ్మని మూలము—మంచిని చెడ్డగాను, చెడ్డను మంచిగాను గ్రహించితి రనుట.

శకుం—ఇం కేమి చేయుదును! నేనీమాయావిచేత మోసపోయితిని. ఏడ్చుచున్నదాన్ని విడనాడి వీరును బోవుచున్నారు. (వెంబడించుచున్నది.)

గౌతమి—(ఆఁగి) నాయనా! శార్ఙ్గరవా! యిదిగోరా! పాపము! శకుంతల యేడ్చుచు మనతోఁ గూడ వచ్చుచున్నది. పెనిమిటి కఠినచిత్తుఁడయి నిరాకరింపఁగా, నాబిడ్డ యిది యేమి చేయఁగలదు?

శార్ఙ్గ—(రోషముతో వెనుక దిరిగి) ఓసిపురోభాగినీ! యేమిది నీస్వాతంత్ర్యము!

శకుం—(భయపడి వడఁకుచున్నది.)

శార్ఙ్గ—శకుంతలా!

చ. పలుకు నరేశ్వరుం డిటులు, వాస్తవ మట్టుల యైతి వేనియుం,
గులమునపాడికిం జెడినకూఁతుర వేటికి నీవు దండ్రికిన్?
దలఁగదు నైజశుద్ధచరితం బని నిక్క మెఱింగి యుంటివా,
నిలు పతియింట దానివగ నేనియు; నీకది చాల మేలగున్. ౧౧౮.

ఉండుము. మేము వెళ్ళెదము.

రాజు—ఓతపస్వీ! యీమె నేల దూషించెదవు?

*క. ఉల్లసిలం జేయును జా
బిల్లి కుముదములనె, ప్రొద్దు బిసరుహములనే;
యొల్లరు గద వేఱొక్కరి
యిల్లాండ్రకవుంగిలికిఁ జితేంద్రియు లెందున్. ౧౧౯.

శార్ఙ్గ—కర్మాంతరసంగమువలనఁ బూర్వవృత్తమును మఱచిపోయినప్పుడు నీ వధర్మభీరుఁడ వెట్లు లగుదువు?

రాజు—(పురోహితునితో) ఇందలియొక్కువతక్కువలను గుఱించి మిమ్మే నే నడిగెదను.

క. నేనే మఱచితినో, యీమెయె
లేనిది యన్నెదునో, తెలియలే నకటా! యి

* తమతో రావలదనియు, రాజునొద్దనే యున్న నేనాఁటికయిన మేలు గలుగు ననియు శార్ఙ్గరవుఁడు శకుంతలను గద్దించి పలికినాఁడు కావున, నామెను దూషింపవలదని పలికి, యామె యిక్కడ నున్న ను [illegible] యను భావము దృష్టాంత పూర్వకముగా రా. జీపద్యమునఁ గన[illegible]చున్నాఁడు.

చో, శాలిని విడుతునా? పెం
డానను జే నంటె కిల్బిషము వారయుదునో? 30.

పురో—(ఆలోచించి) ఇప్పు డిట్లు చేయ వలయును.

రాజు—అది నా కానతింపు.

పురో—ఈమె ప్రసవపర్యంతము మాయింట నుండును. ఇట్లేలఁ జెప్పెద వంటిరా, మీకుఁ దొలుతఁ జక్రవర్తి యగుపుత్రుఁడు గలుగు నని సాధుజనులు మున్దే చెప్పియున్నారు గదా! మునిదౌహిత్రుఁడు తాదృశలక్షణములు గలవాఁ డయ్యెనేని మీ రభినందించి యామెను రాణివాసమునకు రావించుకొనుఁడు. కానిచోఁ దండ్రి యొద్ద కీమెను బంపుట యుండనే యున్నది.

రాజు—తమయిష్టము.

పురో—అమ్మా! నావెంట రా.

శకుం—భగవతీ! వసుంధరా! నాకు నీలోనికి దారి యిమ్ము. (ఏడ్చుచుఁ బురోహితునితోను, దపస్విజనులతోను, నిష్క్రమించుచున్నది.)

రాజు—(శాపమున స్మృతి చెడి, శకుంతలసంగతినే యాలోచించుచున్నాఁడు.)

[తెరలో] ఆశ్చర్య మాశ్చర్యము!

రాజు—(ఆలకించి) అ దేమయి యుండునో?

పురో—(ప్రవేశించి విస్మయముతో) దేవా! యెంత వింత జరిగినది!

రాజు—ఏమది?

పురో—దేవా! కణ్వశిష్యు లటు మరలఁగానే—

చ. తనయము దైన్య మొంపఁ దనపాలిటిదైవము దూఱుకొంచుఁ బె
ర్యెద దడియంగ గోలు మని యేడిచి బాలిక బాహు లెత్తి తాఁ

రాజు—ఏమీ? తరువాతఁ దరువాత?

పురో—అది విని, యేమిమాయ యొకో, యప్సరతీర్థమునొద్ద నాఁడురూ
పు దాల్చు నొక్క జ్యోతి పువుఁబోఁడిని గొంచు నదృశ్య మై చనెన్. ¶

---

¶ ఇందు మూలములో లేనిమాటలు గొన్ని యున్న వవి రసపోషకములు గావున వినుట కీపద్యమే యింపు. కానిచో నీక్రిందిపద్యము చదువునది.

భుజంగ. నిజాదృష్టముం బాల నిందించుకొంచున్
భుజా లూర్ధ్వవిక్షిప్తముల్ చేసి యేడ్వన్.
ప్రజానాథ! యొం డప్సర స్త్రీ [illegible]
[illegible]

అందఱు—(అద్భుతపడుచున్నారు.)

రాజు—అయ్యా! మన మీవిషయము ముందే నిరాకరించితిమి. వృథాతర్కములకుఁ బోయెద రేల? స్తిమితపడుఁడు.

పురో—(చూచి) విజయ మొందుము. (నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—వేత్రవతి! మనసు కలఁత పాఱినది. శయనగృహమునకు మార్గము చూపుము.

ప్రతీహారి—దేవా! యిటు, ఇటు.

రాజు—(తనలో)

మంద. అట్టే నిరాకరించి త్రోచినట్టిమానికన్య, న
క్కటా! యొకించుకేని భార్యగాఁ దలంప; నైన మి
క్కుటంబుగా మదంతరాత్మ గుందుచున్న దిద్యెడన్
ఘటింపఁ బోలె నాకు నత్మకంబు నామెపట్టునన్. ౩౨.

అందఱు—(నిష్క్రమించుచున్నారు.)

గద్యము. ఇది శ్రీపరమేశ్వరవరప్రసాదలబ్ధసరసకవితాధురంధర వడ్డాదిసాధు
వంశక్షీరనీరాకరరాకాసుధాకరాచ్ఛనామాత్యపౌత్ర హరితసగోత్ర పవిత్ర
గుణకదంబలక్ష్మాంబాగర్భశుక్తిముక్తాఫల సూరపరాజప్రధాన
తనూభవ విబుధవిధేయ సుబ్బరాయనామధేయాంధ్రీ
కృతాభిజ్ఞానశాకుంతలనాటకంబునందుఁ
బంచమాంకము.



శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

అభిజ్ఞాన

# శాకుంతలనాటకము.

## షష్ఠాంకము.

[తరువాత నగరపాలకుఁ డయినస్యాలకుఁడును, వానివెనుకఁ జేడ రెక్కలు గట్టినపురుషునితో నిద్దఱు తలారులును బ్రవేశించుచున్నారు.]

తలారులు—ఓరిదొంగా! చెప్పు చెప్పు. రతనాలకట్టునఁ బేరు చెక్కి యున్న యేలినవారియుంగర మిది నీ వెక్కడ దొంగిలించితివిరా?

పురు—(భయము నభినయించుచు) బాబులారా! నామీఁద దయ గలుగుండి. నే నటువంటిపని సేయను బాబులారా!

మొదటితలారి—నీ వటువంటిపని సేయ కుంటే నీకుఁ గాని బాఁపనయ్యవార వని రాజుగారు దార వోసినా రట్రా?

పురు—వినుండి మారాజా! నేను శక్రావతారము రేవులో బ్రతుకు జాలరివాఁడను బాబుగారూ!

రెండవతలారి—ఓరిముచ్చా! మేము ని న్నేమింటివాఁడ వని గాని యడిగి నార మట్రా?

స్యాల—సూచకా! వాని నే వరుసగా నంత చెప్పనీరా. నడుమనడుమ నీవడ్డు రాకు.

ఇద్దఱు—మీ సెలవు. (ఊర కున్నారు.)

స్యాల—ఓరీ! చెప్పు చెప్పురా.

పురు—వినుండి మారాజా! నేను వల గాలము నిటువంటిచేఁపలఁబట్టుకొను కొలముట్టులతో నా పెండ్లాము బిడ్డలను బ్రతికించుకొందును బాబుగారూ!

స్యాల—నీబ్రతుకు మాసుద్ద మైనదిరా.

పురు—అలా గైన వినుండి బాబుగారూ!

తే. గీ. సడి వడిన సాజ మూపని నలుపుకొనక
మాన రాదు గదయ్య యేమానిసికిని?
జాలి గలవాఁపనయ్యరే జన్నమందు
బెట్టిపంబుగ గొఱియను బట్టి చంపు. ౧.

స్యాల—సరే. తరువాత?

పురు—మరి వినండి బాబుగారూ! నా కొకనాఁడు రేవులో నొకరోహితమీను దొరకినది. కూరకోసము దానిని దఱిగితిని బాబుగారూ! తఱుగఁగానే కెంపులు దగదగలాడు నీయుంగరము దానికడుపులో నాకుఁ గనఁబడినది. వెంటనే దీనిని దీసికొని బజారులో బచ్చుల కమ్మఁజూపుచుండఁగా నీబాబు లిద్దఱు నన్నుఁ బట్టుకొన్నారు మహారాజా! మీరు నంపితిరా నంపుండి. వదలితిరా వదలుండి. నా కిది దొరకినవిత మంతె యింతే బాబుగారూ!

స్యాల—(ఉంగరి మాఘ్రాణించి) జానుకా! యిది నేఁపకడుపులోనిదన్న మాట కనుమానము లేదురా. పొలసుగంపు గొలుసుకంపు. ఇది వీనికి దొరకినజాడ మాత్ర మింకను దిన్నగా విచారింప వలెను. నగరిలోనికే వెళ్ళుదము.

తలారులు—మీ చిత్తము. (పురుషునితో) ఓరి పచ్చెకాఁడా! నడువురా.

అందఱు—(నడుచుచున్నారు.)

స్యాల—సూచక! గవనివాకిటఁ గదల నీక వీనిని గాచుకొని యుండుండి. నే నీయుంగరము పట్టుబడ్డవిత మున్నదున్నట్టు యేలినవారితో మనవిచేసి, వారి సెలవు తీసికొని వచ్చెదను.

ఇద్దఱు—చిత్తము. మీరు మహలకోసము దివాణమునకు వెళ్ళి రండి.

స్యాల—(నిష్క్రమించుచున్నాఁడు.)

ప్రథముఁడు—జానుకా! స్యాలకుఁడు గారు పోయి సేపే యయినది.

ద్వితీయుఁడు—ఓరీ! యెంత సేపును గని పెట్టుకోకుండ వెంటనే యవు శక్యా యేలినవారిసముఖమునకు?

ప్రథ—జానుకా! తల నరకక ముందు పూలదండలు వేయవలెను గదా యీపచ్చెకానికి! నా చేతు లాపనికోసము గుఱగుఱలాడుచున్నవిరా.

పురు—బాబుగారూ! నేరమేమి లేనిదే నంపివేసెదరా. మీ కది న్యాయమా మహారాజా!

ద్వితీ—(చూచి) ఓరీ! మహారాజ యేలినవారి సెలవు దీసికొని యిటు మొగ మయి వచ్చుచున్నాఁడు. ఇఁక నీవు గద్దలకు బలి యవుదువు లే.

స్థాల—(ప్రవేశించి) సూచక! యీజాలరిని విడిచి పెట్టుండి. వీని కీయుంగరము వచ్చినవిధము సరిగా నున్నది.

ప్రథ—చిత్తము సామి!

ద్వితీ—వీఁడు జమునియింటికి వెళ్ళి మళ్ళీ వచ్చినాఁడు. (పురుషుని కట్లు విప్పుచున్నాఁడు.)

పుర—(స్యాలకునికి మ్రొక్కి) మహారాజా! నాజీవనము మీది.

స్యాల—ఓరీ! యీయుంగరమునకు రావలసినవెల నీ కేలినవారు పసదన మిప్పించినారు గా. (పురుషునికి సొమ్మిచ్చుచున్నాఁడు.)

పుర—(నమస్కరించిసొమ్ము పుచ్చుకొని) నన్ను దయ దలఁచినారు మహారాజా.

సూచ—వీనిని దయ దలఁచినమాట నిజమే. కొఱతనుండి దింపి కొమ్ముటేనుఁగు మూఁపున నెక్కించినారు గదా!

జాను—(స్యాలకునితో) సామీ! యేలినవారి కాయుంగరముమీఁద మిక్కిలి మక్కువ పుట్టి యుండు నని పసదనము తెలియఁ జేయుచున్నది.

స్యాల—ఓరీ! దానియందుఁ దాపినవెలలేనిరత్నమువలన వారి కంత మక్కువ పుట్టిన దని నే ననుకోను. ఆయుంగరము చూడం గానే యేలినవారికిఁ గావలసినవారెవ్వరో తలఁపునకు వచ్చినారు. అందుచేత నే యంతగుట్టు గలమారాజయినను దానిని జూచి గడెసేపు కంట నీరు పెట్టుకొన్నారు.

సూచ—సామీ! యేలినవారికొలువు మీకు దొరకినది గదా!

జాను—*ఈసేఁపలసూడుకానికోసమ మన మేమిరా? (అసూయతోఁ బురుషునిఁ జూచుచున్నాఁడు.)

పుర—ఇందులో సగము సొమ్ము, నాకు మీరు సుట్టఁ దెచ్చినపూలవెలకోసము దీసికోండి బాబులార!

జాను—అట్లయిన మాభాగు!

స్యాల—జాలరన్నా! నీవు నా కిప్పు డనుఁగునేస్తకాఁడ వయితివి. మన కీ నేస్తము కల్లు †కరిగా జరగ వలెను. అందుకోసము మనము గవుండ్లవాని దుకాణము కడకుఁ బోదము పద.

---

* ఈసేఁపల...కోసము=పల్లెవానికొఱకు; †కరి=సాక్షి.

పురు—అట్లే పోదము.

అందఱు—(నిష్క్రమించుచున్నారు.) (ప్రవేశకము.)

[తరువాత నాకాశయానమున సానుమతి యనునప్సరస ప్రవేశించుచున్నది.]

సాను—నావంతు ప్రకారమప్సరస్తీర్థమునందు సాధుజనులస్నానము లగునంతవఱకు నుంటిని గదా! ఇఁక నిప్పు డారాజర్షి వృత్తాంతమును బ్రత్యక్షముగాఁ జూచెదను. మేనకసంబంధమును బట్టి శకుంతల నాకుఁ గేవలము శరీరమువంటిది. ఇంతియ కాక తన కూఁతు నిమిత్తము మేనక కూడ మునుపే నన్ను నియమించి యున్నది గదా? (అంతటఁ జూచి) ఏ మిది? ఉత్సవకాలమందును నిరుత్సవముగాఁ గనఁబడుచున్న దీరాచనగరు! నాకు ధ్యానముచే సర్వము నెఱుంగుశక్తి గలదు గాని సఖురాలియాదరణమును గౌరవింప వలయును. కానీ. నేను నాతిరస్కరిణీవిద్యచేత నీయుద్యానపాలికలప్రక్క నదాఁగి యుండి సర్వము నెఱింగెదను. (దిగి నిలిచినది.)

[తరువాతఁ జూతాంకురమును జూచుచుఁ జేటియు దానివెనుక వేఱొకతెయుఁ బ్రవేశించుచున్నారు.]

ప్రథమ—క. చూతము హర్షితకోకిల
జాతము, మధుమాసజీవసదృశము మధుప
వ్రాతచరణైకభగ్నముఁ
జూతును *ఋతుమంగళంబుసొంపున దీనిన్. ౧.

ద్వితీయ—సఖీ! పరభృతికా! యొంటిగా నీలో నీవు మాటాడుకొనుచున్నావది యేమే?

ప్రథమ—మధుకరికా! చూతకలికను జూడఁగానే పరభృతిక కున్మాదము గలుగును గదా!

ద్వితీయ—(త్వరగా హర్షముతో సమీపించి) ఏమీ వసంతఋతువు వచ్చినదే?

ప్రథమ—మధుకరికా! నీమదవిభ్రమగీతముల కిది సమయము సుమీ.

ద్వితీయ—సఖీ! నన్నుఁ బట్టుకో. పాదాగ్రమున నిలిచి కామదేవునిఁ బూజించుటకుఁ జూతాంకురములు గోసెదను.

ప్రథమ—మఱి నీవు పూజాఫలములో నాకు సగ మిచ్చెదవా?

ద్వితీయ—నే నడుగక పోయినను నీ కట్లే జరుగును. మనకు దేహములు రెండు గాని ప్రాణ మొక్కటియే గదా! (సఖి తన్నుఁ బట్టుకొనఁగాఁ జూతాంకుర మందు

* ఋతుమంగళంబుసొంపునన్—సర్వకార్యములకును మంగళాచరణమువలె వసంతమునకుఁ జూతపుష్పము శోభాకరమై మొట్టమొదటఁ దోఁచునదియని తాత్పర్యము.

గొనుచున్నది.) ఓసఖీ! వికసింపక యుండియును నీమామిడిమొగ్గ తొందరపడ ద్రుంచుట చేతఁ బరిమళించుచున్నది. (కపోతహస్తము పట్టి)

క. విలసితవసంతకాలిక
సుమ నో నవఁగిలిసి నిన్నుఁ జూతాంకురమా!
యలిగినరతిపతి గూర్చఁగా
వలఁగొను నైదింట నంటు మత్యధికమవై. (చూతాంకురము చిమ్ముచున్నది)

[తెరను చిమ్ముకొని కంచుకి కోపముతోఁ బ్రవేశించి]

కంచు—ఓసిరోసీ తెలియఁగనిదానా! దేవర వసంతోత్సవము నిషేధించి యుండఁగా, నీవు మావిమొగ్గను గోయుచున్నావా? వలదు వలదు.

ఇద్దఱు—(జడిసి) అయ్యా! క్షమింపుము. ఆసంగతి మాకుఁ దెలియదు.

కంచు—ఏమీ! వసంతసుమం బూచువృక్షములును వాని నాశ్రయించుపక్షులును దేవరశాసనమును దలఁ దాల్చి యుండఁగా మీరే యీసంగతి విన లేదా? చూడుండీ.

చ. నెరపదు మావిమొగ్గ చిరనిర్గత మయ్యు రజంబు; గాన నాఁ
గురవక మొందియుం §బసువు కోరకపుంపళిఁ; గంఠసంస్థల
త్స్వరములె గండుఁగోయిలలు, సన్నను శీతు; మనంబునం దొసన్
శర మరవాడి, భీతి సగసంహృతిఁ జేసె నటంచు నెంచెదన్. ౪.

సాను—ఇందు సందేహము లేదు. రాజర్షి మహాప్రభావసంపన్నుఁడు గదా!

ప్రథమ—అయ్యా! కొన్నాళ్ళక్రిందట రాణిగారితోడఁబుట్టువు మిత్రావసుఁడు గారు ప్రభువువారిపాదసన్నిధినుండి మమ్ముల నీయుద్యానవనపాలనమునకుఁ బంపి యున్నారు. అందుచేత నింతకుఁ బూర్వ మీవృత్తాంతము మేము వినియుండ లేదము.

కంచు—సరేగాని యిఁక నిట్లు చేయకుఁడు.

ఇద్దఱు—అయ్యా! మాకు మిక్కిలి కుతూహల మగుచున్నది. వినఁ దగుదు మేని మా కిది యానతిండు. ప్రభువువారు వసంతోత్సవము నేల వలదన్నారు?

సాను—మనుష్యు లుత్సవప్రియులుగదా! ఇందుల కేదో గొప్పకారణముండును.

కంచు—జగ మెఱిఁగినసంగతి యిది చెప్పక పో నేల? రాజుగారు శకుంతలను నిరాకరించుటవలనఁ గలిగినలోకాపవాదము మీ చెవిని బడియుండ లేదా?

---

§ పసువు=పరిపాకము; కోరకపుంపళన్=కోరకావస్థయందు; కంఠసంస్థలత్స్వరములు=గళమునఁ దొట్రువడు నెలుఁగు గలవి; శీతు=శీతకాలము; దొనవాఱమ్ములవాఁడి.

ఇద్దఱు—అంగుళీయకదర్శనపర్యంతము స్యాలకముఖమున విని యున్నాము.

కంచు—అట్లయిన నీకుఁ జెప్పవలసినది కొంచెమే. అట్లాయుంగరము చూడఁగానే, శకుంతలాసతిని రహస్యమునందు సత్యముగా మునుపు పెండ్లి యాడితి ననియుఁ దరువాతఁ బరాకున నట్టులు నిరాకరించితి ననియు, దేవరకు జ్ఞప్తి వచ్చినందున నప్పటి నుండియుఁ బ్రభువుగారు పశ్చాత్తాపపడుచున్నారు. ఆయన—

చ. వలవఁడు రమ్యముల్ ; బ్రకృతివర్గముతోల్త గొనండు నిచ్చ మున్
బలెఁ; బొరలాడు చిట్టు నటుఁ బాన్పనఁ, బుచ్చు వినిద్రుఁడౌచు రా
త్రులు ; తగుపల్కు పల్కి *యవరోధములన్ మొగమోట, †గోత్రసం
స్ఖలనము నొందుచున్ దడవు గానఁబడున్ బిడియంపునివ్వెఱన్. ౫.

సాను—సంతోషము సంతోషము!

కంచు—అందుచేత మనసు బాగుగ నుండక యుత్సవము నిలుపు చేయించినారు.

ఇద్దఱు—సరిగా నున్నది.

[తెరలో]

దేవా! విజయంచేయుము విజయంచేయుము.

కంచు—(చెవి యొగ్గి) ఓహో! ప్రభువారిటే వచ్చుచున్నారు. మీరు మీపని మీఁద నుండుఁడు.

ఇద్దఱు—చిత్తము. (నిష్క్రమించుచున్నారు.)

[తరువాతఁ బశ్చాత్తాపసదృశవేషుఁడయి రాజును, విదూషకుఁడును
ప్రతిహారియుఁ బ్రవేశించుచున్నారు.]

విదూ—దేవా! విజయంచేయుము. విజయంచేయుము.

కంచు—(రాజును జూచి) ఓహో! కొన్నియాకారములు సర్వావస్థలయందును సుందరములే గదా! దేవర యీవిధముగా నౌత్సుక్యమును బూని యున్నను బ్రియదర్శనుఁడే యగుచున్నాఁడు.

చ. ఎడమప్రకోష్ఠమం దొకపయిండికడెంబు ధరించి, యొక్క డా
తొడవు దొడల్చి, కావిజిగి తూలఁగ నూర్పుల మోవిఁ, జింతఁ గూ
ర్కుడుగుట నేత్రముల్ బడల, స్వోర్జితతేజుఁ డితండు చిక్కియున్
బెడఁగగు శాణఘృష్ట మయి వెల్గుమహామణిరాజమున్ బలెన్. ౬.

---

*అవరోధములన్=అంతఃపురస్త్రీలను; †గోత్రసంస్ఖలనము=ఒకతెపేరికి మఱియొకతె పేరుచ్చరించుట—మనసున నున్న శకుంతలపేరు పరాకున నుచ్చరించుట యనుట.

సాను—(రాజును జూచి) మేలు! తను నీయన నిరాకరించి యవమానపఱిచినను శకుంతల యీయననిమిత్తము వేసరుచుండుట యుక్తమే.

రాజు—(పరధ్యానమున మందముగా నడచి)

తే. గీ. ముగ్ధసారంగనయన నాముద్దుగుమ్మ
 గొరయ నపు డంత దెలిపిన నిద్ర మాన
 కకట! యనుతాపదుఃఖంబు ననుభవింప
 మేలుకొన్నది యిపుడు నా మెదుకమనసు. ౬.

సాను—పాపము! శకుంతలయదృష్టము నీకొలఁదిదే.

విదూ—(చేయడ్డము పెట్టుకొని) ఈతనికి శకుంతలావ్యాధి మరల నంకురించినదే! అది యేలాగునఁ గుదురునో నాకుఁ దెలియకున్నది.*

కంచు—దేవా! జయము. మహాప్రభూ! ప్రమదవనప్రదేశములను బరిశీలించి వచ్చితిని. అందలివినోదనస్థానముల నేలినవారు యథేచ్ఛముగా విహరింప వచ్చును.

రాజు—వేత్రవతీ! మే మీదినము ప్రొద్దెక్కి నిద్ర లేచుటచేత ధర్మాసనము నధిష్ఠింపఁ జాలము. తాను విచారించినపౌరకార్యమును బత్రికయందు వ్రాసి పంపవలయు నని మామాటగా నమాత్యపిశునునితోఁ జెప్పుము.

ప్రతీ—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నది.)

రాజు—వాతాయనా! నీవును నీపని నుండుము.

కంచు—చిత్తము దేవా! (నిష్క్రమించుచున్నాఁడు.)

విదూ—మిత్రుఁడా! నీ విప్పు డీఁగ నయిన లే కుండఁ జేసితివి. ఇంకఁ జల్లనయి తాపము నడఁగింపఁ జాలినయీరమణీయప్రమదవనప్రదేశమున హాయిగాఁ గ్రీడింపఁ గలవు.

---

*"నాబుద్ధి కేవలము మంత్రిముద్దవంటిది" ఇత్యాదివిదూషకోక్తిని మనము ముందు చదువఁ బోవుచున్నాము. దానివలన దుష్యంతునకు శకుంతలానురాగము లే దని విదూషకుఁడు నమ్మియున్నట్టు దోఁపఁగలదు. మఱియు "ఆమెను నేను నిరాకరించినప్పుడు నీవు (విదూషకుఁడు) నాయొద్దను లేవు" ఇత్యాదివక్ష్యమాణరాజవాక్యమువలన, శకుంతలను రాజు నిరాకరించినసంగతి కూడ విదూషకునికిఁ దెలియునట్టులుస్పష్టముపడఁగలదు. ఇట్టిస్థితిలో శకుంతలానామోచ్చారణ మయిన లేని "ముగ్ధసారంగనయనే" త్యాది" ప్రకృతరాజవాక్యము శకుంతలను గూర్చి యని తలఁచి "ఈతనికి శకుంతలావ్యాధి మరల నంకురించినదే" యని విదూషకుఁ డనుట యెట్టు పొసఁగునో యాలోచింపవలయును.

రాజు—(నిట్టూర్పు పుచ్చి) వయస్యా! యాపదలు సందు చూచి వచ్చు నను మాట యసత్యము గాదు సుమీ. చూడుము.

తే. గీ. మునిసుతాప్రణయస్మృతిఁ *బాసఁగుపఁజుచు
తమము విడిచెను నాడు డెందమును సఖుఁడ!
కొలఁకులను గాఁడ నేయంగఁ జేఁకువింటఁ
బూలశరమును సంధించె సూనశరుఁడు. ౭.

విదూ—మఱి యుండుము. నే నీదుష్టుఁగట్టెతో మన్మథబాణము నాడఁ గొట్టెదను. (కట్టె యెత్తి చూతాంకురమును రాలఁ గొట్టఁ జూచుచున్నాఁడు.)

రాజు—(చిఱునవ్వుతో) నీబ్రహ్మతేజస్సు కనఁబడినది. సరే గాని మిత్రుఁడా! నాప్రియురాలి నించుకంత యనుకరించుచున్న యీతీఁగలచేత నాచూడ్కికి వేడ్కఁ జేయఁ గోరుచున్నాను. నే నెక్కడఁ గూరుచుందును?

విదూ—వయస్యా! "మేము మాధవీమంటపమునఁ బ్రొద్దుపుచ్చుచుండెదము. స్వహస్తముతోఁడను బూజ్యారా లగుశకుంతలప్రతికృతిని మేము వ్రాసి యుంచినచిత్రఫలకము నక్కడకుఁ దీసికొని రమ్మ"ని యాసన్నపరిచారిక యగుచతురికకు నీ వానతిచ్చితివి గదా!

రాజు—చెలికాఁడా! హృదయవినోదస్థాన మనఁగా నట్టిదే సుమా! అక్కడకే మార్గము చూపుము.

విదూ—ఇదిగో! నిటు వయస్యా!

ఇద్దఱు—(నడుచుచున్నారు.)

సాను—(వారిని వెంబడించుచున్నది.)

విదూ—మిత్రుఁడా! మణిశిలాఫలకసనాథ మయినమాధవీలతామంటప మిదిగోఁ †పుష్పాద్యుపహారములచేతను మనోహర మయి నిశ్చయముగా మనకొఱకు స్వాగతము పలుకుచు వేచి యున్నట్లు తోఁచుచున్నది. ఇందుఁ బ్రవేశించి కూరుచుందుము.

ఇద్దఱు—(ప్రవేశించి కూరుచున్నారు.)

సాను—ఇప్పుడు నే నీతీఁగదగ్గఱనుండి ప్రియసఖి ‡ప్రతికృతి నాలోకించెదను. తరువాత బహువిధ మయినభర్త్రనురాగ మామెకు నివేదించెదను. (తీఁగదగ్గఱ నిలుచున్నది.)

*పాసఁగుపఁజుచు=నశింపఁజేయు; కొలఁకులను=తీవస్థానములను †పుష్పా...చేతను=పూలు మొదలగుకానుకలచేత; ‡ప్రతికృతి=చిత్తరువు.

రాజు—మిత్రుఁడా! నా కిప్పు డంతయు జ్ఞప్తికి వచ్చుచున్నది. శకుంతలా ప్రథమవృత్తాంతము నీతోఁ గూడఁ జెప్పి యుంటిని గదా! ఆమెను నేను నిరాకరించి నప్పుడు నీవు నాయొద్దను లేవు గాని యంతకుఁ బూర్వ మయిన నయ్యాయిముచ్చటలయం దామెపే రెన్నఁడు నెత్త వయితివే. నావలె నీవును బరాకుపడితివా యేమి?

విదూ—నేను బరాకుపడ లేదు గాని, నీవు సర్వము నాతోఁ జెప్పి, చిట్టచివర నది నవ్వులాటలమాట గాని నిజముగా జరిగినది గానట్లు తేల్చి వేసితివి. *నాబుద్ధి కేవలము మంటిముద్దవంటిది గనుక నే నది యట్లే యనుకొంటిని. ఇంతకుఁ గావలసినది కాక మానదు గదా!

సాను—అది యట్టిదే.

రాజు—(ధ్యానించి) మిత్రుఁడా! నన్నుఁ గాపాడుము.

విదూ—అయ్యో! యేమిది? నీయం దిటువంటిది కాఁ దగదు గదా! సత్పురుషు లెప్పుడును శోకమునకు లోఁకువ గారు. వయస్యా! గొప్పగాలి గొట్టినను గొండ లూఁగు లాడవు గదా!

రాజు—మిత్రుఁడా! నేను నిష్కారణము దన్ను నిరాకరించితి నని దుఃఖపరవశురా లయినప్రియురాలియవస్థ యిప్పుడు దలఁపునకు రాఁగా, నాజీవితమును గాపాడు కొనునుపాయ మేదియు నాకుఁ దోఁప కున్నది. అయ్యో!

ఉ. నేను నిరాకరింప నిట, నెవ్వగతోఁ దనవారితోడఁ బో
బో, నట నిల్వు మంచు గురుఁ బోలినశిష్యుఁడు దన్నదల్పఁ, బ
ద్మానన క్రూరు న న్నరల నశ్రుకణావిలదృష్టిఁ జూచె; నా
దీనపుఁజూపు కట్టా! †విషదిగ్ధశరంబటు లేర్చు నాహృదిన్. ర.

సాను—అవురా! స్వకార్యపరత్వ మన నిట్టిదియే గదా! ఈయనసంతాపమునకు నేను సంతోషపడుచున్నాను.

విదూ—ఓయీ! నా కొక యూహ తోఁచుచున్నది. ఎవ్వఁడేని యాకాశసంచారి యొకఁ డామె నెత్తుకొని పోయె నేమో!

రాజు—‡పతిదేవత నామెను బరుఁ డెవ్వఁ డంటఁ గలఁడు? మీనాక్షికి మేనక గదా కన్నతల్లి యని వింటిని. తత్సహచారిణు లామెను గొని పోయి యుందు రని నా మనస్సునకుఁ దోఁచుచున్నది.

---

*ద్వితీయాంకమునందలి చిట్టచివరపద్యములోని విషయమును స్మరించి యిట్లు చెప్పి నట్లు తెలియుఁగునది. † విషదిగ్ధశరంబు—విషము పూసినబాణము. ‡పతిదేవత=పెనిమిటి దేవుఁడుగాఁ గలది—పతివ్రత.

సాను—ముఖపునకుఁ గాని తెలివికి నాశ్చర్యపడఁ దగినది గాదు.

విదూ—అట్లయినఁ, గొన్నాళ్ళలో నామెసమాగమము నీకుఁ దప్పక కలుగును.

రాజు—అది యెట్లు?

విదూ—భర్తృవియోగము చేతను బరితపించెడుతమకూఁతును దల్లిదండ్రులు చిర కాలము చూచి భరింప లేరు గదా!

రాజు—మిత్రుఁడా!

తే. గీ. స్వప్నమో, మాయయో, మతిభ్రమమొ, కావ
దల్పఫల మైనపుణ్యసమాప్తియో, య
తీత మయ్యె; న దింకిటఁ దిరుగ రాదు;
పాఱుఁ గోర్కులు దరి లేనియేఱు లగుచు. ౯.

విదూ—అట్లు గాదు. వయస్యా! యవశ్యముఁ గావలసినయర్థసమాగమ మత్కర్కి తముగా సంఘటిల్లును. అందుల కీయుంగరమే తార్కాణము.

రాజు—(ఉంగరముఁ జూచి) అయ్యో! యటువంటి దుర్లభస్థానమునుండి జారి పోయినది. ఇది శోచనీయము గదా!

తే. గీ. అంగుళీయమ! నీపుణ్య * మస్ప దీయ
మట్లు లస దని ఫలమును బట్టి తలఁతు;
నరుణనఖసుందరము లై నయామెవ్రేళ్ళఁ
బట్టఁ గలిగియు నీ వయో! భ్రష్ట మైతి. ౧౦.

సాను—ఇది వేఱొకరిచేతిలోఁ బడి యున్న నిజముగా శోచనీయమే యగును.

విదూ—ఓయీ! యీనామముద్రికకు నీ వేసందర్భమున నామెహస్తసంసర్గము గలిగించితివి?

సాను—నాకుఁ గూడ నిది యడుగ వలయు ననియే కుతూహలము.

రాజు—ఆలకింపుము. అప్పుడు నగరమునకు మరలఁ బ్రయాణ మగుచున్న నన్నుఁ జూచి, ప్రియురాలు కన్నుల నీరు పెట్టుకొనుచు "యెంతకాలమున కార్యపుత్రులు దపి పొందు నాకుఁ దిరుగ ననుగ్రహింతురో" యని వచించినది.

విదూ—తరువాత?

రాజు—అప్పుడు నే నీనామముద్రిక నామెవ్రేలికిఁ బెట్టి యిట్లు పలికితిని.

---

* అస్ప...దని—నాపుణ్యమువలెనే యల్ప మని.

తే. గీ. *దినదినము కొక్కటొకటిగా దీనిమీఁద
వాఁడు నామాక్షరముల నెన్నాళ్ళ నెంతు
వన్ని నాళ్ళకుఁ బుత్తు నీసన్నిధికిని
నిన్ను నాయంతిపురముఁ జొందించుజనుని. ౧౧.

అని పలికినపలుకు గూడ దారుణుఁ డను మఱపుచేత నేను జరుప నయితిని.

సాను—ఈగడువు మంచిదే గాని, విధి యిందులకుఁ బ్రతికూలుఁ డయ్యెను.

విదూ—మఱి యది జాలరివాఁడు తఱిగినరోహితమీనుకడుపులోని కెట్లు వచ్చెను?

రాజా—శచీతీర్థమునకు మ్రొక్కుచుండఁగా మీసఖి వ్రేలినుండి యూడి యది గంగాప్రవాహమునఁ బడి పోయినది.

విదూ—సరి సరి.

సాను—అందునఁ గదా పాప మధర్మభీరువ కీరాజర్షికి శకుంతలతోడి వివాహవిషయమున సనుమానము దట్టినది. అయిన నింతటియనురాగమునకు కానవా లెందులకో?

రాజా—నే నిప్పు డీయుంగరము నుపాలంభించెదను.

విదూ—(తనలో) ఈతఁడు పిచ్చివారిని బడుచున్నాఁడు. (నవ్వుచుఁ బ్రకాశముగా) నేను గుజ్జుఁడ నయి యుండఁగా నీవు కుటిలముగా నేల యుంటి వని యీదండకాష్ఠమును నే నుపాలంభించెదను.§

రాజా—చ. మృదులమనోహరంబు లగు వ్రేళులు గల్గినకల్కిహస్తముల్
వదలి, తొటుల్ గభీర మగువారి మునింగితి వంగుళీయమా!

అయినను—

ఇది జడవస్తు వౌటను గ్రహింపఁగ నేరదుకో గుణంబు; నే!
హృదయము తాయి చేసికొని, యేఁ బ్రియ నేల నిరాకరించితిన్? ౧౨.

విదూ—‡అయ్యో! యాఁకటికి నేనే దౌర నయ్యెదను.

---

*దినదినమిత్యాది యగుగడువు శకుంతలకుం గాలక్షేపార్థ మని తోఁచెడు:

§ దీనిమూలము మాతృకాంతరమున నున్నది. ‡"ఆః అహంఖలు బుభుక్షయా ఖాదితవ్యోస్మి" యని ఛాయ. "ఆః ఇతి పీడాయాం నిపాతః (సాహిత్యటీకా) బుభుక్షయా శకుంతలాం ప్రతి రిరంసయా రాజ్ఞ ఇతి శేషః. అహంఖలు అహమేవ ఖాదితవ్యః భోక్తవ్యః. శకుంతలా దుర్లభా; నిశేన్యః కోపి నవిద్యతే; శకుంతలాధియా మామేవ గ్రహిష్యతీతి పలాయనచింతా వ్యజ్యతే." యని వ్యాఖ్య. రాజునకుఁ గల శకుంతలాభోగేచ్ఛాతాప మయిన యీయాఁకలి, శకుంతల దుర్లభురాలు గనుకను, దక్కిన కొక్కు లెవ్వరు లేరు గనుకను, శకుంతల యనుతలంపున నన్నే పట్టికొట్టుకొనునేమో యని పాఱిపోవఁ జాచుచున్నాఁ డనువ్యంగ్య మిందుఁ దోఁచుచున్నది.

రాజు—హా! ప్రియురాలా! నిన్ను నకారణముగాఁ బరిత్యజించినందులకయి యనుతాపతప్తహృదయుఁ డగునీజనునిఁ బునర్దర్శనమున నీ వనుగ్రహింపవలెఁ జుమీ.

చతురిక—(తెర చిమ్ముకొని వచ్చి) చిత్రగతురాలు దేవి యిదిగో! (చిత్రఫలకమును జూపుచున్నది.)

విదూ—వయస్యా! మేలు మేలు! భావములపొందిక మధురాకృతిం బట్టి యెంత దర్శనీయముగా నున్నది! ఇందలినిమ్నోన్నతప్రదేశములయందు నాచూపు దొట్రిల్లుచున్నట్లే యున్నది!

సాను—ఓహో! ఏమి! యీరాజుతూలికానైపుణ్యము! ప్రియసఖి నాదుకన్నుల యెదుట నున్న దనుకొనుచున్నాను.

రాజు—క. చిత్తరువునఁ బొంకముగా
వ్రాత్తనిచోఁ దిన్నచేయ నగుఁ గథ దేనిన్;
చిత్తరిలావణ్యము కిం
చిత్తే యేర్పడియె శిఖచే, నటు లైనన్.* ౧౩.

సాను—పశ్చాత్తాపముచే నధిక మయినస్నేహమునకును, గర్వరాహిత్యమునకును నీమాట దగియే యున్నది.

విదూ—వయస్యా! యిచ్చట ముగ్గు రమ్మలు గనఁబడుచున్నారు. వీ రందఱు నందగత్తెలే. ఇందుఁ బూజ్యురాలా శకుంతల యెవరు?

సాను—ఇందు సఖీరూపము దెలిసికొనలేకపోయెనే. ఈతనిచూపు నిరర్థకమే.

రాజు—అయినను నీ కెవ రని తోఁచుచున్నది?

విదూ—నే నామెను బ్రత్యక్షముగఁ జూచి యుండ లేదు—కాని, యిదిగో! ముడి వీడి చెదరి క్రొవ్విరులు జాఱుచున్న పెన్నెఱులకొనలతోడను, చెమ్మటబొట్టు లంకురించినమొగముతోడను, సోయగముగాఁ జాఁచినచేతులతోడను గనుపట్టుచు, నీళ్లు పోయుటచేత నిగనిగ లాడుచున్న క్రొంజివుళ్ళ రంజిల్లెడుమావిమ్రానిక్రేవను గొంచెము బడలినదానివలె వ్రాయఁబడి యున్నయీయామె శకుంతల యనియుఁ, దక్కినయిద్దఱు నామెచెలికత్తె లనియు నూహించెదను.

---

*దిద్ది తిన్నపఱుచుకొనుటకు నవకాశము గలచిత్తరువునందును శకుంతలసౌందర్యము పూర్ణముగా వ్రాయుటకు రాక, కొంచెమే వచ్చిన దనుట. శకుంతలను జూచు నాసక్తిచేత రాజు ట్లనుకొనుచున్నాఁడు; గాని యామెరూప మందులో సరిగానే యున్న దని సానుమతివాక్యము తెలుపుచున్నది.

రాజు—నీవు నిపుణుఁడవోయి. ఇచ్చట నా సాత్త్విక భావచిహ్నములున్న వినుము.

తే. గీ. సోఁకఁ జమరించు నా వ్రేళ్లు చూడు మిచటఁ,
గానఁబడియెడు §మఱక రేకలకుఁ బొంత ;
వదిగో! చెక్కిట రాలె నా యశ్రుకణము,
‡వర్ణ ముబుకుట నూహింప వచ్చు నదియు. ౧౪.

చతురికా! నే నీవినోదస్థానము సగమే వ్రాసితిని. నీవు పోయి రంగులను దీసికొని రా.

చతు—అయ్యా! మాధవ్యా! చిత్రఫలకముఁ బట్టుకో. రంగులబరిణను దీసికొని వచ్చెదను.

రాజు—నేనే దీనిని బట్టుకొనియెదను. (అట్లు చేయుచున్నాఁడు.)

చతు—(నిష్క్రమించుచున్నది.)

రాజు—చ. మొదలను వచ్చి నాకనులయందలి నిల్చినప్రాణవల్లభన్
వదలి, యిటుక పటంబునను వ్రాసెనరూపు బహూకరింతు నే ;
నదములవారిపూర మగు*ళాలును దారిని దాటి వచ్చి, పె
ల్లొదవెడుదప్పిఁ దీర్చుతలఁ బొందితి మిత్రమ! యెండమావులన్. ౧౫.

విదూ—(తనలో) సత్యముగా నీతఁడు నది నతిక్రమించి మృగతృష్ణనే దగిలినాఁడు. (ప్రకాశముగా) వయస్యా! నీ వింక నిందు వ్రాయ వలసిన దేమి ?

సాను—నా సఖికి నెయ్యమైన యే మనోహర మగునో దాని నెల్లను వ్రాయఁ గోరుచున్నాఁడు గా వలయు.

రాజు—ఆలకింపుము.

చ. పులినములందు హంసయుగముల్ గలమాలిని, దానియోర †జం
క లెలయుమంచుఁగొండయనఘస్తుతపాదములన్ లిఖింప నా
వలఁతు రచింపఁ, గొమ్మలను వల్కలము లాడెడు ద్రుమాని క్రింద, డా
పలికను జింకకొమ్మకొనపై జిల వోవఁగ రాయుచేడిసిన్. ౧౬.

విదూ—అట్లయినచో నీచిత్రఫలకము, బిరుసుగడ్డములు వ్రేలాడుజడదారుల మూఁకతోఁ గూడ నితఁడు నిశ్చయముగా నింపఁగలవాఁడే.

రాజు—మిత్రుఁడా! యింకొకటి. శకుంతలయలంకారము నిట వ్రాయఁదలఁచి మఱచి పోయితిని.

---

§మఱక = దాగు; ‡వర్ణము = రంగు. *ళాలు = [illegible]; †జంక లెలయు = లేళ్లుగల [illegible] [illegible] పాలిక = [illegible] జిల = దురద.

విదూ—అది యేమి!

సాను—వనవాసమునకు సౌకుమార్యమునకుఁ దగినట్టి జోడో యదియే గాఁగలదు.

రాజా—ఆ. వె. చెవిని గోడిమఁ జెరివి, చెక్కిలిదాఁక ను

‡వేల ఫేనకరువులు శిరీష మునుపు;

సదమలేందుకిరణమృదుల మృణాళనూ

త్రము గుచాంతరమున వ్రాయ సఖుఁడ! ౧౬.

విదూ—వయస్యా! యే మిది? ఈమె చెంగలువరేకువంటి తన క్రొంగేలితో మొగము మూసికొని బెదరు గదిరిన ట్లున్నది. (సావధానముగా నిరూపించి) ఆఁ! తోట్టుకోడుకు పూఁదేనియ దొంగ, యీతుష్టదపాలసుఁడు పూజ్యురాలి మోముమీఁది కెగురుచున్నాఁడు.

రాజా—మిత్రుఁడా! యీదోసకారిని వారింపుము.

విదూ—అవినీతులను దండించువాఁడవు గావున, నీవే వీనిని వారింప సమర్థుఁడవు.

రాజా—ఓపూఁదీఁగలయనుఁగువిందా! నీ విక్కడఁ బరిపరిన ఖేద మేల యనుభవించెదవు? ఇదిగో!

క. పూవుల వ్రాలి మధుపసతి

తావక మగురాక వేచుఁ దాత్పర్యమునన్;

త్రావదు నీతోఁ గాకది

పూవుందేనియను దప్పి వోడమిన దయ్యును. ౧౭.

సాను—ఇప్పుడు దీని కెంత మర్యాదగా నివారించెను!

విదూ—పెడఁ బట్టి గెంటినను జూతఁబట్టి వ్రేలాడునది గదా యీమధుపజాతి!

రాజా—ఓరీ! నీవు నాశాసనమున నిలువ కున్నావుగా! మంచి యిది వినుము.

ఉ. స్రుక్కని లేఁతమావిచిగురుం బలె నాసను గొల్వఁదానిఁ, జెం

పెక్కరతోత్సవంబులతి నీ సదయంబుగఁ గ్రోలుదాని, నా

చక్కనికొమ్మబింబనిభ చారుతరాధరమున్ స్పృశించితే

నెక్కటిఁ జేటి! నీకుఁ గమలోదరమందు విధింతు బంధమున్. ౧౮.

విదూ—ఇంతటితీవ్రదండనమునకు నిది యేల భయముపడ దదియును? (నవ్వి తనలో) ఇప్పు డితనికిఁ బిచ్చి యెత్తినది. [illegible]సంపర్కమున నేను నట్టివాఁడనై

---

‡అశరువులు=కేసరములు; శిరీషముపువ్వు బెస్తపువ్వు. [illegible] —కమలనివాసము తొత్తిన కమలములో [illegible] మరి [illegible] కల మొనాలాగా మంచు నని భావము.

చతు—దారిలోఁ దరళికతోడ నున్న వసుమతీదేవిగారు, దీని నార్యపుత్రునికి నేనే యిచ్చెద నని బలాత్కారముగా నా చేతిలోనుండి బరణిని లాగికొన్నారు.

విదూ—నీయదృష్టము మంచిది. నిన్ను విడిచిపెట్టినారు.

చతు—అప్పుడు చెట్టుకొమ్మను దగులుకొన్న దేవిగారిపయిఁటకొంగును దరళిక విడిపించు చుండఁగా నే నాసందునఁ దప్పించుకొని బయలఁ బడితిని.

రాజు—మిత్రుఁడా! దేవి చేరువకు వచ్చినది. ఈమె నామన్ననచేతను మిగుల గర్వితురాలు. నీ వీప్రతికృతిని గాపాడ వలయును.

విదూ—నన్నని పలుకుము. §(చిత్రఫలకము పట్టుకొని లేచి) నీ వంతఃపురకలహమునుండి విముక్తుఁడ వయితి వేని, నన్నుఁ గేక వేయుము. నేనుబోయి మేఘప్రతిచ్ఛంద ప్రాసాదమున నుండెదను. (తొందరగా నిష్క్రమించుచున్నాఁడు.)

సాను—అన్యసంక్రాంతహృదయుఁ డయ్యును ప్రథమగౌరవమును గనఁబఱచుచున్నాఁడు. ఈతని స్నేహము శిథిలము కానిది.

ప్రతీహారి—(పత్రహస్త యయి ప్రవేశించి) దేవా! జయము జయము!

రాజు—వేత్రవతి! నీకు దారిలో దేవి గనఁబడ లేదు గద?

ప్రతీ—అమ్మగారు గనఁబడినారుగాని నా చేతఁ బత్రిక చూచి మరలిపోయినారు.

రాజు—కార్యజ్ఞురాలు గావునఁ బని చెఱుపు కానీయదు.

ప్రతీ—"దేవా! నేఁటిదినము ధనరాశిని లెక్కించుపని యెక్కువ యయినందునఁ బౌరవ్యవహార మొక్కటిమాత్రమే విచారణము జరిగినది. అది యిప్పు డిందు వ్రాసి యంపితిని. దేవర చిత్తగించుదురుగాక" యని మంత్రిగారు మనవి సేయుచున్నారు.

రాజు—ఏదీ? పత్రిక నిటు చూపుము.

ప్రతీ—(చూపుచున్నది.)

రాజు—(చదివికొని) అయ్యో! సముద్రవ్యాపారము చేయునట్టి ధనమిత్రుఁడను వేహారి యోడ మునిఁగి చనిపోయినాఁడఁట. పాపము! వానికి సంతానము లేనందున వానిధనసంచయము ప్రభువునకుఁ జెందవలయునని యమాత్యుఁడు వ్రాసి యున్నాఁడు. హా! సంతతి లేమి యెంతకష్టము! వేత్రవతి! మహాధనుఁడు గనుక నతనికి బహుభార్యలుండ వచ్చును. ఈసంగతి విచారింప వలయును.

ప్రతీ—దేవా! యిప్పు డతనిభార్యలలో సాకేతశ్రేష్ఠికూఁతునకుఁ బుంసవనము జరిగిన దని వినికి.

---

§ "చిత్రఫలకమునకు నేలే నన్ను గాపాడు" మని పలుకుమనట.

రాజు—అటు లయిన గర్భస్థశిశువు పిత్ర్య మయినధనమునకుఁ దగియుండును. నీవు పోయి యిది యమాత్యునకుఁ జెప్పుము.

ప్రతి—చిత్తము దేవా! (వెళ్ళుచున్నది.)

రాజు—ఇటు రా.

ప్రతి—వచ్చితిని దేవా!

రాజు—సంతతి కలదు లే దనుమాట యేటికి?

క. నేయము గలబంధుగులం
జేయేజనులోడఁ బ్రజల కడఁబాటగు, నా
యాయిజనుఁడు దుష్యంతుం
డో*యఘమునఁ దక్క వారి కిది చాట పలెన్. ౨౨.

ప్రతి—ఇట్లు చాటింపఁ దగినదే. (నిష్క్రమించి మరలఁ బ్రవేశించి) ఆదనఁ గురిసినవానవలె దేవరయానకు నమాత్యుఁ డానందించెను.

రాజు—(నిట్టూర్పు పుచ్చి) అహో! సంతతి లేకపోవుటచేత నిరాధారము లయిన వంశములసంపదలు మూలపురుషునియవసానమున నిట్లే పరులపా లగును. నాయనంతర మందుఁ బురువంశసంపదలకును గతి యిట్టిదే గదా!

ప్రతి—అమంగళము తొలఁగును గాక!

రాజు—ఇసీ! సిరి రా మోఁకా లొడ్డినాఁడను.

సాను—నిశ్చయముగా నితఁడు శకుంతలను మనసున నుంచుకొని తన్ను నిందించుకొనుచున్నాఁడు.

రాజు—తే. గీ. గర్భమున నేనె చొచ్చియుఁ గాన కకట!
తలఁగితిఁ గులప్రతిష్ఠను ధర్మపత్ని,
నదన విత్తనములు చల్లి యధికమైన
ఫలము నీయంగ నున్నయుర్వరను బోలె. ౨౩.

సాను— నీసంతతి యవిచ్ఛిన్నము గాఁగలదు.

---

*అఘమునఁదక్కన్=పాపమునఁదప్ప;—దుష్యంతుఁడు తనప్రజలలోఁదండ్రిలేని వారికిఁ దండ్రియుఁ, దల్లి లేనివారికిఁ దల్లియు,నిట్లు సర్వబంధువులు తానే యగును కాని యేబంధువుగా నున్నఁ బాపము వచ్చునో యాబంధువు మాత్రము తాను గాఁ డనఁగా భర్త లేనిదానికి భర్త గాఁ డని తాత్పర్యము.

చతు—(జనాంతికముగా) ఈసార్థవాహునివృత్తాంతమున దేవరమనసు చెదినది. ఈయన నూఱడించుటకు మేఘప్రతిచ్ఛందము నుండి యార్యమాధవ్యునిఁ దీసికొని రా.

ప్రతి—బాగుగాఁ జెప్పితివి. (నిష్క్రమించుచున్నది.)

రాజా—అయ్యో! దుష్యంతునిపితృదేవతలు సంశయమునఁ బడినారు.

*చ. ఎవనికిఁ బిమ్మటన్ నిగమవిధ్యుచితంబుగ వంగసంభృతం,
దాను నివాపముల్ మఱి యొనర్చును మా కెవఁ డంచు మత్పితల్,
సూనుఁడు లేని నా విడుచు చుక్కలఁ గొన్నిట ధౌతబాష్పులై,
యానుదు రల్పశేష మగునంబువు నక్కట! విక్కమింతయున్. ౨౪.

(మూర్ఛిల్లుచున్నాఁడు.)

చతు—(తొట్రిల్లుచుఁ బట్టుకొని) దేవా! యూరడిల్లుఁ డూరడిల్లుఁడు.

సాను—అయ్యో! పాపము! దీపము కలిగియు నడ్డుతెరమూలఁగున నున్న దోషము చేత నితఁడు చీఁకటి ననుభవించుచున్నాఁడు. నే నిప్పుడే యీతనిని సుఖితునిఁ గావించెదను. అట్లు గాదు. శకుంతల నూఱడించుచు మహేంద్రజనని, యజ్ఞభాగ ప్రత్యుత్సుకు లయినదేవతలే నీభర్త నిన్ను చిరకాలమున ధర్మపత్నినిగా నాదరించునట్లు చేయఁగల రని యాపెతో నానతిచ్చుచుండఁగా విని యున్నదానను. కాఁబట్టి యంత దనుకఁ బ్రతీక్షించుటే కూడినపని. ఈజరిగినవృత్తాంతమునఁ బ్రియసఖి నూఱడించెదను. (ఆకసమున కెగిరి నిష్క్రమించుచున్నది.)

---

* శ్లో. అస్మాత్పరం బత యథా శ్రుతిసంభృతాని
కో నః కులే నివపనాని కరిష్యతీతి,
నూనం ప్రసూతివికలేన మయా ప్రసిక్తం
ధౌతాశ్రుశేష ముదకం పితరః పిబంతి.

అని మూలము. ధౌతాశ్రుశేషమ్, "ధౌత మశ్రు యేన తత్తథోక్తం తస్మా దుదకాచ్ఛేష మవశిష్టమ్" అని వ్యాఖ్యానము. సూను...నంబువు—తాను బుత్రహీనుఁ డయినందునఁ దన వెనుకఁ దమకు నిలోకములు దొరక వని యేడ్చుచుండుట గానఁ దా నున్నంతకాల మయినను దృప్తిగా నివాపవారిని గ్రోల నసువుపడక, యందులోఁ గొంత జలమును గన్నీరు గడుగుకొనుట కుపయోగించుకొనుచుఁ దనపితృదేవతలు తృప్తి నొందుచుందు రని భావము.

[తెరలో]

చంపఁబడుచున్నానోయి! చంపఁబడుచున్నానోయి!

రాజు—(తెలివి దెచ్చుకొని యాలకించి) అయ్యో! యిది మిత్రస్వరము మాధవ్యునిదిగా నున్నది. ఎవరక్కడ?

ప్రతిహారి—(తొట్రుపాటుతోఁ బ్రవేశించి) దేవా! బ్రతికింపుఁడు బ్రతికింపుఁడు. ఎవఁడో గొంతుకఁ బట్టుకొని వయస్యునిఁ బ్రాణసంశయస్థితికిఁ దెచ్చినాఁడు.

రాజు—ఆమాణవకునిగొంతుకఁ బట్టుకొన్నవాఁ డెవఁడు?

ప్రతి—దేవా! యేదో భూతము మఱుఁగుగా నాతని నెత్తికొని పోయి మేఘచ్ఛందప్రాసాదముకొట్టకొనను బెట్టినది.

రాజు—అట్లనకు. భూతములు మనగృహమునకు సయితము సోఁకునా? అయినను—

క. దినదినమ్ముఁ బ్రమాదంబున
జనియించుచున్నదోష మే యఱికట్టను దెలియుఁగా;
జనులం దెవఁ డేదారిని
జనునో తత్సర్వ మెఱుఁగుశక్తి గలుగునే? ౫౯.

[తెరలో]

బ్రతికింపవోయి! బ్రతికింపవోయి వయస్య!

రాజు—(గతిభేదమున నడచి) మిత్రుఁడా! భయపడకు భయపడకు.

[తెరలో]

బ్రతికింపవోయి! బ్రతికింపవోయి! నే నెట్లు భయపడకుందునోయి నాయనా! వీఁ డెవఁడో నా మెడ వెనుకకు వంచి చెఱకుఁగఱ్ఱ విఱచినట్లు విఱుక్కన నన్ను విఱుచుచున్నాఁడు.

రాజు—(చూపు వఱపి) విల్లు విల్లు.

యవనిక—(విల్లు చేతఁ బట్టుకొని ప్రవేశించి) దేవా! గోధాసహిత మిదిగో! శరాసనము.

రాజు—(బాణసహిత మయినవిల్లు గయికొనుచున్నాఁడు.)

[తెరలో]

ఉ. గొంతుక క్రొత్తనెత్తుటిని గ్రోలఁగ శీఘ్రము వ్యాఘ్రము పెంకిపై
న్గంతున పశువుం బోదువు నెవడిఁ బట్టితి ని వ్యథించెదఁగా;
బంధువు నీకు నార్తులవిపత్తుఁ దొలంచు విల్లు పూనుదు
ష్యంతుఁడు నీకు రక్షణము సల్పఁ గడంగుత మీదుమిక్కిలిన్.

రాజు—(రోషముతో) ఏమీ! నాపేరె యెత్తుచున్నాఁడు! నిలునిలు. రాక్షసాధమ! నీ వికఁ బ్రతుకఁబోవు సుమా. (విల్లెక్కుపెట్టి) వేత్రవతీ! మెట్లదారి చూపుము.

శ్రీరస్తు.

శ్రీపరమాత్మనే నమః.

అభిజ్ఞాన

# శాకుంతల నాటకము.

## సప్తమాంకము.

[తరువాత నాకాశయానమున రథాధిరూఢుఁడు రాజును, మాతలియుఁ బ్రవేశించుచున్నారు.]

రాజు—మాతలీ! యింద్రాజ్ఞను నెఱవేర్చినవాఁడ నయ్యును నా కాయన గావి... సత్కారవిశేషమును బట్టి నన్ను ననుపయుక్తునిఁగాఁ దలఁచుకొనుచున్నాను.

మాతలి—(చిఱునవ్వుతో) ఆయుష్మంతుఁడా! మీయిరువురకును సంతుష్టి లేదు.

ఉ. నా సవునర్చినట్టి ప్రతిపత్తిని బట్టి తలంతు, తొల్త నీ
చేసినతన్మహోపకృతిఁ జిత్తమునం గర మీవు చుల్కఁగాన్;
వాసవుఁడున్ భవచ్చరితపౌరుషదర్శనవిస్మయంబునన్
జేసి మనంబునన్ గణన సేయఁడు మా స్వకృతోరుసత్క్రియల్.

రాజు—మాతలీ! యట్లు కా దట్లు కాదు. నా కాయన వీడుకో లిచ్చినప్పుడు చేసినసత్కారము మనోరథములకుఁ గూడ నవిషయము గదా! సకలదేవతాసమక్షము...ఁ దనయర్ధాసనమున నన్నుఁ గూర్చుండఁ బెట్టుకొని—

చ. తన కతి యిచ్చ నా యని యెదం గదు నవ్వుచు లాఁచునంతిక
స్థునిఁ దనయుం జయంతుఁ గనుచుం జిఱునవ్వున, వక్షమందలం
దినహరిచందనం బూసి దీపిత మాతనపాంగరాతమా
ల నమరవల్లభుండు పదిలంబుగఁ దీసి యిడండె నా మెడన్?

మాతలి—ఆయుష్మంతుఁడా! నీ వమరేంద్రునివలన నేమి పొందుటకుఁ దగవు

ఉ. అనిశము సౌఖ్య మొందఁగ బిడౌజుఁడు దుర్ధరదైత్యకంటకం
బుడుగ నయారి! స్వర్భువనముం, బొనరించిన వెంత రెండె గా!
మునుపు నృసింహమూర్తినఖముల్ * నతపర్వము లిప్పు డవ్విధం
బున నెఱనయ్యె నీవిశిఖముల్ నిఖిలావనిచక్రపాలకా! 3.

రాజు—మాతలీ! యింద్రునిమహిమయే కదా యిందును స్తోత్రపాత్రము!

తే. గీ. గద్దెఁబనులందుఁ గూడ సేవకులు జయంబు
గనుట యున్నది, దొరలమన్ననగుణంబు;
యగ్రపీఠంబు దనకు సహస్రకిరణుఁ
డిడక యుండిన నరుణుఁ డెట్టులు నడుచు? 4.

మాతలి—అది నిజమే. (కొంచెము దూరము పోయి) ఆయుష్మంతుఁడా! స్వర్గమునఁ బ్రతిష్ఠిత మైన నీయశస్సౌభాగ్య మిదిగోఁ జూడుము.

చ. తమకొలఁ శోభకై త్రిదశకామురసాక్షు లలించుకంత దా
ల్ప మిగిలి యున్నవన్నియలఁ బాటకు పాటపడంగ సర్థబం
ధములను బుద్ధి నారసి, యుదాత్తతఁ గల్పలతాంశుకంబులం
దమరులు వ్రాయు చుండిరి సముచిత మైనభవచ్చరిత్రమున్. 5.

రాజు—మాతలీ! రాక్షససంహారమునందలియుబలాటము చేతను నిన్న నే దివమున కేఁగుచు స్వర్గమార్గముఁ జూడనయితిని. మఱి చెప్పు. మన మిప్పు డేవాయుపథము?

మాత—చ. దివి నెలకొన్న † ము త్రైయువృద్ధిమ్మరి నేది వహించు, వెల్గులం
బ్రవిభజనం బొనర్చి బుధిమండలము న్నడిపించు నేది, రెం
డవహరివిక్రమంబునఁ బ్రణష్టతమస్క మనం బ్రసిద్ధ మై
పాదణీలుదీని వాపరివహానిలమార్గ మటంద్రు భూవరా. 6.

రాజు—అందుచేత నే బాహ్యాంతఃకరణములతో నాయంతరాత్మ ప్రసన్నమగుచున్నది. (చక్రమును జూచి) మేఘమండలమునకుఁ దిగితిమి.

మాతలి—నీ వెట్లు దెలిసికొంటివి?

రాజు—ఉ. ఆకులసందునుండి యిటు లట్టులు వోరెడువానకోయిలల్,
పైకొను క్రొమ్మెఱుంగులప్రభం దెలువారెడువారువంబులున్,

---

*నతపర్వములు—ఇది నఖములకును విశిఖములకును గూడ విశేషణము; కావున (హిరణ్యకశిపునిపక్షమున) దిగినయంగుళీగ్రంథులు గల వనియుఁ, బాణపక్షమున దిగినకణుపులు గల వనియు నర్థద్వయ మూహింప వలయు; † ము త్రైయువృద్ధిమ్మరి=గంగ.

శీకరసంచయంబునను *చిత్తడి వొందిన నేములున్, సఖా!
యీకడ నీటిమబ్బులపయిన్ జను నీరథ మంచుఁ దెల్పెడున్. ౭

మాతలి—ఆయుష్మంతుఁడా! నీ విఁక వాక్కాలములో నిజాధికారభూమి నందుదువు.

రాజు—(క్రిందు చూచి)మాతలీ! మనము వేగముగా దిగు చుండుటవలన మనుష్యలోక మెంతవింతగాఁ గనఁబడుచున్నది!

చ. †ఎగయునటుల్ స్ఫురించుమహీభృత్తుల నెత్తులనుండి డిగ్గన
ట్లగు నిల; ‡బోద లేర్పడ దళాంతరలీనతఁ బాయుఁ జెట్లు; §నా
పగలు తనుత్వనష్టతమవారులు స్పష్టతఁ బొందె విస్తృతిన్;
¶జగతియు వచ్చు నా దెసకుఁ జయ్యన నెవ్వఁడొ యువ్వినట్లుగన్. ౮

మాతలి—చక్కఁగాఁ జూచితివి. (సగౌరవముగాఁ జూచి) ఓహో! పృథివి యెంతరమణీయము!

రాజు—మాతలీ! పూర్వాపరసముద్రంబులం జొచ్చిన దయి సంధ్యాకాలమేఘంబునుంబోలెఁ గనకరసమును బ్రసరింపఁ జేయునది యేపర్వతము?

మాతలి—ఆయుష్మంతుఁడా! యిది హేమకూట మనఁబడుకింపురుషపర్వతము. తపస్వుల కిది యుత్కృష్ట మయినసిద్ధక్షేత్రము. చూడుఁ.

క. సరసిజగర్భునిమనుమఁ డగు
మరీచికిని బుట్టె కశ్యపుఁ గొమరులనుగ సురా

---

*చిత్తడి=మిక్కిలితడి ; † ఎగయు......నిల—ఎంతోపయినుండి చూచునప్పుడు పర్వతాగ్రములును భూమియు నేకసమముగానే యున్నట్టు గనఁబడును గాని క్రిందికి దిగుచున్నయీసమయమున నవి రెండును వేఱుపడి గిరిశిఖరములుపయి కెగయుచున్నట్లును, వానిపయినుండి భూమి క్రిందికి దిగుచున్నట్లును దోఁచుచున్న దనుట; ‡ బోద...చెట్లు—మునుపు నేలవలె సమముగాఁ గనఁబడువనములలో నిప్పుడాకుమఱుఁగు వాసి ప్రతివృక్షమును స్కంధముతో వేఱువేఱుగా నగపడుచున్న దనుట; §ఆవ......విస్తృతిన్—పూర్వము సూక్ష్మము లయి నీరు లేనట్లు తోఁచునదులిప్పుడు విశాలము లయి స్పష్టముగాఁ గనఁబడుచున్న వనుట; ¶ జగతి......నట్లుగన్—ఆకాశములోఁ బర్వతశిఖరాదులు వేర్వేఱుగా వర్ణింపఁబడినవి గనుక నిప్పుడు మొత్తముగ భూమండల మంతయుఁ దనకుఁ గనఁబడువిధము ప్రత్యేకముగా మరల నిట్లు వర్ణించినాఁ డని యెఱుంగునది.

రాజు—(దిగి) మఱి నీ వెట్లు?

మాతలి—రథము నిలిపితిని. నేనును దిగెదను. (అట్లు చేసి) ఆయుష్మంతుఁడా! ఇటు. మహానుభావు లయినఋషులతపోవనభూముల నవలోకింపుము.

రాజు—నే నాశ్చర్యములోఁ జూచుచున్నాను.

చ. అనిలముచే సురద్రుమవనము నుచితం బగుప్రాణవృత్తి, కాం
చనవనజాతరేణుకపిశం బగునీటను స్నానధర్మముల్
దనరుమణీశిలాస్థలిని ధ్యానము, నచ్చరలొద్ద సంయమం
బును గఁ ¶ దపింత్రు వీ రొరులు ఘోరతపంబులఁ గోరుచోటునన్. ౧౨.

మాతలి—మహాత్ములకోరిక యూర్ధ్వగామి కదా! (నడిచి యాకాశమున) ఓయీ వృద్ధశాకల్యా! మహానుభావులు మారీచులవా రేమి చేయుచున్నారు? ఏమనుచున్నావు? ...ర్త్రిపత్నీసహిత యయి యదితిమహాదేవి పతివ్రతాధర్మములను గూర్చి యడుగఁగా వారామె కవి యుపదేశించుచున్నా రనియెదవా?

రాజు—(చెవి యొగ్గి) ఓహో! యీసందర్భమున మనకు నవసరము ప్రతీక్షింపవలయును.

మాతలి—(రాజును జూచి) ఆయుష్మంతుఁడా! కొంచెము నీవు నీ యశోకవృక్షమూలమున నుండుము. నే నింతలో నిన్ను గురువులకు నివేదింప నవకాశ మరసెదను.

రాజు—నీకుఁ దోఁచినట్లు. (నిలుచున్నాఁడు.)

మాతలి—(నిష్క్రమించుచున్నాఁడు.)

రాజు—(నిమిత్తము సూచించి.)

తే. గీ. ఇష్టవస్తువు నెడ నా కపేక్ష యుడిగె;
బాహువా! నీకు నీవృథాస్పంద మేల?
క్షితిని బూర్వావధీరితశ్రేయ మకట!
పరిణమించును దుఃఖరూపమునఁ గాదె? ౧౩.

[తెరలో]

వలదు సుమీ వలదు సుమీ. దుడుకు మాను దుడుకు మాను. ఏమీ! నైజగుణము మానకున్నాఁడు.

---

¶ తపింత్రు...చోటునన్—ఇతరులు దేనికొఱకు బహుతపస్సులు చేయుదురో యట్టి యుత్తమస్థానమునందు నుండియు వీరు తపస్సు చేయుచున్నారు. వీరు కోరునది దీనికంటెను నుత్తమపద మని తాత్పర్యము.